

సదాశివ సమారంభాం
గురు దక్షిణామూర్తి
గురు వేదవ్యాస మహర్షి
గురు శుక మహర్షి
గురు నారద మహర్షి
గురు వాల్మీకి మహర్షి
గురు శ్రీకృష్ణ
శంకరాచార్య మధ్యమాం
గురు దత్తాత్రేయ
గురు బాబాజీ
గురు గౌతమ బుద్ధ
గురు ఆదిశంకరాచార్య
గురు రామానుజాచార్యులు
గురు జ్ఞానేశ్వర్
గురు రవిదాస్
గురు కబీర్ దాస్
గురు చైతన్య మహా ప్రభువు
గురు నానక్
గురు రాఘవేంద్ర స్వామి
గురు వీరబ్రహ్మేంద్ర స్వామి
యోగి వేమన
అస్మదాచార్య పర్యంతాం
గురు త్రైలింగ స్వామి
గురు లాహిరి మహాశయ
గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి
గురు వివేకానంద
గురు సాయి బాబా
గురు అరవిందో
గురు రమణ మహర్షి
గురు యోగానంద
గురు భక్తివేదాంత ప్రభుపాద
గురు మళయాళస్వామి
గురు విద్యాప్రకాశానందగిరి
గురు చంద్రశేఖర పరమాచార్య
వందే గురుపరంపరాం..

నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి, జ్ఞాన, ధర్మ ప్రచారార్థం మహానుభావులైన శ్రీ చిన్న జీయర్ వెబ్ సైట్ వారు ఉచితంగా విలువైన మాసపత్రికలను ఆన్ లైన్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు.వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్(http://www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. ఈ మాసపత్రికలు క్రొత్తవా లేక పాతవా? అని చూడకుండ, అందులోగల రత్నాలలాంటి విషయాలను తెలుసుకోవటానికి ప్రయత్నం చేయగలరు అని మనవిచేసుకొంటున్నాము..

ఈ మాసపత్రికలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) చిన్న జీయర్ వెబ్ సైట్: http://www.chinnajeeyar.org
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో చిన్న జీయర్ వెబ్ సైట్ సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## చిన్న జీయర్ వారి వెబ్ సైట్

## http://www.chinnajeeyar.org



# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014



శ్రీమతే రామానుజాయనమః

భక్తి

# నివేదన

వేదాంత మాసపత్రిక

| సంపుటి ౪ | నందన-చైత్రమాసం | సంచిక ౧ |
| --- | --- | --- |

## కృష్ణార్జున సంవాదము

శ్రీ ఉ. వే. శ్రీమాన్ తె. కం. గోపాలాచార్యులుగారు,
కోదకొండ.

—: 3 వ రంగము :—

(ప్రకాశముగా) అర్జునా! నీవు చంపబడుదురని భయపడు భీష్మ ద్రోణాదులయొక్కయు చంపెదనని తలంచు నీ యొక్కయు వాస్తవస్వరూపము నెరుంగక నిట్లు విలపించుచున్నావు!

అర్జు:- ఎరుంగకేమి! నేను కుంతీ పుత్త్రుడను. పాండుమహారాజు నా తండ్రి! ధర్మజుడు నాయన్న, నకులసహదేవులకు యన్నను. నీ బాల్య మిత్త్రుడను. భీష్ముడు నాకు తాత శంతనుని వలన గంగయందుద్భవించిన సాటిలేని మహావీరుడు. అస్ఖలిత బ్రహ్మచారి, ఇకనే ద్రోణాచార్యులు సరే సరి. ఇప్పటి రాజలోకమునకు ధనుర్వేదమున నాచార్యస్థానము నలంకరించిన బ్రాహ్మణోత్తముడు. ఇందు తెలియని రహస్యమేమున్నది.

కృష్ణ:- అది శరీరమునే ఆత్మగా భావించు పామరుల పాఠము, నే చెప్పునది గాదు. వినుము భీష్మద్రోణులన నీ పైకి గాన్పించు ప్రాకృత స్థూల శరీరమే కాదు,

అర్జు:- మరియేమి!

కృష్ణ:- దేహము ఇంద్రియములు మనస్సు ప్రాణము బుద్ధులకంటె వేరై స్వయం ప్రకాశమై ఆనందరూపమై అణువై అవ్యక్తమై అచిన్త్యమై అవయవ విహీనమై వికారరహితమై జ్ఞానమున కాధారమై సర్వేశ్వరునకు నియామ్యమై ధార్యమై శేషమైయుండు నిత్యవస్తువగు ఆత్మయే ఆ భీష్మాదులలోని ప్రధానాంశము. పైకి గాన్పించు శరీరములు ఆయాత్మలకు చినిగినవి పారవేయబడుచు నూతనములు పరిగ్రహింపబడుచు పైన ధరింపబడు వస్తువులవలె వచ్చుచు పోవుచు నుండు అప్రధానాంశములు.

(అర్జు:- కృష్ణా! ఆ యాత్మలయొక్క శుద్ధస్వరూపము నా కొకింత వివరముగా చెప్పుము

కృష్ణ:- పరిశుద్ధమగు ఆత్మతత్త్వము పరమ పురుషునితో సమాన ధర్మములు కలది. అనాదియైనది దానికి కాళ్లు చేతులు కన్నులు తలలు ముఖములు లేకున్నను పరమపురుషునివలె వాటితో చేయు కార్యములను చేయు శక్తి కలిగియుండును. అది లోకమునందుండు సమస్త వస్తువులను తన తేజముతో నావరించియున్నది. స్వాభావికముగ దేవాది దేహములతో సంబంధము లేనిదయ్యును సకలదేహములను ధరింపసమర్థమై యుండును సహజముగ సత్త్వాదిగుణములు లేనిదైనను వాటి ననుభవింప సమర్థమైయుండును. అమానిత్వాది గుణములు లేనివారికి దూరమున నున్నను అవి యున్నవారికి దగ్గరనే యుండును. అవి సూక్ష్మమైనదగుటచే దేహముకంటె వేరని యెఱుంగరాక యుండును. ప్రకృతికంటె పరమైనది. జ్ఞానాకారమైనది. సకల ప్రాణులయొక్క హృదయమున సన్నిహితమైయుండును.)

అర్జు:- కృష్ణా! ఇదియేమి! నీవు చెప్పినదంతయు విపరీతముగనున్నదే. ఈ శుద్ధాత్మ స్వభావము లన్నియు పరమపురుషుని స్వభావముల కొకింతయు తీసిపోకయున్నదే) అయినచో నిట్టి యాత్మకీ ప్రకృతి సంబంధమెట్లు దాపరించెను?

కృష్ణ:- బాగుగ నడిగితివి. అదియే తెలియతగిన ముఖ్యవిషయము. రోగమునకు నిదాన మెరుంగక చికిత్సదుర్ఘటముగదా! ఈ ప్రకృతి పురుషు లనాదిగ నొకరితోనొకరు కలిసియుందురు. ఈ ప్రకృతి మాత్రము దేవమనుష్యాది నానా విధాకారముల మారుచుండును. ఈ జీవుడా శరీర ప్రయుక్తమైన సత్త్వాది గుణముల వలన పుట్టెడు సుఖదుఃఖాదుల యందాసక్తుడగును. అందులకై పుణ్య పాప కర్మల నాచరించు చుండును. పిమ్మట వాటి ఫలముల ననుభవించుటకై ఉచ్చజన్మను గాని నీచ జన్మను గాని పొందుచుండును. అట్లు పుట్టి ఆ ఫలముననుభవించుచు తిరిగి కర్మల నాచరించుచు జన్మల నెత్తుచునే యుండును.

అర్జు:- అయినచో కృష్ణా! ఆత్మనిత్యమైనదంటివే యిది పుట్టుట ఎట్లు?

కృష్ణ:- అర్జునా! తన పూర్వకర్మానుభవమున కనుకూలముగ నాచే నొసంగబడు దేహమున ప్రవేశించుటయే జీవునకు పుట్టుట, దానిని వీడుటయే నాతడు గిట్టుట తెలిసినదా!

అరు;- తెలిసినదిగాని...

కృష్ణ:- కాని యని సంకోచించు చున్నావేల?

అర్జు:- లేదు కృష్ణా! నిన్ను నా ప్రశ్న పరంపరలచే విసిగించు చున్నానేమోయని భయ పడుచున్నాను.

కృష్ణ:- (అర్జునుని చేతులు పట్టుకొని)

ఉ॥ మిత్రమ యెంతమాట భయమేటికి బూనెదు
సంశయింపకేమాత్రము — దూడచే పిడకమానిన
ధేనువు పాలొసంగునా! క్షత్రియ జాతి, శిష్యు
డవు. చాల భయంకరమైన యీ కురుక్షేత్రము
జేరితే మనెదో చెప్పుము తెల్పెద దాని నర్జునా!

అర్జు:- కృష్ణా:- నీ యవ్యాజ కారుణ్యమునకు కృతజ్ఞుడను. జీవునకా కర్మవశమున కలుగు శరీర మేద్రవ్యమో అది వేటి కాశ్రయమైనదో దాని వికారము లెవ్వియో అదియే ప్రయోజనము కొరకు కలిగినదో! ఏ స్వరూపమైనదో దయతో సెలవిమ్ము!

కృష్ణ:- అర్జునా! శరీరము పంచభూతములు అహంకారము మహత్తత్వము ప్రకృతి యన బడు యెనిమిది ద్రవ్యములతో నిర్మింపబడినది. పదునొకండింద్రియముల కాశ్రయమై యిచ్ఛా ద్వేష సుఖదుఃఖములనెడు వికారములు కలిగి భూతసంఘాతరూపమై చేతనుడు సుఖదుఃఖములనుభ వించు నిమిత్తము ఏర్పడుచున్నది.

అర్జు:- అయినచో కృష్ణా! ఇట్లే యాత్మకు శరీరపరంపర లనివార్యములగుచో నిక నీతడు ముక్తి నొందుటెట్లు

కృష్ణ:- బాగుగా నడిగితివి! నుడివెదవినుము. అమానిత్వాదులనెడు యిరువది గుణము లున్నవి. అవి యలవడిన నిక జన్మముండదు.

అర్జు:- ఆ గుణములను దయయుంచి సుబోధకముగ బోధింప ప్రార్థించు చున్నాను.

కృష్ణ:- అట్లే వినుము.

పెద్దల తిరస్కరింపకుండుట, దంభమునకు ధర్మముల నాచరింపకుండుట, మనోవాక్కాయములచే పరులఁపీడింపకుండుట, వారు తనను పీడించినను తన మనమున కలతనొందకుండుట, తన యాచార్యు నకు సేవచేయుట, శాస్త్రోక్తములగు నాచారముల వీడకుండుట, ఆత్మేతరములందు విరక్తి చెంది యుండుట, అహంకార మమకారములకు తావీయకుండుట, పుత్ర మిత్ర కళత్రాదులను శాస్త్రీయ ములగు కర్మలకు మాత్రమే తగునంతగా పరిగ్రహించుట, ఇష్టానిష్టములు సంభవించుతరి హర్షో ద్వేగముల చొరనీయక మనస్సు నొకేరీతి నుంచుకొనుట, నాయందు స్థిరభక్తికలిగియుండుట మొద లగు గుణములీయాత్మ కెప్పుడలవడునో అప్పుడీతని కికముందు శరీరసంబంధ ముండబోదని విశ్వసిం పుము. నీ కందలి పెక్కు గుణంబులు సహజంబుగనే యున్నవి!

అర్జు:- కృష్ణా! ధన్యుడను. ఇది నీ యనుగ్రహ విశేషమే కాని కృష్ణా! ఈ గుణములందర కేలయలవడవు?

కృష్ణ:- అడుగవలసిన దాని నడిగితివి! సావధానముగ వినుము! జీవునకు ప్రాచీన కర్మమూలముగ శరీరసంబంధము దాపరించినదనియు, ఆ శరీరమన ప్రకృతి పరిణామ విశేషమనియువింటివి గదా! అట్టి శరీరమునకు సహజములగు సత్వరజస్తమస్సులనబడు మూడు గుణములతో సంబంధ మనివార్యము.

అర్జు:- అయిన నేమి!

కృష్ణ:- అయిన నేమనుచున్నావా! అవియే గదా జీవుని శరీరముతో బంధించునవి.

అర్జు:- ఓహో! అటులరా! అవి యచేతనములు గదా! అవి యెట్లీతనిని బంధించును.

కృష్ణ:- అర్జునా! సత్వమునకు సుఖసంగమున్ను రజస్సునకు కర్మసంగమున్ను తమస్సునకు చేయరాని పనియందు ప్రవృత్తి సంగమున్ను ముఖ్యద్వారములు ఇవి పురుషునకు వీటియందు ఆసక్తిని కలుగజేయును. దానిచే నా జీవుడు వాటికి సాధనమగు కర్మల నాచరించి తత్ఫలానుభవమునకై అర్హమగు యోనులయందు పుట్టుచున్నాడు. ఇప్పుడు తెలిసినదా ఇవి యెట్లు జీవుని శరీరముతో బంధించుచున్నవో.

అర్జు:- కృష్ణా! విననకొలదియు సంశయములు మితిమీరుచున్నవి గాని శమించుటలేదు. (నాకిది చెప్పుము. (ఈ మూడు సుగుణము లెప్పుడును ఒక్కతీరున వర్తించుచునే యుండవలయును గదా. అయినచో నివియెట్లు పరస్పర విరుద్ధకార్యముల బుట్టించుచుండును.

కృష్ణ:- అట్లుగాదు. ప్రాచీన కర్మవశమునగాని, భుజించు నాహారములయందలి వైషమ్యము వలనగాని సత్వాదులలో నొకటి వృద్ధిపొందుచు మిగిలిన రెండింటిని యడగించుచుండును.

అర్జు:- అయినచో కృష్ణా! ఏ గుణము తలయెత్తినదో యేవి తలవంచినవో తెలియుట కేమైన నుపాయము కలదా?

కృష్ణ:- లేకేమి! ఈ శరీరమునందు జ్ఞానేంద్రియముల ద్వారా వస్తువులయొక్క యధార్థ స్వరూపము తెలియబడుచున్నప్పుడు సత్వగుణము మిగుల వృద్ధిబొందియున్నదనియు లోభము వ్యర్థ చేష్టలు, ఫలసాధన కర్మానుష్టానము, శబ్దాది విషయభోగేచ్ఛయు వర్తించుచున్నచో రజోగుణము వృద్ధిజెంది యున్నదనియు, గుర్తింపుము. ఇక వస్తువులయొక్క వాస్తవస్వరూపము తెలియకుండుటయు, కూడని పనులయందు ప్రవర్తించుటయు, చేయవలసినపనులను మానుటయు సంభవించెనేని తమోగుణము వృద్ధి పొందియున్నదనియు గ్రహింపుము.) .

అర్జు:- నీవు వెనుక మోక్షసాధనములని చెప్పిన అమానిత్వాది గుణములు యీ సత్వాదుల మూడింటిలో దేనివలన బుట్టుచున్నవి?

కృష్ణ:- సత్వగుణమువలననే అయ్యా! ఈ మాత్రి పెరుగుగదా!

అర్జు:- కృష్ణా! ఈ సత్వము వృద్ధియగు సాధనము లెవ్వి!

కృష్ణ:- అర్జునా! మనము తినెడి యాహారము యజ్ఞము దానము తపస్సు అనునవియే యిం దులకు సాధనములు.

అర్జు:- ఇందేది ప్రధానమైనది?

కృష్ణ:- అన్నియు ప్రధానమైనవియే కాని మనస్సు అన్నమయమగుటచేతను ఆహారశుద్ధిచే సత్వశుద్ధి చేకూరుటచేతను ఆహారమే తక్కిన మూడింటికిని నిదానమగుచున్నది.

అర్జు:- అయినచో. ఆ యాహారస్వరూపమును దయతో వివరింపుము,. నేను దానినెరింగి సాత్వికాహారముచే నీవు చెప్పిన సద్గుణముల పెంపొందించు కొందును.

కృష్ణ:- అర్జునా! మధుర రసముతో గూడినవై చమురు గలిగి చూచినంతనే ప్రీతిని పుట్టించునవై రక్తమాంసాది సప్తధాతువులగా పరిణమించి యవి చిరకాలము శరీరము నందున్నట్లు చేయునవి యగు నాహారములు ఆయువును. జ్ఞానమును. బలమును. ఆరోగ్యమును, పెంపొందిం చును, కావున నివి సాత్వికాహారములుగ పరిగణింప బడుచున్నది, ఇందు పాలు పండ్లు దుంపలు మొదలగు అపక్వపదార్థములు ప్రధానములు. కారము పులుసు మిక్కిలి యుప్పన మిక్కిలి వేడి మికలవియు వాత ప్రకోపము వలన శోషకరములును. పిత్తప్రకోపము వలన తాపకరములును పదార్థములు కష్టమును మనోవ్యాకులమును రోగమునుకలుగజేయునుగాన నివి రాజసములనబడును,

వండి చాలకాలము గడచినదియు, సహజరుచి వీడినదియు, దుర్గంధముకలదియు, పాసిన దియు, భుజింపబడిగిలినదియు. భగవన్నివేదితముకానిదియు. తామసాహార మనబడును,) కావున యర్జునా,

గీ॥ ఈవుహితమును గోరుదువేనిపార్థ
సాత్వికాహారసేవయే సలుప వలయు
పరమసాత్వికుడగు వాడుబడయ కలుగు
నాత్మశుద్ధికి సాధనమైన గుణము

అర్జు:- అటుపిమ్మట చేయవలసిన దేమి!

కృష్ణ:- ఇప్పుడే చేయవలసిన దంతయును ఇట్టియోగ్యత నార్జించినవాడే కర్మయోగమున కధికారికాగలడు. ఆ కర్మయోగము స్వయముగ గాని జ్ఞాననిష్టను కలిగించిగాని ఆత్మసాక్షాత్కా రమును కలుగజేయును. దానిని నిరంతర మభ్యసించుటచే భక్తి యుదయించును. దానిచే నన్ను వాస్తవముగ శాస్త్రముచే తెలియుటకును, కలరూపమున సాక్షాత్కరించుటకును, సమర్థుడగును. అం తట వాడర్చిరాది మార్గమున పరమపదము నధిరోహించి నాతోడి పరమసామ్యమునంది నన్ను యథార్థరూపమునసంపూర్ణముగ అనుభవించిశాశ్వతముగసాయుజ్యసుఖము ననుభవించుచుండును.

ఇట్టి మహాభాగ్య మొకజన్మములో లభించునది కాదు. అనేక జన్మార్జితమగు సుకృత పరంపరలచే భక్తుడైన ధన్యునకే యీ భాగ్యమబ్బును.

అర్జు:- ఆహా! కృష్ణా! నేనెంత రహస్యార్థముల వినిపించితివి. నీ స్నేహము నాకిప్పుడు సార్థకమైనది.

ఉ॥ ఎంచితి మిత్రుడంచు భ్రమియించితి బాంధవుడంచు
తెస్సనేమించితి కృష్ణుడంచపహసించితి బావ
సారథియంచు పంపించితి దూతయంచు
పిలిపించితి యాదవుడంచు కాని యొక్కించుక
నీదుశక్తి పరికించక పోయితి నింతగాలమున్.

(కృష్ణా! ఆ కర్మజ్ఞాన యోగములననేమో! వాటి నెట్లాచరింపవలెనో తెలియజెప్పి నన్ను కృతార్థుని చేయుము. నీకంటె నాకీరహస్యార్థముల నుపదేశించు హితుడెవ్వడు. నా తప్పులు మన్నించి నాకీ యర్థముల నుపదేశింపుము. (అని పాదములపై బడును)

కృష్ణ:- అర్జునా! ఇదియు నా పనియే. దీనికి నీవింత ప్రార్థింపపనిలేదు. నీకు శ్రద్ధయు ఆసక్తియును ఉన్నచాలును. నేనెంతయు సవిస్తరముగ చెప్పెద వినుము.

—కర్మయోగమనగా— ఆత్మనిత్యమనెడు జ్ఞానము గలవాడై తన వర్ణమునకు ఆశ్రమమునకును తగిన కర్మలకు తాను కర్తకాననియు 'సర్వవ్యాపియగు సర్వేశ్వరుడే తన కధీనుడగు నాచే తన నారాధించుటకే తన కర్మలను చేయించుచున్నాడు. ఇందు నాకేమియు లేదు. కావుననే నాకీ కర్మలతో సంబంధమును లేదు, గాన నవి ఫలమొసంగినను ఒసంగకున్నను ఆనంద విషాదముల కవకాశములేదు. అనెడు నధ్యవసాయముతో నాచరింపవలెను.

అర్జు:- కృష్ణా! ఈ చేతనుడు మనుష్యుడుగా బుట్టును. పశువుగా బుట్టును. పక్షిగాబుట్టును. చెట్టుగా బుట్టును. అని వాడుకగా వినుచుందుమే, ఇది నిత్యమని యెఱుంగుటకేమి ప్రమాణములు కలవు?

కృష్ణ:- నిజమే కాని ఆ యనుభవము భ్రాంతిమూలము ఆత్మనిత్యమైనది. ఇందులకనేక ప్రమాణములున్నవి. ఆత్మ యిందిర్యములకు గోచరించదు గాన ప్రత్యక్షముచే తెలియబడక పోయినను అనుమానాగమములచే నా విషయము దృఢపరుచబడుచున్నది. చెప్పెద వినుము. ఆత్మ యతిసూక్ష్మమైనది. దానిచే వ్యాపింపబడని పదార్థమే ప్రపంచమున లేనేలేదు. కావున నిది నిత్యమై తీరవలెను.

అర్జు:- గాలి యంతటను వ్యాపించుచున్నది గదా. అది నశించుట లేదా?

కృష్ణ:- అట్లుకాదు. ఆ గాలిలో కూడనిది వ్యాపించి యున్నది. ఆ గాలియు వ్యాపించని పెక్కు పదార్థములున్నవి. నశింపజేయు వస్తువు నశింపజేయబడు వస్తువునందు ప్రవేశించియే

దానిని నశింపజేయజాలవు. అట్టి వస్తువునందు కూడ ఆత్మ వ్యాపించియే యుండును గాన దీనిలో దూర గలిగినంత సూక్ష్మవస్తు వేదియు ప్రపంచమున గాన్పింపదు. కావున నీ యాత్మను ఆయుధములు ఖండింపజాలవు. అగ్నిదహింపజాలదు. నీరు తడపజాలదు. వాయువు శోషింపజాలదు. అందుచే నిది నిత్యమైనది. ఇదిగాక నెన్నియో శ్రుతి స్మృతీతిహాస పురాణాగమాది ప్రమాణ పరంపరలు గలవు.

అర్జు:- సరియే. వాటి నటుండనిమ్ము? ఇట్టి జ్ఞానముతో నిష్ఠ కర్మల నాచరించుటచే నేమి సిద్ధించును?

కృష్ణ:- రజస్తమస్సులు పూర్తిగ నశించి మనస్సు నిర్మలమగును. అంతట జ్ఞాననిష్ఠయనబడు స్థిత ప్రజ్ఞత యుదయించును.

అర్జు:- కృష్ణా! స్థితప్రజ్ఞుని స్వరూపమెట్లుండును. వాడేమి భాషించును? వాడెట్లు ధ్యానమునకు గూర్చుండును? వాని ప్రవర్తన యెట్లుండును?

కృష్ణ:- ఆత్మయందే రతి కలిగియుండుట వాని స్వరూపము. ఆత్మను గూర్చి మాట్లాడుచుండుటయే వాని కభ్యాసము. పరిశుద్ధమగు ప్రదేశమునందు మిక్కిలి యెత్తును కురుచయును గాక కఱ్ఱతో చేయబడు పీఠము పై దర్భలను, వాటిపై కృష్ణాజినమును, దానిపై పరిశుభ్ర వస్త్రమును పరచి దానిపై వెన్ను కొంచెము గోడ కానుకొని కూర్చుండి యోగమునందు మనస్సు నిలిపి చిత్తేంద్రియ వ్యాపారముల నడచి తనకు బంధముపోయి ఆత్మప్రాప్తి కలుగవలెనని ఆత్మనే ధ్యానించుచు ప్రవర్తించును.

అర్జు:- ఈ యనుష్ఠానముచే వెంటనే యాత్మదర్శనమగునా! లేక దీని కేదైనను క్రమ పరిపాటి కలదా?

కృష్ణ:- లేకేమి! ఇది నాలుగు తరగతులుగా నుండును. మొదట బాహ్యేంద్రియములను విషయముల నుండి మరలించి బాహ్యవ్యాపారములను మాని మనస్సులోనున్న ఆత్మయందు నిలుపుటకు యత్నింపవలెను. ఇది మొదటి దశ, దీనికి యతమానావస్థ యనిపేరు.

ఇట్లింద్రియములు బలాత్కారముగా మరల్చబడినను మిగిలియుండు రాగద్వేషాది దోషములచే కలుషితమగు మనస్సు ఆ యింద్రియములను మరల విషయములపట్ల పురిగొల్పుటయే గాక తానును ఆత్మయందు నెలకొనజాలక యుండును. కాబట్టి పక్వము కాని రాగాదులు పూర్తిగా తొలంగునట్లు ఉదాసీనాదులు వహించి యుండవలెను. ఇది వ్యతిరేకావస్థయనబడు రెండవ దశ.

ఇట్లు రాగాదులు పూర్తిగ నశించుటచే విషయానుభవము నశించినను. అనాదికాలము నుండియు అనువర్తించుచున్న విషయవాసన మాత్రము నశించక ఆ విషయములయందు ఔత్సుక్యమును గలిగించి బుద్ధిని కలతబెట్టును అట్టితరి పురుషుని ద్వేషించు నొక యువతికి నొక సుందరాంగుడగు యువకుని జూపగ నామె యాతనియందు క్రమముగ రాగము గలిగి వర్తించునటు

ఆ బుద్ధికి నిరతిశయానంద రూపమగు నాత్మను జూపి క్రమ క్రమముగ దానియందు మిక్కిలి తుష్టిని కలుగజేసి దానిచే బాహ్యవిషయ వాసనను దానిచే గలుగు నౌత్సుక్యమును నిర్మూలింప వలెను. దీనికి చాలకాలము పట్టును. ఇది యేకేంద్రియావస్థ యనబడు మూడవదశ.

ఇట్లాత్మరతిచే సమస్త వాసనల నశించి తుదకు ఔత్సుక్యము గూడ గలుగక పోవుటచే పరమ వైరాగ్యయుక్తమైన వశీకరణమును పేరుగల నాల్గవ యవస్థ గలుగుచున్నది. ఇది జ్ఞాన నిష యనబడు స్థితప్రజ్ఞుని పూర్ణ పరిపాక దశ-

ఇదియే ఆత్మావలోకమును సాధించును, ఆత్మావలోకనమే క్రమముగ భక్తియోగము నకు పిమ్మట దాని మూలమున నిరతిశయ పురుషార్థమగు మోక్షమునకు సాధనమగును.

అర్జు:- కృష్ణా! ఈ యవస్థల వైషమ్యమొకింత స్పష్టముగా తెలుపుము.

కృష్ణ:- కామములు కామములుగా గన్పడకుండుట ఉత్తమావస్థ, అట్లు కనపడినను వాటియందు సంగమము లేకుండుట మూడవ యవస్థ, లేశమాత్ర సంగముతో విషయముల ననుభవించుచున్నను అతిస్నేహము లేకుండుట రెండవ యవస్థ. మిక్కిలి యనురాగమున్నను వాసిని నిర్మూలింప దొడంగుట మొదటి యవస్థ. అర్జునా! తెలిసినదా!

## శ్రీ యతిరాజ భజన కీర్తనలు

కవితావతంస, గానకళానిపుణ, హరికథా చతురానన

శ్రీ ఉ. వే. శ్రీమాన్ కరి నారాయణాచార్య భాగవతార్

### లాలి పాట

ఉదయరవిచంద్రిక — ఖండచాపు

1 లాలి లక్ష్మణబాల ! లాలి గుణజాలా !
లాలి ముద్దులబాల ! లాలి శుభశీలా ! లాలి

2 లాలి కాంతిమతీయ ! లాలిమహనీయా !
లాలి కేసవసూరి రాద్భాగధేయ ! లాలి

3 లాలి దివ్యశరీర ! లావణ్యపూర !
లాలి ధీరోదార ! లాలి సుకుమార ! ||లాలి

4 లాలి రామానుజా ! లాలి బుధరాజా !
లాలి సుగుణవ్రజా ! బాలార్కతేజా ! ||లాలి

5 లాలి శేషావతారా ! మహాధీరా !
లాలి వైష్ణవలోక పాలనోదారా ! ||లాలి

6 లాలి భారతమాతృ రమణీయభూషా !
లాలి నారాయణార్య స్వామిపోషా ! ||లాలి

# "ప్రియః ప్రియా యార్హసి" - ఇందలి యర్థ వివరణ స్వారస్యము.

శ్రీ భగవద్గీతలోని 11 వ అధ్యాయము నందలి 44వ శ్లోకం :-

తస్మాత్ప్రణమ్య ప్రణిధాయ కాయం
ప్రసాదయే త్వా మహ మీశ మీడ్యం ।
పితేవ పుత్రస్య సఖేవ సఖ్యుః
ప్రియః ప్రియాయార్హసి దేవ సోఢుమ్ ॥

1. పై శ్లోకములోని ఉత్తరార్థమునకు శ్రీ మచ్ఛంకర భగవత్పాదాచార్యులవారు భాష్యములో "త్వం పునః పుత్రస్యాపరాధం పితా యథా క్షమతే, సర్వం సఖ్యు రపరాధం వా, ప్రియః ప్రియాయాః అపరాధంక్షమ తే ఏవమర్హసి హే దేవ! ప్రసహితుం క్షంతు మిత్యర్థః-అని వివరించి, పుత్రుని యపరాధమును సర్వమును తండ్రి క్షమించునట్లును. చెలికాని సర్వాపరాధములను చెలికాడు క్షమించు నట్లును, ప్రియురాలి యపరాధములను ప్రియుడు క్షమించునట్లును ఓదేవా! నా సమస్తాపరాధములను నీవు క్షమింపదగుదువు - అని సెలవిచ్చిరి.

శ్రీ పెరియవాచ్చాన్‌పిళ్ళైగారు శరణాగతి గద్యవ్యాఖ్యానములో "హే దేవ! పుత్రస్య(దోషం) పితేవ, సఖ్యుః దోషం సఖేవ ప్రియాయా (మహ్యం) ప్రియః (త్వమ్) సోఢుమ్ అర్హసి-అనియును 'ప్రియః ప్రియాయార్హసి' అనుచోట "ప్రియః-ప్రియాయాః అర్హసి"-అనియును ఆర్ష సంధిని స్వీకరించి ప్రియురాలి తప్పులను ప్రియుడు సైచునట్లునియు ద్వివిధముగ వివరించిరి.

2. శ్రీ మద్భగవద్రామానుజాచార్యులు వారు భాష్యములో యథాకృతా పరాధస్యాపి పుత్రస్య, యథా చ సఖ్యుః ప్రణామ పూర్వం ప్రార్థితః పితా, సఖా వా ప్రసీదతి; తథా త్వం పరమకారుణికః ప్రియః ప్రియాయ మే, సర్వం సోఢు మర్హసి"-అని సెలవిచ్చిరి.

3. "పరమార్థప్రభ" - అనుటీకను వ్రాసిన శ్రీ దైవజ్ఞ సూర్య పండితులు "ప్రియః-ప్రియుడవైననీవు, ప్రియాయ-ఇష్టము కొఱకు అని వ్రాసిరి.

4. శ్రీ కంఠ శివాచార్య కృత భాష్యములో "పితేవ పుత్రస్య, సఖేవ సఖ్యుః, ప్రియాయచ ప్రియశ్చత్వమేవార్హసి, మమాపరాధంసోఢుమిత్య న్వయః"-అనిరి.

పుత్రుని యపరాధమును తండ్రి వలెను, స్నేహితుని యపరాధమును స్నేహితుని వలెను, ప్రియుని యపరాధమును ప్రియుని వలెను, నా యపరాధమును నీవు సహింపదగుదువు,- అనిరి.

సంస్కృత మహాభారతమునకు సరియగు ఆంధ్రీకరణమును గావించిన "మహామహోపాధ్యాయ," "కవిసార్వభౌమ" శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రులవారు "కృష్ణ భారతము"లోని భీష్మపర్వము నందలి ద్వితీయాశ్వాసములోని 304వ పద్యము.

ఆ॥ కాన మేనువంచి నేను నిన్నీడ్యుని శుని
బ్రసన్నుఁ జేసి కొనెద నీవు కరుణఁగొ!
నాకుఁ దండ్రి గతిఁ బ్రియుం బ్రియుండట్లు,
సఖుని సఖుఁడు వోలె సైపదగును॥

అని సెలవిచ్చిరి.

"భావదీప" టీకా కారులైన శ్రీ నీల కంఠాచార్యులవారు శ్రీ మహాభారత వ్యాఖ్యానమున "తస్మాత్ప్రణమ్య" అను శ్లోకమును ఈ దిగువరీతిని వివరించిరి. "ఏత దేవాహ–'తస్మాది తి". యస్మాత్ త్వంపితా గురుశ్చ తస్మాత్ప్రియం శరీరం ప్రణిధాయ భూ మాకృత్వా దండవత్ప్రణమ్య త్వాం ప్రసాదయే–ఈడ్యంస్తుత్యం స్పష్టమన్యత్–అనిరి. "ప్రియః ప్రియాయార్హసి" అనుచోట ఆర్షసంధిని వివరింపలేదు.

"హేకృష్ణ హేయాదవ హేసఖేతి" అను శ్లోకములో హేసఖే ఇతి అని ఆర్షసంధిని శ్రీ నీల కంఠాచార్యులవారు వివరించిరి.

5. శ్రీ భాగవతములోని ప్రథమస్కంధములో 15వ అధ్యాయములోని 19వ శ్లోకము.

"శయ్యాసనాటన వికత్థన భోజనాది, ష్వైక్యా ద్వయస్య ఋతవానితి విప్రలబ్ధః సఖ్యుస్సఖేవ పితృవత్తనయస్య సర్వం సేహే మహాన్మహితయా కుమతే రఘం మే"–అని అర్జునుఁడు ధర్మరాజుగారితో విన్నవించినాఁడు. ఇందు "సఖ్యుస్సఖేవ, పితృవత్తనయస్య–అని ఈ రెండు ఉపమానములు మాత్రమే స్వీకరింపఁబడి వి.

శ్రీ భగవద్గీతా తాత్పర్యమును, శ్రీ భాగవత గ్రంథానుసారముగ నుండునని తలఁచి యే కాబోలు పూజ్యులునైన శ్రీ భాష్యకార రామానుజ గురువరేణ్యులు "ప్రియః ప్రియా యార్హసి" అనుచోట "ప్రియాయాః–అర్హసి" అని ఆర్ష సంధిని చేయక, ప్రియాయ, మే సర్వం సోఢుమర్హసి"–నాకు ప్రియుడవైన నీవు నీకు ప్రియుడనైన నాకొరకు గాను అన్నింటిని సహించ తగుదువు.

పై విషయములను సాకల్యముగ పరిశీలించిన యెడల శ్రీ భగవద్రామానుజ మునీంద్రుల భాష్యము నందలి మూలాను గుణార్థవివరణ స్వారస్యము స్ఫురించును.

# చందాదారులకు విజ్ఞప్తి

అయ్యా!

మీరు పంపుచున్న చందాసొమ్ములు పైనంగా ఏ సంవత్సరం చందా పంపుచున్నదీ వ్రాసిపంపప్రార్థన. మణియార్డరు కూపనులో పైనం వ్రాయకుండా, చేవ్రాలు చేయకుండా ఎందునిమిత్తము పంపుచున్నది తెలుపకుండగా పంపుచున్నారు. చందానెంబరుకూడా వేయప్రార్థన. చందాదార్లు వికృతి, ఖర అయిపోయిన సంవత్సరములు గతం వాటిబాకీ ఇంకా రావలసి ఉన్నవి గాన దయయుంచి వెంటనే పంపప్రార్థన.

ఇట్లు,
కార్యదర్శి.

## పురుషకార వైభవము: పాట

శ్రీమాన్ శ్రీమత్తిరుమలై నల్లాన్ చక్రవర్తి సంపత్కుమార జగన్నాథ తిరువేంకటాచార్యులవారు విజయవాడ.

ఆనందభైరవి: ఖండచాపు

1. శ్రీదేవి పురుషకార । వైభవము, జెప్పెదను జవ్వులుమీర ।
ఆదరంబునను మీర । లందరును, నాలింపుడయ్యలార ॥శ్రీ॥

2. ఘోరాపరాధియైన । కాకమున, కారాముడాత్మలోన ।
నేరమెంచకయె ప్రాణ । ములనిచ్చె, నీరమణికై బిరాన ॥శ్రీ॥

3. అంతయపరాధి కాక । యున్ననుద, శాస్యుని క్షమింపబోక ।
యంతమొందించె లోక । నాథుడీ, యమ్మదన చెంతలేక ॥శ్రీ॥

4. ఆ విభీషణుడు ముందు । జూపిభ, క్త్యతిశయమ్ము సీతయందు ।
కావుమని వేడినందు । వలననే, గాంచె రాఘవుని పొందు ॥శ్రీ॥

5. ప్రభుని యాశ్రయముగోరి । వచ్చెశూ, ర్పణఖ యీయమనుమీరి ।
యభయమును గనకపారి । పోయెనుగ, దా వికృతముగనుమారి ॥శ్రీ॥

6. భూషణము లున్నమాట । యిచ్చిరా, మునినాశ్రయించెనౌట ।
బూపాత్మజుండు దాట । లేదిమె, పురుషీకరించుబాట ॥శ్రీ॥

7. సౌమిత్రి సీత వినగ । మీ వెనుక, జనుదెంచు వాడనగ ।
రాముండు వలదనగ । లేకతని, గ్రహియించి వనికిజనెగా ॥శ్రీ॥

8. పురుషకారంబుదాను । గాగగుణ, ములుమూడు గలుగనౌను ।
విరహములు మూటిలోను । సతివాని, నెరిగించె వరుసగాను ॥శ్రీ॥

9. చెరనుండి సురసతులను । విడిపింప, జెందజనెదా వెతలను ।
విరహమది మొదటిదిలను । అందుగృప, యెరిగింపబడె నిటులను ॥శ్రీ॥

10 కలిగె రెండవ వియోగ । మీయమకు, గర్భిణిగనుండియేగ ।
నీలదశనుస్ఫుటముగాగ । బారతం, త్ర్యమునోచె ముదమురేగ ॥శ్రీ॥

11 అందరువిసర్జ శపథము । జేసిచనె, నదియుమూడవ విరహము ।
అంధదనన్యార్హత్వము ॥ నీస్మెయెడ, నగపడెని చెల్లనిజము ॥శ్రీ॥

12 అరయ సంశ్లేషమందు । విశ్లేష, మందునీయమ్మయెడందు ।
పురుషకారమును బొందు । గాఁజేయు, చురహిల్లు జగమునందు ॥శ్రీ॥

13 మగఁడు సంశ్లేషమునను । దిద్దుబా, టగును నీయుమవలనను ।
జగతి విశ్లేషమునను । జీవుండౌ, సగు నివ్విధానమునను ॥శ్రీ॥

14 జీవుండు నీశ్వరుండు । దిద్దుబా, టౌవిధము జేయుచుండు ।
నీవసజ నేత్రిమెండు । గాఁజేసి, యొసగు నుపదేశమొండు ॥శ్రీ॥

15 ఉపదేశమున నప్పుడు । దిద్దుబా, టొందఁడోనరుఁడప్పుడు ।
కృపవానిపై జొప్పడు । నటుజేయు, నీమెయతడిక దప్పడు ॥శ్రీ॥

16 హరిదా బలుకుకార్యము । జేయకు, న్నపుడీమె సౌందర్యము ।
బరపెనేనియు ధైర్యము । జెడియతడు, ద్వారజూపు నౌదార్యము ॥శ్రీ॥

17 ఈరీతి గర్మపార । తంత్ర్యంబు, నిద్దరికి జెన్నుమీర ।
దీరిచి కృతార్థులైరా । జిలజేయు, నీరమణి హర్షమార ॥శ్రీ॥

18 తా మగనిబాసియున్న । నెవ్వఁడౌ, త్తరివచ్చి శరణటన్న ।
నేమగునోయనుచు నెన్న । డతనివిడ, కేయుండుగలికిమిన్న ॥శ్రీ॥

19 తనదు కనుసన్నలందు । దనమగని, దానడుప వశమందు ।
ననవరత ముండిపొందు । నతనిదగు, ననుభవమి కేమికుందు ॥శ్రీ॥

20 అతని మనసెరుగగోరి । యాశ్రితుల, యపరాధములనునేరి ।
పతితోబలికిత దీరి । తంబుగాని, పరగు నొక్కొక్కసారి ॥శ్రీ॥

21 నీవితని గావలేని । రక్షకుఁ, డీవనెడి ఖ్యాతిహాని ।
నేవిధినిగనదా దాని । జెప్పుమన, నేమనడతండుబూని ॥శ్రీ॥

22 నీభక్తులను గురించి । యిత్తరిని, నేనేమి యుపకరించి ।
శోభిలుదునవివరించి । జనకుఁడీ, సుదతినడుగనుదపించి ॥శ్రీ॥

23 ఏమి గావింపుమన్న । మారుమా, టేమియును నాడదెన్న ।
భామకోరికను గ్రన్న । నచుదీర్చి, పరగు జేజేలమిన్న ॥శ్రీ॥

24 ఒకవేళ నతఁడువినక । యున్నని, య్యువిద జూపించుగినుక ।
బ్రకటించు నేమియనక । సౌందర్య, పటిమలో బడుచుగనుక ॥శ్రీ॥

25 ఈమె సౌందర్యజలధి । దాటిచన, నేది యాతనికిగొలది ।
యా మహామహునివెలది । యీమెయు, ల్లలగించు శక్తిగొలది ॥శ్రీ॥

26 ఈమెకై మన తప్పుల । గణియింప, కీశ్వరుడు బలుచొప్పుల !
ప్రేమమీరగ గుప్పుల । కొలదిమన, విషయమునవిడు నొప్పుల ॥శ్రీ॥

27 ఇన్ని యపరాధములను । జేసినే, నెట్లు హరి జేరగలను ।
అన్న వెరపడగ వలెను । అనిననీ, యమప్రాపు ముఖ్యమిలను ॥ శ్రీ॥

28 మృదువగును గఠినమగును । ఈశ్వరుని, హృదయమీమెకు గనగను ।
అది మృదుతమంబెయగును । గనుకనీ, యమయడరె నివ్యాధిగను ॥శ్రీ॥

29 మాతయే యీమెగాక । యున్నసుర, మానినులు జెందుశోక ।
మీతన్విసైపలేక । చెరనుబడు, నేతానైనబోక ॥శ్రీ॥

30 తన చంటిబిడ్డనూత । బడిసదా, నునునందు బడెసిమాత ।
తనకు నుపమానమాత । మనియీమె, యొనరించె విట్టిచేత ॥శ్రీ॥

31 జనులెంతదను వేసిన । మాధవుడు, శాస్త్రములు జెపజూడనా ।
యనునీమె జతగూడిన ।విడువబో, దత డెన్నినుడులాడిన ॥శ్రీ॥

32 ప్రియముగోరు నదిగాన । జగమునకు, విభుడు హితకరుడైన ।
దయితయగు కతనమాన । సముద్రిప్ప, దాజాలు దగువిధాన ॥శ్రీ॥

33 పురుషకారము మతాంత । రులకునో, ప్పదలగాకుండినంత ।
ధరవైష్ణవత్వ మెంత । యుండినను, సిరిపదముగనె గొరంత ॥శ్రీ॥

34 నరులంచునట్లు పూర్తి । జేసి యిది, నల్లాను చక్రవర్తి ।
తిరువేంకటార్యుడార్తి । బాసిపొం, దెనులోకమున సుకీర్తి ॥శ్రీ॥

## కృతజ్ఞత

భక్తి "నివేదన" చందాదారులకు మా కృతజ్ఞతా పూర్వక అభినందనములు. మీరొసంగు అమూల్యమగు సలహాలను శిరసావహించుచున్నాము. తప్పక వాటిని అమలు జరిపి పత్రికను సుసంపన్న మొనరించ ప్రయత్నింతుము. యింతవరకు కార్యాలయ మొకచోట సంపాదకులొకచోట ప్రెస్సుఒకచోట, పోష్టింగు వేరొకచోట అగుటచే యిట్టి అవ్యవస్థ యేర్పడినది. యికముందు అన్నియు ఒకచోటే జరుగు యేర్పాట్లు చేయుచున్నాము గాన గ్రాహకులు యథాపూర్వము అభిమానించి పత్రిక నాదరించ ప్రార్థించుచున్నాము.

ఇట్లు,
సంపాదకులు.

# శ్రీ మహాభారత కథా సామరస్యము - భగవద్గీత

శ్రీ శ్రీ శ్రీ మేకా వెంకటాద్రి అప్పారావు బహద్దరు జమీందారు వారు, నూజివీడు

శ్రీ భారత ప్రజలమగు మనకు విశేష పరిచయము గల పురాణ గ్రంథములు మూడు. శ్రీమద్రామాయణము శ్రీమన్ మహాభారతము, శ్రీమద్భాగవతము, తెనుగు కవిత్రయం వారిచే అనుపమానముగా ఆంధ్రభాషకు పరివర్తనము చేయబడినందున మిగుల ప్రశస్తి ఆంధ్రదేశమున గాంచినది. మనకు మిగుల వాడుకయైనది. ఈ మన తెలుగు భారతమునకు మూలమైన శ్రీ మహాభారతము వ్యాస మహామునిచే, ప్రథమమున, కలియుగాదియందు జయము (ధర్మజయము) అను పేరుతో రచింప బడినది.

శ్లో॥ నారాయణం నమస్కృత్య।
నరంచైవ నరోత్తమం॥
దేవీం సరస్వతీం వ్యాసః।
తతో జయ ముదీరయేత్॥

ఇది సుమారు పదివేల శ్లోకములు గల గ్రంథముగా నుండెననియు అటు పిమ్మట వ్యాసుని శిష్యుల చేతను ప్రశిష్యుల చేతను ఉపాఖ్యానములు సంవాదములు మొదలైన ఆఖ్యాయికలును హరివంశమును చేర్చబడుటచే సపాద లక్ష శ్లోకముల గ్రంథముగా విపృతమైనదనియు ప్రతీతి.

ఇట్లు పెంపుచేయబడుట కొంత వ్యాసుని వల్లను కొంత వ్యాసుని ఆధ్వర్యమునను కొంత వ్యాసుని అనంతరమును జరిగి యుండును.

వ్యాసుని ప్రథమ రచనము కలియుగాదిని. అనంతర విస్మృతముల సంపుటీకరణము బౌద్ధయుగానంతరమునను అటుపిమ్మటను సంభవించి యుండెనేని—బౌద్ధయుగమున భారత భూమికి వలస వచ్చిన టిబెట్ మొదలైన విదేశీయ రాజుల ఆచార ధర్మములు, భారత ప్రజలచే స్వాంగీకారము పడయుటకై శ్రీ భారతమున విదేశీయ ప్రభుపోషకులగు పరివర్తకుల చేత చేర్చబడి యుండును.

అనగా మనము ప్రస్తుతము సేవించు ముద్రణాపాఠము నందుగల మార్పులు—ఆర్యసాంప్రదాయమునకు భిన్నములైనవి. ఇటీవలి శతాబ్దముల వరకు చేర్చ బడుచున్నట్లు కనుపించుచున్నవి.

ఎందుకనగా బౌద్ధయుగమునకు పూర్వము జైనయుగమునకు చెందిన జైన భారతము, కన్నడ భారతము మొదలైన ప్రాచీన గ్రంథములందు భారత కథలు వేరుగా నున్నవి. మంచివిగా కూడ నున్నవి.

## ముఖ్యమైన కథా భేదములు.

1. వ్యాసుడు, దాశరాజు యొక్క ప్రథమ కుమారికయగు మత్స్యగంధికి పరాశరమునికి జరిగిన గాంధర్వ వివాహ పర్యవసానముగా సంభవించిన కుమారుడు.

2. ఈ మత్స్యగంధి యొక్క చెలియలు శంతన మహారాజులకు భార్యయై, ఆయనవల్ల చిత్రాంగద, విచిత్ర వీర్యులను గాంచిన తల్లి

(వ్యాసుడు కాశీనుడు కాదు. ఈయన తల్లియు, శంతనుని భార్యయగు సత్యవతియు సోదరీలు అగుటచే వ్యాస మాతకు ద్వీపతీర్ధము అను విపరీతము కొన్ని గ్రంధముల పాఠములచే ముగ్గువ్య మగు చున్నవి).

3. ఈ శంతను మహారాజునకు పెద్ద భార్య గంగాదేవి అనబడు ఒక మాండలిక రాజకుమార్తె. ఏడుగురు కుమారులను ఒకరి తరువాత నొకరిని కనెను. కర్మవశముచే వారు శైశవము ననే గతింపుచు వచ్చిరి. ఎనిమిదవ కుమారుడౌ భీష్ముడు మాత్రమే వర్ధిల్లు చుండగా గంగాదేవి గతించెను. అనంతరము శంతను మహారాజు దాశరాజు రెండవ కుమార్తెయగు సత్యవతిని వివాహమై చిత్రాంగద, విచిత్ర వీర్యులను గాంచెను.

4. సత్యవతిని శంతను మహారాజు వివాహము అగు సందర్భమున రాజ్యమును వివాహమును భీష్ముడు త్యజించెను. శంతనుని మరణానంతరము భీష్ముడే తన సవతి తమ్ములకై రాజ్యము చేయుచు వారిని పెంచెను. వీరు పెద్దవారైన పిమ్మట చిత్రాంగదు డొక యుద్ధమునని హతుడు కాగా విచిత్ర వీర్యునకు అంబిక అంబాలికలను, భీష్ముడు వివాహము చేసెను.

5. భార్యలు గర్భిణులై యుండగా విచిత్ర వీర్యుడును మరణించెను. తరువాత అంబిక ధృతరాష్ట్రుని, అంబాలిక పాండురాజును, కనిరి. విదురుడు ధృతరాష్ట్రుని దాది కుమారుడు. (వీరి జన్మలతో వ్యాసునకు ప్రమేయములేదు. ఇప్పటికి తపో మహిమ గాంచిన ఈయన కురు రాజుల కుల గురువై యుండుట వలన వీరికి నియతమైన సర్వ కర్మలను నెరవేర్చెను, భీష్ముడే ఈతని సవతి తమ్ముల కుమారులను కూడా పెంచి పెద్దవారిని చేసి వివాహములు చేసెను.

6. పాండురాజు సంతానమునకై తపస్సు చేసి దేవతల వరములచే మునిశాప విముక్తి బడసి సక్రమముగా పంచపాండవులను తనూజులుగా గనెను. దే వ త ల ది సంకల్ప ప్రభావము మాత్రమే.

7. కర్ణుడు కుంతిభోజుని సూతుని తనూజుడే తన తండ్రితో కూడ కు ం తీ దే వి కి అరణము ఇవ్వబడి హస్తినాపురమునకు వచ్చి- పాండురాజు శతశృంగమున కేగిన పిదప ధృతరాష్ట్రునియొక్కయు, ఆయన కుమారుడౌ దు ర్యో ధ ను ని యొక్కయు ప్రాపుగాంచెను. పాండురాజు మరణానంతరము హస్తినాపురమునకు వచ్చిన పాండవులలో మధ్యముడౌ అర్జునునకు పోటీదైన విలుకాడౌటచే దుర్యోధనుని మైత్రియు, అంగ రాజ్యమును బడసెను. చిన్ననాడు లాలింపబడిన వాత్సల్యమే ఈయనకు కుంతీదేవిసెడ కుమారునంత ప్రేమకు అన్యోన్యముగా కారణమయ్యెను. ఆ చిన్ననాటి మైత్రియే ఈ త ని ని శ్రీకృష్ణ భ క్తునిగా కూడ చే సె న ను ట కు ఈ దిగువ తమిళ భారత పద్యము ఎన్నతగినది.

ఆసన్నమృతి గల కర్ణుడు శ్రీ కృష్ణునకు తన పుణ్యఫలమును అర్పించుట.

అ॥ ఆవియో-నిలై యిజిల్-కలయధ్రు-యాక్కై-ఆక త్తదో

తె॥జీవమో-నెలవునుండి-కదిలినకై-మేని-లోనిదో

అ॥ పుఱ త్తదో-అఱియేన్

తె॥ వెలిదో-తెలియనేరను.

అ॥ పావియేన్-వేణ్డుం-పొరుళెల్లాం-నయక్క-ం-వక్క-వన్-దన్నిల్

తె॥ పాపిని-వలసిన సంపదలన్ని-ఇచ్చునట్టి-వేళ-యందు

అ॥ వన్ దిలై యాల్

తె॥ వెంటరావు-అయ్యో!

అ॥ ఓవిలాదు-యాన్ శెయ్-పుణ్ణియం-అన్ైత్తుం-ఉదవినేన్

తె॥ సమ్మతిలేక-నేచేసిన-పున్నెము-అంతయును-అర్పించితిని

అ॥ కొళ్ కనీ-ఉనక్క-ప్

తె॥ తీసికొనుము-నీకు

అ॥ పూవిల్ వాళ్-అయనుం-నికరఒన్-యెన్లాల్-పుణ్ణియం

తె॥ పద్మమునందుండు - బ్రహ్మయు- సమ్మగను-అనిన-నాపుణ్యము

అ॥ ఎుదనినుం-పెరిదో

తె॥ దీనికంటె-గొప్పదా

8. భారత కథ కంతటికి గొప్పవ్యత్యాసమా ద్రౌపదీ పంచ భర్తృత్వమును గూర్చి జైన భారతము నందు గల శ్లోకములు.

శ్లో॥ 135. ద్రౌపదీ చ నృతం మాలాం।
కంధరే ధృత్వా బంధురే॥
అకరోత్కర పద్మాభ్యాం।
అర్జునస్య వరేచ్ఛయా॥

తా॥ అంతట [కృష్ణా పాంచాలికా] (ద్రౌపది) అర్జునుని వరించవలెనను కోరికతో వెంటనే సమీపించి బంధురమైన అతని కంఠమందు తన చేతులతో స్వయంవరమాలను వేసెను.

శ్లో॥ 150 } స్నుషాబుద్ధి రభూత్తస్యాం।
151 } జ్యేష్ఠయో రర్జున స్త్రియాం॥
ద్రౌపద్యాం యమ స్యాపి।
మాతరీవా నువర్తనం॥

శ్లో॥ తస్యాః శ్వశుర బుద్ధిస్తు।
పాండావివతయో రభూత్॥
అర్జున ప్రేమసంరుద్ధం।
ఔచిత్యం దేవరద్వయే॥

తా॥ అర్జునుని భార్యయగు నా ద్రౌపది యందు పెద్దలగు ధర్మజ భీములు కోడలు అను భావమును వహించిరి. మరుదులగు నకుల సహదేవులు తల్లి యగు భావమును పొందిరి. అట్లే ఆమెయు ధర్మజ భీములను పాండురాజును వలె (మామను వలె) చూచెను. కవలలను ఔచిత్యముతో పుత్రులను వంక చూచెను.

కాబట్టి ద్రుపద కన్యలు అయిదుగురు, పంచాలికలు అనబడువారు. పంచపాండవులకు వేరు వేరు భార్యలు. కావున ద్రౌపదీ పంచభర్తృత్వము మిథ్య. విదేశీయ ఆచారమును స్వదేశ ప్రభువంశమునకు ఆపాదింప జేయబడిన ప్రక్షిప్తము.

ఇట్లు పవిత్రమైన ఇట్టి భారతమున కంతకు పావనతమమైనది. శ్రీ నరనారాయణుల అంశల సంభూతులౌ శ్రీకృష్ణార్జునుల యొక్క స్నేహము ఇందుకు భగవత్ గీత ఉదాహరణము.



# నారీవిభాగము

శ్రీమద్భాగవత శ్రీపాదరేణువు, మదరాసు.

అ॥ ఆరాయిన్దు విట్టేనో తిరుమళిశై యార్పోలే॥

తె॥ శోధించి వదలినానా తిరుమళి శైయాళ్వార్లవలె॥

౨

వీరు భారద్వాజులకును కనకాంగికిని జన్మించిరి. వీరు శైవము - వైష్ణవము - కాపాలికము జైన శక్తి-చార్వాకములను షణ్మతములను పరిశీలించి కడుకు వైష్ణవమతమే ఉత్కృష్టమని,

పా॥ ఇనియరిందేన్ ఈశర్కుం నాన్ముగర్కుం దెయ్వం । ఇనియరిందేన్ ఎంబెరుమాన్ ఉన్నై ।
ఇనియరిందేన్ కారణంనీ కట్రివైనీ కర్పవైనీ । నర్కరిశై నారణన్నీనన్గరిందేన్ నాన్ ।

అని పాడిరి. వీరు అద్వైత మతానుష్ఠాన మవలంబించినప్పుడు వీరికి శివ వాక్యరని పేరు. "జ్ఞాన కోవై" యను గ్రంథమును రచించిన పదునెనిమిది సిద్ధులలో వీరే మొదటివారు. వీరిని వైష్ణవునిగా జేయమని స్వామి అనుజ్ఞకాగా "ముదళాళ్వార్లు" వీరుండిన స్థలమున కెదుట అశ్వత్థవృక్షమును వాటి సమీపమున ఆంజనేయుల ప్రతిష్ఠయుండుటను జూచి ముదలాళ్వార్లు ముగ్వురును ప్రదక్షిణ నమస్కారంబు లొనర్చుటను జూచి ఈ "శివవాక్యర్" పే ఆళ్వార్ పొయ్గై ఆళ్వార్ పూదత్తాళ్వార్లను.

పాట॥ సట్టకలై దైవమెన్ను నాలుపుష్పంశాత్తి యే ।

...మెం మెగౌన్ను శొల్లుమంత్ర మేదడా ।

...మో నాదనుళ్ళిరుక్కై ।

...కరిచ్చు వైయరియుమో ॥

...చిరి ఇట్టిపేరిని,

... నాన్ముగన్ కుండిగై నీర్పెయ్ ॥ మరై కొండమంది రత్తాల్ వాళ్తి

...ండకండత్తాన్ శెన్ని మేలేరక్కళువినాన్ । అండత్తాన్ ఆంగు

...ంపుటి ౪

అన్న ఈ పాటతో జయించిరి. వీరు కాంచీపురమున మణివణ్ణన్ సన్నిధికి సమీపమున తపము జేసికొనుచుండిరి. తన శిష్యులైన కణికణ్ణను వీరికి శుశ్రూష చేయుచుండెను. కణికణ్ణన్ ఉంఛవృత్తికి పోగా ఆ ఊరి రాజైన పల్లవరాయుడు తనపై పాట పాడమనెను. అందుకు కణికణ్ణన్ నా నాలుక మనుష్య మాత్రుని పాడదని చెప్పెను. రాజు కోపగించి కణికణ్ణనను ఊరు వదలి పొమ్మనెను. అట్లేయని గురువైన తిరుమళిశై ఆళ్వార్లతో చెప్పగా తామును బయలుదేరి మణివణ్ణప్పెరుమాళ్‌తో

పా॥ కణికణ్ణన్‌పోగిన్నాన్ కామరుపూంకచ్చిమణివణ్ణా నీకిడక్కవేండాం
తుణివుడైయ శెన్నాప్పులవనియాన్ శెల్గిన్నేన్ నీయునిన్ పైన్నాగప్పాయ్ శురుట్టిక్కొళ్॥

అనగానే స్వామి లేచి ఆదిశేషుని పడకగా చుట్టుకొని ఆగురు శిష్యులను వెంబడించిపోయెను. వీరట్లు పోగానే గాలి నిరోధమాయెను. ఊరు చీకటి గ్రమ్మగా మంత్రి ఇది భాగవతాపచారమని తెలుసుకొని రాజు మంత్రి ప్రధానులతో తిరుమళిశైయాళ్వారుల పాదములపై బడి తప్పు క్షమించమనగా వారు శిష్యుని వేడుమనిరి. అట్లే వేడిరి. అప్పుడు తిరుమళిశై యాళ్వార్లు స్వామితో

పా॥ కణికణ్ణన్‌పోక్కొళిందాన్ కామరుపూంకచ్చిమణివణ్ణా నీకిడక్కవేండుం
తుణివుడైయ శెన్నాప్పులవనియాన్ శెల్‌గిన్నేన్ నీయుమ స్తన్ పైన్నాగప్పాయ్ విరిత్తుక్కొళ్

అని చెప్పగానే స్వామి యథాప్రకారము ఆలయములోకి వచ్చి తన పడకను విరిచి పరుండెను. అప్పటినుంచి వారికి యథోక్తకారి యనిపేరుగల్గెను. తిరుమళిశై యాళ్వారులు వెళ్ళి స్వామి వీరిని చూచి లేచి మాట్లాడలేదని

పా॥ నడందకాల్గళ్ నొందవో నడుంగఞాల మేనమాయ్
ఇడందమెయ్‌కులుంగవో విలంగుమాల్‌వరైచ్చురం।
కడందకాల్పరందకావిరిక్కరైక్కుడందైయుళ్
కిడందవారెళుందిరుందుపేశు॥

అనగానే స్వామి లేవబోగా ఆళికేశనే అనిరి. నేటికిని స్వామికి ఉత్థానశాయి... తిరుమళిశై యాళ్వార్లవలె నేను భగవద్విగ్రహములను లేపించినానా?

భారతమున కంతకు నారాయణుల అంశల ...మల యొక్క స్నేహము ...దాహరణము.

# ప్రచార విభాగము.



## రామానుజ దర్శనం.

గుంటూరు జిల్లా పిడుగురాళ్ల గ్రామమున నెల కొల్పబడిన శ్రీరామ తీర్థ సేవా శ్రమము మన భారత దేశమునకు నిష్పక్ష పాతమగు ఆధ్యాత్మిక సేవ గావించు చున్నది. ఆ యా శ్రమము తరపున యీ దివ్య గ్రంధ మీ సంవత్సరమున 13 వ ప్రచురణము గా వెలు వడినది. ఇది ఆంధ్ర విశ్వవిద్యాలయమున తత్వ శాస్త్రోపన్యాసకు లైన శ్రీయుత కే. సచ్చిదానంద మూర్తి M. A., గారిచే రచింప బడినది. వీరు మూడు మతములను సమగ్రముగా పరిశీలించిన నిపుణ రచయితలు, గ్రంధము శ్రీ రామానుజుల వారి దివ్య జీవిత చరిత్రతోను వారి సిద్ధాంత వివరములతోను అలరారుచు జేబు సైజుతో ముద్దుల మూట కట్టుచున్నవి.

1. ఇందు రామానుజావతార పూర్వావస్థ.
2. శ్రీరామానుజుల చరిత్ర సంగ్రహము.

...త్రి మతము స్వరూతము.

5. అధికారి.

... తత్వమసి.

... 12. ప్రపత్తి.



...శములు 15ము క్తి...లతో తేట తెల్లమగు తెనుగు భాషలో రచింప బడినది.

చివర స్తోత్ర రత్నము నుండి నిత్యాను సంధేయములగు 5 శ్లోక రత్నములు తాత్పర్యముతో చేర్చ బడియున్నవి.

సంగ్రహముగను సుబోధకముగను శ్రీవిశిష్టాద్వైత సంప్రదాయము నెఱుంగ గోరు వారికీ చిన్నిగంధరత్నముమహోపకారముగావించును.

దీని వెల 0-12-0, పోష్టేజీ వేరె.

కావలసిన వారు :- శ్రీరామతీర్థ సేవాశ్రమం
పిడుగురాళ్ల పోష్టు,
గుంటూరు జిల్లా

అనిగాని, సంఘ కార్యాలయమునకు
వ్రాసిన బడయ గలరు.

---

## కట్నములు.

శ్రీరామ తీర్థం ఉ. వే. శ్రీ. తి. ప. రామానుజస్వామిగారి, కుమారుని వివాహ సమయ మందు భక్తి నివేదన పత్రికకు కట్నంగా సమర్పించినది, రూ॥ 2-0-0 లు గాన వధూవరులకు శ్రీయఃపతి ఆయురారోగ్య ఐశ్వర్యములు ఇచ్చి రక్షించుగాక.

బెజవాడ

కోట వెంకటనరశింహంగారి దౌహిత్రిని వివాహసమయమందు కట్నంగా రూ॥5-0-0 లు సమర్పించిరి. గాన వధూవరులకు శ్రీయఃపతి ఆయురారోగ్యఐశ్వర్యములుయిచ్చిరక్షించు...

# శ్రీ భక్తి నివేదనకు

## నందన ఉగాది కానుక

రచన: వేదాధ్యాయి వేదాంతం రాధాకృష్ణమాచార్యులుగారు
పోరంకి

గీ॥ శ్రీరఘువంశభూషణుండు | శ్రీకరుండు
పవలు రేవెలుగులుగ | వెల్గించువాడు
రవికుల సార్వభౌముండు శ్రీ | రామచంద్రుడు
భక్తినివేదనన్ సర్వదా | బ్రోచునింక.

గీ॥ నందనవత్సరాదికిన్ | సవ్యదివ్య
బల్కులతో నివేదన | బల్కుచున్ ద
శదిశలు విరాజిల్లుచు | సంతసముగ
భారతావనియందు | బొందెకీర్తి.

గీ॥ భక్తినివేదన దివ్యంబై | బుధజనులకు
ఆస్తికులైనవారలన | మాదరణము
బొందుచున్ నిరంతరంబు | పండితవర
యాదరణంబై శ్రావ్యంబై | యొప్పుచుండె.

గీ॥ నందన ఉగాదికిన్ యా | నందమస్తు
శ్రీరస్తు శుభమస్తు | సర్వదాని
రంతరంబు భద్రమస్తు | రమ్యమైన
భక్తినివేదనకు సర్వదా | భాగ్యమస్తు.



# ముముక్షుప్పడి.

దీని ప్రాశస్త్యమును చెప్ప వలసిన పనిలేదు. ఇది యెరుంగని వాడు వైష్ణవుడు కానేరడు. గదా! ఇది ద్రావిడ భాషలో మూడు ప్రకరణములుగా నున్నవి. ఆ భాషాపరిచయము లేని వారికి యపూర్వార్థములు దుర్బోధకముగా నుండునని లోక కల్యాణార్థమై లేమల్లె అగ్రహార వాస్తవ్యులైన శ్రీ ఉ. వే. శ్రీమాన్ ఇరగవరపు పెదనారాయణాచార్యులుగారు ఇందలి మూడు ప్రకరణములలోని ప్రతి సూత్రమునకును ఆంధ్రమున సులభశైలిలో ప్రతి పదార్థమును, తాత్పర్యమును వ్రాసి యున్నారు. ఆచార్యుల వలన మంత్రోపదేశమును బడసి పెద్దల వలన కాలక్షేపము గావించుకొని, విని తెలుసుకొన అవకాశము లేనివారికిన్ని, విన్నను ధరించుసామర్థ్యము లేని వారికిన్ని ఇది మహోపకారము గావించును.

దీని వెల 1-0-0. పోస్టేజి అదనం.

వలయువారు, సంఘకార్యాలయమునకుగాని లేక
ఇరగవరపు పెదనారాయణాచార్యులుగారు,
లేమల్లె అగ్రహారం
అగసంపూడి
అని వ్రాయవలెను.

భారతమున కంతకు
నారాయణుల అంశల
వల యొక్క స్నేహము
దాహరణము.





శ్రీమతే రామానుజాయనమః


భక్తి

# నివేదన

వేదాంత మాసపత్రిక

సంపుటి ౪ | నందన-చైత్రమాసం | సంచిక ౧


## కృష్ణార్జున సంవాదము


శ్రీ ఉ. వే. శ్రీమాన్ తె. కం. గోపాలాచార్యులుగారు,

కోదకొండ.


—: 3 వ రంగము :—

(ప్రకాశముగా) అర్జునా! నీవు చంపబడుదురని భయపడు భీష్మ ద్రోణాదులయొక్కయు చంపెదనని తలంచు నీ యొక్కయు వాస్తవస్వరూపము నెఱుంగక నిట్లు విలపించుచున్నావు!

అర్జు:- ఎఱంగకేమి! నేను కుంతీ పుత్త్రుడను. పాండుమహారాజు నా తండ్రి! ధర్మజుడు నాయన్న, నకులసహదేవులకు యన్నను. నీ బాల్య మిత్రుడను. భీష్ముడు నాకు తాత శంతనుని వలన గంగయందుద్భవించిన సాటిలేని మహావీరుడు. అస్ఖలిత బ్రహ్మచారి, ఇకనే ద్రోణాచార్యులు సరే సరి. ఇప్పటి రాజలోకమునకు ధనుర్వేదమున నాచార్యస్థానము నలంకరించిన బ్రాహ్మణోత్తముడు. ఇందు తెలియని రహస్య మేమున్నది.

కృష్ణ:- అది శరీరమునే ఆత్మగా భావించు పామరుల పాఠము, నే చెప్పునదది గాదు.వినుము భీష్మద్రోణులన నీ పైకి గాన్పించు ప్రాకృత స్థూల శరీరమే కాదు,

అర్జు:- మరియేమి!

కృష్ణ:- దేహము ఇంద్రియములు మనస్సు ప్రాణము బుద్ధులకంటె వేరై స్వయం ప్రకాశమై ఆనందరూపమై అణువై అవ్యక్తమై అచిన్త్యమై అవయవ విహీనమై వికారరహితమై జ్ఞానమున కాధారమై సర్వేశ్వరునకు నియామ్యమై ధార్యమై శేషమైయుండు నిత్యవస్తువగు ఆత్మయే ఆ భీష్మాదులలోని ప్రధానాంశము. పైకి గాన్పించు శరీరములు ఆయాత్మలకు చినిగినవి పారవేయబడుచు నూతనములు పరిగ్రహింపబడుచు పైన ధరింపబడు వస్తువులవలె వచ్చుచు పోవుచు నుండు అప్రధానాంశములు.

(అర్జు:- కృష్ణా! ఆ యాత్మలయొక్క శుద్ధస్వరూపము నా కొకింత వివరముగా చెప్పుము

కృష్ణు:- పరిశుద్ధమగు ఆత్మతత్త్వము పరమపురుషునితో సమాన ధర్మములు కలది. అనాదియైనది దానికి కాళ్లు చేతులు కన్నులు తలలు ముఖములు లేకున్నను పరమపురుషునివలె వాటితో చేయు కార్యములను చేయు శక్తి కలిగియుండును. అది లోకమునందుండు సమస్త వస్తువులను తన తేజముతో నావరించియున్నది. స్వాభావికముగ దేవాదిదేహములతో సంబంధము లేనిదయ్యును సకలదేహములను ధరింపసమర్థమై యుండును సహజముగ సత్త్వాదిగుణములు లేనిదైనను వాటి ననుభవింప సమర్థమైయుండును. అమానిత్వాది గుణములు లేనివారికి దూరమున నున్నను అవి యున్నవారికి దగ్గరనే యుండును. అవి సూక్ష్మమైనదగుటచే దేహముకంటె వేరని యెఱుంగరాకయుండును. ప్రకృతికంటె పరమైనది. జ్ఞానాకారమైనది. సకల ప్రాణులయొక్క హృదయమున సన్నిహితమైయుండును.)

అర్జు:- కృష్ణా! ఇదియేమి! నీవు చెప్పునదంతయు వింతగనున్నదే. ఈ శుద్ధాత్మ స్వభావములన్నియు పరమపురుషుని స్వభావముల కొకింతయు తీసిపోకయున్నదే) అయినచో నిట్టి యాత్మకీ ప్రకృతి సంబంధమెట్లు దాపరించెను?

కృష్ణ:- బాగుగ నడిగితివి. అదియే తెలియతగిన ముఖ్యవిషయము. రోగమునకు నిదానమెరుంగక చికిత్సమర్థమగునా! ఈ ప్రకృతి పురుషు లనాదిగ నొకరితో నొకరు కలిసియుందురు. ఈ ప్రకృతి మాత్రము దేవమనుష్యాది నానా విధాకారముల మారుచుండును. ఈ జీవుడా శరీర ప్రయుక్తమైన సత్త్వాది గుణముల వలన పుట్టెడు సుఖదుఃఖాదుల యందాసక్తుడగును. అందులకై పుణ్య పాప కర్మల నాచరించు చుండును. పిమ్మట వాటి ఫలముల ననుభవించుటకై ఉచ్చజన్మను గాని నీచ జన్మను గాని పొందుచుండును. అట్లు పుట్టి ఆ ఫలముననుభవించుచు తిరిగి కర్మల నాచరించుచు జన్మల నెత్తుచునే యుండును.

అర్జు:- అయినచో.కృష్ణా! ఆత్మనిత్యమైనదంటివే .యిది పుట్టుట ఎట్లు?

కృష్ణ:- అర్జునా! తన పూర్వకర్మానుభవమున కనుకూలముగ నాచే నొసంగబడు దేహమున ప్రవేశించుటయే జీవునకు పుట్టుట, దానిని వీడుటయే నాతడు గిట్టుట తెలిసినదా!

అర్జు:- తెలిసినదిగాని ...

కృష్ణ:- కాని యని సందేహించు చున్నావేల?

అర్జు:- లేదు కృష్ణా! నిన్ను నా ప్రశ్న పరంపరలచే విసిగించు చున్నానేమోయని భయ పడుచున్నాను.

కృష్ణ:- (అర్జునుని చేతులు పట్టుకొని)

ఉ॥ మిత్రమ యెంతమాట భయమేటికి బూనెదు
సంశయింపకేమాత్రము — దూడచే పిడకమానిన
ధేనువు పాలొసంగునా! క్షత్రియ జాతి, శిష్యు
డవు. చాల భయంకరమైన యీ కురుక్షేత్రము
జేరితే మనెదొ చెప్పుము తెల్పెద దాని నర్జునా!

అర్జు:- కృష్ణా:- నీ యవ్యాజ కారుణ్యమునకు కృతజ్ఞుడను. జీవునకా కర్మవశమున కలుగు శరీర మేద్రవ్యమో అది నేటి కాశ్రయమైనదో దాని వికారము లెవ్వియో అదియే ప్రయోజనము కొరకు కలిగినదో! ఏ స్వరూపమైనదో దయతో సెలవిమ్ము!

కృష్ణ:- అర్జునా! శరీరము పంచభూతములు అహంకారము మహత్తత్వము ప్రకృతి యన బడు యెనిమిది ద్రవ్యములతో నిర్మింపబడినది. పదునొకండింద్రియముల కాశ్రయమై యిచ్ఛా ద్వేష సుఖదుఃఖములనెడు వికారములు కలిగి భూతసంఘాతరూపమై చేతనుడు సుఖదుఃఖములనుభ వించు నిమిత్తము ఏర్పడుచున్నది.

అర్జు:- అయినచో కృష్ణా! ఇట్లీ యాత్మకు శరీరపరంపర లనివార్యములగుచో నిక నీతడు ముక్తి నొందుటెట్లు

కృష్ణ:- బాగుగా నడిగితివి! నుడివెదవినుము. అమానిత్వాదులనెడు యిరువది గుణము లున్నవి. అవి యలవడిన నిక జన్మముండదు.

అర్జు:- ఆ గుణములను దయయుంచి సుబోధకముగ బోధింప ప్రార్థించు చున్నాను.

కృష్ణ:- అట్లే వినుము.

పెద్దల తిరస్కరింపకుండుట, దంభమునకు ధర్మముల నాచరింపకుండుట, మనోవాక్కాయములచే పరులపీడింపకుండుట, వారు తనను పీడించినను తన మనమున కలతనొందకుండుట, తన యాచార్యు నకు సేవచేయుట, శాస్త్రోక్తములగు నాచారముల వీడకుండుట, ఆత్మేతరములందు విరక్తి చెంది యుండుట, అహంకార మమకారములకు తావీయకుండుట, పుత్ర మిత్ర కళత్రాదులను శాస్త్రీయ ములగు కర్మలకు మాత్రమే తగునంతగా పరిగ్రహించుట, ఇష్టానిష్టములు సంభవించుతరి హర్షో ద్వేగముల చొరనీయక మనస్సు నొకేరీతి నుంచుకొనుట, నాయందు స్థిరభక్తికలిగియుండుట మొద లగు గుణములీయాత్మ కెప్పుడలవడునో అప్పుడీతని కికముందు శరీరసంబంధ ముండబోదని విశ్వసిం పుము. నీ కందలి పెక్కు గుణంబులు సహజంబుగనే యున్నవి!

అర్జు:- కృష్ణా! ధన్యుడను. ఇది నీ యనుగ్రహ విశేషమే కాని కృష్ణా! ఈ గుణములందర కేలయులవడవు?

కృష్ణ:- అడుగవలసిన దాని నడిగితివి! సావధానముగ వినుము! జీవునకు ప్రాచీన కర్మమూలముగ శరీరసంబంధము దాపరించినదనియు, ఆ శరీరమన ప్రకృతి పరిణామ విశేషమనియువింటివి గదా! అట్టి శరీరమునకు సహజములగు సత్వరజస్తమస్సులనబడు మూడు గుణములతో సంబంధమనివార్యము.

అర్జు:- అవుననేను!

కృష్ణ:- అయిన నేమనుచున్నావా! అవియే గదా జీవుని శరీరముతో బంధించునవి.

అర్జు:- ఓహో! అటులనా! అవి యచేతనములు గదా! అవి యెట్లు చేతనుని బంధించును.

కృష్ణ:- అర్జునా! సత్వమునకు సుఖసంగమున్ను రజస్సునకు కర్మసంగమున్ను తమస్సునకు చేయరాని పనియందు ప్రవృత్తి సంగమున్న ముఖ్యద్వారములు ఇవి పురుషునకు వీనియందు ఆసక్తిని కలుగజేయును. దానిచే నా జీవుడు వాటికి సాధనమగు కర్మల నాచరించి తత్ఫలానుభవమునకై అర్హమగు యోనులయందు పుట్టుచున్నాడు. ఇప్పుడు తెలిసినదా ఇవి యెట్లు జీవుని శరీరముతో బంధించుచున్నవో.

అర్జు:- కృష్ణా! వినినకొలదియు సంశయములు మితిమీరుచున్నవి గాని శమించుటలేదు. (నాకిది చెప్పుము. (ఈ మూడు సుగుణము లెప్పుడును ఒక్కతీరున వర్తించుచునే యుండవలయును గదా. అయినచో నివియెట్లు పరస్పర విరుద్ధకార్యముల బుట్టించుచున్నవు.

కృష్ణ:- అట్లుగాదు. ప్రాచీన కర్మవశమునగాని, భుజించు నాహారములయందలి వైషమ్యము వలనగాని సత్వాదులలో నొకటి వృద్ధిపొందుచు మిగిలిన రెండింటిని యడగించుచుండును.

అర్జు:- అయినచో కృష్ణా! ఏ గుణము తలయెత్తినదో యేవి తలవంచినవో తెలియుటకేమైన నుపాయము కలదా?

కృష్ణ:- లేకేమి! ఈ శరీరమునందు జ్ఞానేంద్రియముల ద్వారా వస్తువులయొక్క యధార్థ స్వరూపము తెలియబడుచున్నప్పుడు సత్వగుణము మిగుల వృద్ధిబొందియున్నదనియు లోభము వ్యర్థ చేష్టలు, ఫలసాధన కర్మానుష్ఠానము, శబ్దాది విషయభోగేచ్ఛయు వర్తించుచున్నచో రజోగుణము వృద్ధిజెంది యున్నదనియు, గుర్తింపుము. ఇక వస్తువులయొక్క వాస్తవస్వరూపము తెలియకుండుటయు, కూడని పనులయందు ప్రవర్తించుటయు, చేయవలసినపనులను మానుటయు సంభవించెనేని తమోగుణము వృద్ధి పొందియున్నదనియు గ్రహింపుము.)

అర్జు:- నీవు వెనుక మోక్షసాధనములని చెప్పిన అమానిత్వాది గుణములు యీ సత్వాదుల మూడింటిలో దేనివలన బుట్టుచున్నవి?

కృష్ణ:- సత్వగుణమువలననే అయ్యా! ఈ మాత్రి మెఱుంగవా!

అర్జు:- కృష్ణా! ఈ సత్వము వృద్ధియగు సాధనము లెవ్వి!

కృష్ణ:- అర్జునా! మనము తినెడి యాహారము యజ్ఞము దానము తపస్సు అనునవియే యిందులకు సాధనములు.

అర్జు:- ఇందేది ప్రధానమైనది?

కృష్ణ:- అన్నియు ప్రధానమైనవియే కాని మనస్సు అన్నమయమగుటచేతను ఆహారశుద్ధిచే సత్వశుద్ధి చేకూరుటచేతను ఆహారమే తక్కిన మూడింటికిని నిదానమగుచున్నది.

అర్జు:- అయినచో. ఆ యాహారస్వరూపమును దయతో వివరింపుము, నేను దానినెరింగి సాత్వికాహారముచే నీవు చెప్పిన సద్గుణముల పెంపొందించు కొందును.

కృష్ణ:- అర్జునా! మధుర రసముతో గూడినవై చమురు గలిగి చూచినంతనే ప్రీతిని పుట్టించునవై రక్తమాంసాది సప్తధాతువులుగా పరిణమించి యవి చిరకాలము శరీరము నందున్నట్లు చేయునవి యగు నాహారములు ఆయువును, జ్ఞానమును, బలమును, ఆరోగ్యమును, పెంపొందించును, కావున నివి సాత్వికాహారములుగ పరిగణింప బడుచున్నది, ఇందు పాలు పండ్లు దుంపలు మొదలగు అపక్వపదార్థములు ప్రధానములు. కారము పులుసు మిక్కిలి యుప్పన మిక్కిలి వేడి మికలవియు వాత ప్రకోపము వలన శోషకరములును, పిత్తప్రకోపము వలన తాపకరములును నగు పదార్థములు కష్టమును మనోవ్యాకులమును రోగమునుకలుగజేయునుగాన నివి రాజసములనబడును.

వండి చాలకాలము గడచినదియు, సహజరుచి వీడినదియు, దుర్గంధముకలదియు, పాసినదియు, భుజింపబడిగిలినదియు, భగవన్నివేదితముకానిదియు, తామసాహార మనబడును,) కావున యర్జునా,

గీ॥ ఈవుహితమును గోరుదువేనిపార్థ
సాత్వికాహారసేవయే సలుప వలయు
పరమసాత్వికుడగు వాడుబడయ కలుగు
నాత్మసిద్ధికి సాధనమైన గుణము

అర్జు:- అటుపిమ్మట చేయవలసిన దేమి!

కృష్ణ:- ఇప్పుడే చేయవలసిన దంతయును ఇట్టియోగ్యత నార్జించినవాడే కర్మయోగమున కధికారికాగలడు. ఆ కర్మయోగము స్వయముగ గాని జ్ఞాననిష్టను కలిగించిగాని ఆత్మసాక్షాత్కారమును కలుగజేయును. దానిని నిరంతర మభ్యసించుటచే భక్తి యుదయించును. దానిచే నన్ను వాస్తవముగ శాస్త్రముచే తెలియుటకును, కలరూపమున సాక్షాత్కరించుటకును, సమర్థుడగును. అంతట వాడర్చిరాది మార్గమున పరమపదము నధిరోహించి నాతోడి పరమసామ్యమునంది నన్ను యథార్థరూపమునసంపూర్ణముగ అనుభవించిశాశ్వతముగసాయుజ్యసుఖము ననుభవించుచుండును.

ఇట్టి మహాభాగ్య మొకజన్మములో లభించునది కాదు. అనేక జన్మార్జితమగు సుకృత పరంపరలచే భక్తుడైన ధన్యునకే యీ భాగ్యమబ్బును.

అర్జు:- ఆహా! కృష్ణా! నేడెంత రహస్యార్థముల వినిపించితివి. నీ స్నేహము నాకిప్పుడు సార్థకమైనది.

ఉ॥ ఎంచితి మిత్రుడంచు భ్రమియించితి బాంధవుడంచు
తెన్నవేర్చి మించితి కృష్ణుడంచపహాసించితి బావ
సాత్రాదియంచు పంపించితి దూతయంచు
పిలిపించితి యాదవుడంచు కాని యొక్కించుక
నీదుశక్తి పరికించక పోయితి నింతగాలమున్.

(కృష్ణా! ఆ కర్మజ్ఞాన యోగములనవేమో! వాటి నెట్లాచరింపవలెనో తెలియజెప్పి నన్ను కృతార్థుని చేయుము. నీకంటె నాకీరహస్యార్థముల నుపదేశించు హితుడెవ్వడు. నా తప్పులు మన్నించి నాకీ యర్థముల నుపదేశింపుము. (అని పాదములపై బడును)

కృష్ణ:- అర్జునా! ఇదియు నా పనియే. దీనికి నీవింత ప్రార్థింపపనిలేదు. నీకు శ్రద్ధయు ఆ సిక్యమును ఉన్నచాలును. నేనెంతయు సవిస్తరముగ చెప్పెద వినుము.

కర్మయోగమనగా— ఆత్మనిత్యమనెడు జ్ఞానము కలవాడై తన వర్ణమునకు ఆశ్రమము నకును తగిన కర్మలకు తాను కర్తకాననియు 'సర్వస్వామియగు సర్వేశ్వరుడే తన కధీనుడగు నాచే తన నారాధించుటకే తన కర్మలను చేయించుచున్నాడు. ఇందు నాకేమియు లేదు. కావుననే నాకీ కర్మలతో సంబంధమును లేదు, గాన నవి ఫలమొసంగినను ఒసంగకున్నను ఆనంద విషాద ముల కవకాశములేదు. అనెడు నధ్యవసాయముతో నాచరింపవలెను.

అర్జు:- కృష్ణా! ఈ చేతనుడు మనుష్యుడుగా బుట్టును. పశువుగా బుట్టును. పక్షిగాబుట్టును. చెట్టుగా బుట్టును. అని వాడుకగా వినుచుందుమే, ఇది నిత్యమని యెఱుంగుటకేమి ప్రమాణములు కలవు?

కృష:- నిజమే కాని ఆ యనుభవము భ్రాంతిమూలము ఆత్మనిత్యమైనది. ఇందులకనేక ప్రమాణములున్నవి. ఆత్మ యింద్రియములకు గోచరించదు గాన ప్రత్యక్షముచే తెలియబడక పోయినను అనుమానాగమములచే నా విషయము దృఢపరుచ బడుచున్నది. చెప్పెద వినుము. ఆత్మ యతిసూక్ష్మమైనది. దానిచే వ్యాపింపబడని పదార్థమే ప్రపంచమున లేనేలేదు. కావున నిది నిత్యమై తీరవలెను.

అర్జు:- గాలి యంతటను వ్యాపించుచున్నది గదా. అది నశించుట లేదా?

కృష్ణ:- అట్లుకాదు. ఆ గాలిలో కూడనిది వ్యాపించి యున్నది. ఆ గాలియు వ్యాపించని పెక్కు పదార్థములున్నవి. నశింపజేయు వస్తువు నశింపజేయబడు వస్తువునందు ప్రవేశించియే

దానిని నశింపజేయవలెను. అట్టి వస్తువునందు కూడ ఆత్మ వ్యాపించియె యుండును గాన దీనిలో దూర గలిగినంత సూక్ష్మవస్తువేదియు ప్రపంచమున గాన్పింపదు. కావున నీ యాత్మను ఆయుధ ములు ఖండింపజాలవు. అగ్ని దహింపజాలదు. నీరు తడపజాలదు. వాయువు శోషింపజాలదు. అం దుచే నిది నిత్యమైనది. ఇదిగాక నెన్నియో శ్రుతి స్మృతీతిహాస పురాణాగమాది ప్రమాణ పరం పరలు గలవు.

అర్జు:- సరియే. వాటి నటుండనిమ్ము? ఇట్టి జ్ఞానముతో నిర్లేప కర్మల నాచరించుటచే నేమి సిద్ధించును?

కృష్ణ:- రజస్తమస్సులు పూర్తిగ నశించి మనస్సు నిర్మలమగును. అంతట జ్ఞాననిష్ఠయన బడు స్థితప్రజ్ఞత యుదయించును.

అర్జు:- కృష్ణా! స్థితప్రజ్ఞుని స్వరూపమెట్లుండును. వాడేమి భాషించును ? వాడెట్లు ధ్యాన మునకు గూర్చుండును? వాని ప్రవర్తన యెట్లుండును?

కృష్ణ:- ఆత్మయందే రతి కలిగియుండుట వాని స్వరూపము. ఆత్మను గూర్చి మాట్లాడు చుండుటయే వాని కభ్యాసము. పరిశుద్ధమగు ప్రదేశమునందు మిక్కిలి యెత్తును కురుచయును గాక కఱ్ఱతో చేయబడు పీఠముపై దర్భలను, వాటిపై కృష్ణాజినమును, దానిపై పరిశుభ్ర వస్త్రమును పరచి దానిపై వెన్ను కొంచెము గోడ కానుకొని కూర్చుండి యోగమునందు మనస్సు నిలిపి చిత్తేంద్రియ వ్యాపారముల నడంచి తనకు బంధముపోయి ఆత్మప్రాప్తి కలుగవలెనని ఆత్మనే ధ్యానించుచు ప్రవర్తించును.

అర్జు:- ఈ యనుష్ఠానముచే వెంటనే యాత్మదర్శనమగునా! లేక దీని కేదైనను క్రమ పరిపాటి కలదా?

కృష్ణ:- లేకేమి! ఇది నాలుగు తరగతులుగా నుండును. మొదట బాహ్యేంద్రియములను విషయముల నుండి మరలించి బాహ్యవ్యాపారములను మాని మనస్సులోనున్న ఆత్మయందు నిలుపుటకు యత్నింపవలెను. ఇది మొదటి దశ. దీనికి యతమానావస్థ యనిపేరు.

ఇట్లింద్రియములు బలాత్కారముగా మరల్చబడినను మిగిలియుండు రాగద్వేషాది దోషము లచే కలుషితమగు మనస్సు ఆ యింద్రియములను మరల విషయములపట్ల పురిగొల్పుటయే గాక తానును ఆత్మయందు నెలకొనజాలక యుండును. కాబట్టి పక్వము కాని రాగాదులు పూర్తిగా తొలంగునట్లు ఉదాసీనాదులు వహించి యుండవలెను. ఇది వ్యతిరేకావస్థయనబడు రెండవ దశ.

ఇట్లు రాగాదులు పూర్తిగ నశించుటచే విషయానుభవము నశించినను, అనాదికాలము నుండియు అనువర్తించుచున్న విషయవాసన మాత్రము నశించక ఆ విషయములయందు ఔత్సు క్యమును గలిగించి బుద్ధిని కలతపెట్టును అట్టితరి పురుషుని ద్వేషించు నొక యువతికి నొక సుంద రాంగుడగు యువకుని జూపగ నామె యాతనియందు క్రమముగ రాగము గలిగి వర్తించునటు

ఆ బుద్ధికి నిరతిశయానంద రూపమగు నాత్మను జూపి క్రమ క్రమముగ దానియందు మిక్కిలి తుష్టిని కలుగజేసి దానిచే బాహ్యవిషయ వాసనను దానిచే గలుగు నౌత్సుక్యమును నిర్మూలింప వలెను. దీనికి చాలకాలము పట్టును. ఇది యేకేంద్రియావస్థ యనబడు మూడవదశ.

ఇట్లాత్మరతిచే సమస్త వాసనల నశించి తుదకు ఔత్సుక్యము గూడ గలుగక పోవుటచే పరమ వైరాగ్యయుక్తమైన వశీకరణమును పేరుగల నాల్గవ యవస్థ గలుగుచున్నది. ఇది జ్ఞాన నిష్ఠ యనబడు స్థితప్రజ్ఞుని పూర్ణ పరిపాక దశ-

ఇదియే ఆత్మావలోకమును సాధించును, ఆత్మావలోకనమే క్రమముగ భక్తియోగము నకు పిమ్మట దాని మూలమున నిరతిశయ పురుషార్థమగు మోక్షమునకు సాధనమగును.

అర్జు:- కృష్ణా! ఈ యవస్థల వైషమ్య మొకింత స్పష్టముగా తెలుపుము.

కృష్ణ:- కామములు కామములుగా గన్పడకుండుట. ఉత్తమావస్థ, అట్లు కనపడినను వాటియందు సంగము లేకుండుట మూడవ యవస్థ, లేశమాత్ర సంగముతో విషయముల ననుభవించుచున్నను అతిస్నేహము లేకుండుట రెండవ యవస్థ. మిక్కిలి యనురాగమున్నను దానిని నిర్మూలింప దొడంగుట మొదటి యవస్థ. అర్జునా! తెలిసినదా!

## శ్రీ యతిరాజ భజన కీర్తనలు

కవితావతంస, గానకళానిపుణ, హరికథా చతురానన

శ్రీ ఉ. వే. శ్రీమాన్ కరి నారాయణాచార్య భాగవతార్

### లాలిపాట

ఉదయరవిచంద్రిక — ఖండచాపు

1 లాలి లక్ష్మణబాల ! లాలి గుణజాలా ।
లాలి ముద్దులబాల ! లాలి శుభశీలా ! లాలి

2 లాలి కాంతిమతీయ ! లాలిమహనీయా ।
లాలి కేశవసూరి రాడ్భాగధేయ । లాలి

3 లాలి దివ్యశరీర ! లావణ్యపూర ।
లాలి ధీరోదార ! లాలి సుకుమార । ॥లాలి

4 లాలి రామానుజా ! లాలి బుధరాజా ।
లాలి సుగుణవ్రజా ! బాలార్కతేజా । ॥లాలి

5 లాలి శేషావతారా ! మహాధీరా ।
లాలి వైష్ణవలోక పాలనోదారా । ॥లాలి

6 లాలి భారతమాతృ రమణీయభూషా ।
లాలి నారాయణార్య స్వామిపోషా । ॥లాలి

# "ప్రియః ప్రియా యార్హసి" - ఇందలి యర్థ వివరణ స్వారస్యము.

శ్రీ భగవద్గీతలోని 11 వ అధ్యాయము నందలి 44వ శ్లోకం :-

తస్మాత్ప్రణమ్య ప్రణిధాయ కాయం
ప్రసాదయే త్వా మహ మీశ మీడ్యం।
పితేవ పుత్త్రస్య సఖేవ సఖ్యుః
ప్రియః ప్రియాయార్హసి దేవ సోఢుమ్॥

1. పై శ్లోకములోని ఉత్తరార్థమునకు శ్రీ మచ్ఛంకర భగవత్పాదాచార్యులవారు భాష్యములో "త్వం పునః పుత్త్రస్యాపరాధం పితా యథా క్షమతే, సర్వం సఖ్యు రపరాధం వా, ప్రియః ప్రియాయాః అపరాధం క్షమతే ఏవమర్హసి హే దేవ! ప్రసహితుం క్షంతు మిత్యర్థః-అని వివరించి, పుత్త్రుని యపరాధమును సర్వమును తండ్రి క్షమించునట్లును, చెలికానికి సర్వాపరాధములను చెలికాడు క్షమించునట్లును, ప్రియురాలి యపరాధములను ప్రియుడు క్షమించునట్లును ఓ దేవా! నా సమస్తాపరాధములను నీవు క్షమింపదగుదువు - అని సెలవిచ్చిరి.

శ్రీ పెరియ వాచ్చాన్‌పిళ్ళైగారు శరణాగతి గద్యవ్యాఖ్యానములో "హే దేవ! పుత్త్రస్య(దోషం) పితేవ, సఖ్యుః (దోషం) సఖేవ, ప్రియాయా (మహ్యం) ప్రియః (త్వమ్) సోఢుమ్ అర్హసి-అనియును 'ప్రియః ప్రియాయార్హసి' అనుచోట "ప్రియః-ప్రియాయాః అర్హసి"-అనియను ఆర్ష సంధిని స్వీకరించి ప్రియురాలి తప్పులను ప్రియుడు సైచునట్లనియు ద్వివిధముగ వివరించిరి.

2. శ్రీ మద్భగవద్రామానుజాచార్యులువారు భాష్యములో "యథాకృతా పరాధస్యాపి పుత్త్రస్య, యథా చ సఖ్యుః ప్రణామ పూర్వం ప్రార్థితః పితా, సఖా వా ప్రసీదతి; తథా త్వం పరమకారుణికః ప్రియః ప్రియాయ మే, సర్వం సోఢు మర్హసి"-అని సెలవిచ్చిరి.

3. "పరమార్థప్రభ" - అనుటీకను వ్రాసిన శ్రీ దైవజ్ఞ సూర్య పండితులు "ప్రియః-ప్రియుడవైననీవు, ప్రియాయ-ఇష్టము కొఱకు అని వ్రాసిరి.

4. శ్రీ కంఠ శివాచార్య కృత భాష్యములో "పితేవ పుత్త్రస్య, సఖేవ సఖ్యుః, ప్రియాయచ ప్రియశ్చత్వమేవార్హసి, మమాపరాధంసోఢుమిత్య న్వయః"-అనిరి.

పుత్త్రుని యపరాధమును తండ్రి వలెను, స్నేహితుని యపరాధమును స్నేహితుని వలెను, ప్రియుని యపరాధమును ప్రియుని వలెను, నా యపరాధమును నీవు సహింపదగుదువు,-అనిరి.

సంస్కృత మహాభారతమునకు సరియగు ఆంధ్రీకరణమును గావించిన "మహామహోపాధ్యాయ," "కవిసార్వభౌమ" శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రులవారు "కృష్ణ భారతము"లోని భీష్మపర్వము నందలి ద్వితీయాశ్వాసములోని 304వ పద్యము.

ఆ॥ కాన మేనువంచి నేను నిన్నిఁడ్యుని శుని
బ్రిసన్నుఁజేసి కొనెద నీవు కరుణఁగొ॥
పుత్రుఁ దండ్రి గతిఁబ్రియుం బ్రియుండట్లు,
సఖుని సఖుఁడు వోలె సైపదగును॥

అని సెలవిచ్చిరి.

"భావదీప" టీకా కారులైన శ్రీ నీలకంఠాచార్యులవారు శ్రీ మహాభారత వ్యాఖ్యానమున "తస్మాత్ప్రణమ్య" అను శ్లోకమును ఈ దిగువరీతిని వివరించిరి. "ఏత దేవాహ-'తస్మాదితి". యస్మాత్ త్వంపితా గురుశ్చ తస్మాత్ప్రియం శరీరం ప్రణిధాయ భూమావాకృత్వా దండవత్ప్రణమ్యత్వాం ప్రసాదయే-ఈడ్యంస్తుత్యం స్పష్టమన్యత్-అనిరి. "ప్రియః ప్రియాయార్హసి" అనుచోట ఆర్షసంధిని వివరింపలేదు.

"హేకృష్ణ హేయాదవ హేసఖేతి" అను శ్లోకములో హేసఖే ఇతి అని ఆర్షసంధిని శ్రీ నీలకంఠాచార్యులవారు వివరించిరి.

5. శ్రీ భాగవతములోని ప్రథమస్కంధములో 15వ అధ్యాయములోని 19వ శ్లోకము.

"శయ్యాసనాటన వికత్థన భోజనాది, ష్వైక్యా ద్వయస్య ఋతవానితి విప్రలబ్ధః సఖ్యుస్సఖేవ పితృవత్తనయస్య సర్వం సేహే మహామహితయా కుమతే రఘం మే"-అని అర్జునుఁడు ధర్మరాజుగారితో విన్నవించినాఁడు. ఇందు "సఖ్యుస్సఖేవ, పితృవత్తనయస్య-అని ఈ రెండు ఉపమానములు మాత్రమే స్వీకరింపఁబడి వి.

శ్రీ భగవద్గీతా తాత్పర్యమును, శ్రీ భాగవత గ్రంథానుసారముగ నుండునని తలఁచి యే కాబోలు పూజ్యులునైన శ్రీ భాష్యకార రామానుజ గురువరేణ్యులు "ప్రియః ప్రియాయార్హసి" అనుచోట "ప్రియాయాయాః-అర్హసి" అని ఆర్షసంధిని చేయక, ప్రియాయ, మే సర్వంసోఢు మర్హసి"-నాకు ప్రియుడవైన నీవు నీకు ప్రియుడనైన నాకొరకు గాను అన్నింటిని సహించ తగుదువు.

పై విషయములను సాకల్యముగ పరిశీలించిన యెడల శ్రీ భగవద్రామానుజ మునీంద్రుల భాష్యము నందలి మూలాను గుణార్థవివరణ స్వారస్యము స్ఫురించును.

# చందాదారులకు విజ్ఞప్తి

అయ్యా !

మీరు పంపుచున్న చందాసొమ్ములు పైనంగా ఏ సంవత్సరం చందా పంపుచున్నదీ వ్రాసిపంపప్రార్థన. మణియార్డరు కూపనుల్లో పైనం వ్రాయకుండా, చేవ్రాలు చేయకుండా ఎందునిమిత్తము పంపుచున్నది తెలుపకుండగా పంపుచున్నారు. చందానెంబరుకూడా వేయప్రార్థన. చందాదార్లు వికృతి, ఖర అయిపోయిన సంవత్సరములు గతం వాటిబాకీకి ఇంకా రావలసి ఉన్నవి గాన దయయుంచి వెంటనే పంపప్రార్థన.

ఇట్లు,
కార్యదర్శి.

## పురుషకార వైభవము: పాట

శ్రీమాన్ శ్రీమ త్తిరుమలై నల్లాన్ చక్రవ ర్తి సంపత్కుమార జగన్నాధ తిరువేంకటాచార్యులవారు విజయవాడ.

ఆనందభైరవి: ఖండచాపు

1. శ్రీదేవి పురుషకార । వైభవము, జెప్పెదను జవులుమీర ।
ఆదరంబునను మీర । లందరును, నాలింపుడయ్యాలార ॥శ్రీ॥
2. ఘోరాపరాధియైన । కాకమున, కారాముడాత్మలోన ।
నేరమెంచకయె ప్రాణ । ములనిచ్చె, సీరమణికై బిరాన ॥శ్రీ॥
3. అంతయపరాధి కాక । యున్న నుద, శాస్యుని క్షమింపబోక ।
యంత మొందించె లోక । నాధుడీ, యమ్మదన చెంత లేక ॥శ్రీ॥
4. ఆ విభీషణుడు ముందు । జూపిభ, క్త్యతిశయము సీతయందు ।
కావుమని వేడినందు । వలననే, గాంచె రాఘువుని పొందు ॥శ్రీ॥
5. ప్రభుని యాశ్రయముగోరి । వచ్చెశూ, ర్పణఖ యీాయమనుమీరి ।
యభయమును గనకపారి । పోయెనుగ, దా వికృతముగనుమారి ॥శ్రీ॥
6. భూషణము లున్నమాట । యిచ్చిరా, మునినాశ్రయించెనోట ।
బూషాత్మజుండు దాట । లేదీమె, పురుషీకరించుబాట ॥శ్రీ॥
7. సౌమిత్రి సీత వినగ । మీా వెనుక, జనుదెంచు వాడననగ ।
రాముండు వలదనగ । లేకతని, గ్రహియించి వనికిజనెగా ॥శ్రీ॥
8. పురుషకారంబుదాను । గాగగుణ, ములుమూాడు గలుగనౌను ।
విరహములు మూాటిలోను । సతివాని, నెరిగించె వరుసగాను ॥శ్రీ॥
9. చెరనుండి సురసతులను । విడిపింప, జెందజనెదా వెతలను ।
విరహమది మొదటిదిలను । అందుగృప, యెరిగింపబడె నిటులను ॥శ్రీ॥
10. కలిగె రెండవ వియోగ । మీాయమకు, గర్భిణిగనుండియేగ ।
నీలదశనుస్ఫుటముగాగ । భారతం, త్ర్యముసోచ్చె ముదము రేగ ॥శ్రీ॥
11. అందరువినగ శపథము । జేసిచనె, నదియుమూాడవ విరహము ।
అందననన్యార్హత్వము ॥ నీమెయెడ, నగపడెని దెల్ల నిజము ॥శ్రీ॥

12 అరయ సంశ్లేషమందు । విశ్లేష, మందునీయమ్మ యెందు ।
పురుషకారమును బొందు । గాఁజేయు, చురపిల్లు జగమునందు ॥శ్రీ॥

13 మగడు సంశ్లేషముననను । దిద్దుబా, టగును నీయమవలనను ।
జగతి విశ్లేషముననను । జీవుండై, నగు నివ్విధానమునను ॥శ్రీ॥

14 జీవుండు నీశ్వరుండు । దిద్దుబా, టొవిధము జేయుచుండు ।
నీవనజ నేత్రిమెందు । గాఁజేసి, యొసగు నుపదేశ మొండు ॥శ్రీ॥

15 ఉపదేశమున నెప్పుడు । దిద్దుబా, టొందడోసగుఁడప్పుడు ।
కృపవానిపై జొప్పడు । నటుజేయు, నీమెయతడిక దప్పడు ॥శ్రీ॥

16 హరిదా బలుకుకార్యము । జేయకు, న్నపుడీమె సౌందర్యము ।
బరసెనేనియు ధైర్యము । జెడియతడు, ద్వరజూపు నౌదార్యము ॥శ్రీ॥

17 ఈరీతి గర్మసార । తంత్ర్యంబు, నిద్దరికి జెన్నుమీర ।
దీరిచి కృతార్థులైరా । జిలజేయు, నీరమణి హర్షమార ॥శ్రీ॥

18 తా మగనిబాసియున్న । నెవ్వడై, త్రరివచ్చి శరణటన్న ।
నేమగునోయనుచు నెన్న । డతనివిడ, కేయుండు గలికిమిన్న ॥శ్రీ॥

19 తనదు కనుసన్నలందు । దనమగని, దానడుప వశమందు ।
ననవరత ముండిపొందు । నతనిదగు, ననుభవమి కేమికుందు ॥శ్రీ॥

20 అతని మనసెరుగగోరి । యాశ్రితుల, యపరాధములనునేరి ।
పతితో బలికిత దీరి । తంబుగొని, పరగు నొక్కొక్కసారి ॥శ్రీ॥

21 నీవితని గావ లేని । రక్షకుడ, వీవనెడి ఖ్యాతిహాని ।
నేవిధినిగనదో దాని । జెప్పుమన, నేమనడతండుబూని ॥శ్రీ॥

22 నీభక్తులను గురించి । యిత్తరిని, నేనేమి యుపకరించి ।
శోభిలుదునని విరించి । జనకుడీ, సుదతినడుగునుదపించి ॥శ్రీ॥

23 ఏమి గావింపుమన్న । మారుమా, టేమియును నాడదెన్న ।
భామకోరికను గన్న । నచుదీప్చి. పరగు జేజేలమిన్న ॥శ్రీ॥

24 ఒకవేళ నతడువినక । యున్నని, య్యొవిధ జూపించుగినుక ।
బ్రికటించు నేమియునక । సౌందర్య, పటిమలో బడుచుగనుక ॥శ్రీ॥

25 ఈమె సౌందర్యజలధి । దాటిచన, నేది యాతనికిగోలది ।
యా మహామహునివెలది । యీమెయు, ట్లలరించు శక్తి గోలది ॥శ్రీ॥

26 ఈమెకై మన తప్పుల । గణియింప, కీశ్వరుడు బలుచొప్పుల !
ప్రేమమీరగ గుప్పుల । కొలదిమన, విషయమునని నొప్పుల ॥శ్రీ॥

27 ఇన్ని యపరాధములను । జేసినే, నెట్లు హరి జేరగలను ।
అన్న వెరపడగ వలెను । అనిననీ, యమపాప్రు ముఖ్యమిలను ॥శ్రీ॥

28 మృదువగును గఠినమగును । ఈశ్వరుని, హృదయమీమెను గనగను ।
అది మృదుతమంబెయగును । గనుకనీ, యమయడరె నివ్విధిగను ॥శ్రీ॥

29 మాతయే యీమెగాక । యున్నసుర, మానినులు జెందుశోక ।
మీతన్వీసైపలేక । చెరనుబడు, నేతాన్నైనబోక ॥శ్రీ॥

30 తన చంటిబిడ్డనూత । బడిసదా, నునునందు బడెసిమాంత ।
తనకు నుపమానమాత । మనియీమె, యొనరించె నిట్టిచేత ॥శ్రీ॥

31 జనులెంతదను వేడిన । మాధవుడు, శాస్త్రములు జెడజూడరా ।
యనునీమె జతగూడిన । విడువబో, దత డెన్నినుడులాడిన ॥శ్రీ॥

32 ప్రియముగోరు నదిగాన । జగమునకు, విభుడు హితకరుడైన ।
దయితయగు కఠినమాన । సముదిప్ప, దాజాలు దగువిధాన ॥శ్రీ॥

33 పురుషకారము మతాంత । రులకునో, ప్పదలగాకుండినంత ।
ధరవైష్ణవత్వ మెంత । యుండినను, సిరిపదముగనె నొరంత ॥శ్రీ॥

34 నరులంటునట్లు పూర్తి । జేసి యిది, నల్లాను చక్రవర్తి ।
తిరువేంకటార్యడార్తి । బాసిపొం, దెనులోకమున సుకీర్తి ॥శ్రీ॥

## కృతజ్ఞత

భక్తి "నివేదన" చందాదారులకు మా కృతజ్ఞతా పూర్వక అభినందనములు. మీరొసంగు అమూల్యమగు సలహాలను శిరసావహించుచున్నాము. తప్పక వాటిని అమలు జరిపి పత్రికను సుసంపన్న మొనరించ ప్రయత్నింతుము. యింతవరకు కార్యాలయ మొకచోట సంపాదకులొకచోట ప్రెస్సుఒకచోట, పోష్టింగు వేరొకచోట అగుటచే యిట్టి అవ్యవస్థ ఏర్పడినది. యికముందు అన్నియు ఒకచోటే జరుగు ఏర్పాట్లు చేయుచున్నాము గాన గ్రాహకులు యథాపూర్వము అభిమానించి పత్రిక నాదరించ ప్రార్థించుచున్నాము.

ఇట్లు,
సంపాదకులు.

# శ్రీ మహాభారత కథా సామరస్యము - భగవద్గీత

శ్రీ శ్రీ శ్రీ మేకా వెంకటాద్రి అప్పారావు బహద్దరు జమీందారు గారు, నూజివీడు

శ్రీ భారత ప్రజలమగు మనకు విశేష పరిచయము గల పురాణ గ్రంథములు మూడు. శ్రీమద్రామాయణము శ్రీమన్ మహాభారతము, శ్రీమద్భాగవతము, తెనుగుకవిత్రయంవారిచేఅనుపమానముగాఆంధ్రభాషకుపరివర్తనముచేయబడినందునయుగుల ప్రశస్తిఆంధ్రదేశమున గాంచినది. మనకు మిగుల వాడుకయైనది. ఈ మన తెలుగు భారతమునకు మూలమైన శ్రీ మహాభారతము వ్యాస మహామునిచే, ప్రథమమున, కలియుగాదియందు—జయము (ధర్మజయము) అను పేరుతో రచింప బడినది.

శ్లో॥ నారాయణం నమస్కృత్య।
నరంచైవ నరోత్తమం॥
దేవీం సరస్వతీం వ్యాసః।
తతో జయ ముదీరయేత్॥

ఇది సుమారు పదివేల శ్లోకములు గల గ్రంథముగా నుండెననియు అటు పిమ్మట వ్యాసుని శిష్యుల చేతను ప్రశిష్యుల చేతను ఉపాఖ్యానములు సంవాదములు మొదలైన ఆఖ్యాయికలును హరి వంశమును చేర్చబడుటచే సపాద లక్ష శ్లోకముల గ్రంథముగా విపులమైనదనియు ప్రతీతి.

ఇట్లు పెంపుచేయబడుట కొంత వ్యాసుని వల్లను కొంత వ్యాసుని ఆధ్వర్యమునను కొంత వ్యాసుని అనంతరమును జరిగి యుండును.

వ్యాసుని ప్రథమ రచనము కలియుగాదిని. అనంతర విస్తృతముల సంపుటీకరణము బౌద్ధయుగానంతరమునను అటుపిమ్మటను సంభవించి యుండెనేని—బౌద్ధయుగమున భారత భూమికి వలస వచ్చిన టిబెట్ మొదలైన విదేశీయ రాజుల ఆచార ధర్మములు, భారత ప్రజలచే అంగీకారము పడయుటకై శ్రీ భారతమున విదేశీయ ప్రభుపోషకులగు పరివర్తకుల చేత చేర్చబడి యుండును.

అనగా మనము ప్రస్తుతము సేవించు మద్రాసు పాఠము నందుగల మార్పులు—ఆర్యసాంప్రదాయమునకు భిన్నములైనవి. ఇటీవలి శతాబ్దముల వరకు చేర్చ బడుచున్నట్లు కనుపించుచున్నవి.

ఎందుకనగా బౌద్ధయుగమునకు పూర్వము జైనయుగమునకుచెందినదైన భారతము, కన్నడ భారతము మొదలైన ప్రాచీన గ్రంథములందు భారత కథలు వేరుగా నున్నవి. మంచివిగా కూడ నున్నవి.

## ముఖ్యమైన కథా భేదములు.

1. వ్యాసుడు, దాశరాజు యొక్క ప్రథమ కుమారికయగు మత్స్యగంధికి పరాశరమునికిజరిగిన గాంధర్వ వివాహ పర్యవసానముగా సంభవించిన కుమారుడు.

2. ఈ మత్స్యగంధి యొక్క చెలియలు శంతన మహారాజులకు భార్యయై, ఆయనవల్ల చిత్రాంగద, విచిత్ర వీర్యులను గాంచిన తల్లి

(వ్యాసుడు కానీనుడు కావు. ఈయన తల్లియు, శంతనుని భార్యయా సత్యవతియు సోదరీలు అగుటచే వ్యాస మాతకు ద్వీపతీర్థ్యము అను విపరీతము కొన్ని గ్రంథముల పాఠములచే ముగ్ధ్య మగు చున్నవి).

3. ఈ శంతను మహారాజునకు పెద్ద భార్య గంగాదేవి అనబడు ఒక మాండలిక రాజకుమార్తె. ఏడుగురు కుమారులను ఒకరి తరువాత నొకరిని కనెను. కర్మవశముచే వారు శైశవముననే గతింపుచు వచ్చిరి. ఎనిమిదవ కుమారుడౌ భీష్ముడు మాత్రమే వర్ధిలు చుండగా గంగాదేవి గతించెను. అనంతరము శంతను మహారాజు దాశరాజు రెండవ కుమార్తెయాసత్యవతిని వివాహమై చిత్రాంగద, విచిత్ర వీర్యులను గాంచెను.

4. సత్యవతిని శంతను మహారాజు వివాహము అగు సందర్భమున రాజ్యమును వివాహమును భీష్ముడు త్యజించెను. శంతనుని మరణానంతరము భీష్ముడే తన సవతి తమ్ములకై రాజ్యము చేయుచు వారిని పెంచెను. వీరు పెద్దవారైన పిమ్మట చిత్రాంగదు డొక యుద్ధమునని హతుడు కాగా విచిత్ర వీర్యునకు అంబిక అంబాలికలను, భీష్ముడు వివాహము చేసెను.

5. భార్యలు గర్భిణులై యుండగా విచిత్ర వీర్యుడును మరణించెను. తరువాత అంబిక ధృతరాష్ట్రుని, అంబాలిక పాండురాజును, కనిరి. విదురుడు ధృతరాష్ట్రుని దాది కుమారుడు. (వీరి జన్మలలో వ్యాసునకు ప్రమేయము లేదు. ఇప్పటికి తపో మహిమ గాంచిన ఈయన కురు రాజుల కుల గురునై యుండుట వలన వీరికి నియతిమైన సర్వ కర్మలను నెరవేర్చెను. భీష్ముడే ఈతని సవతి తమ్ముల కుమారులను కూడా పెంచి పెద్దవారిని చేసి వివాహములు చేసెను.

6. పాండురాజు సంతానమునకై తపస్సు చేసి దేవతల వరములచే మునిశాప విముక్తి బడసి సక్రమముగా పంచపాండవులను తనూజులుగా గనెను. దేవతలంది సంకల్ప ప్రభావము మాత్రమే.

7. కర్ణుడు కుంతిభోజుని సూతుని తనూజుడే తన తండ్రితో కూడ కుంతీదేవికి అరణము ఇవ్వబడి హస్తినాపురమునకు వచ్చి- పాండురాజు శతశృంగమున కేగిన పిదప ధృతరాష్ట్రునియొక్క-యు, ఆయన కుమారుడౌ దుర్యోధనుని యొక్క-యు ప్రాపుగాంచెను. పాండురాజు మరణానంతరము హస్తినాపురమునకు వచ్చిన పాండవులలో మధ్యముడౌ అర్జునునకు పోటీయైన విలుకాడౌటచే దుర్యోధనుని మైత్రియు, అంగ రాజ్యమును బడసెను. చిన్ననాడు లాలింపబడిన వాత్సల్యమే ఈయనకు కుంతీదేవిసొడ కుమారు నంత ప్రేమకు అన్యోన్యముగా కారణమయ్యెను. ఆ చిన్ననాటి మైత్రియే ఈతనిని శ్రీకృష్ణ భక్తునిగా కూడ చేసెననుటకు ఈ దిగువ తమిళ భారత పద్యము ఎన్నతగినది.

ఆసన్నమృతి గల కర్ణుడు శ్రీ కృష్ణునకు తన పుణ్యఫలమును అర్పించుట.

అ॥ ఆవిరోా-నిలై యుజీల్-కలయుదు-యాక్కై -
అకత్తదో

తె॥ జీవమో-నెలవునుండీ-కదిలినని-మేని-లోనిదో

అ॥ పులత్తదో-అటియేన్

తె॥ పెలిదో-తెలియనేరను

అ॥ పావియేన్-వేణ్డుం-పొరు ళెల్లాం-నయక్కు-ం-వక్క-వన్-దన్నిల్

తె॥ పాపిని-వచ్చిన సంపదలన్ని-ఇచ్చునట్టి-వేళ-యందు

అ॥ వన్దిలై యాల్

తె॥ వెంటరావు-అయ్యో!

అ॥ ఓవిలాదు-యాన్ శెయ్-పుణ్ణియం-అన్నైత్తుం-ఉదవినేన్

తె॥ సమ్మతిలేక-నేచేసిన-పుణ్యము-అంతయును-అర్పించితిని

అ॥ కొళ్ కనీ-ఉనక్కు-ప్

తె॥ తీసికొనుము-నీకు

అ॥ పూవిల్ వాళ్-అయనుం-నికరలన్-యెన్రాల్-పుణ్ణియం

తె॥ పద్మమునందుండు - బ్రహ్మయు- నమ్మడు-అనిన-నాపుణ్యము

అ॥ యిదనినుం-పెరిదో

తె॥ నీనికంటె-గొప్పదా

8. భారత కథ కంతటికి గొప్పవ్యత్యాసమా ద్రౌపదీ పంచ భర్తృత్వమును గూర్చి జైన భారతము నందు గల శ్లోకములు.

శ్లో॥ 135. ద్రౌపదీ చ ధృతం మాలాం।
కంధరే ధృత్వా బంధురే॥
అకరోత్కర పద్మాభ్యాం।
అర్జునస్య వరేచ్ఛయా॥

తా॥ అంతట [కృష్ణా పాంచాలిక] (ద్రౌపది) అర్జునుని వరించవలెనను కోరికతో వెంటనే సమీపించి బంధురమైన అతని కంఠమందు తన చేతులతో స్వయంవరమాలను వేసెను.

శ్లో॥ 150 } స్నుషా బుద్ధి రభూత్తస్యాం।
151 } జ్యేష్ఠయో రర్జున స్త్రియాం॥
ద్రౌపద్యాం యమ యోస్యాపి।
మాతరీ వా సువర్తినం॥

శ్లో॥ తస్యాః శ్వశుర బుద్ధిస్తు।
పాండావివతయో రభూత్॥
అర్జున ప్రేమసంరుద్ధం।
సౌచిత్యం దేవరద్వయే॥

తా॥ అర్జునుని భార్యయగు నా ద్రౌపది యందు పెద్దలగు ధర్మజ భీములు కోడలు అను భావమును వహించిరి. మరుదులగు నకుల సహదేవులు తల్లి యగు భావమును పొందిరి. అట్లే ఆమెయు ధర్మజ భీములను పాండురాజును వలె (మామను వలె) చూచెను. కవలలను ఔచిత్యముతో పుత్రులను వంక చూచెను.

కాబట్టి ద్రుపద కన్యలు అయిదుగురు, పంచాలికలు అనబడువారు. పంచపాండవులకు వేరు వేరు భార్యలు. కావున ద్రౌపదీ పంచభర్తృత్వము మిథ్య. విదేశీయ ఆచారమును స్వదేశ ప్రభువంశమునకు ఆపాదింప జేయబడిన ప్రక్షిప్తము.

ఇట్లు పవిత్రమైన ఇట్టి భారతమున కంతకు పావనతమమైనది. శ్రీ నరనారాయణుల అంశల సంభూతులౌ శ్రీకృష్ణార్జునుల యొక్క స్నేహము ఇందుకు భగవత్ గీత ఉదాహరణము.



## నారీ విభాగము

శ్రీమద్భాగవత శ్రీపాదరేణువు. మదరాసు.

అ॥ ఆరాయిన్దు విట్టేనో తిరుమళిశై యార్పోలే॥

తె॥ శోధించి వదలినానా తిరుమళి శై యాళ్వార్వలె॥

౨

వీరు భార్గవ్యాజులకును కనకాంగికిని జన్మించిరి. వీరు శైవము - వైష్ణవము - కాపాలికము జైన శక్తి-చార్వాకములను షణ్మతములను పరిశీలించి కడుకు వైష్ణవమతమే ఉత్కృష్టమని,

పా॥ ఇనియరిందేన్ ఈశర్కుం నాన్ముగర్కుం దెయ్వం । ఇనియరిందేన్ ఎంబెరుమాన్ ఉన్నై । ఇనియరిందేన్ కారణంనీ కట్రివైనీ కర్పవైనీ । నర్కురిశై నారణన్నీ నన్గరిందేన్ నాన్ ।

అని పాడిరి. వీరు అద్వైత మతానుష్ఠాన మవలంబించినప్పుడు వీరికి శివ వాక్యరని పేరు. "జ్ఞాన కోవై" యను గ్రంధమును రచించిన పదునెనిమిది సిద్ధులలో వీరే మొదటివారు. వీరిని వైష్ణవు నిగా జేయమని స్వామి అనుజ్ఞకాగా "ముదళాళ్వార్లు" వీరుండిన స్థలమున కెదుట అశ్వత్థవృక్ష మును వాటి సమీపమున ఆంజనేయుల ప్రతిష్ఠయుండుటను జూచి ముదలాళ్వార్లు మువ్వురును ప్రదక్షిణ నమస్కారంబు లొనర్చుటను జూచి ఈ "శివవాక్యర్" పే ఆళ్వార్ పొయ్గై ఆళ్వార్ పూదత్తాళ్వార్లను.

పాట॥ నట్టకల్లైదైవమెన్రు నాలుపుష్పంశాత్తియే ।

శుట్రివందు మొణమొణెన్రు శొల్లుమంత్రమేదడా ।

నట్టకల్లుం పేశుమో నాదనుళ్ళిరుక్కైయిల్ ।

శుట్టశట్టి శట్టువంకరిచ్చువైయరియుమో ॥

ఇయర్పా॥ యనిపరిహసించిరి ఇట్టిపీఠిని,

పా॥ కూరైకుండు నాన్ముగన్ కుండిగై నీర్పెయ్యు ॥ మఱైకొండమంది రత్తాల్ వాళ్తి కఱైకొండకండత్తాన్ శెన్నిమేలేరక్కళువినాన్ । అండత్తాన్ ఆంగు

అన్న ఈ పాటతో జయించిరి. వీరు కాంచీపురమున మణివణ్ణన్ సన్నిధికి సమీపమున నివసము జేసికొనుచుండిరి. తన శిష్యులైన కణికణ్ణను వీరికి శుశ్రూష చేయుచుండెను. కణికణ్ణన్ ఉంఛవృత్తికి పోగా ఆ ఊరి రాజైన పల్లవరాయుడు తనపై పాట పాడమనెను. అందుకు కణికణ్ణన్ నా నాలుక మనుష్య మాత్రుని పాడదని చెప్పెను. రాజు కోపగించి కణికణ్ణనను ఊరు వదలి పొమ్మనెను. అట్లేయని గురువైన తిరుమళిశై ఆళ్వార్లతో చెప్పగా తామును బయలుదేరి మణివణ్ణప్పెరుమాళ్తో

పా॥ కణికణ్ణన్ పోగిన్రాన్ కామరుపూంకచ్చిమణివణ్ణా నీకిడక్క వేండాం
తుణివుడైయ శెన్నాప్పులవనియాన్ శెల్గిన్రేన్ నీయుమునిన్ పైన్నాగప్పాయ్ శురుట్టిక్కొళ్॥

అనగానే స్వామిలేచి ఆదిశేషుని పడకగా చుట్టుకొని గురుశిష్యులను వెంబడించిపోయెను. వీరట్లు పోగానే గాలి నిరోధమాయెను. ఊరు చీకటి గ్రమ్మగా మంత్రి ఇది భాగవతాపచారమని తెలుసుకొని రాజు మంత్రి ప్రధానులతో తిరుమళిశైయాళ్వారుల పాదములపై బడి తప్పు క్షమించమనగా వారు శిష్యుని వేడమనిరి. అట్లే వేడిరి. అప్పుడు తిరుమళిశై యాళ్వార్లు స్వామితో

పా॥ కణికణ్ణన్ పోక్కొళిందాన్ కామరుపూంకచ్చిమణివణ్ణా నీకిడక్క వేండుం
తుణివుడైయ శెన్నాప్పులవనియాన్ శెల్ గిన్రేన్ నీయుమున్ పైన్నాగప్పాయ్ విరిత్తుక్కొళ్

అని చెప్పగానే స్వామి యథాప్రకారము ఆలయములోకి వచ్చి తన పడకను విచ్చి పడుకొనెను. అప్పటినుంచి వారికి యథోక్తకారి యనిపేరుగల్గెను. తిరుమళిశై యాళ్వారులు కుంభకోణమునకు వెళ్ళి స్వామి వీరిని చూచి లేచి మాట్లాడలేదని

పా॥ నడందకాల్గళ్ నొందవో నడుంగఞాలమేనమాయ్
ఇడందమెయ్కులుంగవో విలంగుమాల్వరైచ్చురం!
కడందకాల్పరందకావిరిక్కరైక్కుడందైయుళ్
కిడందవారెళుందిరుందు పేశు॥

అనగానేస్వామి లేవబోగా ఆళికేశనే అనిరి. నేటికిని స్వామికి ఉత్థానశాయి యనిపేరు. తిరుమళిశై యాళ్వార్లవలె నేను భగవద్విగ్రహములను లేపించినానా?

# ప్రచారవిభాగము



## రామానుజ దర్శనం.

గుంటూరు జిల్లా పిడుగురాల గ్రామమున నెల కొల్పబడిన శ్రీరామ తీర్థ సేవా శ్రమము మన భారత దేశమునకు నిష్పక్ష పాతమగు ఆధ్యాత్మిక సేవ గావించు చున్నది. ఆ యా శ్రమము తరపున యీ దివ్య గ్రంథ మీ సంవత్సరమున 13 వ ప్రచురణము గా వెలు వడినది. ఇది ఆంధ్ర విశ్వవిద్యాలయమున తత్వ శాస్త్రోపన్యాసకు లైన శ్రీయుత కే. సచ్చిదానంద మూర్తి M. A, గారిచే రచింప బడినది. వీరు మూడు మతములను సమగ్రముగా పరిశీలించిన నిపుణ రచయితలు, గ్రంధము శ్రీ రామానుజుల వారి దివ్య జీవిత చరిత్రతోను వారి సిద్ధాంత వివరములతోను అలరారుచు జేబు సైజులో ముద్దుల మూట కట్టుచున్నవి.

1. ఇందు రామానుజావతార పూర్వావస్థ.
2. శ్రీరామానుజుల చరిత్ర సంగ్రహము.
3. శ్రీ విశిష్టాద్వైతి మత స్వరూపము.
4, ప్రమాణము. 5. అధికారి.
6. విషయము. 7. తత్త్వమసి.
8. జీవుడు. 9. సృష్టి.
10. జగత్తు. 11. సాధన. 12. ప్రపత్తి.
13 సాక్షాత్కారము 14 వర్ణాశ్రమములు 15 ముక్తి

అను 15 ప్రకరణములతో తేట తెల్లమగు తెనుగు భాషలో రచింప బడినది.

చివర స్తోత్ర రత్నము నుండి నిత్యాను సంధేయములగు 5 శ్లోక రత్నములు తాత్పర్యము తో చేర్చ బడియున్నవి.

సంగ్రహముగను సుబోధకముగను శ్రీవిశిష్టాద్వైత సంప్రదాయము నెఱుంగ గోరు వారికీ చిన్ని గంధరత్నముమహోపకారముగావించును.

దీని వెల 0-12-0, పోష్టేజీ వేరే.

కావలసిన వారు :- శ్రీరామతీర్థ సేవాశ్రమం
పిడుగురాల పోష్టు,
గుంటూరు జిల్లా

అనిగాని, సంఘ కార్యాలయమునకు
వ్రాసిన బడయ గలరు.

## కట్నములు.

శ్రీరామ తీర్థం ఉ. వే. శ్రీ. తి. ప. రామానుజస్వామిగారి, కుమారుని వివాహ సమయమందు భక్తి నివేదన పత్రికకు కట్నంగా సమర్పించినది, రూ॥ 2-0-0 లు గాన వధూవరులకు శ్రీయఃపతి ఆయురారోగ్య ఐశ్వర్యములు ఇచ్చి రక్షించుగాక.

బెజవాడ

కోట వెంకటనరశింహంగారి దౌహిత్రిని వివాహసమయమందు కట్నంగా రూ॥5-0-0 లు సమర్పించిరి. గాన వధూవరులకు శ్రీయఃపతి ఆయురారోగ్యఐశ్వర్యములుయిచ్చిరక్షించుగాక.

# శ్రీ భక్తి నివేదనకు

## నందన ఉగాది కానుక

రచన: వేదాధ్యాయీ వేదాంతం రాధాకృష్ణమాచార్యులుగారు
పోరంకి

సీ॥ శ్రీరఘువంశభూషణుండు శ్రీకరుండు
పవలు రేవెలుఁగులుగ | ల్పించువాడు
రవికుల సార్వభౌముండు శ్రీ | రామచంద్రుఁ
భక్తినివేదనన్ సర్వదా | బ్రోచునింక

గీ॥ నందనవత్సరాదికిన్ | సవ్యదివ్య
బల్కులతో నివేదన | బల్కుచున్ ద
శదిశలు విరాజిల్లుచు | సంతసముగ
భారతావనియందు | బొందెకీర్తి.

సీ॥ భక్తినివేదన దివ్యంబై | బుధజనులకు
ఆస్తికులైనవారలన | మాదరణము
బొందుచున్ నిరంతరంబు | పండితవర
యాదరణంబై శ్లాఘ్యంబై |యొప్పుచుండె.

గీ॥ నందన ఉగాదికిన్ యా | నందమస్తు
శ్రీరస్తు శుభమస్తు | సర్వదాని
రంతరంబు భద్రమస్తు | రమ్యమైన
భక్తినివేదనకు సర్వదా | భాగ్యమస్తు.

# ముముక్షుప్పడి.

దీని ప్రాశస్త్యమును చెప్ప వలసిన పనిలేదు. ఇది యెరుంగని వాడు వైష్ణవుడు కానేరడు. గదా! ఇది ద్రావిడ భాషలో మూడు ప్రకరణములుగా నున్నవి. ఆ భాషాపరిచయము లేని వారికీ యపూర్వార్థములు దుర్బోధకముగా నుండునని లోక కల్యాణార్థమై క్షేమర్తి అగ్రహార వాస్తవ్యులైన శ్రీ ఉ. వే. శ్రీమాన్ ఇరగవరపు పెదనారాయణాచార్యులుగారు ఇందలి మూడు ప్రకరణములలోని ప్రతి సూత్రమునకును ఆంధ్రమున సులభశైలిలో ప్రతి పదార్థమును, తాత్పర్యమును వ్రాసి యున్నారు. ఆచార్యుల వలన మంత్రోపదేశమును బడసి పెద్దల వలన కాలక్షేపము గావించుకొని,విని తెలుసుకొన అవకాశము లేనివారికిన్ని, విన్నను ధరించు సామర్థ్యము లేని వారికిన్ని ఇది మహోపకారము గావించును.

దీని వెల 1-0-0. పోస్టేజి అదనం.

వలయువారు, సంఘకార్యాలయమునకుగాని లేక
ఇరగవరపు పెదనారాయణాచార్యులుగారు,
క్షేమర్తి అగ్రహారం
అగసంపూడి పోష్టు. వా ప్తేరు.
అని వ్రాయవలెను. ఆర్. యస్.



శ్రీమతే రామానుజాయనమః

భక్తి

# నివేదన

వేదాంత మాసపత్రిక

| సంపుటి ౪ | నందన-వైశాఖమాసం | సంచిక ౨ |
| --- | --- | --- |

## కృష్ణార్జున సంవాదము

శ్రీ ఉ. వే. శ్రీమాన్ తె. కం. గోపాలాచార్యులుగారు,
కొరుకొండ.

—: 4వ రంగము :—

అర్జు:- కృష్ణా! ఈ కర్మయోగమునకు ఫలమగు ఆత్మ సాక్షాత్కారము ముక్తి కెట్లుప యోగించును.

కృష్ణు:- అర్జునా! ఈ కర్మయోగి జ్ఞానయోగియై ఆత్మను కలరూపుతో సాక్షాత్కరింప గనే తానత్యంత పరతంత్రుడననియు భగవంతునకు శేషభూతుడననియు తెలుసుకొని భగవంతుని ప్రేమించి నిరంతరమాతని కైంకర్యతత్పరుడై యాతనినే ధ్యానించుచుండును.

అర్జు:- దానికేమి ఫలము.

కృష్ణు:- ఇదియే గదా మోక్షమునకు సన్నిహితోపాయమగు భక్తియోగము. ఈ భక్తి చేతనే నాయొక్క విశదతమ సాక్షాత్కారముచే తన శరీర సంబంధమును బాసి నాసాయుజ్యమును పొందును.

అర్జు:- కృష్ణా! విశ్వరూప మత్యద్భుతమైనదని వింటిని. నీ యసాధారణమగు ఆరూపమును సాక్షాత్కరింప గోరుచున్నాను. దానిని జూచుటకు నేను తగుదునని నీకు తోచినచో ఆ స్వరూప మును సమగ్రముగ గుణవిభూతి విగ్రహాదులతో చూపింప వేడుచున్నాను.

కృష్ణు:- అర్జునా! ఇది దేవతలకైనను అసాధ్యమైన కోరిక. అయినను నీయందలి ప్రేమచే నీకు చూపుచున్నాను. నేను నా దేహమునందు ఒకే భాగమున జగత్తునంతను జూపెదను. కాని నీవు నన్ను నీసామాన్య నేత్రముచే జూడజాలవు. కావున నన్ను జూచుటకు తగిన యప్రాకృత దృష్టిని నీకు ప్రసాదించెదను. దాన నీవు నా విశ్వరూపము నంతను సమగ్రముగ చూడగల్గుదువు.

(అని యర్జునుని కండ్లను తన చేతితో తుడిచి యభిమంత్రించును. పెద్దకాంతిగాన్పించును.)

అర్జు:- ఓహో! ఏమి యీ తేజస్సు, ఇది నా దివ్యచక్షుస్సును గూడ ప్రతిఘటించుచున్నదే! అబ్బా! నా చర్మచక్షుస్సైయైన నేనేమై యుండెడివాడనో! ఆహా! మా కృష్ణుడేడి? నా రథమేది, ఓహోహో! ఈ యద్భుత దేహమేమి! దీని పొడవునకు గాని వైశాల్యమునకు గాని యంతమునకు గాని యంతము గాన్పింపకున్నదే. అరె చేతులకు, ముఖములకు, నేత్రములకు, సంఖ్యయే లేదె. అబ్బా!!! ఒక్కొక్క చేతియందొక్కొక్క దివ్యాయుధము గాన్పించుచున్నది. ఈ దివ్య భూషణములు యీ దివ్యమాలికలు యీ దివ్యాంబరములు! యీ దివ్య గంధపు పూతలు అపరిమిత తేజముతో విరాజిల్లుచు నన్ను తబ్బిబ్బు గావించుచున్నవి. అబ్బా! ఒక్క శరీరమునందే చతుర్దశ భువనము లెట్లిమిడి యున్నవో! (చేతితో చూపుచు) ఆ ఆ అదుగో బ్రహ్మ. అదుగో యాతని భ్రుకుటీ భూషుడగు రుద్రుడు. (నమస్కరించి) ఏమి నా భాగ్యము!! సప్తర్షులును గోచరించుచున్నారే! అదుగో! ఒకటి! రెండు, మూడు అబ్బో పన్నిండుగురు సూర్యులే! ఇదుగో వీరష్ట వసువులు, వీరేనా ఏకాదశ రుద్రులు ఓహో! వీరిరువురున్నారు. అశ్వినీదేవతలు కావచ్చును. ఈ గుంపు మరుద్గణమువలె నున్నారు. వీరు పితరులు. వీరు గంధర్వులు. వారు మునులు, ఆచాటున సిద్ధులు కావచ్చును. వీరందరును ఆశ్చర్యచకితులై చేతులు జోడించి బొమ్మలవలె నిలచియున్నారు. (నేనిదివరలో ప్రత్యక్షముగా చూచినవియే గాక శాస్త్రము వలన తెలిసికొనినవియు పెద్దల వలన వినిన పదార్థములన్నియు కన్నులార నీ విశ్వరూపపు శరీరకోణమునందే గాంచుచున్నాను. ఇదేమి యాశ్చర్యము) వీరందరకు నొక్కసారి ప్రదక్షిణ నమస్కారము గావింతమన్న యిదియేమి యీ రూపమునకు ఆదిమధ్యాంతములే గానరాకున్నవే! అబ్బబ్బా ఈ ముఖములనుండి యీ దుర్భరమగు మంటయేమి! ఈ కోరలెంత భయమును గొల్పుచున్నవి. అదుగో తమ పిక్కబలము నంతయు చూపి వెర్రికేకలిడుచు ఆ పారిపోవువార లెవ్వరు బాగుగ చూచి [నవ్వుచు] ఓహో! రాక్షసపుంగవులా! బాగు బాగు. ఇదుగో కొందరు దేవతలు ముకుళితాంజలులతో దరిజేరుచున్నారు. కొందరుస్తుతి పాఠముల చదువుచున్నారు. యిదుగో యీ భృగ్వాది మహర్షులు, సనకాది సిద్ధులు, స్వస్త్యస్తు, స్వస్త్యస్తుయను చున్నారు.

(తేరి పారచూచి గడగడ వణకుచు)

అయ్యయ్యో! వర్షకాలమున నదులు సముద్రమున చేరునంత వేగముతో మిడుతలదండు కార్చిచ్చులో నురుకురీతి యీ కాలానల సన్నిభ భయంకర ముఖపరంపరలో వచ్చి పడుచున్న వారెవ్వరు? (బాగుగచూచి) అయ్యో! నా ప్రియ పితామహుడగు భీష్ముడే! అయ్యో! నాపూజ్య

ఆచార్యవర్యులగు ద్రోణులే! నా ప్రతియోధుడగు కర్ణుడే! ఏమియాశ్చర్యము. ఈ పదునొక్కండ క్షోహిణీల సేనంతయు యిట్లీతని ముఖములకు ధారగా నేగుచున్నారేమి! (మరొక వైపునకుచూచి) ఇటునుండి మరొక యోధ ప్రవాహము వచ్చుచున్నట్లున్నదే! ఇదియెవరు. (బాగుగజూచి) అయ్యో! అయ్యో! నా వీరులేనా వీరు? ఇదియేమి! వీర్లనందరినీ విశ్వరూపుడు పప్పువలె నమలుచున్నాడే! అందు కొందరు తలలు గుంక పిండియై కోరలలో యిరుకుకొని యున్నారు. ఈతడు తన దీర్ఘ జిహ్వాల జాపి కారుచున్న రక్తప్రవాహమును నాకుచున్నాడు బాబోయి! నేనేమగుదునో! నాగతియేమి! నాకు దిక్కెవరు! నా కృష్ణుడేడీ! నేనెక్కడికి పోవుదును అంతట యీతడే నిండి యున్నాడు. యిక యీతనినే శరణ జొచ్చెద.

ప్రభో! నాకు దిక్కు దోచుటలేదు. నేను నిలువజాలక యున్నాను. నీవెవ్వరవు తండ్రీ!

విశ్వ:- అర్జునా! నీవు చూపమని ప్రార్థించిన విశ్వరూపమిదియే!

అర్జు :- అయ్యో! తండ్రీ! నేను నీ నిగతిశ యైశ్వర్యమును జూపుదువని యాశించితిని గాని యీఘోరరూప ప్రదర్శనము నాకేల; అది యిట్టిదే యైనచో నేను ప్రార్థించియుందునా? తండ్రీ! నీవెవ్వరవు, ఇట్టి నీభయంకర రూపమును నాకేల జూపితివి ?

కృష్ణ :- గీ॥ కాలుడను నేను ఘోరవిగ్రహముబూని
వీరినందఱ హతమార్ప బెరిగియుంటి
కంటికగుపించు రాజలోకంబ దెల్ల
రాజ వేషంబులో నున్న రాక్షసాళి.

ఈభీష్మ ద్రోణ, కర్ణ, సైంధవాదులందరును నాకసహ్యమగు భాగవతాపచారముల నపరిమితముగా గావించియున్నారు. గాన నేను వీరిని చంపుటకే వినియోగించుకొని యున్నాను. నీవు వుపేక్షించినను వీరు బ్రతుకరు. కావున నేను వీరిని జయింతునో ఓడుదునోయని శంకింపక యుద్ధమును చేయుము. నీవు ధర్మాధర్మ భయముచేతను, బంధు స్నేహముచేతను, కారుణ్యముచేతను బాధపడకుము. వీరిని వధించుటవలన పాపమొకింతయు నీకు కలుగదు. లెమ్ము —— గాండీవమును చేబట్టుము,

అర్జు :- (భయముతో వణంకుచు మోకరించి చేతులు జోడించి) హే ప్రభో! లోకనాథా విశ్వరూపా! నీకివే పరశ్శత ప్రణామముల నంతట నర్పించుచున్నాడ.

మ. క్షమియింపన్ గదవయ్య నన్నికను కృష్ణా? విశ్వరూపా!
క్షమింపుము నీశక్తిని నీస్వరూప మెఱుగన్ పూర్వంబునం
దున్న స్నేహము నన్నీవిధి మాయజేసె బరిహాసాలాపచాపల్య బంధము
సైరింపుమను గ్రహించి జగదాధారా ! నమోవాకముల్.

నేను పరిహాసార్థముగా ననేకయసత్కారముల గావించియుంటిని. మన మిరువురము నొకటిగా విహరించునపుడును, శయనించునపుడును, కూర్చుండునపుడును, భుజించునపుడును, ఏకాంతమందును కలువుర సమక్షమునందును యనేక యసత్కారముల గావించితిని. అచ్యుతా, నీవు నా తప్పుల నన్నింటిని క్షమింపుము.

(అప్రతిమ ప్రభావ! నీవు సకలలోక జనకుడవు, గురుడవు, పూజ్యుడవు, ఈచతుర్దశ భువనములకును కారుణ్యాది గుణములతో నీకు సమానుడుగాని అధికుడుగాని లేడు. కావున తండ్రీ నీకు సాష్టాంగ నమస్కారములు గావించి నిన్ను వేడుకొనుచున్నాను. పాపరాధులగు పుత్రులు తండ్రులను మిత్రులు సఖులను ప్రమాణ పురస్సరముగ ప్రార్థించిన ఆ పితృసఖాదులు ప్రసన్నులగునట్లు నీవును పరమ కారుణికుడవు గాన నీకు ప్రియుడనగు నాయపరాధముల నన్నిటిని క్షమింప వేడు చున్నాను)

నీయద్భుత విశ్వరూపమును జూచి ఆనందించితిని. నామనస్సు కలతచెంది పోయినది. కావున ప్రభూ! నీ సుప్రసన్నమైన చతుర్భుజ సౌమ్యరూపమును జూపి నన్ను అశ్వాసింపుము

(అని సాష్టాంగ నమస్కరించును) కృష్ణుడు సౌమ్యరూపముతో అర్జునుని లేవనెత్తి

కృష్ణ :- అర్జునా ! ఇప్పుడు నీవు చూచిన నావాస్తవ రూపము నాయందు భక్తి లేక కేవలవేదాధ్యయన శ్రమాజపముల వలనగాని యాగ దాన హోమ తపస్సులచేతగాని చూడశక్యము గాదు. కేవల నిర్మలమగు భక్తిచేతనే వాస్తవరూపమును శాస్త్రముచే తెలియుటకును, సాక్షాత్కరించుటకును శక్యమగును. కావున వేదాధ్యయనాది కర్మల నారాధనయను బుద్ధితో చేయు చుండుము. నీవేపనిని చేసినను నన్ను పొందుటయే ప్రయోజనముగా ప్రేమతో చేయుచుండుము నన్ను ప్రేమించి నన్నుగురించిన కీర్తన, స్తుతి, ధ్యానము, అర్చన, ప్రణామములు, మొదలగువాటిని చేయకున్న బ్రతకలేనంత యార్తితో యితర విషయ సంగమములవీడి నన్ను పొందుటయే ప్రయోజనముగా గావింపుము. నాతోడి సంశ్లేషమే సంతోషముగాను విశ్లేషమే దుఃఖము గాను గలిగియుండుము సకల చరాచరములును, నా శరీరములు గాన వేటితోను కలహింపకుము. ఇట్లాచరించితివేని నా ప్రియభక్తుడవై నన్నే పొందుదువు.

అర్జు:- చిత్తము. మహాప్రసాదము.



# శ్రీమహాభారత కథా సామరస్యము — భగవద్గీత

శ్రీశ్రీశ్రీ మేకా వెంకటాద్రి అప్పారావు బహద్దరు జమీందారువారు నూజివీడు.

శ్రీమహాభారతమున, భీష్మపర్వమున, 24 వ అధ్యాయము నుండి 42వ అధ్యాయము వరకు గల 18 అధ్యాయముల గ్రంథము. భారత యుద్ధారంభమున, బంధువధ చేయలేక వెనుదీయు నర్జునుని యుద్ధోన్ముఖుని గావించుటకై శ్రీకృష్ణునిచే ప్రవచింపబడినది. అర్జునుని ప్రశ్నలు కూడ కలవు. కావున శ్రీకృష్ణార్జున సంవాదమైనది.

ఇట్టి గీత అను శ్లోకములు కలవి శ్రీ మహాభారతమున మఱియు కొన్ని గలవు.

2. ఉతథ్యగీత- శాం॥ ప॥ 90, 91 అధ్యా॥ ఆంగీరస పుత్రుడౌ ఉతథ్యుడు యువనాశ్వ పుత్రుడౌ మాంధాతకు చెప్పినరాజధర్మములను భీష్ముడు ధర్మరాజునకు చెప్పుట.

3. వామదేవగీత-శాం॥ప॥92,93,94.అధ్యా॥ వామదేవుడను ముని వసుమనునకు చెప్పిన రాజధర్మాచరణ విధానమును భీష్ముడు ధర్మరాజునకు చెప్పుట.

4. ఋషభగీత- శాం॥ ప॥ 125, 126,127, 128 అధ్యా॥ ఋషభుడను ముని సుమిత్రుడను రాజునకు తెలిపిన ఆశాపవిముక్తి మార్గము ఉపాఖ్యానమును భీష్ముడు ధర్మరాజునకుచెప్పుట.

5. పింగళాగీత- శాం॥ ప॥ 174 అధ్యా॥ పుత్రశోకార్తుడౌ ప్రసేనజిత్తు అను రాజునకు ఒక విప్రుడు బోధించిన వైరాగ్యము పింగళ యను వేశ్య విరక్తి చెందిన ఉపాఖ్యానము భీష్ముడు ధర్మరాజునకు చెప్పుట.

6. శంపాకగీత- శాం॥ ప॥ 176 అధ్యా॥ ధనికుని కంటె నిర్ధనికుడే సుఖతరుడని, శంపాకుడను ఒక ముక్తుడు ఒక విరక్తుడౌ విప్రునకు తెల్పినది. భీష్ముడు ధర్మరాజునకు చెప్పుట.

7. మంకిగీత- శాం॥ ప॥ 177 అధ్యా॥ మంకియను విప్రుడు లంకె జంటగా కూర్చబడిన తన దూడలు ఒక ఒంటె మెడకు చిక్కి-నశింపగా తన మనస్సును విరక్తి చెందించుట. భీష్ముడు ధర్మరాజునకు చెప్పుట.

8. బోధ్యగీత- శాం॥ ప॥ 178 అధ్యా॥ నహుషపుత్రుడౌ రాజునకు బోధ్యుడను ఋషి తెలిపిన కార్యసాధననీతి. పింగళ-శారిక-సర్పము భ్రమరము-ఇషుకారుడు-కుమారి-వీరలు ఉదాహరణములని భీష్ముడు ధర్మరాజునకు చెప్పుట.

9. విచఖ్నుగీత- శాం॥ ప॥ 265 అధ్యా॥ అహింసయే మేలని విచఖ్నుడను రాజు యజ్ఞపశువధను నిరసించిన ఉపాఖ్యానమును భీష్ముడు ధర్మరాజునకు చెప్పుట.

10. హారీతగీత:- శాం॥ ప॥ 278 అధ్యా॥ హారీతుడు వివరించిన మోక్షాసక్తుని శీలమును భీష్ముడు ధర్మరాజునకు చెప్పుట.

11. వృత్రగీత:- శాం॥ప॥279,280 అధ్యా॥ శత్రువులచే రాజ్యభ్రష్టుడైన వృత్రాసురునకు తెల్పుమని శుక్రుడు కోరగా, సనత్కు-మారుడు తెల్పిన శ్రీమహావిష్ణు మహాత్మ్యము జీవుల. తత్త్వము, ఉద్ధారణ మార్గము. భీష్ముడు ధర్మరాజునకు చెప్పుట. మొదట వృత్రాసురుని

గీతయందు గానయోగ్యమైన సంగతులు ఏవి కలవు? సన్నివేశమునకు తగిన వీరరసపోషణము ఎట్లు సమర్థింపబడినది? వీరరసప్రధానముగా నుండతగిన గీత వేదాంతపరిభాషలో నుండుటకు కారణము ఏమి? అను ప్రశ్నలను వేసికొని ఎవరును సమాధానములను నిర్వచించినట్లుగాని ఈ విగువ సందర్భములను స్పష్టముగా గుర్తించినట్లుగాని తెలియ కనుపించదు.

అర్జునుడు మహాయోధుడు. ఇదివరకే చాల సార్లు కౌరవులపై యుద్ధము చేసినవాడే. అయినను మహోత్కృష్టమౌ ఈ తుది మహాసంగ్రామము.

అ॥వి॥యో॥శ్లో॥ 21 సేనయోరుభయోర్మధ్యే ।
రథంస్థాపయ మేఽచ్యుత ॥

శ్లో॥ 22 యావదేతాన్నిరీక్షేఽహం ।
యోద్ధుకామానవస్థితాన్ ॥
కైర్మయాసహయోద్ధవ్యమ్
అస్మిన్ రణసముద్యమే ॥

వ॥ ఓ అచ్యుతా! నాపై యుద్ధము చేయ వచ్చు మొనగాండ్లు ఎవరో చూచెదము. రెండు సేనల మధ్యకు రథమును తోలి నిలుపుము అని మహోత్సాహముతో పోయు

అ॥వి॥యో॥శ్లో. 28 కృపయాపరయాఽఽవిష్టో
విషీదన్నిద మబ్రవీత్ ॥

అర్జున ఉవాచ॥ దృష్ట్వేమం స్వజనంకృష్ణ ।

శ్లో. 31. నచశ్రేయోఽను పశ్యామి
హత్వాస్వజన మాహవే

వ॥ అర్జునుడు స్వజనమును యుద్ధభూమిలో చూచి కృపాపరవశుడై క్షాత్రధర్మమైన శౌర్యమును మరచి బావా! కటికివానివలె అర్థకాంక్షపై ఈ మన బంధువులను చంపజాలను అని సీరసిల్లెను.

అ॥వి॥యో॥శ్లో॥47. ఏవముక్త్వాఽర్జునస్సంఖ్యే
రథోపస్థ ఉపావిశత్
విసృజ్య సశరం చాపం
శోకసంవిగ్న మానసః

ఇట్టి భావమును-ఇట్టి తరుణమున మనస్సును ఆక్రమింప నిచ్చినయెడల ఏయోధుడును యే యుద్ధమునను - ధీరతతో, ధీరోత్సాహముతో పోరాడజాలడు. ఏలయన ఉదారహృదయమునకు మానవలోకమంతయు బంధువులు స్వజనులే. కావున అట్టి ఉత్కృష్ట తరుణమున అర్జునుని శౌర్యోన్ముఖునిగా చేయుటకే శ్రీకృష్ణ భగవానుడు మహోత్సాహకరమైన వీరగానమును గావించెను. అదియే భగవత్ గీత.



# గోదాష్టోత్తర శతనామ స్తోత్రం

ఉపన్యాసభూషణ రామాయణ రత్నాకర శ్రీ ఉ. వే. శ్రీమాన్
విద్వాన్ కాండ్యూరి రామానుజాచార్య స్వామి
సంపాదితము.

గోదా గాథాప్రియా శ్రీదా వేదాంతార్థసుబోధినీ ।
యశోదాతనయాఽమోదా గోవిందోద్వాహనోత్సుకా ॥
ధనుః పురావతారా చ మనుజోద్వాహనాక్షమా ।
మహాత్మ్యాసుతా మాన్యా తులసీతరుమూలజా ॥
అయోనిజానంతగుణా నియంత్రీ నిఖిలప్రదా ।
ఆషాఢమాససంజాతా పూర్వఫాల్గునభోద్భవా ॥
రమ్యైరక్షణ సంజాతా నమ్యానాయక నాయికా ।
నారాయణోత్సుకా నిత్యానామ కీర్తనతత్పరా ॥
గోపీప్రీత సముద్యుక్తా సహానా తాపహారిణీ ।
భూదేవీ భూతిదాత్రీ చ భూరిదాసూరిభూషణా ॥
స్వోస్వాహాకామవినయా రంగరాజకుతూహలా ।
రంగరాడంతరంగజ్ఞా సుందరప్రార్థనాతురా ॥
దాసాభీష్టప్రదాత్రీ చ నాసికాభరణోజ్జ్వలా ।
పాపహంత్రీ తాపహంత్రీ కూపదర్పణదర్శనా ॥
పీతాంబరానిలాసక్తా తులసీ ధరణోత్సుకా ।
కృష్ణపాదరజోధాత్రీ కృష్ణోష్ఠాఽమృతపాయినీ ॥
కృష్ణవిశ్లేషాఽసహనా కృష్ణాఽలింగనభావనా ।
జ్ఞానభక్తిస్తనాకారా కృష్ణార్పిత పయోధరా ॥
కామదేవస్తోత్రికామా రామానుజసహోదరీ ।
క్షేమంకరీ క్షామహంత్రీ శ్యామాఽరామ పరాయణా ॥

స్వామినీ స్నానకుతుకా శ్రీమతీ శ్రీమహారిణీ ।
శంకామీనా శంఖపరా శంఖధ్యానమనోహరా ॥
కృష్ణవిశ్లేషరోగార్తా కృష్ణవిశ్లేష సంభ్రమా ।
సువర్ణఖ్యాతపీఠస్థా సువర్ణాఽవయవాన్వితా ॥
సర్వగంధా సర్వరసా పుష్పసౌగంధ్యదాయినీ ।
ఉత్తమస్యందనారూఢా పరమోత్తమభావినీ ॥
వైవాహిక స్వప్నతోషా వివాహాచారబోధినీ ।
వెంకటేశోత్సవానందా వేదాంతోదంతభాషణా ॥
గోవిప్రతానుకారా చ గోవేషసుభూషణా ।
నీళాప్రబోధకుతుకా నీళారక్తాచ్యుత ప్రియా ॥
నందాలయ ద్వార్థసన్న మానందబోధనతత్పరా ।
నీలమేఘకృపాసక్తా వ్రితోపకిరణార్థినీ ॥
చక్రభానుఘనానందా శంఖనాదాభితోషిణీ ।
త్రివిక్రమ మహోత్సాహా గరవద్వాగ్గ రాక్షిణీ ॥
వర్షాఽసక్తా వంద్యవర్షా వామనస్సిగమానసా ।
వసుధావసుదా వేద్యా వరదా వైష్ణవాశ్రయా ॥
పుష్పకేశీ పూర్ణలేఖా పుణ్యపూర్వాసుభాషిణీ
పూజ్యాచార్యాజ్ఞాప్రధానా చ యమునాతీరకాంక్షిణీ ॥
కృష్ణాశ్రియా కృష్ణబలా కృష్ణాధిసమహోదయా ।
శిష్టాచారైకరతా బహిరంతర్నివాసినీ ॥
రంగగోపాల మహిషీ రంగరాడంఘ్రిశేముషీ ।
రంగరాట్ తత్త్వవిదుషీ రంగరాడ్వ్యాసతాకృషిః ॥

☞ యీ గోదాష్టోత్తర శతనామావళీ జ్యేష్ఠమాస పత్రికలో చూడండి.

శ్రీమతే రామానుజాయనమః

# ఆర్తి ప్రబంధము

అనువక్త:
కందాళ జగన్నాధాచార్యులు
మంచరియాల.

(ఆంధ్ర పద్యానువాదము)

ఈ దివ్యప్రబంధమును పరమోదారులగు శ్రీమణవాళ మహామునులు శ్రీ ఎంబెరుమానారుల విషయమై భక్త్యతిశయముతో వారిపట్ల తమకుగల ఆర్తినంతను ప్రకటించుచు ద్రావిడ ఛందోబద్ధముగ సాయించిరి. ఇయ్యది 60 పాశురములతో నలరారు దివ్యప్రబంధము. ఇది ఉడయవరుల వైభవమును బహుభంగుల సాటుచున్నది, రామానుజీయులకు నిత్యానుసంధేయమగు నీదివ్య ప్రబంధమును నైజాం ఇలాకా మంచరియాల వాస్తవ్యులైన శ్రీ ఉ.వే. శ్రీమాన్ కందాళ జగన్నాధాచార్యస్వామివారు మృదుమధుర శైలిలో నాంధ్రీకరించి భక్తలోకమునకు ప్రసాదించి మన కార్యాలయమున కందజేసిరి దీనిని మతాభిమాను లెల్లరు అనుసంధించి ఆనందించి తరింతురుగాక యని యథావకాశముగా నిచట ప్రకటించుచున్నాము.

తేన్ పయలుం

శానమధుష్యంది సుమమాలికను ధరించు
శ్రీయతీశుని పాదరాజీవయుగళి
పైనధిక భక్తితమకు నొప్పారగామ
రులకు సైతము జ్ఞానంబు గలుగునట్లు
సతికమున దేల్చు ద్రవిడ శబ్ద తతివరవ
రమునియై వచ్చి యీకృతిన్ రచనజేసె. ౧

వమ్బవిశ్

నవవికచ పుష్పహారమండన తనుండు
దారమణ వాళమునిపతి ధాత్రియందు
కాలునిల్వక నిత్య ముక్తానుభావ్య
మై యొసగునట్టి వైకుంఠ మరుగ నార్తి
మునుగొన యతీంద్రు పద్మయమును దలంచు
చానతిచ్చెను మనకమూల్యార్థకృతిని. ౨

వాళియెతిరాజ

యతిపతికి మంగళము యతిపతికి మంగ
ళము యతిపతికి శుభమంగళం బటంచు
మంగళా శాసనముజేయు మహితులెవరొ
వారికట్లు లాశాసించు వారలెవరొ
వారికానతు లెవ్వారొ వారునిత్య
సూరి నిర్వాహకులటంచు పేరుగాంతు(రు), ౩

ఇరామానుశా

శ్రీయతీశునకే నమస్కృతి యొనర్తు
నని మనుజులతో క్షణమైన జెలిమి
కూడదని యెంచువారి యడుగులను జేరు
వారిపాదములన్న మోవాక మిడెడు
వారు సూరుల నిత్యసంపదలుగారె, ౪

తన్ డై నల్ తామ్

తండ్రిమేల్దల్లి భార్యయు తనుజులును బ్ర
వృద్ధసంపత్తి మాదృశ వితతికీవె
యనెడి తలపున జేరని తనువు నిపుడు
ఛేదనమొనర్చి నన్కృపనాదరించ
కుంటిరే హేతువో తెల్పుడో యతీశ, ౫

## ప్రశ్నోత్తరములు

# శ్రీ కృష్ణజయంతి - శ్రాద్ధాదికము

కాంచీపురములో వేంచేసియున్న శ్రీ ఉ. వే. శ్రీమాన్ ఆ. తి. కొ. వెంకట తాతాచార్యులయ్యవార్లంగారు ఈ ప్రమాణములను తెలుపుచున్నారు.

శ్రీకృష్ణ జయంతి దినమున పితృశ్రాద్ధాదికము తటస్థించినచో దాని నెటుల నిర్వర్తించవలయునని చాలమంది ప్రశ్నించుచున్నారు. ఇందును గూర్చి శిష్టాచారములనేకవిధములుగయున్నది.

1, కొంతమంది మామూలు ప్రకారముగ రాత్రికాలమువరకు యుండి రాత్రి శ్రీకృష్ణ జయంతి వుత్సవమును జరిపించుకొని తాము ఆ రోజంతయు కూడ ఉపవాసముండి మరుచటి దివసమున పితృకర్మాదులు జరుపుట గలదు.

2. మరికొంతమంది నక్షత్రావసానము వరకు యుండి అపుడు శ్రీకృష్ణజయంత్యుత్సవమును జరుపుకొని వెంటనే పితృశ్రాద్ధాదికముల జరిపించుట గలదు.

3. మరికొంతమంది మామూలుగ ఉదయమున పితృశ్రాద్ధాదికమునుజరిపించుకొని తాము మాత్రము ఉపవాసముండి తాము రాత్రి శ్రీ కృష్ణోత్సవమును జరిపించి తాము పారణచేయుట గలదు.

4. మరికొంతమంది శ్రీకృష్ణ జయంత్యుత్సవమును ఉదయముననే జరిపించుకొని 2 ఝాములైన పిమ్మట కుతపకాలమున పితృశ్రాద్ధాదికములు జరిపించుట గలదు. ఇటుల అనేకు లనేక పద్ధతులు అమలు జరుపుచున్నారు.

వీరిలో ఏది యుక్తము అని విచారించగా మొదటి మూడు పక్షములకంటె చివరిదైన నాలుగవ పక్షమే యుక్తమైనదిగ తోచుచున్నది.

శ్రీకృష్ణజయంత్యుత్సవమును విద్యుక్త ప్రకారము జరిపించవలెనన్నచో అర్ధరాత్రివరకు ఉపవాసముండి అర్ధరాత్రి అయినపిమ్మట పెరుమాళ్ళను అర్చనజేసి ఆరగింపు సమర్పించి మంగళాశాసనమును జేసి తిరునక్షత్ర తనియ విన్నపమును జేసి చాత్తుమొఱ అయినపిమ్మట తీర్థ ప్రసాద స్వీకరణము జేయవలయును.

ఇవన్నియు అగునప్పటికి ప్రసాదస్వీకరణ సమయమునకు అర్ధరాత్రి దాటిపోవును. రాత్రి 12 గంటల యనంతరము మంచితీర్థమునైనను తీసుకొనకూడదు అను సామాన్య శాస్త్రము ననుసరించి కొంతమంది అపుడు పెరుమాళ్ళ తీర్థమును మాత్రము తీసుకొని మర్నాడు మాత్రమే ప్రసాదమును స్వీకరించుట కలదు. కాని కొందరు శిష్టులు భగవదారాధన యనునది భగవన్నివేదిత తీర్థప్రసాద స్వీకారముతోగాని పూర్తికాదను విశేషశాస్త్రము ననుసరించి నిశీథ నిషేధరూప సామాన్యశాస్త్రమును వదిలి ఎంత రాత్రి గడచిననుకూడ భగవన్నివేదిత తీర్థ ప్రసాదముల స్వీకరించుట కలదు. ప్రపన్నులకు ఈవిశేష శాస్త్రానుసరణమే యుక్తము.

ఇది సామాన్యముగ శ్రీకృష్ణ జయంత్యుత్సవ విధానము.

ఇక యీరోజున పితృశ్రాద్ధము తటస్థించి

నచో ఏమి చేయవలయునో విచారింతము.

ఏకాదశినాడున్ను ఆశౌచాదులు తటస్థించినపుడున్ను తప్ప మిగత ఏ కాలమునందుకూడ పితృ మృత తిథియందు పితృశ్రాద్ధమును జరిపించుట మానరాదనియు అటుల మానుట ప్రత్యవాయ జనకమనియు శాస్త్రములు తెలుపుచున్నవి.

ఈ స్థలములయందు చెప్పటను కృష్ణాష్టమినాడు తటస్థించిన పితృశ్రాద్ధమును ఆనాడు మానివేసి మర్నాడు చేయవలయునని విధి కనుపించదు. గాన మొదటిపక్షము యుక్తియుక్తముగ లేదు శ్రీకృష్ణజయంత్యుత్సవమును అర్ధరాత్రి సమయమున నాచరించవలయునని విధియుండగా తమ యానుకూల్యమునకై నక్షత్రదర్శన కాలముననే దానిని జరిపించుటయు న్యాయముకాదు. ముఖ్య కాలమును విడుచుటకు అంగీకరించినపుడు ఆ ఉత్సవమును ఉదయముననే ఏల చేయరాదు. నిశీథత్వసామ్యమాత్రముననే మన సంతృప్తిని పొందతలచినను ఉత్సవానంతరము పితృశ్రాద్ధము నాచరించు సమయమునకు ఎటులైనను బాగుగ చీకటి పడును. నిశీథ శ్రాద్ధాచరణ నిషేధము తగులుక మానదు, అందుచే వ్రతకాల పరిత్యాగము శ్రాద్ధనిషేధకాలానుష్ఠానము అను రెండు దోషములు కూడ తటస్థించును. గాన రెండవపక్షముకూడ యుక్తియుక్తముగ గనుపించదు

మూడవపక్షముకూడ యుక్తముగ తోచదు. ఏలయన :—

శ్రీకృష్ణ జయంత్యుత్సవ మనునది వైష్ణవుల కత్యంత ముఖ్యమైన విధాయకమైన ఉత్సవ విశేషము,

ఆనాడు ఆ ఉత్సవ విశేషార్చనారాధనాదికములు జరుపకుండగ పెరుమాళ్ళకు ఉదయమున మహానివేదనము సమర్పించుటయు దానినే పితృదేవతలకు (భోక్తలకు) సమర్పించుటయు తాను మాత్రము రాత్రివరకు యుండి తిరిగి రెండవ పర్యాయము మహానివేదనము ఆరగింపుజేసి ఉత్సవమును పూర్తిజేసుకొని అప్పుడు మాత్రమే తీర్థప్రసాదములు స్వీకరించుటయు అంతయు క్రమముగ తోచదు. మరియు శ్రాద్ధకర్త పితృశేషమును మాత్రమే స్వీకరించుట కుదురదు. పితృశేషముగాని భగవన్నివేదిత ప్రసాదస్వీకరణ మెప్పుడు. భోక్తలకు ఈ ఉత్సవ ప్రసాదస్వీకరణ ఆనాడే లభ్యపడదు. అందుచే యీ మూడవ పక్షముకూడ పూర్తిగ యుక్తమనుటకు వీలులేదు.

ఇక నాలుగవ పక్షము మాత్రమే విశేష విధిచే యుక్తమని తోచుచున్నది. ఇందు ఉత్సవ ముఖ్యకాల పరిత్యాగ రూపదోషము తటస్థించినను గౌణకాలమున (మధ్యాహ్నముననే) ఉత్సవము జరిగించుటచేతను భోక్తలకు ఉత్సవ ప్రయుక్త భగవద్విశేషార్చన ఆరాధనల పూర్తిజేసి తత్తీర్థ ప్రసాదములనే వినియోగించుటచేతను తానుకూడ పితృశేష రూపమును కూడ పొందిన ఆ తీర్థప్రసాదములనే స్వీకరించుటచేతను పితృమృత తిథిని విడువకుండుటచేతను మిగత పక్షములన్నింటికంటెను ఈపక్షమే యుక్తియుక్తము ఆచరణీయమున్ను శిష్టసమ్మతమున్ను అయియున్నది.

దీనికి ధర్మశాస్త్రమున యిటుల ప్రమాణము కలదు.

శ్రీ జయంతీ దివసాగత శ్రాద్ధకర్తవ్య విధిః లిఖ్యతే.

జయన్త్యా మేవ కృష్ణస్య । విహితా నిశి పారణా।
పితు శ్శ్రాద్ధం కథం కుర్యా న్మధ్యాహ్నే విహితే సతి ।
సర్వాసు చ జయంతీషు।మృతాహే సముపస్థితే।
జయంతీ కౌ తు కనుపి । సంచితె తు విధీయతే

తతః పరం పితు శ్శ్రాద్ధం । మధ్యాహ్నేషు సమాచరేత్ ।
దివసస్యాష్టమే భాగే । యథా మందాయతేరవిః
సకాలం*కుతపో జ్ఞేయః పితౄణాం దత్తమక్షయం
(స్మృత్యర్థసారే)
అజ్ఞ శ్చేదతి వేధాయాం ఆపత్ బహ్మావిచ్ఛయః
సంకల్పేన విధానేనకుర్యాచ్ఛ్రాద్ధం న పార్వణం

* కుతపకాలమనగా సామాన్యముగా పగలు 18 ఘటియలనుండి 24 ఘటియలవరకు మధ్య యున్న కాలము.

## శ్రీ యతిరాజ భజన కీర్తనములు

కవితావతంస, గానకళానిపుణ, హరికథా చతురానన
శ్రీ ఉ. వే. శ్రీమాన్ కరి నారాయణాచార్య భాగవతార్.

దేశి — చతురస్రగతి

అబితేరెసివా కోనుమెరె అనుదానివలె

ప॥ శ్రీభాష్యకార భవవిదూర భక్తమందారా నీ
పాదపద్మదాసులమగుమమ్ముఁబ్రోవరా రా శ్రీ ॥భాష్య॥

అ॥ దూష్యమౌ భవాబ్ధిమునఁగి దొరలుచుంటిమి (బహు) మా
దుష్టచేష్టలన్నియుఁగృపతోక్షమింపుమా కనికరముంచిబ్రోవుమా! సుమ
భూష్యమౌభవత్పదాబ్జపూజలొసఁగుమా!
కనుమా!వినుమా!యనుమానమా!మహాత్మ!మమ్మనుగ్రహింపుమా! ॥శ్రీ

2 కరుణింపుమోకృపానిలయా! కాంతిమతేయా!
శరణనుచునిన్నునమ్మితిమో! సద్గుణాలయా!
పరిపూర్ణవిశ్వమానవసా భ్రాత్వభావమున్
బరమార్థతిన్ దలంచియెల్ల వారికాదృతిన్ బరమాశ్చర్యమాగతిన్
నరమంత్రరాజమొసఁగి కీర్తిఁబరగినావహో!
కరుణాభరణా! కరినారాయణార్యవినుత! కావఁగరారా! ॥శ్రీ భా॥



## నారీ విభాగము



శ్రీమతే రామానుజాయ నమః

# తిరువాయ్‌మొళిలో 6వ పదిలో 7వ తిరువాయ్‌మొళిలో మొదటి పాశుర భావము

శ్రీమతి నండూరి ఆనందమ్మగారు

ప్రబంధమంతా లాపాయంట్లు ఆలాగ యంటుత్తోనే దివ్యదేశములన్ని పాడినారు. కాని అచ్చట క్షేత్రమహిమలో ఇటువంటి ప్రశక్తే లేదు. శ్రీరంగము పాడినారు. అంటే శ్రీవైష్ణవులెలా వుండాలి. భక్తితో కూడిన ప్రపత్తా లేక శూన్యప్రపత్తా. ఆభక్తి వుపాయమా లేక ఉపాయశూన్యమా అనే విషయాలతో స్వార్థత్యాగమైన భక్తితో చూపిన ప్రపత్తే శ్రీవైష్ణవలక్షణమ్ అనే విషయాన్ని ప్రకటించుతూ శ్రీరంగము పాడేరు. ఇంక తిరుమోగూరిలో అర్చావతార వైభవమును ప్రకటించుతూ ఆ అర్చావతార ఉపాయమని సాయించుచు ఇచ్చట ఈలీలావిభూతిలో ప్రకృతిలో వున్నంత కాలమే కాకుండా ఈ ప్రకృతి విముక్తానంతరము కూడ విరజానదిలో స్నానము చేసే పర్యంతము అర్చిరాది మార్గములో కూడా అర్చాస్వరూపమే సహాయము అన్న సంగతి విపులముగా ప్రకటించినారు.

ఇక ఈ తిరువాయ్‌మొళి ఉణ్ణుంశోరులో పరమాత్మని మోక్షో విరక్తో ఆ పరమాత్మని అనే ఈ ఉపనిషదర్థాన్ని పరమాత్మని ప్రేమించినవాడు ఇతర విషయములను ప్రేమింపలేడు అనే వేదాంత అర్థమును ఈ తల్లిగారి పాశురము ద్వారా వెలిపరుస్తున్నారు ఆళ్వార్లు. ఇక గ్రంధ విస్తర భీతి అవుతుంది గనుక పాశుర భావములలోకి వచ్చి కొంచెము సేపు చర్చించుకొని ఆనంద పడుదాము. మన నమ్మయ్యా తండ్రి నాయికావస్థ పొంది వాళ్ళ తల్లిగారి దగ్గర ఒకటి మూరాము చేయుట మొదలు పెట్టినారు. ఏమని

పాలనా యేళులగుండు పరివిన్ని ఆలిలై యన్నవళం శెయ్యు మణ్ణాలార్
తాళిణమేలణి తణ్ణన్దు ళాయెన్నే మాలు మాల్ వల్వినై యేన్ మడవల్లియే

అన్నట్లు ఏనాడో వటపత్రశాయి లోకములన్నీ బొజ్జలో పెట్టుకొని పవళించిన

వటపత్రశాయి పాదపద్మములపైన వున్న త్తిరత్తుళాయ్ కావాలని, తల్లిగారు మాత్రము ఎలా తెస్తారు చెప్పండి అర్చావతారములో వేంచేశివున్నస్వామి తిరువడిలో సమర్పించిన తిడుత్తుళాయ్ గనుక నా కోరిక తీర్చుటకు కాలాతీతమయిపోయి నదాయెను కాలాతీతమయిన విషయములు కావాలంటే ఎవరితరము. వీరు అదే కావాలని దుఃఖపడి ఏడ్చి ఏడ్చి మూర్ఛపొంది దేహము తెలియకుండా పడుకొన్నారు. ఇక తల్లిగారికి చాలా బాధ కలిగి ఆమె దుఃఖము పొందుతూ అయ్యో ఆ వటపత్రశాయి కొరకు నా కూతురు తన దేహకాంతి పోగొట్టుకొన్నది. అదిపోగొట్టుకున్నది. ఈ గాజులు పోగొట్టుకున్నదని కుమార్తె స్థితికి జాలిపడుతూ దుఃఖపడి ఆమె కూడా మూర్ఛపొందేరు. ఈమె మూర్ఛపొందగానే ఆళ్వార్‌నాయకి కుమార్తె గారికి తెలివి వచ్చినది. ఎలా తెలివి వచ్చిందంటారేమో మూర్ఛపొందినవాని మొఖముపై చల్లని నీరు జల్లితే తెలివి వచ్చినటుల ఈమె తల్లిగారి ఏడుపులో ఆ సర్వేశ్వరుని కొరకు దేహకాంతి గాజులు మొదలైనవి పోగొట్టుకొన్నది. అనిగదా దుఃఖపడ్డారు. ఆ దుఃఖములో సర్వేశ్వరుని తిరునామ ప్రసక్తి వుండుటచేత అదే ఈమె మూర్ఛకు శిశిరోపచారమైతే లేవగలిగారు. లేచి ఇక నేను ఇచ్చట వుండ లేను. నా మనస్సు పోయినవద్దకే నేను పోతాను అంటూ "లక్ష్మణేనగతాంగతిం" అని లక్ష్మయ్యను విడచివుండలేక రామయ్య తండ్రి వెంటనే సరయు నదిలో మునిగినటుల వీరు మనస్సు పోయిన తిరుక్కోళూరుకి వెళ్ళిపోయారు. దీనివలన తేలిన దేమయ్యా అంటే ఇన్నిదినాలుగా ఎవరూ ఎరుగకుండా క్షుద్రవిషయానుభవములకు పోయెడు జీవాత్మ ఇప్పుడు ఎవరూ ఎరుగకుండా పరమాత్మ వద్దకు పారిపోయే స్థితిలోకి వచ్చాడు అనే విషయము చెప్పబడుచూన్నవి. "మాట్పాల్ మనం శుళిప్ప మంగైయర్ తోళ్" నిధినని శ్రియఃపతిపైకి నా హృదయము వెళ్ళిపోయినది, ఆరోగ్యత కీడుపడిపోయి స్త్రీల భుజముల సౌందర్యము విడచివేశినాను అని తిరుమంగైమన్నన్ సాయించినటుల వీరు పరమాత్మని యోరక్తో విరక్తో ఆ పరమాత్మని అనే వుపనిషదర్థమును ఈ రూపముగా తెలుపుడు చేస్తున్నారు. సరి వీరు పడకవిడచి తిరుక్కోళూరుకి వెళ్ళిపోయినారు. బాగానేవుంది. ఇక వీరితల్లిగారి అవస్తచూద్దాము. వీరు అటు వెళ్ళగానే ఈ తల్లిగారికి మూర్ఛ నుండి తెలివి వచ్చింది. ఎంతసేపూ కుమార్తె దృష్టేకదూ, చూచారు. కుమార్తె లేరు. ఇల్లంతా పాడుపడిపోయి నటులవున్నది. ఆళ్వార్‌నాయకి లేకపోవుటచేత శ్రీరాఘువులు తమ్మునితో జానికితో అరణ్యమునకు వెళ్ళిపోతే అయోధ్యలో వుండే దశరథుని బంగళా ఎలావుందయ్యా అంటే (పుత్రద్వయహీనంతత్) దశరథులకి రామయ్యమీదనే ప్రాణము ఎంత వెతికినా మేడలో కనుపడ లేదు. రామలక్ష్మణులు దాంతో చాలా బాధపడ్డారు, ముసలిరాజు పోనీ 4 దినాలు పోయాకయినా వస్తారేమోనని ధయిర్నముగా వుందామంటే (స్నుషయాచ వివర్జితమ్) వాళ్ళ వస్తువుండే ఆ వస్తువ కోసరమైనా వస్తారని ఆశయినా లేకుండా కోడలిని కూడా తీసుకొని వెళ్ళిపోయినారు గదా ఇక వచ్చేదేమిటి, (అపశ్యద్భవనంరాజా నష్టచంద్రమివాంబరమ్) చంద్ర సూర్యులు లేక నక్ష

త్రిములు లేక శూన్యమైన ఆకాశము ఎలావుందో ఆ విధముగ కొడుకులు లేక కోడలు లేక వున్న మేడను చూచి ధశరధులు దుఃఖము పొందునటుల వీరు కూడా తమ కుమార్తె లేని ఇంటిని చూచి దుఃఖపడుచున్నారు. సీతా పిరాట్టి (సర్వాన్ భోగాన్ పరిత్యజ్య భర్తృస్నేహ బలాత్కృతా అచింతయిత్వా దుఃఖాని ప్రివిష్టా నిర్జనంవనమ్) అన్నట్లు ఈ రాఘవులయందు వుండే ప్రీతిచేత సమస్త భోగములు విడిచిపెట్టి ఘోరకష్ట పరంపరలకు కారణమైన అరణ్యములకు వెంబడించి వెళ్ళిపోయిన జానికి దేవి మాదిరిగా నా కుమార్తె తిరుక్కోళూరెంబెరుమానుని యందు వుండే ప్రేమ చేత నన్ను నా దుఃఖమునైనా విచారించకుండా వెళ్ళిపోయినదని బాధపడుచున్నారు. పూర్వము మన ఆళ్వందారు గోష్టిలో ఈ పాశురము కాలక్షేపము జరుగుతూన్నప్పుడు శిష్యులని ఒక ప్రశ్న వేశారు. యేమంటే ఈ ఆళ్వార్ నాయకి గారి తల్లి దుఃఖము ఎక్కువా లేక తిరుమంగ ఆళ్వార్ల తల్లి గారి దుఃఖము ఎక్కువ అని అంటే వారి శిష్యులు సమాధానము చెప్పినారుగదా తిరుమంగ ఆళ్వారుల తల్లిగారికి అంత దుఃఖముండదు. ఎందువల్లనంటే వాడే వచ్చి స్వయముగా తీసుకొని వెళ్ళుటచేత ఈమె ఒంటరిగా వెళ్ళినారు గనుక ఈ తల్లిగారికే ఎక్కువ దుఃఖమని గాన దీనికి యామునాచార్యులవారి సమాధానమేమంటే వాడు వచ్చి తీసుకొనివెళ్ళాడు గనుకనే తిరుమంగై యాళ్వారునాయకి తల్లి గారికి దుఃఖము ఎక్కువ కారణమేమంటే ఉభయులకూ ఒకరిని చూస్తే ఒకరికి వళ్ళు తెలియదు. ఒకరినొకరు చూచుకుంటూ ఆనందముతో శరీరము మరచి తిరునగరికి పోక దండకారణ్యమునకు పోతే అచ్చట శూర్పణఖ వస్తే ఎలాగ అని ఆమె భయము. ఈమె వంటరిగా వెళ్లుట వలన తిన్నగా తిరుక్కోళూర్ కే వెళ్లుతారనే ధైర్యము ఈ తల్లిగారికి అని సమాధానము చెప్పినారు.

[సశేషం]

# తిరుక్కోళూర్ పెణ్‌పిళ్ళై రహస్యము

రచయిత: శ్రీమద్భాగవత పాదరేణువు, మదరాసు.

## నాలాయిరం

అ॥ అవన్ శిరియనెన్రేనో ఆళ్వారై ప్పోలే ।

తె॥ అతడే పిన్న అని అన్నానా ఆళ్వార్లవలె॥

వి

పెరి. తి॥ పా॥ శిరియనెన్రు ఎన్నిళం శింగత్తైయిగళేల్ కండాయ్ ।
శిరుమైయిన్ వార్త్తైయై మావలి యిడంశెన్రుకేళ్ ।
శిరుమైప్పిళ్ళై కొళ్ళిల్ నీయుమున్ తేవైక్కురియైకాణ్ ।
నిర్ మది! నెడుమాల్ విరైందున్నై క్కూవుగిన్రాన్ ॥

అని పెరియాళ్వార్లు అనుభవించియున్నారు.॥ నమ్మాళ్వారున్ను తిరువాయ్ మొళిలో

తి. వా. మొ॥ పా॥ అరివినార్కురైవిల్లా వకల్ ఞాలత్తవరఱియ ।
నెఱియెల్లా మెడుత్తురైత్త నిఱైఞానత్తొరుమూర్త్తి ।
కుఱియమాణురువాగి క్కొడుంకోళాల్ నిలంకొండ ।
కిఱియమ్మాన్ కవరాద । కిళరొళిమురుక్కైవిలమే ।

తా॥ అజ్ఞానులకు గోచరమగునట్లు పరిపూర్ణుడును అద్వితీయుడును పొట్టియునగు బ్రహ్మచారియై (బలిని) వంచనచేసి త్రిలోకములను స్వాధీనపఱచుకొనిన వామనమూర్తి అంగీకరింపని కాంతిచే యేమి ప్రయోజనము గలదు.

(3) మధుర కవులు నమ్మాళ్వార్లతో ప్రథమ సంభాషణ.

ప్రశ్న: శెత్తత్తిన్ వయిట్రిల్ శిరియదు పిఱందాల్ ఎత్తైత్తిన్రు ఎంగనే కిడక్కుం? అని మధురకవులడుగగా నమ్మాళ్వార్లు అత్తైత్తిన్రు అంగనేకిడక్కుం అని అప్పుడే వాక్రుచ్చి చెప్పిరి.

తా॥ (మ) అచిత్తుతో జీవాత్మ సంబాధపడియున్నప్పుడు అనగా ప్రకృతి గర్భమున జీవుడు ప్రవేశించి కరణ కళేబరములను కలిగియుండినప్పుడు అనగా (జీవునికి శరీరము వచ్చినప్పుడు) దేనిని అనుభవించుచూ యెక్కడపడియుండునని నమ్మాళ్వారును అడిగిరి.

తా॥ అందుకు నమ్మాళ్వార్లు శరీరగతమగు సుఖఃదుఃఖాఃదులను పురాకృత కర్మఫలముల ననుభవించుచు ఆ శరీరమునే ఆశ్రయించుకొనియుండును.

### మరియొక వ్యాఖ్యానము

ప్రశ్న: మధురకవి ఆళ్వారు: అణురూపుడైన జీవునియందు విభురూపమైన జ్ఞానవికాస మేర్పడెనేని దేనిని అనుభవ యోగ్యముగా గొని యెచటచేరునని అడిగిరి.

ఉత్తరము॥ నమ్మాళ్వార్లు:- అకారవాచ్యుడైన పరబ్రహ్మ ననుభవించి ఆ బ్రహ్మమందే అవగాహించియుండును. అని బదులు జెప్పిరి.

శ్లో॥ పత్యుః శ్రియః ప్రసాదేన ప్రాప్యసార్వజ్ఞ సంపదం ।
ప్రపన్న జనకూటస్థం ప్రపద్యే శ్రీపరాంకుశం ॥

(తి. అ.) నమ్మాళ్వార్లవలె అసాధారణ ప్రజ్ఞ నాకు గలదా?

# ప్రచారవిభాగము

చైత్ర, వైశాఖ మాసములు

## శాశ్వతనిధికి చందా ఇచ్చిన దాతలు

| | | |
|---|---|---|
| శ్రీ రాణీ [illegible]యమ్మగారు నె. 1కి 1-0-0 చొ॥ జనవరి నుం॥ 4 నెలలు | | 4-0 |
| S. T. P. U. [illegible]చార్యులుగారు | సం॥ కు [illegible] | 5-0 |
| రామినీడి రాయలమ్మగారు | రాజమండ్రి | 5-0 |
| నల్లందిగల్ లక్ష్మీనరసింహాచార్యులుగారు నూజివీడు | | 5-0 |
| సి. హెచ్. శ్రీమన్నారాయణాచార్యులుగారు తెనాలి | | 3-0 |
| మహేంద్రాడ వెంకటాలక్ష్మీనరసింహాచార్యులుగారు శ్రీకాకుళం | | 12-0 |
| టి. శ్రీనివాసరావుగారు హెడ్‌క్లర్కు డివిజనల్ ఫారెస్టు ఆఫీసు గుల్బర్గా | | 4-13 |
| యాదాల పుష్పవల్లి తాయారమ్మగారు | నెల్లూరు | 5-0 |
| నల్లాన్ చక్రవర్తుల రఘునాథాచార్యులుగారు వేణుగోపాలపురం | | 5-0 |
| చిలకమర్రి రంగనాయకమ్మగారు | సికిందరాబాద్ | 5-0 |
| ఎమ్. రాఘవాచార్యులుగారు ప్రిన్సిపల్ (S. S. R. కాలేజి) విజయవాడ | | 5-0 |
| మైలవరం రాణీగారు నెలకు 2-10-0 చొ॥ 2 మాసములు | | 5-0 |
| గోమఠం నమ్మయాచార్యులుగారు | పొన్నూరు | 5-0 |
| కె. వెంకటప్పదాసుగారు | నడిగడ్డపాలెం | 5-0 |
| కు. బాపనయ్య | ,, | 5-0 |
| | | 79-5 |

## శాశ్వత నిధికి వాగ్దానము చేసిన దాతలు

| | | | |
|---|---|---|---|
| దాసరి చెలమయ్యగారు | అన్నవరం | సం॥ 1కి | 3-4 |
| పోకల బాలకృష్ణరామానుజదాసుగారి కుమారులు<br>పి. శ్రీనివాసరావు రామానుజదాసుగారు<br>ఋ. వి. దీనదయాళుగారు మద్రాసు | నెలకి 1-0-0 చొ॥ | | 1-0 |
| పీతాంబరం రామానుజాచార్యులుగారు | వడిశలేరు | సం॥ 1కి | 1-0 |
| గోవర్ధనం శ్రీనివాసాచార్యులుగారు | పొన్నూరు | సం॥ | 5-0 |

# శాశ్వత కైంకర్యము

శ్రీ ఉ. వే. శ్రీమాన్ ధనకుధరం రామానుజాచార్యులుగారు
(శ్రీలక్ష్మీనారాయణపురం రామానుజపేట, గుంటూరు.)

ఈ స్వాములవారు తెనాలి తాలూకా ఆలపాడు గ్రామవాస్తవ్యులు శ్రీ పాంచరాత్ర వ్రతాచార్యైక పుత్రులు. అచ్చటి శ్రీ వేణుగోపాలస్వామివారి గోపురప్రాకారవాపీకూప తటాకాది పెక్కు కైంకర్యములను చేసిన భక్తాగ్రేసరులు. వీరు పది సంవత్సరములనుండి గుంటూరులోని గోతాలమిల్లుసద్ద ఉత్తరముగా 39 సెంట్ల నివేశన స్థలములో శ్రీ లక్ష్మీనారాయణపురము నొక దానిని నిర్మించిరి. అందు రామానుజ కూటము, శ్రీ లక్ష్మీనారాయణ కోవెల, కోనేరుల నేర్పరచి తమ శిష్యదాసాది బృందములతో నివసించుచు కైంకర్యములను చక్కగా నిర్వహించుచున్నారు. ఒక ఆంజనేయాలయమునుకూడ నేర్పరచిరి. ఈ స్వామి వారి కైంకర్య నిర్వహణమునకై సాలీనా 26 బస్తాల ధాన్యము ఆదాయము వచ్చు 2 యకరముల భూమిని ఆలపాడు గ్రామములోనిది వీరు సమర్పించిరి.

ఇట్టి ఆదర్శప్రాయములగు కైంకర్య ధురంధరులను శ్రియఃపతి సకల సౌభాగ్యపరంపరలతో ననుగ్రహించు గాక!

ఇట్లు,
ఒక భక్తులు (గుంటూరు)

---

## : కృతజ్ఞత :

మన సంఘ తీర్మానమును ఆమోదించి సంఘాభివృద్ధికై శాశ్వతనిధికి విరాళము లొసంగుచున్న భాగవత బృందమునకు మా కృతజ్ఞతా పూర్వకమగు ధన్యవాదముల నర్పించుచున్నాము ఇంతవరకు విరాళముల నొసంగినట్టియు, వాగ్దానము గావించినట్టియు మతాభిమానుల తిరునామముల నిచ్చట ప్రచురించుచున్నాము. విరాళములను పంపించువారు గాని వాగ్దానము గావించువారుగాని వివరముగా "శాశ్వతనిధికి" అని తెలుపగోరుచున్నాము.

---

## .... గీతా మందిర కార్యక్రమము ....

(వరదాముత్తియప్పన్ వీధి, మదరాసు 1.)

ఇచ్చట గీతామందిరములో కార్యక్రమము ప్రశాంతముగా జరుగుచున్నది. ప్రతి మంగళ బుధ గురువారములలో రాత్రి గం 6-30 ము గం 8-0 ల వరకు గీతలోని మొదటి అధ్యాయము ప్రారంభించి ప్రతిశ్లోకమునకు వివిధభాష్య విశేష వివరములతో పండిత పామర రంజకముగా సుబోధకముగా ఉపన్యాసము జరుగుచున్నది. ఇప్పుడు ద్వితీయాధ్యాయము జరుగుచున్నది. పెక్కుమంది స్త్రీలును కొద్దిపాటి పురుషులును నిందు పాల్గొని ఆనందించుచున్నారు.

ప్రతినిత్యము గీతాపాఠ ప్రవచనము కావ్యపాఠమువలె పదచ్ఛేద ప్రతిపదార్థ ఆకాంక్షాది విశేషములతో జరుపబడుచున్నది. ఇందు పదుగురు స్త్రీలు మాత్రమేపాల్గొనుచున్నారు. శబ్దములు సమాసములు అమరము వ్యాకరణ విశేషములు, సంస్కృత సంభాషణ, భాషాన్తరీకరణము మొదలగు సాహిత్యోపయుక్త విషయములు గరుపబడుచున్నవి.

ప్రతీ ఏకాదశికిని ఉదయము సమగ్రగీతాపారాయణము ఇచ్చటి పెరుమాళ్ళ సన్నిధిలో గావింపబడుచున్నది. ఇందు కొలదిమంది మాత్రమే పాల్గొనుచున్నారు.

ప్రతి శుక్రవారం సాయంకాలము శ్రీ లక్ష్మీపూజ, శిరియతిరుమడల్ మొదలగు ప్రబంధ సేవా కాలము ఆరగింపు ప్రసాదవినియోగము ఉపన్యాసములు తిరునామ సంకీర్తనములు గావింపబడుచున్నవి. ఇందు పెక్కుమంది స్త్రీలే పాల్గొని జయప్రదముగా జరిపించుచున్నారు.

ప్రతిదినము రెండు హిందీక్లాసులు జరుపబడుచున్నవి. ఇందు పదిమంది బాలికలు పాల్గొని పరీక్షలకు వ్యాసంగము చేయుచున్నారు.

ఈ జ్యేష్ఠ శుద్ధ విదియనుండి దివ్యప్రబంధము స్తోత్రపాఠములు వారి వారి యోగ్యతానుసారముగ స్త్రీలు పెద్దలు పిల్లలు అందరకు సంథలు చెప్పుట ప్రారంభింపబడును.

## కాలక్షేపములు

ఈ జ్యేష్ఠ బహుళ విదియ మొదలు ద్రావిడ ప్రబంధ కాలక్షేపము పంక్తిమీదనే ప్రతి పదార్థముగా ప్రారంభింప దలంచబడుచున్నది. తిరుమంత్రార్థము భగవద్విషయము రెండు కక్షలుగా అరుంబద విశేషవివరముతో ప్రతి శబ్దమునకు అర్థజ్ఞానము కలిగి త్వరలో మంచిసాహిత్యము కలుగునట్లు బోధింపబడును. తగిన అధికారు లందుపాల్గొనవచ్చును. పొరుగూరుల నుండి యీ కాలక్షేపములకై విచ్చేయు స్త్రీలకు మందిరములో ఉచితబస ఉచిత కాలక్షేపము లభించగలదు. సాపాటునకు ఎవరికి వారే ఏర్పాటు చేసుకొనవలసియుండును.

ఈ రీతిగా సంపూర్ణ గ్రంథపరిచయము కలిగించి పాఠప్రవచన ఉపన్యాస సామర్థ్యము కలుగజేయబడును. ప్రస్తుత మిచ్చటి కార్యక్రమమునంతను శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘ కార్యదర్శిగారైన న్యాయవేదాంత విద్వాన్ శ్రీ ఉ. వే. శ్రీమాన్ తె. క౦. గోపాలాచార్యులు గారున్నూ, శ్రీమతి మరంగంటి రంగనాయకమ్మగారున్నూ నిర్వహించుచున్నారు.

తమ తమ సాపాటు ప్రయత్నము తాము నిర్వహించుకొనలేని స్త్రీలకు ప్రస్తుతం కొలది మందికి మాత్రము యీ మందిరమునందే కొన్ని చేతిపనులు యేర్పాటు చేయబడుచున్నవి. అందు దినమునకు రెండు గంటలకు తక్కువగాకుండ పనిచేయువారికి వారి పనిని బట్టి ఆర్థిక సహాయము మందిర నిర్వాహకులచే గావింపబడుచుండును.

ఇందు నాలుగు సంవత్సరములలో ఇంగ్లీషుకానీ లేక ఆంధ్రా మెట్రిక్ పరీక్షలకును, భాషా విద్యాప్రవీణ ఎంట్రెన్సు పరీక్షలకును లేక కేవల ప్రాచీన పద్ధతిగా గీతపైననే సమగ్ర సంస్కృత సాహిత్య పరిజ్ఞానమును కలుగజేయబడు ఏర్పాట్లు గావింపబడుచున్నవి. విద్యార్థినుల ప్రోత్సాహమును బట్టి యీ ఏర్పాట్లు జరిపించబడును.

ఇందు ఉపన్యాస గోష్ఠికి తప్ప తక్కిన అన్ని విషయములలోను కేవలం స్త్రీలకు మాత్రమే ప్రవేశ మొసంగబడును. పాఠప్రవచనకు కూడ సాధ్యమైనంతవరకు స్త్రీలే వినియోగింపబడుదురు.

వివరములు దెలియగోరువారు ఈ క్రింది అడ్రసునకు 0-2-0ల బిళ్ళలతో కవరు వ్రాసిన బడయగలరు.

ఈ సదవకాశమును వివేకవంతులగు నారీమణులెల్లరు ఉపయోగపరచు కుందురుగాక.

ఇట్లు,

మ. చంద్రమ్మ.

శ్రీయతిరాజ సేవా మహిళామండలి కార్యదర్శినీ, గీతామందిరం.

107 వరదాముత్తియప్పన్ వీధి, మదరాసు 1.

# శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘ విజయవాడ శాఖ

స్వస్తిశ్రీ ఖరనామ సంవత్సర ఫాల్గుణ శు ౧౩ ఆదివారము ది 9-3-51 వ తేదీ మధ్యాహ్నము గం 2 లకు విజయవాడలోని నిడుముక్కలవారి రామానుజ కూటమున శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘ విజయవాడ శాశ్వత శాఖను స్థాపించు విషయమై కేంద్ర సంఘ కార్యదర్శియగు అ. చి. శ్రీమన్నారాయణాచార్యులు గారి అధ్యక్షత క్రింద విజయవాడ శాఖ సర్వ సభ్య సమావేశము జరిగినది.

: హాజరైన వారి నామములు :

అ. చి. శ్రీమన్నారాయణాచార్యులు
శివకోటి లక్ష్మీనరసింహము
కూరపాటి రామారావు
నిడుముక్కల శ్రీరామమూర్తి
నందిపాటి రామయ్య
దూపుకుంట్ల లక్ష్మీనరశింహ్మము
యీలిపిళ్ళ వీరరాఘవులు
కపిలవాయ వెంకయ్య
మాతంశెట్టి సీతారామయ్య
నండూరు శోభనాద్రాచార్యులు
జవ్వాజి లక్ష్మీనారాయణ
నందిపాటి జగన్నాయకులు

తీర్మానములు:-

1. ఈ సంఘమున శాశ్వత సభ్యులు జేరిన ఈ క్రింద తెలిసిన మహాశయులు శాశ్వత సభ్యత్వమును అంగీకరించుచు కృతజ్ఞత తెలుపుచు క్రింద సంఘము వారికి మన యామోదమును తెలుపుటకు తీర్మానించడమైనది.

1. శ్రీమాన్ శివకోటి లక్ష్మీనరశింహంగారు
రాజగోపాలాచారివీథి, గవర్నరుపేట విజయవాడ
హిం. ర. నెం 101 రూ 116 శాశ్వత
సాధారణ సభ్యత.

2. శ్రీమాన్ కూరపాటి రామారావుగారు
శివాలయం వీథి, విజయవాడ.
హిం. ర. నెం 102 రూ 116 శాశ్వత
సాధారణ సభ్యత

3. శ్రీమాన్ ఉదయగిరి కృష్ణారావుగారు
బట్టల వర్తకులు, విజయవాడ.
హిం. ర. నెం 103 రూ 116 శాశ్వత
సాధారణ సభ్యత

4. శ్రీమాన్ నందిపాటి జగన్నాయకులుగారు
పచారు దినుసులకొట్టు విజయవాడ.
హిం. ర. నెం 104 రూ 119 శాశ్వత
సాధారణ సభ్యత

5. శ్రీమాన్ నందిపాటి రామయ్యగారు
విజయవాడ
హిం. ర. నెం 105 రూ 116 శాశ్వత
సాధారణ సభ్యత

6. శ్రీమాన్ గోపు శేషావతారంగారు
గవర్నరుపేట, విజయవాడ.
హిం. ర. నెం 106 రూ 116 శాశ్వత
సాధారణ సభ్యత

7. శ్రీమాన్ నండూరి శోభనాద్రాచార్యులుగారు
గాంధినగరము, విజయవాడ.
హిం. ర. నెం. 108 రూ 116 శాశ్వత
సాధారణ సభ్యత

2వ తీర్మానము:- ఈ క్రిందివారిని నూతన కార్యనిర్వాహక వర్గముగ ఎన్నుకొనడమైనది.

అధ్యక్షులు:- శ్రీమాన్ శివకోటి లక్ష్మీనరసింహంగారు
ఉపాధ్యక్షులు:- శ్రీమాన్ ఉదయగిరి కృష్ణారావుగారు
,, ,, నందిపాటి జగన్నాయకులుగారు
,, ,, గోపు శేషావతారంగారు
ప్రధాన కార్యదర్శి:- ,, కూరపాటి రామారావుగారు
సహాయ కార్యదర్శి:- ,, నందిపాటి రామయ్యగారు
,, నంబూరు శోభనాద్రిచార్యులుగారు
కార్యనిర్వాహకసభ్యులు:- ,, మాతంశెట్టి శీతారామయ్యగారు
,, యీలిపిళ్ళ వీరరాఘవులుగారు
,, పారేపల్లి శీతారామయ్యగారు
,, జవ్వాజి లక్ష్మినారాయణగారు

3వ తీర్మానము

ఈ విజయవాడ శాఖ కార్యాలయమును విజయవాడలోని 5/75 (కొత్తగుళ్ళవద్ద) శేషయ్య వీధిలో గల శ్రీమాన్ నిడుముక్కల సుబ్బారాయుడు, రంగవల్లి తాయారమ్మ గార్ల రామానుజ కూటములో యుంచుటకున్నూ ఆఫీసు పర్యవేక్షణాధికారము శ్రీమాన్ నిడుముక్కల శ్రీరామమూర్తిగారు వ్యవహరించుటకున్ను తీర్మానించడమైనది.

4వ తీర్మానము:-

ఈ ప్రాంతములో ఈ సంఘ శాశ్వత సభ్యులను హెచ్చుగా చేర్చవలసినదిగను, ఈ పట్టణముననే ఈ సంఘముయొక్క ఆంధ్రరాష్ట్రీయ శాఖ కార్యాలయము కొరకున్ను, ఈ పట్టణ కార్యాలయముకొరకున్ను శాశ్వత సొంత భవనమును ఏర్పాటు చేయవలసినదిగను, ఈ సంఘము జరుపదలచిన ప్రచార పరీక్షల నిర్వహణకై శాశ్వతాదాయము వచ్చు చక్కటి భవనమును కొనుటకు తగు ప్రయత్నము చేయవలసినదిగను కమిటీని కోరుచు తీర్మానించడమయినది.

5వ తీర్మానము:-

శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘమువారు తలపెట్టిన ప్రచార-పరీక్షల నిర్వహణకొరకైన శాశ్వత నిధికిగాను రూ 10111—0—3ను విరాళముగ సమర్పించిన శ్రీమాన్ కూరపాటి రామారావుగారు వారి ధర్మపత్ని గోదాదేవి గార్లకు యీ సంఘము ఇందు మూలముగ తమ కృతజ్ఞతను తెలుపుచు తీర్మానించడమైనది.

ఆ. చి. శ్రీమన్నారాయణాచార్యులు 9—3—52

రిజిష్టరు నెం. 5094

# భక్తినివేదన

(వేదాంత మాసపత్రిక)

ఇందు వేదాంత విషయ రాజములున్ను; భక్తి ప్రచార విషయమైన వార్తలున్ను వేదాంత సాంప్రదాయ విషయకమైన ప్రశ్నోత్తరములున్ను ప్రచురించబడును.

చందాలు:

| | | |
|---|---|---|
| సాధారణ చందా, సం. కు 1 కి॥ | | రు 5-0-0. |
| సహాయ చందా | ,, | రు. 10-0-0. |

**Book-Post**

1. శ్రీమన్నారాయణుడే సృష్టి - స్థితి - లయ కారకుడు.
2. ఆయనే మోక్షప్రదాత.
3. ఆయనే పరతత్త్వము-పరమాత్మ
4. ఆయన అఖిలహేయ ప్రత్యనీక కల్యాణ గుణకుడు.
5. ఆయనకు జీవుడు శరీరభూతుడు; శేషభూతుడు, పరతంత్రుడు, నియామ్యుడు, అనుభావ్యుడు.
6. జీవులు జ్ఞానైకాకారులు.
7. జీవులు అనంతములు.
8. జీవులు పరమాత్మకంటె భిన్నులు: ఈ భేదము సత్యమైనది; నిత్యమైనది.
9. జీవ-పరమాత్మలకు ప్రకృతి శరీరభూతమైనది; శేషభూతమైనది; పరతంత్రమైనది; నియామ్యమైనది; అనుభావ్యమైనది.
10. ప్రకృతి వికారాస్పదమైనది. జీవపరమాత్మలకంటె భిన్నమైనది, ఈ భేదము సత్యమైనది; నిత్యమైనది.
11. జీవుడు ప్రకృతి వియుక్తుడై పునరావృత్తి రహితమైన [illegible] పరమాత్మ సాన్నిధ్యమును పరమ పదమున [illegible] మోక్షము.
12. భక్తి [illegible] మోక్ష [illegible] సాధనము.
13. భక్తియనగా [illegible] అవిచ్ఛిన్నమైన స్మృతి [illegible]
14. వివేక-విమోక-అభ్యాస-క్రియా-కల్యాణ అనవసాద-అనుద్ధర్షములు భక్తికంగములు.
15. ఇవి సదా[illegible]-సన్న్యాసి[illegible]యణ-లభ్యములు
16. జగద్గురువులగు శ్రీరామానుజాచార్యులు వారును; వారి యనుయాయులున్ను సదాచార్యులు.

"నగురుర్వైష్ణవాత్ పరః" భా. సం.

[illegible]d by A. Ch, Srimannarayanacharya at Sriman Press, Kakinada.

శ్రీమతే రామానుజాయనమః

భక్తి

# నివేదన

వేదాంత మాసపత్రిక

| సంపుటి ౪ | నందన-వైశాఖమాసం | సంచిక ౨ |
|---|---|---|

## కృష్ణార్జున సంవాదము

శ్రీ ఉ. వే, శ్రీమాన్ తె. కం. గోపాలాచార్యులుగారు,
కోదకొండ.

—: 4వ రంగము :—

అర్జు:- కృష్ణా! ఈ కర్మయోగమునకు ఫలమగు ఆత్మ సాక్షాత్కారము ముక్తి కెట్లుప యోగించును.

కృష్ణు:- అర్జునా! ఈ కర్మయోగి జ్ఞానయోగియై ఆత్మను కలరూపుతో సాక్షాత్కరింప గనే తానత్యంత పరతంత్రుడననియు భగవంతునకు శేషభూతుడననియు తెలుసుకొని భగవంతుని ప్రేమించి నిరంతరమాతని కైంకర్యతత్పరుడై యాతనినే ధ్యానించుచుండును.

అర్జు:- దానికేమి ఫలము.

కృష్ణు:- ఇదియే గదా మోక్షమునకు సన్నిహితోపాయమగు భక్తియోగము. ఈ భక్తి చేతనే నాయొక్క విశదతమ సాక్షాత్కారముచే తన శరీర సంబంధమును బాసి నాసాయుజ్యమును పొందును.

అర్జు:- కృష్ణా! విశ్వరూప మత్యద్భుతమైనదని వింటిని. నీ యసాధారణమగు ఆరూపమును సాక్షాత్కరింప గోరుచున్నాను. దానిని జూచుటకు నేను తగుదునని నీకు తోచినచో ఆ స్వరూప మును సమగ్రముగ గుణవిభూతి విగ్రహములతో చూపింప వేడుచున్నాను.

కృష్ణు:- అర్జునా! ఇది దేవతలకైనను అసాధ్యమైన కోరిక. అయినను నీయందలి ప్రేమచే నీకు చూపుచున్నాను. నేను నా దేహమునందు ఒకే భాగమున జగత్తునంతను జూపెదను. కాని నీవు నన్ను నీసామాన్య నేత్రముచే జూడజాలవు. కావున నన్ను జూచుటకు తగిన యప్రాకృత దృష్టిని నీకు ప్రసాదించెదను. దాన నీవు నా విశ్వరూపము నంతను సమగ్రముగ చూడగల్గుదువు.

(అని యర్జునుని కండ్లను తన చేతితో తుడిచి యభిమంత్రించును. పెద్దకాంతిగాన్పించును.)

అర్జు:- ఓహో! ఏమి యీ తేజస్సు, ఇది నా దివ్యచక్షుస్సును గూడ ప్రతిఘటించుచున్నదే! అబ్బా! నా చర్మచక్షుస్సైన నేనేమై యుండెడివాడనో! ఆహా! మా కృష్ణుడేడి? నా రథమేది, ఓహోహో! ఈ యద్భుత దేహమేమి! దీని పొడవునకు గాని వైశాల్యమునకు గాని యంతమునకు గాని యంతము గాన్పింపకున్నదే, అరే చేతులకు, ముఖములకు, నేత్రములకు, సంఖ్యయే లేదే. అబ్బా!!! ఒక్కొక్క చేతియందొక్కొక్క దివ్యాయుధము గాన్పించుచున్నది. ఈ దివ్య భూషణములు యీ దివ్యమాలికలు యీ దివ్యాంబరములు! యీ దివ్య గంధపు పూతలు అపరిమిత తేజముతో విరాజిల్లుచు నన్ను తబ్బిబ్బు గావించుచున్నవి. అబ్బా! ఒక్క శరీరమునందే చతుర్దశ భువనము లెట్లిమిడి యున్నవో! (చేతితో చూపుచు) ఆ ఆ అదుగో బ్రహ్మ. అదుగో యాతని భృకుటీ భూషుడగు రుద్రుడు. (నమస్కరించి) ఏమి నా భాగ్యము!! సప్తర్షులను గోచరించుచున్నారే! అదుగో! ఒకటి! రెండు, మూడు అబ్బో పన్నిండుగురు సూర్యులే! ఇదుగో వీరష్ట వసువులు, వీరేనా ఏకాదశ రుద్రులు ఓహో! వీరిరువురున్నారు. అశ్వినీదేవతులు కావచ్చును. ఈ గుంపు మరుద్గణమువలె నున్నారు. వీరు పితరులు. వీరు గంధర్వులు. వారు మునులు. ఆచాటున సిద్ధులు కావచ్చును. వీరందరును ఆశ్చర్యచకితులై చేతులు జోడించి బొమ్మలవలె నిలచియున్నారు. (నేనిదివరలో ప్రత్యక్షముగా చూచినవియే గాక శాస్త్రము వలన తెలిసికొనినవియు పెద్దల వలన వినిన పదార్థములన్నియు కన్నులార నీ విశ్వరూపుని శరీరకోణమునందే గాంచుచున్నాను. ఇదేమి యాశ్చర్యము) వీరందరకు నొక్కసారి ప్రదక్షిణ నమస్కారము గావింతమన్న యిదియేమి యీ రూపమునకు ఆదిమధ్యాంతములే గానరాకున్నవే! అబ్బబ్బా ఈ ముఖములనుండి యీ దుర్భరమగు మంటలేమి! ఈ కోరలెంత భయమును గొల్పుచున్నవి. అదుగో తమ పిక్కబలము నంతయు చూపి కెట్టికేకలిడుచు ఆ పారిపోవువార లెవ్వరు బాగుగ చూచి [నవ్వుచు] ఓహో! రాక్షసపుంగవులా! బాగు బాగు. ఇదుగో కొందరు దేవతలు ముద్రితాంజలులతో దరిజేరుచున్నారు. కొందరుస్తుతి పాఠముల చదువుచున్నారు. యిదుగో యీ భృగ్వాది మహర్షులు, సనకాది సిద్ధులు, స్వస్త్యస్తు, స్వస్త్యస్తుయను చున్నారు.

(తేరి పారచూచి గడగడ వణంకుచు)

అయ్యయ్యో! వర్షకాలమున నదులు సముద్రమున చేరునంత వేగముతో మిడుతలుదండు కార్చిచ్చులో నురుకురీతి యీ కాలానల సన్నిభ భయంకర ముఖపరంపరలో వచ్చి పడుచున్న వారెవ్వరు? (బాగుగచూచి) అయ్యో! నా ప్రియ పితామహుడగు భీష్ముడే! అయ్యో! నాపూజ్య

ఆచార్యవర్యులగు ద్రోణులే! నా ప్రతియోధుడగు కర్ణుడే! ఏమియాశ్చర్యము. ఈ పదునొక్కండ క్షోహిణీల సేనంతయు యిట్లీతని ముఖములకు ధారగా నేగుచున్నారేమి! (మరొక వైపునకుచూచి) ఇటునుండి మరొక యోధ ప్రవాహము వచ్చుచున్నట్లున్నదే! ఇదియెవరు. (బాగుగజూచి) అయ్యో! అయ్యో! నా వీరులేనా వీరు? ఇదియేమి! వీర్లనందరినీ విశ్వరూపుడు పప్పువలె నమలుచున్నాడే! అందు కొందరు తలలు గుండ పిండియై కోరలలో యిరుకుకొని యున్నారు. ఈతడు తన దీర్ఘ జిహ్వల జాపి కారుచున్న రక్తప్రవాహమును నాకుచున్నాడు బాబోయి! నేనేమగుదునో! నాగతియేమి! నాకు దిక్కెవరు! నా కృష్ణుడేడీ! నేనెక్కడికి పోవుదును అంతట యీతడే నిండి యున్నాడు. యిక యీతనినే శరణ జొచ్చెద.

ప్రభో! నాకు దిక్కు దోచుటలేదు. నేను నిలువజాలక యున్నాను. నీవెవ్వరవు తండ్రీ!

విశ్వ:- అర్జునా! నీవు చూపమని ప్రార్థించిన విశ్వరూపమిదియే!

అర్జు :- అయ్యో! తండ్రీ! నేను నీ నిగతిశ యైశ్వర్యమును జూపుదువని యాశించితిని గాని యీఘోరరూప ప్రదర్శనము నాకేల; అది యిట్టిదే యైనచో నేను ప్రార్థించియుందునా? తండ్రీ! నీవెవ్వడవు, ఇట్టి నీభయంకర రూపమును నాకేల జూపితివి ?

కృష్ణ :- గీ॥ కాలుడను నేను ఘోరవిగ్రహముబూని
వీరినందఱ హతమార్ప బెరిగియుంటి
కంటికగుపించు రాజలోకంబ దెల్ల
రాజవేషంబులో నున్న రాక్షసాళి.

ఈభీష్మ ద్రోణ, కర్ణ, సైంధవాదులందరును నాకసహ్యమగు భాగవతాపచారముల నపరిమితముగా గావించియున్నారు. గాన నేను వీరిని చంపుటకే వినియోగించుకొని యున్నాను. నీవు వుపేక్షించినను వీరు బ్రతుకరు. కావున నేను వీరిని జయింతునో ఓడుదునోయని శంకింపక యుద్ధమును చేయుము. నీవు ధర్మాధర్మ భయముచేతను, బంధు స్నేహముచేతను, కారుణ్యముచేతను బాధపడకుము. వీరిని వధించుటవలన పాపమొకింతయు నీకు కలుగదు. లెమ్ము — గాండీవమును చేబట్టుము,

అర్జు :- (భయముతో వణంకుచు మోకరించి చేతులు జోడించి) హే ప్రభో! లోకనాథా విశ్వరూపా! నీకివే పరశ్శత ప్రణామముల నంతట నర్పించుచున్నాడ.

మ. క్షమియింపన్ గదవయ్య నన్నికను కృష్ణా? విశ్వరూపా!
క్షమింపుము నీశక్తిని నీస్వరూప మెఱుగన్ పూర్వంబునం
దున్న స్నేహము నన్నీవిధి మాయజేసె బరిహాసాలాపచాపల్య బంధము
సైరింపుమను గ్రహించి జగదాధారా! నమోవాకముల్.

నేను పరిహాసార్థముగా ననేకయసత్కారముల గావించియుంటిని. మన మిరువురము నొకటిగా విహరించునప్పుడును, శయనించునప్పుడును, కూర్చుండునపుడును, భుజించునపుడును, ఏకాంతము నం దును పలువుర సమక్షమునందును యనేక యసత్కారముల గావించితిని. అచ్యుతా, నీవు నా తప్పుల నన్నింటిని క్షమింపుము.

(అప్రతిమ ప్రభావ! నీవు సకలలోక జనకుడవు, గురుడవు, పూజ్యుడవు, ఈచతుర్దశ భువన ములకును కారుణ్యాది గుణములతో నీకు సమానుడుగాని అధికుడుగాని లేడు. కావున తండ్రీ నీకు సాష్టాంగ నమస్కారములు గావించి నిన్ను వేడుకొనుచున్నాను. నాపరాధులగు పుత్రులు తండ్రు లను మిత్రులు సఖులను ప్రమాణ పురస్సరముగ ప్రార్థించిన ఆ పితృసఖాదులు ప్రసన్నులగునట్లు నీవును పరమ కారుణికుడవు గాన నీకు ప్రియుడనగు నాయపరాధముల నన్నిటిని క్షమింప వేడు చున్నాను)

నీయద్భుత విశ్వరూపమును జూచి ఆనందించితిని. నామనస్సు కలతజెంది పోయినది. కా వున ప్రభూ! నీ సుప్రసన్నమైన చతుర్భుజ సౌమ్యరూపమును జూపి నన్ను ఆశ్వాసింపుము

(అని సాష్టాంగ నమస్కరించును) కృష్ణుడు సౌమ్యరూపముతో అర్జునుని లేవనెత్తి)

కృష్ణ :- అర్జునా ! ఇప్పుడు నీవు చూచిన నావాస్తవ రూపము నాయందు భక్తి లేక కేవ లవేదాధ్యయన శ్రీమాజపముల వలనగాని యాగ దాన హోమ తపస్సులచేతగాని చూడశక్యము గాదు. కేవల నిర్మలమగు భక్తిచేతనే నా స్వరూపమును శాస్త్రముచే తెలియుటకును, సాక్షాత్క రించుటకును శక్యమగును. కావున వేదాధ్యయనాది కర్మల నాయారాధనయను బుద్ధితో చేయు చుండుము. నీవేపనిని చేసినను నన్ను పొందుటయే ప్రయోజనముగా ప్రేమతో చేయుచుండుము నన్ను ప్రేమించి నన్నుగురించిన కీర్తన, స్తుతి, ధ్యానము, అర్చన, ప్రణామములు, మొదలగువా టిని చేయుకున్న బ్రతికలేనంత యార్తితో యితర విషయ సంగమములవీడి నన్ను పొందుటయే ప్రయోజనముగా గావింపుము. నాతోడి సంశ్లేషమే సంతోషముగాను విశ్లేషమే దుఃఖముగాను గలిగియుండుము సకల చరాచరములును, నా శరీరములు గాన వేటితోను కలహింపకుము. ద్వేషాచ రించితివేని నా ప్రియభక్తుడవై నన్నే పొందుదువు.

అర్జు:- చిత్తము. మహాప్రసాదము.

# శ్రీమహాభారత కథా సామరస్యము — భగవద్గీత

శ్రీశ్రీశ్రీ మేకా వెంకటాద్రి అప్పారావు బహద్దరు జమీందారువారు నూజివీడు.

శ్రీ మహాభారతమున, భీష్మపర్వమున, 24 వ అధ్యాయము నుండి 42వ అధ్యాయము వరకు గల 18 అధ్యాయముల గ్రంధము. భారత యుద్ధారంభమున, బంధువధ చేయలేక వెనుదీయు నర్జునుని యుద్ధోన్ముఖుని గావించుటకై శ్రీకృష్ణునిచే ప్రవచింపబడినది. అర్జునుని ప్రశ్నములు కూడ కలవు. కావున శ్రీకృష్ణార్జున సంవాదమైనది.

ఇట్లు గీత అను శీర్షిక గలవి శ్రీ మహాభారతమున మఱియు కొన్ని గలవు.

2. ఉతథ్యగీత- శాం॥ ప॥ 90, 91 అధ్యా॥ అంగీరస పుత్రుడైన ఉతథ్యుడు యువనాశ్వ పుత్రుడైన మాంధాతకు చెప్పినరాజధర్మములను భీష్ముడు ధర్మరాజునకు చెప్పుట.

3. వామదేవగీత-శాం॥ప॥92,93,94.అధ్యా॥ వామదేవుడను ముని వసుమనునకు చెప్పిన రాజధర్మాచరణ విధానమును భీష్ముడు ధర్మరాజునకు చెప్పుట.

4. ఋషభగీత- శాం॥ ప॥ 125, 126,127, 128 అధ్యా॥ ఋషభుడను ముని సుమిత్రుడను రాజునకు తెలిపిన ఆశాపవిముక్తి మార్గము ఉపాఖ్యానమును భీష్ముడు ధర్మరాజునకు చెప్పుట.

5. పింగళాగీత- శాం॥ ప॥ 174 అధ్యా ॥ పుత్రశోకార్తుడైన ప్రసేనజిత్తు అను రాజునకు ఒక విప్రుడు బోధించిన వైరాగ్యము పింగళ యను వేశ్య విరక్తి చెందిన ఉపాఖ్యానము భీష్ముడు ధర్మరాజునకు చెప్పుట.

6. శంపాకగీత- శాం॥ ప॥ 176 అధ్యా॥ ధనికుని కంటె నిర్ధనికుడే సుఖతరుడని, శంపాకుడను ఒక ముక్తుడు ఒక విరక్తుడైన విప్రునకు తెల్పినది. భీష్ముడు ధర్మరాజునకు చెప్పుట.

7. మంకిగీత- శాం॥ ప॥ 177 అధ్యా॥ మంకియను విప్రుడు లంకె జంటగా కూర్చబడిన తన దూడలు ఒక ఒంటె మెడకు చిక్కి-నశింపగా తన మనస్సును విరక్తి చెందించుట. భీష్ముడు ధర్మరాజునకు చెప్పుట.

8. బోధ్యగీత- శాం॥ ప॥ 178 అధ్యా॥ నహుషపుత్రుడైన రాజునకు బోధ్యుడను ఋషి తెలిపినకార్యసాధననీతి. పింగళ-శారిక-సర్పము భ్రమరము-ఇషుకారుడు-కుమారి-పీరలు ఉదాహరణములని భీష్ముడు ధర్మరాజునకు చెప్పుట.

9. విచఖ్యుగీత- శాం॥ ప॥ 265 అధ్యా॥ అహింసయే మేలని విచఖ్యుడను రాజు యజ్ఞపశువధను నిరసించిన ఉపాఖ్యానమును భీష్ముడు ధర్మరాజునకు చెప్పుట.

10. హారీతగీత:- శాం॥ ప॥ 278 అధ్యా॥ హారీతుడు వివరించిన మోక్షాసక్తుని శీలమును భీష్ముడు ధర్మరాజునకు చెప్పుట.

11. వృత్రగీత:- శాం॥ప॥279,280 అధ్యా॥ శత్రువులచే రాజ్యభ్రష్టుడైన వృత్రాసురునకు తెల్పుమని శుక్రుడు కోరగా, సనత్కుమారుడు తెల్పిన శ్రీమహావిష్ణు మహాత్మ్యము జీవుల, తత్త్వము, ఉద్ధారణ మార్గము. భీష్ముడు ధర్మరాజునకు చెప్పుట. మొదట వృత్రాసురుని

మనోజ్ఞీరత తెల్పునది. కావున వృత్రగీత అనబడెను.

12. పరాశరగీత:- శాం॥ ప॥ 291 టు 299 వరకు అధ్యా॥ జనకమహారాజునకు పరాశరముని తెల్పిన శ్రేయస్సాధనాది వివిధ విషయములు గలది. భీష్ముడు ధర్మరాజునకు చెప్పుట.

13. హంసగీత:- శాం॥ ప॥ 300 అధ్యా॥ హంసరూపమందిన బ్రహ్మదేవుడు సాధ్యులను దేవతలకు తెల్పిన అధ్యాత్మ వివరములను భీష్ముడు ధర్మరాజునకు చెప్పుట.

14. అనుగీత:- అశ్వ॥ ప॥ 16టు 20 అధ్యా॥ వెనుకటి భగవత్ గీతలోని వివరములు తిరిగి బోధింపుమని అర్జునుడు కోరగా శ్రీకృష్ణుడు తెల్పిన విజ్ఞాన విషయములు. సిద్ధకాశ్యపుల సంభాషణ రూపమైనది.

15. బ్రాహ్మణగీత:- అశ్వ॥ ప॥ 21 అధ్యా॥ ఒకానొక బ్రాహ్మణ దంపతుల సంవాదరూపమైన విజ్ఞానము. శ్రీకృష్ణుడుఅర్జునునకు తెల్పుట.

పైననుదహరింపబడిన రెండునుండి, పదిహేను వరకుగల గీతలోని విషయములు ఆయా ప్రదేశములకు సమయమునకు వక్తలకు, శ్రోతలకు ఉచితమైయున్నవి. ఇంక - ఈగీతలన్నిటికంటె ప్రశస్తియు, పవిత్రతయు గాంచిన మొదటిదా భగవత్ గీతయొక్క సన్నివేశ ఔచిత్యములను వివరింపవలసి యున్నది.

## శ్రీభగవద్గీత - ఔచిత్యము

వీరగేయమా? వేదాంతశాస్త్రమా?

ఏగ్రంథముయొక్క ప్రాశస్త్యము గాని, మహిమ గాని దాని ఔచిత్యమును అనుసరించునదే ఔచిత్యము దేశ, కాల, పాత్ర స్వస్వరూపముల వలన వెలయును గదా! ఈ సందర్భ సన్నివేశములు శ్రీ భగవద్గీతకు ఎట్టివి? దేశము-ప్రదేశము-యుద్ధభూమి.

శ్లో॥ ధర్మక్షేత్రే-కురుక్షేత్రే - అనగా క్షాత్రధర్మ పరీక్షకై కురువీరులు నిర్ణయించుకొనిన యుద్ధభూమి-కాలము -యుద్ధమునకై (యుయుత్సవః) ఉత్సాహము గలవారై (సమవేతాః) వీరులు తారసిల్లిన సమయము.

3. పాత్రలు-రాజ్యములు - రాజుల భరణ వసతులా? అవి విభాజ్యములా? అవిభాజ్యములా? అను సమస్య రణముచే గాని పరిష్కారము కానట్టి స్థితి ఏర్పడగా, కౌరవ, పాండవపక్షములలో ఐక్యము కల్పించుకొని యుద్ధసన్నద్ధులై వచ్చి తుములముగా శంఖారావములచేత తమ సేనలను వ్యూహములుగా తీర్చునట్టి ద్వాపర యుగాంత వీరవరుల పారావారము.

4. స్వస్వరూపము - గీత-అనగా గేయము-పాట - గానయోగ్యమైనది. పై దేశ, కాల, పాత్రలు మూడింటికి తగియుండవలసిన గేయగ్రంథమా శ్రీ భగవద్గీతయొక్క స్వస్వరూపము ఎట్టిదిగానుండుట తగునో! వీరగేయముగనా? వేదాంతశాస్త్రముగనా? శ్రీభగవద్గీతను వివరించు వ్యాఖ్యానములు అనేకములు. మతత్రయ కర్తలు-తిలకు-బిసంటు-గాంధి-మొదలగు మహనీయులు, అనేకులచే రచింపబడినవి. ఈ గీతా వివరణములు అన్నింటిలో శ్రీ భగవద్గీత వేదాంతసారమా గ్రంథముగనే భావింపబడినది.

గీతయందు గానయోగ్యమైన సంగతులు ఏవి కలవు? సన్నివేశమునకు తగిన వీరరసపోషణము ఎట్లు సమన్వయింపబడినది? వీరరసప్రధానముగా నుండతగిన గీత వేదాంతపరిభాషలో నుండుటకు కారణము ఏమి? అను ప్రశ్నలను వేసికొని ఎవరును సమాధానములను నిర్వచించి నట్లుగాని ఈ దిగువ సందర్భములను క్లుప్తముగా గుర్తించి నట్లుగాని తెలుపు కనుపించదు.

అర్జునుడు మహాయోధుడు. ఇదివరకే చాల సార్లు కౌరవులపై యుద్ధము చేసినవాడే. అయినను మహోత్కృష్టమౌ ఈ తుది మహాసంగ్రామమున.

అ॥వి॥యో॥శ్లో॥ 21 సేనయోరుభయోర్మధ్యే ।
రథంస్థాపయ మేఽచ్యుత ॥

శ్లో॥ 22 యావదేతాన్నిరీక్షేఽహం ।
యోద్ధుకామానవస్థితాన్ ॥
కైర్మయాసహయోద్ధవ్యమ్
అస్మిన్ రణ-సముద్యమే ॥

వ॥ ఓ అచ్యుతా! నాపై యుద్ధము చేయ వచ్చు మొనగాండ్లు ఎవరో చూచెదము. రెండు సేనల మధ్యకు రథమును తోలి నిలుపుము అని మహోత్సాహముతో పోయు

అ॥వి॥యో॥శ్లో. 28 కృపయాపరయాఽఽవిష్టో
విషీదన్నిద మబ్రవీత్ ॥
అర్జున ఉవాచః॥ దృష్ట్వేమం స్వజనంకృష్ణ ।
శ్లో. 31. నచశ్రేయోఽఽను పశ్యామి
హత్వాస్వజన మాహవే

వ॥ అర్జునుడు స్వజనమును యుద్ధభూమిలో చూచి కృపాపరవశుడై క్షాత్రధర్మమైన శౌర్యమును మరచి బావా! కటికివానివలె అర్థకాంక్షపై ఈ మన బంధువులను చంపజాలను అని నిరసిల్లెను.

అ॥వి॥యో॥శ్లో॥47. ఏవముక్త్వాఽర్జునస్సంఖ్యే
రథోపస్థ ఉపావిశత్
విసృజ్య సశరం చాపం
శోకసంవిగ్న మానసః

ఇట్టి భావమును-ఇట్టి తరుణమున మనస్సును ఆక్రమింప నిచ్చినయెడల ఏయోధుడును యే యుద్ధమునను - ధీరతతో, ధీరోత్సాహముతో పోరాడజాలడు. ఏలయన ఉదారహృదయమునకు మానవలోకమంతయు బంధువులు స్వజనులే. కావున అట్టి ఉత్కృష్ట తరుణమున అర్జునుని శౌర్యోన్ముఖునిగా చేయుటకే శ్రీకృష్ణ భగవానుడు మహోత్సాహకరమైన వీరగానమును గావించెను. అదియే భగవత్ గీత.



# గోదాఽష్టోత్తర శతనామ స్తోత్రం

ఉపన్యాసభూషణ రామాయణ రత్నాకర శ్రీ ఉ. వే. శ్రీమాన్
విద్వాన్ కాండ్యూరి రామానుజాచార్య స్వామి
సంపాదితము.

గోదాగాథాప్రథా శ్రీదా వేదాంతార్థసుబోధినీ ।
యశోదాతనయాఽమోదా గోవిందోద్వాహనోత్సుకా ॥
ధనుః పురావతారా చ మనుజోద్వాహనాక్షమా ।
మహాత్మ్యసుతామాన్యా తులసీతరుమూలజా ॥
అయోనిజానంతగుణా నియమస్త్రీనిఖిలప్రదా ।
ఆషాఢమాససంజాతా పూర్వఫాల్గునభోద్భవా ॥
రమ్యాదిత్యదిన సంజాతా నమ్యానాయకనాయికా ।
నారాయణోత్సుకా నిత్యానామకీర్తనతత్పరా ॥
గోపీచరిత సముద్యుక్తా సహనా తాపహారిణీ ।
భూదేవీ భూతిదాత్రీ చ భూరిదాసూరిభూషణా ॥
స్వోద్వాహకామవినయా రంగరాజకుతూహలా ।
రంగరాడంతరంగజ్ఞా సుందరప్రార్థనాతురా ॥
దాసాభీష్టప్రదాత్రీ చ నాసికాభరణోజ్జ్వలా ।
పాపహంత్రీ తాపహర్త్రీ కూపదర్పణదర్శనా ॥
పీతాంబరానిలాసక్తా తులసీధరణోత్సుకా ।
కృష్ణపాదరజోధాత్రీ కృష్ణోష్ఠాఽమృతపాయినీ ॥
కృష్ణవిశ్లేషాఽసహనా కృష్ణాఽలింగనభావనా ।
జ్ఞానభక్తిస్తనాకారా కృష్ణార్పిత పయోధరా ॥
కామదేవస్తోత్రకామా రామానుజసహోదరీ ।
క్షేమంకరీ క్షౌమహర్త్రీ శ్యామాఽరామపరాయణా ॥

స్వామినీ స్నానకుతుకా శ్రీమతీ శ్రీమహారిణీ ।
శంఖామీనా శంఖపరా శంఖధ్యానమనోహరా ॥
కృష్ణవిశ్లేషరోగార్తా కృష్ణవిశ్లేష సంభ్రమా ।
సువర్ణఖ్యాతపీతస్థా సువర్ణాఽవయవాన్వితా ॥
సర్వగంధా సర్వరసా పుష్పసౌగంధ్యదాయినీ ।
ఉత్తమస్యందనారూఢా పరమోత్తమభాషిణీ ॥
వైవాహిక స్వప్నతోషా వివాహాచారబోధినీ ।
వెంకటేశోత్సవానందా వేదాంతోదంతభాషణా ॥
గోపీవ్రతానుకారా చ గోపవేషసుభూషణా ।
నీళాప్రబోధకుతుకా నీళారకామ్యుతప్రియా ॥
నందాలయ ద్వారస్థసన్మానందబోధనతత్పరా ।
నీలమేఘక్రియాసక్తా వ్రిశోపకిరణార్థినీ ॥
చక్రభానుఘనానందా శంఖనాదాభ్రితోషిణీ ।
త్రివిక్రమ మహోత్సాహా శరవద్వర్ష కాంక్షిణీ ॥
వర్షాఽసక్తా వంశ్యవఘోషా వామనస్థిరమానసా ।
వసుధావసుదా వేద్యా వరదా వైష్ణవాశయా ॥
పుష్పకేళిపూర్ణలేఖాపుణ్యాపూర్వసుభాషిణీ ।
పూజ్యాప్రాజ్ఞాప్రధానాచయమునాతీరకాంక్షిణీ ॥
కృష్ణాశ్రయా కృష్ణబలా కృష్ణాధీనమహోదయా ।
శిష్టాచారైకరతా బహిరంతర్నివాసినీ ॥
రంగగోపాలమహిషీ రంగరాడంఘ్రిశేముషీ ।
రంగరాట్ తత్త్వవిదుషీ రంగరాడ్వాసతాకృషీః ॥

☞ యీ గోదాష్టోత్తర శతనామావళి జ్యేష్ఠమాస పత్రికలో చూడండి.

శ్రీమతే రామానుజాయనమః

# ఆర్తి ప్రబంధము

అనువక్త:
కందాళ జగన్నాథాచార్యులు
మంచరియాల.

(ఆర్తి పద్యానువాదము)

ఈ దివ్యప్రబంధమును పరమోదారులగు శ్రీమణవాళ మహామునులు శ్రీ ఎంబెరుమానారుల విషయమై భక్త్యతిశయముతో వారిపట్ల తమకుగల ఆర్తినంతను ప్రకటించుచు ద్రావిడ ఛందోబద్ధముగ సాయించిరి. ఇయ్యది 60 పాశురములతో నలరారు దివ్యప్రబంధము. ఇది ఉడయవరుల వైభవమును బహుభంగుల చాటుచున్నది, రామానుజీయులకు నిత్యానుసంధేయమగు నీదివ్య ప్రబంధమును నైజాం ఇలాకా మంచరియాల వాస్తవ్యులైన శ్రీ ఉ. వే. శ్రీమాన్ కందాళ జగన్నాథాచార్యస్వామివారు మృదుమధురశైలిలో నాంధ్రీకరించి భక్తలోకమునకు ప్రసాదించి మన కార్యాలయమున కందజేసిరి దీనిని మతాభిమానులెల్లరు అనుసంధించి ఆనందించి తరింతురుగాక యని యథావకాశముగా నిచట ప్రకటించుచున్నాము.

తేన్ పయలుం

జ్ఞానమధుష్యంది సుమమాలికను ధరించు
శ్రీయతీశుని పాదరాజీవయుగళి
పైనధిక భక్తితమకు నొప్పారపాము
రులకు నైతము జ్ఞానంబు గలుగునట్లు
కుతికమున దేల్చి ద్రవిడ శబ్ద తతివరవ
రమునియై వచ్చి యీకృతిన్ రచనజేసె. ౧

వమ్బవిళ్

నవవికచ పుష్పహారమండన తనుండు
దారమణ వాళమునిపతి ధాత్రియందు
కాలునిల్లక నిత్య ముక్తానుభావ్య
మై యొసగునట్టి వైకుంఠ మరుగ నార్తి
మునుగొన యతీంద్రు పద్మయుగమును దలంచు
చానతిచ్చెను మనకమూల్యార్థకృతిని. ౨

వాళియెతిరాజ

యతిపతికి మంగళము యతిపతికి మంగ
ళము యతిపతికి శుభమంగళం బటంచు
మంగళాశాసనముజేయు మహితులెవరొ
వారికట్టు లాశాసించు వారలెవరొ
వారికానతు లెవ్వారొ వారునిత్య
సూరి నిర్వాహకులటంచు పేరుగాంతురు, ౩

ఇరామానుశా

శ్రీయతీశునకే నమస్కృతి యొనర్తు
నని మనుజులతో క్షణమైన జెలిమి
కూడదని యెంచువారి యడుగులనుజేరు
వారిపాదములన్న మోహాక మిడెడు
వారు సూరుల నిత్యసంపదలుగారె. ౪

తన్ డైనల్ తామ్

తండ్రి తల్లి భార్యయు తనుజులును బ్రి
వృద్ధసంపత్తి మాదృశ వితతికీవె
యనెడి తలపున జేరని తనువు నిపుడు
ఛేదనమొనర్చి నన్కృపనాదరించ
కుంటిరే హేతువో తెల్పుడో యతీశ, ౫

# ప్రశ్నోత్తరములు

## శ్రీ కృష్ణజయంతి - శ్రాద్ధాదికము

కాంచీపురములో వేంచేసియున్న శ్రీ ఉ. వే. శ్రీమాన్ ఆ. తి. కొ. వెంకట తాతాచార్యులయ్యవార్లంగారు ఈ ప్రమాణము లను తెలుపుచున్నారు.

శ్రీకృష్ణ జయంతి దినమున పితృశ్రాద్ధాదికము తటస్థించినచో దాని నెటుల నిర్వర్తించవలయునని చాలమంది ప్రశ్నించుచున్నారు. ఇందును గురించి శిష్టాచారముల నేకవిధములుగ యున్నది.

1. కొంతమంది మామూలు ప్రకారముగ రాత్రికాలమువరకు యుండి రాత్రి శ్రీకృష్ణ జయంతి వుత్సవమును జరిపించుకొని తాము ఆ రోజంతయు కూడ ఉపవాసముండి మరుచటి దివసమున పితృకర్మాదులు జరుపుట గలదు.

2. మరికొంతమంది నక్షత్రదర్శనము వరకు యుండి అపుడు శ్రీకృష్ణజయంత్యుత్సవమును జరుపుకొని వెంటనే పితృశ్రాద్ధాదికముల జరిపించుట గలదు.

3. మరికొంతమంది మామూలుగ ఉదయమున పితృశ్రాద్ధాదికమునుజరిపించుకొని తాము మాత్రము ఉపవాసముండి తాము రాత్రి శ్రీ కృష్ణోత్సవమును జరిపించి తాము పారణచేయుట గలదు.

4. మరికొంతమంది శ్రీకృష్ణ జయంత్యుత్సవమును ఉదయముననే జరిపించుకొని 2 ఝాములైన పిమ్మట కుతపకాలమున పితృశ్రాద్ధాదికములు జరిపించుట గలదు. ఇటుల అనేకు లనేక పద్ధతులు అమలు జరుపుచున్నారు.

వీరిలో ఏది యుక్తము అని విచారించగా మొదటి మూడు పక్షములకంటె చివరిదైన నాలుగవ పక్షమే యుక్తమైనదిగ తోచుచున్నది.

శ్రీకృష్ణజయంత్యుత్సవమును విద్యుక్త ప్రకారము జరిపించవలె నన్నచో అర్ధరాత్రివరకు ఉపవాసముండి అర్ధరాత్రి అయినపిమ్మట పెరుమాళ్ళకు అర్చనజేసి ఆరిగింపు సమర్పించి మంగళాశాసనమును జేసి తిరునక్షత్ర తనయ విన్నపమును జేసి చాత్తుమొఱ అయినపిమ్మట తీర్థ ప్రసాద స్వీకరణము జేయవలయును.

ఇవన్నియు అగునప్పటికి ప్రసాదస్వీకరణ సమయమునకు అర్ధరాత్రి దాటిపోవును. రాత్రి 12 గంటల యనంతరము మంచితీర్థమునైనను తీసుకొనకూడదు అను సామాన్య శాస్త్రము ననుసరించి కొంతమంది అపుడు పెరుమాళ్ళ తీర్థమును మాత్రము తీసుకొని మర్నాడు మాత్రమే ప్రసాదమును స్వీకరించుట కలదు. కాని కొందరు శిష్టులు భగవదారాధన యనునది భగవన్నివేదిత తీర్థప్రసాద స్వీకారముతోగాని పూర్తికాదను విశేషశాస్త్రము ననుసరించి నిశీథ నిషేధరూప సామాన్యశాస్త్రమును వదిలి ఎంత రాత్రి గడచిననుకూడ భగవన్నివేదిత తీర్థ ప్రసాదముల స్వీకరించుట కలదు. ప్రపన్నులకు ఈవిశేష శాస్త్రానుసరణమే యుక్తము.

ఇది సామాన్యముగ శ్రీకృష్ణ జయంత్యుత్సవ విధానము.

ఇక యీరోజున పితృశ్రాద్ధము తటస్థించి

నచో ఏమి చేయవలయునో విచారింతము.

ఏకాదశినాడున్ను ఆశౌచాదులు తటస్థించినపుడున్ను తప్ప మిగత ఏకాలమునందుకూడ పితృ మృత తిథియందు పితృశ్రాద్ధమును జరిపించుట మానరాదనియు అటులమానుట ప్రత్యవాయ జనకమనియు శాస్త్రములు తెలుపుచున్నవి.

ఈ స్థలములయందు చెప్పటను కృష్ణాష్టమినాడు తటస్థించిన పితృశ్రాద్ధమును ఆనాడు మానివేసి మర్నాడు చేయవలయునని విధి కనుపించదు. గాన మొదటిపక్షము యుక్తియుక్తముగ లేదు.

శ్రీకృష్ణజయంత్యుత్సవమును అర్ధరాత్రి సమయమున నాచరించవలయునని విధియుండగా తమ యానుకూల్యమునకై నక్షత్రదర్శన కాలముననే దానిని జరిపించుటయు న్యాయముకాదు. ముఖ్యకాలమును విడుచుటకు అంగీకరించినపుడు ఆ ఉత్సవమును ఉదయముననే ఏల చేయరాదు. నిశీదత్వసామ్యమాత్రముననే మన స్తృప్తిని పొందతలచినను ఉత్సవానంతరము పితృశ్రాద్ధము నాచరించు సమయమునకు ఎటులైనను బాగుగ చీకటి పడును. నిశీథ శ్రాద్ధాచరణ నిషేధము తగులుక మానదు, అందుచే వ్రతకాల పరిత్యాగము శ్రాద్ధనిషేధకాలానుష్ఠానము అను రెండు దోషములు కూడ తటస్థించును. గాన రెండవపక్షముకూడ యుక్తియుక్తముగ గనుపించదు

మూడవపక్షముకూడ యుక్తముగ తోచదు. ఏలయన :—

శ్రీకృష్ణ జయంత్యుత్సవ మనునది ప్రపన్నులకత్యంత ముఖ్యమైన విధాయకమైన ఉత్సవ విశేషము, ఆనాడు ఆ ఉత్సవ విశేషార్చ్య నారాధనాదికముల జరుపకుండగ పెరుమాళ్ళకు ఉదయమున మహానివేదమును సమర్పించుటయు దానినే పితృదేవతలకు (భోక్తలకు) సమర్పించుటయు తానుమాత్రము రాత్రివరకు యుండి తిరిగి రెండవ పర్యాయము మహానివేదనము అరగింపుజేసి ఉత్సవమును పూర్తిజేసుకొని అప్పుడు మాత్రమే తీర్థప్రసాదములు స్వీకరించుటయు అంతయుక్తముగ తోచదు. మరియు శ్రాద్ధకర్త పితృశేషమును మాత్రమే స్వీకరించుట కుదురదు. పితృశేషముగాని భగవన్నివేదిత ప్రసాదస్వీకరణ తప్పదు. భోక్తలకు ఈ ఉత్సవ ప్రసాదస్వీకరణ ఆనాడు లభ్యపడదు. అందుచే యీ మూడవ పక్షముకూడ పూర్తియుక్తమునకు విలువలేదు.

ఇక నాలుగవ పక్షము మాత్రమే విశేష విధిచే యుక్తమని తోచుచున్నది. ఇందు ఉత్సవ ముఖ్యకాల పరిత్యాగ రూపదోషము తటస్థించినను గౌణకాలమున (మధ్యాహ్నముననే) ఉత్సవము జరిగించుటచేతను భోక్తలకు ఉత్సవ ప్రయుక్త భగవద్విశేషార్చ్య ఆరాధనల పూర్తి జేసి తత్తీర్థ ప్రసాదములనే వినియోగించుట చేతను తానుకూడ పితృశేష రూపమును కూడ పొందిన ఆతీర్థప్రసాదములనే స్వీకరించుటచేతను పితృమృత తిథిని విడువకుండుటచేతను మిగత పక్షములన్నింటికి కంటెను ఈపక్షమే యుక్తియుక్తము ఆచరణీయమున్ను శిష్టసమ్మతమున్ను అయియున్నది.

దీనికి ధర్మశాస్త్రమున ఇటుల ప్రమాణము కలదు.

### శ్రీ జయంతీ దివసాగత శ్రాద్ధకర్తవ్య విధిః లిఖ్యతే.

జయన్త్యా మేవ కృష్ణస్య । విహితా నిశి పారణా।
పితుః శ్రాద్ధం కథం కుర్యా న్మధ్యాహ్నే విహితే సతి ।

సర్వాసు చ జయంతీషు। మృతాహే సముపస్థితే।
జయంతీ కౌ తు కసుపి । సంచితే తు విధీయతే
తతః పరం పితుః శ్రాద్ధం । మధ్యాహ్నేఽసు సమాచరేత్ ।
దివసస్యాష్టమే భాగే । యథా మందాయతేరవిః
సకాలం*కుతపో జ్ఞేయః పితౄణాం దత్తమక్షయం
(స్మృత్యర్థసారే)
అజ్ఞ శ్చేదతి వేధాయాం ఆపతి బ్రహ్మవిచ్ఛయః
సంకల్పేన విధానేనకుర్యాచ్ఛ్రాద్ధం న పార్వణం

* కుతపకాలమనగా సామాన్యముగా పగలు 18 ఘటియలనుండి 24 ఘటియలవరకు మధ్య యున్న కాలము.

---

## శ్రీ యతిరాజ భజన కీర్తనములు

కవితావతంస, గానకళానిపుణ, హరికథా చతురానన
శ్రీ ఉ. వే. శ్రీమాన్ కరి నారాయణాచార్య భాగవతార్,

దేశి — చతురస్రగతి

అబితేరెసివా కోనుమెరె అనుదానివలె

ప॥ శ్రీభాష్యకార భవవిదూర భక్తమందారా నీ
పాదపద్మదాసులమగుమమ్ముఁబ్రోవరా రా శ్రీ ॥భాష్య॥

అ॥ దూష్యమా భవాబ్ధిమునీఁగి దొరలుచుంటిమి (బహు) మా
దుష్టచేష్టలన్నియుఁగృపతోక్షమింపుమా కనికరముంచి బ్రోవుమా! సుమ
భూష్యమాభవత్పదాబ్జపూజలొసఁగుమా!
కనుమా!వినుమా!యనుమానమా!మహాత్మ!మమ్మనుగ్రహింపుమా! ॥శ్రీ

2 కరుణింపుమోకృపానిలయా! కాంతిమతేయా!
శరణనుచునిన్నునమ్మితిమో! సద్గుణాలయా!
పరిపూర్ణవిశ్వమానపసౌ భ్రాత్వభావమున్
బరమార్థతన్ దలంచియెల్ల వారికాదృతిన్ బరమాశ్చర్యమాగతిన్
వరమంత్రరాజమొసఁగి కీర్తిఁబరగినావహో!
కరుణాభరణా! కరినారాయణార్యవినుత! కావఁగరారా! ॥శ్రీ భా॥

వటపత్రశాయి పాదపద్మములపైన వున్న త్తిరత్తుళాయ్ కావాలని, తల్లిగారు మాత్రము ఎలా తెస్తారు చెప్పండి అర్చావతారములో వేంచేశివున్నస్వామి తిరువడిలో సమర్పించిన తిడుత్తుళాయ్ గనుక నా కోరిక తీర్చుటకు కాలాతీతమయిపోయి సదా ఏమైను కాలాతీతమయిన విషయములు కావాలంటే ఎవరితరము. వీరు అదే కావాలని దుఃఖపడి ఏడ్చి ఏడ్చి మూర్ఛపొంది దేహము తెలియకుండా పడుకొన్నారు. ఇక తల్లిగారికి చాలా బాధ కలిగి ఆమె దుఃఖము పొందుతూ అయ్యో ఆ వటపత్రశాయి కొరకు నా కూతురు తన దేహకాంతి పోగొట్టుకొన్నది. అదిపోగొట్టు కున్నది. ఈ గాజులు పోగొట్టుకున్నదని కుమార్తె స్థితికి జాలిపడుతూ దుఃఖపడి ఆమె కూడా మూర్ఛపొందేరు. ఈమె మూర్ఛపొందగానే ఆళ్వార్‌నాయకి కుమార్తె గారికి తెలివి వచ్చినది. ఎలా తెలివి వచ్చిందంటారేమో మూర్ఛపొందినవాని మొఖముపై చల్లని నీరు జల్లితే తెలివి వచ్చినటుల ఈమె తల్లిగారి ఏడుపులో ఆ సర్వేశ్వరుని కొరకు దేహకాంతి గాజులు మొదలైనవి పోగొట్టుకొన్నది. అనిగదా దుఃఖపడ్డారు. ఆ దుఃఖములో సర్వేశ్వరుని తిరునామ ప్రసక్తి వుండుటచేత అదే ఈమె మూర్ఛకు శిశిరోపచారమైతే లేవగలిగారు. లేచి ఇక నేను ఇచ్చట వుండ లేను. నా మనస్సు పోయినవద్దకే నేను పోతాను అంటూ "లక్ష్మణేవగతాంగతిం" అని లక్ష్మయ్యను విడచివుండలేక రామయ్య తండ్రి వెంటనే సరయు నదిలో మునిగినటుల వీరు మనస్సు పోయిన తిరుక్కోళూరుకి వెళ్ళిపోయారు. దీనివలన తేలిన దేమయ్యా అంటే ఇన్నిదినాలుగా ఎవరూ ఎరుగకుండా క్షుద్రవిషయానుభవములకు పోయెడు జీవాత్మ ఇప్పుడు ఎవరూ ఎరుగకుండా పర మాత్మ వద్దకు పారిపోయే స్థితిలోకి వచ్చాడు అనే విషయము చెప్పబడుచున్నవి. "మాజ్ పాల్ మనం శుళిప్ప మంగైయర్ తోళ్" నిథనని శ్రియఃపతిపైకి నా హృదయము వెళ్ళిపోయినది, ఆరోగ్యత కీడుపడిపోయి స్త్రీల భుజముల సౌందర్యము విడచివేశినాను అని తిరుమంగైమన్నన్ సాయించినటుల వీరు పరమాత్మని యోరక్తో విరక్తో ఆ పరమాత్మని అనే వుపనిషదర్థమును ఈ రూపముగా తెలుపుడు చేస్తున్నారు. సరి వీరు పడకవిడచి తిరుక్కోళూరుకి వెళ్ళిపోయినారు. బాగానేవుంది. ఇక వీరితల్లిగారి అవస్తచూద్దాము. వీరు అటు వెళ్ళగానే ఈ తల్లిగారికి మూర్ఛ నుండి తెలివి వచ్చింది. ఎంతసేపూ కుమార్తె దృష్టికదూ, చూచారు. కుమార్తె లేరు, ఇల్లంతా పాడుపడిపోయి నటులవున్నది. ఆళ్వార్‌నాయకి లేకపోవుటచేత శ్రీరాఘువులు తమ్మునితో జానికితో అరణ్యమునకు వెళ్ళిపోతే అయోధ్యలో వుండే దశరథుని బంగళా ఎలావుందయ్యా అంటే (పుత్రద్వయహీనంతత్) దశరథులకి రామయ్యమీదనే ప్రాణము ఎంత వెతికినా మేడలో కనుపడ లేదు. రామలక్ష్మణులు దాంతో చాలా బాధపడ్డారు, ముసలిరాజు పోనీ 4 దినాలు పోయాకయినా వస్తారేమోనని ధయిర్నముగా వుందామంటే (స్నుషయాచ వివర్జితమ్) వాళ్ళ వస్తువుండే ఆ వస్తువ కోసరమైనా వస్తారని ఆశయినా లేకుండా కోడలిని కూడా తీసుకొని వెళ్ళిపోయినారు గదా ఇక వచ్చేదేమిటి, (అపశ్యద్భవనంరాజా నష్టచంద్రమివాంబరమ్) చంద్ర సూర్యులు లేక నక్ష

తల్లిములు లేక శూన్యమైన ఆకాశము ఎలావుందో ఆ విధముగ కొడుకులు లేక కోడలు లేక వున్న మేడను చూచి దశరథులు దుఃఖము పొందినటుల వీరు కూడా తమ కుమార్తె లేని ఇంటిని చూచి దుఃఖపడుచున్నారు. సీతా పిరాట్టి (సర్వాన్ భోగాన్ సరిత్యజ్య భర్తృస్నేహ బలాత్కృతా అచింతయిత్వా దుఃఖాని ప్రవిష్టా నిర్జనంవనమ్) అన్నట్లు ఈ రాఘవులయందు వుండే ప్రీతిచేత సమస్త భోగములు విడిచిపెట్టి ఘోరకష్ట పరంపరలకు కారణమైన అరణ్యములకు వెంబడించి వెళ్ళిపోయిన జానికి దేవి మాదిరిగా నా కుమార్తె తిరుక్కోళూర్ వైత్తమానిధి యందు వుండే ప్రేమ చేత నన్ను నా దుఃఖమునైనా విచారించకుండా వెళ్ళిపోయినదని బాధపడుచున్నారు. పూర్వము మన ఆళ్వందారు గోష్ఠిలో ఈ పాశురము కాలక్షేపము జరుగుతూన్నప్పుడు శిష్యులని ఒక ప్రశ్న వేశారు. యేమంటే ఈ ఆళ్వార్ నాయకి గారి తల్లి దుఃఖము ఎక్కువా లేక తిరుమంగ ఆళ్వార్ల తల్లిగారి దుఃఖము ఎక్కువ అని అంటే వారి శిష్యులు సమాధానము చెప్పినారుగదా తిరుమంగ ఆళ్వారుల తల్లిగారికి అంత దుఃఖముండదు. ఎందువల్లనంటే వాడే వచ్చి స్వయముగా తీసుకొని వెళ్ళుటచేత ఈమె ఒంటరిగా వెళ్ళినారు గనుక ఈ తల్లిగారికే ఎక్కువ దుఃఖమని గాన దీనికి యామునాచార్యులవారి సమాధానమేమంటే వాడు వచ్చి తీసుకొని వెళ్ళాడు గనుకనే తిరుమంగై యాళ్వారునాయకి తల్లి గారికి దుఃఖము ఎక్కువ కారణమేమంటే ఉభయులకూ ఒకరిని చూస్తే ఒకరికి వళ్ళు తెలియదు. ఒకరినొకరు చూచుకుంటూ ఆనందముతో శరీరము మరచి తిరునగరికి పోక దండకారణ్యమునకు పోతే అచ్చట శూర్పణఖ వస్తే ఎలాగ అని ఆమె భయము. ఈమె వంటరిగా వెళ్లుట వలన తిన్నగా తిరుక్కోళూర్‌కే వెళ్లుతారనే ధైర్యము ఈ తల్లిగారికి అని సమాధానము చెప్పినారు.

[సశేషం]

# తిరుక్కోళూర్ పెణ్ పిళ్ళై రహస్యము

రచయిత: శ్రీమద్భాగవత పాదరేణువు, మగరాను.

## నాలాయిరం

అ॥ అవన్ శిరియనెన్రేనో ఆళ్వారై ప్పోలే ।

తె॥ అతడేపిన్న అని అన్నానా ఆళ్వార్లవలె॥

ఏ

పెరి. తి॥ పా॥ శిరియనెన్రు ఎన్నిళం శింగత్తైయిగళేల్ కండాయ్ ।
శిరుమైయిన్ వార్తైయై మావళి యిడం శెన్రుకేళ్ ।
శిరుమైప్పిళై కొళ్ళిల్ సీయుమున్ తేన్రైకుక్కురియైకాణ్ ।
నిర్ది మది! నెడుమాల్ విర్రైంమన్రై కూక్కుగిరాన్ ॥

అని పెరియాళ్వార్లు అనుభవించియున్నారు.॥ నమ్మాళ్వారున్ను తిరువాయ్ మొళిలో

తి. వా. మొ॥ పా॥ అరివినార్క్కురై విల్లా వకల్ఞాల త్తవరటియ ।
నెటియెల్లామెడుత్తురైత్త నిత్తె ఞానత్తోరుమూర్తి ।
కుటియమాణురువాగి కొడుంకోళాల్ నిలంకొండ।
కిరియమ్మాన్ కవరాద । కిళరొళియూర్క్కుత్తైవిలమే।

తా॥ అజ్ఞానులకు గోచరమగునట్లు పరిపూర్ణుడును అద్వితీయుడును పొట్టియునగు బ్రహ్మచారియై (బలిని) వంచనచేశి త్రిలోకములను స్వాధీనపఱచుకొనిన వామనమూర్తి అంగీకరింపని కాంతిచే యేమి ప్రయోజనము గలదు.

(3) మధుర కవులు నమ్మాళ్వార్లతో ప్రథమ సంభాషణ.

ప్రశ్న: శెత్తత్తిన్ వయటిర్రిల్ శిరియదు పిరందాల్ ఎత్తైత్తిన్రు ఎంగనే కిడక్కుం? అని మధురకవులడుగగా నమ్మాళ్వార్లు అత్తైత్తిన్రు అంగనేకిడక్కుం అని అప్పుడే వాక్రుచ్చి చెప్పిరి.

తా॥ (మ) అచిత్తుతో జీవాత్మ సంబాధపడియున్నప్పుడు అనగా ప్రకృతి గర్భమున జీవుడు ప్రవేశించి కరణ కళేబరములను కలిగియుండినప్పుడు అనగా (జీవునికి శరీరము వచ్చినప్పుడు) దేనిని అనుభవించుచూ యెక్కడపడియుండునని నమ్మాళ్వారును అడిగిరి.

తా॥ అందుకు నమ్మాళ్వార్లు శరీరగతమగు సుఖఃదుఖాఃదులను పురాకృత కర్మఫలముల ననుభవించుచు ఆ శరీరమునే ఆశ్రయించుకొనియుండును.

మరియొక వ్యాఖ్యానము

ప్రశ్న: మధురకవి అళ్వారు: అణురూపుడైన జీవునియందు విభురూపమైన జ్ఞానవికాస మేర్పడెనేని దేనిని అనుభవ యోగ్యముగా గొని యెచటచేరునని అడిగిరి.

ఉత్తరము॥ నమ్మాళ్వార్లు:- అకారవాచ్యుడైన పరబ్రహ్మ ననుభవించి ఆ బ్రహ్మమందే అవగాహించియుండును. అని బదులు జెప్పిరి.

శ్లో॥ పత్యుః శ్రియః ప్రసాదేన ప్రాప్యసార్వజ్ఞ సంపదం ।
ప్రపన్న జనకూటస్థం ప్రపద్యే శ్రీపరాంకుశం ॥

(తి. అ.) నమ్మాళ్వార్లవలె అసాధారణ ప్రజ్ఞ నాకు గలదా?

# ప్రచార విభాగము.

చైత్ర, వైశాఖ మాసములు

## శాశ్వతనిధికి చందా ఇచ్చిన దాతలు

| | |
|---|---|
| శ్రీ కాణి పాపాయమ్మగారు నె 1కి 1-0-0 చొ॥ జనవరి మొ॥ 4 మా. | 4-0 |
| S. T. P. U. స్వామాత్మాచార్యులుగారు సం॥ కు (పోలూరి) | 5-0 |
| రామినీడి రాయలమ్మగారు రాజమండ్రి | 5-0 |
| నల్లందిగళ్ లక్ష్మీనరశింహాచార్యులుగారు నూజవీడు | 5-0 |
| సి. హెచ్. శ్రీమన్నారాయణాచార్యులుగారు తణుకు | 3-0 |
| మహేంద్రాడ వెంకటాద్రినరశింహాచార్యులుగారు కళింగపట్నం | 12-0 |
| టి. శ్రీనివాసరావుగారు హెడ్‌క్లర్కు డివిజనల్ ఫారెస్టు ఆఫీసు గుంటూరు | 4-13 |
| యాదాల పుష్పవల్లి తాయారమ్మగారు నెల్లూరు | 5-0 |
| నల్లాన్ చక్రవర్తుల రఘునాథాచార్యులుగారు వేణుగోపాలపురం | 5-0 |
| చిలకమర్రి రంగనాయకమ్మగారు శికింద్రాబాద్ | 5-0 |
| ఎమ్. రాఘవాచార్యులుగారు ప్రిన్సిపల్ (S. S. R. కాలేజి) విజయవాడ | 5-0 |
| మైలవరం రాణీగారు నెలకు 2-10-0 చొ॥ 2. మాసములు | 5-0 |
| గోమఠం నమ్మయాచార్యులుగారు పొన్నూరు | 5-0 |
| కె. వెంకటప్పదాసుగారు నడిగడ్డపాలెం | 5-0 |
| కు. బాపనయ్య ,, | 5-0 |
| | 79-5 |

## శాశ్వత నిధికి వాగ్దానము చేసిన దాతలు

| | | | |
|---|---|---|---|
| దాసరి చెలమయ్యగారు | అన్నవరం | సం॥ 1కి | 3-4 |
| పోకల బాలకృష్ణరామానుజదాసుగారి కుమారులు<br>పి. శ్రీనివాసరావు రామానుజదాసుగారు<br>ఋ. పి. దీనదయాళుగారు మద్రాసు | నెలకి 1-0-0 చొ॥ | | 1-0 |
| పీతాంబరం రామానుజాచార్యులుగారు | వడిశలేరు | సం॥ 1కి | 1-0 |
| గోవర్ధనం శ్రీనివాసాచార్యులుగారు | పొన్నూరు | సం॥ | 5-0 |

## శాశ్వత కైంకర్యము

శ్రీ ఉ. వే. శ్రీమాన్ ధనకుధరం రామానుజాచార్యులుగారు
(శ్రీలక్ష్మీనారాయణపురం రామానుజపేట, గుంటూరు)

ఈ స్వాములవారు తెనాలి తాలూకా ఆలపాడు గ్రామవాస్తవ్యులు శ్రీ పాంచరాత్రి చ్యుతాచార్యైక పుత్రులు. అచ్చటి శ్రీ వేణుగోపాలస్వామివారి గోపురప్రాకారవాపీకూప తటాకాది పెక్కు కైంకర్యములను చేసిన భక్తాగ్రేసరులు. వీరు ఐదు సంవత్సరములనుండి గుంటూరులోని గోతాలమిల్లునద్ద ఉత్తరముగా 39 సెంట్ల నివేశన స్థలములో శ్రీ లక్ష్మీనారాయణపురమునొక దానిని నిర్మించిరి. అందు రామానుజ కూటము, శ్రీ లక్ష్మీనారాయణ కోవెల, కోనేరుల నేర్పరచి తమ శిష్యదాసాది బృందములతో నివసించుచు కైంకర్యములను చక్కగా నిర్వహించుచున్నారు. ఒక ఆంజనేయాలయమునుకూడ నేర్పరచిరి. ఈ స్వామి వారి కైంకర్య నిర్వహణమునకై సాలీనా 26 బస్తాల ధాన్యము ఆదాయము వచ్చు 2 యకరముల భూమిని ఆలపాడు గ్రామములోనిది వీరు సమర్పించిరి.

ఇట్టి ఆదర్శప్రాయములగు కైంకర్య ధురంధరులను శ్రియఃపతి సకల సౌభాగ్యపరంపరలతో ననుగ్రహించు గాక !

ఇట్లు,
ఒక భక్తులు (గుంటూరు)

---

## : కృతజ్ఞత :

మన సంఘ తీర్మానమును ఆమోదించి సంఘాభివృద్ధికై శాశ్వతనిధికి విరాళము లొసంగుచున్న భాగవత బృందమునకు మా కృతజ్ఞతా పూర్వకమగు ధన్యవాదముల నర్పించుచున్నాము ఇంతవరకు విరాళముల నొసంగినట్టియు, వాగ్దానము గావించినట్టియు మతాభిమానుల తిరునామముల నిచ్చట ప్రచురించుచున్నాము. విరాళములను పంపించువారు గాని వాగ్దానము గావించువారుగాని వివరముగా "శాశ్వతనిధికి" అని తెలుపగోరుచున్నాము.

---

## .... గీతా మందిర కార్యక్రమము ....

### (వరదాముత్తియప్పన్ వీధి, మదరాసు 1.)

ఇచ్చట గీతామందిరములో కార్యక్రమము ప్రశాంతముగా జరుగుచున్నది. ప్రతి మంగళ బుధ గురువారములలో రాత్రి గం 6-30 మొ గం 8-0 ల వరకు గీతలోని మొదటి అధ్యాయము ప్రారంభించి ప్రతిశ్లోకమునకు వివిధభాష్య విశేష వివరములతో పండిత పామర రంజకముగా సుబోధకముగా ఉపన్యాసము జరుగుచున్నది ఇప్పుడు ద్వితీయాధ్యాయము జరుగుచున్నది. పెక్కుమంది స్త్రీలును కొద్దిపాటి పురుషులును యిందు పాల్గొని ఆనందించుచున్నారు.

ప్రతినిత్యము గీతాపాఠ ప్రవచనము కావ్యపాఠమువలె పదచ్ఛేద ప్రతిపదార్థ ఆకాంక్షాది విశేషములతో జరుపబడుచున్నది. ఇందు పదుగురు స్త్రీలు మాత్రమేపాల్గొనుచున్నారు. శబ్దములు సమాసములు అమరము వ్యాకరణ విశేషములు, సంస్కృత సంభాషణ, భాషాన్తరీకరణము మొదలగు సాహిత్యోపయుక్త విషయములు గరుపబడుచున్నవి.

ప్రతీ ఏకాదశికిని ఉదయము సమగ్రగీతాపారాయణము ఇచ్చటి పెరుమాళ్ళ సన్నిధిలో గావింపబడుచున్నది. ఇందు కొలదిమంది మాత్రమే పాల్గొనుచున్నారు.

ప్రతి శుక్రవారం సాయంకాలము శ్రీ లక్ష్మీపూజ, శిరియతిరుమడల్ మొదలగు ప్రబంధ సేవాకాలము ఆరగింపు ప్రసాదవినియోగము ఉపన్యాసములు తిరునామ సంకీర్తనములు గావింప బడుచున్నవి. ఇందు పెక్కుమంది స్త్రీలే పాల్గొని జయప్రదముగా జరిపించుచున్నారు.

ప్రతిదినము రెండు హిందీక్లాసులు జరుపబడుచున్నవి. ఇందు పదిమంది బాలికలు పాల్గొని పరీక్షలకు వ్యాసంగము చేయుచున్నారు.

ఈ జ్యేష్ఠ శుద్ధ విదియనుండి దివ్యప్రబంధము స్తోత్రపాఠములు వారి వారి యోగ్యతాను సారముగ స్త్రీలు పెద్దలు పిల్లలు అందరకు సంథలు చెప్పుట ప్రారంభింపబడును.

## కాలక్షేపములు

ఈ జ్యేష్ఠ బహుళ విదియ మొదలు ద్రావిడ ప్రబంధ కాలక్షేపము పంక్తిమీదనే ప్రతి పదార్థముగా ప్రారంభింప దలంచబడుచున్నది. తిరుమంత్రార్థము భగవద్విషయము రెండు కక్షలుగా అరుంబద విశేషవివరములో ప్రతి శబ్దమునకు అర్థజ్ఞానము కలిగి త్వరలో మంచిసాహిత్యము కలుగుతీరున బోధింపబడును. తగిన అధికారు లందుపాల్గొనవచ్చును. పొరుగూరుల నుండి యీ కాలక్షేపములకై వచ్చేయు స్త్రీలకు మందిరములో ఉచితబస ఉచిత కాలక్షేపము లభించగలదు. సాపాటునకు ఎవరికి వారే ఏర్పాటు చేసుకొనవలసియుండును.

ఈ రీతిగా సంపూర్ణ గ్రంథపరిచయము కలిగించి పాఠప్రవచన ఉపన్యాస సామర్థ్యము కలుగజేయబడును. ప్రస్తుత మిచ్చటి కార్యక్రమమునంతను శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘ కార్యదర్శిగారైన న్యాయవేదాంత విద్వాన్ శ్రీ ఉ. వే. శ్రీమాన్ తె. క. గోపాలాచార్యులు గారున్నూ, శ్రీమతి మరంగంటి రంగనాయకమ్మగారున్నూ నిర్వహించుచున్నారు.

తమ తమ సాపాటు ప్రయత్నము తాము నిర్వహించుకొనలేని స్త్రీలకు ప్రస్తుతం కొలది మందికి మాత్రము యీ మందిరమునందే కొన్ని చేతిపనులు యేర్పాటు చేయబడుచున్నవి. అందు దినమునకు రెండు గంటలకు తక్కువగాకుండ పనిచేయువారికి వారి పనిని బట్టి ఆర్థిక సహాయము మందిర నిర్వాహకులచే గావింపబడుచుండును.

ఇందు నాలుగు సంవత్సరములలో ఇంగ్లీషుకానీ లేక ఆంధ్రామెట్రిక్ పరీక్షలకును, భాషా విద్యాప్రవీణ ఎంట్రెన్సు పరీక్షలకును లేక కేవల ప్రాచీన పద్ధతిగా గీతపైననే సమగ్ర సంస్కృత సాహిత్య పరిజ్ఞానమును కలుగజేయబడు ఏర్పాట్లు గావింపబడుచున్నవి. విద్యార్థినుల ప్రోత్సాహమును బట్టి యీ ఏర్పాట్లు జరిపించబడును.

ఇందు ఉపన్యాస గోష్ఠికి తప్ప తక్కిన అన్ని విషయములలోను కేవలం స్త్రీలకు మాత్రమే ప్రవేశ మొసంగబడును. పాఠప్రవచనకు కూడ సాధ్యమైనంతవరకు స్త్రీలే వినియోగింపబడుదురు.

వివరములు దెలియగోరువారు ఈ క్రింది అడ్రసునకు 0-2-0ల బిళ్ళలతో కవరు వ్రాసిన బడయగలరు.

ఈ సదవకాశమును వివేకవంతులగు నారీమణులెల్లరు ఉపయోగపరుచు కుందురుగాక.

ఇట్లు,

మ. చంద్రమ్మ.

శ్రీయతిరాజ సేవా మహిళామండలి కార్యదర్శినీ, గీతామందిరం.

107 వరదాముత్తియప్పన్ వీధి, మదరాసు 1.

# శ్రీ విశిష్టాద్వైత పరిచారక సంఘ విజయవాడ శాఖ

స్వస్తిశ్రీ ఖరనామ సంవత్సర ఫాల్గుణ శు ౧౩ ఆదివారము ది 9-3-51 వ తేదీ మధ్యాహ్నము గం 2 లకు విజయవాడలోని నిడుముక్కలవారి రామానుజ కూటమున శ్రీ విశిష్టాద్వైత పరిచారక సంఘ విజయవాడ శాశ్వత శాఖను స్థాపించు విషయమై కేంద్ర సంఘ కార్యదర్శియగు అ. చి. శ్రీమన్నారాయణాచార్యులు గారి అధ్యక్షత క్రింద విజయవాడ శాఖ సర్వ సభ్య సమావేశము జరిగినది.

: హాజరైన వారి నామములు :

అ. చి. శ్రీమన్నారాయణాచార్యులు
శివకోటి లక్ష్మీనరసింహము
కూరపాటి రామారావు
నిడుముక్కల శ్రీరామమూర్తి
నందిపాటి రామయ్య
దూపుకుంట్ల లక్ష్మీనరశింహము
యీలిపిళ్ళ వీరరాఘవులు
కపిలవాయ వెంకయ్య
మాతంశెట్టి సీతారామయ్య
నండూరు శోభనాద్రాచార్యులు
జవ్వాజి లక్ష్మీనారాయణ
నందిపాటి జగన్నాయకులు

తీర్మానములు:-

1. ఈ సంఘమున శాశ్వత సభ్యులు జేరిన ఈ క్రింద తెలిసిన మహాశయుల శాశ్వత సభ్యత్వమును అంగీకరించుచు కృతజ్ఞత తెలుపుచు క్రింద సంఘము వారికి మన యామోదమును తెలుపుటకు తీర్మానించడమైనది.

1. శ్రీమాన్ శివకోటి లక్ష్మీనరశింహంగారు
రాజగోపాలాచారివీధి, గవర్నరుపేట విజయవాడ
హిం. ర. నెం 101 రూ 116 శాశ్వత
సాధారణ సభ్యత.

2. శ్రీమాన్ కూరపాటి రామారావుగారు
శివాలయం వీధి, విజయవాడ.
హిం. ర. నెం 102 రూ 116 శాశ్వత
సాధారణ సభ్యత

3. శ్రీమాన్ ఉదయగిరి కృష్ణారావుగారు
బట్టల వర్తకులు, విజయవాడ.
హిం. ర. నెం 103 రూ 116 శాశ్వత
సాధారణ సభ్యత

4. శ్రీమాన్ నందిపాటి జగన్నాయకులుగారు
పచారు దినుసులకొట్టు విజయవాడ.
హిం. ర. నెం 104 రూ 119 శాశ్వత
సాధారణ సభ్యత

5. శ్రీమాన్ నందిపాటి రామయ్యగారు
విజయవాడ
హిం. ర. నెం 105 రూ 116 శాశ్వత
సాధారణ సభ్యత

6. శ్రీమాన్ గోపు శేషావతారంగారు
గవర్నరుపేట, విజయవాడ.
హిం. ర. నెం 106 రూ 116 శాశ్వత
సాధారణ సభ్యత

7. శ్రీమాన్ నండూరి శోభనాద్రాచార్యులుగారు
గాంధినగరము, విజయవాడ.
హిం. ర. నెం. 108 రూ 116 శాశ్వత
సాధారణ సభ్యత

2వ తీర్మానము:- ఈ క్రిందివారిని నూతన కార్యనిర్వాహక వర్గముగ ఎన్నుకొనడమైనది.

అధ్యక్షులు:- శ్రీమాన్ శివకోటి నృసింహరాంగారు
ఉపాధ్యక్షులు:- శ్రీమాన్ ఉదయగిరి కృష్ణారావుగారు
,, ,, నందిపాటి జగన్నాయకులుగారు
,, ,, గోపు శేషావతారంగారు
ప్రధాన కార్యదర్శి:- ,, కూరపాటి రామారావుగారు
సహాయ కార్యదర్శి:- ,, నందిపాటి రామయ్యగారు
,, నంబూరు శోభనాద్రాచార్యులుగారు
కార్యనిర్వాహకసభ్యులు:- ,, మాతంశెట్టి శీతారామయ్యగారు
,, యాలిపిళ్ళ వీరరాఘవులుగారు
,, పారేపల్లి శీతారామయ్యగారు
,, జవ్వాజి లక్ష్మీనారాయణగారు

3 వ తీర్మానము

ఈ విజయవాడ శాఖ కార్యాలయమును విజయవాడలోని 5/75 (కొత్తగుళ్ళవద్ద) శేషయ్య వీధిలో గల శ్రీమాన్ నిడుముక్కల సుబ్బారాయుడు, రంగవల్లి తాయారమ్మ గార్ల రామానుజ కూటములో యుంచుటకున్నూ ఆఫీసు పర్యవేక్షణాధికారము శ్రీమాన్ నిడుముక్కల శ్రీరామ మూర్తిగారు వ్యవహరించుటకున్ను తీర్మానించడమైనది.

4వ తీర్మానము:-

ఈ ప్రాంతములో ఈ సంఘ శాశ్వత సభ్యులను హెచ్చుగా చేర్చవలసినదిగను, ఈ పట్టణముననే ఈ సంఘముయొక్క ఆంధ్రరాష్ట్రీయ శాఖ కార్యాలయము కొరకున్ను, ఈ పట్టణ కార్యాలయముకొరకున్ను శాశ్వత సొంత భవనమును ఏర్పాటు చేయవలసినదిగను, ఈ సంఘము జరుపదలచిన ప్రచార పరీక్షల నిర్వహణకై శాశ్వతాదాయము వచ్చు చక్కటి భవనమును కొనుటకు తగు ప్రయత్నము చేయవలసినదిగను కమిటీని కోరుచు తీర్మానించడ మయినది.

5వ తీర్మానము:-

శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘమువారు తలపెట్టిన ప్రచార-పరీక్షల నిర్వహణకొరకైన శాశ్వత నిధికిగాను రూ 10111—0—0ను విరాళముగ సమర్పించిన శ్రీమాన్ కూరపాటి రామారావుగారు వారి ధర్మపత్ని గోదాదేవి గార్లకు యీ సంఘము ఇందు మూలముగ తమ కృతజ్ఞతను తెలుపుచు తీర్మానించడమైనది.

ఆ. చి. శ్రీమన్నారాయణాచార్యులు 9—3—52

శ్రీమతే రామానుజాయనమః

భక్తి

# నివేదన

వేదాంత మాసపత్రిక

| సంపుటి ౪ | నందన-వైశాఖమాసం | సంచిక ౨ |
|---|---|---|

## కృష్ణార్జున సంవాదము

శ్రీ ఉ. వే. శ్రీమాన్ తె. కం. గోపాలాచార్యులుగారు,
కోదకొండ.

—: 4వ రంగము :—

అర్జు:- కృష్ణా! ఈ కర్మయోగమునకు ఫలమగు ఆత్మ సాక్షాత్కారము ముక్తి కెట్లుప యోగించును.

కృష్ణు:- అర్జునా! ఈ కర్మయోగి జ్ఞానయోగియై ఆత్మను కలరూపుతో సాక్షాత్కరింప గనే తానత్యంత పరతంత్రుడననియు భగవంతునకు శేషభూతుడననియు తెలుసుకొని భగవంతుని ప్రేమించి నిరంతరమాతని కైంకర్యతత్పరుడై యాతనినే ధ్యానించుచుండును.

అర్జు:- దానికేమి ఫలము.

కృష్ణు:- ఇదియే గదా మోక్షమునకు సన్నిహితోపాయమగు భక్తియోగము. ఈ భక్తి చేతనే నాయొక్క విశదతమ సాక్షాత్కారముచే తన శరీర సంబంధమును బాసి నాసాయుజ్యమును పొందును.

అర్జు:- కృష్ణా! విశ్వరూప మత్యద్భుతమైనదని వింటిని. నీ యసాధారణమగు ఆరూపమును సాక్షాత్కరింప గోరుచున్నాను. దానిని జూచుటకు నేను తగుదునని నీవు తోచినచో ఆ స్వరూప మును సమగ్రముగ గుణవిభూతి విగ్రహములతో చూపింప వేడుచున్నాను.

కృష్ణు:- అర్జునా! ఇది దేవతలకైనను అసాధ్యమైన కోరిక. అయినను నీయందలి ప్రేమచే నీకు చూపుచున్నాను. నేను నా దేహమునందు ఒకే భాగమున జగత్తునంతను జూపెదను. కాని నీవు నన్ను నీసామాన్య నేత్రముచే జూడజాలవు. కావున నన్ను జూచుటకు తగిన యప్రాకృత దృష్టిని నీకు ప్రసాదించెదను. దాన నీవు నా విశ్వరూపము నంతను సమగ్రముగ చూడగల్గుదువు.

(అని యర్జునుని కండ్లను తన చేతితో తుడిచి యభిమంత్రించును. పెద్దకాంతిగాన్పించును.)

అర్జు:- ఓహో! ఏమి యీ తేజస్సు, ఇది నా దివ్యచక్షుస్సును గూడ ప్రతిఘటించుచున్నదే! అబ్బా! నా చర్మచక్షుస్సైన నేనేమై యుండెడివాడనో! ఆహా! మా కృష్ణుడేడీ? నా రథమేది, ఓహోహో! ఈ యద్భుత దేహమేమి! దీని పొడవునకు గాని వైశాల్యమునకు గాని యంతమునకు గాని యంతము గాన్పింపకున్నదే. అరే చేతులకు, ముఖములకు, నేత్రములకు, సంఖ్యయే లేదే. అబ్బా!!! ఒక్కొక్క చేతియందొక్కొక్క దివ్యాయుధము గాన్పించుచున్నది. ఈ దివ్యభూషణములు యీ దివ్యమాలికలు యీ దివ్యాంబరములు! యీ దివ్య గంధపు పూతలు అపరిమిత తేజముతో విరాజిల్లుచు నన్ను తబ్బిబ్బు గావించుచున్నవి. అబ్బా! ఒక్క శరీరమునందే చతుర్దశ భువనము లెట్లిమిడి యున్నవో! (చేతితో చూపుచు) ఆ ఆ అదుగో బ్రహ్మ. అదుగో యాతని భృకుటీ భూషుడగు రుద్రుడు. (నమస్కరించి) ఏమి నా భాగ్యము!! సప్తర్షులును గోచరించుచున్నారే! అదుగో! ఒకటి! రెండు, మూడు అబ్బో పన్నిండుగురు సూర్యులే! ఇదుగో వీరష్ట వసువులు, వీరేనా ఏకాదశ రుద్రులు ఓహో! వీరిరువురున్నారు. అశ్వినీదేవతలు కావచ్చును. ఈ గుంపు మరుద్గణమువలె నున్నారు. వీరు పితరులు. వీరు గంధర్వులు. వారు మునులు, ఆచాటున సిద్ధులు కావచ్చును. వీరందరును ఆశ్చర్యచకితులై చేతులు జోడించి బొమ్మలవలె నిలచియున్నారు. (నేనిదివరలో ప్రత్యక్షముగా చూచినవియే గాక శాస్త్రము వలన తెలిసికొనినవియు పెద్దల వలన వినిన పదార్థములన్నియు కన్నులార నీ విశ్వరూపుని శరీరకోణమునందే గాంచుచున్నాను. ఇదేమి యాశ్చర్యము) వీరందరకు నొక్కసారి ప్రదక్షిణ నమస్కారము గావింతమన్న యిదియేమి యీ రూపమునకు ఆదిమధ్యాంతములే గానరాకున్నవే! అబ్బబ్బా ఈ ముఖములనుండి యీ దుర్భరమగు మంటయేమి! ఈ కోరలెంత భయమును గొల్పుచున్నవి. అదుగో తమ పక్కబలము నంతయు చూపి వెర్రికేకలిడుచు ఆ పారిపోవువార లెవ్వరు బాగుగ చూచి [నవ్వుచు] ఓహో! రాక్షసపుంగవులా! బాగు బాగు. ఇదుగో కొందరు దేవతలు ముద్రితాంజలులతో దరిజేరుచున్నారు. కొందరుస్తుతి పాఠముల చదువుచున్నారు. యిదుగో యీ భృగ్వాది మహర్షులు, సనకాది సిద్ధులు, స్వస్త్యస్తు, స్వస్త్యస్తు యనుచున్నారు.

(తేరి పారచూచి గడగడ వణకుచు)

అయ్యయ్యో! వర్షకాలమున నదులు సముద్రమున చేరునంత వేగముతో మిడుతలదండు కార్చిచ్చులో నురుకురీతి యీ కాలానల సన్నిభ భయంకర ముఖపరంపరలో వచ్చి పడుచున్నవారెవ్వరు? (బాగుగచూచి) అయ్యో! నా ప్రియ పితామహుడగు భీష్ముడే! అయ్యో! నా పూజ్య

ఆచార్యవర్యులగు ద్రోణులే! నా ప్రతియోధుడగు కర్ణుడే! ఏమియాశ్చర్యము. ఈ పదునొక్కండ క్షౌహిణీల సేనంతయు యిట్లీతని ముఖములకు ధారగా నేగుచున్నారేమి! (మరొక వైపునకుచూచి) ఇటునుండి మరొక యోధ ప్రవాహము వచ్చుచున్నట్లున్నదే! ఇదియెవరు. (బాగుగజూచి) అయ్యో! అయ్యో! నా వీరులేనా వీరు? ఇదియేమి! వీర్లనందరినీ విశ్వరూపుడు పప్పువలె నమలుచున్నాడే! అందు కొందరు తలలు గుంకపిండియై కోరలలో యిరుకుకొని యున్నారు. ఈతడు తన దీర్ఘ జిహ్వల జాపి కారుచున్న రక్తప్రవాహమును నాకుచున్నాడు బాబోయి! నేనేమగుదునో! నాగతియేమి! నాకు దిక్కెవరు! నా కృష్ణుడేడి! నేనెక్కడికి పోవుదును అంతట యీతడే నిండి యున్నాడు. యిక యీతనినే శరణ జొచ్చెద.

ప్రభో! నాకు దిక్కు దోచుటలేదు. నేను నిలువజాలక యున్నాను. నీవెవ్వరవు తండ్రీ!

విశ్వ:- అర్జునా! నీవు చూపమని ప్రార్థించిన విశ్వరూపమిదియే!

అర్జు :- అయ్యో! తండ్రీ! నేను నీ నిగతిశ యైశ్వర్యమును జూపుదువని యాశించితిని గాని యీఘోరరూప ప్రదర్శనము నాకేల; అది యిట్టిదే యైనచో నేను ప్రార్థించియుందునా? తండ్రీ! నీవెవ్వడవు, ఇట్టి నీభయంకర రూపమును నాకేల జూపితివి ?

కృష్ణ :- గీ॥ కాలుడను నేను ఘోరవిగ్రహముబూని
వీరినందఱ హతమార్ప బెరిగియుంటి
కంటకగుపించు రాజలోకంబ దెల్ల
రాజవేషంబుతో నున్న రాక్షసాళి.

ఈభీష్మ ద్రోణ, కర్ణ. సైంధవాదులందరును నాకసహ్యమగు భాగవతాపచారముల నపరిమితముగా గావించియున్నారు. గాన నేను వీరిని చంపుటకే వినియోగించుకొని యున్నాను. నీవు వుపేక్షించినను వీరు బ్రతుకరు. కావున నేను వీరిని జయింతునో ఓడుదునోయని శంకింపక యుద్ధమును చేయుము. నీవు ధర్మా ధర్మ భయముచేతను, బంధు స్నేహముచేతను, కారుణ్యముచేతను బాధపడకుము. వీరిని వధించుటవలన పాపమొకింతయు నీకు కలుగదు. లెమ్ము —— గాండీవమును చేబట్టుము,

అర్జు :- (భయముతో వణంకుచు మోకరించి చేతులు జోడించి) హే ప్రభో! లోకనాథా విశ్వరూపా! నీకివే పరశ్శత ప్రణామముల నంతట నర్పించుచున్నాడ.

మ. క్షమియింపన్ గదవయ్య నన్నికను కృష్ణా? విశ్వరూపా!
క్షమింపుము నీశక్తిని నీస్వరూప మెఱుగన్ పూర్వంబునం
దున్న స్నేహము నన్నీవిధి మాయజేసె బరిహాసాలాపచాపల్య బంధము
సైరింపుమను గ్రహించి జగదాధారా ! నమోవాకముల్.

నేను పరిహాసార్థముగా ననేకయపచారముల గావించియుంటిని. మన మిరువురము నొకటిగ విహరించునపుడును, శయనించునపుడును, కూర్చుండునపుడును, భుజించునపుడును, ఏకాంతమునందును పలువుర సమక్షమునందును యనేక యపచారముల గావించితిని. అచ్యుతా, నీవు నా తప్పుల నన్నింటిని క్షమింపుము.

(అప్రతిమ ప్రభావ! నీవు సకలలోక జనకుడవు, గురుడవు, పూజ్యుడవు, ఈచతుర్దశ భువనములకును కారుణ్యాది గుణములతో నీకు సమానుడుగాని అధికుడుగాని లేడు. కావున తండ్రీ నీకు సాష్టాంగ నమస్కారములు గావించి నిన్ను వేడుకొనుచున్నాను. అపరాధులగు పుత్రులు తండ్రులను మిత్రులు సఖులను ప్రమాణ పురస్సరముగ ప్రార్థించిన ఆ పితృసఖాదులు ప్రసన్నులగునట్లు నీవును పరమ కారుణికుడవు గాన నీకు ప్రియుడనగు నాయపరాధముల నన్నిటిని క్షమింప వేడుచున్నాను)

నీయద్భుత విశ్వరూపమును జూచి ఆనందించితిని. నామనస్సు కలతజెంది పోయినది. కావున ప్రభూ! నీ సుప్రసన్నమైన చతుర్భుజ సౌమ్యరూపమును జూపి నన్ను ఆశ్వాసింపుము

(అని సాష్టాంగ నమస్కరించును) కృష్ణుడు సౌమ్యరూపముతో అర్జునుని లేవనెత్తి,

కృష్ణ :- అర్జునా ! ఇప్పుడు నీవు చూచిన నావాస్తవ రూపము నాయందు భక్తి లేక కేవలవేదాధ్యయన శ్రీమాజపముల వలనగాని యాగ దాన హోమ తపస్సులచేతగాని చూడశక్యము గాదు. కేవల నిర్మలమగు భక్తిచేతనే వాస్తవరూపమును శాస్త్రముచే తెలియుటకును, సాక్షాత్కరించుటకును శక్యమగును. కావున వేదాధ్యయనాది కర్మల నాయారాధనయను బుద్ధితో చేయుచుండుము. నీవేపనిని చేసినను నన్ను పొందుటయే ప్రయోజనముగా ప్రేమతో చేయుచుండుము నన్ను ప్రేమించి నన్నుగురించిన కీర్తన, స్తుతి, ధ్యానము, అర్చన, ప్రణామములు, మొదలగువాటిని చేయకున్న బ్రతకలేనంత యార్తితో యితర విషయ సంగమములవీడి నన్ను పొందుటయే ప్రయోజనముగా గావింపుము. నాతోడి సంశ్లేషమే సంతోషముగాను విశ్లేషమే దుఃఖముగాను గలిగియుండుము సకల చరాచరములును, నా శరీరములు గాన వేటితోను కలహింపకుము. ఇట్లాచరించితివేని నా ప్రియభక్తుడవై నన్నే పొందుదువు.

అర్జు:- చిత్తము. మహాప్రసాదము.

# శ్రీమహాభారత కథా సామరస్యము — భగవద్గీత

శ్రీశ్రీశ్రీ మేకా వెంకటాద్రి అప్పారావు బహద్దరు జమీందారువారు సూచించినవి.

శ్రీమహాభారతమున, భీష్మపర్వమున, 24 వ అధ్యాయము నుండి 42వ అధ్యాయము వరకు గల 18 అధ్యాయముల గ్రంథము. భారత యుద్ధారంభమున, బంధువధ చేయలేక వెనుదీయు నర్జునుని యుద్ధోన్ముఖుని గావించుటకై శ్రీకృష్ణునిచే ప్రవచింపబడినది. అర్జునుని ప్రశ్నములు కూడ కలవు. కావున శ్రీకృష్ణార్జున సంవాదమైనది.

ఇట్లు గీత అను శ్లోక కలవి శ్రీ మహాభారతమున మఱియు కొన్ని గలవు.

2. ఉతథ్యగీత- శాం॥ ప॥ 90, 91 అధ్యా॥ ఆంగీరస పుత్రుడౌ ఉతథ్యుడు యవనాశ్వ పుత్రుడౌ మాంధాతకు చెప్పినరాజధర్మములను భీష్ముడు ధర్మరాజునకు చెప్పుట.

3. వామదేవగీత-శాం॥ప॥92,93,94.అధ్యా॥ వామదేవుడను ముని వసుమనునకు చెప్పిన రాజధర్మాచరణ విధానమును భీష్ముడు ధర్మరాజునకు చెప్పుట.

4. ఋషభగీత- శాం॥ ప॥ 125, 126,127, 128 అధ్యా॥ ఋషభుడను ముని సుమిత్రుడను రాజునకు తెలిపిన ఆశాపవిముక్తి మార్గము ఉపాఖ్యానమును భీష్ముడు ధర్మరాజునకుచెప్పుట.

5. పింగళాగీత- శాం॥ ప॥ 174 అధ్యా॥ పుత్రశోకార్తుడౌ ప్రసేనజిత్తు అను రాజునకు ఒక విప్రుడు బోధించిన వైరాగ్యము పింగళ యను వేశ్య విరక్తి చెందిన ఉపాఖ్యానము భీష్ముడు ధర్మరాజునకు చెప్పుట.

6. శంపాకగీత- శాం॥ ప॥ 176 అధ్యా॥ ధనికుని కంటె నిర్ధనికుడే సుఖతరుడని, శంపాకుడను ఒక ముక్తుడు ఒక విరక్తుడౌ విప్రునకు తెల్పినది. భీష్ముడు ధర్మరాజునకు చెప్పుట.

7. మంకిగీత- శాం॥ ప॥ 177 అధ్యా॥ మంకియను విప్రుడు లంకె జంటగా కూర్చబడిన తన దూడలు ఒక ఒంటె మెడకు చిక్కి-నశింపగా తన మనస్సును విరక్తి చెందించుట. భీష్ముడు ధర్మరాజునకు చెప్పుట.

8. బోధ్యగీత- శాం॥ ప॥ 178 అధ్యా॥ నహుషపుత్రుడౌ రాజునకు బోధ్యుడను ఋషి తెలిపినకార్యసాధననీతి. పింగళ-శారిక-సర్పము భ్రమరము-ఇషుకారుడు-కుమారి-వీరలు ఉదాహరణములని భీష్ముడు ధర్మరాజునకు చెప్పుట.

9. విచఖ్యుగీత- శాం॥ ప॥ 265 అధ్యా॥ అహింసయే మేలని విచఖ్యుడను రాజు యజ్ఞపశువిధను నిరసించిన ఉపాఖ్యానమును భీష్ముడు ధర్మరాజునకు చెప్పుట.

10. హారీతగీత:- శాం॥ ప॥ 278 అధ్యా॥ హారీతుడు వివరించిన మోక్షాసక్తుని శీలమును భీష్ముడు ధర్మరాజునకు చెప్పుట.

11. వృత్రగీత:- శాం॥ప॥279,280 అధ్యా॥ శత్రువులచే రాజ్యభ్రష్టుడైన వృత్రాసురునకు తెల్పుమని శుక్రుడు కోరగా, సనత్కుమారుడు తెల్పిన శ్రీమహావిష్ణు మహాత్మ్యము జీవుల తత్త్వము, ఉద్ధారణ మార్గము. భీష్ముడు ధర్మరాజునకు. చెప్పుట. మొదట వృత్రాసురుని

మనోజ్ఞకత తెల్పునది. కావున వృత్రగీత అనబడెను.

12. పరాశరగీత:- శాం॥ ప॥ 291 టు 299 వరకు అధ్యా॥ జనకమహారాజునకు పరాశర ముని తెల్పిన శ్రేయస్సాధనాది వివిధ విషయములు గలది. భీష్ముడు ధర్మరాజునకు చెప్పుట.

13. హంసగీత:- శాం॥ ప॥ 300 అధ్యా॥ హంసరూపమందిన బ్రహ్మదేవుడు సాధ్యులను దేవతలకు తెల్పిన అధ్యాత్మ వివరములను భీష్ముడు ధర్మరాజునకు చెప్పుట.

14. అనుగీత:- అశ్వ॥ ప॥ 16టు 20 అధ్యా॥ వెనుకటి భగవత్ గీతలోని వివరములు తిరిగి బోధింపుమని అర్జునుడు కోరగా శ్రీకృష్ణుడు తెల్పిన విజ్ఞాన విషయములు. సిద్ధకాశ్యపుల సంభాషణ రూపమైనది.

15. బ్రాహ్మణగీత:- అశ్వ॥ ప॥ 21 అధ్యా॥ ఒకానొక బ్రాహ్మణ దంపతుల సంవాదరూపమైన విజ్ఞానము. శ్రీకృష్ణుడు అర్జునునకు తెల్పుట.

పైన నుదహరింపబడిన రెండు నుండి, పదిహేను వరకుగల గీతలలోని విషయములు ఆయా ప్రదేశములకు సమయమునకు వక్తలకు, శ్రోతలకు ఉచితమైయున్నవి. ఇంక ఈగీతలన్నిటికంటె ప్రశస్తియు, పవిత్రతయు గాంచిన మొదటిదౌ భగవత్ గీతయొక్క సన్నివేశ ఔచిత్యములను వివరింపవలసి యున్నది.

## శ్రీభగవద్గీత - ఔచిత్యము

గీత గేయమా? వేదాంతశాస్త్రమా?

ఏగ్రంథముయొక్క ప్రాశస్త్యము గాని, మహిమ గాని దాని ఔచిత్యమును అనుసరించు నదే ఔచిత్యము దేశ, కాల, పాత్ర స్వస్వరూపములవలన నెలయును గదా! ఈ సందర్భ సన్నివేశములు శ్రీ భగవద్గీతకు ఎట్టివి? దేశము- ప్రదేశము-యుద్ధభూమి.

శ్లో॥ ధర్మక్షేత్రే-కురుక్షేత్రే - అనగా క్షాత్ర ధర్మ పరీక్షకై కురువీరులు నిర్ణయించుకొనిన యుద్ధభూమి-కాలము -యుద్ధమునకై (యుయుత్సవః) ఉత్సాహము గలవారై (సమవేతాః) వీరులు తారసిల్లిన సమయము.

3. పాత్రలు-రాజ్యములు - రాజుల భరణ వసువులా? అవి విభాజ్యములా? అవిభాజ్యములా? అను సమస్య రణముచే గాని పరిష్కారము కానట్టి స్థితి ఏర్పడగా, కౌరవ, పాండవపక్షములలో ఐక్యము కల్పించలేని యుద్ధసన్నద్ధులై వచ్చి తుములములో శంఖారావములచేత తమ సేనలను వ్యూహములుగా తీర్చినట్టి ద్వాపర యుగాంత వీరవరుల పాత్రాగమము.

4. స్వస్వరూపము - గీత-అనగా గేయము- పాట - గానయోగ్యమైనది. పై దేశ, కాల, పాత్రలు మూడింటికి తగియుండవలసిన గేయ గ్రంథమా శ్రీ భగవద్గీతయొక్క స్వస్వరూపము ఎట్టిదిగానుండుట తగును? గీత గేయముగనా? వేదాంతశాస్త్రముగనా? శ్రీ భగవద్గీతను వివరించు వ్యాఖ్యానములు అనేకములు. మరి త్రియు కర్ణు-తిలకు-బిసెంటు-గాంధి-మొదలగు మహనీయులు. అనేకులచే రచింపబడినవి. ఈ గీతా వివరణములు అన్నింటిలో శ్రీ భగవద్గీత వేదాంతసారమౌ గ్రంథముగనే భావింపబడినది.

గీతయందు గానయోగ్యమైన సంగతులు ఏవి కలవు? సన్నివేశమునకు తగిన వీరరసపోషణము ఎట్లు సమన్వయింపబడినది? వీరరసప్రధానముగా నుండతగిన గీత వేదాంతపరిభాషలో నుండుటకు కారణము ఏమి? అను ప్రశ్నలను వేసికొని ఎవరును సమాధానములను నిర్వచించి నట్లుగాని ఈ దిగువ సందర్భములను స్పష్టముగా గుర్తించి నట్లుగాని తెలుచు కనుపించదు.

అర్జునుడు మహాయోధుడు. ఇదివరకే చాల సార్లు కౌరవులపై యుద్ధము చేసినవాడే. అయినను మహోత్కృష్టమౌ ఈ తుది మహాసంగ్రామమున.

అ॥ వి॥ యో॥ శ్లో॥ 21 సేనయోరుభయోర్మధ్యే ।
రథంస్థాపయ మేఽచ్యుత ॥

శ్లో॥ 22 యావదేతాన్నిరీక్షేఽహం ।
యోద్ధుకామానవస్థితాన్ ॥
కైర్మయాసహ యోద్ధవ్యమ్
అస్మిన్ రణ-సముద్యమే ॥

వ॥ ఓ అచ్యుతా! నాపై యుద్ధము చేయ వచ్చు మొనగాండ్లు ఎవరో చూచెదము. రెండు సేనల మధ్యకు రథమును తోలి నిలుపుము అని మహోత్సాహముతో పోయి

అ॥ వి॥ యో॥ శ్లో. 28 కృపయాపరయాఽఽవిష్టో
విషీదన్నిద మబ్రవీత్ ॥

అర్జున ఉవాచ॥ దృష్ట్వేమం స్వజనంకృష్ణ ।
శ్లో. 31. నచ శ్రేయోఽను పశ్యామి
హత్వాస్వజన మాహవే

వ॥ అర్జునుడు స్వజనమును యుద్ధభూమిలో చూచి కృపాపరవశుడై క్షాత్ర ధర్మమైన శౌర్యమును మరచి బావా! కటికివానివలె అర్థకాంక్షపై ఈ మన బంధువులను చంపజాలను అని నిరసిల్లెను.

అ॥ వి॥ యో॥ శ్లో॥ 47. ఏవముక్త్వాఽర్జునస్సంఖ్యే
రథోపస్థ ఉపావిశత్
విసృజ్య సశరం చాపం
శోకసంవిగ్న మానసః

ఇట్టి భావమును-ఇట్టి తరుణమున మనస్సును ఆక్రమింప నిచ్చినయెడల ఏ యోధుడును యే యుద్ధమునను - ధీరతతో, ధీరోత్సాహముతో పోరాడజాలడు. ఏలయన ఉదారహృదయమునకు మానవలోకమంతయు బంధువులు స్వజనులే. కావున అట్టి ఉత్కృష్ట తరుణమున అర్జునుని శౌర్యోన్ముఖునిగా చేయుటకే శ్రీకృష్ణ భగవానుడు మహోత్సాహకరమైన వీరగానమును గావించెను. అదియే భగవత్ గీత.



# గోదాఽష్టోత్తర శతనామ స్తోత్రం

ఉపన్యాసభూషణ రామాయణ రత్నాకర శ్రీ ఉ. వే. శ్రీమా. విద్వాన్ కాంద్యూరి రామానుజాచార్య స్వామి సంపాదితము.

గోదా గాథాప్రథా శ్రీదా వేదాంతార్థసుబోధినీ।
యశోదాతిశయాఽమోదా గోవిందో
ద్వాహనోత్సుకా॥

పురః పురావతారాచ మనుజోద్వాహనాక్షమా।
మహోత్సాహసుతా మాన్యా తులసీతరుమూలజా॥

అయోనిజాఽనంతగుణా నియస్త్రీనిఖిలప్రదా।
ఆషాఢమాససంజాతా పూర్వఫాల్గునభోద్భవా॥

రమ్యారితుణా సంజాతా నవ్యా నాయకనాయికా।
నానాయికోత్సుకా నిత్యా నామకీర్తనతత్పరా॥

గోపీవ్రత సముద్యుక్తా సహనా తాపహారిణీ।
భూదేవీ భూతిదాత్రీచ భూరిదాసూరిభూషణా॥

స్వోన్వాహకామవినయా రంగరాజకుతూహలా।
రంగరాడంతరంగజ్ఞా సుందరప్రార్థనాతురా॥

దాసాభీష్టప్రదాత్రీచ నాసికాభరణోజ్జ్వలా।
పాపహంత్రీ తాపహర్త్రీ కూపదర్పణదర్శనా॥

పీతాంబరానిలాసక్తా తులసీ ధరణోత్సుకా।
కృష్ణపాదరజోధాత్రీ కృష్ణోష్ఠాఽమృతపాయినీ॥

కృష్ణవిశ్లేషాఽసహనా కృష్ణాఽలింగనభావనా।
జ్ఞానభక్తిస్తనాకారా కృష్ణార్పిత పయోధరా॥

కామదేవస్తోత్రికామా రామానుజసహోదరీ।
క్షేమంకరీ క్షామహర్త్రీ శ్యామాఽరామ
పరాయణా॥

స్వామినీ స్నానకుతుకా శ్రీమతీ శ్రీమహారిణీ।
శంకాహీనా శంఖపరా శంఖధ్యానమనోహరా॥

కృష్ణవిశ్లేషరోగార్తా కృష్ణవిశ్లేష సంభ్రమా।
సువర్ణఖ్యాతపీఠస్థా సువర్ణాఽవయవాన్వితా॥

సర్వగంధా సర్వరసా పుష్పసౌగంధ్యదాయినీ।
ఉత్తమస్యందనారూఢా పరమోత్తమభాషిణీ॥

వైవాహిక స్వప్నతోషా వివాహాచారబోధినీ।
వెంకటేశోత్సవానందా వేదాంతోదంతభాషణా॥

గోపచిత్రానుకారాచ గోపవేషసుభూషణా।
నీళాప్రబోధకుతుకా నీళారక్తాద్భుత ప్రియా॥

నందాలయ ద్వారస్థ నమ్మానందబోధనతత్పరా।
నీలమేఘక్రియాసక్తా వ్రతోపకిరణాగ్నినీ॥

చక్రభానుఘనానందా శంఖనాదాభితోషిణీ।
త్రివిక్రమ మహోత్సాహా శరవద్వర్ష సాక్షిణీ॥

వర్షాఽసక్తా వంధ్యవసూః వామనస్థిరమానసా।
వసుధా వసుదా వేద్యా వరదా వైష్ణవాశ్రయా॥

పుష్పకేశీ పూర్ణలేఖా పుణ్యాపూర్వసుభాషిణీ।
పూజ్యా ప్రజ్ఞాప్రధానాచ యమునాతీరకాంక్షిణీ॥

కృష్ణాశ్రయా కృష్ణబలా కృష్ణాధీనమహోదయా।
శిష్టాచారైకరతా బహిరంతర్గ్నివాసినీ॥

రంగగోపాల మహిషీ రంగరాడంఘ్రిశేముషీ।
రంగరాట్ తత్త్వవిదుషీ రంగరాడ్వాసతాకృషిః॥

☞ యీ గోదాష్టోత్తర శతనామావళి జ్యేష్ఠమాస పత్రికలో చూడండి.

శ్రీమతే రామానుజాయనమః

# ఆర్తి ప్రబంధము

అనువక్త:
కందాళ జగన్నాధాచార్యులు
మంచరియాల.

(ఆంధ్ర పద్యానువాదము)

ఈ దివ్యప్రబంధమును పరమోదారులగు శ్రీమణవాళ మహామునులు శ్రీ ఎంబెరుమా నారుల విషయమై భక్త్యతిశయముతో వారిపట్ల తమకుగల ఆర్తినంతను ప్రకటించుచు ద్రావిడ ఛందోబద్ధముగ రచించిరి. ఇయ్యది 60 పాశురములతో నలరారు దివ్యప్రబంధము. ఇది ఉడయవరుల వైభవమును బహుభంగుల చాటుచున్నది. రామానుజీయులకు నిత్యానుసంధేయ మగు నీదివ్య ప్రబంధమును నైజాం ఇలాకా మంచరియాల వాస్తవ్యులైన శ్రీ ఉ. వే. శ్రీమాన్ కందాళ జగన్నాథాచార్యస్వామివారు మృదుమధుర శైలిలో నాంధ్రీకరించి భక్తలోకమునకు ప్రసాదించి మన కార్యాలయమునకు అందజేసిరి. దీనిని మతాభిమానులెల్లరు అనుసంధించి ఆనందించి తరింతురుగాక యని యథావకాశముగా నిచట ప్రకటించుచున్నాము.

తేన్ పయలుం

జ్ఞానమధుష్యంది సుమమాలికను ధరించు
శ్రీయతీశుని పాదరాజీవయుగళి
పై నధిక భక్తితమకు సోప్పారపాము
రులకు నైతము జ్ఞానంబు గలుగునట్లు
సుతికమున దేల్చు ద్రవిడ శబ్ద తతివరవ
రమునియై వచ్చి యీకృతిన్ రచనజేసె. ౧

వమ్బవిళ్

నవవికచ పుష్పహారమండన తనుండు
దారమణ వాళమునిపతి ధాత్రియందు
కాలునిర్వాక నిత్య ముక్తానుభావ్య
మై యొసగునట్టి వైకుంఠ మరుగ నార్తి
మునుగొన యతీంద్రు పద్మయుగమును దలంచు
చానతిచ్చెను మనకమూల్యార్థకృతిని. ౨

వాళియెతిరాజ

యతిపతికి మంగళము యతిపతికి మంగ
ళము యతిపతికి శుభమంగళం బటంచు
మంగళా శాసనము జేయు మహితులెవరో
వారికట్టు లాశాసించు వారలెవరో
వారికానతు లెవ్వారో వారునిత్య
సూరి నిర్వాహకులటంచు పేరుగాంతురు. ౩

ఇరామానుశా

శ్రీయతీశునకే నమస్కృతి యొనర్తు
నని మనుజులతో క్షణమైన జెలిమి
కూడదని ప్రేమించువారి యడుగులను జేరు
వారిపాదములన్న మోహాక మిడెడు
వారు సూరుల నిత్యసంపదలుగారె. ౪

తన్ దైనల్ తామ్

తండ్రి మేల్తల్లి భార్యయు తనుజులును బ్రి
వృద్ధసంపత్తి మాదృశ వితతికీవె
యనెడి తలపున జేరని తనువు నిపుడు
ఛేదన మొనర్చి నన్కృపనాదరించ
కుంటిరే హేతువో తెల్పుడో యతీశ, ౫

ప్రశ్నోత్తరములు

# శ్రీ కృష్ణజయంతి - శ్రాద్ధాదికము

కాంచీపురములో వేంచేసియున్న శ్రీ ఉ. వే. శ్రీమాన్ ఆ. తి. కొ. వెంకట తాతాచార్యులయ్యవార్లంగారు ఈ ప్రమాణము లను తెలుపుచున్నారు.

శ్రీకృష్ణ జయంతి దినమున పితృశ్రాద్ధాదికము తటస్థించినచో దాని నెటుల నిర్వర్తించ వలయునని చాలమంది ప్రశ్నించుచున్నారు. ఇందును గురించి శిష్టాచారముల నేకవిధములుగ యున్నది.

1, కొంతమంది మామూలు ప్రకారముగ రాత్రికాలమువరకు యుండి రాత్రి శ్రీకృష్ణ జయంతి వుత్సవమును జరిపించుకొని తాము ఆ రోజంతయు కూడ ఉపవాసముండి మరుచటి దివసమున పితృకర్మాదులు జరుపుట గలదు.

2. మరికొంతమంది నక్షత్రదర్శనము వరకు యుండి అపుడు శ్రీకృష్ణజయంత్యుత్సవమును జరుపుకొని వెంటనే పితృశ్రాద్ధాదికముల జరిపించుట గలదు.

3. మరికొంతమంది మామూలుగ ఉదయమున పితృశ్రాద్ధాదికమునుజరిపించుకొని తాము మాత్రము ఉపవాసముండి తాము రాత్రి శ్రీకృష్ణోత్సవమును జరిపించి తాము పారణచేయుట గలదు.

4. మరికొంతమంది శ్రీకృష్ణ జయంత్యుత్సవమును ఉదయముననే జరిపించుకొని 2 ఝాములైన పిమ్మట కుతపకాలమున పితృశ్రాద్ధాదికములు జరిపించుట గలదు. ఇటుల అనేకు లనేక పద్ధతులు అమలు జరుపుచున్నారు.

వీరిలో ఏది యుక్తము అని విచారించగా మొదటి మూడు పక్షములకంటె చివరిదైన నాలుగవ పక్షమే యుక్తమైనదిగ తోచుచున్నది.

శ్రీకృష్ణజయంత్యుత్సవమును విద్యుక్త ప్రకారము జరిపించవలె నన్నచో అర్ధరాత్రివరకు ఉపవాసముండి అర్ధరాత్రి అయినపిమ్మట పెరుమాళ్ళకు అర్చనజేసి ఆరగింపు సమర్పించి మంగళాశాసనమును జేసి తిరునక్షత్ర తనియ విన్నపమును జేసి చాత్తుమొఱ అయినపిమ్మట తీర్థ ప్రసాద స్వీకరణము జేయవలయును.

ఇవన్నియు అగునప్పటికి ప్రసాదస్వీకరణ సమయమునకు అర్ధరాత్రి దాటిపోవును. రాత్రి 12 గంటల యనంతరము మంచితీర్థమునైనను తీసుకొనకూడదు అను సామాన్య శాస్త్రము ననుసరించి కొంతమంది అపుడు పెరుమాళ్ళ తీర్థమును మాత్రము తీసుకొని మర్నాడు మాత్రమే ప్రసాదమును స్వీకరించుట కలదు. కాని కొందరు శిష్టులు భగవదారాధన యనునది భగవన్నివేదిత తీర్థప్రసాద స్వీకారముతోగాని పూర్తికాదను విశేషశాస్త్రము ననుసరించి నిశీథ నిషేధరూప సామాన్యశాస్త్రమును వదిలి ఎంత రాత్రి గడచినను కూడ భగవన్నివేదిత తీర్థ ప్రసాదముల స్వీకరించుట కలదు. ప్రపన్నులకు ఈ విశేష శాస్త్రానుసరణమే యుక్తము.

ఇది సామాన్యముగ శ్రీకృష్ణ జయంత్యుత్సవ విధానము.

ఇక యీరోజున పితృశ్రాద్ధము తటస్థించి

నచో ఏమి చేయవలయునో విచారింతము.

ఏకాదశినాడున్ను ఆశౌచాదులు తటస్థించి నపుడున్ను తప్ప మిగత ఏ కాలమునందుకూడ పితృ మృత తిథినాడు పితృశ్రాద్ధమును జరిపించుట మానరాదనియు అట్లుమానుట ప్రత్యవాయ జనకమనియు శాస్త్రములు తెలుపుచున్నవి.

ఈ స్థలములయం దెచ్చటను కృష్ణాష్టమినాడు తటస్థించిన పితృశ్రాద్ధమును ఆనాడు మానివేసి మర్నాడు చేయవలయునని విధి కనుపించదు. గాన మొదటిపక్షము యుక్తియుక్తముగ లేదు. శ్రీకృష్ణజయంత్యుత్సవమును అర్ధరాత్రి సమయమున నాచరించవలయునని విధియుండగా తమ యానుకూల్యమునకై నక్షత్రదర్శన కాలముననే దానిని జరిపించుటయు న్యాయముకాదు. ముఖ్య కాలమును విడుచుటకు అంగీకరించినపుడు ఆ ఉత్సవమును ఉదయముననే ఏల చేయరాదు. నిశీథత్వసామ్యమాత్రమునకే మన స్తృప్తి నొందదతలచినను ఉత్సవానంతరము పితృశ్రాద్ధము నాచరించు సమయమునకు ఎట్లైనను బాగుగ చీకటి పడును. నిశీథ శ్రాద్ధాచరణ నిషేధము తగులుక మానదు, అందుచే వ్రతకాల పరిత్యాగము శ్రాద్ధనిషేధకాలానుష్ఠానము అను రెండు దోషములు కూడ తటస్థించును. గాన రెండవపక్షముకూడ యుక్తియుక్తముగ గనుపించదు

మూడవపక్షముకూడ యుక్తముగ తోచదు. ఏలయన :—

శ్రీకృష్ణ జయంత్యుత్సవ మనునది వైష్ణవుల కత్యంత ముఖ్యమైన విధాయకమైన ఉత్సవ విశేషము,

ఆనాడు ఆ ఉత్సవ విశేషార్చ నారాధనాదికముల జరుపకుండగ పెరుమాళ్ళకు ఉదయమున మహానివేదమును సమర్పించుటయు దానినే పితృదేవతలకు (భోక్తలకు) సమర్పించుటయు తానుమాత్రము రాత్రివరకు యుండి తిరిగి రెండవ పర్యాయము మహానివేదనము ఆరగింపుజేసి ఉత్సవమును పూర్తిజేసుకొని అప్పుడు మాత్రమే తీర్థప్రసాదములు స్వీకరించుటయు అంతయుక్తముగ తోచదు. మరియు శ్రాద్ధకర్త పితృశేషమును మాత్రమే స్వీకరించుట కుదురదు. పితృశేషముగాని భగవన్నివేదిత ప్రసాదస్వీకరణ మప్పుడు. భోక్తలకు నీ వుత్సవ ప్రసాదస్వీకరణ ఆనాడు లభ్యపడదు. అందుచే యీ మూడవ పక్షముకూడ పూర్తిగయుక్తమనుటకు వీలులేదు.

ఇక నాలుగవ పక్షము మాత్రమే విశేష విధిచే యుక్తమని తోచుచున్నది. ఇందు ఉత్సవ ముఖ్యకాల పరిత్యాగ రూపదోషము తటస్థించినను గౌణకాలమున (మధ్యాహ్నముననే) ఉత్సవము జరిగించుటచేతను భోక్తలకు ఉత్సవ ప్రయుక్త భగవద్విశేషార్చనారాధనల పూర్తి జేసి తత్తీర్థ ప్రసాదములనే వినియోగించుట చేతను తానుకూడ పితృశేష రూపమును కూడ నొందిన ఆతీర్థప్రసాదములనే స్వీకరించుటచేతను పితృమృత తిథిని విడువకుండుటచేతను మిగత పక్షములన్నిటికంటెను ఈపక్షమే యుక్తియుక్తము ఆచారణీయమున్ను శిష్టసమ్మతమున్ను అయియున్నది.

దీనికి ధర్మశాస్త్రమున యిట్టుల ప్రమాణము కలదు.

శ్రీ జయంతి దివసాగత శ్రాద్ధకర్తవ్య విధిః లిఖ్యతే.

జయన్త్యా మేవ కృష్ణస్య । విహితా నిశి పారణా।
పితు శ్శ్రాద్ధం కథం కుర్యా న్మధ్యాహ్నే విహితే సతి ।

సర్వాసు చ జయంతీషు।మృతాహే సముపస్థితే।
జయంతీ కౌ తు కసుపి । సంచితె తు విధీయతే
తతః పరం పితు శ్శ్రాద్ధం । మధ్యాహ్నేషు సమాచరేత్ ।
దివసస్యాష్టమే భాగే । యథా మందాయతే రవిః
సకాలం*కుతపో జ్ఞేయఃపిత్యాణాం దత్తమక్షయం
(స్మృత్యర్థసారే)
అజ్ఞశ్చేదతి వేధాయాం ఆపత్ బ్రహ్మవిచ్ఛయః
సంకల్పేన విధానేనకుర్యాచ్ఛ్రాద్ధం న పార్వణం

* కుతపకాలమనగా సామాన్యముగా పగలు 18 ఘటియలనుండి 24 ఘటియలవరకు మధ్య యున్న కాలము.

# శ్రీ యతిరాజ భజన కీర్తనములు

కవితావతంస, గానకళానిపుణ, హరికథా చతురానన
శ్రీ ఉ. వే. శ్రీమాన్ కరి నారాయణాచార్య భాగవతార్.

దేశి — చతురస్రగతి

అబితేరెసివా కోనుమెరె అనుదానివలె

ప॥ శ్రీభాష్యకార భవవిదూర భక్తమందారా నీ
పాదపద్మదాసులమగుమమ్ముఁబ్రోవరా రా శ్రీ ॥భాష్య॥

అ॥ దూష్యమా భవాబ్ధిమునిఁగి దొరలుచుంటిమి (బహు) మా
దుష్టచేష్టలన్నియుఁగృపతోక్షమింపుమా కనికరముంచి బ్రోవుమా! సుమ
భూష్యమాభవత్పదాబ్జపూజలొసఁగుమా!
కనుమా!వినుమా!యనుమానమా!మహాత్మ!మమ్మనుగ్రహింపుమా! ॥శ్రీ

2 కరుణింపుమోకృపానిలయా! కాంతిమతేయా!
శరణనుచునిన్నునమ్మితిమో! సద్గుణాలయా!
పరిపూర్ణ విశ్వమానవసౌ భ్రాతృభావమున్
బరమార్థతన్ దలంచియెల్ల వారికాదృతిన్ బరమాశ్చర్యమాగతిన్
వరమంత్రరాజమొసఁగి కీర్తిఁబరగినావహో!
కరుణాభరణా! కరినారాయణార్యవినుత! కావఁగరారా! ॥శ్రీ భా॥



## నారీ విభాగము



శ్రీమతే రామానుజాయ నమః

# తిరువాయ్ మొళిలో 6వ పదిలో 7వ తిరువాయ్ మొళిలో
# మొదటి పాశుర భావము

శ్రీమతి నంబూరి ఆనందమ్మగారు

ప్రబంధమంతా లాపాయల్లు ఆలాగ యంటుళ్ళోనే దివ్యదేశములన్ని పాడినారు. గాని అచ్చట క్షేత్రమహిమలో ఇటువంటి ప్రశక్తే లేదు. శ్రీరంగము పాడినారు. అంటే శ్రీవైష్ణవుడెలా వుండాలి. భక్తితో కూడిన ప్రపత్తా లేక శూన్యప్రపత్తా. ఆభక్తివుపాయమా లేక ఉపాయశూన్యమా అనే విషయాలతో స్వార్థత్యాగమైన భక్తితో చూపిన ప్రపత్తే శ్రీవైష్ణవలక్షణమ్ అనే విషయాన్ని ప్రకటించుచుతూ శ్రీరంగము పాడేరు. ఇంక తిరుమోగూరిలో అర్చావతార వైభవమును ప్రకటించుతూ ఆ అర్చావతార ఉపాయమని సాయించుచుఇచ్చట ఈలీలావిభూతిలో ప్రకృతిలో వున్నంత కాలమే కాకుండా ఈ ప్రకృతి విముక్తానంతరము కూడ విరజానదిలో స్నానము చేశే పర్యంతము అర్చిరాది మార్గములో కూడా అర్చాస్వరూపమే సహాయము అన్న సంగతి విపులముగా ప్రకటించినారు.

ఇక ఈ తిరువాయ్మొళి ఉణ్ణుంశోరులో పరమాత్మని తూక్కో విరక్తో ఆ పరమాత్మని అనే ఈ ఉపనిషదర్థాన్ని పరమాత్మని ప్రేమించినవాడు ఇతర విషయములను ప్రేమింపలేడు అనే వేదాంత అర్థమును ఈ తల్లిగారి పాశురము ద్వారా వెలిపరుస్తున్నారు ఆళ్వార్లు. ఇక గ్రంథ విస్తర బీతి అవుతుంది గనుక పాశుర భావములలోకి వచ్చి కొంచెము సేపు చర్చించుకొని ఆనంద పడుదాము. మన నమ్మయ్యా తండ్రి నాయికావస్థ పొంది వాళ్ళ తల్లిగారి దగ్గర ఒకటి మారాము చేయుట మొదలు పెట్టినారు. ఏమని

పాలనా యేళులగుండు పరివిన్ని ఆలిలై యన్నవళంశెయ్యు మణ్ణాలార్
తాళినమేలణి తణ్ణన్దు ళాయెన్నే మాలు మాల్ వల్వినైయేన్ మడవల్లియే

అన్నట్లు ఏనాడోవటపత్రశాయి లోకములన్నీ బొజలో పెట్టుకొని పవళించిన

వటపత్రశాయి పాదపద్మములపైన వున్న త్తిరత్తుళాయ్ కావాలని, తల్లిగారు మాత్రము ఎలా తెస్తారు చెప్పండి అర్చావతారములో వేంచేశివున్నస్వామి తిరువడిలో సమర్పించిన తిరుత్తుళాయ్ గనుక నా కోరిక తీర్చుటకు కాలాతీతమయిపోయి సదా మైను కాలాతీతమయిన విషయములు కావాలంటే ఎవరితరము. వీరు అదే కావాలని దుఃఖపడి ఏడ్చి ఏడ్చి మూర్ఛపొంది దేహము తెలియకుండా పడుకొన్నారు. ఇక తల్లిగారికి చాలా బాధ కలిగి ఆమె దుఃఖము పొందుతూ అయ్యో ఆ వటపత్రశాయి కొరకు నా కూతురు తన దేహకాంతి పోగొట్టుకొన్నది. ఆదిపోగొట్టు కున్నది. ఈ గాజులు పోగొట్టుకున్నదని కుమార్తె స్థితికి జాలిపడుతూ దుఃఖపడి ఆమె కూడా మూర్ఛపొందేరు. ఈమె మూర్ఛపొందగానే ఆళ్వార్ నాయకి కుమార్తె గారికి తెలివి వచ్చినది. ఎలా తెలివి వచ్చిందంటారేమో మూర్ఛపొందినవాని మొఖముపై చల్లని నీరు జల్లితే తెలివి వచ్చినటుల ఈమె తల్లిగారి ఏడుపులో ఆ సర్వేశ్వరుని కొరకు దేహకాంతి గాజులు మొదలైనవి పోగొట్టుకొన్నది. అనిగదా దుఃఖపడ్డారు. ఆ దుఃఖములో సర్వేశ్వరుని తిరునామ ప్రసక్తి వుండుటచేత అదే ఈమె మూర్ఛకు శిశిరోపచారమైతే లేవగలిగారు. లేచి ఇక నేను ఇచ్చట వుండ లేను. నా మనస్సు పోయినవద్దకే నేను పోతాను అంటూ "లక్ష్మణేనగతాంగతిం" అని లక్ష్మయ్యను విడచివుండలేక రామయ్య తండ్రి వెంటనే సరయు నదిలో మునిగినటుల వీరు మనస్సు పోయిన తిరుక్కోళూరుకి వెళ్ళిపోయారు. దీనివలన తేలిన దేమయ్యా అంటే ఇన్నిదినాలుగా ఎవరూ ఎరుగకుండా క్షుద్రవిషయానుభవములకు పోయెడు జీవాత్మ ఇప్పుడు ఎవరూ ఎరుగకుండా పరమాత్మ వద్దకు పాఱిపోయే స్థితిలోకి వచ్చాడు అనే విషయము చెప్పబడుచున్నవి. "మాట్పాల్ మనం శుళిప్ప మంగైయర్ తోళ్" నిధినని శ్రియఃపతిపైకి నా హృదయము వెళ్ళిపోయినది. ఆభోగ్యత కీడుపడిపోయి స్త్రీల భుజముల సౌందర్యము విడచివేశినాను అని తిరుమంగై మన్నన్ పాయించినటుల వీరు పరమాత్మని యోరక్తో విరక్తో ఆ పరమాత్మని అనే వుపనిషదర్థమును ఈ రూపముగా తెలుపుడు చేస్తున్నారు. సరి వీరు పడకవిడచి తిరుక్కోళూరుకి వెళ్ళిపోయినారు. బాగానేవుంది. ఇక వీరితల్లిగారి అవస్థచూద్దాము. వీరు అటు వెళ్ళగానే ఈ తల్లిగారికి మూర్ఛ నుండి తెలివి వచ్చింది. ఎంతసేపూ కుమార్తె దృష్టికదూ, చూచారు. కుమార్తె లేరు. ఇల్లంతా పాడుపడిపోయి నటులవున్నది. ఆళ్వార్ నాయకి లేకపోవుటచేత శ్రీరాఘవులు తమ్మునితో జానకితో అరణ్యమునకు వెళ్ళిపోతే అయోధ్యలో వుండే దశరథుని బంగళా ఎలావుందయ్యా అంటే (పుత్రద్వయహీనంతత్) దశరథులకి రామయ్యమీదనే ప్రాణము ఎంత వెతికినా మేడలో కనుపడ లేదు. రామలక్ష్మణులు దాంతో చాలా బాధపడ్డారు, ముసలిరాజు పోనీ 4 దినాలు పోయాకయినా వస్తారేమోనని ధైర్యముగా వుందామంటే (స్నుషయాచ వివర్జితమ్) వాళ్ళ వస్తువుండే ఆ వస్తువ కోసరమైనా వస్తారని ఆశయినా లేకుండా కోడలిని కూడా తీసుకొని వెళ్ళిపోయినారు గదా ఇక వచ్చేదేమిటి, (అపశ్యద్భవనంరాజా నష్టచంద్రమివాంబరమ్) చంద్ర సూర్యులు లేక . నక్ష

త్రిములు లేక శూన్యమైన ఆకాశము ఎలావుందో ఆ విధముగ కొడుకులు లేక కోడలు లేక వున్న మేడను చూచి ధశరథులు దుఃఖము పొందునటుల వీరు కూడా తమ కుమార్తె లేని ఇంటిని చూచి దుఃఖపడుచున్నారు. సీతా పిరాట్టి (సర్వాన్ భోగాన్ పరిత్యజ్య భర్తృస్నేహ బలాత్కృతా అచింత యిత్వా దుఃఖాని ప్రివిష్టా నిర్జనంవనమ్) అన్నట్టు ఈ రాఘవులయందు వుండే ప్రీతిచేత సమస్త భోగములు విడిచిపెట్టి ఘోరకష్ట పరంపరలకు కారణమైన అరణ్యములకు వెంబడించి వెళ్ళి పోయిన జానికి దేవి మాదిరిగా నా కుమార్తె తిరుక్కోళూరెంబెరుమానుని యందు వుండే ప్రేమ చేత నన్నూ నా దుఃఖమునైనా విచారించకుండా వెళ్ళిపోయినదని బాధపడుచున్నారు. పూర్వము మన ఆళ్వందారు గోష్టిలో ఈ పాశురము కాలక్షేపము జరుగుతూన్నప్పుడు శిష్యులని ఒక ప్రశ్న వేశారు. యేమంటే ఈ ఆళ్వార్ నాయకి గారి తల్లి దుఃఖము ఎక్కువా లేక తిరుమంగ ఆళ్వార్ల తల్లిగారి దుఃఖము ఎక్కువ అని అంటే వారి శిష్యులు సమాధానము చెప్పినారుగదా తిరుమంగ ఆళ్వారుల తల్లిగారికి అంత దుఃఖముండదు. ఎందువల్లనంటే వాడే వచ్చి స్వయముగా తీసుకొని వెళ్ళుటచేత ఈమె ఒంటరిగా వెళ్ళినారు గనుక ఈ తల్లిగారికే ఎక్కువ దుఃఖమని గాన దీనికి యామునాచార్యులవారి సమాధానమేమంటే వాడు వచ్చి తీసుకొనివెళ్ళాడు గనుకనే తిరుమంగై యాళ్వారునాయకి తల్లి గారికి దుఃఖము ఎక్కువ కారణమేమంటే ఉభయులకూ ఒకరిని చూస్తే ఒకరికి వళ్ళు తెలియదు. ఒకరినొకరు చూచుకుంటూ ఆనందముతో శరీరము మరచి తిరునగరికి పోక దండకారణ్యమునకు పోతే అచ్చట శూర్పణఖ వస్తే ఎలాగ అని ఆమె భయము. ఈమె వంటరిగా వెళ్ళుట వలన తిన్నగా తిరుక్కోళూర్ కే వెళ్ళుతారనే ధైర్యము ఈ తల్లిగారికి అని సమాధానము చెప్పినారు.

[సశేషం]

# తిరుక్కోళూర్ పెణ్పిళ్ళై రహస్యము

రచయిత: శ్రీమద్భాగవత సాపిరేయుభు, మదరాసు.

## నాలాయిరం

అ॥ అవన్ శిరియనెన్రినో ఆళ్వారై ప్పోలే ।

తె॥ అతడేపిన్న అని అన్నానా ఆళ్వార్లవలె॥

౭

పెరి. తి॥ పా॥ శిరియనెన్రు ఎన్నిళం శింగత్తైయుగ్గేల్ కండాయ్ ।
శిరుమైయిన్ వార్తైయైమావలి యిడం శెన్రుకేళ్ ।
శిరుమైప్పిళ్లై కొళ్ళిల్ నీయుమున్ తేవైక్కురియైకాణ్ ।
నిర్గ్ఞమది! నెడుమాల్ విరైందున్నై క్కూపుగిన్రాన్ ॥

అని పెరియాళ్వార్లు అనుభవించియున్నారు.॥ నమ్మాళ్వారున్ను తిరువాయ్ మొళిలో

తి. వా. మొ॥ పా॥ అరివినార్క్కరైవిల్లా వకల్ఞాల త్తవరఱియ ।
నెఱియెల్లా మెడుత్తురైత్త నిఱై ఞానత్తొరుమూర్తి ।
కుఱియమాణురువాగి క్కొడుంగోళాల్ నిలంకొండ।
కిఱియమ్మాన్ కవరాద । కిళరొళియాల్ కుఱైవిలమే।

తా॥ అజ్ఞానులకు గోచరమగునట్లు పరిపూర్ణుడును అద్వితీయుడును పొట్టియునగు బ్రహ్మచారియై (బలిని) వంచనచేసి త్రిలోకములను స్వాధీనపఱచుకొనిన వామనమూర్తి అంగీకరింపని కాంతిచే యేమి ప్రయోజనము గలదు.

(3) మధుర కవులు నమ్మాళ్వార్లితో ప్రథమ సంభాషణ.

ప్రశ్న: శెత్తత్తిన్ వయిట్రిల్ శిరియదు పిరందాల్ ఎత్తై త్తిన్రు ఎంగే కిడక్కుం? అని మధురకవులడుగగా నమ్మాళ్వార్లు అత్తైత్తిన్రు అంగేకిడక్కుం అని అప్పుడే వాక్రుచ్చి చెప్పిరి.

తా॥ (మ) అచిత్తుతో జీవాత్మ సంబంధపడియున్నప్పుడు అనగా ప్రకృతి గర్భమున జీవుడు ప్రవేశించి కరణ కళేబరములను కలిగియుండినప్పుడు అనగా (జీవునికి శరీరము వచ్చినప్పుడు) దేనిని అనుభవించుచూ యెక్కడపడియుండునని నమ్మాళ్వారును అడిగిరి.

తా॥ అందుకు నమ్మాళ్వార్లు శరీరగతమగు సుఖదుఃఖాదులను పురాకృత కర్మఫలముల ననుభవించుచు ఆ శరీరమునే ఆశ్రయించుకొనియుండును.

### మరియొక వ్యాఖ్యానము

ప్రశ్న: మధురకవి అళ్వారు: అణురూపుడైన జీవునియందు విభురూపమైన జ్ఞానవికాస మేర్పడెనేని దేనిని అనుభవ యోగ్యముగా గొని యెచటచేరునని అడిగిరి.

ఉత్తరము॥ నమ్మాళ్వార్లు:- అకారవాచ్యుడైన పరబ్రహ్మ ననుభవించి ఆ బ్రహ్మమందే అవగాహించియుండును. అని బదులు జెప్పిరి.

శ్లో॥ పత్యుః శ్రియః ప్రసాదేన ప్రాప్యసార్వజ్ఞ సంపదం ।
ప్రపన్న జనకూటస్థం ప్రపద్యే శ్రీపరాంకుశం ॥

(తి. అ.) నమ్మాళ్వార్లవలె అసాధారణ ప్రజ్ఞ నాకు గలదా?

# ప్రచార విభాగము.

చైత్ర, వైశాఖ మాసాలు

## శాశ్వతనిధికి చందా ఇచ్చిన దాతలు

| | | |
|---|---|---|
| శ్రీ రాణి సీతయమ్మగారు నెలకి 1-0-0 చొ॥ జనవరి మొ॥ 4 మా. | | 4-0 |
| S. T. P. U. కూర్మాచార్యులుగారు | సం॥ కు ([illegible]) | 5-0 |
| రామినీడి రాయలమ్మగారు | రాజమండ్రి | 5-0 |
| నల్లందిగళ్ లక్ష్మీనరసింహాచార్యులుగారు | నూజివీడు | 5-0 |
| సి. హెచ్. శ్రీమన్నారాయణాచార్యులుగారు | తణుకు | 3-0 |
| మహేంద్రాడ వెంకటాద్రినరసింహాచార్యులుగారు | కళింగపట్నం | 12-0 |
| టి. శ్రీనివాసరావుగారు హెడ్ క్లర్కు డివిజనల్ ఫారెస్టు ఆఫీసు | గుల్బర్గా | 4-13 |
| యాదాల పుష్పవల్లి తాయారమ్మగారు | నెల్లూరు | 5-0 |
| నల్లాన్ చక్రవర్తుల రఘునాథాచార్యులుగారు | వేణుగోపాలపురం | 5-0 |
| చిలకమర్రి రంగనాయకమ్మగారు | సికిందాబాద్ | 5-0 |
| ఎమ్. రాఘవాచార్యులుగారు ప్రిన్సిపల్ (S. S. R. కాలేజి) | విజయవాడ | 5-0 |
| మైలవరం రాణిగారు నెలకు 2-10-0 చొ॥ 2 మాసములు | | 5-0 |
| గోమఠం నమ్మయాచార్యులుగారు | పొన్నూరు | 5-0 |
| కె. వెంకటప్పదాసుగారు | నడిగడ్డపాలెం | 5-0 |
| కు. బాపనయ్య | ,, | 5-0 |
| | | 79-5 |

## శాశ్వత నిధికి వాగానము చేసిన దాతలు

| | | |
|---|---|---|
| దాసరి చెలమయ్యగారు | అన్నవరం సం॥ 1కి | 3-4 |
| పోకల బాలకృష్ణరామానుజదాసుగారి కుమారులు<br>పి. శ్రీనివాసరావు రామానుజదాసుగారు<br>ఋ. పి. దీనదయాళుగారు మద్రాసు | నెలకి<br>1-0-0 చొ॥ | 1-0 |
| పీతాంబరం రామానుజాచార్యులుగారు | వడిశలేరు సం॥ 1కి | 1-0 |
| గోవర్ధనం శ్రీనివాసాచార్యులుగారు | పొన్నూరు సం॥ | 5-0 |

## శాశ్వత కైంకర్యము

శ్రీ ఉ. వే. శ్రీమాన్ ధనకుధరం రామానుజాచార్యులుగారు
(శ్రీలక్ష్మీనారాయణపురం రామానుజపేట, గుంటూరు.)

ఈ స్వాములవారు తెనాలి తాలూకా అలపాడు గ్రామవాస్తవ్యులు శ్రీ పాంచరాత్రాచార్యుల ఏక పుత్రులు. అచ్చటి శ్రీ వేణుగోపాలస్వామివారి గోపురప్రాకారవాహనాప తటాకాది పెక్కు కైంకర్యములను చేసిన భక్తాగ్రేసరులు. వీరు 30 ది సంవత్సరములనుండి గుంటూరులోని గోతాలమిల్లువద్ద ఉత్తరముగా 39 సెంట్ల నివేశన స్థలములో శ్రీ లక్ష్మీనారాయణపురమనొక దానిని నిర్మించిరి. అందు రామానుజ కూటము, శ్రీ లక్ష్మీనారాయణ కోవెల, కోనేరుల నేర్పరచి తమ శిష్యదాసాది బృందములతో నివసించుచు కైంకర్యములను చక్కగా నిర్వహించుచున్నారు. ఒక ఆంజనేయాలయమునుకూడ నేర్పరచిరి. ఈ స్వామి వారి కైంకర్య నిర్వహణమునకై సాలీనా 26 బస్తాల ధాన్యము ఆదాయము వచ్చు 2 యకరముల భూమిని అలపాడు గ్రామములోనిది వీరు సమర్పించిరి.

ఇట్టి ఆదర్శప్రాయములగు కైంకర్య ధురంధరులను శ్రియఃపతి సకల సౌభాగ్యపరంపరలతో ననుగ్రహించు గాక !

ఇట్లు,
ఒక భక్తులు (గుంటూరు)

---

## : కృతజ్ఞత :

మన సంఘ తీర్మానమును ఆమోదించి సంఘాభివృద్ధికై శాశ్వతనిధికి విరాళము లొసంగుచున్న భాగవత బృందమునకు మా కృతజ్ఞతా పూర్వకమగు ధన్యవాదముల నర్పించుచున్నాము ఇంతవరకు విరాళముల నొసంగినట్టియు, వాగ్దానము గావించినట్టియు మతాభిమానుల తిరునామముల నిచ్చట ప్రచురించుచున్నాము. విరాళములను పంపించువారు గాని వాగ్దానము గావించువారుగాని వివిరముగా "శాశ్వతనిధికి" అని తెలుపగోరుచున్నాము.

---

## .... గీతా మందిర కార్యక్రమము ....

### (వరదాముత్తియప్పన్ వీథి, మదరాసు 1.)

ఇచ్చట గీతామందిరములో కార్యక్రమము ప్రశాంతముగా జరుగుచున్నది. ప్రతి మంగళ బుధ గురువారములలో రాత్రి గం 6-30 మొ గం 8-0 ల వరకు గీతలోని మొదటి అధ్యాయము ప్రారంభించి ప్రతిశ్లోకమునకు వివిధభాష్య విశేష వివరములతో పండిత పామర రంజకముగా సుబోధకముగా ఉపన్యాసము జరుగుచున్నది. ఇప్పుడు ద్వితీయాధ్యాయము జరుగుచున్నది. పెక్కుమంది స్త్రీలును కొద్దిపాటి పురుషులును యిందు పాల్గొని ఆనందించుచున్నారు.

ప్రతినిత్యము గీతాపాఠ ప్రవచనము కావ్యపాఠమువలె పదచ్ఛేద ప్రతిపదార్థ ఆకాంక్షాది విశేషములతో జరుపబడుచున్నది. ఇందు పదుగురు స్త్రీలు మాత్రమే పాల్గొనుచున్నారు. శబ్దములు సమాసములు అమరము వ్యాకరణ విశేషములు, సంస్కృత సంభాషణ, భాషాన్తరీకరణము మొదలగు సాహిత్యోపయుక్త విషయములు గరుపబడుచున్నవి.

ప్రతీ ఏకాదశికిని ఉదయము సమగ్రగీతాపారాయణము ఇచ్చటి పెరుమాళ్ళ సన్నిధిలో గావింపబడుచున్నది. ఇందు కొలదిమంది మాత్రమే పాల్గొనుచున్నారు.

ప్రతి శుక్రవారం సాయంకాలము శ్రీ లక్ష్మీపూజ, శిరియతిరుమడల్ మొదలగు ప్రబంధ సేవాకాలము ఆరగింపు ప్రసాదవినియోగము ఉపన్యాసములు తిరునామ సంకీర్తనములు గావింపబడుచున్నవి. ఇందు పెక్కుమంది స్త్రీలే పాల్గొని జయప్రదముగా జరిపించుచున్నారు.

ప్రతిదినము రెండు హిందీక్లాసులు జరుపబడుచున్నవి. ఇందు పదిమంది బాలికలు పాల్గొని పరీక్షలకు వ్యాసంగము చేయుచున్నారు.

ఈ జ్యేష్ఠ శుద్ధ విదియనుండి దివ్యప్రబంధము స్తోత్రపాఠములు వారి వారి యోగ్యతానుసారముగ స్త్రీలు పెద్దలు పిల్లలు అందరకు సంథలు చెప్పుట ప్రారంభింపబడును.

## కాలక్షేపములు

ఈ జ్యేష్ఠ బహుళ విదియ మొదలు ద్రావిడ ప్రబంధ కాలక్షేపము పంక్తిమీదనే ప్రతి పదార్థముగా ప్రారంభింప దలంచబడుచున్నది. తిరుమంత్రార్థము, భగవద్విషయము రెండు కక్షలుగా అరుంబద విశేషవివరముతో ప్రతి శబ్దమునకు అర్థజ్ఞానము కలిగి త్వరలో మంచిసాహిత్యము కలుగుతీరున బోధింపబడును. తగిన అధికారు లందుపాల్గొనవచ్చును. పొరుగూరుల నుండి యీ కాలక్షేపములకై విచ్చేయు స్త్రీలకు మందిరములో ఉచితబస ఉచిత కాలక్షేపము లభించగలదు. సాపాటునకు ఎవరికి వారే ఏర్పాటు చేసుకొనవలసియుండును.

ఈ రీతిగా సంపూర్ణ గ్రంథపరిచయము కలిగించి పాఠప్రవచన ఉపన్యాస సామర్థ్యము కలుగజేయబడును. ప్రస్తుత మిచ్చటి కార్యక్రమమునంతను శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘ కార్యదర్శిగారైన న్యాయవేదాంత విద్వాన్ శ్రీ ఉ. వే. శ్రీమాన్ తె. క. గోపాలాచార్యులు గారున్నూ, శ్రీమతి మరంగంటి రంగనాయకమ్మగారున్నూ నిర్వహించుచున్నారు.

తమ తమ సాపాటు ప్రయత్నము తాము నిర్వహించుకొనలేని స్త్రీలకు ప్రస్తుతం కొలది మందికి మాత్రము యీ మందిరమునందే కొన్ని చేతిపనులు యేర్పాటు చేయబడుచున్నవి. అందు దినమునకు రెండు గంటలకు తక్కువగాకుండ పనిచేయువారికి వారి పనిని బట్టి ఆర్థిక సహాయము మందిర నిర్వాహకులచే గావింపబడుచుండును.

ఇందు నాలుగు సంవత్సరములలో ఇంగ్లీషుకాని లేక ఆంధ్రామెట్రిక్ పరీక్షలకును, భాషా విద్యాప్రవీణ ఎంట్రెన్సు పరీక్షలకును లేక కేవల ప్రాచీన పద్ధతిగా గీతపైననే సమగ్ర సంస్కృత సాహిత్య పరిజ్ఞానమును కలుగజేయబడు ఏర్పాట్లు గావింపబడుచున్నవి. విద్యార్థినుల ప్రోత్సాహమును బట్టి యీ ఏర్పాట్లు జరిపించబడును.

ఇందు ఉపన్యాస గోష్ఠికి తప్ప తక్కిన అన్ని విషయములలోను కేవలం స్త్రీలకు మాత్రమే ప్రవేశ మొసంగబడును. పాఠప్రవచనకు కూడ సాధ్యమైనంతవరకు స్త్రీలే వినియోగింపబడుదురు.

వివరములు దెలియగోరువారు ఈ క్రింది అడ్రసునకు 0-2-0ల బిళ్ళలతో
కవరు వ్రాసిన బడయగలరు.

ఈ సదవకాశమును వివేకవంతులగు నారీమణులెల్లరు ఉపయోగపరుచు కొందురుగాక.

ఇట్లు,
మ. చంద్రమ్మ,
శ్రీయతిరాజ సేవా మహిళామండలి కార్యదర్శినీ, గీతామందిరం.
107 వరదాముత్తియప్పన్ వీధి, మదరాసు 1.

# శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘ విజయవాడ శాఖ

స్వస్తిశ్రీ ఖరనామ సంవత్సర ఫాల్గుణ శు ౧౩ ఆదివారము ది 9-3-51 వ తేదీ మధ్యాహ్నము గం 2 లకు విజయవాడలోని నిడుముక్కలవారి రామానుజ కూటమున శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘ విజయవాడ శాశ్వత శాఖను స్థాపించు విషయమై కేంద్ర సంఘ కార్యదర్శియగు అ. చి. శ్రీమన్నారాయణాచార్యులు గారి అధ్యక్షత క్రింద విజయవాడ శాఖ సర్వ సభ్య సమావేశము జరిగినది.

: హాజరైన వారి నామములు :

అ. చి. శ్రీమన్నారాయణాచార్యులు
శివకోటి లక్ష్మీనరసింహము
కూరపాటి రామారావు
నిడుముక్కల శ్రీరామమూర్తి
నందిపాటి రామయ్య
దూపుకుంట్ల లక్ష్మీనరశింహ్మము
యీలిపిళ్ళ వీరరాఘవులు
కపిలవాయి వెంకయ్య
మాతంశెట్టి సీతారామయ్య
నండూరు శోభనాద్రాచార్యులు
జవ్వాజి లక్ష్మీనారాయణ
నందిపాటి జగన్నాయకులు

తీర్మానములు:-

1. ఈ సంఘమున శాశ్వత సభ్యులు జేరిన ఈ క్రింద తెలిసిన మహాశయుల శాశ్వత సభ్యత్వమును అంగీకరించుచు కృతజ్ఞత తెలుపుచు క్రింద సంఘము వారికి మన యామోదము తెలుపుటకు తీర్మానించడమైనది.

1. శ్రీమాన్ శివకోటి లక్ష్మీనరశింహంగారు
రాజగోపాలాచారివీధి, గవర్నరుపేట విజయవాడ
హిం. ర. నెం 101 రూ 116 శాశ్వత
సాధారణ సభ్యత.

2. శ్రీమాన్ కూరపాటి రామారావుగారు
శివాలయం వీధి, విజయవాడ.
హిం. ర. నెం 102 రూ 116 శాశ్వత
సాధారణ సభ్యత

3. శ్రీమాన్ ఉదయగిరి కృష్ణారావుగారు
బట్టల వర్తకులు, విజయవాడ.
హిం. ర. నెం 103 రూ 116 శాశ్వత
సాధారణ సభ్యత

4. శ్రీమాన్ నందిపాటి జగన్నాయకులుగారు
పచారు దినుసులకొట్టు విజయవాడ.
హిం. ర. నెం 104 రూ 119 శాశ్వత
సాధారణ సభ్యత

5. శ్రీమాన్ నందిపాటి రామయ్యగారు
విజయవాడ
హిం. ర. నెం 105 రూ 116 శాశ్వత
సాధారణ సభ్యత

6. శ్రీమాన్ గోపు శేషావతారంగారు
గవర్నరుపేట, విజయవాడ.
హిం. ర. నెం 106 రూ 116 శాశ్వత
సాధారణ సభ్యత

7. శ్రీమాన్ నండూరి శోభనాద్రాచార్యులుగారు
గాంధినగరము, విజయవాడ.
హిం. ర. నెం. 108 రూ 116 శాశ్వత
సాధారణ సభ్యత

2వ తీర్మానము:- ఈ క్రిందివారిని నూతన కార్యనిర్వాహక వర్గముగ ఎన్నుకొనడమైనది.

అధ్యక్షులు:- శ్రీమాన్ శివకోటి లక్ష్మీనరసింహంగారు
ఉపాధ్యక్షులు:- శ్రీమాన్ ఉదయగిరి కృష్ణారావుగారు
,, ,, నందిపాటి జగన్నాయకులుగారు
,, ,, గోపు శేషావతారంగారు
ప్రధాన కార్యదర్శి:- ,, కూరపాటి రామారావుగారు
సహాయ కార్యదర్శి:- ,, నందిపాటి రామయ్యగారు
,, నంబూరు శోభనాద్రిచార్యులుగారు
కార్యనిర్వాహకసభ్యులు:- ,, మాతంశెట్టి శీతారామయ్యగారు
,, యీలిపిళ్ళ వీరరాఘవులుగారు
,, పారేపల్లి శీతారామయ్యగారు
,, జవ్వాజి లక్ష్మీనారాయణగారు

3 వ తీర్మానము

ఈ విజయవాడ శాఖ కార్యాలయమును విజయవాడలోని 5/75 (కొత్తగుళ్ళవద్ద) శేషయ్య వీధిలో గల శ్రీమాన్ నిడుముక్కల సుబ్బారాయుడు, రంగవల్లి తాయారమ్మ గార్ల రామానుజ కూటములో యుంచుటకున్నూ ఆఫీసు పర్యవేక్షణాధికారము శ్రీమాన్ నిడుముక్కల శ్రీరామ మూర్తిగారు వ్యవహరించుటకున్ను తీర్మానించడమైనది.

4వ తీర్మానము:-

ఈ ప్రాంతములో ఈ సంఘ శాశ్వత సభ్యులను హెచ్చుగా చేర్చవలసినదిగను, ఈ పట్టణముననే ఈ సంఘముయొక్క ఆంధ్రరాష్ట్రీయ శాఖ కార్యాలయము కొరకున్ను, ఈ పట్టణ కార్యాలయముకొరకున్ను శాశ్వత సొంత భవనమును ఏర్పాటు చేయవలసినదిగను, ఈ సంఘము జరుపదలచిన ప్రచార పరీక్షల నిర్వహణకై శాశ్వతాదాయము వచ్చు చక్కటి భవనమును కొనుటకు తగు ప్రయత్నము చేయవలసినదిగను కమిటీని కోరుచు తీర్మానించడ మయినది.

5వ తీర్మానము:-

శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘమువారు తలపెట్టిన ప్రచార-పరీక్షల నిర్వహణకొరకైన శాశ్వత నిధికిగాను రూ 1011—0—3ను విరాళముగ సమర్పించిన శ్రీమాన్ కూరపాటి రామారావుగారు వారి ధర్మపత్ని గోదాదేవి గార్లకు యీ సంఘము ఇందు మూలముగ తమ కృతజ్ఞతను తెలుపుచు తీర్మానించడమైనది.

ఆ. చి. శ్రీమన్నారాయణాచార్యులు 9—3—52



శ్రీమతే రామానుజాయనమః

భక్తి

# నివేదన

వేదాంత మాసపత్రిక

సంపుటి ౪ | నందన-జ్యేష్ఠమాసం | సంచిక 3

## కృష్ణార్జున సంవాదము

శ్రీ ఉ. వే. శ్రీమాన్ తె. కం. గోపాలాచార్యులుగారు,
కోదకొండ.

—: ౬వ రంగము :—

(అర్జునుడు దుఃఖముతో తలవంచుకొని విచారించుచుండును. శ్రీకృష్ణుడు ఆతని చేతులను పట్టుకొని తలయెత్తి ఓదార్చుచుండును.)

కృష్ణు:- అర్జునా! యింకను నిట్లేల విచారించుచున్నావు! నీకు బంధువధవలని దుఃఖము గాని పాపముగాని యంటక నీ క్షాత్రమును కాపాడుకొను ఉపాయముల చెప్పియుంటిని గదా! నీకు చెప్పవలసిన గుహ్యాతరముల నన్నిటిని సమగ్రముగా చెప్పియే యుంటిని. వాటి నన్నిటిని సమగ్రముగా విమర్శించుకొని నీకు తోచినట్లాచరించి తరించరాదా! ఇంకను నీవిట్లు దుఃఖించుటకు కారణమేమి?

అర్జు:- [నిరాశతో] కృష్ణా! ఏమి చెప్పితివి?

కృష్ణు:- యిదియేమి యర్జునా! కర్మయోగమును చెప్పలేదా!

అర్జు:- ఆ చెప్పితివి! ఆ సమత్వబుద్ధి కలుగుట ఎట్లు ఆ కర్మల నెరుంగుట యెట్లు! లోపములు లేకుండ వాటి నాచరించుటెట్లు! ఆ ద్రవ్యశుద్ధి ఆ మనశ్శుద్ధి అబ్బో! యివి నావంటి వానికి దుస్సాధ్యములు ఆత్మస్వరూప విరుద్ధములు.

కృష్ణు:- ఊ ( అజ్ఞానయోగమో!

అర్జు:- అది మరింత సహజముగ మనస్సు చంచలము అది యసలు అలవాటుపడిన విషయములయందే నిలువక చలించి పోవుచుండును, అది బలవంతమైనది పురుషుని క్షోభింపజేయునది, విపరీత విషయములయందు ప్రవేశపెట్టుటలో గట్టిది. అట్టి మనస్సును నిగ్రహించి జ్ఞానయోగి యగుట ఎదురుగా వీచు పెద్దగాలిని విసనకఱ్ఱతో నడ్డుటవంటిది. అది నావలన నేమగును

కృష్ణు:- ఇక మనకు నా భక్తియోగ మున్నదిగదా!

అర్జు:- ఆ లేకేమి! ఆరెండును యున్నగదా! ఇది యుండునది. అంగము లేక అంగి చేకూరుటెందైన గలదా! గాక దానికి కూడ నిశ్చలమగు మనస్సు అపేక్షితమే గదా! అది యసంభవమని విన్నవించియే యుంటిని. అదియును గాక కృష్ణా? ఆ భక్తికి కావలసిన వివేకము విమోకము మొదలగునవి నాతరమా! ఇక నేతరించుట ఎట్లు కృష్ణా? మరియు చివరకు నీవు చెప్పుటలో గుహ్యతరమునే చెప్పితినంటివి! అయిన గుహ్యతమము నేల దాచియుంచితివి. అందులకు నే నింకను ఏమిచేయవలెను. నేను కార్పణ్యదోష దూషితుడనని మొదటనే విన్నవించియుండ పైగా నన్నిటిని విమర్శించుకొని తోచినట్లు చేయమనుచున్నావా! కన్నుపొడిచి కన్నీటికి కారణ మేమనునట్లు యింకను ఏల ఏడ్చుచున్నావనుచున్నావా? నేను నీ దాసుడను గాన, నీ భక్తుడను గాన, నీ ప్రియుడగాన కృష్ణా? నీదయ నాపట్ల ఏమైనది. దయామయా! కంచెయె చేనునుమేసిన మరిదిక్కెవ్వరు.

ఉ॥ సాధనబుద్ధితో సలుపు జ్ఞానము కర్మము భక్తియున్ మహో, బాధకరంబులివ్వి భగవంతుని జేరుట కెంతమాత్రమా! రాధనసేయరానివవుగా యివియానను నుద్ధరించు నీ! బోధకె నేను తృప్తి పడిపోవుదునేని నశింపకుందునే!

(అని గట్టిగ నేడ్చును.

కృష్ణు:- (దయతో కన్నీరు గార్చుచు అర్జునుని వీపుతట్టి భుజముపై చేతినుంచి) అర్జునా! అధికారిని పూర్తిగ పరీక్షింపక చెప్పరాని రహస్యమగుటచే చెప్పక దాచియుంచితిని. నీ దుఃఖము నా మనస్సును కరగించినది. నీవు నిజముగ అధికారివని కనుగొంటిని. మంత్రతుల్యమగు దీనిని సావధానముగ వినుము. నీ కత్యంత సులభమగునట్టియు, సర్వాధికార మగునట్టియు, అవ్యవహిత మోక్షసాధన యగునట్టి పరమ గుహ్యతమము నుపదేశించు చున్నాను.

అర్జు:- చిత్తము. మహాప్రసాదము. నీటముంచినను పాలముంచినను నీవే! నాకు వేరు గతిలేదు.

కృష్ణు:- పార్థా!

మన్మనాభవ మద్భక్తో మద్యాజీ మాంనమస్కురు
మామేవైష్యసిసత్యంతే ప్రతిజానే ప్రియోసిమే

నాయందత్యంత ప్రీతికలవాడవై నన్ను సాక్షాత్కరించు నంతటి విశదతమమగు ధ్యానము కలిగి నన్నారాధింపుము. ప్రీతితో నాకు నమస్కరింపుము. అట్లు చేసితివేని నీవు నన్నే పొంద గలవు. నీవు నాకు ప్రియుడవు గాన నిది నిజమని ప్రమాణము చేసి చెప్పుచున్నాను.

అర్జు:- (వికసించిన మోముతో నమస్కరించి) మహాప్రసాదము (దీనిచే నిష్టప్రాప్తి నుప దేశింపబడియె. యిక ననిష్ట నివృత్తియెట్లు?

కృష్ణు:- నన్ను పొందుటకు ప్రతిబంధకములగు పాపము లెట్లు పోవుననియా నీ సందేహము.

అర్జు:- చిత్తము

కృష్ణు:- అట్లే దానికేమున్నది) మరియు (యిదుగో నీకు కఠవల్లియంతర్గతమగు ద్వయ మంత్రవివరణమై పంచమ వేదసార భూతమగు) నీ గీతకు పరమ తాత్పర్యార్థమై చరమ రహస్య మనబడు గుహ్యాతమ మంత్రరాజమును నీకుపదేశించు చున్నాను.

అర్జు:- చేతులు జోడించి వికసిత ముఖముతో) ధన్యోస్మి!

కృష్ణు:- కాని,

చం॥ పరమరహస్యమీయది య । భక్తుడనాదృత దేశికాంఘ్రి స
త్పరిచయుడెంతమాత్రము త । పంబునుజేయనివాడసూయ చే
పరిగెడువాడు దీనివిన । పాత్రుడు గాడటువంటివానికీ
చరమసుధారసంబిడెడు । సాహసమెప్పుడు సేయబోకుమా !

అర్జు:- చిత్తము. నీపాదములాన నీయానను గీటువాసియైనను తప్పదునాకృష్ణా! సెలవిమ్ము.

కృష్ణు—(దగ్గరకు తీసుకొని చెవులో)

సర్వధర్మాన్ పరిత్యజ్య—మామేకం శరణం వ్రజ
అహంత్వా సర్వపాపేభ్యో—మోక్షయిష్యామి మాశుచః॥

అర్జు—కృష్ణా ! ఈశబ్దములు సులభముగనే యున్నను దీని తాత్పర్యముమాత్రమునాకొ కింతయు గోచరించుటలేదె ! దయతో సెలవిత్తువా ?

కృష్ణు—(నవ్వి) అర్జునా ! ఈపనియంత సులభమైనదికాదు. దీని నెరుంగుటకు పరమసాత్వి కుడై యుండవలయును. (ఏలయన, అట్టివానికి జ్ఞానము నిర్మలముగ వెలుంగుచుండును. అదివీనికి సాత్వికదైవమగు నాయందు ప్రీతిని కలిగించును. అట్టినాయందలి ప్రీతి రాజసతామసముల నడంచి నంతనే తదితరములయందు వైరాగ్యమునకు కారణమగును. అంతమాత్రమేకాక అది నాయను గ్రహమునకై నాయాజ్ఞారూపమగు శాస్త్రమునందు ఆదరమును పుట్టించును. అట్టివాడు "సర్వ ధర్మములను విడిచి నన్నేయుపాయముగా నమ్మి ఆశ్రయించిన వానిని సర్వపాపములనుండి విడి పించి నన్నుపొందింతు" ననెడు నావైభవమును విన్నచో నిది యథార్థమేయనెడు విశ్వాసము కలవాడగును.) ఇట్టివాడే ఈమంత్రార్థమును వినుట కధికారి, మునుముందిట్టి యధికారులత్యంత

విరళమైయుండురు. (వారైనను, ఈయర్థమును తగినయధికారి యార్తితో యాసన్నమైనప్పుడాతనిని సంవత్సరంబో తదర్ధంబో మాసత్రియంబో వివిధోపాయములచే పరీక్షించి కృప తో నుపదేశించుచుందురు ) కాని ముముక్షువులపాలిటి కల్పవృక్షమై నాయాజ్ఞచే రామానుజ రూపమున నవతరించునట్టి మాయనంతుడు మిక్కిలి శ్రమతో తానీయర్థముల గ్రహించి (ఈనియమముల కొంత సడలించి) ఆర్తికలవారందరీ యర్థము నెఱుంగునట్లు భూరిప్రదానము గావించును. ఆయర్థములన్నియు నాయాజ్ఞచే లోకాచార్యులచే సూత్రీకరింపబడి వరవర మునిపుంగవులచే విశదీకరింపబడును. అందులకు నిదానముగ నేను నీకు మంత్రార్థమును సంగ్రహముగా వివరింతు నాలకింపుము.

ఈమంత్రమున పూర్వార్థముచే ముముక్షువు చేయవలసిన కృత్యమును, ఉత్తరార్థముచే శరణ్యుడనగు నేనుగావించు కృత్యమున్ను చెప్పబడినవి.

అర్జు:—అయినచో కృష్ణా! అధికారిచేయవలసిన కృత్యమేది!

కృష్ణు:—అర్జునా! శ్రుతిస్మృతులచే విధింపబడిన కర్మయోగాద్యుపాయములను "భగవత్ప్రాప్తికి సాధనములుకాని వీటిని తత్ప్రాప్తిసాధనములని భ్రమించి పరిగ్రహించితిమేయని భయపడి వాటియందలి రుచివాసనలతో గూడ విడిచిపెట్టుము.

అర్జు:—(ఆశ్చర్యముతో) యిది ఏమికృష్ణా! నీవింతవరకు పరమాదరముతో మోక్షోపాయములని నొక్కివక్కాణించిన వాటినే విడువమనుచున్నావే, యిక ముముక్షువునకు గత్యంతరమేమి.

కృష్ణు:—అవును. అర్జునా! అవినిజముగ భగవదేక శేషభూతుడును తదేక పరతంత్రుడునగు నీయాత్మస్వరూపమునకు విరుద్ధములనుటలో సందేహములేదు.

అర్జు:—అయినచో వాటిని వేదపురుషుడేలవిధించెను. నీవు నాకేల యింతవిపులముగ నుపదేశించితివి.

కృష్ణు:—దొంగమేతనుమేసి దొరకక తిరుగు పశువును ఆవృత్తినిమాన్పి వశపరచుకొనుటకై దానిమెడయందు గుదిబండను కట్టి విడచునట్లు అహంకార మమకారములకు వశ్యుడై గర్వించి తిరుగుచున్న ఈచేతనునకు కాయక్లేశరూపమైన కర్మానుష్ఠానమును యింద్రియ జయము మొదలగు శుష్కరవ్యాపారములను ఉపదేశించినచో వాటియనుష్ఠాన మూలమున రజస్తమస్సులడగి సత్త్వముద్రిక్తమై రజస్తమస్సుల కార్యములగు అహంకార మమకారముల నశింపజేయును. దానిచే తాను భగవత్పరతంత్రుడనను స్వరూపజ్ఞాన ముదయించును. దానిచే భగవంతుడే సాధనమను అధ్యవసాయము జనించును. కావుననే ఆమార్గములుప దేశింపబడినవి.

అర్జు:-అయిన నేమికృష్ణా! నీవుచెప్పినట్లే కర్మయోగాదులు సాక్షాత్తుగ కారణములు కాకన్నను క్రమముగనైనను కారణములు కావచ్చునుగదా. అట్టివాటి నేలవిడిచిపెట్టమనుచున్నావు.

కృష్ణు:-యిట్లు స్వరూపజ్ఞాన ముదయించుటకు ఈకర్మజ్ఞానయోగములే అవసరములేదు. అవిలేకున్నను నాకృపచేతనే ఆజ్ఞానముకలిగి దానిచే భగవంతుడే యుపాయమగు అధ్యవసాయము కలుగవచ్చును గాన వాటికి పరంపరగానైనను కారణత్వ మనావశ్యకము. గావుననే వాటియందు సాధనత్వబుద్ధిని సవాసనగా విడువమంటిని.

అర్జు:-అయినచో కృష్ణా! కర్మజ్ఞానభక్తులను పూర్తిగ విడిచిపెట్టవలయు ననియేగదా! నీయభిప్రాయము.

కృష్ణు:-అబ్బే! అట్లుకాదు. నీవు వీటిని ఆచరించుచునే యుండుము. కాని నీవాచరించు వర్ణాశ్రమోచిత కర్మ సాధన బుద్ధితోగాక కరుణతో నితరులుజ్జీవించుటకే గావింపబడును గాన అది నాకు మిక్కిలి ఆనందావహమగును. అందువలన ఆకర్మ నా కైంకర్యమందంతర్భవించును. జ్ఞానము తనయందు సాధనత్వబుద్ధి పోవుటతోడనే ఆత్మస్వరూప జ్ఞానములో చేరును. యిక భక్తియు తనయందలి యుపాయబుద్ధి పోవుటతోడనే కైంకర్యరుచి యందంతర్భవించును.)

అర్జు:-అయినచో, మోక్షోపాయమేమి!

కృష్ణు ఆరయ సర్వరక్షకుడనయ్యును
నీకడ కింకరుండుగా
సారథినై రథంబుభయ సైన్య
సమక్షమునందునిల్ప నీ
కోరికయెద్దియో తెలియ
గోరుచు నీదొసగెల్లభోగ్యమా
తీరుననెంచి నీకెవరు దిక్కను
పించనివేళ దిక్కుగా
జేరి పిరాట్టి నీదొసగుచెప్పిన
కాదని "నత్యజేయమం"
చారసి రక్షసేయదగునట్టి
స్వభావముకలుగు నన్నుగా
భారత! నీవెఱింగి మదిభావన
చేయుముపాయ బుద్ధితో.

అర్జు:-అయినచో నిదివరలో చెప్పబడిన కర్మాద్యుపాయములకంటె దీనికిగల నతిశయమేమి?

కృష్ణు:-అబ్బో! హస్తిమశకాంతరముకలదు. చూడుము.

అరయగ నిత్యమై సులభమై
యనపాయమునై స్వరూపమై
ఖరికనురూప మేకము గాకన
పేక్షమునై ప్రమాణ సు
స్థిరము సిద్ధమై పరమ చేతనమై
సకలాధికారమై
కరమవిలంబ్య సత్ఫలము కల్పన
జేసి విలక్షణంబుగా
బరగు నుపాయముం దెలయ
బల్కితి నేనని నమ్ము మర్జునా!

# గోదాష్టోత్తర శతనామావళి

రామాయణ రత్నాకర శ్రీ ఉ. వే. శ్రీమాన్ విద్వాన్
కంద్యూరి రామానుజాచార్యులుగారు.

1 ఓం గోదాయైనమః
2 గాథాఃప్రియాయైనమః
3 శ్రీదాయైనమః
4 వేదాంతార్థ సుబోధిన్యైః
5 యశోదాతనయాఽమోదాయైనమః
6 గోవిందోద్వాహనోత్సుకాయైనమః
7 ధనుఃపురావతారాయైనమః
8 మనుజోద్వాహనాఽక్షమాయైనమః
9 మహాత్మ్సాకిసుతాయైనమః
10 మాన్యాయైనమః
11 తులసీతరుమూలజాయైనమః
12 అయోనిజాయైనమః
13 అనంతగుణాయైనమః
14 నియన్త్ర్యైనమః
15 నిఖిలప్రదాయైనమః
16 ఆషాఢమాససంజాతాయైనమః
17 పూర్వఫాల్గునభోద్భవాయైనమః
18 రమ్యాయైనమః
19 రక్షణసంజాతాయైనమః
20 నమ్యాయైనమః
21 నాయకనాయికాయైనమః
22 నారాయణోత్సుకానమః
23 నిత్యాయైనమః
24 నామకీర్తన తత్పరాయైనమః
25 గోపీవ్రత సముద్యుక్తాయైనమః
26 సహనాయైనమః
25 తాపహారిణ్యైనమః
28 భూదేవ్యైనమః
29 భూతదాత్ర్యైనమః
30 భూరిదాయైనమః
31 సూరిభూషణాయైనమః
32 స్వోవ్యాహకామలినయాయైనమః
33 రంగరాజకుతూహలాయైనమః
34 రంగరాడంతరంగజ్ఞాయైనమః
35 సుందరప్రార్థనోత్సుకాయైనమః
36 దాసాభీష్టప్రదాత్ర్యైనమః
37 నాసికాభరణోజ్జ్వలాయైనమః
38 పాపహన్త్ర్యైనమః
39 తాపహర్త్ర్యైనమః
40 రూపదర్పణదర్శనాయైనమః
41 కృష్ణవిశ్లేషాఽసహనాయైనమః
42 కృష్ణాఽలింగనభాలీనాయైనమః
43 కృష్ణవిశ్లేషరోగార్తాయైనమః
44 పీతాంబరానిలాఽసక్తాయైనమః
45 తులసీధరణోత్సుకాయైనమః
46 కృష్ణపాదగజోధాత్ర్యైనమః
47 కృష్ణోష్ఠాఽమృతపాయిన్యైనమః
48 జ్ఞానభక్తిస్తనాకారాయైనమః
49 కృష్ణార్పితపయోధరాయైనమః
50 కామదేవస్తోత్రకామాయైనమః
51 రామానుజసహోదర్యైనమః
52 క్షేమంకర్యైనమః
53 క్షామహర్త్ర్యైనమః
54 శ్యామాయైనమః
45 ఆరామపరాయణాయై నమః
56 స్వామిన్యై నమః

57 స్నానకుతుకాయై నమః
58 శ్రీమత్యై నమః
59 శ్రీమహారిష్ట్యై నమః
60 శంకాహీనాయై నమః
61 శంఖపరాయై నమః
62 శంఖధ్వానమనోహరాయై నమః
63 సుపర్ణఖ్యాతరథస్థాయై నమః
64 సుపర్ణాఽవయవాన్వితాయైనమః
65 సర్వగంధాయై నమః
66 సర్వరసాయై నమః
67 పుష్పసౌగంధ్యదాయిన్యై నమః
68 ఉత్తమస్యందనారూఢాయై నమః
69 పరమోత్తమభాషిణ్యైనమః
70 వైవాహికస్వప్నతోషాయై నమః
71 వివాహోచారబోధిన్యై
72 వేంకటేశోత్సవానందాయై నమః
73 వేదాంతోదంతభాషిణ్యై నమః
74 గోపీవ్రతానుకర్త్ర్యై నమః
75 గోపీవేషసుభూషణాయై నమః
76 నీళాప్రబోధనరతాయై నమః
77 నీళారక్తాచ్యుతప్రియాయై నమః
78 నందాలయద్వార్దసమార్గాయై నమః
79 నందబోధనతత్పరాయై నమః
80 నీలమేఘక్రియాసక్తాయై నమః
81 వ్రతోపకరణార్ధిన్యై నమః
82 చక్రభానుఘనాఽనందాయై నమః
83 శుభనాదాభిఘోషిణ్యై నమః
84 త్రివిక్రమమహోత్సాహాయై నమః
85 శరవద్వర్ష కాంక్షిణ్యై నమః
86 వర్షాఽసక్తాయై నమః
87 వ్రతవత్యై నమః
88 వామనస్థిరమానసాయై నమః
89 వసుధాయై నమః
90 వసుదాయై నమః
91 వేద్యాయై నమః
92 వరదాయై నమః
93 వైష్ణవాశ్రయాయై నమః
94 పుష్టకేశ్యై నమః
95 పూర్ణవేషాయై నమః
96 పుణ్యాయై నమః
97 పూర్వసుభాషిణ్యై నమః
98 పూజ్యాయై నమః
99 ప్రాజ్ఞప్రథానాయై నమః
100 యమునాతీరకాంక్షిణ్యై నమః
101 కృష్ణాశ్రయాయై నమః
102 కృష్ణబలాయై నమః
103 బహిరంర్నితవాసిన్యైనమః
104 రంగగోపాలమహిష్యై నమః
105 రంగరాడంఘ్రిశేముష్యై నమః
106 రంగరాట్ తత్త్వవిదుష్యై నమః
107 రంగరాద్వ్యాసతాకృష్యై నమః

# ఢిల్లీ నుంచి సంపత్కుమారుని తెచ్చిన విషయము

విద్యారణ్యపంచానన విద్యావాచస్పతి శ్రీమాన్ విక్రాల రామచంద్రాచార్యులుగారు

తురుష్కులు ఇండియాలోకి వచ్చిన కాలము

ఢిల్లీ ప్రభువు పృథివీరాజుతో జయచంద్రునకును కాన్యకుబ్జరాజుకుయుద్ధముగలిగినపుడు తనపక్క సహాయముకొరకు మహమ్మదీ గోరీని A D 12 వ శతాబ్దములో పిలుచుకొని వచ్చినాడు.

మహమ్మదీ గోరీయొక్క మొదటి సేనానాయకుడు కుతుబుద్దీన్ అను నాతడు AD 1206 సంవత్సరమున ఢిల్లీలో పాదుషాగావున్న అల్లావుద్దీన్‌యొక్క సేనానాయకుడగు మాలిక్కాఫర్ అనునతడు రామేశ్వరం వరకు దండయాత్ర చేసెను.

భగవద్రామానుజా చార్యావతారము
శకం ౯౧౯
ఇంగ్లీషుకు శాలిశకముక్క వారడ్జీటకలుపగా
AD ౧౦౧౭

A D ౧౦౧౭ సంవత్సరము భగవద్రామానుజాచార్యావతారము ఇది ౧౧ వ శతాబ్దము అవతారసమాప్తి ౧౦౧౭
౧౨౦

A D ౧౧౩౭ఇది౧౨వశతాబ్దము రామానుజాచార్యావతార సమాప్తి అయిన పిదప మహమ్మదీగోరి అను తురుష్కరాజు ఇండియాలోకి ప్రథమమున ప్రవేశించెను. అంతకు తొలుత తురకలు ఇండియాలోకి వచ్చి యెరుగరు. పిదప నూటఅరువదియేండ్లు తాళి దక్షిణ దేశమును కొల్లగొట్టినారు. కావున భగవద్రామానుజాచార్యులవారు జీవించియుండు కాలమున దక్షిణదేశమందు తురుష్కుల ప్రస్తావమే వుండివుండదు.

ఒకవేళ A D శతాబ్దమునుండి తురకలు అరేబియానుండి పంజాబ్ దేశమునకువచ్చి కొళ్ళగొట్టి యెత్తుకుని పోయినారన్నను వారు పంజాబుకు దక్షిణం తూర్పు రాలేదు. ఢిల్లీలో రాజ్యస్థాపన చేయలేదు. దక్షిణహిందూస్థానమును వారెరుగరు. గావున సోమనాథం మున్నగు ఆలయములగొట్టి దానిలోని ద్రవ్యమును హరించుకొని అంతట వెనుకకు తిరిగి పోవుచుండిరే గాని దీర్ఘయాత్ర చేయుటకు వారికి వసతి గలుగలేదు.

కావున భగవద్రామానుజాచార్యుల వారికి తొలుత తిరునారాయణపురంలోని ఉత్సవ విగ్రహములను ఢిల్లీపాదుషా యెత్తుకునిపోయి చెరసాలలో పెట్టినాడన్న విషయము ఆలోచించదగినది. అయితే గురుపరంపరా ప్రభావము ప్రపన్నామృతము పెరియతిరుముడియడవు ఆచార్యసూక్తి ముక్తావళి. ఈ తెంగల గ్రంథములందును యతిరాజ వైభవము మువ్వాయిరప్పడి గురుపరంపర ఈ వడగల గ్రంథములందును ఢిల్లీలో తురుష్కరాజ పుత్రి గృహమున తిరునారాయణుని ఉత్సవబేరమగు రామప్రియలున్నటుల దెలుపబడియున్నది. దివ్యసూరి చరితము పరమయోగి విలాసము అను తెంగల గ్రంథములందు ఢిల్లీ ప్రస్తావమే లేదు.

ఇట్లుండ రాజచరిత్రలకును మతగ్రంథము

నకు అర్థవిరోధము గలుగుచున్నది.

దివ్యసూరిచరితము ఒక్క గ్రంథము మట్టుకు భగవద్రామానుజాచార్యుల వారి జీవిత కాలములో నెరిగిన ఒకరిచేత వ్రాయబడినది. మిగత గ్రంథము లన్నియు మణవాళమాముని కాలమునకు గూడ నివతల బుట్టినవి. ఆ కాలమునకు కథలు అనేక మార్పులు బుట్టినవి. ఆ కాలమునకు కథలు అనేక మార్పులు చెందియుండుట సహజము. ఆ సమకాలమున బుట్టిన దివ్యసూరి చరితమున ఈ ఢిల్లీ ప్రస్తావ మించుకంతైన నెత్తబడలేదు. భగవద్రామానుజాచార్యుల వారు తిరునారాయణ ప్రతిష్టను గావించి ఆ సన్నిధిన యేయే కైంకర్యము నెవ్వరెవరెటుల చేయవలసినదియు ఒక నిబంధన గ్రంథమును యేర్పఱచి దానికి నియమనప్పడి యని పేరు బెట్టిరి. అందు ముందు ఆలయనిర్మాణాది విషయమును కొంత దెలిపియున్నారు. అందులో ఉత్సవబేరము ఎమ్మాళిరాయన్ అను రాజు యింట వున్నట్టున్నూ వారిని భగవద్రామానుజాచార్యుల వారికి అర్పించుచు తన రాజ్యములోని బంకాపురమను గ్రామమును గూడ సమర్పించినట్లున్నది.

కాబట్టి సాక్షాత్తుగ భగవద్రామానుజాచార్యులవారు యేర్పరచిన గ్రంథములో నున్న దానినే నమ్మవలయును. ఇట్లు నమ్మిన రాజ చరిత్రములకు గూడ విరోధము గలుగదు.

ఈ గ్రంథమున నిట్లుండ గురుచరిత్రకారు లెందుకు విరుద్ధముగ రాసిరని యడిగినచో ఈ నియమనప్పడి యనునది తిరునారాయణ స్వామి ఆలయములో జరుగవలసిన కైంకర్యములను గూర్చి వ్రాసిన పట్టీ గనుక దానిని యితరులు సంపాదించి తెలుసుకొన దగిన అవసరము యెల్లరకున్నూ వుండివుండదు. ఆ యాలయపు వారికి మట్టుకు ఉపయోగము గాన వారు ఆగ్రంథమును భద్రముగ కాపాడుకొనుచూ వారి వారి హక్కులను రక్షించుకొనుచుందురు.

ఇట్లె శ్రీరంగమున ఆ సన్నిధిలోని విషయములను దెలుపునది కోయిలఒళుగు అను గ్రంథము గలదు.

వేంకటాచలేతి హాసమాల యను గ్రంథము తిరుపతికి గలదు. అవి ఆయా దేశములలోనే రక్షింపబడును.

శ్రీరంగము తిరుపతుల గ్రంథములు కాలాంతరములలోని సంగతులను గూడ దెలుపునవి గాన కర్త యొక్కడుగనే యుండడు. ఇదిభేదము ఈ గ్రంథము లన్నియు ఆయా పూర్ణనాయాలయ సంబంధము గలవారికే దెలిసియున్నవి. గాని ఇట్లు గ్రంథములు గలవని గొప్ప పండితులు గూడ కొందరెరుగరు. నాకు దెలియును.

ఎమ్మాళిరాయన్ అనునత డెవ్వడనగా విచారింతము.

పశ్చిమ చాళుక్యరాజులలో ఆరవ విక్రమాదిత్యునికి పెర్మాడియని బిరుదు గలదు. ఆ పెర్మాడి యను శబ్దము కన్నడములో హెమ్మాళి యని చెప్పబడును.

ఈ విక్రమాంకుని గూర్చియే బిల్హణుడు విక్రమాంక దేవచరిత్రమను గ్రంథమును

వ్రాసెను. ఈ రాజు శ్రీమద్రామానుజాచార్యులవారి కాలములో క్రిమికంఠచోళుడని వైష్ణవులచే చెప్పబడు కులోత్తుంగ చోళుని యొక్క శత్రువులలో ప్రసిద్ధుడైన త్రిభువనమల్ల విక్రమాంకుడని ప్రసిద్ధి.

ఈ రాజు బిరుదగు హేమ్మాళి యను దాని కేరాయన్ అను గౌరవ వాచక పదమును చేర్చి నియమనప్పడిలో హేమ్మాళిరాయన్ తిరుమాళిగై యిులే యని గాశివున్నారు.

# అర్చావతారము

వేదాధ్యాయీ వేదాంతం రాధాకృష్ణమాచార్యులు
పో ఠం కి.

శ్లో॥ ఆరాధనానాం సర్వేషాం విష్ణో రారాధనం పరం।
యేన కేన ప్రకారేణ విష్ణో రర్చన ముత్తమం ॥

అని ఆరాధనంబులలోను విష్ణు నారాధించుట చాల శ్రేష్ఠమైనది, యే ప్రకారంబునైనను విష్ణువు నారాధించుట యుత్తమము. ఆత్మార్థముగ స్వగృహమందు గాని పరార్థముగ నాలయమందు గాని వాసుదేవుని యర్చించ వలయును. ఈ యర్చనము లక్షకోటి గుణితంబై యొప్పును. పరశబ్దమునకు మోక్షమని యర్థము ముముక్షువులకు మోక్షమొసంగును. కావున పరార్థమని యాలయార్చనంబుకు పేరై యున్నది. సూర్యుడు పరార్థముగను గృహమందలి దీపము స్వార్థ మగునట్లు, అట్లే గృహార్చనము చేయు నెడల నాయా గృహస్థులకు మాత్ర ముపకరించును. గ్రామార్చనము గ్రామము కాపాడును. స్వయంవ్యక్త స్థలమందలి యర్చనము సమస్త లోకములకు శుభము గలుగును. శ్రీమన్నారాయణుని యభివ్యక్త మైనప్రకారంబులై యున్నవి. అవి పరము, వ్యూహము, విభవము అంతర్యామి అర్చ యను నామంబులు గలిగి యుండును. పరస్వరూపంబనిన నఖిలాండంబులకు సృష్టిమాత్రమందు ప్రయోజకంబగును. వ్యూహంబనిన మానసాదుల కిది దైవతంబై దేహాదిచలనంబులకు ప్రయోజకంబగును, విష్ణు పురుషసత్యాచ్యుతా నిరుద్ధులను పేరనియ్యది పంచవిధంబై యున్నది. విభవంబులని రాక్షస సంహారాది దుష్టశిక్షణంబున కుద్భవంబగుమత్స్యకూర్మాదులు. అంతర్యామి యన జగత్తున కాధారభూతమై ప్రతిప్రాణియందు యిమిడి యుండు స్వరూపము. ఈ విధంబుననే సమస్తమగు జీవకోట్లయొక్క దుఃఖంబును శాంతింప జేయుటకు సులభమార్గంబున మోక్షమును ప్రసాదించుటకు అర్చావతారంబై యవతరించెను. పరవ్యూహంబులు నిత్యులు ముక్తులగు వారలకు మాత్రముపాసింప సాధ్యంబగును. విభవస్వరూపము ఆకాలమందుండినట్టి జనులకు మాత్రము నేత్రగోచరంబుగ కానవచ్చుటచే నదియు సర్వసులభంబు గానేరదు. అంతర్యామి స్వరూపము విశుద్ధులగు యోగిపుంగవు

లకు మాత్రము యోగదృష్టికి గోచరమగును. కావున యఖిల జీవకోటికిని అర్చాస్వరూపము నారాధించుటయందు స్వాతంత్ర్యము గలిగి యున్నది. భక్తి శ్రద్ధాదులచే చేయబడిన పత్రి పుష్పాదులచే పూజ అర్చారూపియగు భగవానుని యందు ఫలవంతమై దుర్లభమగు మోక్షము లభించును. ఏ గ్రామమున ఆలయమందు వైదిక విధానముగా యర్చనము జరుగుచున్నదో ఆ గ్రామమందు నివసించునట్టి ద్విజుల నెల్లరకును సభ్యాహోత్రము వంటి ఫలము నిచ్చును.

శ్లో॥ గ్రామార్చా రహితే గ్రామే ।
గృహే దేవో ప్యముక్తిదః ।
మూలనాశే తు వృక్షస్య ।
సేచనే కిం ఫలం భవేత్ ॥

గ్రామార్చనము లేని గ్రామమందు గృహార్చన సయితము ఫలవంతము కాజాలదు. వృక్షము యొక్క వ్రేళ్లు తెగిపోయిన వెనుక దానికి మొదటికి గాని శాఖలకు గాని నీరు పోసిన ఉపయోగమెట్లు కాజాలదో అట్లే గ్రామార్చనము లేనియెడల గృహార్చన ముపయోగము కాజాలదు. అర్చావతారముగ భగవాను డవతరించెడి స్థానవిశేషంబులైదు

శ్లో॥ దైవం చాపి తదైవార్షం ।
పౌరాణం మానుషం తదా ।
స్వాయం వ్యక్తం చ పంచైతే ।
స్థానాని పృథివీపతే ॥

దైవము ఆర్షము పౌరాణము మానుషము స్వాయంవ్యక్తమని యీ భూలోకము నందర్చావతార స్థాన భేదంబులైయున్నవి. దైవమన బ్రహ్మేంద్రాదులవలన ప్రతిష్ఠింప బడినవి, దైవతములును. మరీచ్యాది మహర్షులచే ప్రతిష్ఠింపబడినవి. యార్షములన్నియు లక్ష జన్మంబుట్టె పురాణకాలము నాటినుండి ప్రాశస్త్యముగ వచ్చుచుండినవి పౌరాణంబులనియు, భక్తి శ్రద్ధాదులచే మనుష్యులచే ప్రతిష్ఠింపబడినవి మానుషంబులనియు,

భక్తుల ననుగ్రహింప నిచ్ఛగలిగి నిర్వ్యాజమగు కరుణావిశేషంబున భగవానుడే యేపుణ్య ప్రదేశమందు స్వసంకల్పముచే యావిర్భవించునో ఆ ప్రదేశము స్వయంవ్యక్త మనబడును అట్టి స్వయంవ్యక్తార్చా రూపము సర్వలోక సమృద్ధికరము,

శ్లో॥ మానుషం యోజనా దర్వాక్
దైవతం దశయోజనం
పంచయోజన మార్షంచ
పౌరాణం యోజనత్రయం ॥

మానుష స్థలము యోజన దూరమును దైవతము దశయోజనము- ఆర్షమై దుయోజనంబులను - పౌరాణము యోజనత్రయంబును పవిత్రముజేయును, (స్వాయంవ్యక్తస్థలే దేవస్సర్వలోక శుభప్రదః) స్వయంవ్యక్తస్థలమందలి దేవుండు సర్వలోక శుభప్రదుండు కృతత్రేతాది చతుర్యుగంబులలో నిట్టి యర్చావిధానమే మోక్షదాయకమై యున్నది. ఈ యర్చావిధానముచే నా భగవంతుని నాశ్రయించిన వారలు భగవత్తుల్యులగుచున్నారు. సర్వకాల సర్వావస్థలయందును శ్రౌత స్మార్తాది వైదిక కర్మలచే విష్ణువు నారాధించువారు మోక్షమును బొందుదురు.



# నారీవిభాగము



శ్రీమతే రామానుజాయ నమః

## తిరుక్కోళూర్ పెణ్ పిళ్ళై రహస్యము

రచయిత: శ్రీమద్భాగవత పాదరేణువు, మదరాసు.

---

## మహాభారతము

అ॥ యాణసత్య మెనేన్ నో కృష్ణనై ప్పోలే ।

తె॥ 'అహమేవ సత్యా' మన్నానా కృష్ణునివలె॥

### ౨

శ్రీకృష్ణ పరమాత్మ పరీక్షిత్తు అశ్వత్థామ యొక్క అస్త్రధాటిచే విగతజీవుఁడై పుట్టగా

భార॥ శ్లో॥ గా॥ యదిమే బ్రహ్మచర్యంస్యాత్ మయిసత్యంతుతిష్ఠతి ।
ఆవ్యాహతం మమైశ్వర్యం తేనజీవతబాలకః ॥

అను నీ మూడు ప్రమాణములచే బ్రతికించెను.

తె. భా॥ తే॥ ఫగఁబయెడనైననే బొంకుపలుకనేని । సమరముఖమున నెన్నఁడుఁజలితవృత్తి ।
బిరిదికడుగిడనేని యిప్పన్నవాని యంగమునజీవ మీఁబొద్దుయావహిల్లు ॥
. తే॥ మహితసత్యంబు పరమధర్మంబుగాఢ నిర్మల బ్రహ్మచర్యంబు నిత్య
సుప్రతిష్ఠితంబయి నాయందు దేజగిల్లు నేని యిబ్బాలునకు జీవమిపుడవచ్చు॥
బ్రహ్మచారీత్యత్ర కాణ్వాయన స్మృతిరర్థత ఉపక్రమ్యతే
కాణ్వాయని స్మృతిః॥ బ్రహ్మచారీ చతుర్విధః।గాయత్రః।బ్రాహ్మః।ప్రాజాపత్యః।బృహన్ ఇతి।

శ్రు॥ తతోత్ర పనయనాదూర్ధ్వం య స్త్రిరాత్ర మక్షారలవణాశీ గాయత్రీం అధీతే సగాయత్రః
యస్తు వేదస్య గ్రహణాంతం బ్రహ్మచర్యం చరతి స బ్రాహ్మః ।
ఋతుకాలే స్వదారగామీ నిత్యం పరస్త్రీవిముఖః స ప్రాజాపత్యః ।
సంవత్సరం వేదకృ ద్వాటు రపి ప్రాజాపత్య యేవ ॥

ఆ మరణాంతం గురుకులవాసీ స నైష్ఠికో బ్రహ్మన్నిత్యుచ్యతే ॥

మనువాక్యం

శ్లో॥ షోడశ స్తు నిశాః స్త్రీణాం తస్మిన్ యుగ్మాసు సందిశేత్ ।
బ్రహ్మచార్యేవ పర్వాద్యా శ్చతస్రశ్చ వివర్జయేత్ ॥

తా॥ బ్రహ్మచారియైనవాడు స్త్రీలకు ఋతుదినములు పదునారింటిలో రాత్రులలో సరి దినములందు గూడవలెను. పర్వములు నాలుగింటిలో గూడుటను మానలెను.

ఉపనిషత్తులు ॥శ్లో॥ స్వదారే విధివత్కృత్వా నివృత్తి శ్చా న్యత స్సదా
మనసా కర్మణా వాచా బ్రహ్మచర్య మితి స్మృతం॥

తా॥ స్వభార్యయందు ఋతుకాలవిధి ననుసరించి ప్రవర్తించువాడై మనోవాక్కాయ కర్మములచేత నితరకాలములందు విషయనివృత్తి గలిగియుండుట బ్రహ్మచర్య మనబడును.

శ్లో॥ ఋతుకాలాభిగామీ యః స్వదారనిరతశ్చయః ।
స సదా బ్రహ్మచారీ హి విజ్ఞేయ స్స గృహాశ్రమీ॥

తా॥ స్వపత్నియందు ఋతుకాలమున మాత్రము ప్రవర్తించువాడై ఇతరకాలములందు విషయరహితులైన స్త్రీ పురుషు లిర్వురును బ్రహ్మచారిణి- బ్రహ్మచారులే యగుదురు.

శ్లో॥ పరదార పరిత్యాగీ స్వదారపరితుష్టితః । ఋతుకాలాభిగామిత్వా ద్బ్రహ్మచారీ గృహీరితః ॥

తా॥ పరస్త్రీలను తల్లులవలె చూచువాడును ఋతుకాలములందు మాత్రము స్వపత్నియందు గృహస్థధర్మము నిర్వహించు వాడును అగు గృహస్థాశ్రమి కూడ బ్రహ్మచారి యనంబడును.

[తి. అ.] శ్రీకృష్ణుని వలె మృత శిశువును బ్రతికించినావా?

# శ్రీరామాయణము

అ॥ అడయాళంశొన్నేనో కవందప్పోలే॥

తె॥ ముందుకు మార్గములను సూచించి నానాకబంధునివలె ॥

౨

సీ॥ శబరిని గనుగొని యరుగుమీయావల పంపాసరో వరప్రాంతమునకు
నచ్చట సుమభారహారిశైలము ఋశ్యమూకంబు పొలుచుననేకపముల
సమ్మార్గమున జేసి సౌఖ్యంబుగాగొండ నెక్కంగరాదది నిక్కువంబు
ఆమలపై నిద్రనందువారే సొమ్ము గలలోనగాంచు మేల్కనియంత
దానిబడయును. బాపులాధరణీధరము పై కిజనరాదు చనినిద్రగైకొనినను
రాక్షసులు వారి బ్రహరింత్రు రామచంద్ర బ్రహ్మనిర్మితమియ్యది పార్థివేంద్ర ॥

సీ॥ ఎలుగులబులులును నింద్రనీలచ్ఛాయ మృగములగన శోకమెడలునీకు
నాపర్వతమున మహాగుహయొక్కటి యుర్వీశ యొప్పారుచుండునదియు
రాతి పెన్మూతచేగ్రాలెడు నద్దాని జొరగబూనుట సుఖకరముగాదు
తదుహకును దూర్పుద్వారంబుకడనొండు మంచిచల్లని నీటిమడుగు గలదు ॥

గీ॥ ఆజలాశయతీరంబు తేజరిల్లు హరిఫలమాలతమై హరిణనికర
యుక్తినాగు హనుగ్రీవుడుండునయ్య వానరచతుష్కయుతుడై వాలి భీతి॥

నీకన్నివిధముల సీతాన్వేషణమునకు తోడ్పడసమర్థుడు గాన స్నేహపాత్రుడని విన్నవించెను॥

తి॥ అ॥ కబంధునివలె గురుతులు దెల్పినానా ?



# శ్రీకృష్ణజయంతి ★ తిరుపధ్యయనము

శ్రీమాన్ శ్రీమత్తిరుమలై నల్లాన్ చక్రవర్తి సంపత్కుమార జగన్నాథ తిరువేంకటాచార్యులుగారు

శ్లో॥ నందంతు నిందంతు హసంతువాపి । యథాకథం వాప్యధునా భవంతు ।
మయాభవచ్ఛాసన మేవకార్యం । కింవాభవే దిత్యపహాయశంకాం ॥

శ్లో॥ పరిహాస్యాస్య సత్వేపి । నోహసంతి విపశ్చితః ।
తదభావే విహాసశ్చే । త్తన్నైజమితి కథ్యతే ॥

శ్రీకృష్ణజయంతి రోజున తిరువారాధన రాత్రిని జరుగవలెను. తిరువధ్యయనము పగలే జరుగవలెను. భగవదారాధన జరిగిన గాని తిరువధ్యయనమును జరుపవీలులేదు. ఇవి రెండును ఒకే రోజున జరుపవలసివచ్చినచో చేయవలసిన విధానమేది? యని సంశయము. ఇందులకు కొందరు రాత్రిని శ్రీకృష్ణజయంత్యారాధనము జరిపి యారోజుపవసించి మరునాడు తిరువధ్యయనమును జరుపవలయు ననుచున్నారు. ఈ పక్షమునకు ప్రమాణ బలము లేదు. యుక్తి బలము లేదు. జయంతిని గురించి తిరువధ్యయనమును ఆరోజున మానిన మృతదివసాతిక్రమణదోషము, తప్పదు. భుజించిన గదా యీ దోషము వచ్చుట యందురా? ఏదో ప్రమాదవశమున తిరువధ్యయనమును జరుపుట కాటంకము కలిగినపుడు భుజింపకుండ నుండి యాటంకము తీరగనే తిరువధ్యయనమును జరుపుమని యున్నది గాని బుద్ధి పూర్వకముగ తిరువధ్యయనమును జరుపక యుపవాస ముండుమని యున్నదా? కనుక నీ దోషము తప్పదు. మరియు నారోజున తిరువధ్యయనమును గురించి తీర్థప్రసాదములు పుచ్చుకొనకున్న తిరువారాధన పూర్తిగాదు. అట్లని స్వీకరించిన పితృదేవతల నతిక్రమించినట్లగును. అట్లయిన నేకాదశియిందెట్లందురా?

ఆరోజు మహానివేదనము లేదు గనుక బాధ లేదు. ఈరోజది యుండుటచే దాని గూడ గొనవలశి వచ్చును. ఆనాటి తీర్థప్రసాదములనే మరునాడు వినియోగించిన విపరీతానుష్ఠానమగును భగవత్తీర్థప్రసాదములను ఆనాడు వినియోగింతురా? ఇది చాలా యసౌకర్యమైన కృత్యము. ఇట్లని శాస్త్రమును లేదు. మరియు నిట్లు జేసినచో మరునాడు తిరువారాధన జేయవలెనో మానవలెనో తేలదు. చేసిన యెడల ఆనాటి తీర్థప్రసాదముల నేమి జేయవలెను. మానినయెడల నా మరునాడు పెరుమాళ్ళకు సంప్రోక్షణ జరుపవలసియుండును. అందుకని రెండు రోజుల తీర్థ ప్రసాదములను కలిపి వినియోగించిన మరీ యసౌకర్యమైన కృత్యము. ఒక రోజు తీర్థప్రసాదములను వదలెదమందురా? అట్లుజేసిన నేరోజు నందలి తీర్థప్రసాదములను వదలెదరో యారోజు నందలి యారాధన లోపమును జెందును. అయినను వదలదగినవియే రోజుది? మొదటి రోజుదియైన కర్తకును భోక్తలకును జయంత్యారాధన సంబంధమే లేకపోవును. ఆది శ్రీవైష్ణవత్వ భంజకము. రెండవరోజువి వినియోగింతురేని పర్యుషితత్వాది దోషములు శక్యశంకితములై యుండు వానిని వినియోగించుటయునే దోషమును లేని వానిని పరిహరించుటయు పరిహాస్యములు. మరియు జయంతినా డుపవసించునది కర్తయే గదా? తక్కిన వారికి నిర్బంధము లేదు గావున వారానాడు తీర్థప్రసాదములను స్వీకరింతురా? లేదా? స్వీకరింతురేని వారి శేషమునా యీ తిరువధ్యయనమున వినియోగించునది? [వినియోగించునెడల]ఒక వేళస్వీకరింపక మానెదరా? శ్రీవైష్ణవత్వము చెడునుగదా? మరియు భోక్తలను నియమించునది యెప్పుడు? మృతితిథిరోజుననా? తిరువధ్యయనమును పెట్టెడిరోజుననా? మృతతిథిరోజుననైన భోక్తలకును కర్తకు గలిగిననిన్ని యిబ్బందులు కలుగును గదా? ఈ యిబ్బందుల కియ్యకొని యెవరు భోక్తలుగా నిష్టపడెదరు? అప్పుడు బ్రాహ్మణాభావమే గదా? మరునాడే భోక్తలను నియమింతుమందురా? వారికి జయంత్యారాధన ప్రయుక్త తీర్థప్రసాద స్వీకారము తొలినాడే జరిగియుండును గావున తిరుగ తిరువధ్యయనాంగముగ సక్యశంకిత దోషవిశిష్ట తీర్థప్రసాద స్వీకారమును జేయుట యొక యనవసరమైన విపరీతము. అందుకని వారవి గ్రహింపరా? వారు గ్రహింపని కర్తకు గ్రాహ్యము లెట్లగును? కానిచో నీపనికి జయంతీ సంబంధము గలుగుటెట్లు? ఆరోజున కర్త జయంత్యారాధనమునందు పాలుగొనకుండునందురా? అట్లయిన రెంటికిని జెడునుగదా? ఆరోజు కర్త యుపవసించుట కారోజుపవాసదినమా? కాని యప్పుడుపవాస మెందులకు? దీనివలన రెంటికిని జెడుటయే గాక యనవసరముగనుపవాసము జేయుట యొకటి మిగులును. కనుక నీ పక్షముపపన్నము గాదు.

మరికొందరు రాత్రిని నక్షత్ర దర్శనము కాగానే జయంత్యారాధనము జేసి పిమ్మట తిరువధ్యయనమును జరిపెదమనుచున్నారు. వీరినెవరైన నిశీథత్వసామ్య మాత్రముననే మనస్తృప్తిని పొందదలచితిరా యని యడిగిన నప్పటికే నిశీదమెక్కడనందురు. కాని పగలు జయంత్యా

రాధనమును జరుపగాదని ప్రిబలమగు నిషేధము లేనందుచేతను రాత్రిని తిరువధ్యయనమును జరుపరాదను నిషేధమున్నందు చేతను ఇట్లు జేయుట యనవసర విపరీత కృత్యమే యగును. ఈ నిషేధము రాత్రి సామాన్యమునకే గాన నిశీథశ్రాద్ధాచరణనిషేధము మీకు తగులునన రాదు. ఇక జయంత్యారాధనమును పగలు జరుపరాదని ప్రత్యేక నిషేధము లేకున్నను రాత్రిని జరుపవలయునని యున్నందుచే నిది యే దానిని సూచించుచున్నదందురా? ప్రబల మగు ప్రత్యక్షనిషేధము లేనందున నిట్టిది గల తిరువధ్యయనవిధితో నిది ఢీకొనజాలదు. అపుడు ప్రిబలమగు తిరువధ్యయనవిధి దు ర్బ ల మ గు జయంత్యారాధన విధిని స్వావిరోధముగ జరుగు నట్లు నియమించును. కనుక నీపక్షమును అను పపన్నమే యనదగును.

ఇంకను కొందరు మామూలుగా తిరువధ్య యనమును జరిపి కర్త తానుమాత్రి ముపవాస ముండి రాత్రిని జయంత్యారాధమును జేసి భుజింపదగుననుచున్నారు. ఈ పక్షము నందు సంక్రమించు దోషములు కొన్ని పైని జెప్ప బడియే యున్నవి. ఇంకను గలుగు దోషము లెవ్వియనిన భోక్తలు నిర్గమింపగనే పితృశేష మును భుజింపకుండుట యొకదోషము. ఇందుచే తిరువధ్యయనము పూర్తిగాదు గనుక భగవ దారాధన కధికారము గలుగదు. కనుక దాని యందు ప్రవేశించుట యొక దోషము. అందు కని తిరువధ్యయనము జరుగగనే పితృశేషమును గ్రహించిన భగవదారాధన కసలే యధికారము లేదు. జయంతీదినమందు పగలు సామాన్యా రాధన జేయుట యొక దో ష ము. అప్రసక్త ముగ మరల రాత్రిని జేయుట యొక దోషము. జయంత్యారాధ నాంగముగ రాత్రియందును తిరువధ్యయనాంగముగ పగలును రెండుసారులు రాజభోగమును సమర్పించుట యొక దోషము. దోషమని యేది మానినను దోషమే. ఇందు నకు శాస్త్రము లేదు గనుక నిదియు కామకార కృత్యమే. అయిన నిక కర్తవ్యమగువిధాన మేది యనిన పగలే ఆకృష్ణజయంత్యారాధనమును జరిపి యనంతరము తిరువధ్యయనమును జరుప వలెను. ఇట్లయిన పై దోషము లేవియు సంక్ర మింపవు. ఇందులకు శాస్త్రమున్నదా? యని యడుగవచ్చును. ఉన్నదని కొందరనుచున్నారు ఉండనిండు, ఉండకపోనిండు ప్రమాణ విచా రమే యనవసరము. ఏమనిన "జాతాశౌచమృ తాశౌచ గ్రహణైకాదశీర్వినా మృతాహస్స మతిక్రమ్యచండాలః కోటిజన్మసు" అను వచ నమును విమర్శించిన మృతదివసాతిక్రమణమును జేసినను తప్పులేని సమయములన్నియు దెలియ బడుచునే యున్నవి. అందు జేరనిదేదియు నట్టిది గాదని స్పష్టమగుచునే యున్నది. కనుక వేరొక ప్రమాణ మనవసరము. ఏకాదశీ వ్రతమును తిరువధ్యయనమును సమము గాన కరణే ప్రత్య వాయజనకములు. కనుక వానికి రెంటికిని పర స్పర విరోధము గలిగినపుడొక నిర్ణయమవసర మైనది. అందువలన పై వచనము పుట్టినది. ఏకా దశీ వ్రతమని నేకాదశ్యుపవాసము దీనిని మాన త గి న స మ య మొ వ్వా డు ను లే దు. తిరువధ్యయన మాశౌచాది ప్రతిబంధకములు వచ్చినపుడవి నివర్తింపగనే జరుపదగినదియే య

గుటచే నిదియు నెప్పుడును మానదగిన దిగలే దు. అందుచేతనే యివి రెండును పరస్పరవిరోధ పరిహార పూర్వకముగ జరుపదగినవి యైనవి. ఆవిధానమును శాస్త్రమే నిర్ణయింపవలయును. కావున పై శాస్త్రమవతరించినది. జయంతీవిష యమును ప్రివన్నుల కత్యంతముఖ్యమైన యుత్స వ విశేషమనియున్నను యేకాదశి వంటిదిగాదు. తిరువధ్యయనము వంటిదిగాదు. కనుకనే యూ శౌచాది ప్రతిబంధకము లేవివచ్చినను దానికి ప్రికాకాంతరేణ అనుష్ఠానము లేదు. రాత్రిని చేయదగిన జయంత్యారాధనమును ఆరోజు తిరు వధ్యయన మైనచో పగలే చేయునెడల నిదిప్రి కారాంతరేణ అనుష్ఠానముగా లేదా ? యందు రేమో ? ఇది యొక్కటియేగాని యిట్లన్ని ప్రతి బంధకములకును పరిహారము జేయువిధానములు లేవుగదా ? కనుకనే ప్రశ్న కుదురదు. ఇది యిట్ల నుటకు కారణమేమందురా ! ఇది యకరణేప్రి త్యవాయ జనకముగాక కరణేఽభ్యుచ్ఛయజనక మగుటయే కారణము ఈరెండువిధములలో మొ దటి విధమేగదా ? మనకు గ్రాహ్యమని యడుగ వచ్చును. కాని యది కర్మవిషయమున గాని జ్ఞానవిషయమునగాదు. ఇది భగవద్విషయము గావున జ్ఞానవిషయమైనది. ఏకాదశియు భగవ ద్విషయంగనుక జ్ఞానమునకు సంబంధించినదే. అయినపుడిదియు జయంతియు నొకవిధమైనవే యనరాదా ! అనిన నిట్టివేమైనను ఏకాదశి యక రణే ప్రత్యవాయజనకము జయంతి కరణేఽభ్యు చ్ఛయు జనకము. కనుకనే యీ రెంటికిని పై రీతిగా భేదము గలిగినది. జయంతి దుర్బలమైన చో ప్రబలమగు తిరువధ్యయనము కిన్న గుండె ట్లు జేయదగినదయ్యెనందురా ? తిరువధ్యయన ము భగవదారాధనానంతర కర్తవ్యము. జయం త్యారాధనము భగవదారాధనాంతర్భూతము. కనుక నిదిముందు జేయదగినదయ్యెను. రాత్రిని జేయదగిన దీనిని తిరువధ్యయనము కొరకు పగ లు జేయుటచే నిదిగౌణమయ్యె నందురా? అట్ల నరాదు. ఈరోజున నిట్లే చేయవలసియున్నం దున నిదియే ముఖ్యమనదగును. కనుక వ్రతకా లపరిత్యాగ దోషము లేదు. శాస్త్రోక్తములుగాని యింకే యిబ్బందుల వలన నైనను దీనిని పగటి యందే జరిపిన గౌణమున దగును. కానియప్పుడైన నను ప్రబలమగు దోష మేదియునున్నట్లు లేదు. ఈ విషయ మిట్లు పరిష్కృతమైన ఇక తిరువధ్యయనము రాని దివసమున జయం త్యారాధన మెప్పుడు జరుగ వలయునను నిది విచారింతము.

శ్రీకృష్ణావతారము రాత్రియందు జరిగినది గావున దీనికి ముఖ్యకాలమదియే యని నిశ్చయ ము. రాత్రియనిన రాత్రి సామాన్యమే వివక్షి తము. భగవదవతార మర్ధరాత్రమున నైనదని కాబోలు నంతవరకు వేచియుండవలయునని కొం దరనుచున్నారు. కాని యట్టివిధి యున్నదందు రా ! అందురేని చూపింపవలయును. కానిజయం త్యా మేవకృష్ణస్య విహితానిశిపారణా యను టచే పారణయే నిశియందని యుండె ఇక నారా ధన మునిశీథమందెట్లు ? నిశి యనగా రాత్రి యందని యర్థము. కాని నిశీథమందనిగాదు, నిశీ థమనగా నర్ధరాత్రము. అర్ధరాత్రనిశీథౌద్వా వితి నిఘంటువు. కనుక నర్ధరాత్రము వరకు వేచి యుండవలయు నను వాదమునిరస్తమైనది, ఇటుల

జేయుటవిధి ప్రయుక్తమే గావున తమయాను కూల్యమునకై చేసిరనరాదు. మరియు భగవదవతారసమయ మెప్పుడని ముందు వీరి నడుగుదము. అర్ధరాత్రిమొదటిది గదాయనిన నందులకు ప్రమాణమేమి ? నిశీథేతమ ఉద్భూతే యను శ్రీభాగవతవచనమే ప్రమాణమందురా! ఆవచనమందే 'జాయమానేజనార్దనే' యనుటచే భగవదవతారమున కవ్యవహిత పూర్వకాలమని తెలియవచ్చుచున్నది. అవతారకాలము మాత్రమావిరాసీద్యథాప్రాచ్యాం దిశీందురివపుష్కలః అనుటచే చంద్రోదయమైన కొంతకాలమున కని తోచుచున్నది. అనగా నిశీథమందవతరింప గడంగెను. అవతరించునప్పటి కపరరాత్రియైనది నడుమను గొంతకాలమున్నది. కనుకనే దీనినాంధ్రీకరించిన పోతన్నగారు పంకజముఖి నీళ్ళాడను సంకటపడునని చెప్పినారు. ఆరోజష్టమి గావున చంద్రోదయమే 16 గడియలకగును. ఉదితుడైన చంద్రునకు పుష్కలత్వ మింక గొంతకాలమునకుగాని కల్గదుగదా! మరియు పగలష్టమియుండి రాత్రికి నవమియున్నచో నింకను గాలహరణమగును. రోహిణీ ప్రాధాన్యముగ జేయునెడల "అష్టమ్యాంవా నవమ్యాంవా దశమ్యాం యదిరోహిణి" యనునట్లా రోహిణి దశమిరోజుననయ్యెనేని యింకను గాలవిలంబమే. ఇవియన్నియునపరరాత్రిలో నివేయగును. 'ఆవిరాసీ'త్తను నదియుదాహరణము మాత్రమేగాని యవతారకాలము చంద్రోదయానంతరమని చెప్పుటలేదందురా ? చంద్రోదయమును భగవదావిర్భావమును ఏకకాలముననైన దానిని దీనికి దృష్టాంతముగ జెప్పుట రమ్యముగనుండును. దేవకియందు భగవానుడుదయించినాడు. తూర్పుదిక్కునందు చంద్రుడుదయించినాడు. అతడెట్లు పుష్కలుడుగ నుండెనో యితడు నట్లెయుండెను. అతనికి దిక్సంబంధ మెట్టిదో యట్టిదే యితనికి దేవకీదేవి గర్భసంబంధమనిన స్వారస్యముగ నుండును. కనుకను ఆఅర్థమె గ్రాహ్యము. స్వారస్యముగల యర్థమును విడువనేల సామాన్యార్థమును గ్రహింపనేల కనుక నపరరాత్రియే యవతారకాలము, అంతవరకు వేచియుండి యారాధనము నారంభింపవలెననిన నించుమించుగా తెల్లవారవచ్చును, అప్పుడు తీర్థప్రసాద స్వీకారయోగ్యత లేదు. యోగ్యతలేని కాలమున స్వీకరించుటవిశేషవిధి యందురా! ఆవిధిని జూపవలయును, కాని మనయిష్టము వచ్చినట్లు విశేషవిధి యనిన జెల్లునా! తీర్థప్రసాదస్వీకారమునకును కొన్ని కట్టుబాట్లు గలవుగదా ? వచనాత్ ప్రవృత్తిర్వచనాన్నివృత్తిః అనుటచే మనము స్వతంత్రింప వీలు లేదుగదా! ఆసమయమువరకు దీనిని జేయరాదనిన నసలా ఆరాధన ప్రారంభింపనే కూడదా పూర్తి జేయగూడదా ప్రారంభింపనే గూడదనిన పూజారంభింప యారాధనము మరురోజునకు జేరి యారోజారాధనమే శూన్యమగును, అర్ధరాత్రము దాటిననే తరువాత కృత్యములు మరురోజునకు సంక్రమించుచుండగానికనపరరాత్రిని గురించి సందేహమున్నదా "రాత్రౌత్రిభాగం కుర్వీత" యనునది యీవిషయమునందు గాదుగదా "అర్ధరాత్రాదధస్తాచ్చేత్సం క్రమేద్యదిభానుమాన్" ఇత్యాదివచనములచే నర్థరాత్రానంతరకాలము మరురోజునకు జేరుట మనమెరుంగనిది గాదుగదా ? ఇది ధనుర్మాస ప్రవేశాదుల

యందు స్పష్టము ఒకవేళ పూర్తి మాత్రము జేయరా దందురా ఎంతవరకు జేయవలెను ఎక్కడనుండి యాపవలెను ఇక నపరరాత్రియని గ్రహించిన నీదోషములుగాని యర్ధరాత్రియని గ్రహించిన నేదోషమును లేదుగదా యందురా? అవతారకాల మర్ధరాత్రముగాదని పైని దెల్పితిమిగదా? అయినను ఉక్తదోష పరిహారమున కొకవేళ నర్ధరాత్రమే యవతారకాలమని గ్రహించినను తీర్థప్రసాద స్వీకార యోగ్యకాల మతిక్రమింపక మానదు, అప్పుడును ప్రారంభింపగూడదా? ఇత్యాది ప్రశ్నలు కలిగియే యుండును, అర్ధరాత్రము దాటినగాని దాటకున్న పరదినమునకు జేరదందురా? అర్ధరాత్రముపూర్వదినమునకు జేరునా? "యోయమేకాదేశస్స పూర్వస్యాంత వత్ పరస్యాది వత్ స్యాత్" అనునట్లు రెంటికిని జేరునందురా? అప్పు "డిదమిత్థ"మని నిర్ణయింప వీలులేదు గదా? ఒకవేళ పూర్వదినమునకే చేరుననుకొన్నను తీర్థప్రసాద స్వీకారమునకు మాత్రము యోగ్యమగు కాలము లేదుగదా? అది జరుగని యారాధనము వ్యర్థమే గాక దుష్కృతము గూడ నగునుగదా! ఇందువలన తీర్థమును మాత్రమప్పుడు స్వీకరింతుమందురా? ప్రసాదము నేమి జేయుదురు! మానిన నపచారమే గదా? గ్రహించిన నిషిద్ధమే గదా! తీర్థమునకు బనికి వచ్చిన కాలము ప్రసాదమున కెట్లు పనికిరాలేదు? అసలు ప్రసాద స్వీకారమనిన నేమి? కరతల ప్రసాదముగా బదరీఫల మాత్రముగా గ్రహించు శుద్ధాన్న వ్యతిరిక్తములగు నుపహారాదులను గ్రహించుటా? భోజనవిధి ప్రయుక్త పరిషేచనా పోశనాది పూర్వకముగా విస్తరియందుంచుకొని భుజించు సవ్యంజన శుద్ధాన్న స్వీకరణమా? మొదటిదే యనిన జయంత్యారాధనమందు మహానివేదనముగలదు గదా? అది యనిన సవ్యంజన శుద్ధాన్న నివేదనమేగదా? అట్లు నివేదితముగ వచ్చిన ప్రసాదమును భోజనవిధి ప్రకారముగ భుజింపనిచో మరల దానికి దుర్వినియోగమే గదా? ఇందుకని మహానివేదన మానిన నారాధన లుప్తమగుటయే గదా? అందుకని భుజించిన యెడల ననర్హమగు కాలమున భుజించిన దోషమగు గదా? ఇట్లు భుజించుట విశేషవిధియనిన నిది పాషండత్వసంపాదకమై శ్రోత్రియగోష్ఠియందు నగు బాట్లకు దెచ్చునుగదా? భగవదారాధనానంతరము తీర్థప్రసాదములను గ్రహింపక తప్పదన్న మాత్రమున నేకాలమైనను తప్పులేదని సమన్వయించినచో భగవదారాధనముగాకుండ తిరువధ్యయనమును జరుపరాదనుటచే నపరరాత్రియందైనను తిరువధ్యయనమును జరుపవచ్చునని గూడ సమన్వయింప వలసివచ్చును.

విష్ణోర్నివేదితాన్నేన యష్టవ్యం దేవతాంతరం పితృభ్యశ్చాపితద్దేయం తదానంత్యాయ కల్పతే ఇత్యాది వచనములచే భగవదారాధనగాకుండ తిరువధ్యయనమును జరుపవీలులేదు గదా? ఇక శిష్టాచారముల పైనిట్లు ప్రశ్నింపవచ్చునా? యని యొక యాక్షేపమున్నది. ప్రమాణబలము యుక్తిబలము సమానముగనున్న యాచారభేదములను గురించి శిష్టాచారములను గౌరవముతో నెవరి యిష్టానుసారముగ వారవలంబింప వచ్చుగాని యిందులకు వ్యతిరిక్తము

లను వానిని శిష్టాచారము లనరాదు, ఇన్నివిధముల యాచారములకును అనుష్ఠాతలు పండితులే కావచ్చును. ఐనను ఒక్కరికి సర్వవిద్యల యందును ప్రవేశముండదుగదా కొన్ని విద్యల యందు తాము ప్రవీణులయ్యును తమకు ప్రవేశము లేని విషయములను గురించి వానిని తెలిసినవారి సలహా తీసుకొని ప్రవర్తించుట దగును. అట్లుగాక తమ కగౌరవమని భ్రాంతితో తోచినట్లు జేయుట తెలిసీ తెలియని యనుష్ఠానమగును. ఒక్కొక్కపు డొక్కొక్కరికి తెలిసిన విషయమున గూడ భ్రమప్రమాదాదులు కలుగవచ్చును, కనుక తగిన వారి సలహా తీసుకొనుట యవసరమే. అట్లు జేయనివారి యనుష్ఠానమును (వారు శిష్టులైనను) శిష్టాచారమందురేని దానిపై విమర్శింపదగదు. ప్రతివిషయమునకును ప్రమాణమైన నుండవలెను, ఉపపత్తియైన నుండవలెను. ఇందేదియున్నను గ్రాహ్యమే, ఏదియు లేనిచో త్యాజ్యమే, ప్రమాణ వచనమున్నను దానికి దేశకాలపాత్రాది విభాగమొకటి విమర్శనీయము. విధి వేరు, యుక్తి వేరు. విధినే ప్రమాణమందురు. యుక్తినే యుపపత్తి యందురు. విధిలేని దానిని అవిహిత మందురు. యుక్తి లేని దానిని యుక్తిహీనమందురు. యుక్తి యుక్తము గానిదనిన నదియే. ఇట్లు గాక తోచినట్లనిన జెల్లదు.

# ప్రచార విభాగము.

భక్తి "నివేదన"
అనుబంధము

మదరాసు శ్రీయతిరాజ సేవామహిళా మండలివారిచే ప్రతిసంవత్సరము జరుపబడుచుండు

## భగవద్గీతా పరీక్షా వివరములు.

**ఉద్దేశము:**—స్త్రీలలోను, అందును విశేషించి స్కూళ్ళయందు విద్య నభ్యసించు బాలికలయందును విరివిగా గీతాప్రచారమును గావించుట

మూడు సంవత్సరములలో ప్రథమ-మధ్యమ-ఉత్తమ పరీక్షలయందు క్రమముగ ఉత్తీర్ణులై గీతలోని విషయములను సమగ్రముగ తెలుసుకొని సుమారు 180 శ్లోకములను టీకాతాత్పర్యములతో కంఠస్థపరచి జీవ-ఈశ్వర-ప్రకృతి తత్వముల స్వరూపస్వభావాదులను అవగతము చేసుకొనుటకు అవకాశము కల్పించుట.

**పాఠ్యక్రమము:**—గీతామందిర ప్రచురణమైన టీకాతాత్పర్య సహితమగు భగవద్గీతనుండి ఒక్కొక్క-సంవత్సరమునకు క్రమముగా ఆరు అధ్యాయములలోని విషయములున్ను వాటినుండి పరీక్షాధికారులచే నిర్ణయింపబడిన 60 శ్లోకములున్ను, గీతామందిర ప్రచురణమగు తత్వత్రియ వివరణమనబడు జీవేశ్వర ప్రకృతితత్వములలో ఒక్క-తత్వమున్ను ఇట్లు మూడుసంవత్సరములలో సమగ్రగీతా విషయములున్ను, 180 గీతాశ్లోకములున్ను. తత్వత్రియ వివరణము సమగ్రముగనున్ను పరీక్షింపబడుచుండును.

**పరీక్షాకాలము:**—ఈపరీక్షలు ప్రతిసంవత్సరము ఒకసారిమాత్రమే నిర్ణీతకేంద్రములలో నవంబరు నెల మొదటివారములో ఆదివారమున జరుపబడుచుండును.

**పరీక్షావిధానము:**—ప్రతి పరీక్షకును రెండుప్రశ్న పత్రములుండును. ఒకటిచదివిన గీతావిషయములలోని ప్రశ్నలున్ను. వర్ణించిన శ్లోకములనుగూర్చిన ప్రశ్నలున్ను కలిగియుండును.

రెండవది తత్వత్రియ వివరణములోని నిర్ణీతవిషయములును గూర్చినప్రశ్నపత్రము

**పరీక్షకేంద్రము:**—ఈపరీక్షలకు 5 గురు స్త్రీలుఉన్న ప్రతిగ్రామమునను ఒక పరీక్షాకేంద్రముండును. పరీక్షాధికారులచే నొసంగబడు రెండుప్రశ్న పత్రములున్ను వేరువేరు కవర్లలో సీలు చేయబడి దేవస్థాన ధర్మాధికారికి రిజిష్టరుపోష్టులో పరీక్షాతేదికి 2 రోజులు ముందుగా పంపబడును. వారు సకాలములో దేవాలయమున పరీక్షలను జరిపించి ఉత్తరపత్రములును వెంటనే రిజిష్టరుపోస్టులో కార్యాలయమునకు పంపివేయుదురు. ఒకనెలలో పరీక్షాఫలితములు శ్రీవిశిష్టాద్వైత ప్రచారకసంఘ భక్తినివేదన పత్రికలో ప్రకటింపబడును,

ఈపరీక్షలకు సంబంధించు విషయవిమర్శలు కూడా ఈపత్రికయందు ప్రతినెలకు ప్రచురింపబడి అభ్యర్థినులకు పరీక్షకు మిక్కిలి సహాయకరముగ నుండగలవు.

**పరీక్షకు అర్హులు :—** స్త్రీలుమాత్రమే ఏవయస్సునందున్న వారైనను పరీక్షనిచ్చుటకు అర్హతకలిగి యుందురు.

**ఉత్తీర్ణకక్షానిర్ణయము :—** ఈపరీక్షలలో ప్రతిపత్రికలోను నూటికి అరవై అంతకుపైబడిన మార్కులు లభించువారు ఉత్తమకక్షలోను, ఏభై అంతకుపైబడిన మార్కులు లభించువారు మధ్యమకక్షలోను, నలభై అంతకుపైన మార్కులు లభించువారు ఉత్తీర్ణులుగాను భావింపబడుదురు,

**బహుమతులు - బిరుదములు :—** ఈమూడు పరీక్షలలోను క్రమముగా నుత్తీర్ణులైనవారికి మూడవ సంవత్సరాంతమున 'గీతావిశారద'యను బిరుదముతో యోగ్యతాపత్ర మొసంగబడును.

ఇదిగాక మొదటిపరీక్షకు ఉత్తీర్ణతక్రమము ననుసరించి రు 25.20.15.10,5 వరకు 5 నగదు బహుమతులున్ను 5 పుస్తక బహుమతులున్ను ఒసంగబడును.

రెండవపరీక్షకు ఉత్తీర్ణతక్రమము ననుసరించి రు 30,25.20,15.10,6 వరకు 6 నగదు బహుమతులున్ను 4 పుస్తకబహుమతులున్ను ఒసంగబడును.

ఉత్తమపరీక్షకు ఉత్తీర్ణతక్రమము ననుసరించి రు 50,40, 3020.10.5 వరకు 6 నగదు బహుమతులున్ను 4 పుస్తక బహుమతులున్ను ఒసంగబడును.

**విశేషబహుమానము :—** పై మూడుపరీక్షలలోను తప్పక, వరుసగ సర్వోత్తమముగా ఉత్తీర్ణమైన ఒకరికిమాత్రము బంగారుపతకము బహూకరింపబడును.

**ఉపాధ్యాయసన్మానము :—** ప్రతి కేంద్రములోను అభ్యర్థినుల తయారుచేసి పరీక్షకుపంపిన ప్రతి ఉపాధ్యాయులకును ఉత్తీర్ణత ననుసరించి యథావకాశముగా నగదు సన్మానము సమర్పింపబడును.

**దరఖాస్తు పంపుకాల నిర్ణయము :—** ప్రతిసంవత్సరము సెప్టెంబరు నెలాఖరులోగా కార్యాలయమునకు తమతమ దరఖాస్తులను అభ్యర్థినులు పంపుకొనవలెను. ఆయవధిమించిన దరఖాస్తులు మంజూరు కానేరవు.

దరఖాస్తు అచ్చుఫారములు కార్యాలయనుండి కోరినవారికి ఉచితముగా పంపబడగలవు.

**పరీక్షాశుల్కము :—**

మొదటి పరీక్షకు 0-8-0 రెండవ పరీక్షకు 0-12-0 మూడవ పరీక్షకు 1-0-0 దరఖాస్తుతో మనియార్డరు ద్వారా కార్యాలయమునకు పంపవలెను.


గీతామందిర కార్యదర్శిని<br>
107 వరదాముత్తియప్పన్ వీధి<br>
మదరాసు 1<br>
(అడ్రసు ఇంగ్లీషులో వ్రాయవలెను.)

# కట్నములు

శ్రీరామకృష్ణ రామానుజదాసుగారు (లింగాలపాలెం) శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘమునకు సమర్పించిన కట్నము. 5-0-0

శ్రీ వణుకూరుకోట లక్ష్మీనరసింహం గారు వారి దౌహిత్రుడు చి॥ చక్కా సత్యనారాయణకు చి॥ సౌ॥ ప్రభావతిని యిచ్చి 2-3-52 వ తేదీని జరిపించిన వివాహసందర్భమున సంఘమునకు రు 5-0-0 కట్నమును సమర్పించిరి. ఈ నూతనదంపతులు చిరంజీవులైన సమస్త సంపదలతో వర్ధిల్లుగాక యని శ్రియఃపతిని ప్రార్థించుచున్నాము.

శ్రీమాన్ తె. కం. గోపాలాచార్యులుగారు తమ కుమారుడు చి॥ తె. కం. రంగరామానుజాచార్యులకు చి॥రామచంద్రాచార్యులు గారి కుమార్తె చి॥సౌ॥చి. వెంకటమ్మనిచ్చివివాహము జరిపించినసందర్భమునసంఘమునకురు10-0-0లు సమర్పించిరి. ఈ వధూవరులకు శ్రియఃపతి ఆయురారోగ్యైశ్వర్యముల నొసంగి బ్రోచుగాక.

విశాఖపట్టమున 18-4-52 తేది మొదలు 3 రోజులుజరుపబడిన శ్రీయతిరాజసేవామహిళామండలి వార్షిక సభల సందర్భమున సదరుశాఖా సంఘ కార్యదర్శినిగారైన శ్రీ మతి దాసరి ఆండాళ్ళమ్మగారు మనసంఘమునకు రు 5-0-0లు కట్నమును సమర్పించి మార్గదర్శకులైరి. వీరి ఉద్యమమునకు శ్రీయఃపతిపూర్ణదోహద మొసంగు గాత!

శ్రీమతి వక్కలంక వెంకట రంగనాయకమ్మ గారు-(అనకాపల్లి). శ్రీయతిరాజసేవామహిళా మండలికి గొప్ప సేవచేయుచు పెక్కుమందిసభ్యులను చేర్పించుచు అందరికిని ఆదర్శపాత్రులగుచున్నారు. వీరికి మా అభివందనములనర్పించుచున్నాము.

విజయవాడలో శ్రీ పారేపల్లి సీతారామయ్యగారు చూపుచున్న సంఘాభిమానమునకు మా కృతజ్ఞతను తెలుపుకొనుచున్నాము.

★

---

శ్రీమాన్ ఎన్. జి. కె. ఆచార్యులుగారు "సుదర్శనమ్" అను పేరుతో నొక వారపత్రికను ప్రచురించుచున్నారు. ఇందు పెక్కు వేదాంత విషయములు, వేదాంత ప్రచారవివరములు, సత్సంప్రదాయ విషయములు మొదలగునవి సులభశైలిలో ప్రచురింపబడుచు ఆబాలగోపాలమత్యంతోపయుక్తముగానున్నది. దీనిని ప్రతివారును ప్రోత్సహించుట ముఖ్యకర్తవ్యము. చందా స్వల్పము. సంవత్సరమునకు రు. 3 లు మాత్రమే.

---

మైలవరం శ్రీ యతిరాజసేవా మహిళామండలి అధ్యక్షులగు శ్రీ శ్రీ శ్రీ సూరానేని శ్రీ వరమంగయ్యామ్మ బహద్దరు జమీందారిణీవారు మద్రాసు శ్రీ యతిరాజసేవా మహిళామండలివారు గీతామందిరములో జరుపుచున్న శుక్రవార కార్యక్రమమున ముత్తయిదువులకు వినియోగించుటకుగాను నూరు బంగినిపల్లి మామిడి పండ్లు ప్రేమతో పంపించిరి. ఇట్లు అన్ని స్థలముల యందున్న శాఖా సంఘములకు పరస్పర పరిచయమున ప్రీతి వృద్ధిపొందుటకు వీరు మార్గదర్శకులైరి అని వీరికి మద్రాసు మండలివారు తమ కృతజ్ఞతను తెలుపుకొనుచున్నారు.

# శ్రీ యతిరాజ సేవా మహిళామండలి — (విశాఖపట్టణంశాఖ)

## ద్వితీయ వార్షిక సభా సమావేశము.

## పండితసభా వివరములు.

ది 18-4-1952వ తేదీని ఉదయం గం 9 0॥ కు విశాఖపట్టణంలో వేంచేసియున్న శ్రీ వెంబెరు మానార్ల కోవెలలో శ్రీ ఉ. వే. శ్రీమాన్ ప్రతి వాది భయంకరం శ్రీనివాసాచార్యస్వామివారి అధ్యక్షత క్రింద శ్రీ యతిరాజసేవా మహిళా మండలి సభ్యురాండ్రు సమావేశమై తమమండలి ద్వితీయ వార్షికోత్సవమును అత్యంత వైభవ ముతో జరిపించి యీ దిగువ కార్యక్రమమును దిగ్విజయముగా జరిపించిరి. పెక్కుమంది పండితప్రకాండులును, విదుషీమణులును వివిధప్రాంత ములనుండి వేంచేసి తమ అమూల్య సలహాలను ఉపన్యాసములను నొసంగి వందలుగా సభ నలం కరించిన శ్రోతబృందము నానందాబ్ధి నోలలాడించిరి.

దైవప్రార్థన సంస్కృత ద్రావిడభాషలతో జరిగిన పిదప మండలి కార్యదర్శిని గారైన శ్రీమతి దాసరి ఆండాళ్ళమ్మగారు గత సంవత్సరమంతయు యీ మండలివారు జరిపిన శుక్రవార కార్యక్రమ వివరములను, తిథి, నక్షత్రాదిమహోత్సవ వివరములను ఆ సందర్భములలో విదుషీమణులచేతను పండితోత్తముల చేతనుగావింపబడిన ఉపన్యాస వివరములను వ్రాస గుచ్చినట్లు విన్నవించి యీ సంవత్సరమునూతన కార్యవర్గముతో నూతనోత్సాహముతో ద్విగుణీకృతముగా కార్యక్రమముల జరిపించి ఆంధ్రదేశమందున్న మహిళామండలి లన్నిటికిని యీ శాఖ ఆదర్శప్రాయమై యలరారవలె నని హెచ్చరించిరి.

పిమ్మట అధ్యక్షులు సంఘసేవను మండలి ప్రచార దీక్షను ప్రశంసించుచు ఉపన్యసించిరి. ఈ దినము మొదలు 3 రోజులు రెండుపూటల యందును ఈ దిగువ కార్యక్రమానుసారముగ అత్యంత వైభవముతో ఈ సభ జయప్రదముగ ముగింపబడినది.

| ఇందు పాల్గొనిన పండిత ప్రముఖులు. | ఉపన్యసించిన విషయములు. |
|---|---|
| శ్రీ అధ్యక్ష మహాశయులు. | శ్రీ విశిష్టాద్వైత వైభవము, ఆళ్వారుల భక్త్యనుభవ తారతమ్యములను విమర్శించుచు ఉపన్యసించిరి. (2) భక్తి ప్రాధాన్యము. |
| ,, ఇరగవరపు రంగాచార్యులుగారు. (సింహాచలం) | పెరియాళ్వారులు ఆండాళ్ వైభవము. |

" కో. కం. వేంకటేశ్వరాచార్యులుగారు.
శ్రీ రా మ తీ ర్థ ం

పరమాచార్యులగు శ్రీ వరహాస్వామివారి వైభవము, శ్రీ కులశేఖరాళ్వారుల వైభవము.

" తి. వె. సంపత్కుమారాచార్యులుగారు.
(సింహాచలం)

1 "యాదృచ్ఛిక సుకృతము"
2 "అవతార విశేష వైభవం"
3 "ప్రిరాచావశ్యకత- సభావిశేషములు"

,, తి ప. నారాయణస్వామిగారు ,,

శ్రీరామసీతావిరాటుల సౌందర్య విశేషము అష్టప్రబంధమున్ను.

,, కరి నారాయణాచార్యులుగారు (రామతీర్థం)

సంకీర్తన వైభవం, గోదా కళ్యాణం హరికథా కాలక్షేపమున్ను.

కోమాండూరి అప్పలాచార్యులుగారు
(సింహాచలం)

1 శ్రీరామ - కృష్ణావతార సౌలభ్యాతిశయ విశేషములు - (భగవద్విషయమునుండి)
2 "ఆళ్వారుల హృదయం"

,, కో. కం. అప్పలాచార్యులుగారు.
(శ్రీరామతీర్థం)

1 నాలాయిర ప్రబంధమందలి మంగళాచరణ వైభవ విమర్శ,
2 పెరియతిరుమొళి వైభవమున్ను,

,, నండూరి అప్పలాచార్యులుగారు.
(సింహాచలం)

శ్రీమద్రామాయణ వైభవము.

ఈ మూడు దినములలో మధ్యాహ్నకాలమున మహిళామండలిచే నాహ్వానింపబడిన శ్రీమతి ముడుంబై రామానుజమ్మగారు, శ్రీమతి పున్నంరాజు వెంకటబంగారమ్మగారు, మొదలగు విదుషీమణులచే ఉపన్యాసములు వైభవముగా గావింపబడెను.

3వ దినము సభాంతమున అధ్యక్షభాషణానంతరం మహిళామండలి సభ్యురాండ్రు పండితులకును, విదుషీమణులకును, ఆగంతుక భక్తబృందమునకును, చందనతాంబూల దక్షిణ సత్కారాదుల సమర్పించిరి.

—:ఈ క్రింది దాతలీ సభకు ఆర్థిక సహాయ మొనరించి ప్రోత్సహించిరి:—

—:వి శా ఖ ప ట్ట ం:—

శ్రీమతి ద్వారం శ్రీనివాసమ్మగారు.
శ్రీమతి రెడ్లం అమ్మన్నగారు.
శ్రీమాన్ మంచుకుండ కోదండరామయ్యగారు.
,, మద్ది శ్రీనివాసం బ్రదర్సువారు.
,, మంగళగిరి కోదండరామయ్యగారు.
,, ద్వారం జగన్నాథరావుగారు.
,, దాసరి మధుసూదనరావుగారు.
,, రామినీడి వెంకటాద్రియుడు నాయుడుగారు
,, ఎర్రబోలు కృష్ణారావుగారు.
,, రామినీడి రాజానాయుడుగారు.

శ్రీమతి తలువుల కాంతయ్యమ్మగారు.

,, యజ్ఞభోల నారాయణమ్మగారు.

,, రామినీడి రామాయమ్మగారు.

శ్రీ శ్రీ ఒకభక్తురాలు.

శ్రీమతి పెద్ద తాయారమ్మగారు.

,, చిన్న తాయారమ్మగారు.

,, కరిది లక్ష్మీనరసమ్మగారు.

,, గుండాల లక్ష్మీనరసమ్మగారు.

,, ప్రి. భ. కనకమ్మగారు.

,, వక్కలంక వెంకటనరసమ్మగారు.

## పుష్ప చందన కైంకర్య తిరునామములు.

శ్రీమతి మంచుకొండ సీతయ్యమ్మగారు.

,, మం. నరసమ్మగారు.

,, మం. సీతాపిరాట్టిగారు.

,, మం. వరలక్ష్మమ్మగారు.

,, మద్ది రంగనాయకమ్మగారు.

,, మద్ది సీతయ్యమ్మగారు.

,, మంచుకొండ తల్లెమ్మగారు.

,, రామినీడి సరస్వతమ్మగారు.

,, కట్టమూరి అమ్మాయమ్మగారు.

,, పరాంకుశమ్మగారు.

ఇట్లు:

దాసరి ఆండాళ్ళమ్మ,

శ్రీ యతిరాజ సేవా మహిళామండలి, [విశాఖపట్న శాఖా] కార్యదర్శి.

---

శ్రీమతి దాసరి ఆండాళ్ళమ్మగారు తమ కుమార్తు ఆనందమోహనరావునకు జరిగిన వివాహ సందర్భమున మన సంఘమునకు రు 5 లు కట్నం సమర్పించిరి. ఈ నూతనదంపతులకు శ్రీయఃపతి ఆయురారోగ్యమైశ్వర్యములు ప్రసాదించుగాక.

★

రిజిస్టరు నెం. 5094

# భక్తినివేదన

(వేదాంత మాసపత్రిక)

ఇందు వేదాంత విషయ రాజములున్ను; భక్తి ప్రచార విషయమైన వార్తలున్ను వేదాంత సాంప్రదాయ విషయకమైన ప్రశ్నోత్తరములున్ను ప్రచురించబడును.

చందాలు:

సం 1 కి॥ రు. 5-0-0.

రు. 10-0-0.

To

Book-Post



1. శ్రీమన్నారాయణుడే సృష్టి - స్థితి - లయ కారకుడు.
2. ఆయనే మోక్షప్రదాత.
3. ఆయనే పరతత్త్వము-పరమాత్మ
4. ఆయన అఖిలహేయ ప్రత్యనీక కల్యాణ గుణకుడు.
5. ఆయనకు జీవుడు శరీరభూతుడు; శేషభూతుడు, పరతంత్రుడు, నియామ్యుడు, అనుభావ్యుడు.
6. జీవులు జ్ఞానాకారులు.
7. జీవులు అనంతములు.
8. జీవులు పరమాత్మకంటె భిన్నులు; ఈ భేదము సత్యమైనది; నిత్యమైనది.
9. జీవ-పరమాత్మలకు ప్రకృతి శరీరభూతమైనది; శేషభూతమైనది; పరతంత్రమైనది; నియామ్యమైనది; అనుభావ్యమైనది.
10. ప్రకృతి వికారాస్పదమైనది. జీవపరమాత్మలకంటె భిన్నమైనది; ఈ భేదము సత్యమైనది నిత్యమైనది.
11. జీవుడు ప్రకృతి వియుక్తుడై పునరావృత్తి రహితమైన పరమాత్మ సాన్నిధ్యమగు పరమపదమును పొందుటయే మోక్షము,
12. భక్తి ఒక్కటియే మోక్షసాధనము.
13. భక్తి యన తైలధారవలె అవిచ్ఛిన్నమైన స్మృతి పరంపర.
14. వివేక-విమోక-అభ్యాస-క్రియా-కల్యాణ అనవసాద—అనుద్ధర్షలు భక్తికంగములు.
15. ఇవి సదాచార్య-సమాశ్రయణ-లభ్యములు
16. జగద్గురువగు శ్రీరామానుజాచార్యుల వారును; వారి యనుయాయులున్ను సదాచార్యులు.

"నగురుద్వైష్ణవాత్ పరః" భా. సం.

Edited Printed & Published by A. Ch, Srimannarayanacharya at Sriman Press, Kakiuada.



శ్రీమతే రామానుజాయనమః

భక్తి

# నివేదన

వేదాంత మాసపత్రిక


| సంపుటి ౮ | నందన-జ్యేష్ఠమాసం | సంచిక 3 |
|---|---|---|


## కృష్ణార్జున సంవాదము


శ్రీ ఉ. వే. శ్రీమాన్ తె. కం. గోపాలాచార్యులుగారు,

కోదకొండ.


—: 5వ రంగము :—

(అర్జునుడు దుఃఖముతో తలవంచుకొని విచారించుచుండును. శ్రీకృష్ణుడు
ఆతని చేతులను పట్టుకొని తలయెత్తి ఓదార్చుచుండును.)

కృష్ణు:- అర్జునా! యింకను నిట్లేల విచారించుచున్నావు! నీకు బంధువధవలని దుఃఖము గాని పాపముగాని యంటకె నీ క్షాత్రమును కాపాడుకొను ఉపాయముల చెప్పియుంటిని గదా! నీకు చెప్పవలసిన గుహ్యాతరముల నన్నిటిని సమగ్రముగా చెప్పియే యుంటిని. వాటి నన్నిటిని సమగ్రముగా విమర్శించుకొని నీకు తోచినట్లాచరించి తరించరాదా! ఇంకను నీవిట్లు దుఃఖించుటకు కారణమేమి?

అర్జు:- [నిరాశతో] కృష్ణా! ఏమి చెప్పితివి?

కృష్ణు;- యిదియేమి యర్జునా! కర్మయోగమును చెప్పలేదా!

అర్జు:- ఆ చెప్పితివి! ఆ సమత్వబుద్ధి కలుగుట ఎట్లు ఆ కర్మల నెరుంగుట యెట్లు! లోపములు లేకుండ వాటి నాచరించుటెట్లు! ఆ ద్రవ్యశుద్ధి ఆ మనశ్శుద్ధి అబ్బో! యివి నావంటి వానికి దుస్సాధ్యములు ఆత్మస్వరూప విరుద్ధములు.

కృష్ణు:- ఊఁ! అజ్ఞానయోగమా!

అర్జు:- అది మరింత సహజముగ మనస్సు చంచలము అది యసలు అలవాటుపడిన విషయములయందే నిలువక చలించి పోవుచుండును. అది బలవంతమైనది పురుషుని క్షోభింపజేయునది. విపరీత విషయములయందు ప్రవేశపెట్టుటలో గట్టిది. అట్టి మనస్సును నిగ్రహించి జ్ఞానయోగి యగుట ఎదురుగా వీచు పెద్దగాలిని విసనకఱ్ఱతో నడ్డుటవంటిది. అది నావలన నేమగును

కృష్ణు:- ఇక మనకు నా భక్తియోగ మున్నదిగదా!

అర్జు:- అ లేకేమి! ఆరెండును యున్నగదా! ఇది యుండునది. అంగము లేక అంగి చేకూరుటెుద్దైన గలదా! గాక దానికి కూడ నిశ్చలమగు మనస్సు అపేక్షితమే గదా! అది యసంభవమని విన్నవించియే యుంటిని. అదియును గాక కృష్ణా? ఆ భక్తికి కావలసిన వివేకము విమోకము మొదలగునవి నాతరమా! ఇక నేతరించుట ఎట్లు కృష్ణా? మరియు చివరకు నీవు చెప్పుటలో గుహ్యతరమునే చెప్పితినంటివి! అయిన గుహ్యతమము నేల దాచియుంచితివి. అందులకు నే నింకను ఏమిచేయవలెను. నేను కార్పణ్యదోష దూషితుడనని మొదటనే విన్నవించియుండ పైగా నన్నిటిని విమర్శించుకొని తోచినట్లు చేయమనుచున్నావా! కన్నుపొడిచి కన్నీటికి కారణమేమనునట్లు యింకను ఏల ఏడ్చుచున్నావనుచున్నావా? నేను నీ దాసుడను గాన, నీ భక్తుడను గాన, నీ ప్రియుడగాన కృష్ణా? నీదయ నాపట్ల ఏమైనది. దయామయా! కంచెయె చేనునుమేసిన మరిదిక్కెవ్వరు.

ఉ॥ సాధనబుద్ధితో సలుపు జ్ఞానము కర్మము భక్తియున్ మహా, బాధకరంబులివ్వి భగవంతుని జేరుట కెంతమాత్రమా! రాధనసేయరానివవురా యివియానను నుద్ధరించు నీ! బోధకె నేన తృప్తి పడిపోవుదునేని నశింపకుందునే!

(అని గట్టిగ నేడ్చును.

కృష్ణు:- (దయతో కన్నీరు గార్చుచు అర్జునుని వీపుతట్టి భుజముపై చేతినుంచి) అర్జునా అధికారిని పూర్తిగ పరీక్షింపక చెప్పరాని రహస్యమగుటచే చెప్పక దాచియుంచితిని. నీ దుఃఖమ నా మనస్సును కరగించినది. నీవు నిజముగ అధికారివని కనుగొంటిని. మంత్రితుల్యమగు దీని సావధానముగ వినుము. నీ కత్యంత సులభమగునట్టియు, సర్వాధికార మగునట్టియు, అవ్యవహిత మోక్షసాధన యగునట్టి పరమ గుహ్యతమము నుపదేశించు చున్నాను.

అర్జు:- చిత్తము. మహాప్రసాదము. నీటముంచినను పాలముంచినను నీవే! నాకు వేరు గతిలేదు.

కృష్ణు:- పార్థా!

మన్మనాభవ మద్భక్తో మద్యాజీ మాంనమస్కురు
మామెవైష్యసిసత్యంతే ప్రతిజానే ప్రియోసిమే

నాయందత్యంత ప్రీతికలవాడవై నన్ను సాక్షాత్కరించు నంతటి విశదతమమగు ధ్యానము కలిగి నన్నారాధింపుము. ప్రీతితో నాకు నమస్కరింపుము. అట్లు చేసితివేని నీవు నన్నే పొంద గలవు. నీవు నాకు ప్రియుడవు గాన సిది నిజమని ప్రమాణము చేసి చెప్పుచున్నాను.

అర్జు:- (వికసించిన మోముతో నమస్కరించి) మహోపకారము (దీనిచే నిష్టప్రాప్తి నుప దేశింపబడియె. యిక ననిష్ట నివృత్తియెట్లు?

కృష్ణు:- నన్ను పొందుటకు ప్రతిబంధకములగు పాపము లెట్లు పోవుననియా నీ సందేహము.

అర్జు:- చిత్తము

కృష్ణు:- అట్లే దానికేమున్నది) మరియు (యిదుగో నీకు కఠవల్లియంతర్గతమగు ద్వయ మంత్రవివరణమై పంచమ వేదసార భూతమగు) నీ గీతకు పరమ తాత్పర్యార్థమై చరమ రహస్య మనబడు గుహ్యతమ మంత్రరాజమును నీకుపదేశించు చున్నాను.

అర్జు:- చేతులు జోడించి వికసిత ముఖముతో) ధన్యోస్మి!

కృష్ణు:- కాని,

చం॥ పరమరహస్యమీయది య । భక్తుడనాదృత దేశికాంఘ్రి స
త్పరిచయుడెంతమాత్రము త । పంబునుజేయనివాడనూయ చే
పరిగెడువాడు దీనివిన । పాత్రుడు గాడటువంటివానికి
చరమసుధారసంబిడెడు । సాహసమెప్పుడు సేయబోకుమా!

అర్జు:- చిత్తము. నీపాదములాన నీయానను గీటువాసియైనను తప్పదునాకృష్ణా! సెలవిమ్ము.

కృష్ణు—(దగ్గరకు తీసుకొని చెవులో)

సర్వధర్మాన్ పరిత్యజ్య—మామేకం శరణం వ్రజ
అహంత్వా సర్వపాపేభ్యో—మోక్షయిష్యామి మాశుచః॥

అర్జు—కృష్ణా! ఈశబ్దములు సులభముగనే యున్నను దీని తాత్పర్యముమాత్రమునాకొ కింతయు గోచరించుటలేదె! దయతో సెలవిత్తువా?

కృష్ణు—(నవ్వి) అర్జునా! ఈపనియంత సులభమైనదికాదు. దీని నెరుంగుటకు పరమసాత్త్వి కుడై యుండవలయును; (ఏలయన, అట్టివానికి జ్ఞానము నిర్మలముగ వెలుంగుచుండును. అదివానికి సాత్త్వికదైవమగు నాయందు ప్రీతిని కలిగించును. అట్టినాయందలి ప్రీతి రాజసతామసముల నడంచి నంతనే తదితరములయందు వైరాగ్యమునకు కారణమగును. అంతమాత్రమేకాక అది నాయను గ్రహమునకై నాయాజ్ఞారూపమగు శాస్త్రమునందు ఆదరమును పుట్టించును. అట్టివాడు "సర్వ ధర్మములను విడిచి నన్నేయుపాయముగా నమ్మి ఆశ్రయించిన వానిని సర్వపాపములనుండి విడి పించి నన్నుపొందింతు" ననెడు నావైభవమును విన్నచో నిది యథార్థమేయనెడు విశ్వాసము కలవాడగును.) ఇట్టివాడే ఈమంత్రార్థమును వినుట కధికారి, మనుముందిట్టి యధికారులత్యంత

విరలమైయుందురు. (వారైనను, ఈయర్థమును తగినయధికారి యార్తితో యాసన్నమైనప్పుడాత నిని సంవత్సరంబో తదర్ధంబో మాసత్రయంబో వివిధోపాయములచే పరీక్షించి కృపతో నుపదేశించుచుందురు) కాని ముముక్షువులపాలిటి కల్పవృక్షమై నాయాజ్ఞచే రామానుజ రూపముననవతరించునట్టి మాయనంతుడు మిక్కిలి శ్రమతో తానీయర్థముల గ్రహించి (ఈనిమముల కొంత సడలించి) ఆర్తికలవారందరీ యర్థము నెరుంగునట్లు భూరిప్రదానము గావించును. ఆయర్థములన్నియు నాయాజ్ఞచే లోకాచార్యులచే సూత్రీకరింపబడి వరవర మునిపుంగవులచే విశదీకరింపబడును. అందులకు నిదానముగ నేను నీకు మంత్రార్థమును సంగ్రహముగా వివరింతు నాలకింపుము.

ఈమంత్రమున పూర్వార్థముచే ముముక్షువు చేయవలసిన కృత్యమును, ఉత్తరార్థముచే శరణ్యుడనగు నేనుగావించు కృత్యమున్ను చెప్పబడినవి.

అర్జు:—అయినచో కృష్ణా! అధికారి చేయవలసిన కృత్యమేది!

కృష్ణు:—అర్జునా! శ్రుతిస్మృతులచే విధింపబడిన కర్మయోగాద్యుపాయములను "భగవత్ప్రాప్తికి సాధనములుకాని వీటిని తత్ప్రాప్తిసాధనములని భ్రమించి పరిగ్రహించితిమేయని భయపడి వాటియందలి రుచివాసనలతో గూడ విడిచిపెట్టుము.

అర్జు:—(ఆశ్చర్యముతో) యిది ఏమికృష్ణా! నీవింతవరకు పరమాదరముతో మోక్షోపాయములని నొక్కి వక్కాణించిన వాటినే విడువమనుచున్నావే, యిక ముముక్షువునకు గత్యంతరమేమి.

కృష్ణు:—అవును. అర్జునా! అవినిజముగ భగవదేక శేషభూతుడును తదేక పరతంత్రుడునగు నీయాత్మస్వరూపమునకు విరుద్ధములనుటలో సందేహము లేదు.

అర్జు:—అయినచో వాటిని వేదపురుషుడేలవిధించెను. నీవు నాకేల యింతవిపులముగ నుపదేశించితివి.

కృష్ణు:—దొంగమేతను మేసి దొరకక తిరుగు పశువును ఆవృత్తినిమాన్పి వశపరచుకొనుటకై దానిమెడయందు గుదిబండను కట్టి విడచునట్లు అహంకార మమకారములకు వశ్యుడై గర్వించి తిరుగుచున్న ఈచేతనునకు కాయక్లేశరూపమైన కర్మానుష్ఠానమును యింద్రియ జయము మొదలగు శుష్కరవ్యాపారములను ఉపదేశించినచో వాటియనుష్ఠాన మూలమున రజస్తమస్సులడగి సత్వముద్రిక్తమై రజస్తమస్సుల కార్యములగు అహంకార మమకారముల నశింపజేయును. దానిచే తాను భగవత్పరతంత్రుడనను స్వరూపజ్ఞాన ముదయించును. దానిచే భగవంతుడే సాధనమను అధ్యవసాయము జనించును. కావుననే ఆమార్గములుపదేశింపబడినవి.

అర్జు:—అయిన నేమికృష్ణా! నీవుచెప్పినట్లే కర్మయోగాదులు సాక్షాత్తుగ కారణములు కాకున్నను క్రమముగనైనను కారణములు కావచ్చునుగదా. అట్టివాటి నేలవిడిచిపెట్టమనుచున్నావు.

కృష్ణు:—ఇట్లు స్వరూపజ్ఞాన ముదయించుటకు ఈకర్మజ్ఞానయోగములే అవసరము లేదు. అవిలేకున్నను నాకృపచేతనే ఆజ్ఞానముకలిగి దానిచే భగవంతుడే యుపాయమగు అధ్యవసాయము కలుగవచ్చును గాన వాటికి పరంపరగానైనను కారణత్వ మనావశ్యకము. గావుననే వాటియందు సాధనత్వబుద్ధిని సవాసనగా విడువమంటిని.

అర్జు:-అయినచో కృష్ణా! కర్మజ్ఞానభక్తులను పూర్తిగ విడిచిపెట్టవలయు ననియేగదా! నీయభిప్రాయము.

కృష్ణు:-అబ్బే! అట్లుకాదు. నీవు వీటిని ఆచరించుచునే యుండుము. కాని నీవాచరించు వర్ణాశ్రమోచిత కర్మ సాధన బుద్ధితోగాక కరుణతో నితరులుజ్జీవించుటకే గావింపబడును గాన అది నాకు మిక్కిలి ఆనందావహమగును. అందువలన ఆకర్మ నా కైంకర్యమందంతర్భవించును. జ్ఞానము తనయందు సాధనత్వబుద్ధి పోవుటతోడనే ఆత్మస్వరూప జ్ఞానములో చేరును. ఇక భక్తియు తనయందలి యుపాయబుద్ధి పోవుటతోడనే కైంకర్యరుచి యందంతర్భవించును.)

అర్జు:-అయినచో, మోక్షోపాయమేమి!

కృష్ణు: ఆరయ సర్వరక్షకుడనయ్యును
నీకడ కింకరుండుగా
సారథినై రథంబుభయ సైన్య
సమక్షమునందునిల్పనీ
కోరిక యెద్దియో తెలియ
గోరుచు నీదాసగల్లభోగ్యహా
తీరుననెంచి నీకెవరు దిక్కువు
పించనివేళ దిక్కుగా
జేరి పిరాట్టి నీదాసగుచెప్పిన
కాదని "సత్యజేయమం"
చారసి రక్షసేయదగునట్టి
స్వభావముకలుగు నన్నుగా
భారత! నీవెఱింగి మదిభావన
చేయుముపాయ బుద్ధితో.

అర్జు:-అయినచో నిదివరలో చెప్పబడిన కర్మాద్యుపాయములకంటె దీనికిగల నతిశయమేమి.

కృష్ణు:-అబ్బో! హస్తిమశకాంతరముకలదు. చూడుము.

అరయగ నిత్యమై సులభమై
యనపాయమునై స్వరూపమై
ఖరిశనురూప మేకమయి గాకన
పేక్షము నై ప్రమాణ సు
స్థిరమయి సిద్ధమై పరమ చేతనమై
సకలాధికారమై
కరమవిలంబ్య సత్ఫలము కల్పన
జేసి విలక్షణంబుగా
బరగు నుపాయముం దెలయ
బల్కితినేనని నమ్ముమర్జునా!

# గోదాష్టోత్తర శతనామావళి

రామాయణ రత్నాకర శ్రీ ఉ. వే. శ్రీమాన్ విద్వాన్
కంద్యూరి రామానుజాచార్యులుగారు.

1 ఓం గోదాయై నమః
2 గాథాశ్రీదాయై నమః
3 శ్రీదాయై నమః
4 వేదాంతార్థ సుబోధిన్యై నమః
5 యశోదాతనయాఽమోదాయై నమః
6 గోవిందోద్వాహనోత్సుకాయై నమః
7 ధనుఃపురావతారాయై నమః
8 మనుజోద్వాహనాఽక్షమాయై నమః
9 మహాత్సూరిసుతాయై నమః
10 మాన్యాయై నమః
11 తులసీతరుమూలజాయై నమః
12 అయోనిజాయై నమః
13 అనంతగుణాయై నమః
14 నియన్త్ర్యై నమః
15 నిఖిలప్రదాయై నమః
16 ఆషాఢమాససంజాతాయై నమః
17 పూర్వఫాల్గునభోద్భవాయై నమః
18 రమ్యాయై నమః
19 రక్షణసంజాతాయై నమః
20 నమ్యాయై నమః
21 నాయకనాయికాయై నమః
22 నారాయణోత్సుకానమః
23 నిత్యాయై నమః
24 నామకీర్తన తత్పరాయై నమః
25 గోపీవ్రత సముద్యుక్తాయై నమః
26 సహనాయై నమః
25 తాపహారిణ్యై నమః
28 భూదేవ్యై నమః
29 భూతదాత్ర్యై నమః
30 భూరిదాయై నమః
31 సూరిభూషణాయై నమః
32 స్వాహాకామలినయాయై నమః
33 రంగరాజకుతూహలాయై నమః
34 రంగరాడంతరంగజ్ఞాయై నమః
35 సుందరప్రార్థనోత్సుకాయై నమః
36 దాసాభీష్టప్రదాత్ర్యై నమః
37 నాసికాభరణోజ్జ్వలాయై నమః
38 పాపహన్త్ర్యై నమః
39 తాపహర్త్ర్యై నమః
40 రూపదర్పణదర్శనాయై నమః
41 కృష్ణవిశ్లేషాఽసహనాయై నమః
42 కృష్ణాఽలింగనభాలీనాయై నమః
43 కృష్ణవిశ్లేషరోగార్తాయై నమః
44 పీతాంబరానిలాఽసక్తాయై నమః
45 తులసీధరణోత్సుకాయై నమః
46 కృష్ణపాదరజోధాత్ర్యై నమః
47 కృష్ణోష్ఠాఽమృతపాయిన్యై నమః
48 జ్ఞానభక్తిస్తనాకారాయై నమః
49 కృష్ణార్పితపయోధరాయై నమః
50 కామదేవస్తోత్రికామాయై నమః
51 రామానుజసహోదర్యై నమః
52 క్షేమంకర్యై నమః
53 క్షామహర్త్ర్యై నమః
54 శ్యామాయై నమః
45 ఆరామపరాయణాయై నమః
56 స్వామిన్యై నమః

57 స్నానకుతుకాయై నమః
58 శ్రీమత్యై నమః
59 శ్రీమహార్షిణ్యై నమః
60 శంకాహీనాయై నమః
61 శంఖపరాయై నమః
62 శంఖధ్వానమనోహరాయై నమః
63 సుపర్ణఖ్యాతశిరస్థాయై నమః
64 సుపర్ణానయయవాన్వితాయైనమః
65 సర్వగంధాయై నమః
66 సర్వరసాయై నమః
67 పుష్పసౌగంధ్యదాయిన్యై నమః
68 ఉత్తమస్యందనారూఢాయై నమః
69 పరమోత్తమభాషిణ్యైనమః
70 వైవాహికస్వప్నతోషాయై నమః
71 వివాహాచారబోధిన్యై
72 వేంకటేశోత్సవానందాయై నమః
73 వేదాంతోదంతభాషిణ్యై నమః
74 గోపీవ్రతానుకర్త్ర్యై నమః
75 గోపీవేషసుభూషణాయై నమః
76 నీళాప్రబోధనరతాయై నమః
77 నీళారక్తాచ్యుతప్రియాయై నమః
78 నందాలయద్వార్దనమాత్రాయై నమః
79 నందబోధనతత్పరాయై నమః
80 నీలమేఘకృప్రియాసక్తాయై నమః
81 వ్రతోపకరణార్థిన్యై నమః
82 చక్రభానుఘనానందాయై నమః
83 శుభనాదాభ్రతోషిణ్యై నమః
84 త్రివిక్రమమహోత్సాహాయై నమః
85 శరవద్వర్ష కాంక్షిణ్యై నమః
86 వర్షానసక్తాయై నమః
87 వ్రతవత్యై నమః
88 వామనస్థిరమానసాయై నమః
89 వసుధాయై నమః
90 వసుదాయై నమః
91 వేద్యాయై నమః
92 వరదాయై నమః
93 వైష్ణవాశ్రయాయై నమః
94 పుష్టకేశ్యై నమః
95 పూర్ణవేషాయై నమః
96 పుణ్యాయై నమః
97 పూర్వసుభాషిణ్యై నమః
98 పూజ్యాయై నమః
99 ప్రాజ్ఞప్రధానాయై నమః
100 యమునాతీరకాంక్షిణ్యై నమః
101 కృష్ణాశ్రయాయై నమః
102 కృష్ణబలాయై నమః
103 బహిరంర్నితవాసిన్యైనమః
104 రంగగోపాలమహిష్యై నమః
105 రంగరాడంఘ్రిశేముష్యై నమః
106 రంగరాట్ తత్త్వవిదుష్యై నమః
107 రంగరాద్వాసతాకృష్యై నమః

# ఢిల్లీ నుంచి సంపత్కుమారుని తెచ్చిన విషయము

విద్యారణ్యపంచానన విద్యావాచస్పతి శ్రీమాన్ విక్రాల రామచంద్రాచార్యులుగారు

తురుష్కులు ఇండియాలోకి వొచ్చుకాలము

ఢిల్లి ప్రభువు పృథివీరాజుతో జయచంద్రునకును కాన్యకుబ్జరాజుకుయుద్ధముగలిగినపుడు తనపక్ష సహాయముకొరకు మహమ్మద్ గోరీని AD 12 వ శతాబ్దములో పిలుచుకొని వచ్చినాడు.

మహమ్మద్ గోరీయొక్క మొదటి సేనానాయకుడు కుతుబుద్దీన్ అను నాతడు AD 1206 సంవత్సరమున ఢిల్లీలో పాదుషాగావున్న అల్లావుద్దీన్‌యొక్క సేనానాయకుడగు మాలిక్కాఫర్ అనునతడు రామేశ్వరం వరకు దండయాత్రి చేసెను.

భగవద్రామానుజా చార్యావతారము
శకం ౯౧౯
ఇంగ్లీషుకు శాలిశకమున్కు వారడ్జికలుపగా
AD ౧౦౧౭

AD ౧౦౧౭ సంవత్సరము భగవద్రామానుజాచార్యావతారము ఇది ౧౧ వ శతాబ్దము అవతారసమాప్తి ౧౦౧౭
౧౨౦

AD ౧౧౩౭ ఇది౧౨వశతాబ్దము రామానుజాచార్యావతార సమాప్తి అయిన పిదప మహమ్మద్‌గోరి అను తురుష్కరాజు ఇండియాలోకి ప్రథమమున ప్రవేశించెను. అంతకు తొలుత తురకలు ఇండియాలోకి వచ్చి యెరుగరు. పిదప నూటఅరువదియేండ్లు తాళి, దక్షిణదేశమును కొల్లగొట్టినారు. కావున భగవద్రామానుజాచార్యులవారు జీవించియుండు కాలమున దక్షిణదేశమందు తురుష్కుల ప్రస్తాపమే వుండివుండదు.

ఒకవేళ AD శతాబ్దమునుండి తురకలు అరేబియానుండి పంజాబ్ దేశమునకువచ్చి కొళ్ళగొట్టి యెత్తుకుని పోయినారన్నను వారు పంజాబుకు దక్షిణం తూర్పురాలేదు. ఢిల్లీలో రాజ్యస్థాపన చేయలేదు. దక్షిణహిందూస్థానము వారెరుగరు. గావున సోమనాథం మున్నగు ఆలయములగొట్టి దానిలోని ద్రవ్యమును హరించుకొని అంతట వెనుకకు తిరిగి పోవుచుండిరే గాని దీర్ఘయాత్ర చేయుటకు వారికి వసతి గలుగలేదు.

కావున భగవద్రామానుజాచార్యుల వారికి తొలుత తిరునారాయణపురంలోని ఉత్సవ విగ్రహములను ఢిల్లీపాదుషా యెత్తుకునిపోయి చెరసాలలో పెట్టినాడన్న విషయము ఆలోచించదగినది. అయితే గురుపరంపరా ప్రభావము ప్రపన్నామృతము పెరియతిరుముడియడవు ఆచార్యసూక్తి ముక్తావళి. ఈ తెంగల గ్రంథములందును యతిరాజ వైభవము మువ్వాయిరప్పడి గురుపరంపర ఈ వడగల గ్రంథములందును ఢిల్లీలో తురుష్కరాజ పుత్రి గృహమున తిరునారాయణుని ఉత్సవబేరమగు రామప్రియులున్నటుల తెలుపబడియున్నది. దివ్యసూరి చరితము పరమయోగి విలాసము అను తెంగల గ్రంథములందు ఢిల్లీ ప్రస్తావమే లేదు.

ఇట్లుండ రాజచరిత్రలకును మతగ్రంథము

నకు అర్థవిరోధము గలుగుచున్నది.

దివ్యసూరిచరితము ఒక్క గ్రంథము మట్టుకు భగవద్రామానుజాచార్యుల వారి జీవిత కాలములో యెరిగిన వారిచేత వ్రాయబడినది. మిగత గ్రంథము లన్నియు మణవాళమా ముని కాలమునకు గూడ నివతల బుట్టినవి. ఆ కాలమునకు కథలు అనేక మార్పులు బుట్టినవి. ఆ కాలమునకు కథలు అనేక మార్పులు చెందియుండుట సహజము. ఆ సమకాలమున బుట్టిన దివ్యసూరి చరితమున ఈ ఢిల్లీ ప్రస్తావ మించుకంతైన యెత్తబడ లేదు. భగవద్రామానుజాచార్యుల వారు తిరునారాయణ ప్రతిష్టను గావించి ఆ సన్నిధిన యేయే కైంకర్యము నెవ్వరెవరెటుల చేయవలసినదియు ఒక నిబంధన గ్రంథమును యేర్పరచి దానికి నియమనప్పడి యని పేరు బెట్టిరి. అందు ముందు ఆలయనిర్మాణాది విషయమును కొంత దెలిపియున్నారు. అందులో ఉత్సవబేరము ఎమ్మాళిరాయన్ అను రాజు యింట వున్నట్టున్నూ వారిని భగవద్రామానుజాచార్యుల వారికి అర్పించుచు తన రాజ్యములోని బంకాపురమను గ్రామమును గూడ సమర్పించినట్లున్నది.

కాబట్టి సాక్షాత్తుగ భగవద్రామానుజాచార్యులవారు యేర్పరచిన గ్రంథములో నున్న దానినే నమ్మవలయును. ఇట్లు నమ్మిన రాజ చరిత్రములకు గూడ విరోధము గలుగదు.

ఈ గ్రంథమున నిట్లుండ గురుచరిత్రకారు లెందుకు విరుద్ధముగ రాసిరని యడిగినచో ఈ నియమనప్పడి యనునది తిరునారాయణ స్వామి ఆలయములో జరుగవలసిన కైంకర్యములను గూర్చి వ్రాసిన పట్టీ గనుక దానిని యితరులు సంపాదించి తెలుసుకొన దగిన అవసరము యెల్లరకున్నూ వుండివుండదు. ఆ యాలయపు వారికి మట్టుకు ఉపయోగము గాన వారు ఆగ్రంథమును భద్రముగ కాపాడుకొనుచూ వారి వారి హక్కులను రక్షింపుకొనుచుందురు.

ఇట్లే శ్రీరంగమున ఆ సన్నిధిలోని విషయములను దెలుపునది కోయిలఒుగు అను గ్రంథము గలదు.

వేంకటాచలేతి హాసమాల యను గ్రంథము తిరుపతికి గలదు. అవి ఆయా దేశములలోనే రక్షింపబడును.

శ్రీరంగము తిరుపతుల గ్రంథములుకాలాంతరములలోని సంగతులను గూడ దెలుపునవి గాన కర్త యొక్కడుగనే యుండడు. ఇదిభేదము

ఈ గ్రంథము లన్నియు ఆయా పూర నాయాలయ సంబంధము గలవారికే దెలిసియున్నవి. గాని ఇట్లు గ్రంథములు గలవని గొప్ప పండితులు గూడ కొందరెరుగరు. నాకు దెలియును.

ఎమ్మాళిరాయన్ అనునత డెవ్వడనగా విచారింతిము.

పశ్చిమ చాళుక్యరాజులలో ఆరవ విక్రమాదిత్యునికి పెర్మాడియని బిరుదు గలదు. ఆ పెర్మాడి యను శబ్దము కన్నడములో హెమ్మాళి యని చెప్పబడును.

ఈ విక్రమాంకుని గూర్చియే బిల్హణుడు విక్రమాంక దేవచరిత్రమను గ్రంథమును

వ్రాసెను. ఈ రాజు శ్రీమద్రామానుజాచార్యులవారి కాలములో క్రిమికంఠచోళుడని వైష్ణవులచే చెప్పబడు కులోత్తుంగ చోళుని యొక్క శత్రువులలో ప్రసిద్ధుడైన త్రిభువనమల్ల విక్రమాంకుడని ప్రసిద్ధి.

ఈ రాజు బిరుదగు హెమ్మాడి యను దానికేరాయన్ అను గౌరవ వాచక పదమును చేర్చినియమనప్పడిలో హెమ్మాడిరాయన్ తిరుమాళిగై యితే యని గాశివున్నారు.

# అర్చావతారము

వేదాధ్యాయి వేదాంతం రాధాకృష్ణమాచార్యులు

పోరంకి.

శ్లో॥ ఆరాధనానాం సర్వేషాం విష్ణో రారాధనం పరం।
యేన కేన ప్రకారేణ విష్ణో రర్చన ముత్తమం ॥

అని ఆరాధనంబులలోను విష్ణు నారాధించుట చాల శ్రేష్ఠమైనది, యే ప్రకారంబునైనను విష్ణువు నారాధించుట యుత్తమము. ఆత్మార్థముగ స్వగృహమందు గాని పరార్థముగ నాలయమందు గాని వాసుదేవుని యర్చించ వలయును. ఈ యర్చనము లక్షకోటి గుణితంబై యొప్పును. పరశబ్దమునకు మోక్షమని యర్థము ముముక్షువులకు మోక్షమొసంగును. కావున పరార్థమని యాలయార్చనంబుకు పేరై యున్నది. సూర్యుడు పరార్థముగను గృహమందలి దీపము స్వార్థ మగునట్లు, అట్లే గృహార్చనము చేయునెడల నాయా గృహస్థులకు మాత్రముపకరించును. గ్రామార్చనము గ్రామము కాపాడును. స్వయంవ్యక్త స్థలమందలి యర్చనము సమస్త లోకములకు శుభము గలుగును. శ్రీమన్నారాయణుని యభివ్యక్తమైనప్రకారంబులై యున్నవి. అవి పరము, వ్యూహము, విభవము అంతర్యామి అర్చ యను నామంబులు గలిగియుండును. పరస్వరూపంబనిన నఖిలాండంబులకు సృష్టిమాత్రమందు ప్రయోజకంబగును. వ్యూహంబనిన మానసాదుల కిది దైవతంబై దేహాదిచలనంబులకు ప్రయోజకంబగును, విష్ణు పురుషసత్యాచ్యుతా నిరుద్ధులను పేరనియ్యది పంచవిధంబై యున్నది. విభవంబులని రాక్షస సంహారాది దుష్టశిక్షణంబున కుద్భవంబగుమత్స్యకూర్మాదులు. అంతర్యామి యన జగత్తునకాధారభూతమై ప్రతిప్రాణియందు నుండి యుండు స్వరూపము. ఈ విధంబుననే సమస్తమగు జీవకోట్లుయొక్క దుఃఖంబును శాంతింప జేయుటకు సులభమార్గంబున మోక్షమును ప్రసాదించుటకు అర్చావతారంబై యవతరించెను. పరవ్యూహంబులు నిత్యులు ముక్తులగు వారలకు మాత్రముపాసింప సాధ్యంబగును. విభవస్వరూపము ఆకాలమందుండినట్టి జనులకు మాత్రము నేత్రగోచరంబుగ కానవచ్చుటచే నదియు సర్వసులభంబు గానేరదు. అంతర్యామి స్వరూపము విశుద్ధులగు యోగిపుంగవు

లకు మాత్రము యోగదృష్టికి గోచరమగును. కావున యఖిల జీవకోటికిని అర్చాస్వరూపము నారాధించుటయందు స్వాతంత్ర్యము గలిగి యున్నది. భక్తి శ్రద్ధాదులచే నొసంగబడిన పత్రి పుష్పాదులచే పూజ అర్చారూపియగు భగవానుని యందు ఫలవంతమై దుర్లభమగు మోక్షము లభించును. ఏ గ్రామమున ఆలయమందు వైదిక విధానముగా యర్చనము జరుగుచున్నదో ఆ గ్రామమందు నివశించునట్టి ద్విజుల నెల్లరకును సభ్యాహోత్రము వంటి ఫలము నిచ్చును.

శ్లో॥ గ్రామార్చా రహితే గ్రామే ।
గృహే దేవో ప్యముక్తిదః ।
మూలనాశే తు వృక్షస్య ।
సేచనే కిం ఫలం భవేత్ ॥

గ్రామార్చనము లేని గ్రామమందు గృహార్చన సయితము ఫలవంతము కాజాలదు. వృక్షము యొక్క వ్రేళ్లు తెగిపోయిన వెనుక దానికి మొదటికి గాని శాఖలకు గాని నీరు పోసిన ఉపయోగమెట్లు కాజాలదో అట్లే గ్రామార్చనము లేనియెడల గృహార్చన ముపయోగము కాజాలదు. అర్చావతారముగ భగవాను డవతరించెడి స్థానవిశేషంబులైదు

శ్లో॥ దైవం చాపి తదైవార్షం ।
పౌరాణం మానుషం తదా ।
స్వయం వ్యక్తం చ పంచైతే।
స్థానాని పృథివీపతే ॥

దైవము ఆర్షము పౌరాణము మానుషము స్వయంవ్యక్తమని యీ భూలోకము నందర్చావతార స్థాన భేదంబులై యున్నవి. దైవమన బ్రహ్మేంద్రాదులవలన ప్రతిష్ఠింప బడినవి. దైవతములును. మరీచ్యాది మహర్షులచే ప్రతిష్ఠింపబడినవి. యార్షములన్నియు లక్ష జన్మంబులై పురాణకాలము నాటినుండి ప్రసిద్ధముగ వచ్చుచుండినవి పౌరాణంబులనియు, భక్తి శ్రద్ధాదులచే మనుష్యులచే ప్రతిష్ఠింపబడినవి మానుషంబులనియు,

భక్తుల ననుగ్రహింప నిచ్ఛగలిగి నిర్వ్యాజమగు కరుణావిశేషంబున భగవానుడే యేపుణ్య ప్రదేశమందు స్వసంకల్పముచే యావిర్భవించునో ఆ ప్రదేశము స్వయంవ్యక్త మనబడును అట్టి స్వయంవ్యక్తార్చా రూపము సర్వలోక సమృద్ధికరము,

శ్లో॥ మానుషం యోజనా దర్వాక్
దైవతం దశయోజనం
పంచయోజన మార్షంచ
పౌరాణం యోజనత్రయం ॥

మానుష స్థలము యోజన దూరము దైవతము దశయోజనము- ఆర్షమైదుయోజనంబులను - పౌరాణము యోజనత్రయంబును పవిత్రముజేయును, (స్వయంవ్యక్తస్థలే దేవస్సర్వలోక శుభప్రదః) స్వయంవ్యక్తస్థలమందలి దేవుండు సర్వలోక శుభప్రదుండు కృతత్రేతాది చతుర్యుగంబులలో నిట్టి యర్చావిధానమే మోక్షదాయకమై యున్నది. ఈ యర్చావిధానముచే నా భగవంతుని నాశ్రయించిన వారలు భగవత్తుల్యులగుచున్నారు. సర్వకాల సర్వావస్థలయందును శ్రౌత స్మార్తాది వైదిక కర్మలచే విష్ణువు నారాధించువారు మోక్షమును బొందుదురు.



# నారీవిభాగము



శ్రీమతే రామానుజాయ నమః

## తిరుక్కోళూర్ పెణ్ పిళ్ళై రహస్యము

రచయిత: శ్రీమద్భాగవత పాదరేణువు, మదరాసు.

## మహాభారతము

అ॥ యాఙ్ఞాసత్య మెన్రేనో కృష్ణనై ప్పోలే ।

తె॥ 'అహమేవ సత్య' మన్నానా కృష్ణునివలె॥

౭

శ్రీకృష్ణ పరమాత్మ పరీక్షిత్తు అశ్వత్థామ యొక్క అస్త్రఘాటిచే విగతజీవుడై పుట్టగా

భార॥ శ్లో॥ గా॥ యదిమే బ్రహ్మచర్యంస్యాత్ మయిసత్యంతుతిష్ఠతి ।
ఆవ్యాహతం మమైశ్వర్యం తేనజీవతబాలకః ॥

అను నీ మూడు ప్రమాణములచే బ్రతికించెను.

తె, భా॥ తే॥ పగఱయెడనైననే బొంకుపలుకనేని । సమరముఖమున నెన్నడుజలితవృత్తి ।
బిరిదికడుగిడనేని యిప్పున్నవాని యంగమునజీవ మిూప్రొద్దుయావహిల్లు॥
తే॥ మహితసత్యంబు పరమధర్మంబుగాఢ నిర్మల బ్రహ్మచర్యంబు నిత్య
సుప్రతిష్ఠితంబయి నాయందు దేజగిల్లు నేని యిబ్బాలునకు జీవమిపుడవచ్చు॥
బ్రహ్మచారీత్యత్ర కాణ్వాయన స్మృతిరర్థత ఉపక్రమ్యతే
కాణ్వాయని స్మృతిః॥ బ్రహ్మచారీ చతుర్విధః।గాయత్రః।బ్రాహ్మః।ప్రాజాపత్యః।బృహాన్ ఇతి।

శృ॥ తత్రోపనయనాదూర్ధ్వం య స్త్రిరాత్ర మక్షారలవణాశీ గాయత్రీం అధీతే సగాయత్రః
యస్తు వేదస్య గ్రహణాంతం బ్రహ్మచర్యం చరతి స బ్రాహ్మః ।
ఋతుకాలే స్వదారగామీ నిత్యం పరస్త్రీవిముఖః స ప్రాజాపత్యః ।
సంవత్సరం వేదకృద్వాటు రపి ప్రాజాపత్య యేవ ॥

ఆ మరణాంతం గురుకులవాసీ స నైష్ఠికో బ్రహ్మన్నిత్యుచ్యతే ॥

మనువాక్యం

శ్లో॥ షోడశర్తు నిశాః స్త్రీణాం తస్మిన్ యుగ్మాసు సందిశేత్ ।
బ్రహ్మచార్యేవ పర్వాద్యా శ్చతస్రశ్చ వివర్జయేత్ ॥

తా॥ బ్రహ్మచారియైనవాడు స్త్రీలకు ఋతుదినములు పదునారింటిలో రాత్రులలో సరి దినములందు గూడవలెను. పర్వములు నాలుగింటిలో గూడుటను మానవలెను.

ఉపనిషత్తులు ॥శ్లో॥ స్వదారే విధివత్కృత్వా నివృత్తి శ్చాన్యత స్సదా
మనసా కర్మణా వాచా బ్రహ్మచర్య మితి స్మృతం॥

తా॥ స్వభార్యయందు ఋతుకాలవిధి ననుసరించి ప్రవర్తించువాడై మనోవాక్కాయ కర్మములచేత నితరకాలములందు విషయనివృత్తి గలిగియుండుట బ్రహ్మచర్య మనబడును.

శ్లో॥ ఋతుకాలాభిగామీ యః స్వదారనిరతశ్చయః ।
స సదా బ్రహ్మచారీ హి విజ్ఞేయ స్స గృహాశ్రమీ॥

తా॥ స్వపత్నియందు ఋతుకాలమున మాత్రము ప్రవర్తించువాడై ఇతరకాలములందు విషయరహితులైన స్త్రీ పురుషు లిర్వురును బ్రహ్మచారిణీ- బ్రహ్మచారులే యగుదురు.

శ్లో॥ పరదార పరిత్యాగీ స్వదారపరితుష్టితః । ఋతుకాలాభిగామిత్వా ద్బ్రహ్మచారీ గృహీరితః ॥

తా॥ పరస్త్రీలను తల్లులవలె చూచువాడును ఋతుకాలములందు మాత్రము స్వపత్నియందు గృహస్థధర్మము నిర్వహించు వాడును అగు గృహస్థాశ్రమి కూడ బ్రహ్మచారి యనంబడును.

[తి. అ.] శ్రీకృష్ణుని వలె మృత శిశువును బ్రతికించినానా?

# శ్రీరామాయణము

అ॥ అడయాళంశొన్నేనోకవందనైప్పోలే॥

తె॥ ముందుకు మార్గములను సూచించి నానాకబంధునివలె ॥

౨

సీ॥ శబరిని గనుగొని యరుగుమీరావల బంపాసరోవరప్రాంతమునకు
నచ్చట సుమభారహారిశైలము ఋశ్య మూకంబు పొలుచు ననేకపముల
సమ్మార్గమున జేసి సౌఖ్యంబుగాగొండ నెక్కంగరాదది నిక్కువంబు
ఆమలపై నిద్రనందువారే సొమ్ము గలలోనగాంచు మేల్కనియంత
చానిబడయును బాపులాధరణిధరము పై కిజనరాదు చనినిద్రగైకొనినను
రాక్షసులు వారి బ్రహరింత్రు రామచంద్ర బ్రహ్మనిర్మితమియ్యది పార్థివేంద్ర ॥

సీ॥ ఎలుగులబులులును నింద్రనీలచ్ఛాయ మృగములగన శోకమెడలునీకు
నాపర్వతమున మహాగుహయొక్కటి యుర్వీశ యొప్పారుచుండునదియు
రాతి పెన్మూతచేగ్రాలెడు నద్దాని జొరగబూనుట సుఖకరముగాదు
తద్గుహకును దూర్పుద్వారంబుకడనొండు మంచిచల్లని నీటమడుగు గలదు ॥

గీ॥ ఆజలాశయతీరంబు తేజరిల్లు హరిఫలమాత్మమై హరిణనికర
యుక్తినాగు హనుగ్రీవుడుండుసయ్యు వానరచతుష్కయుతుడై వాలి భీతి॥

నీకన్నివిధముల సీతాన్వేషణమునకు తోడ్పడసమర్ధుడు గాన స్నేహపాత్రుడని విన్నవించెన

తె॥ అ॥ కబంధునివలె గురుతులు దెల్పినానా ?





# శ్రీకృష్ణజయంతి ★ తిరువధ్యయనము

శ్రీమాన్ శ్రీమత్తిరుమలై నల్లాన్ చక్రవర్తి సంపత్కుమార జగన్నాధ తిరువెంకటాచార్యులుగారు

శ్లో॥ నందంతు నిందంతు హసంతు వాపి । యధాకధం వాప్యదునా భవంతు ।
మయాభవచ్చాసన మేవకార్యం । కింవాభవే దిత్యపహాయశంకాం ॥

శ్లో॥ పరిహాస్యాస్య సత్వేపి । నోహసంతి విపశ్చితః ।
తదభావే విహాసశ్చే । త్తన్న్యూనమితి కధ్యతే ॥

శ్రీకృష్ణజయంతి రోజున తిరువారాధన రాత్రిని జరుగవలెను. తిరువధ్యయనము పగలే జరుగవలెను. భగవదారాధన జరిగిన గాని తిరువధ్యయనమును జరుపవీలులేదు. ఇవి రెండును ఒకే రోజున జరుపవలసివచ్చినచో చేయవలసిన విధానమేది? యని సంశయము. ఇందులకు కొందరు రాత్రిని శ్రీకృష్ణజయంత్యారాధనము జరిపి యారోజుపవసించి మరునాడు తిరువధ్యయనమును జరుపవలయు ననుచున్నారు. ఈ పక్షమునకు ప్రమాణ బలముః లేదు. యుక్తి బలము లేదు, జయంతిని గురించి తిరువధ్యయనమును ఆరోజున మానిన మృతదివసాతిక్రమణదోషము, తప్పదు. భుజించిన గదా యీ దోషము వచ్చుట యందురా? ఏదో ప్రమాదవశమున తిరువధ్యయనమును జరుపుట కాటంకము కలిగినపుడు భుజింపకుండ నుండి యాటంకము తీరగనే తిరువధ్యయనమును జరుపుమని యున్నది గాని బుద్ధి పూర్వకముగ తిరువధ్యయనమును జరుపక యుపవాస ముండుమని యున్నదా? కనుక నీ దోషము తప్పదు. మరియు నారోజున తిరువధ్యయనమును గురించి తీర్థప్రసాదములు పుచ్చుకొనకున్న తిరువారాధన పూర్తిగాదు. అట్లని స్వీకరించిన పితృదేవతల నతిక్రమించి నట్లగును. అట్లయిన నేకాదశియిందెట్లందురా?

ఆరోజు మహానివేదనము లేదు గనుక బాధ లేదు. ఈరోజది యుండుటచే దాని గూడ గొనవలశి వచ్చును. ఆనాటి తీర్థప్రసాదములనే మరునాడు వినియోగించిన విపరీతానుష్ఠానమగును భగవత్తీర్థప్రసాదములను ఆనాడు వినియోగింతురా? ఇది చాలా యసౌకర్యమైన కృత్యము. ఇట్లని శాస్త్రమును లేదు. మరియు నిట్లు జేసినచో మరునాడు తిరువారాధన జేయవలెనో మానవలెనో తేలదు. చేసిన యెడల ఆనాటి తీర్థప్రసాదముల నేమి జేయవలెను. మానిన యెడల నా మరునాడు పెరుమాళ్ళకు సంప్రోక్షణ జరుపవలసియుండును. అందుకని రెండు రోజుల తీర్థ ప్రసాదములను కలిపి వినియోగించిన మరీ యసౌకర్యమైన కృత్యము. ఒక రోజు తీర్థప్రసాదములను వదలెదమందురా? అట్లుజేసిన నేరోజునందలి తీర్థప్రసాదములను వదలెదరో యారోజునందలి యారాధన లోపమును జెందును. అయినను వదలదగినవియే రోజువి? మొదటి రోజువియైన కర్తకును భోక్తలకును జయంత్యారాధన సంబంధమే లేకపోవును. అది శ్రీవైష్ణవత్వభంజకము. రెండవరోజువి వినియోగింతురేని పర్యుషితత్వాది దోషములు శక్యశంకితములై యుండు వానిని వినియోగించుటయునే దోషమును లేని వానిని పరిహరించుటయు పరిహాస్యములు. మరియు జయంతినాడుపవసించునది కర్తయే గదా? తక్కిన వారికీ నిర్బంధము లేదు గావున వారానాడు తీర్థప్రసాదములను స్వీకరింతురా? లేదా? స్వీకరింతురేని వారి శేషమునాయీ తిరువధ్యయనమున వినియోగించునది? [వినియోగించునెడల]ఒక వేళస్వీకరింపక మానెదరా? శ్రీవైష్ణవత్వము చెడునుగదా? మరియు భోక్తలను నియమించునది యెప్పుడు? మృతితిథిరోజుననా? తిరువధ్యయనమును పెట్టెడిరోజుననా? మృతతిథిరోజుననైన భోక్తలకును కర్తకు గలిగినన్ని యిబ్బందులు కలుగును గదా? ఈ యిబ్బందుల కియ్యకొని యెవరు భోక్తలుగా నిష్టపడెదరు? అప్పుడు బ్రాహ్మణాభావమే గదా? మరునాడే భోక్తలను నియమింతుమందురా? వారికి జయంత్యారాధన ప్రయుక్త తీర్థప్రసాద స్వీకారము తొలినాడే జరిగియుండును గావున తిరుగ తిరువధ్యయనాంగముగ శక్యశంకిత దోషవిశిష్ట తీర్థప్రసాద స్వీకారమును జేయుట యొక యనవసరమైన విపరీతము. అందుకని వారవి గ్రహింపరా? వారు గ్రహింపని కర్తకు గ్రాహ్యము లెట్లగును? కానిచో నీపనికి జయంతీ సంబంధము గలుగుటెట్లు? ఆరోజున కర్త జయంత్యారాధనమునందు పాలుగొనకుండునందురా? అట్లయిన రెంటికిని జెడునుగదా? ఆరోజు కర్త యుపవసించుట కారోజుపవాసదినమా? కాని యప్పుడుపవాస మెందులకు? దీనివలన రెంటికిని జెడుటయే గాక యనవసరముగనుపవాసము జేయుట యొకటి మిగులును. కనుక నీ పక్షముపపన్నము గాదు.

మరికొందరు రాత్రిని నక్షత్ర దర్శనము కాగానే జయంత్యారాధనము జేసి పిమ్మట తిరువధ్యయనమును జరిపెదమనుచున్నారు. వీరినెవరైన నిశీథత్వసామ్య మాత్రముననే మనస్తృప్తిని పొందదలచితిరా యని యడిగిన నప్పటికే నిశీదమెక్కడనందురు. కాని పగలు జయంత్యా

రాధనమును జరుపగాదని ప్రబలమగు నిషేధము లేనందుచేతను రాత్రిని తిరువధ్యయనమును జరుపరాదను నిషేధమున్నందు చేతను ఇట్లు జేయుట యనవసర విపరీత కృత్యమే యగును. ఈ నిషేధము రాత్రి సామాన్యమునకే గాన నిశీథశ్రాద్ధాచరణనిషేధము మీకు తగులునన రాదు. ఇక జయంత్యారాధనమును పగలు జరుపరాదని ప్రత్యేక నిషేధము లేకున్నను రాత్రిని జరుపవలయునని యున్నందుచే నిది యే దానిని సూచించుచున్నదందురా? ప్రబలముగు ప్రత్యక్షనిషేధము లేనందున నిట్టిది గల తిరువధ్యయనవిధితో నిది డీకొనజాలదు. అపుడు ప్రబలమగు తిరువధ్యయనవిధి దుర్బలమగు జయంత్యారాధన విధిని స్వావిరోధముగ జరుగునట్లు నియమించును. కనుక నీపక్షమును అనుపపన్నమే యనదగును.

ఇంకను కొందరు మామూలుగా తిరువధ్యయనమును జరిపి కర్త తానుమాత్ర ముపవాసముండి రాత్రిని జయంత్యారాధము జేసి భుజింపదగుననుచున్నారు. ఈ పక్షము నందు సంక్రమించు దోషములు కొన్ని పైని జెప్పబడియే యున్నవి. ఇంకను గలుగు దోషములెవ్వియనిన భోక్తలు నిర్గమింపగనే పితృశేషమును భుజింపకుండుట యొకదోషము. ఇందుచే తిరువధ్యయనము పూర్తిగాదు గనుక భగవదారాధన కధికారము గలుగదు. కనుక దాని యందు ప్రవేశించుట యొక దోషము. అందుకని తిరువధ్యయనము జరుగగనే పితృశేషమును గ్రహించిన భగవదారాధన కసలే యధికారము లేదు. జయంతీదినమందు పగలు సామాన్యారాధన జేయుట యొక దోషము. అప్రసక్తముగ మరల రాత్రిని జేయుట యొక దోషము. జయంత్యారాధనాంగముగ రాత్రియందును తిరువధ్యయనాంగముగ పగలును రెండుసారులు రాజభోగమును సమర్పించుట యొక దోషము. దోషమని యేది మానినను దోషమే. ఇందునకు శాస్త్రము లేదు గనుక నిదియు కామకార కృత్యమే. అయిన నిక కర్తవ్యమగువిధాన మేది యనిన పగలే ఆకృష్ణజయంత్యారాధనమును జరిపి యనంతరము తిరువధ్యయనమును జరుపవలెను. ఇట్లయిన పైదోషము లేవియు సంక్రమింపవు. ఇందులకు శాస్త్రమున్నదా? యని యడుగవచ్చును. ఉన్నదని కొందరనుచున్నారు ఉండనిండు, ఉండకపోనిండు ప్రమాణ విచారమే యనవసరము. ఏమనిన "జాతాశౌచమృతాశౌచ గ్రహణైకాదశీర్వినా మృతాహస్సమతిక్రమ్యచండాలః కోటిజన్మసు" అను వచనమును విమర్శించిన మృతదివసాతిక్రమణమును జేసినను తప్పులేని సమయములన్నియు దెలియబడుచునే యున్నవి. అందు జేరనిదేదియు నట్టిది గాదని స్పష్టమగుచునే యున్నది. కనుక వేరొక ప్రమాణ మనవసరము. ఏకాదశీ వ్రతమును తిరువధ్యయనమును సమము గాన కరణే ప్రత్యవాయజనకములు. కనుక వానికి రెంటికిని పరస్పర విరోధము గలిగినపుడొక నిర్ణయమవసరమైనది. అందువలన పైవచనము పుట్టినది. ఏకాదశీ వ్రతమని నేకాదశ్యుపవాసము దీనిని మాన తగిన సమయమెప్పుడును లేదు. తిరువధ్యయన మాశౌచాది ప్రతిబంధకములు వచ్చినపుడవి నివర్తింపగనే జరుపదగినదియే య

గుటచే నిదియు నెప్పుడును మానదగిన దిగలే
దు. అందుచేతనే యివి రెండును పరస్పరవిరోధ
పరిహార పూర్వకముగ జరుపదగినవి యైనవి.
ఆవిధానమును శాస్త్రమే నిర్ణయింపవలయును.
కావున పై శాస్త్రమవతరించినది. జయంతీవిష
యమును ప్రపన్నుల కత్యంతముఖ్యమైన యుత్స
వ విశేషమనియున్నను యేకాదశి వంటిదిగాదు.
తిరువధ్యయనము వంటిదిగాదు. కనుకనే యా
శౌచాది ప్రతిబంధకము లేవివచ్చినను దానికి
ప్రకారాంతరేణ అనుష్ఠానము లేదు. రాత్రిని
చేయదగిన జయంత్యారాధనమును ఆరోజు తిరు
వధ్యయన మైనచో పగలే చేయునెడల నిదిప్ర
కారాంతరేణ అనుష్ఠానముగా లేదా ? యందు
రేమో ? ఇది యొక్కటియేగాని యిట్లన్ని ప్రతి
బంధకములకును పరిహారము జేయువిధానములు
లేవుగదా ? కనుకనే ప్రశ్న కుదురదు. ఇది యిట్లు
నుటకు కారణమేమందురా ! ఇది యకరణేప్ర
త్యవాయ జనకముగాక కరణేఅభ్యుచ్ఛ్రయజనక
మగుటయే కారణము ఈరెండువిధములలో మొ
దటి విధమేగదా ? మనకు గ్రాహ్యమని యడుగ
వచ్చును. కాని యది కర్మవిషయమున గాని
జ్ఞానవిషయమునగాదు. ఇది భగవద్విషయము
గావున జ్ఞానవిషయమైనది. ఏకాదశియు భగవ
ద్విషయంగనుక జ్ఞానమునకు సంబంధించినదే.
అయినపుడిదియు జయంతియు నొకవిధమైనవే
యనరాదా ! అనిన నిట్టివేమైనను ఏకాదశి యక
రణే ప్రత్యవాయజనకము జయంతి కరణేఅభ్యు
చ్ఛ్రయు జనకము. కనుకనే యీ రెంటికిని పై
రీతిగా భేదము గలిగినది. జయంతి దుర్బలమైన
చో ప్రబలమగు తిరువధ్యయనము కిన్న ము దె
ట్లు జేయవలెనదయ్యెనందురా ? తిరువధ్యయన
ము భగవదారాధనానంతర కర్తవ్యము. జయం
త్యారాధనము భగవదారాధనాంతర్భూతము.
కనుక నిదిముందు జేయదగినదయ్యెను. రాత్రిని
చేయదగిన దీనిని తిరువధ్యయనము కొరకు పగ
లు జేయుటచే నిదిగౌణమయ్యె నందురా? అట్ల
నరాదు. ఈరోజున నిట్లే చేయవలసియున్నం
దున నిదియే ముఖ్యమనదగును. కనుక వ్రతకా
లపరిత్యాగ దోషములేదు. శాస్త్రోక్తములుగాని
యింకే యిబ్బందుల వలన నైనను దీనిని పగటి
యందే జరిపిన గౌణమన దగును. కానియపుడైన
నను ప్రబలమగు దోష మేదియునున్నట్లు
లేదు. ఈ విషయ మిట్లు పరిష్కృతమైన
ఇక తిరువధ్యయనము రాని దివసమున జయం
త్యారాధన మెపుడు జరుగ వలయునను నిది
విచారింతము.

శ్రీకృష్ణావతారము రాత్రియందు జరిగినది
గావున దీనికి ముఖ్యకాలమదియే యని నిశ్చయ
ము; రాత్రియనిన రాత్రి సామాన్యమే వివక్షి
తము. భగవదవతార మర్ధరాత్రమున నైనదని
కాబోలు నంతవరకు వేచియుండవలయునని కొం
దరనుచున్నారు. కాని యట్టివిధి యున్నదందు
రా ! అందు లేని చూపింపవలయును. కానిజయం
త్యామేవకృష్ణస్య విహితానిశిపారణా యను
టచే పారణయే నిశియందని యుండె ఇక నారా
ధన మునిశీథమందెట్లు? నిశి యనగా రాత్రి
యందని యర్థము. కాని నిశీథమందనిగాదు, నిశీ
థమనగా నర్ధరాత్రము. అర్ధరాత్రనిశీథౌద్వౌ
అని నిఘంటువు. కనుక నర్ధరాత్రము వరకువేచి
యుండవలయు నను వాదమునిరస్తమైనది, ఇటుల

జేయుటవిధి ప్రయుక్తమే గావున తమయాను
కూల్యమునకై చేసిరనరాదు. మరియు భగవదవ
తారసమయ మెప్పుడని ముందు వీరి నడుగుదము
అర్ధరాత్రమంటిమి గదా యనిన నందులకు ప్ర
మాణమేమి ? నిశీథేతమ ఉద్భూతే యను శ్రీ
భాగవతవచనమే ప్రమాణమందురా! ఆవచన
మందే 'జాయమానే జనార్ధనే' యనుటచే భగవ
దవతారమున కవ్యవహిత పూర్వకాలమని తె
లియవచ్చుచున్నది. అవతారకాలము మాత్ర
మావిరాసీద్యథాప్రాచ్యాం దిశీందురివపుష్కలః
అనుటచే చంద్రోదయమైన కొంతకాలమున కని
తోచుచున్నది. అనగా నిశీథమందవతరింప
గడంగెను. అవతరించునప్పటి కపరరాత్రియైనది
నడుమను గొంతకాలమున్నది. కనుకనే దీనినాం
ధ్రీకరించిన పోతన్నగారు పంకజముఖి నీళ్ళాడను
సంకటపడునని చెప్పినారు. ఆరోజష్టమి గావున
చంద్రోదయమే 16 గడియలకగును. ఉదితు
డైన చంద్రునకు పుష్కలత్వ మింక గొంతకాల
మునకు గాని కల్గదుగదా! మరియు పగలష్టమి
యుండి రాత్రికి నవమియున్నచో నింకను గాల
హరణమగును. రోహిణీ ప్రాధాన్యముగ జేయు
నెడల "అష్టమ్యాం వా నవమ్యాం వా దశమ్యాం
యదిరోహిణి" యనునట్లా రోహిణి దశమిరోజు
ననయ్యెనేని యింకను గాలవిలంబమే. ఇవియన్ని
యునపరరాత్రిలో నివేయగును. 'ఆవిరాసీ'త్తను
నదియుదాహరణము మాత్రమేగాని యవతార
కాలము చంద్రోదయానంతరమని చెప్పుటలేదం
దురా ? చంద్రోదయమును భగవదావిర్భావ
మును నేకకాలముననైన దానిని దీనికి దృష్టాంత
ముగ జెప్పుట రమ్యముగనుండును. దేవకియందు
భగవానుడుదయించినాడు. తూర్పుదిక్కునందు
చంద్రుడుదయించినాడు. అతడెట్లు పుష్కలుం
డుగ నుండెనో యితడు నట్లెయుండెను. అతనికి
దిక్సంబంధ మెట్టిదో యట్టిదే యితనికి దేవకీదేవి
గర్భసంబంధము నని స్వారస్యముగ నుండును.
కనుకను అర్ధమే గ్రాహ్యము. స్వారస్యముగల
యర్థమును విడువనేల సామాన్యార్థమును గ్ర
హింపనేల కనుక నపరరాత్రియే యవతారకాల
ము, అంతవరకు వేచియుండి యారాధనము నా
రంభింపవలెననిన నించుమించుగా తెల్లవారవ
చ్చును, అపుడు తీర్థప్రసాద స్వీకారయోగ్యత
లేదు. యోగ్యతలేని కాలమున స్వీకరించుటవి
శేషవిధి యందురా! ఆవిధిని జూపవలయును,
కాని మనయిష్టము వచ్చినట్లు విశేషవిధి యనిన
జెల్లునా! తీర్థప్రసాదస్వీకారమునకును కొన్ని
కట్టుబాట్లు గలవుగదా ? వచనాత్ ప్రవృత్తిర్వ
చనాన్నివృత్తిః అనుటచే మనము స్వతంత్రింప
వీలు లేదుగదా! ఆసమయమువరకు దీనిని జేయ
రాదనిన నసలా ఆరాధనప్రారంభింపనే కూడదా
పూర్తి జేయుకూడదా ప్రారంభింపనే కూడదనిన
పునరారంభింప యారాధనము మరురోజునకు
జేరి యారోజారాధనమే శూన్యమగును, అర్ధరా
త్రము దాటిననే తరువాత కృత్యములు మరు
రోజునకు సంక్రమించుచుండగ్గా నికనపరరాత్రిని
గురించి సందేహమున్నదా "రాత్రౌ త్రిభాగం
కుర్వీత" యనునది యీవిషయమునందు గాదు
గదా "అర్ధరాత్రాదధస్తాచ్చేత్సం క్రమేద్యదిభా
నుమాన్" ఇత్యాదివచనములచే నర్ధరాత్రానం
తరకాలము మరురోజునకు జేరుట మనమెరుం
గనిది గాదుగదా ? ఇది ధనుర్మాస ప్రవేశాదుల

యందు స్పష్టము ఒకవేళ పూర్ణిమాత్రము జే
యరా దండురా ఎంతవరకు జేయవలెను ఎక్క
డనుండి యాపవలెను ఇక నపరరాత్రియని గ్ర
హించిన నీదోషములుగాని యర్ధరాత్రమని గ్ర
హించిన నేదోషమును లేదుగదా యందురా?
అవతారకాల మర్ధరాత్రముగాదని పైనిదెల్పితి
మిగదా? అయినను ఉక్తదోష పరిహారమున
కొకవేళ నర్ధరాత్రిమే యవతారకాలమని గ్ర
హించినను తీర్థప్రసాద స్వీకార
యోగ్యకాల మతిక్రమింపకమానదు,
అప్పుడును ప్రారంభింపగూడదా? ఇత్యాది
ప్రశ్నలు కలిగియే యుండును, అర్ధరాత్రము
దాటినగాని దాటకున్న పరదినమునకు జేరదం
దురా? అర్ధరాత్రిముపూర్వదినమునకు జేరునా?
"యోయమేకాదేశస్య పూర్వస్యాంత వత్ పర
స్యాది వత్ స్యాత్" అనునట్లు రెంటికిని జేరు
నందురా? అప్పు "ఉిదమిత్థ" మని నిర్ణయింప
వీలు లేదు గదా? ఒకవేళ పూర్వదినమునకే చేరు
ననుకొన్నను తీర్థప్రసాద స్వీకారమునకు
మాత్రము యోగ్యమగు కాలము లేదుగదా?
అది జరుగని యారాధనము వ్యర్థమే గాక
దుష్కృతము గూడ నగునుగదా! ఇందువలన
తీర్థమును మాత్రమప్పుడు స్వీకరింతుమందురా?
ప్రసాదము నేమి జేయుదురు! మానిన నపచా
రమే గదా? గ్రహించిన నిషిద్ధమే గదా! తీర్థ
మునకు బనికి వచ్చిన కాలము ప్రసాదమున
కెట్లు పనికిరాలేదు? అసలు ప్రసాద స్వీకార
మనిననేమి? కరతల ప్రసాదముగా బదరీఫల
మాత్రముగా గ్రహించు శుద్ధాన్న వ్యతిరిక్తము
లగు నుపహారాదులను గ్రహించుటా? భోజన
విధి ప్రయుక్త పరిషేచనా పోశనాది పూర్వ
కముగా విస్తరియందుంచుకొని భుజించు సర్వం
జన శుద్ధాన్న స్వీకరణమా? మొదటిదే యనిన
జయంత్యారాధనమందు మహానివేదనముగ లేదు
గదా? అది యనిన సర్వంజన శుద్ధాన్న నివేద
నమేగదా? అట్లు నివేదితముగ వచ్చిన ప్రసాద
మును భోజనవిధి ప్రకారముగ భుజింపనిచో
మరల దానికి దుర్వినియోగమే గదా? ఇందు
కని మహానివేదన మానిన నారాధన లుప్తమ
గుటయే గదా? అందుకని భుజించిన యెడల
నసర్హమగు కాలమున భుజించిన దోషమగు
గదా? ఇట్లు భుజించుట విశేషవిధియనిన నిది
పామండత్వసంపాదకమై శ్రోత్రియగోష్ఠియందు
నగు బాట్లకు దెచ్చునుగదా? భగవదారాధనా
నంతరము తీర్థప్రసాదములను గ్రహింపక తప్ప
దన్న మాత్రమున నేకాలమైనను తప్పు లేదని
సమన్వయించినచో భగవదారాధనముగాకుండ
తిరువధ్యయనమును జరుపరాదనుటచే నపరరా
త్రి యందైనను తిరువధ్యయనమును జరుపవ
చ్చునని గూడ సమన్వయింప వలసివచ్చును.

విష్ణోర్నివేదితాన్నేన యష్టవ్యం దేవతాంత
రం పితృభ్యశ్చాపితద్దేయం తదానంత్యాయ
కల్పతే ఇత్యాది వచనములచే భగవదారాధన
గాకుండ తిరువధ్యయనమును జరుపవీలులేదు
గదా? ఇక శిష్టాచారముల పైనిట్లు ప్రశ్నింపవ
చ్చునా? యని యొక యాక్షేపమున్నది. ప్ర
మాణబలము యుక్తిబలము సమానముగనున్న
యాచారభేదములను గురించి శిష్టాచారములను
గౌరవముతో నెవరి యిష్టానుసారముగ వారవ
లంబింప వచ్చుగాని యిందులకు వ్యతిరిక్తము

ను వానిని శిష్టాచారము లనరాదు, ఇన్నివిధ ములగు నాచారములకును అనుష్ఠాతలు పండితులే కావచ్చును. ఐనను ఒక్కరికి సర్వవిద్యల యందును ప్రవేశముండదుగదా కొన్ని విద్యల యందు తాము ప్రవీణులయ్యును తమకు ప్రవేశములేని విషయములను గురించి వానిని తెలిసినవారి సలహాతీసుకొని ప్రవర్తించుట దగును. అట్లుగాక తమ కగౌరవమని భ్రాంతితో తోచినట్లు జేయుట తెలిసీతెలియని యనుష్ఠానమగును. ఒక్కొక్కప్పు డొక్కొక్కరికి తెలిసిన విషయమున గూడ భ్రమప్రమాదాదులు కలుగవచ్చును, కనుక తగిన వారి సలహా తీసుకొనుట యవసరమే. అట్లు జేయనివారి యనుష్ఠానమును (వారు శిష్టులైనను) శిష్టాచారమందురేని దానిపై విమర్శింపదగదు. ప్రతివిషయమునకును ప్రమాణమైన నుండవలెను, ఉపపత్తియైన నుండవలెను. ఇందేదియున్నను గ్రాహ్యమే, ఏదియు లేనిచో త్యాజ్యమే, ప్రమాణ వచనమున్నను దానికి దేశకాలపాత్రాది విభాగమొకటి విమర్శనీయము. విధివేరు, యుక్తివేరు. విధినే ప్రమాణమందురు. యుక్తినే యుపపత్తి యందురు. విధిలేని దానిని అవిహిత మందురు. యుక్తిలేని దానిని యుక్తిహీనమందురు. యుక్తి యుక్తము గానిదనిన నదియే. ఇట్లు గాక తోచినట్లనిన జెల్లదు.

# ప్రచార విభాగము.

భక్తి "నివేదన" అనుబంధము

మదరాసు శ్రీయతిరాజ సేవామహిళా మండలవారిచే ప్రతిసంవత్సరము జరుపబడుచుండు

## భగవద్గీతా పరీక్షా వివరములు.

ఉద్దేశము:—స్త్రీలలోను, అందును విశేషించి స్కూళ్ళయందు విద్య నభ్యసించు బాలికలయందును విరివిగా గీతాప్రచారమును గావించుట

మూడు సంవత్సరములలో ప్రథమ-మధ్యమ-ఉత్తమ పరీక్షలయందు క్రమముగ ఉత్తీర్ణులై గీతలోని విషయములను సమగ్రముగ తెలుసుకొని సుమారు 180 శ్లోకములను టీకాతాత్పర్యములతో కంఠస్థపరచి జీవ-ఈశ్వర-ప్రకృతి తత్త్వముల స్వరూపస్వభావాదులను అవగతము చేసుకొనుటకు అవకాశము కల్పించుట.

పాఠ్యక్రమము:—గీతామందిర ప్రచురణమైన టీకాతాత్పర్య సహితమగు భగవద్గీతనుండి ఒక్కొక్క-సంవత్సరమునకు క్రమముగా ఆరు అధ్యాయములలోని విషయములున్ను వాటినుండి పరీక్షాధికారులచే నిర్ణయింపబడిన 60 శ్లోకములున్ను, గీతామందిర ప్రచురణమగు తత్త్వత్రయ వివరణమనబడు జీవేశ్వర ప్రకృతితత్త్వములలో ఒక్క-తత్త్వమున్ను ఇట్లు మూడుసంవత్సరములలో సమగ్రగీతా విషయములున్ను, 180 గీతాశ్లోకములున్ను, తత్త్వత్రయ వివరణము సమగ్రముగనున్ను పరీక్షింపబడుచుండును.

పరీక్షాకాలము:—ఈపరీక్షలు ప్రతిసంవత్సరము ఒకసారిమాత్రమే నిర్ణీతకేంద్రములలో నవంబరు నెల మొదటివారములో ఆదివారమున జరుపబడుచుండును.

పరీక్షావిధానము:—ప్రతి పరీక్షకును రెండుప్రశ్న పత్రములుండును. ఒకటిచదివిన గీతావిషయములలోని ప్రశ్నలున్ను, వల్లించిన శ్లోకములనుగూర్చిన ప్రశ్నలున్ను కలిగియుండును.

రెండవది తత్త్వత్రయ వివరణములోని నిర్ణీతవిషయములను గూర్చినప్రశ్నపత్రము

పరీక్షకేంద్రము:—ఈపరీక్షలకు 5 గురు స్త్రీలుఉన్న ప్రతిగ్రామమునను ఒక పరీక్షాకేంద్రముండును. పరీక్షాధికారులచే నొసంగబడు రెండుప్రశ్న పత్రములున్ను వేరువేరు కవర్లలో సీలు చేయబడి దేవస్థాన ధర్మాధికారికి రిజిష్టరుపోష్టులో పరీక్షాతేదీకి 2 రోజులు ముందుగా పంపబడును. వారు సకాలములో దేవాలయమున పరీక్షలను జరిపించి ఉత్తరపత్రములను వెంటనే రిజిష్టరుపోష్టులో కార్యాలయమునకు పంపివేయుదురు. ఒకనెలలో పరీక్షాఫలితములు శ్రీవిశిష్టాద్వైత ప్రచారకసంఘ భక్తినివేదన పత్రికలో ప్రకటింపబడును,

ఈపరీక్షలకు సంబంధించు విషయవిమర్శలు కూడా ఈపత్రికయందు ప్రతినెలకు ప్రచురింపబడి అభ్యర్థినులకు పరీక్షకు మిక్కిలి సహాయకరముగ నుండగలవు.

**పరీక్షకు అర్హులు :—** స్త్రీలుమాత్రమే ఏవయస్సునందున్న వారైనను పరీక్షనిచ్చుటకు అర్హతకలిగి యుందురు.

**ఉత్తీర్ణతానిర్ణయము :—** ఈపరీక్షలలో ప్రతిపత్రికలోను నూటికి అరవై అంతకుపైబడిన మార్కులు లభించువారు ఉత్తమకక్షలోను. ఏభై అంతకుపైబడిన మార్కులు లభించువారు మధ్యమకక్షలోను. నలభై అంతకుపైన మార్కులు లభించువారు ఉత్తీర్ణులుగాను భావింపబడుదురు,

**బహుమతులు - బిరుదములు :—** ఈమూడు పరీక్షలలోను క్రమముగా నుత్తీర్ణులైనవారికి మూడవ సంవత్సరాంతమున 'గీతావిశారద'యను బిరుదముతో యోగ్యతాపత్ర మొసంగబడును.

ఇదిగాక మొదటిపరీక్షకు ఉత్తీర్ణక్రమము ననుసరించి రు 25.20.15.10,5 వరకు 5 నగదు బహుమతులున్ను 5 పుస్తక బహుమతులున్ను ఒసంగబడును.

రెండవపరీక్షకు ఉత్తీర్ణక్రమము ననుసరించి రు 30,25.20,15.10,6 వరకు 6 నగదు బహుమతులున్ను 4 పుస్తకబహుమతులున్ను ఒసంగబడును.

ఉత్తమపరీక్షకు ఉత్తీర్ణక్రమము ననుసరించి రు 50,40, 3020.10.5 వరకు 6 నగదు బహుమతులున్ను 4 పుస్తక బహుమతులున్ను ఒసంగబడును.

**విశేషబహుమానము :—** పై మూడుపరీక్షలలోను తప్పక, వరుసగ సర్వోత్తమముగా ఉత్తీర్ణమైన ఒకరికిమాత్రము బంగారుపతకము బహూకరింపబడును.

**ఉపాధ్యాయసన్మానము :—** ప్రతి కేంద్రములోను అభ్యర్థినుల తయారుచేసి పరీక్షకుపంపిన ప్రతి ఉపాధ్యాయులకును ఉత్తీర్ణత ననుసరించి యథావకాశముగా నగదు సన్మానము సమర్పింపబడును.

**దరఖాస్తు పంపుకాల నిర్ణయము :—** ప్రతిసంవత్సరము సెప్టెంబరు నెలాఖరులోగా కార్యాలయమునకు తమతమ దరఖాస్తులను అభ్యర్థినులు పంపుకొనవలెను. ఆయవధిమించిన దరఖాస్తులు మంజూరు కానేరవు.

దరఖాస్తు అచ్చుఫారములు కార్యాలయనుండి కోరినవారికి ఉచితముగా పంపబడగలవు.

**పరీక్షాశుల్కము :—**

మొదటి పరీక్షకు 0-8-0 రెండవ పరీక్షకు 0-12-0 మూడవ పరీక్షకు 1-0-0 దరఖాస్తుతో మనియార్డరు ద్వారా కార్యాలయమునకు పంపవలెను.

గీతామందిర కార్యదర్శిని
107 వరదాముత్తియప్పన్ వీధి
మదరాసు 1
(అడ్రసు ఇంగ్లీషులో వ్రాయవలెను.)

# కట్నములు

శ్రీరామకృష్ణ రామానుజదాసుగారు (లింగాలవలస) శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘమునకు సమర్పించిన కట్నము. 5-0-0

శ్రీ వణుకూరుకోట లక్ష్మీనరసింహం గారు వారి దౌహిత్రుడు చి॥ చక్కా సత్యనారాయణకు చి॥ సౌ॥ ప్రభావతిని యిచ్చి 2-3-52 వ తేదీని జరిపించిన వివాహసందర్భమున సంఘమునకు రు 5-0-0 కట్నమును సమర్పించిరి. ఈ నూతనదంపతులు చిరంజీవులైన సమస్త సంపదలతో వర్థిల్లుగాక యని శ్రియఃపతిని ప్రార్థించుచున్నాము.

శ్రీమాన్ తె. కం. గోపాలాచార్యులుగారు తమ కుమారుడు చి॥ తె. కం. రంగరామానుజాచార్యులకు చి॥రామచంద్రాచార్యులు గారి కుమార్తె చి॥ సౌ॥ చి. వెంకటమ్మనిచ్చి వివాహము జరిపించినసందర్భమునసంఘమునకురు10-0-0లు సమర్పించిరి. ఈ వధూవరులకు శ్రియఃపతి ఆయురారోగ్యైశ్వర్యముల నొసంగి బ్రోచుగాక.

విశాఖపట్టమున 18-4-52 తేది మొదలు 3 రోజులుజరుపబడిన శ్రీయతిరాజసేవామహిళామండలి వార్షిక సభల సందర్భమున సదరుశాఖా సంఘ కార్యదర్శినిగారైన శ్రీ మతి దాసరి ఆండాళ్ళమ్మగారు మనసంఘమునకు రు 5-0-0లు కట్నమును సమర్పించి మార్గదర్శకులైరి. వీరి ఉద్యమమునకు శ్రీయఃపతిపూర్ణదోహదమొసంగు గాత!

శ్రీమతి వక్కలంక వెంకట రంగనాయకమ్మగారు-(అనకాపల్లి). శ్రీయతిరాజసేవామహిళా మండలికి గొప్ప సేవచేయుచు పెక్కుమందిసభ్యులను చేర్పించుచు అందరికిని ఆదర్శపాత్రులగుచున్నారు. వీరికి మా అభివందనములనర్పించుచున్నాము.

విజయవాడలో శ్రీ పారేపల్లి శీతారామయ్యగారు చూపుచున్న సంఘాభిమానమునకు మా కృతజ్ఞతను తెలుపుకొనుచున్నాము.

★

---

శ్రీమాన్ ఎన్. జి. కె. ఆచార్యులుగారు "సుదర్శనమ్" అను పేరుతో నొక వారపత్రికను ప్రచురించుచున్నారు. ఇందు పెక్కు వేదాంత విషయములు, వేదాంత ప్రచారవివరములు, సత్సంప్రదాయ విషయములు మొదలగునవి సులభశైలిలో ప్రచురింపబడుచు ఆబాలగోపాలమత్యంతోపయుక్తముగానున్నది. దీనిని ప్రతివారును ప్రోత్సహించుట ముఖ్యకర్తవ్యము. చందా స్వల్పము. సంవత్సరమునకు రు 3 లు మాత్రమే.

---

మైలవరం శ్రీ యతిరాజసేవా మహిళామండలి అధ్యక్షులగు శ్రీ శ్రీ శ్రీ సూరానేని శ్రీ వరమంగయ్యమ్మ బహద్దరు జమీందారిణీవారు మద్రాసు శ్రీ యతిరాజసేవా మహిళామండలి వారు గీతామందిరములో జరుపుచున్న శుక్రవార కార్యక్రమమున ముత్తయిదువులకు విని యోగించుటకుగాను నూరు బంగినిపల్లి మామిడి పండ్లు ప్రేమతో పంపించిరి. ఇట్లు అన్ని స్థలములయందున్న శాఖా సంఘములకు పరస్పర పరిచయమున ప్రీతి వృద్ధిపొందుటకు వీరు మార్గదర్శకులైరి అని వీరికి మద్రాసు మండలివారు తమ కృతజ్ఞతను తెలుపుకొనుచున్నారు.

# శ్రీ యతిరాజ సేవా మహిళామండలి — (విశాఖపట్టణంశాఖ)

## ద్వితీయ వార్షిక సభా సమావేశము.

## పండితసభా వివరములు.

ది 18-4-1952వ తేదీని ఉదయం గం 9.00లకు విశాఖపట్టంలో వేంచేసియున్న శ్రీ యెంబెరుమానార్ల కోవెలలో శ్రీ ఉ. వే. శ్రీమాన్ ప్రతివాది భయంకరం శ్రీనివాసాచార్యస్వామివారి అధ్యక్షత క్రింద శ్రీ యతిరాజసేవా మహిళా మండలి సభ్యురాండ్రు సమావేశమై తమమండలి ద్వితీయ వార్షికోత్సవమును అత్యంత వైభవ ముతో జరిపించి యీ దిగువ కార్యక్రమమును దిగ్విజయముగా జరిపించిరి. పెక్కుమంది పండితప్రకాండులును, విదుషీమణులును వివిధప్రాంతములనుండి వేంచేసి తమ అమూల్య సలహాలను ఉపన్యాసములను నొసంగి వందలుగా సభ నలంకరించిన శ్రోతబృందము నానందాబ్ధి నోలలాడించిరి.

దైవప్రార్థన సంస్కృత ద్రావిడభాషలతోజరిగిన పిదప మండలి కార్యదర్శిని గారైన శ్రీమతి దాసరి ఆండాళ్ళమ్మగారు గత సంవత్సరమంతయు యీ మండలివారు జరిపిన శుక్రవార కార్యక్రమ వివరములను, తిథి, నక్షత్రాదిమహోత్సవ వివరములను ఆ సందర్భములలో విదుషీమణులచేతను పండితోత్తముల చేతనుగావింపబడిన ఉపన్యాస వివరములను వ్రాస గుచ్చినట్లు విన్నవించి యీ సంవత్సరమునూతన కార్యవర్గముతో నూతనోత్సాహముతో ద్విగుణీకృతముగా కార్యక్రమముల జరిపించి ఆంధ్రదేశమందున్న మహిళామండలి లన్నిటికిని యీ శాఖ ఆదర్శప్రాయమై యలరారవలె నని హెచ్చరించిరి.

పిమ్మట అధ్యక్షులు సంఘసేవను మండలి ప్రచార దీక్షను ప్రశంసించుచు ఉపన్యసించిరి. ఈ దినము మొదలు 3 రోజులు రెండుపూటల యందును ఈ దిగువ కార్యక్రమానుసారముగ అత్యంత వైభవముతో ఈ సభ జయప్రదముగ ముగింపబడినది.

| ఇందు పాల్గొనిన పండిత ప్రముఖులు. | ఉపన్యసించిన విషయములు. |
|---|---|
| శ్రీ అధ్యక్ష మహాశయులు. | శ్రీ విశిష్టాద్వైత వైభవము, ఆళ్వారుల భక్త్యనుభవ తారతమ్యములను విమర్శించుచు ఉపన్యసించిరి. |
| ,, ఇరగవరపు రంగాచార్యులుగారు. (సింహాచలం) | (2) భక్తి ప్రాధాన్యము. పెరియాళ్వారులు ఆండాళ్ వైభవము. |

| | |
|---|---|
| " కో. కం. వేంకటేశ్వరాచార్యులుగారు. శ్రీ రా మ తీ ర్థ ం | పరమాచార్యులగు శ్రీ వరహాస్వామివారి వైభవము, శ్రీ కులశేఖరాళ్వారుల వైభవము. |
| " తి. వె. సంపత్కుమారాచార్యులుగారు. (సింహాచలం) | 1 "యాదృచ్ఛిక సుకృతము" 2 "అవతార విశేష వైభవం" 3 "ప్రిరాచావశ్యకత- సభావిశేషములు" |
| ,, తి ప. నారాయణస్వామిగారు ,, | శ్రీ రామసీతావిరాటుల సౌందర్య విశేషము అష్టప్రబంధమున్ను. |
| ,, కరి నారాయణాచార్యులుగారు (రామతీర్థం) | సంకీర్తన వైభవం, గోదా కళ్యాణం హరికథా కాలక్షేపమున్ను. |
| , కోమాండూరి అప్పలాచార్యులు గారు (సింహాచలం) | 1 శ్రీరామ - కృష్ణావతార సౌలభ్యాతిశయ విశేషములు - (భగవద్విషయమునుండి) 2 "ఆళ్వారుల హృదయం" |
| ,, కో. కం. అప్పలాచార్యులుగారు. (శ్రీరామతీర్థం) | 1 నాలాయిర ప్రబంధమందలి మంగళాచరణ వైభవ విమర్శ, 2 పెరియతిరుమొళి వైభవమున్ను. |
| ,, నండూరి అప్పలాచార్యులుగారు. (సింహాచలం) | శ్రీమద్రామాయణ వైభవము. |

ఈ మూడు దినములలో మధ్యాహ్నకాలమున మహిళామండలిచే నాహ్వానింపబడిన శ్రీమతి ముడుంబై రామానుజమ్మగారు, శ్రీమతి పున్నంరాజు వెంకటబంగారమ్మగారు, మొదలగు విదుషీమణులచే ఉపన్యాసములు వైభవముగా గావింపబడెను.

3వ దినము సభాంతమున అధ్యక్షభాషణానంతరం మహిళామండలి పక్ష్యరాండ్రు పండితులకును, విదుషీమణులకును, ఆగంతుక భక్తబృందమునకును, చందనతాంబూల దక్షిణ సత్కారాదుల సమర్పించిరి.

—: ఈక్రింది దాతలీ సభకు ఆర్థిక సహాయ మొనరించి ప్రోత్సహించిరి: —

—: వి శా ఖ ప ట్ట ం: —

శ్రీమతి ద్వారం శ్రీనివాసమ్మగారు.
శ్రీమతి రెడ్లం అమ్మన్నగారు.
శ్రీమాన్ మంచుకుండ కోదండరామయ్యగారు.
,, మద్ది శ్రీనివాసం బ్రదర్సువారు.
,, మంగళగిరి కోదండరామయ్యగారు.
,, ద్వారం జగన్నాథరావుగారు.
,, దాసరి మధుసూదనరావుగారు.
,, రామినీడి వెంకటప్రియుడు నాయుడుగారు
,, ఎర్రిబోలు కృష్ణారావుగారు.
,, రామినీడి రాజానాయుడుగారు.

శ్రీమతి తలువుల కాంతయ్యమ్మగారు.
,, యజ్ఞబోల నారాయణమ్మగారు.
,, రామినీడి రామాయమ్మగారు.
శ్రీ శ్రీ ఒకభక్తురాలు.
శ్రీమతి పెద్ద తాయారమ్మగారు.
,, చిన్న తాయారమ్మగారు.
,, క|గి లక్ష్మీనరసమ్మగారు.
,, గుండాల లక్ష్మీనరసమ్మగారు.
,, ప్రి. భ. కనకమ్మగారు.
,, వక్కలంక వెంకటనరసమ్మగారు.

## పుష్ప చందన కైంకర్య తిరునామములు.

శ్రీమతి మంచుకొండ సీతయ్యమ్మగారు.
,, మం. నరసమ్మగారు.
,, మం. సీతాపిరాట్టిగారు.
,, మం. వరలక్ష్మమ్మగారు.
,, మద్ది రంగనాయకమ్మగారు.
,, మద్ది సీతయ్యమ్మగారు.
,, మంచుకొండ తల్లెమ్మగారు.
,, రామినీడి సరస్వతమ్మగారు.
,, కట్టమూరి అమ్మాయమ్మగారు.
,, పరాంకుశమ్మగారు.

ఇట్లు:
దాసరి ఆండాళ్ళమ్మ,
శ్రీ యతిరాజ సేవా మహిళామండలి, [విశాఖపట్న శాఖా] కార్యదర్శి.

---

శ్రీమతి దాసరి ఆండాళ్ళమ్మగారు తమ కుమార్డు ఆనందమోహనరావునకు జరిగిన వివాహ సందర్భమున మన సంఘమునకు రు 5 లు కట్నం సమర్పించిరి. ఈ నూతనదంపతులకు శ్రీయఃపతి ఆయురారోగ్యమైశ్వర్యములు ప్రసాదించుగాక.

★

రిజిష్టరు నెం. 5094

# భక్తినివేదన

(వేదాంత మాసపత్రిక)

ఇందు వేదాంత విషయ రాజములున్ను; భక్తిప్రచార విషయమైన వార్తలున్ను వేదాంత సాంప్రదాయ విషయకమైన ప్రశ్నోత్తరములున్ను ప్రచురించబడును.

చందాలు;

| | | |
|---|---|---|
| సాధారణ చందా సం. 1 కి | రు. 5-0-0. |
| సహాయ చందా | ,, | రు. 10-0-0. |

1. శ్రీమన్నారాయణుడే సృష్టి - స్థితి - లయకారకుడు.
2. ఆయనే మోక్షప్రదాత.
3. ఆయనే పరతత్వము-పరమాత్మ
4. ఆయన అఖిలహేయ ప్రత్యనీక కల్యాణగుణకుడు.
5. ఆయనకు జీవుడు శరీరభూతుడు; శేషభూతుడు, పరతంత్రుడు, నియామ్యుడు, అనుభావ్యుడు.
6. జీవులు జ్ఞానైకాకారులు.
7. జీవులు అనంతములు.
8. జీవులు పరమాత్మకంటె భిన్నులు; ఈ భేదము సత్యమైనది; నిత్యమైనది.
9. జీవ-పరమాత్మలకు ప్రకృతి శరీరభూతమైనది; శేషభూతమైనది: పరతంత్రమైనది; నియామ్యమైనది; అనుభావ్యమైనది.
10. ప్రకృతి వికారాస్పదమైనది. జీవపరమాత్మలకంటె భిన్నమైనది, ఈ భేదము సత్యమైనది; నిత్యమైనది.
11. జీవుడు ప్రకృతి వియుక్తుడై పునరావృత్తిరహితమైన పరమాత్మ సాన్నిధ్యమును పరమపదమును పొందుటయే మోక్షము.
12. భక్తి ఒక్కటియే మోక్షసాధనము.
13. భక్తియన తైలధారవలె అవిచ్ఛిన్నమైన స్మృతి పరంపర.
14. వివేక-విమోక-అభ్యాస-క్రియా-కల్యాణ-అనవసాద-అనుద్ధర్షలు భక్తికంగములు.
15. ఇవి సదాచార్య-సమాశ్రయణ-లభ్యములు
16. జగద్గురువగు శ్రీరామానుజాచార్యుల వారును; వారి యనుయాయులున్ను సదాచార్యులు.

"నగురుర్వైష్ణవాత్ పరః" భా. సం.

**Book-Post**

To

Sri Paravasthu Ramanujacharyulu garu,
Director, Sri Venkateswara Oriental Institution,
THIRUPATHI, Chittur Dt.

...Ch. Srimannarayanacharya at Sriman Press, Kakiuada.




శ్రీమతే రామానుజాయనమః

భక్తి

# నివేదన

వేదాంత మాసపత్రిక

| సంపుటి ౪ | నందన-జ్యేష్ఠమాసం | సంచిక 3 |
|---|---|---|


## కృష్ణార్జున సంవాదము


శ్రీ ఉ. వే. శ్రీమాన్ తె. కం. గోపాలాచార్యులుగారు.
కోదకొండ.


—: 5వ రంగము :—

(అర్జునుడు దుఃఖముతో తలవంచుకొని విచారించుచుండును. శ్రీకృష్ణుడు ఆతని చేతులను పట్టుకొని తలయెత్తి ఓదార్చుచుండును.)

కృష్ణు:- అర్జునా! యింకను నిట్లేల విచారించుచున్నావు! నీకు బంధువధవలని దుఃఖము గాని పాపముగాని యంటక నీ క్షాత్రమును కాపాడుకొను ఉపాయముల చెప్పియుంటిని గదా! నీకు చెప్పవలసిన గుహ్యాతరముల నన్నిటిని సమగ్రముగా చెప్పియే యుంటిని. వాటి నన్నిటిని సమగ్రముగా విమర్శించుకొని నీకు తోచినట్లాచరించి తరించరాదా! ఇంకను నీవిట్లు దుఃఖించుటకు కారణమేమి?

అర్జు:- [నిరాశతో] కృష్ణా! ఏమి చెప్పితివి?

కృష్ణు:- యిదియేమి యర్జునా! కర్మయోగమును చెప్పలేదా!

అర్జు:- ఆ చెప్పితివి! ఆ సమత్వబుద్ధి కలుగుట ఎట్లు ఆ కర్మల నెరుంగుట యెట్లు! లోపములు లేకుండ వాటి నాచరించుటెట్లు! ఆ ద్రవ్యశుద్ధి ఆ మనశ్శుద్ధి అబ్బో! యివి నావంటి వానికి దుస్సాధ్యములు ఆత్మస్వరూప విరుద్ధములు.

కృష్ణు:- ఊ ( అజ్ఞానయోగమో!

అర్జు:- అది మరింత సహజముగ మనస్సు చంచలము అది యసలు అలవాటుపడిన విషయములయందే నిలువక చలించి పోవుచుండును. అది బలవంతమైనది పురుషుని క్షోభింపజేయునది. విపరీత విషయములయందు ప్రవేశపెట్టుటలో గట్టిది. అట్టి మనస్సును నిగ్రహించి జ్ఞానయోగి యగుట ఎదురుగా వీచు పెద్దగాలిని విసనకఱ్ఱతో నడ్డుటవంటిది. అది నావలన నేమగును

కృష్ణు:- ఇక మనకు నా భక్తియోగ మున్నదిగదా!

అర్జు:- ఆ లేకేమి! ఆ రెండును యున్నగదా! ఇది యుండునది. అంగము లేక అంగి చేకూడునెందైన గలదా! గాక దానికి కూడ నిశ్చలమగు మనస్సు అపేక్షితమే గదా! అది యసంభవమని విన్నవించియే యుంటిని. అదియును గాక కృష్ణా? ఆ భక్తికి కావలసిన వివేకము విమోకము మొదలగునవి నాతరమా! ఇక నేతరి చుట ఎట్లు కృష్ణా? మరియు చివరకు నీవు చెప్పుటలో గుహ్యతరమునే చెప్పితినంటివి! అయిన గుహ్యతమము నేల దాచియుంచితివి. అందులకు నే నింకను ఏమిచేయవలెను. నేను కార్పణ్యదోష దూషితుడనని మొదటనే విన్నవించియుండ పైగా నన్నిటిని విమర్శించుకొని తోచినట్లు చేయమనుచున్నావా! కన్నుపొడిచి కన్నీటికి కారణమేమనునట్లు యింకను ఏల ఏడ్చుచున్నావనుచున్నావా? నేను నీ దాసుడను గాన, నీ భక్తుడను గాన, నీ ప్రియుడగాన కృష్ణా? నీదయ నాపట్ల ఏమైనది. దయామయా! కంచెయె చేనునుమేసిన మరిదిక్కెవ్వరు.

ఉ॥ సాధనబుద్ధితో సలుపు జ్ఞానము కర్మము భక్తియున్ మహా, బాధకరంబులివ్వి భగవంతుని జేరుట కెంతమాత్రమూ! రాధనసేయరానివవురా యివియానను నుద్ధరించు నీ! బోధకె నేను తృప్తి పడిపోవుదు నేని నశింపకుండునే!

(అని గట్టిగ నేడ్చును.

కృష్ణు:- (దయతో కన్నీరు గార్చుచు అర్జునుని వీపుతట్టి భుజముపై చేతినుంచి) అర్జునా! అధికారిని పూర్తిగ పరీక్షింపక చెప్పరాని రహస్యమగుటచే చెప్పక దాచియుంచితిని. నీ దుఃఖము నా మనస్సును కరగించినది. నీవు నిజముగ అధికారివని కనుగొంటిని. మంత్రితుల్యమగు దీనిని సావధానముగ వినుము. నీ కత్యంత సులభమగునట్టియు, సర్వాధికార మగునట్టియు, అవ్యవహిత మోక్షసాధన యగునట్టి పరమ గుహ్యతమము నుపదేశించు చున్నాను.

అర్జు:- చిత్తము. మహాప్రసాదము. నీటముంచినను పాలముంచినను నీవే! నాకు వేరు గతిలేదు.

కృష్ణు:- పార్థా!

మన్మనాభవ మద్భక్తో మద్యాజీ మాంనమస్కురు
మామేవైష్యసిసత్యంతే ప్రతిజానే ప్రియోసిమే

నాయందత్యంత ప్రీతికలవాడవై నన్ను సాక్షాత్కరించు నంతటి విశదతమమగు ధ్యానము కలిగి నన్నారాధింపుము. ప్రీతితో నాకు నమస్కరింపుము. అట్లు చేసితివేని నీవు నన్నే పొంద గలవు. నీవు నాకు ప్రియుడవు గాన నిది నిజమని ప్రమాణము చేసి చెప్పుచున్నాను.

అర్జు:- (వికసించిన మోముతో నమస్కరించి) మహాప్రసాదము (దీనిచే నిష్టప్రాప్తి నుప దేశింపబడియె. యిక ననిష్ట నివృత్తియెట్లు?

కృష్ణు:- నన్ను పొందుటకు ప్రతిబంధకములగు పాపము లెట్లు పోవుననియా నీ సందేహము.

అర్జు:- చిత్తము

కృష్ణు:- అవ్వే దానికేమున్నది) మరియు (ఇదిగో నీకు కఠవల్లియంతర్గతమగు ద్వయ మంత్రవివరణమై పంచమ వేదసార భూతమగు) నీ గీతకు పరమ తాత్పర్యార్థమై చరమ రహస్య మనబడు గుహ్యాతమ మంత్రరాజమును నీకుపదేశించు చున్నాను.

అర్జు:- చేతులు జోడించి వికసిత ముఖముతో) ధన్యోస్మి!

కృష్ణు:- కాని,

చం॥ పరమరహస్యమీయది య । భక్తుడనాదృత దేశికాంఘ్రి స
త్పరిచయుడెంతమాత్రము త । పంబునుజేయనివాడసూయ చే
పరిగెడువాడు దీనివిన । పాత్రుడు గాడటువంటివానికీ
చరమసుధారసంబిడెదు । సాహసమెప్పుడు సేయబోకుమా !

అర్జు:- చిత్తము. నీపాదములాన నీయానను గీటువాసియైనను తప్పదునాకృష్ణా! సెలవిమ్ము.

కృష్ణు—(దగ్గరకు తీసుకొని చెవులో)

సర్వధర్మాన్ పరిత్యజ్య—మామేకం శరణం వ్రజ
అహంత్వా సర్వపాపేభ్యో—మోక్షయిష్యామి మాశుచః॥

అర్జు—కృష్ణా ! ఈశబ్దములు సులభముగనే యున్నను దీని తాత్పర్యముమాత్రమునాకొ కింతయు గోచరించుటలేదె ! దయతో సెలవిత్తువా ?

కృష్ణు—(నవ్వి) అర్జునా ! ఈపనియంత సులభమైనదికాదు. దీని నెరుంగుటకు పరమసాత్త్వి కుడై యుండవలయును. (ఏలయన, అట్టివానికి జ్ఞానము నిర్మలముగ వెలుంగుచుండును. అదివీనికి సాత్త్విక దైవమగు నాయందు ప్రీతిని కలిగించును. అట్టినాయందలి ప్రీతి రాజసతామసముల నడంచి నంతనే తదితరములయందు వైరాగ్యమునకు కారణమగును. అంతమాత్రమేకాక అది నాయను గ్రహమునకై నాయాజ్ఞారూపమగు శాస్త్రమునందు ఆదరమును పుట్టించును. అట్టివాడు "సర్వ ధర్మములను విడిచి నన్నేయుపాయముగా నమ్మి ఆశ్రయించిన వానిని సర్వపాపములనుండి విడి పించి నన్నుపొందింతు" ననెడు నావైభవమును విన్నచో నిది యథార్థమేయనెడు విశ్వాసము కలవాడగును.) ఇట్టివాడే ఈమంత్రార్థమును వినుట కధికారి, మునుముందిట్టి యధికారులత్యంత

విరళమైయుండుదురు. (వారైనను, ఈయర్థమును తగినయధికారి యార్తితో యాసన్నమైనప్పుడాతనిని సంవత్సరంబో తదర్ధంబో మాసత్రయంబో వివిధోపాయములచే పరీక్షించి కృపతో నుపదేశించుచుందురు) కాని ముముక్షువులపాలిటి కల్పవృక్షమై నాయాజ్ఞచే రామానుజరూపముననవతరించునట్టి మాయనంతుడు మిక్కిలి శ్రమతో తానీయర్థముల గ్రహించి (ఈనియమముల కొంత సడలించి) ఆర్తి కలవారందరీ యర్థము నెరుంగునట్లు భూరిప్రదానము గావించును. ఆయర్థములన్నియు నాయాజ్ఞచే లోకాచార్యులచే సూత్రీకరింపబడి వరవర మునిపుంగవులచే విశదీకరింపబడును. అందులకు నిదానముగ నేను నీకు మంత్రార్థమును సంగ్రహముగా వివరింతు నాలకింపుము.

ఈమంత్రమున పూర్వార్థముచే ముముక్షువు చేయవలసిన కృత్యమును, ఉత్తరార్థముచే శరణ్యుడనగు నేనుగావించు కృత్యమున్ను చెప్పబడినవి.

అర్జు:—అయినచో కృష్ణా! అధికారిచేయవలసిన కృత్యమేది!

కృష్ణు:—అర్జునా! శ్రుతిస్మృతులచే విధింపబడిన కర్మయోగాద్యుపాయములను "భగవత్ప్రాప్తికి సాధనములుకాని వీటిని తత్ప్రాప్తిసాధనములని భ్రమించి పరిగ్రహించితిమేమోయని భయపడి వాటియందలి రుచివాసనలతో గూడ విడిచిపెట్టుము.

అర్జు:—(ఆశ్చర్యముతో) యిది ఏమికృష్ణా! నీవింతవరకు పరమాదరముతో మోక్షోపాయములని నొక్కివక్కాణించిన వాటినే విడువమనుచున్నావే, యిక ముముక్షువునకు గత్యంతరమేమి.

కృష్ణు:—అవును. అర్జునా! అవినిజముగ భగవదేక శేషభూతుడును తదేక పరతంత్రుడునగు నీయాత్మస్వరూపమునకు విరుద్ధములనుటలో సందేహములేదు.

అర్జు:—అయినచో వాటిని వేదపురుషుడేలవిధించెను. నీవు నాకేల యింతవిపులముగ నుపదేశించితివి.

కృష్ణు:—దొంగమేతనుమేసి దొరకక తిరుగు పశువును ఆవృత్తినిమాన్పి వశపరచుకొనుటకై దానిమెడయందు గుదిబండను కట్టి విడచునట్లు అహంకార మమకారములకు వశ్యుడై గర్వించి తిరుగుచున్న ఈచేతనునకు కాయక్లేశరూపమైన కర్మానుష్ఠానమును యింద్రియ జయము మొదలగు శుష్కరవ్యాపారములను ఉపదేశించినచో వాటియనుష్ఠాన మూలమున రజస్తమస్సులడగి సత్వముద్రిక్తమై రజస్తమస్సుల కార్యములగు అహంకార మమకారముల నశింపజేయును. దానిచే తాను భగవత్పరతంత్రుడనను స్వరూపజ్ఞాన ముదయించును. దానిచే భగవంతుడే సాధనమను అధ్యవసాయము జనించును. కావుననే ఆమార్గములుప దేశింపబడినవి.

అర్జు:-అయిన నేమికృష్ణా! నీవుచెప్పినట్టి కర్మయోగాదులు సాక్షాత్తుగ కారణములు కాకున్నను క్రమముగనైనను కారణములు కావచ్చునుగదా. అట్టివాటి నేలవిడిచిపెట్టమనుచున్నావు.

కృష్ణు:-యిట్లు స్వరూపజ్ఞాన ముదయించుటకు ఈకర్మజ్ఞానయోగములే అవసరములేదు. అవిలేకున్నను నాకృపచేతనే అజ్ఞానముకలిగి దానిచే భగవంతుడే యుపాయమగు అధ్యవసాయము కలుగవచ్చును గాన వాటికి పరంపరగానైనను కారణత్వ మనావశ్యకము. గావుననే వాటియందు సాధనత్వబుద్ధిని సవాసనగా విడువమంటిని

అర్జు:-అయినచో కృష్ణా! కర్మజ్ఞానభక్తులను పూర్తిగ విడిచిపెట్టవలయు ననియేగదా! నీయభిప్రాయము.

కృష్ణు:-అర్జునా! అట్లుకాదు. నీవు వీటిని ఆచరించుచునే యుండుము. కాని నీవాచరించు వర్ణాశ్రమోచిత కర్మ సాధన బుద్ధితోగాక కరుణతో నితరులుజ్జీవించుటకే గావింపబడును గాన అది నాకు మిక్కిలి ఆనందావహమగును. అందువలన ఆకర్మ నా కైంకర్యమందంతర్భవించును. జ్ఞానము తనయందు సాధనత్వబుద్ధి పోవుటతోడనే ఆత్మస్వరూప జ్ఞానములో చేరును. ఇక భక్తియు తనయందలి యుపాయబుద్ధి పోవుటతోడనే కైంకర్యరుచి యందంతర్భవించును.)

అర్జు:-అయినచో, మోక్షోపాయమేమి!

కృష్ణు ఆరయ సర్వరక్షకుడనయ్యును
నీకడ కింకరుండుగా
సారథినై రథంబుభయ సైన్య
సమక్షమునందునిల్ప నీ
కోరిక యెద్దియో తెలియ
గోరుచు నీదొసగెల్లభోగ్యమా
తీరుననెంచి నీకెవరు దిక్కు-వు
పించనివేళ దిక్కు-గా
జేరి పిరాట్టి నీదొసగు చెప్పిన
కాదని "సత్యజేయమం"
చారసి రక్ష సేయదగునట్టి
స్వభావముకలుగు నన్నుగా
భారత! నీవెఱింగి మదిభావన
చేయుముపాయ బుద్ధితో.

అర్జు:-అయినచో నిదివరలో చెప్పబడిన కర్మాద్యుపాయములకంటె దీనికిగల నతిశయమేమి?

కృష్ణు:-అర్జునా! హస్తిమశకాంతరముకలదు. చూడుము.

అరయగ నిత్యమై సులభమై
యనపాయమునై స్వరూపమై
ఖరికనురూప మేకము గాకన
పేక్షము నై ప్రమాణ సు
స్థిరము సిద్ధమై పరమ చేతనమై
సకలాధికారమై
కరమవిలంబ్య సత్ఫలము కల్పన
జేసి విలక్షణంబుగా
బరగు నుపాయముం దెలియ
బల్కితినేనని నమ్ముమర్జునా!

# గోదాష్టోత్తర శతనామావళి

రామాయణ రత్నాకర శ్రీ ఉ. వే. శ్రీమాన్ విద్వాన్
కంప్యూరి రామానుజాచార్యులుగారు.

1 ఓం గోదాయైనమః
2 గాధాప్రిదాయైనమః
3 శ్రీదాయైనమః
4 వేదాంతార్ధ సుబోధిన్యైః
5 యశోదాతనయాఽమోదాయైనమః
6 గోవిందోద్వాహనోత్సుకాయైనమః
7 ధనుఃపురావతారాయైనమః
8 మనుజోద్వాహనాఽక్షమాయైనమః
9 మహాత్మప్రసుతాయైనమః
10 మాన్యాయైనమః
11 తులసీతరుమూలజాయైనమః
12 అయోనిజాయైనమః
13 అనంతగుణాయైనమః
14 నియన్త్ర్యైనమః
15 నిఖిలప్రిదాయైనమః
16 ఆషాఢమాససంజాతాయైనమః
17 పూర్వఫాల్గునభోద్భవాయైనమః
18 రమ్యాయైనమః
19 రక్షణసంజాతాయైనమః
20 నమ్యాయైనమః
21 నాయకనాయికాయైనమః
22 నారాయణోత్సుకానమః
23 నిత్యాయైనమః
24 నామకీర్తన తత్పరాయైనమః
25 గోపీవ్రత సముద్యుక్తాయైనమః
26 సహనాయైనమః
25 తాపహారిణ్యైనమః
28 భూదేవ్యైనమః
29 భూతదాత్ర్యైనమః
30 భూరిదాయైనమః
31 సూరిభూషణాయైనమః
32 స్వోచ్ఛ్యాహకామలినస్రూయైనమః
33 రంగరాజకుతూహలాయైనమః
34 రంగరాడంతరంగజ్ఞాయైనమః
35 సుందరప్రార్థనోత్సుకాయైనమః
36 దాసాభీష్టప్రదాత్ర్యైనమః
37 నాసికాభరణోజ్జ్వలాయైనమః
38 పాపహన్త్ర్యైనమః
39 తాపహర్త్ర్యైనమః
40 రూపదర్పణదర్శనాయైనమః
41 కృష్ణవిశ్లేషాఽసహనాయైనమః
42 కృష్ణాఽలింగనభాలీనాయైనమః
43 కృష్ణవిశ్లేషరోగార్తాయైనమః
44 పీతాంబరానిలాఽసక్తాయైనమః
45 తులసీధరణోత్సుకాయైనమః
46 కృష్ణపాదరజోధాత్ర్యైనమః
47 కృష్ణోష్ఠాఽమృతపాయిన్యైనమః
48 జ్ఞానభక్తిస్తనాకారాయైనమః
49 కృష్ణార్పితపయోధరాయైనమః
50 కామదేవస్తోత్రకామాయైనమః
51 రామానుజసహోదర్యైనమః
52 క్షేమంకర్యైనమః
53 క్షామహర్త్ర్యైనమః
54 శ్యామాయైనమః
45 ఆరామపరాయణాయై నమః

57 స్నానకుతుకాయై నమః
58 శ్రీమత్యై నమః
59 శ్రీమహారిణ్యై నమః
60 శంకాహీనాయై నమః
61 శంఖపరాయై నమః
62 శంఖధ్వానమనోహరాయై నమః
63 సుపర్ణఖ్యాత శర్ధాయై నమః
64 సుపర్ణావయవాన్వితాయైనమః
65 సర్వగంధాయై నమః
66 సర్వరసాయై నమః
67 పుష్పసౌగంధ్యదాయిన్యై నమః
68 ఉత్తమస్యందనారూఢాయై నమః
69 పరమోత్తమభాషిణ్యైనమః
70 వైవాహికస్వప్నతోషాయై నమః
71 వివాహాచారబోధిన్యై
72 వేంకటేశోత్సవానందాయై నమః
73 వేదాంతోదంతభాషిణ్యై నమః
74 గోపీవ్రతానుకర్త్ర్యై నమః
75 గోపీవేషసుభూషణాయై నమః
76 లీలాప్రబోధనరతాయై నమః
77 లీలారక్తాచ్యుతప్రియాయై నమః
78 నందాలయద్వార్స్థనమ్రాయై నమః
79 నందబోధనతత్పరాయై నమః
80 నీలమేఘక్రియాసక్తాయై నమః
81 వ్రతోపకరణార్థిన్యై నమః
82 చక్రభానుఘనానందాయై నమః
83 శుభనాదాభ్రఘోషిణ్యై నమః
84 త్రివిక్రమమహోత్సాహాయై నమః
85 శరవద్వర్ష కాంక్షిణ్యై నమః
86 వర్షాఽసక్తాయై నమః
87 వ్రతవత్యై నమః
88 వామనస్థిరమానసాయై నమః
89 వసుధాయై నమః
90 వసుదాయై నమః
91 వేద్యాయై నమః
92 వరదాయై నమః
93 వైష్ణవాశ్రయాయై నమః
94 పుష్టకేశ్యై నమః
95 పూర్ణవేషాయై నమః
96 పుణ్యాయై నమః
97 పూర్వసుభాషిణ్యై నమః
98 పూజ్యాయై నమః
99 ప్రాజ్ఞప్రథానాయై నమః
100 యమునాతీరకాంక్షిణ్యై నమః
101 కృష్ణాశ్రయాయై నమః
102 కృష్ణబలాయై నమః
103 బహిరంర్స్థితవాసిన్యైనమః
104 రంగగోపాలమహిష్యై నమః
105 రంగరాడంఘ్రిశేముష్యై నమః
106 రంగరాట్ తత్వవిదుష్యై నమః
107 రంగరాద్వాసతాకృష్యై నమః

# ఢిల్లీ నుంచి సంపత్కుమారుని తెచ్చిన విషయము

విద్యారణ్యపంచానన విద్యావాచస్పతి శ్రీమాన్ విక్రాల రామచంద్రాచార్యులుగారు

తురుష్కులు ఇండియాలోకి వచ్చిన కాలము

ఢిల్లీ ప్రభువు పృథ్వీరాజుతో జయచంద్రునకును కాన్యకుబ్జరాజుకును యుద్ధము గలిగినపుడు తనపక్క సహాయముకొరకు మహమ్మద్ గోరీని AD 12 వ శతాబ్దములో పిలుచుకొని వచ్చినాడు.

మహమ్మద్ గోరీయొక్క మొదటి సేనానాయకుడు కుతుబుద్దీన్ అను నాతడు AD 1206 సంవత్సరమున ఢిల్లీలో పాదుషాగావున్న అల్లావుద్దీన్‌యొక్క సేనానాయకుడగు మాలిక్కాఫర్ అనునతడు రామేశ్వరం వరకు దండయాత్ర చేసెను.

భగవద్రామానుజాచార్యావతారము
శకం ౯౩౯
ఇంగ్లీషుకు శాలిశకమునుకు వారడ్డి ౭౮ కలుపగా

AD ౧౦౧౭

AD ౧౦౧౭ సంవత్సరము భగవద్రామానుజాచార్యావతారము ఇది ౧౧ వ శతాబ్దము అవతారసమాప్తి ౧౦౧౭

౧౨౦

AD ౧౧౩౭ ఇది ౧౨ వ శతాబ్దము రామానుజాచార్యావతార సమాప్తి అయిన పిదప మహమ్మద్‌గోరి అను తురుష్కరాజు ఇండియాలోకి ప్రథమమున ప్రవేశించెను. అంతకు తొలుత తురకలు ఇండియాలోకి వచ్చి యెరుగరు. పిదప నూటఅరువదియేండ్లు తాళి దక్షిణ దేశమును కొల్లగొట్టినారు. కావున భగవద్రామానుజాచార్యులవారు జీవించియుండు కాలమున దక్షిణదేశమందు తురుష్కుల ప్రస్తావమే పుండివుండదు.

ఒకవేళ AD శతాబ్దమునుండి తురకలు అరేబియానుండి పంజాబ్ దేశమునకువచ్చి కొళ్ళగొట్టి యెత్తుకుని పోయినారన్నను వారు పంజాబుకు దక్షిణం తూర్పు రాలేదు. ఢిల్లీలో రాజ్యస్థాపన చేయలేదు. దక్షిణహిందూస్థానము వారెరుగరు. గావున సోమనాథం మున్నగు ఆలయములగొట్టి దానిలోని ద్రవ్యమును హరించుకొని. అంతట వెనుకకు తిరిగి పోవుచుండిరే గాని దీర్ఘయాత్ర చేయుటకు వారికి వసతి గలుగలేదు.

కావున భగవద్రామానుజాచార్యుల వారికి తొలుత తిరునారాయణపురంలోని ఉత్సవ విగ్రహములను ఢిల్లీపాదుషా యెత్తుకునిపోయి చెరసాలలో పెట్టినాడన్న విషయము ఆలోచించదగినది. అయితే గురుపరంపరా ప్రభావము ప్రపన్నామృతము పెరియతిరుముడియడవు ఆచార్యసూక్తి ముక్తావళి. ఈ తెంగల గ్రంథములందును యతిరాజ వైభవము మువ్వాయిరప్పడి గురుపరంపర ఈ వడగల గ్రంథములందును ఢిల్లీలో తురుష్కరాజ పుత్రీ గృహమున తిరునారాయణుని ఉత్సవబేరమగు రామప్రియులున్నటుల తెలుపబడియున్నది. దివ్యసూరి చరితము పరమయోగి విలాసము అను తెంగల గ్రంథములందు ఢిల్లీ ప్రస్తావమే లేదు.

ఇట్లుండ రాజచరిత్రలకును మతగ్రంథము

నకు అర్థవిరోధము గలుగుచున్నది.

దివ్యసూరిచరితము ఒక్క గ్రంధము మట్టుకు భగవద్రామానుజాచార్యుల వారి జీవిత కాలములో యెరిగిన వారిచేత వ్రాయబడినది. మిగత గ్రంధము లన్నియు మణవాళమా ముని కాలమునకు గూడ నివతల బుట్టినవి. ఆ కాలమునకు కథలు అనేక మార్పులు బుట్టినవి. ఆ కాలమునకు కథలు అనేక మార్పులు చెందియుండుట సహజము. ఆ సమకాలమున బుట్టిన దివ్యసూరి చరితమున ఈ ఢిల్లీ ప్రస్తావ మించుకంతైన యెత్తబడలేదు. భగవద్రామానుజాచార్యుల వారు తిరునారాయణ ప్రతిష్టను గావించి ఆ సన్నిధిన యేయే కైంకర్యము నెవ్వరెవరెటుల చేయవలసినదియు ఒక నిబంధన గ్రంధమును యేర్పరచి దానికి నియమనప్పడి యని పేరు బెట్టిరి. అందు ముందు ఆలయనిర్మాణాది విషయమును కొంతె దెలిపియున్నారు. అందులో ఉత్సవబేరము ఎమ్మాళిరాయన్ అను రాజు యింట వున్నట్టున్నూ వారిని భగవద్రామానుజాచార్యుల వారికి అర్పించుచు తన రాజ్యములోని బంకాపురమను గ్రామమును గూడ సమర్పించినట్లున్నది.

కాబట్టి సాక్షాత్తుగ భగవద్రామానుజాచార్యులవారు యేర్పరచిన గ్రంధములో నున్న దానినే నమ్మవలయును. ఇట్లు నమ్మిన రాజ చరిత్రములకు గూడ విరోధము గలుగదు.

ఈ గ్రంధమున నిట్లుండ గురుచరిత్రకారు లెందుకు విరుద్ధముగ రాసిరని యడిగినచో ఈ నియమనప్పడి యనునది తిరునారాయణ స్వామి ఆలయములో జరుగవలసిన కైంకర్యములను గూర్చి వ్రాసిన పట్టీ గనుక దానిని యితరులు సంపాదించి తెలుసుకొన దగిన అవసరము యెల్లరకున్నూ వుండివుండదు. ఆ యాలయపు వారికి మట్టుకు ఉపయోగము గాన వారు ఆగ్రంధమును భద్రముగ కాపాడుకొనుచూ వారి వారి హక్కులను రక్షింపుకొనుచుందురు.

ఇట్లె శ్రీరంగమున ఆ సన్నిధిలోని విషయములను దెలుపునది కోయిలళుగు అను గ్రంధము గలదు.

వేంకటాచలేతి హాసమాల యను గ్రంధము తిరుపతికి గలదు. అవి ఆయా దేశములలోనే రక్షింపబడును.

శ్రీరంగము తిరుపతుల గ్రంధములుకాలాంతరములలోని సంగతులను గూడ దెలుపునవి గాన కర్త యొక్కడుగనే యుండడు. ఇదిభేదము

ఈ గ్రంధము లన్నియు ఆయా పూరనాయాలయ సంబంధము గలవారికే దెలిసియున్నవి. గాని ఇట్లు గ్రంధములు గలవని గొప్ప పండితులు గూడ కొందరెరుగరు. నాకు దెలియును.

ఎమ్మాళిరాయన్ అనునత డెవ్వడనగా విచారింతిము.

పశ్చిమ చాళుక్యరాజులలో ఆరవ విక్రమాదిత్యునికి పెర్మాడియని బిరుదు గలదు. ఆ పెర్మాడి యను శబ్దము కన్నడములో హెమ్మాళి యని చెప్పబడును.

ఈ విక్రమాంకుని గూర్చియే బిల్హణుడు విక్రమాంక దేవచరిత్రమను గ్రంధమును

వ్రాసెను. ఈ రాజు శ్రీ గద్యరామానుజాచార్యులవారి కాలములో క్రిమికంఠచోళుడని వైష్ణవులచే చెప్పబడు కులోత్తుంగ చోళుని యొక్క శత్రువులలో ప్రసిద్ధుడైన త్రిభువనమల్ల విక్రమాంకుడని ప్రసిద్ధి.

ఈ రాజు బిరుదగు హెమ్మాళి యను దానికేరాయన్ అను గౌరవ వాచక పదమును చేర్చి నియమనప్పుడిలో హెమ్మాళిరాయన్ తిరుమాళిగై యిలే యని గాశివ్రున్నారు.

# అర్చావతారము

వేదాధ్యాయీ వేదాంతం రాధాకృష్ణమాచార్యులు
పోరంకి.

శ్లో॥ ఆరాధనానాం సర్వేషాం విష్ణో రారాధనం పరం।
యేన కేన ప్రకారేణ విష్ణో రర్చన ముత్తమం ॥

అని ఆరాధనంబులలోను విష్ణు నారాధించుట చాల శ్రేష్ఠమైనది, యే ప్రకారంబునైనను విష్ణువు నారాధించుట యుత్తమము. ఆత్మార్థముగ స్వగృహమందు గాని పరార్థముగ నాలయమందు గాని వాసుదేవుని యర్చించ వలయును. ఈ యర్చనము లక్షకోటి గుణితంబై యొప్పును. పరశబ్దమునకు మోక్షమని యర్థము ముముక్షువులకు మోక్షమొసంగును. కావున పరార్థమని యాలయార్చనంబుకు పేరై యున్నది. సూర్యుడు పరార్థముగను గృహమందలి దీపము స్వార్థ మగునట్లు, అట్లే గృహార్చనము చేయునెడల నాయా గృహస్థులకు మాత్రి ముపకరించును. గ్రామార్చనము గ్రామము కాపాడును. స్వయంవ్యక్త స్థలమందలి యర్చనము సమస్త లోకములకు శుభము గలుగును. శ్రీమన్నారాయణుని యభివ్యక్తమైనప్రకారంబులై యున్నవి. అవి పరము, వ్యూహము, విభవము అంతర్యామి అర్చ యను నామంబులు గలిగి యుండును. పరస్వరూపంబనిన నఖిలాండంబులకు సృష్టిమాత్రమందు ప్రయోజకంబగును. వ్యూహంబనిన మానసాదుల కిది దైవతంబై దేహాదిచలనంబులకు ప్రయోజకంబగును, విష్ణుపురుషసత్యాచ్యుతానిరుద్ధులను పేరనియ్యది పంచవిధంబై యున్నది. విభవంబులని రాక్షససంహారాది దుష్టశిక్షణంబున కుద్భవంబగుమత్స్యకూర్మాదులు. అంతర్యామి యన జగత్తునకాధారభూతమై ప్రతిప్రాణియందు యిమిడి యుండు స్వరూపము. ఈ విధంబుననే సమస్తమగు జీవకోట్లుయొక్క దుఃఖంబును శాంతింప జేయుటకు సులభమార్గంబున మోక్షమును ప్రసాదించుటకు అర్చావతారంబై యవతరించెను. పరవ్యూహంబులు నిత్యులు ముక్తులగు వారలకు మాత్రముపాసింప సాధ్యంబగును. విభవస్వరూపము ఆకాలమందుండినట్టి జనులకు మాత్రము నేత్రగోచరంబుగ కానవచ్చుటచే నదియు సర్వసులభంబు గానేరదు. అంతర్యామి స్వరూపము విశుద్ధులగు యోగిపుంగవు

లకు మాత్రము యోగదృష్టికి గోచరమగును. కావున యఖిల జీవకోటికిని అర్చాస్వరూపము నారాధించుటయందు స్వాతంత్ర్యము గలిగి యున్నారు. భక్తిశ్రద్ధాదులతో నేయబడిన పత్రపుష్పాదులచే పూజ అర్చారూపియగు భగవానుని యందు ఫలవంతమై దుర్లభమగు మోక్షము లభించును. ఏ గ్రామమున ఆలయమందు వైధిక విధానముగా యర్చనము జరుగుచున్నదో ఆ గ్రామమందు నివశించునట్టి ద్విజుల నెల్లరకును సభ్యాహోత్రము వంటి ఫలము నిచ్చును.

శ్లో॥ గ్రామార్చా రహితే గ్రామే ।
గృహే దేవో వ్యముక్తిదః ।
మూలనాశే తు వృక్షస్య ।
సేచనే కిం ఫలం భవేత్ ॥

గ్రామార్చనము లేని గ్రామమందు గృహార్చన సయితము ఫలవంతము కాజాలదు. వృక్షము యొక్క వ్రేళ్లు తెగిపోయిన వెనుక దానికి మొదటికి గాని శాఖలకు గాని నీరు పోసిన ఉపయోగమెట్లు కాజాలదో అట్లే గ్రామార్చనము లేనియెడల గృహార్చన ముపయోగము కాజాలదు. అర్చావతారముగ భగవాను డవతరించెడి స్థానవిశేషంబులైదు

శ్లో॥ దైవం చాపి తదైవార్షం ।
పౌరాణం మానుషం తదా ।
స్వయం వ్యక్తం చ పంచైతే.
స్థానాని పృథివీపతే ॥

దైవము ఆర్షము పౌరాణము మానుషము స్వయంవ్యక్తమని యీ భూలోకము నందర్చావతార స్థాన భేదంబులైదై యున్నవి. దైవమన బ్రహ్మేంద్రాదులవలన ప్రతిష్ఠింప బడినవి, దైవశములును. మరీచ్యాది మహాత్ములచే ప్రతిష్ఠింపబడినవి. యార్షములన్నియు లక్ష జన్మంబుల్టై పురాణకాలము నాటినుండి ప్రాశస్త్యముగ వచ్చుచుండినవి పౌరాణంబులనియు, భక్తిశ్రద్ధాదులచే మనుష్యులచే ప్రతిష్ఠింపబడినవి మానుషంబులనియు,

భక్తుల ననుగ్రహింప నిచ్ఛగలిగి నిర్వ్యాజమగు కరుణావిశేషంబున భగవానుడే యేపుణ్య ప్రదేశమందు స్వసంకల్పముచే యావిర్భవించునో ఆ ప్రదేశము స్వయంవ్యక్త మనబడును అట్టి స్వయంవ్యక్తార్చా రూపము సర్వలోక సమృద్ధికరము,

శ్లో॥ మానుషం యోజనా దర్వాక్
దైవతం దశయోజనం
పంచయోజన మార్షంచ
పౌరాణం యోజనత్రయం ॥

మానుష స్థలము యోజన దూరమును దైవతము దశయోజనము ఆర్షమైదుయోజనంబులను – పౌరాణము యోజనత్రయంబును పవిత్రముజేయును, (స్వయంవ్యక్తస్థలే దేవస్సర్వలోక శుభప్రదః) స్వయంవ్యక్తస్థలమందలి దేవుండు సర్వలోక శుభప్రదుండు కృతత్రేతాది చతుర్యుగంబులలో నిట్టి యర్చావిధానమే మోక్షదాయకమై యున్నది. ఈ యర్చావిధానముచే నా భగవంతుని నాశ్రయించిన వారలు భగవత్తుల్యులగుచున్నారు. సర్వకాల సర్వావస్థలయందును శ్రౌత స్మార్తాది వైదిక కర్మలచే విష్ణువు నారాధించువారు మోక్షమును బొందుదురు.





## నారీవిభాగము

శ్రీమతే రామానుజాయ నమః

# తిరుక్కోళూర్ పెణ్ పిళ్ళై రహస్యము

రచయిత: శ్రీమద్భాగవత పాదరేణువు, మదరాసు.

## మహాభారతము

అ॥ యాన్ సత్య మెన్ఱేనో కృష్ణనై ప్పోలే ।

తె॥ 'అహమేవ సత్య' మన్నానా కృష్ణునివలె॥

౨

శ్రీకృష్ణ పరమాత్మ పరీక్షిత్తు అశ్వత్థామ యొక్క అస్త్రధాటిచే విగతజీవుఁడై పుట్టగా

భార॥ శ్లో॥ గా॥ యదిమే బ్రహ్మచర్యంస్యాత్ మయిసత్యంతుతిష్ఠతి ।
అవ్యాహతం మమైశ్వర్యం తేనజీవతబాలకః ॥

అను నీ మూడు ప్రమాణములచే బ్రతికించెను.

తె. భా॥ తే॥ పగఱయెడనైననే బొంకుపలుకనేని । సమరముఖమున నెన్నఁడుఁజలితవృత్తి ।
బిరిదికడుగిడనేని యిప్పన్నవాని యంగమునజీవ మీఁపొద్దుయావహిల్లు॥
తే॥ మహితసత్యంబు పరమధర్మంబుగాఁథ నిర్మల బ్రహ్మచర్యంబు నిత్య
సుప్రతిష్ఠితంబయి నాయందు దేజరిల్లు నేని యిబ్బాలునకు జీవమిపుడువచ్చు॥
బ్రహ్మచారీత్యత్ర కాణ్వాయన స్మృతిరర్థత ఉపక్రియ్యతే
కాణ్వాయని స్మృతిః॥ బ్రహ్మచారీ చతుర్విధః।గాయత్రః।బ్రాహ్మః।ప్రాజాపత్యః।బృహన్ ఇతి

శ్రు॥ తతో ప్రనయనాదూర్ధ్వం య స్త్రిరాత్ర మక్షారలవణాశీ గాయత్రీం అధీతే సగాయత్రః
య స్తు వేదస్య గ్రహణాంతం బ్రహ్మచర్యం చరతి స బ్రాహ్మః ।
ఋతుకాలే స్వదారగామీ నిత్యం పరస్త్రీవిముఖః స ప్రాజాపత్యః ।
సంవత్సరం వేదకృ ద్వాటు రపి ప్రాజాపత్య యేవ ॥

ఆ మరణాంతం గురుకులవాసీ స నైష్ఠికో బ్రహ్మిత్యుచ్యతే ॥

మనువాక్యం

శ్లో॥ షోడశ స్తు నిశాః స్త్రీణాం తస్మిన్ యుగ్మాసు సందిశేత్ ।
బ్రహ్మచార్యేవ పర్వాద్యా శ్చతస్రశ్చ వివర్జయేత్ ॥

తా॥ బ్రహ్మచారియైనవాడు స్త్రీలను ఋతుదినములు పదునాఱింటిలో రాత్రులలో సరి దినములందు గూడవలెను. పర్వములు నాలుగింటిలో గూడుటను మానవలెను.

ఉపనిషత్తులు ॥శ్లో॥ స్వదారే విధివత్కృత్వా నివృత్తి శ్చా న్యత స్సదా
మనసా కర్మణా వాచా బ్రహ్మచర్య మితి స్మృతం॥

తా॥ స్వభార్యయందు ఋతుకాలవిధి ననుసరించి ప్రవర్తించువాడై మనోవాక్కాయ కర్మములచేత నితరకాలములందు విషయనివృత్తి గలిగియుండుట బ్రహ్మచర్య మనబడును.

శ్లో॥ ఋతుకాలాభిగామీ యః స్వదారనిరతశ్చయః ।
స సదా బ్రహ్మచారీ హి విజ్ఞేయ స్స గృహాశ్రమీ॥

తా॥ స్వపత్నియందు ఋతుకాలమున మాత్రము ప్రవర్తించువాడై ఇతరకాలములందు విషయరహితులైన స్త్రీ పురుషు లిర్వురును బ్రహ్మచారిణీ- బ్రహ్మచారులే యగుదురు.

శ్లో॥ పరదార పరిత్యాగీ స్వదారపరితుష్టితః । ఋతుకాలాభిగామిత్వా ద్బ్రహ్మచారీ గృహీరితః ॥

తా॥ పరస్త్రీలను తల్లులవలె చూచువాడును ఋతుకాలములందు మాత్రము స్వపత్నియందు గృహస్థధర్మము నిర్వహించు వాడును అగు గృహస్థాశ్రమి కూడ బ్రహ్మచారి యనంబడును.

[తి. అ.] శ్రీకృష్ణుని వలె మృత శిశువును బ్రతికించినానా?

# శ్రీరామాయణము

అ॥ అడయాళంశొన్నకవంధనైప్పోలే॥

తె॥ ముందుకు మార్గములను సూచించి నానాకబంధునివలె ॥

౭

సీ॥ శబరిని గనుగొని యరుగుమీరాయావల బంపాసరో వరప్రాంతమునకు
నచ్చట సుమభారహారిశైలము ఋశ్య మూకంబు పొలుచు ననేకపముల
సన్మార్గమున జేసి సౌఖ్యంబుగాగొండ నెక్కంగరాదది నిక్కువంబు
అమలపై నిద్రినందువారే సొమ్ము గలలోనగాంచు మేల్కనియంత
దానిబడయును బాపులాధరణీధరము పైకిజనరాదు చనినిద్రగైకొనినను
రాక్షసులు వారి బ్రహరింత్రు రామచంద్ర బ్రహ్మనిర్మితమియ్యది పార్థివేంద్ర ॥

సీ॥ ఎలుగులబులులును నింద్రనీలచ్ఛాయ మృగములగన శోకమెడలునీకు
నాపర్వతమున మహాగుహయొక్కటి యుర్వీశ యొప్పారుచుండునదియు
రాతి పెన్మూతచేగ్రాలెడు నద్దాని జొరగబూనుట సుఖకరముగాదు
తదుహకును దూర్పుద్వారంబుకెడనొండు మంచిచల్లని నీటమడుగు గలదు ॥
గీ॥ ఆజలాశయతీరంబు తేజరిల్లు హరిఫలమాత్తమై హరిణనికర
యుక్తినాగు హనుగ్రీవుడుండునయ్య వానరచతుష్కయుతుడై వాలి భీతి॥
నీకన్నివిధముల సీతాన్వేషణమునకు తోడ్పడసమర్థుడు గాన స్నేహపాత్రుడని విన్నవించెను।
తి॥ అ॥ కబంధునివలె గురుతులు దెల్పినానా ?



# శ్రీకృష్ణజయంతి ★ తిరువధ్యయనము

శ్రీమాన్ శ్రీమత్తిరుమలై నల్లాన్ చక్రవర్తి సంపత్కుమార జగన్నాథ తిరువేంకటాచార్యులుగారు

శ్లో॥ నందంతు నిందంతు హసంతువాపి । యథాకథం వాప్యధునా భవంతు ।
మయాభవచ్ఛాసన మేవకార్యం । కింవాభవే దిత్యపహాయశంకాం ॥

శ్లో॥ పరిహాస్యాస్య సత్వేపి । నోహాసంతి విపశ్చితః ।
తదభావే విహాసశ్చే । త్తన్నైజమితి కథ్యతే ॥

శ్రీకృష్ణజయంతి రోజున తిరువారాధన రాత్రిని జరుగవలెను. తిరువధ్యయనము పగలే జరుగవలెను. భగవదారాధన జరిగిన గాని తిరువధ్యయనమును జరుపవీలులేదు. ఇవి రెండును ఒకే రోజున జరుపవలసివచ్చినచో చేయవలసిన విధానమేది? యని సంశయము. ఇందులకు కొందరు రాత్రిని శ్రీకృష్ణజయంత్యారాధనము జరిపి యారోజుపవసించి మరునాడు తిరువధ్యయనమును జరుపవలయు ననుచున్నారు. ఈ పక్షమునకు ప్రమాణ బలము లేదు. యుక్తి బలము లేదు. జయంతిని గురించి తిరువధ్యయనమును ఆరోజున మానిన మృతదివసాతిక్రమణదోషము, తప్పదు. భుజించిన గదా యీ దోషము వచ్చుట యందురా? ఏదో ప్రమాదవశమున తిరువధ్యయనమును జరుపుట కాటంకము కలిగిన పుడు భుజింపకుండ నుండి యాటంకము తీరగనే తిరువధ్యయనమును జరుపుమని యున్నది గాని బుద్ధిపూర్వకముగ తిరువధ్యయనమును జరుపక యుపవాస ముండుమని యున్నదా? కనుక నీ దోషము తప్పదు. మరియు నారోజున తిరువధ్యయనమును గురించి తీర్థప్రసాదములు పుచ్చుకొనకున్న తిరువారాధన పూర్తిగాదు. అట్లని స్వీకరించిన పితృదేవతల నతిక్రమించి నట్లగును. అట్లయిన నేకాదశియిం దెట్లందురా?

ఆరోజు మహానివేదనము లేదు గనుక బాధ లేదు. ఈరోజది యుండుటచే దాని గూడ గానవలసి వచ్చును. ఆనాటి తీర్థప్రసాదములనే మరునాడు వినియోగించిన విపరీతానుష్ఠానమగును భగవత్తీర్థప్రసాదములను ఆనాడు వినియోగింతురా? ఇది చాలా యసౌకర్యమైన కృత్యము. ఇట్లని శాస్త్రమును లేదు. మరియు నిట్లు జేసినచో మరునాడు తిరువారాధన జేయవలెనో మానవలెనో తెలదు. చేసిన యెడల ఆనాటి తీర్థప్రసాదముల నేమి జేయవలెను. మానినయెడల నా మరునాడు పెరుమాళ్ళకు సంప్రోక్షణ జరుపవలసియుండును. అందుకని రెండు రోజుల తీర్థ ప్రసాదములను కలిపి వినియోగించిన మరీ యసౌకర్యమైన కృత్యము. ఒక రోజు తీర్థప్రసాదములను వదలెదమందురా? అట్లుజేసిన నేరోజు నందలి తీర్థప్రసాదములను వదలెదరో యారోజు నందలి యారాధన లోపమును జెందును. అయినను వదలదగినవియే రోజుది? మొదటి రోజుది యైన కర్తకును భోక్తలకును జయంత్యారాధన సంబంధమే లేకపోవును. అది శ్రీవైష్ణవత్వ భంజకము. రెండవరోజుది వినియోగింతురేని పర్యుషి తత్వాది దోషములు శక్యశంకితములై యుండు వానిని వినియోగించుటయునే దోషమును లేని వానిని పరిహరించుటయు పరిహాస్యములు. మరియు జయంతినా డుపవసించునది కర్తయే గదా? తక్కిన వారికీ నిర్బంధము లేదు గావున వారానాడు తీర్థప్రసాదములను స్వీకరింతురా? లేదా? స్వీకరింతురేని వారి శేషమునా యీ తిరువధ్యయనమున వినియోగించునది? [వినియోగించునెడల]ఒక వేళస్వీకరింపక మానెదరా? శ్రీవైష్ణవత్వము చెడునుగదా? మరియు భోక్తలను నియమించునది యెప్పుడు? మృతితిథిరోజుననా? తిరువధ్యయనమును పెట్టెడిరోజుననా? మృతతిథిరోజుననైన భోక్తలకును కర్తకు గలిగినన్ని యిబ్బందులు కలుగును గదా? ఈ యిబ్బందుల కియ్యకొని యెవరు భోక్తలుగా నిష్టపడెదరు? అప్పుడు బ్రాహ్మణాభావమే గదా? మరునాడే భోక్తలను నియమింతుమందురా? వారికి జయంత్యారాధన ప్రయుక్త తీర్థప్రసాద స్వీకారము తొలినాడే జరిగియుండును గావున తిరుగ తిరువధ్యయనాంగముగ సక్యశంకిత దోషవిశిష్ట తీర్థప్రసాద స్వీకారమును జేయుట యొక యనవసరమైన విపరీతము. అందుకని వారది గ్రహింపరా? వారు గ్రహింపని కర్తకు గ్రాహ్యమెట్లగును? కానిచో నీపనికి జయంతీ సంబంధము గలుగుటెట్లు? ఆరోజున కర్త జయంత్యారాధనమునందు పాలుగొనకుండునందురా? అట్లయిన రెంటికిని జెడునుగదా? ఆరోజు కర్త యుపవసించుట కారోజుపవాసదినమా? కాని యప్పుడుపవాస మెందులకు? దీనివలన రెంటికిని జెడుటయే గాక యనవసరముగనుపవాసము జేయుట యొకటి మిగులును. కనుక నీ పక్షముపపన్నము గాదు.

మరికొందరు రాత్రిని నక్షత్ర దర్శనము కాగానే జయంత్యారాధనము జేసి పిమ్మట తిరువధ్యయనమును జరిపెదమనుచున్నారు. వీరినెవరైన నిశీథత్వసామ్య మాత్రముననే మనస్తృప్తిని పొందదలచితిరా యని యడిగిన నప్పటికే సళీదమెక్కడనందురు. కాని పగలు జయంత్యా

రాధనమును జరుపగాదని ప్రబలమగు నిషేధము లేనందుచేతను రాత్రిని తిరువధ్యయనమును జరుపరాదను నిషేధమున్నందు చేతను ఇట్లు జేయుట యనవసర విపరీత కృత్యమే యగును. ఈ నిషేధము రాత్రి సామాన్యమునకే గాన నిశీథశ్రాద్ధాచరణనిషేధము మీాకు తగులునన రాదు. ఇక జయంత్యారాధనమును పగలు జరుపరాదని ప్రత్యేక నిషేధము లేకున్నను రాత్రిని జరుపవలయునని యున్నందుచే నిది యే దానిని సూచించుచున్నదందురా? ప్రబల మగు ప్రత్యక్షనిషేధము లేనందున నిట్టిది గల తిరువధ్యయనవిధితో నిది డీకొనజాలదు. అపుడు ప్రబలమగు తిరువధ్యయనవిధి దుర్బలమగు జయంత్యారాధన విధిని స్వావిరోధముగ జరుగు నట్లు నియమించును. కనుక నీపక్షమును అను పపన్నమే యనదగును.

ఇంకను కొందరు మామూలుగా తిరువధ్య యనమును జరిపి కర్త తానుమాత్రి ముపవాస ముండి రాత్రిని జయంత్యారాధమును జేసి భుజింపదగుననుచున్నారు. ఈ పక్షము నందు సంక్రమించు దోషములు కొన్ని పైని జెప్ప బడియే యున్నవి. ఇంకను గలుగు దోషము లెవ్వియనిన భోక్తలు నిర్గమింపగనే పితృశేష మును భుజింపకుండుట యొకదోషము. ఇందుచే తిరువధ్యయనము పూర్తిగాదు గనుక భగవ దారాధన కధిగారము గలుగదు. కనుక దాని యందు ప్రవేశించుట యొక దోషము. అందు కని తిరువధ్యయనము జరుగగనే పితృశేషమును గ్రహించిన భగవదారాధన కసలే యధికారము లేదు. జయంతీదినమందు పగలు సామాన్యా రాధన జేయుట యొక దోషము. అప్రసక్త ముగ మరల రాత్రిని జేయుట యొక దోషము. జయంత్యారాధ నాంగముగ రాత్రియందును తిరువధ్యయనాంగముగ పగలును రెండుసారులు రాజభోగమును సమర్పించుట యొక దోషము. దోషమని యేది మానినను దోషమే. ఇందు నకు శాస్త్రము లేదు గనుక నిదియు కామకార కృత్యమే. అయినను నిక కర్తవ్యమగువిధాన మేది యనిన పగలే ఆశ్రీకృష్ణజయంత్యారాధనమును జరిపి యనంతరము తిరువధ్యయనమును జరుప వలెను. ఇట్లయిన పై దోషము లేవియు సంక్ర మింపవు. ఇందులకు శాస్త్రమున్నదా? యని యడుగవచ్చును. ఉన్నదని కొందరనుచున్నారు ఉండనిండు, ఉండకపోనిండు ప్రమాణ విచా రమే యనవసరము. ఏమనిన "జాతాశౌచమృ తాశౌచ గ్రహణైకాదశీర్వినా మృతాహస్స మతిక్రమ్యచండాలః కోటిజన్మసు" అను వచ నమును విమర్శించిన మృతదివసాతిక్రమణమును జేసినను తప్పులేని సమయములన్నియు దెలియ బడుచునే యున్నవి. అందు జేరనిదేదియు నట్టిది గాదని స్పష్టమగుచునే యున్నది. కనుక వేరొక ప్రమాణ మనవసరము. ఏకాదశీ వ్రతమును తిరువధ్యయనమును సమము గాన కరిణే ప్రత్య వాయజనకములు. కనుక వానికి రెంటికిని పర స్పర విరోధము గలిగినపుడొక నిర్ణయమవసర మైనది. అందువలన పై వచనము పుట్టినది. ఏకా దశీ వ్రతమని నేకాదశ్యుపవాసము దీనిని మాన తగిన సమయమెప్పుడును లేదు. తిరువధ్యయన మాశౌచాది ప్రతిబంధకములు వచ్చినపుడవి నివర్తింపగనే జరుపదగినదియే య

గుటచే నిదియు నెప్పుడును మానదగిన దిగలే
దు. అందుచేతనే యివి రెండును పరస్పరవిరోధ
పరిహార పూర్వకముగ జరుపదగినవి యైనవి.
ఆవిధానమును శాస్త్రమే నిర్ణయింపవలయును.
కావున నైశాస్త్రమవతరించినది. జయంతివిష
యమును ప్రపన్నుల కత్యంతముఖ్యమైన యుత్స
వ విశేషమనియున్నను యేకాదశి వంటిదిగాదు.
తిరువధ్యయనము వంటిదిగాదు. కనుకనే యా
శౌచాది ప్రతిబంధకము లేవివచ్చినను దానికి
ప్రకారాంతరేణ అనుష్ఠానము లేదు. రాత్రిని
చేయదగిన జయంత్యారాధనమును ఆరోజు తిరు
వధ్యయన మైనచో పగలే చేయునెడల నిదిప్ర
కారాంతరేణ అనుష్ఠానముగా లేదా ? యందు
రేమో ? ఇది యొక్కటియేగాని యిట్లన్ని ప్రతి
బంధకములకును పరిహారము జేయువిధానములు
లేవుగదా ? కనుకనే ప్రశ్న కుదురదు. ఇది యిట్ల
నుటకు కారణమేమందురా ! ఇది యకరణేప్ర
త్యవాయ జనకముగాక కరణేఽభ్యుచ్ఛ్రయజనక
మగుటయే కారణము ఈరెండువిధములలో మొ
దటి విధమేగదా ? మనకు గ్రాహ్యమని యడుగ
వచ్చును. కాని యది కర్మవిషయమున గాని
జ్ఞానవిషయమునగాదు. ఇది భగవద్విషయము
గావున జ్ఞానవిషయమైనది. ఏకాదశియు భగవ
ద్విషయంగనుక జ్ఞానమునకు సంబంధించినదే.
అయినపుడిదియు జయంతియు నొకవిధమైనవే
యనరాదా ! అనిన నిట్టివేయైనను ఏకాదశి యక
రణే ప్రత్యవాయజనకము జయంతి కరణేఽభ్యు
చ్ఛ్రయ జనకము. కనుకనే యీ రెంటికిని పై
రీతిగా భేదము గలిగినది. జయంతి దుర్బలమైన
చో ప్రబలమగు తిరువధ్యయనము కన్న ముందె
ట్లు జేయదగినదయ్యెనందురా ? తిరువధ్యయన
ము భగవదారాధనానంతర కర్తవ్యము. జయం
త్యారాధనము భగవదారాధనాంతర్భూతము.
కనుక నదిముందు జేయదగినదయ్యెను. రాత్రిని
జేయదగిన దీనిని తిరువధ్యయనము కొరకు పగ
లు జేయుటచే నిదిగౌణమయ్యె నందురా? అట్ల
నరాదు. ఈరోజున నిట్లే చేయవలసియున్నం
దున నిదియే ముఖ్యమనదగును. కనుక వ్రతకా
లపరిత్యాగ దోషములేదు. శాస్త్రోక్తములుగాని
యింకే యిబ్బందుల వలన నైనను దీనిని పగటి
యందే జరిపిన గౌణమన దగును. కానియప్పుడై
నను ప్రబలమగు దోష మేదియునున్నట్లు
లేదు. ! ఈ విషయ మిట్లు పరిష్కృతమైన
ఇక తిరువధ్యయనము రాని దివసమున జయం
త్యారాధన మెప్పుడు జరుగ వలయునను నిది
విచారింతము.

శ్రీకృష్ణావతారము రాత్రియందు జరిగినది
గావున దీనికి ముఖ్యకాలమదియే యని నిశ్చయ
ము. రాత్రియనిన రాత్రి సామాన్యమే వివక్షి
తము. భగవదవతార మర్ధరాత్రమున నైనదని
కాబోలు నంతవరకు వేచియుండవలయునని కొం
దరనుచున్నారు. కాని యట్టివిధి యున్నదందు
రా ! అందు రేని చూపింపవలయును. కానిజయం
త్యా మేవకృష్ణస్య విహితానిశిపారణా యను
టచే పారణయే నిశియందని యుండె ఇక నారా
ధన మునిశీథమందెట్లు? నిశి యనగా రాత్రి
యందని యర్థము. కాని నిశీథమందనిగాదు, నిశీ
థమనగా నర్ధరాత్రము. అర్ధరాత్రనిశీథౌద్వౌ
అని నిఘంటువు. కనుక నర్ధరాత్రము వరకు వేచి
యుండవలయు నను వాదమునిరస్తమైనది, ఇటుల

చేయుటవిధి ప్రయుక్తమే గావున తమయాను
కూల్యమునకై చేసిరినరాదు. మరియు భగవదవ
తారసమయ మెప్పుడని ముందు వీరి నడుగుదము.
అర్ధరాత్రిమంటిమి గదా యనిన నందులకు ప్ర
మాణమేమి? నిశీథేతమ ఉద్భూతే యను శ్రీ
భాగవతవచనమే ప్రమాణమందురా! ఆవచన
మందే 'జాయమానేజనార్దనే' యనుటచే భగవ
దవతారమున కవ్యవహిత పూర్వకాలమని తె
లియవచ్చుచున్నది. అవతారకాలము మాత్ర
మావిరాసీద్యథాప్రాచ్యాం దిశీందురివపుష్కలః
అనుటచే చంద్రోదయమైన కొంతకాలమున కని
తోచుచున్నది. అనగా నిశీథమందవతరింప
గడంగెను. అవతరించునప్పటి కపరరాత్రియైనది
నడుమను గొంతకాలమున్నది. కనుకనే దీనినాం
ధ్రీకరించిన పోతన్నగారు పంకజముఖి నీళ్ళాడను
సంకటపడుననని చెప్పినారు. ఆరోజష్టమి గావున
చంద్రోదయమే 16 గడియలకగును. ఉదితు
డైన చంద్రునకు పుష్కలత్వ మింక గొంతకాల
మునకుగాని కల్గదుగదా! మరియు పగలష్టమి
యుండి రాత్రికి నవమియున్నచో నింకను గాల
హరణమగును. రోహిణీ ప్రాధాన్యముగ జేయు
నెడల "అష్టమ్యాం వా నవమ్యాం వా దశమ్యాం
యదిరోహిణి" యనునట్లు రోహిణి దశమిరోజు
ననయ్యేనేని యింకను గాలవిలంబమే. ఇవియన్ని
యునపరరాత్రిలో నివేయగును. 'ఆవిరాసీ'త్తను
నదియుదాహరణము మాత్రమేగాని యవతార
కాలము చంద్రోదయానంతరమని చెప్పుట లేదం
దురా? చంద్రోదయమును భగవదావిర్భావ
మును ఏకకాలముననైన దానిని దీనికి దృష్టాంత
ముగ జెప్పుట రమ్యముగనుండును. దేవకియందు
భగవానుడుదయించినాడు. తూర్పుదిక్కునందు
చంద్రుడుదయించినాడు. అతడెట్లు పుష్కలు
డుగ నుండెనో యితడు నట్లెయుండెను. అతనికి
దిక్సంబంధ మెట్లో యట్టిదే యితనికి దేవకీదేవి
గర్భసంబంధమనిన స్వారస్యముగ నుండును.
కనుకను ఆఅష్టమే గ్రాహ్యము. స్వారస్యముగల
యర్థమును విడువనేల సామాన్యార్థమును గ్ర
హింపనేల కనుక నపరరాత్రియే యవతారకాల
ము, అంతవరకు వేచియుండి యారాధనము నా
రంభింపవలెననిన నింపుమించుగా తెల్లవారవ
చ్చును, అపుడు తీర్థప్రసాద స్వీకారయోగ్యత
లేదు. యోగ్యతలేని కాలమున స్వీకరించుటవి
శేషవిధి యందురా! ఆవిధిని జూపవలయును,
కాని మనయిష్టము వచ్చినట్లు విశేషవిధి యనిన
జెల్లునా! తీర్థప్రసాదస్వీకారమునకును కొన్ని
కట్టుబాట్లు గలవుగదా? వచనాత్ ప్రవృత్తిర్వ
చనాన్నివృత్తిః అనుటచే మనము స్వతంత్రింప
వీలు లేదుగదా! ఆసమయమువరకు దీనిని జేయ
రాదనిన నసలా ఆరాధన ప్రారంభింపనే కూడదా
పూర్తి జేయగూడదా ప్రారంభింపనే గూడదనిన
పుడారంభింప యారాధనము మరురోజునకు
జేరి యారోజారాధనమే శూన్యమగును, అర్ధరా
త్రము దాటిననే తరువాత కృత్యములు మరు
రోజునకు సంక్రమించుచుండగా నిక నపరరాత్రిని
గురించి సందేహమున్నదా "రాత్రౌ త్రిభాగం
కుర్వీత" యనునది యీవిషయమునందు గాదు
గదా "అర్ధరాత్రాదధస్తాచ్చేత్సం క్రమేద్యదిభా
నుమాన్" ఇత్యాదివచనములచే నర్ధరాత్రానం
తరకాలము మరురోజునకు జేరుట మనమెరుం
గనిది గాదుగదా? ఇది ధనుర్మాస ప్రవేశాదుల

యందు స్పష్టము ఒకవేళ పూర్తి మాత్రము జే
యరా దంచురా ఎంతివరకు జేయవలెను ఎక్క-
డనుండి యాపవలెను ఇక నపరరాత్రియని గ్రి
హించిన నీదోషములుగాని యర్ధరాత్రియని గ్రి
హించిన నేదోషమును లేదుగదా యందురా?
అవతారకాల మర్ధరాత్రిముగాదని పైనిదెల్పితి
మిగదా? అయినను ఉక్తదోష పరిహారముగ
కొకవేళ నర్ధరాత్రిమే యవతారకాలమని గ్రి
హించినను తీర్థప్రసాద స్వీకార
యోగ్యకాల మతిక్రమింపక మానదు,
అప్పుడును ప్రారంభింపగూడదా? ఇత్యాది
ప్రశ్నలు కలిగియే యుండును, అర్ధరాత్రిము
దాటినగాని దాటకున్న పరదినమునకు జేరదం
దురా? అర్ధరాత్రిముపూర్వదినమునకు జేరునా?
"యోయమేకాదేశస్స పూర్వస్యాంత వత్ పర
స్యాది వత్ స్యాత్" అనునట్లు రెంటికిని జేరు
నందురా? అప్పు "ఇదమిత్థ" మని నిర్ణయింప
వీలులేదు గదా? ఒకవేళ పూర్వదినమునకే చేరు
ననుకొన్నను తీర్థప్రసాద స్వీకారమునకు
మాత్రము యోగ్యమగు కాలము లేదుగదా?
అది జరుగని యారాధనము వ్యర్థమే గాక
దుష్కృతము గూడ నగునుగదా! ఇందువలన
తీర్థమును మాత్రమప్పుడు స్వీకరింతుమందురా?
ప్రసాదము నేమి జేయుదురు! మానిన నపచా
రమే గదా? గ్రహించిన నిషిద్ధమే గదా! తీర్థ
మునకు బనికి వచ్చిన కాలము ప్రసాదమున
కెట్లు పనికిరాలేదు? అసలు ప్రసాద స్వీకార
మనిననేమి? కరతల ప్రసాదముగా బదరీఫల
మాత్రముగా గ్రహించు శుద్ధాన్న వ్యతిరిక్తము
లగు నుపహారాదులను గ్రహించుటా? భోజన
విధి ప్రయుక్త పరిషేచనా పోశనాది పూర్వ
కముగా విస్తరియందుంచుకొని భుజించు సవ్యం
జన శుద్ధాన్న స్వీకరణమా? మొదటిదే యనిన
జయంత్యారాధనమందు మహానివేదనముగదు
గదా? అది యనిన సవ్యంజన శుద్ధాన్న నివేద
నమేగదా? అట్లు నివేదితముగ వచ్చిన ప్రసాద
మును భోజనవిధి ప్రకారముగ భుజింపనిచో
మరల దానికి దుర్వినియోగమే గదా? ఇందు
కని మహానివేదన మానిన నారాధన లుప్తమ
గుటయే గదా? అందుకని భుజించిన యెడల
ననర్హమగు కాలమున భుజించిన దోషమగు
గదా? ఇట్లు భుజించుట విశేషవిధియనిన నిది
పామండత్వసంపాదకమై శ్రోత్రియగోష్ఠియందు
నగు బాట్లకు దెచ్చునుగదా? భగవదారాధనా
నంతరము తీర్థప్రసాదములను గ్రహింపక తప్ప
దన్న మాత్రమున నేకాలమైనను తప్పులేదని
సమన్వయించినచో భగవదారాధనముగాకుండ
తిరువధ్య యనమును జరుపరాదనుటచే నపరరా
త్రియందైనను తిరువధ్యయనమును జరుపవ
చ్చునని గూడ సమన్వయింప నలసివచ్చును.

విష్ణోర్నివేదితాన్నేన యష్టవ్యం దేవతాంత
రం పితృభ్యశ్చాపితద్దేయం తదానంత్యాయ
కల్పతే ఇత్యాది వచనములచే భగవదారాధన
గాకుండ తిరువధ్యయనమును జరుపవీలులేదు
గదా? ఇక శిష్టాచారముల పైనిట్లు ప్రశ్నింపవ
చ్చునా? యని యొక యాక్షేపమున్నది. ప్ర
మాణబలము యుక్తిబలము సమానముగనున్న
యాచారభేదములను గురించి శిష్టాచారములను
గౌరవముతో నెవరి యిష్టానుసారముగ వారవ
లంబింప వచ్చుగాని యిందులకు వ్యతిరిక్తము

ఐనను వానిని శిష్టాచారము లనరాదు, ఇన్నివిధ
ములయాచారములకును అనుష్ఠాతలు పండితు
లే కావచ్చును. ఐనను ఒక్కరికే సర్వవిద్యల
యందును ప్రవేశముండదుగదా కొన్ని విద్యల
యందు తాము ప్రవీణులయ్యును తమకు ప్రవే
శములేని విషయములను గురించి వానిని తెలి
సినవారి సలహాతీసుకొని ప్రవర్తించుట దగును.
అట్లుగాక తమ కగౌరవమని భ్రాంతితో తోచి
నట్లు జేయుట తెలిసీ తెలియని యనుష్ఠానమగు
ను. ఒక్కొక్కపు డొక్కొక్కరికి తెలిసిన విష
యమున గూడ భ్రమప్రమాదాదులు కలుగవ
చ్చును, కనుక తగిన వారి సలహా తీసుకొనుట
యవసరమే. అట్లు జేయనివారి యనుష్ఠానమును
(వారు శిష్టులైనను) శిష్టాచారము కారేని దాని
నై విమర్శింపదగదు. ప్రతివిషయమునకును ప్ర
మాణమైన నుండవలెను, ఉపపత్తియైన నుండ
వలెను. ఇందేదియున్నను గ్రాహ్యమే, ఏదియు
లేనిచో త్యాజ్యమే, ప్రమాణ వచనమున్నను
దానికి దేశకాలపాత్రాది విభాగమొకటి విమర్శ
నీయము. విధివేరు, యుక్తి వేరు. విధినే ప్రమా
ణమందురు. యుక్తినే యుపపత్తి యందురు.
విధిలేని దానిని అవిహిత మందురు. యుక్తిలేని
దానిని యుక్తిహీనమందురు. యుక్తి యుక్తము
గానిదనిన నదియే. ఇట్లు గాక తోచినట్లనిన
జెల్లదు.

# ప్రచార విభాగము.

భక్తి "నివేదన" అనుబంధము

మదరాసు శ్రీయుతరాజ సేవామహిళా మండలవారిచే ప్రతిసంవత్సరము జరుపబడుచుండు

## భగవద్గీతా పరీక్షా వివరములు.

**ఉద్దేశము:**—స్త్రీలలోను, అందును విశేషించి స్కూళ్ళయందు విద్య నభ్యసించు బాలికలయందును విరివిగా గీతాప్రచారమును గావించుట

మూడు సంవత్సరములలో ప్రథమ-మధ్యమ-ఉత్తమ పరీక్షలయందు క్రమముగ ఉత్తీర్ణులై గీతలోని విషయములను సమగ్రముగ తెలుసుకొని సుమారు 180 శ్లోకములను టీకాతాత్పర్యములతో కంఠస్థపరచి జీవ-ఈశ్వర-ప్రకృతి తత్త్వముల స్వరూపస్వభావాదులను అవగతము చేసుకొనుటకు అవకాశము కల్పించుట.

**పాఠ్యక్రమము:**—గీతామందిర ప్రచురణమైన టీకాతాత్పర్య సహితమగు భగవద్గీతనుండి ఒక్కొక్క-సంవత్సరమునకు క్రమముగా ఆరు అధ్యాయములలోని విషయములున్ను వాటినుండి పరీక్షాధికారులచే నిర్ణయింపబడిన 60 శ్లోకములున్ను, గీతామందిర ప్రచురణమగు తత్త్వత్రియ వివరణమనబడు జీవేశ్వర ప్రకృతితత్త్వములలో ఒక్క-తత్త్వమున్ను ఇట్లు మూడుసంవత్సరములలో సమగ్రగీతా విషయములున్ను, 180 గీతాశ్లోకములున్ను. తత్త్వత్రియ వివరణము సమగ్రముగనున్ను పరీక్షింపబడుచుండును.

**పరీక్షాకాలము:**—ఈపరీక్షలు ప్రతిసంవత్సరము ఒకసారిమాత్రమే నిర్ణీతకేంద్రములలో నవంబరు నెల మొదటివారములో ఆదివారమున జరుపబడుచుండును.

**పరీక్షావిధానము:**—ప్రతి పరీక్షకును రెండుప్రశ్న పత్రములుండును. ఒకటిచదివిన గీతావిషయములలోని ప్రశ్నలున్ను. వర్ణించిన శ్లోకములనుగూర్చిన ప్రశ్నలున్ను కలిగియుండును.

రెండవది తత్త్వత్రియ వివరణములోని నిర్ణీతవిషయములను గూర్చిన ప్రశ్నపత్రము

**పరీక్షకేంద్రము:**—ఈపరీక్షలకు 5 గురు స్త్రీలుఉన్న ప్రతిగ్రామమునను ఒక పరీక్షాకేంద్రముండును. పరీక్షాధికారులచే నొసంగబడు రెండుప్రశ్న పత్రములున్ను వేరు వేరు కవర్లలో సీలు చేయబడి దేవస్థాన ధర్మాధికారికి రిజిష్టరుపోష్టులో పరీక్షా తేదీకి 2 రోజులు ముందుగా పంపబడును. వారు సకాలములో దేవాలయమున పరీక్షలను జరిపించి ఉత్తరపత్రములను వెంటనే రిజిష్టరుపోస్టులో కార్యాలయమునకు పంపివేయుదురు. ఒకనెలలో పరీక్షాఫలితములు శ్రీవిశిష్టాద్వైత ప్రచారకసంఘ భక్తి నివేదన పత్రికలో ప్రకటింపబడును,

ఈపరీక్షలకు సంబంధించు విషయవిమర్శలు కూడా ఈపత్రికయందు ప్రతినెలకు ప్రచురింపబడి అభ్యర్థినులకు పరీక్షకు మిక్కిలి సహాయకరముగ నుండగలవు.

**పరీక్షకు అర్హులు :—** స్త్రీలుమాత్రమే ఏవయస్సునందున్న వారైనను పరీక్షనిచ్చుటకు అర్హతకలిగి యుందురు.

**ఉత్తీర్ణకక్ష్యానిర్ణయము :—** ఈపరీక్షలలో ప్రతిపత్రికలోను నూటికి అరవై అంతకుపైబడిన మార్కులు లభించువారు ఉత్తమకక్షలోను, ఏభై అంతకుపైబడిన మార్కులు లభించువారు మధ్యమకక్షలోను, నలభై అంతకుపైన మార్కులు లభించువారు ఉత్తీర్ణలుగాను భావింపబడుదురు,

**బహుమతులు – బిరుదములు :—** ఈమూడు పరీక్షలలోను క్రమముగా నుత్తీర్ణులైనవారికి మూడవ సంవత్సరాంతమున 'గీతావిశారద'యను బిరుదముతో యోగ్యతాపత్ర మొసంగబడును.

ఇదిగాక మొదటిపరీక్షకు ఉత్తీర్ణతక్రమము ననుసరించి రు 25.20.15.10,5 వరకు 5 నగదు బహుమతులున్ను 5 పుస్తక బహుమతులున్ను ఒసంగబడును.

రెండవపరీక్షకు ఉత్తీర్ణక్రమము ననుసరించి రు 30,25.20,15.10,6 వరకు 6 నగదు బహుమతులున్ను 4 పుస్తకబహుమతులున్ను ఒసంగబడును.

ఉత్తమపరీక్షకు ఉత్తీర్ణక్రమము ననుసరించి రు 50,40, 3020.10.5 వరకు 6 నగదు బహుమతులున్ను 4 పుస్తక బహుమతులున్ను ఒసంగబడును.

**విశేషబహుమానము :—** పై మూడుపరీక్షలలోను తప్పక, వరుసగ సర్వోత్తమముగా ఉత్తీర్ణమైన ఒకరికిమాత్రము బంగారుపతకము బహూకరింపబడును.

**ఉపాధ్యాయసన్మానము :—** ప్రతి కేంద్రములోను అభ్యర్థినుల తయారుచేసి పరీక్షకుపంపిన ప్రతి ఉపాధ్యాయులకును ఉత్తీర్ణత ననుసరించి యథావకాశముగా నగదు సన్మానము సమర్పింపబడును.

**దరఖాస్తు పంపుకాల నిర్ణయము :—** ప్రతిసంవత్సరము సెప్టెంబరు నెలాఖరులోగా కార్యాలయమునకు తమతమ దరఖాస్తులను అభ్యర్థినులు పంపుకొనవలెను. ఆయవధిమించిన దరఖాస్తులు మంజూరు కానేరవు.

దరఖాస్తు అచ్చుఫారములు కార్యాలయనుండి కోరినవారికి ఉచితముగా పంపబడగలవు.

**పరీక్షాశుల్కము :—**

మొదటి పరీక్షకు 0–8–0 రెండవ పరీక్షకు 0–12–0 మూడవ పరీక్షకు 1–0–0 దరఖాస్తుతో మనియార్డరు ద్వారా కార్యాలయమునకు పంపవలెను.

గీతామందిర కార్యదర్శిని
107 వరదాముత్తియప్పన్ వీధి
మదరాసు 1
(అడ్రసు ఇంగ్లీషులో వ్రాయవలెను.)

# కట్నములు

శ్రీరామకృష్ణ రామానుజదాసుగారు (లింగాలవలస) శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘమునకు సమర్పించిన కట్నము. 5-0-0

శ్రీ వణుకూరుకోట లక్ష్మీనరసింహం గారు వారి దౌహిత్రుడు చి॥ చక్కా సత్యనారాయణకు చి॥ సౌ॥ ప్రభావతిని యిచ్చి 2-3-52 వ తేదీని జరిపించిన వివాహసందర్భమున సంఘమునకు రు 5-0-0 కట్నమును సమర్పించిరి. ఈ నూతనదంపతులు చిరంజీవులైన సమస్త సంపదలతో వర్ధిల్లుగాక యని శ్రియఃపతిని ప్రార్థించుచున్నాము.

శ్రీమాన్ తె. కం. గోపాలాచార్యులుగారు తమ కుమారుడు చి॥ తె. కం. రంగరామానుజాచార్యులకు చి॥రామచంద్రాచార్యులు గారి కుమార్తె చి॥సౌ॥చి. వెంకటమ్మనిచ్చివివాహము జరిపించినసందర్భమునసంఘమునకురు10-0-0లు సమర్పించిరి. ఈ వధూవరులకు శ్రియఃపతి ఆయురారోగ్యైశ్వర్యముల నొసంగి బ్రోచుగాక.

విశాఖపట్టమున 18-4-52 తేది మొదలు 3 రోజులుజరుపబడిన శ్రీయతిరాజసేవామహిళామండలి వార్షిక సభల సందర్భమున సదరుశాఖా సంఘ కార్యదర్శినిగారైన శ్రీమతి దాసరి ఆండాళ్ళమ్మగారు మనసంఘమునకు రు 5-0-0లు కట్నమును సమర్పించి మార్గదర్శకులైరి. వీరి ఉద్యమమునకు శ్రియఃపతిపూర్ణదోహద మొసంగు గాత!

శ్రీమతి వక్కలంక వెంకట రంగనాయకమ్మగారు-(అనకాపల్లి). శ్రీయతిరాజసేవామహిళామండలికి గొప్ప సేవచేయుచు పెక్కుమందిసభ్యులను చేర్పించుచు అందరికిని ఆదర్శపాత్రులగు చున్నారు. వీరికి మా అభివందనములనర్పించు చున్నాము.

విజయవాడలో శ్రీ పాలేపల్లి శీతారామయ్యగారు చూపుచున్న సంఘాభిమానమునకు మా కృతజ్ఞతను తెలుపుకొనుచున్నాము.

★

---

శ్రీమాన్ ఎన్. జి. కె. ఆచార్యులుగారు "సుదర్శనమ్" అను పేరుతో నొక వారపత్రికను ప్రచురించుచున్నారు. ఇందు పెక్కు వేదాంత విషయములు, వేదాంత ప్రచారవివరములు, సత్సంప్రదాయ విషయములు మొదలగునవి సులభశైలిలో ప్రచురింపబడుచు ఆబాలగోపాల మత్యంతోపయుక్తముగానున్నది. దీనిని ప్రతివారును ప్రోత్సహించుట ముఖ్యకర్తవ్యము. చందా స్వల్పము. సంవత్సరమునకు రు 3 లు మాత్రమే.

---

మైలవరం శ్రీ యతిరాజసేవా మహిళామండలి అధ్యక్షులగు శ్రీ శ్రీ శ్రీ సూరానేని శ్రీ వరమంగయ్యమ్మ బహద్దరు జమీందారిణీవారు మద్రాసు శ్రీ యతిరాజసేవా మహిళామండలి వారు గీతామందిరములో జరుపుచున్న శుక్రవార కార్యక్రమమున ముత్తయిదువులకు వినియోగించుటకుగాను నూరు బంగినిపల్లి మామిడి పండ్లు ప్రేమతో పంపించిరి. ఇట్లు అన్ని స్థలముల యందున్న శాఖా సంఘములకు పరస్పర పరిచయమున ప్రీతి వృద్ధిపొందుటకు వీరు మార్గదర్శకులైరి అని వీరికి మద్రాసు మండలివారు తమ కృతజ్ఞతను తెలుపుకొనుచున్నారు.

# శ్రీ యతిరాజ సేవా మహిళామండలి — (విశాఖపట్టణంశాఖ)

## ద్వితీయ వార్షిక సభా సమావేశము.

## పండితసభా వివరములు.

ది 18-4-1952వ తేదీని ఉదయం గం 9-0 లకు విశాఖపట్నంలో వేంచేసియున్న శ్రీ యెంబెరు మానార్ల కోవెలలో శ్రీ ఉ. వే. శ్రీమాన్ ప్రతివాది భయంకరం శ్రీనివాసాచార్యస్వామివారి అధ్యక్షత క్రింద శ్రీ యతిరాజసేవా మహిళా మండలి సభ్యురాండ్రు సమావేశమై తమమండలి ద్వితీయ వార్షికోత్సవమును అత్యంత వైభవముతో జరిపించి యీ దిగువ కార్యక్రమమును దిగ్విజయముగా జరిపించిరి. పెక్కుమంది పండితప్రకాండులును, విదుషీమణులును వివిధప్రాంతములనుండి వేంచేసి తమ అమూల్య సలహాలను ఉపన్యాసములను నొసంగి వందలుగా సభ నలంకరించిన శ్రోతబృందము నానందాబ్ధి నోలలాడించిరి.

దైవప్రార్థన సంస్కృత ద్రావిడభాషలతో జరిగిన పిదప మండలి కార్యదర్శిని . గారైన శ్రీమతి దాసరి ఆండాళ్ళమ్మగారు గత సంవత్సరమంతయు యీ మండలివారు జరిపిన శుక్రవార కార్యక్రమ వివరములను, తిథి, నక్షత్రాదిమహోత్సవ వివరములను ఆ సందర్భములలో విదుషీమణులచేతను పండితోత్తముల చేతనుగావింపబడిన ఉపన్యాస వివరములను పూసగుచ్చినట్లు విన్నవించి యీ సంవత్సరమునూతన కార్యవర్గముతో నూతనోత్సాహముతో ద్విగుణీకృతముగా కార్యక్రమముల జరిపించి ఆంధ్రదేశమందున్న మహిళామండలి లన్నిటికిని యీ శాఖ ఆదర్శప్రాయమై యలరారవలె నని హెచ్చరించిరి.

పిమ్మట అధ్యక్షులు సంఘసేవను మండలి ప్రచార దీక్షను ప్రశంసించుచు ఉపన్యసించిరి. ఈ దినము మొదలు 3 రోజులు రెండుపూటల యందును ఈ దిగువ కార్యక్రమానుసారముగ అత్యంత వైభవముతో ఈ సభ జయప్రదముగ ముగింపబడినది.

| ఇందు పాల్గొనిన పండిత ప్రముఖులు. | ఉపన్యసించిన విషయములు. |
|---|---|
| శ్రీ అధ్యక్ష మహాశయులు. | శ్రీ విశిష్టాద్వైత వైభవము, ఆళ్వారుల భక్త్యనుభవ తారతమ్యములను విమర్శించుచు ఉపన్యసించిరి. (2) భక్తి ప్రాధాన్యము. |
| ,, ఇరగవరపు రంగాచార్యులుగారు. (సింహాచలం) | పెరియాళ్వారులు ఆండాళ్ వైభవము. |

| | |
|---|---|
| " కో. కం. వేంకటేశ్వరాచార్యులుగారు. శ్రీ రా మ తీ ర్థ ం | పరమాచార్యులగు శ్రీ వరహాస్వామివారి వైభవము, శ్రీ కులశేఖరాళ్వారుల వైభవము. |
| " తి. పె. సంపత్కుమారాచార్యులుగారు. (సింహాచలం) | 1 "యాదృచ్ఛిక సుకృతము" 2 "అవతార విశేష వైభవం" 3 "ప్రాచార్యావశ్యకత- సభావిశేషములు" |
| ,, తి ప. నారాయణస్వామిగారు ,, | శ్రీరామసీతావిరాటుల సౌందర్య విశేషము అష్టప్రబంధమున్ను. |
| ,, కరి నారాయణాచార్యులుగారు (రామతీర్థం) | సంకీర్తన వైభవం, గోదా కళ్యాణం హరికథా కాలక్షేపమున్ను. |
| , కొమాండూరి అప్పలాచార్యులుగారు (సింహాచలం) | 1 శ్రీరామ - కృష్ణావతార సౌలభ్యాతిశయ విశేషములు - (భగవద్విషయమునుండి) 2 "ఆళ్వారుల హృదయం" |
| ,, కో. కం. అప్పలాచార్యులుగారు. (శ్రీరామతీర్థం) | 1 నాలాయిర ప్రబంధమందలి మంగళాచరణ వైభవ విమర్శ, 2 పెరియతిరుమొళి వైభవమున్ను, |
| ,, నండూరి అప్పలాచార్యులుగారు. (సింహాచలం) | శ్రీమద్రామాయణ వైభవము. |

ఈ మూడు దినములలో మధ్యాహ్నకాలమున మహిళామండలిచే నాహ్వానింపబడిన శ్రీమతి ముడుంబై రామానుజమ్మగారు, శ్రీమతి పున్నంరాజు వెంకటబంగారమ్మగారు, మొదలగు విదుషీమణులచే ఉపన్యాసములు వైభవముగా గావింపబడెను.

3వ దినము సభాంతమున అధ్యక్షభాషణానంతరం మహిళామండలి పక్షమున పండితులకును, విదుషీమణులకును, ఆగంతుక భక్తబృందమునకును, చందనతాంబూల దక్షిణ సత్కారాదుల సమర్పించిరి.

—:ఈక్రింది దాతలీ సభకు ఆర్థిక సహాయ మొనరించి ప్రోత్సహించిరి:—

—:వి శా ఖ ప ట్ట ం:—

శ్రీమతి ద్వారం శ్రీనివాసమ్మగారు.
శ్రీమతి రెడ్లం అమ్మన్నగారు.
శ్రీమాన్ మంచుకుండ కోదండరామయ్యగారు.
,, మద్ది శ్రీనివాసం బ్రదర్సువారు.
,, మంగళగిరి కోదండరామయ్యగారు.
,, ద్వారం జగన్నాధరావుగారు.
,, దాసరి మధుసూదనరావుగారు.
,, రామినీడి వెంకటాప్రియుడు నాయుడుగారు
,, ఎర్రబోలు కృష్ణారావుగారు.
,, రామినీడి రాజానాయుడుగారు.

శ్రీమతి తలువుల శాంతయ్యమ్మగారు.
,, యజ్ఞబోల నారాయణమ్మగారు.
,, రామినీడి రామాయమ్మగారు.
శ్రీ శ్రీ ఒకభక్తురాలు.
శ్రీమతి పెద్ద తాయారమ్మగారు.
,, చిన్న తాయారమ్మగారు.
,, కద్రి లక్ష్మీనరసమ్మగారు.
,, గుండాల లక్ష్మీనరసమ్మగారు.
,, ప్రి. భ. కనకమ్మగారు.
,, వక్కలంక వెంకటనరసమ్మగారు.

## పుష్ప చందన కైంకర్య తిరునామములు.

శ్రీమతి మంచుకొండ సీతయ్యమ్మగారు.
,, మం. నరసమ్మగారు.
,, మం. సీతాపిరాట్టిగారు.
,, మం. వరలక్ష్మమ్మగారు.
,, మద్ది రంగనాయకమ్మగారు.
,, మద్ది సీతయ్యమ్మగారు.
,, మంచుకొండ తల్లెమ్మగారు.
,, రామినీడి సరస్వతమ్మగారు.
,, కట్టమూరి అమ్మాయమ్మగారు.
,, పరాంకుశమ్మగారు.

ఇట్లు:
దాసరి ఆండాళ్ళమ్మ,
శ్రీ యతిరాజ సేవా మహిళామండలి, [విశాఖపట్టణ శాఖా] కార్యదర్శి.

---

శ్రీమతి దాసరి ఆండాళ్ళమ్మగారు తమ కుమార్డు ఆనందమోహనరావునకు జరిగిన వివాహ సందర్భమున మన సంఘమునకు రు 5 లు కట్నం సమర్పించిరి. ఈ నూతనదంపతులకు శ్రీయఃపతి ఆయురారోగ్యైశ్వర్యములు ప్రసాదించుగాక.

★

రిజిస్టరు నెం. 5094

# భక్తినివేదన

(వేదాంత మాసపత్రిక)

ఇందు వేదాంత విషయ రాజములున్ను; భక్తిప్రచార విషయమైన వార్తలున్ను వేదాంత సాంప్రదాయ విషయకమైన ప్రశ్నోత్తరములున్ను ప్రచురించబడును.

**చందాలు;**

సాధారణ చందా. సం. 1 కి రు. 5-0-0.
సహాయ చందా ,, రు. 10-0-0.

To
శ్రీ Sri Venkateswara Oriental Library,
TIRUPATI
Dt.

**Book-Post**



1. శ్రీమన్నారాయణుడే సృష్టి - స్థితి - లయ కారకుడు.
2. ఆయనే మోక్షప్రదాత.
3. ఆయనే పరతత్త్వము-పరమాత్మ
4. ఆయన అఖిలహేయ ప్రత్యనీక కల్యాణ గుణకుడు.
5. ఆయనకు జీవుడు శరీరభూతుడు; శేషభూతుడు, పరతంత్రుడు, నియామ్యుడు, అనుభావ్యుడు.
6. జీవులు జ్ఞానాకారులు.
7. జీవులు అనంతములు.
8. జీవులు పరమాత్మకంటె భిన్నులు; ఈ భేదము సత్యమైనది; నిత్యమైనది.
9. జీవ-పరమాత్మలకు ప్రకృతి శరీరభూతమైనది; శేషభూతమైనది; పరతంత్రమైనది; నియామ్యమైనది; అనుభావ్యమైనది.
10. ప్రకృతి వికారాస్పదమైనది. జీవపరమాత్మలకంటె భిన్నమైనది, ఈ భేదము సత్యమైనది; నిత్యమైనది.
11. జీవుడు ప్రకృతి వియుక్తుడై పునరావృత్తి రహితమైన పరమాత్మ సాన్నిధ్యమగు పరమ పదమును పొందుటయే మోక్షము.
12. భక్తి ఒక్కటియే మోక్షసాధనము.
13. భక్తి యనగా తైలధారవలె అవిచ్ఛిన్నమైన స్మృతి పరంపర.
14. వివేక-విమోక-అభ్యాస-క్రియా-కల్యాణ-అనవసాద-అనుద్ధర్షలు భక్తికంగములు.
15. ఇవి సదాచార్య-సమాశ్రయణ-లభ్యములు
16. జగద్గురువగు శ్రీరామానుజాచార్యులవారును; వారి యనుయాయులున్ను సదాచార్యులు.

"నగురుర్వైష్ణవాత్ పరః" భా. సం.

Edited Printed & Published by A. Ch. Srimannarayanacharya at Sriman Press, Kakinada.



శ్రీమతే రామానుజాయనమః

భక్తి

# నివేదన

వేదాంత మాసపత్రిక

సంపుటి ౮ | నందన-ఆషాఢమాసం | సంచిక ౪

## ★ సంధ్యావందనము — దాని మహిమ ★

శ్రీ ఉ. వే. శ్రీమాన్ తె. కం. గోపాలాచార్యులుగాడ

విశ్వామిత్ర మహర్షి పెక్కు సంవత్సరములు రాజ్యమును పాలించి ఒక్కతరి గొప్ప సేనను సమకూర్చుకొని దేశములన్నియు తిరిగి తిరిగి వశిష్ఠమహర్షి ఆశ్రమమున కేతెంచెను. వశిష్ఠు డాతనిచే పూజింపబడి విశ్వామిత్రునకును ఆతని సమస్త సైన్యమునకును ఆతిథ్యమొసంగ నిశ్చయించి యాతనిని నిర్బంధించెను. విశ్వామిత్రు డందుల కంగీకరింపగా వశిష్ఠమహర్షి తన కామధేను ప్రభావముచే బ్రహ్మాండమగు విందు గావించెను. విశ్వామిత్రుడది గాంచి యా కామధేనువు నపేక్షించి యాతడీయ కుండుటచే బలాత్కారముగా తీసుకొని పోజొచ్చెను. అంతట వారిద్దరకును గొప్ప యుద్ధము సంభవించెను. కామధేనువు సహాయముచే వశిష్ఠ మహర్షికే జయము చేకూరెను. అంత విశ్వామిత్రుడుగొప్ప తపస్సు గావించి అమోఘములగు శస్త్రాస్త్రములను సంపాదించి వశిష్ఠు నెదుర్కొనెను. కాని విశ్వామిత్రుడు ప్రయోగించిన శస్త్రాస్త్రాదుల నన్నింటిని యా వశిష్ఠుని బ్రహ్మదండ మొక్కటియే మ్రింగి వేయజొచ్చెను. తుదకు బ్రహ్మాస్త్రమునకు గూడనిదే గతి పట్టుటను గాంచి విశ్వామిత్రుడు మిక్కిలి ఆశ్చర్యపడి

> “ధిగ్బలం క్షత్రియబలం
> బ్రహ్మతేజోబలం బలం
> ఏకేన బ్రహ్మదండేన
> సర్వాస్త్రాణి హతాని మే॥

ఛీ క్షత్రియ బలమును కాల్చనా ! బలమనిన బ్రాహ్మణతేజస్సే గదా బలము. ఆహా ! ఒక్క అచేతనమగు కర్రతో చేయబడిన బ్రహ్మదండము నాతపః ఫలమగు అస్త్రముల నన్నిటిని తన పొట్టను బెట్టుకున్నదే. నేనా బ్రహ్మతేజస్సును తపస్సుచే సంపాదించుటకే నాజీవితము నర్పింతు నని నిశ్చయించి నాలుగు దిక్కులయందును ఘోరతపము లాచరించి తుదకు బ్రహ్మనుండి బ్రహ్మర్షి పదవిని లభించెను.

ఇట్టి శక్తి దేనిలో నున్నదో విచారించవలసి యున్నది. దీనినే బ్రహ్మతేజమని విశ్వామిత్రుడు ప్రశంసించెను. ఈ బ్రహ్మతేజమున కేదిముఖ్య కారణము? దేనివలన వసిష్ఠు డంతప్రభావశాలి యయ్యెను? అనునది మనము ప్రకృతమున తెలుసుకొన దగిన ముఖ్యాంశము. అది నియమ బద్ధమగుగాయత్రీమంత్ర ప్రభావమనుట నిస్సంశయము.

ఇట్టి ప్రభావముచేతనే గదా నచికేతుడు యమునిగూడ గడగడ వడకించెను. ఇట్టి ప్రభావముచేతనే గదా అగస్త్యుడు సముద్రమును ఆచమించెను. ఇంకను పూర్వము మహర్షులు మహాత్ములు యెన్నెన్ని యలౌకిక అత్యద్భుత సంఘటనలు గావించిరనినను పరమపూజ్యులై యల రారిరనినను పరమనిశ్శ్రేయసము నందగల్గించినను అన్నిటికి మూలకారణ మీగాయత్రీ మంత్ర పురశ్చరణ ప్రభావమే.

ఈ ప్రభావమును సంపాదించు యధికారము ప్రతియుప నీతునకును గలదు. కలికాల ప్రభావముచే నాశక్తి మనలో క్షీణించుటచేతనే బ్రహ్మణ్య మీనాడింత దుస్థిలో నున్నది.

నూతన వటువు నాయనా! సంధ్యావందనము చెప్పమని తండ్రిని యడుగగా ఛీ! కుంకా వడుగయి వారమైనను కాలేదే నీకేరానిచో నలబది సంవత్సరముల క్రిందట ఉపనయనమైన నా కెట్లు వచ్చునురా! యని గద్దించు తండ్రులును ఒకవేళ తండ్రులకు సంధ్యావందనమందాసక్తిచే బిడ్డలకు చెప్పించ బూనినను వాడు, ముక్కు పట్టుకొనమనిన, పురోహితుని ముక్కుపట్టుకొనుటయో, కొట్టియో, తిట్టియో వాని ముక్కు వాడిచే పట్టించినను'

బాలోయ మితి జ్ఞానాత్ నాసాం గ్రాహ
యసే బలాత్ నాఽహం మోంభూరితి బ్రూ
యాం పితరి త్వయి మృతేపి వా"

"నేను పిల్లవానిని గదాయని తలంచి బలాత్కారముగా నాముక్కు పట్టించితివి. సరే కానిమ్ము నేను మాత్రము నీవును నీయబ్బయు చచ్చినను సరే, ఓంభూః అని మాత్రమనను" అనెడు బిడ్డలు తయారగు రోజులమహిమ దాపరించినది. ఇక గాయత్రీ మహిమను తావేది?

## సంధ్యావందనము యొక్క అభిప్రాయము.

సకల ఫలప్రదుడు సర్వేశ్వరుడు ఆయనచతుర్భుజుడు చతుర్విధ పురుషార్థములను ప్రసాదించుటకే వాటిని ధరించుచున్నాడు. కాని "అడిగినగాని అమ్మైనను పెట్టదన్నట్లు ఆయన మన ఆర్తిని నిరీక్షించు చుండును,

మన యపేక్షితములను గూర్చి ఆభగవంతుని ప్రార్థించుటయే యీ సంధ్యావందనములోని యంతరార్థము.

## —♦ ఇదియొక దరఖాస్తు ♦—

మనకొక పర్మిట్టు కావలసియున్నది. అది మన జిల్లాకలెక్టరు నుండి పడయ వలసియున్నది. అందుకొక నిర్ణీత దరఖాస్తు ఫారముండును. అది ఆకలెక్టరు చేతనే ఏర్పాటు గావింపబడియుండును.

అందు మునుముందు మనగ్రామము తారీఖు పేరు వ్రాయవలెను. పిమ్మట దరఖాస్తులోని ప్రార్థనా సారాంశమును సబ్జెక్టుగా వ్రాయవలెను. పిమ్మట కావలసిన వివరముల నన్నిటిని వేరు వేరు పేరాలలో సవినయముగాను స్పష్టముగాను తెలుపవలెను. చివరకు మన వినయమంతయు చూపించుచు మన పూర్తి పేరుతో సంతకము చేయవలెను.

ఈదరఖాస్తును నిర్ణీతమగు స్థలమునకు తీసుకొనిపోయి నిర్ణీతమగు వేళకు దాఖలు చేయవలెను. ఆవేళ దాటిపోయినచో ఆదరఖాస్తు మంజూరు చేయబడదు. ఆదరఖాస్తులో మనము కోరు విషయ గౌరవమునుబట్టి పని యగువరకును దాఖలు చేయుచునే యుండవలెను.

అట్లే సంధ్యావందనము కూడా మనము మన యపేక్షితములను బడయుటకు మనకు సర్వరక్షకుడగు సర్వేశ్వరునకు సమర్పించుకొను దరఖాస్తువంటిదే.

ముందు సంకల్పములో బ్రహ్మణా ద్వితీయ పరార్థే శ్వేతవరాహకల్పే మేరోర్దక్షిణ దిగ్భాగే గంగాగోదావర్యో ర్మధ్యదేశే ఇత్యాదులచే మన నివాసమునున్ను నందననామ సంవత్సరే ఇత్యాదులచే తిథియు……నామధేయోహం అని పేరును విన్నవించుచున్నాము,

పిమ్మట భగవదాజ్ఞయా "భగవత్కైంకర్యార్థం" అనిగాని మమోపాత్త దురితక్షయద్వారా ఆయురారోగ్యైశ్వర్యాభి వృద్ధ్యర్థం అనియో మరియొక విధముగనో మన యభీష్టమును సంగ్రహపరచుచున్నాము,

పిమ్మట లోతక్సీలుగా సూర్యశ్చమా మనుశ్చ-దధిక్రావిణ్ణో-అకార్షం-ఆయాతువరదాదేవి ఓంభూర్భువస్సువ మిత్రస్యచర్షణీత్యాది మంత్రములచే మన యభీష్టములను సవినయముగా వివరించుచున్నాము. చివరకు చతుస్సాగర పర్యంతం అను ప్రవరరూపముగా వినయముతో మన పేరునుజెప్పి సంతకమునుచేసి దరఖాస్తును ముగించుచున్నాము.

ఈదరఖాస్తును కూడా సకాలములోనే అనగా ధర్మశాస్త్రములలో నిర్ణయింపబడి ఆయాసంధ్యాకాలములలోనే దాఖలు చేయబడవలెను, గాని లేనిచో కొద్ది ఆలస్యమునకు పెనాల్టీతో (ముఖ్య) కాలాతిక్రమణ ప్రాయశ్చిత్తార్ఘ్యము తో దాఖలు చేయవలెను. ఇంకను హెచ్చుఆలస్యమైనచో మంజూరు చేయబడదు. మనకు ప్రతిక్షణము ఆయన సహాయ మవసరమగుటచే ప్రతిదినము మూడువేళలయందును యీదరఖాస్తులు కాలము నతిక్రమించకుండా దాఖలుచేయబడుచునే యుండవలెను.

ఇకముందే సంధ్యావందనమందలి ముఖ్య మంత్రములను పదచ్ఛేదము. అర్థక్రమము, ప్రతిపదార్థము తాత్పర్యములతో ప్రకటింపబడును. ఆస్తికులగు పాఠకులుపయోగపరచుకొందురుగాక!

# శ్రీమహాభారత కథా సామరస్యము — భగవద్గీత

శ్రీ శ్రీ శ్రీ మేకా వెంకటాద్రి అప్పారావు బహద్దరు జమీందారువారు నూజివీడు.

సాం॥ యో॥ శ్లో॥ 18:

అంతవంత ఇమే దేహా।
నిత్యస్యోక్తాః శరీరిణః।
అనాశినోఽప్రమేయస్య।
తస్మాద్యుధ్యస్వ భారత॥

క్షత్రియకార్యమునగల యోగ్యతను నిర్వచింపుచు స్వార్థపరత్వములేని సమభావన్యాయమును— యుక్తాయుక్తవివేచనగల శౌర్యధర్మనియోజకతా విధానమును వివరింపుచు ప్రత్యక్షయుద్ధమునందుగాని, యుద్ధపదముచే సూచింపబడు ప్రతి జీవియొక్క నిత్యజీవ సంఘర్షణమునందుగాని, యోధరూపవ్యక్తి అవలంబింపతగిన సాంఖ్య, కర్మ, జ్ఞాన, భక్త్యాది ఆయా భావములను యోగముచే అనగా మనస్సంకల్పముచే క్షత్రధర్మలో సమభాగములుగా సంయోగించుట గీతాభావము.

సాం॥ యో॥ శ్లో॥ 48:

యోగస్థః కురుకర్మాణి।
సంగం త్యక్త్వా ధనంజయ।
సిద్ధ్యసిద్ధ్యోస్సమో భూత్వా।
సమత్వం యోగ ఉచ్యతే॥

వ॥ అందుచే భగవద్గీత వీరగేయమనియే యెంచతగినది. ప్రతి యోధుడును పఠింపదగినది. పాటింపదగినది. క్షత్రియ ధర్మగౌరవమును ప్రబోధించునది. (Grusaders) అనబడు మధ్యయుగమునాటి క్రైస్తవ యోధులు అవలంబించిన త్యాగ వైరాగ్య మతసూత్రములకు నిదానమైనది. ఈ భగవద్గీత వేదాంతపరిభాషా విషయయుక్తమై యున్నదికదా? హేతువేమి? ఉద్దేశమేమి? యోధులేగాక జన సామాన్యమంతయు చదువునట్టి శ్రద్ధకల్పించుటకును సామాన్యయోధులకు ఉండు పరుష స్వభావమును స్నిగ్ధపరచి ధైర్యధీరత ఆపాదించుటకును ఉద్దేశము. మరియు ఆ మహాయుద్ధమున యువకులనేకులు అర్జునునకు ప్రేమపాత్రులైనవారు అభిమన్యాదులు హతులు కావచ్చును. అని ముందుగనే యూహించి అర్జునుని మనస్సును ముందుగానేస్థిరపరచి స్వపరభేదభావశక్తిని కర్మప్రతిఫలాశక్తిని నిర్మూలపరచి కార్యదీక్షాశక్తిని సమకూర్చి పాండవపక్షమునకంతకు ప్రధానయోధుడౌ అర్జునునియుద్ధము తుదివరకు పోరించుటకే క్రమక్రమోన్నతమౌ యొకవిధానముగీతలో ప్రకటింపబడుటకు హేతువు.

అ॥ ప॥ యో॥ శ్లో॥ 7

తస్మాత్ సర్వేషు కాలేషు।
మామనుస్మర యుధ్య చ।
మయ్యర్పిత మనో బుద్ధిః।
మామేవైష్యస్య సంశయః॥

అయితే యోధునకు సామాన్యముగాయుండ తగిన ధీరతలో అర్జునునకు యే కొఱతయులేదు. కాని అతడు పరమ కృపావిష్టుడయ్యెను. అది ఈ తరుణమున అనుచితము.

అట్టి కరుణా నిస్పృహ ఎట్లు పోగలదు? పై నుడివిన స్వపర సమత్వభావన, మృతి యెడల నిర్భయము, రణమృతిపై గౌరవము రణమృత్యనంతర దివ్యజీవితముపై నమ్మకము వలననే పోగలవు. భగవద్గీతలో వివరించబడిన విషయములు సంగతులు ఇవియే.

ఈ గీతాశాస్త్రమును పూర్తిగా నవగాహన చేసుకొని ఆచరించు యుద్ధయోగి శత్రువుల యొక్క అస్త్ర, శస్త్ర, సంఖ్యాబలములకు వెరవని ధీరుడు గాక కామక్రోధాది అంతశ్శత్రువులను పైకొననీయని మనోదార్ఢ్యముగలవీరనరుడే గాక నైమిత్తికముగా విధివశమున వచ్చు ఆది వ్యాధి, దుఃఖములను కూడ లెక్కపెట్టని ధీరవరోత్తముడు యోగసత్తముడు, కాగలడు. కావుననే భగవద్గీతను వీరగేయమని కొనియాడవలసియున్నది.

మో॥ స॥ యో॥ శ్లో॥ 63

ఇతి తే జ్ఞాన మాఖ్యాతం ।
గుహ్యాద్గుహ్యతరం మయా।
విమృశ్యైత దశేషేణ ।
యథేచ్ఛసి తథాకురు ॥

కొందరు వ్యాఖ్యాతల అభిప్రాయమేమనగా అర్జునునకు యుద్ధారంభముననే యుద్ధ విరక్తి కలుగవచ్చుననుట ముందుగనే ఊహించి శ్రీకృష్ణుడు అర్జునునితో సారథిగా ఏకరథస్థుడైయుండుటకును గీతాబోధను అర్జునుని ప్రమేయమున లోకమునకు వెల్లడి చేయుటకును ఉద్దేశించి ఉద్యోగ పర్వమున తన సైన్యమును దుర్యోధనునకు ఇచ్చి తాను అస్త్ర సన్యస్త సారథి దీక్ష పూనెను అని అందురు. కాని నా అభిప్రాయమేమన అర్జునవిషాదము స్వామికి సంభ్రమము కల్పించెననియు తత్కాలోపయోగ క్రియగా గీతాబోధ స్వామికి తత్సమయ హటాత్ సంకల్పమునచనితమైనవీరగానోపన్యాసమేయనియు నిర్ణయించుట స్వభావసిద్ధము, సహేతుకము, సమయసమ్మతముగా కన్పించుచున్నది.

---

## శ్రీ య తి రా జ భ జ న కీ ర న ము లు

కవితావతంస, గానకళానిపుణ, హరికథా చతురానన

శ్రీ ఉ. వే. శ్రీమాన్ కరి నారాయణాచార్య భాగవతార్.

కన్నడ=ఆది= "పావనగుణరామా" అనువానివలె

ప॥ ఆదరమున రారా! యతీశ్వరా! । నాదు మొఱన్ వినరా ! నతోద్ధారా ! ॥ఆద॥

1. నీదు మనసునవ నీతమొగాదా! । గాదిలి దాసునిఁ గన్గొనరాదా !
మేదినిలో నిను మించిన దైవము । నేదెసఁగానలే మెంబెరుమానే ! ॥ఆద॥

2. భరతఖండమునఁ బ్రజలలో భేదము । లరమర లన్నియు నడగఁజేసి నీ
వరమగు మతమును వరలఁజేసితివి । కరినారాయణ కవివర పోషణ ! ॥ఆద॥

## రామానుజదివ్యయోగి ✶✶✶

[illegible]
మొవ్వ దాశరథిసూరి

తే. కాలపరిణామమున ధరాఖండమెల్ల
విహిత విధులేది పటుతనూని హితమయ్యె
సాంద్రకారుణ్య చంద్రికాసారరుచులు
నెరయ యతిరాజచంద్ర! నమ్మరయ రావె.

ఉ. మానిత విష్ణులోక మణిమందిర నిత్యవిహారి!
దానవవైరి మానసపథంబుల కెక్కిన దివ్యశీల; మా
యా నిరయంబునం బడిన యాత్మలనెల్ల సముద్ధరింపఁగా
మానవదేహమున్ గనిన మాని కులాభరణా! నమస్కృతుల్. 2

మ. పొడముం బ్రొద్దున విచ్చుతమ్మిన నక్రింబోలేడు నెగ్గాడు నీ
కడకంటన్ జడిగొన్న సాంద్రకరుణా కల్యాణవర్షంబునన్
బొడమెన్ లేఁజిగురాకు మోటువులయందున్ బాపముల్ వాపు నీ
యడుగుందామర లెల్లవారికిని దేవా ముక్తి సోపానముల్. 3

ఉ. సాదరబుద్ధి మానవులు సంసరణాబ్ధి మునింగి దుర్భరా
వేదనఁ గట్టుఁగానక తపించుచునుండినఁ జూచి మాతృదే
వీ దయదోచునట్లు దురపిల్లెదు మంగళదేవతా! మనః
ఖేదము వాపి ప్రీతిఁ గలిగింపఁగఁగల్గిన దీవె సోగురూ. 4

చం. హరికి నసాధ్యమైన భువనావన మేనొనరింతునంచు నా
పరమ వికుంఠలోకమునఁ బంతములాడి బిఱ్ఱాన వచ్చి యీ
ధరణి జనించు నీ బహుళధైర్య కృపాద్భుత సాహసంబులన్
దరమె ప్రశంససేయఁగ సుదాదృశ మానవకోటికిన్ బ్రభూ. 5

మ. మతకర్తల్ చతురర్ణవావళితమా మా భారతక్షోణిలో
శతసంఖ్యాకులు పుట్టిరెల్లరును నీ చందాన మానీంద్ర సం
తతికిన్ దుర్లభమైన నిత్యపదమొందం బంపిరే కూర్మితో
యతిలోకాన్వయసింధు కౌస్తుభమ! తిర్యగ్జంతు సంతానమున్. 6

ఉ. రేపటివేళఁ బూర్వశిఖరిన్ వెలుగొందు దినేంద్రుకైవడిన్
గోపురమెక్కి నాదుమద కోకిల కూజిత మాధురీఝరుల్
దోపఁగ మంత్రరాజమును లోకములెల్ల నెఱుంగఁ బల్కి తత్
పాపభరంబు నొక్కమొగిఁ బాపవె భూతదయామయానయా.

ఉ. తెల్లని యజ్ఞసూత్రములు దీర్ఘత్రిదండ మృగాజినంబులు
వ్వల్లలితోర్ధ్వ పుండ్రములు తామరసాక్షసర ప్రతానముల్
దెల్లముగాగ నంబుధి గతిన్ బలుతెంచెడు శిష్యసేనతో
ఢిల్లిని ముట్టడించి ప్రకటింపవె నీ మహిత ప్రభావమున్ 8



★

నారీవిభాగము

★

# తిరుక్కోళూర్ పెణ్ పిళ్ళై రహస్యము

రచయిత: శ్రీమద్భాగవత పాదరేణువు, మదరాసు.

అ॥ అంతరంగం శొన్నే నోత్రిజడైయైప్పోలే ॥

తె॥ ఆంతరంగికమును దెల్పి నానా త్రిజటవలె ।

## ౬

రామా. రావణుడు సీతాదేవితో మోహపు మాటలాడినందుకు ఆమె నిగ్రహించగా అశోకవనమున సీతకు కావలియున్న రాక్షస స్త్రీలతో

కం॥ ఎడయిచ్చితి నిరుమాసము లోడబరపుడు నేర్చినట్టి లొంగబడకున్నన్ ।
గడికండలు గాగోయుచు బడతులు భక్షింపుడింతి పలలం బెల్లన్ ॥

అని ఆగ్రహముతో చెప్పి నగరికి వెళ్ళెను. సీత అత్యంత దుఃఖాక్రాంతురాలై యుండ చుట్టునున్న రాక్షస స్త్రీలెంతో ఆమెకు బోధించిరి గాని ఆమె ఒప్పకపోగా అక్కో అందరు నిద్రించిరి. అందులో విభీషణుని పుత్రియైన త్రిజట నిదుర మేల్కాంచి తనతోడి రాక్షస స్త్రీలను ఆశ్చర్యముతో లేపి

మ॥ కలగంటిన్ వినుడింతులార ఘన లంకాద్వీపవిహాయబ్ధిలో ।
పలవ్రాలన్ మనరావణేశ్వరుని కుంభద్రత్నకోటీరముల్ ।
కలనన్ గూల రఘూద్వహుండెలమితో గంధద్విపం బెక్కియు।
జ్వలకాంతిన్ విలసిల్లు సీత గొనిపోనన్ మిన్నకే నిప్పుడే ॥

ఓ! చెలియలారా!

సీ॥ దశకంధరునిగంటిదైల విప్తాంగుడై తైలంబుగ్రోలుచు నగ్నుడగుచు।
గన్నేరుపైగులు గళమున వ్రేలంగ రక్తాంబరంబులు గ్రాలుచుండ।
ముండుడై కృష్ణాంబరుండునై వెండియుబుష్పకంబుననుండి పుడమిగూల।
నెలనాగచేత వాడీడ్వంగబడుచుండ గంటినేగల మత్స్యకంటులార॥

మరియుఖరయుక్త రథమున మలయువాని।
రక్తమాల్యాను లేపన యుక్తుడగుచు।
భ్రాంతమతినూనె గ్రోలుచు గంతులిడుచు।
నగుచు వరిగె నపదక్షిణంబు గాగ॥

సీ॥ అలకుంభకర్ణుపై గలగంటినే నిట్టిరీతిన మరి దశగ్రీవుసుతులు।
నూనెగ్రుంగుటగంటి దానవనాథుండు పందిని నిందజిబులు మొసలిని।
గుంభకర్ణుడొంటెగొని వాహనములుగ దక్షిణదిశకై తరలగంటి।
వీరలలోన విభీషణుండొక్కడే తెల్లనిగొడుగును తెల్లచేల ములును॥

తెల్లని గంధంపు బూతలునై।
శంఖదుందుభిని ర్ఘోషసంయుతముగ।
నృత్తగీతాదు లొప్పభూభృత్సమంబు।
మేఘరావంబునగు నొక్కమేలిగజము॥

చెలులారా మనమింక

ఉ॥ చాలునుచాలురక్కసలు సాధ్వి నభాషల పుస్తకంబులా।
మూలనుగట్టివేయుడిక మోసమువచ్చును మంచిమాటలన్।
లాలనసేయుడీమె మనలన్ క్షమియింపగ వేడుకొంటయే।
పోలును సీతయాత్మ విభుబొందుట నిక్కమునిక్కలన్ గనన్॥

అంత త్రిజట సీత నూరడించి

కం॥ అమ్మా! వెరువకుమదిలో నిమ్ముగమరివేక్కనుండిమిక సీవిభుడున్
నెమ్మదినినుగొనిపోవును మమ్మందరమనుపుమమ్మ మరువకకరుణన్॥

కం॥ ఉన్నాడు లెస్సరాఘవుడు న్నాడిదె కపులగూడి యురుగతిరాబో
చున్నాడు నిన్నుకొనిపో నున్నాడిది నిజమునమ్మ మూర్వీతనయా॥

కం॥ శుద్ధాత్ముడైన రాముని శుద్ధాంతపుదేవిగాన శుభసూచకముల్
శుద్ధంబై తోచుచునుమది సిద్ధంబీమాటనిజము వేదసిద్ధాంతమగున్॥

అని సీతను సమాధాన పరచెనట.

[తి. అ.] త్రిజటవలె విపత్తులో సీతమ్మ నూరడించినానా?

అ॥ అవన్ దెయ్యమనేరినో మండోదరియైపోవలె ।

లె॥ అతడే పరాత్పరుడన్నానా మండోదరివరె ॥

౨

రామాయణము — శ్రీరామలక్ష్మణులు సేతుబంధనమొనర్చి కపివీరులతో లంకాప్రవేశ మొనర్చిన వెనుక అంగదుడు అంతఃపురముసొచ్చి మండోదరిని తలపట్టి ఈడ్చితెచ్చి రావణుని ముందుపెట్టగా

మ॥ మయదైత్యేంద్రుని కుందనూజనయి సేమంబొప్పనీ పత్నినై
జయవెట్టంగను నింద్రజిజ్జనని నై సర్వాంగనాపూజ్యనై
భయమెన్నండు నెఱుంగనట్టినను నిర్భంగిగా వనాటుండు
నిర్భయవృత్తిగా దలబట్టి ఈడ్వగను గోబాలైతినీ ముందటగా

అని దుఃఖించుచు

శ్లో॥ విజ్ఞాప్యంశృణురాజేంద్ర యద్యథాహం కృతాంజలిః
సచమానుషమాత్రోసౌ రామోదశరథాత్మజః ।

శ్లో॥ రామభార్యాసతీసీతా రాఘవాయ ప్రదీయతాం
యోగ్యశ్చరాఘవోమైత్రే కార్తవీర్యార్జునోయథా ॥

శ్లో॥ రాజ్ఞైవఖలుకర్తవ్యం జారచోరనివారణం
రాజైవ జారశ్చోరశ్చేత్ కస్తత్రవారకః ప్రభో ॥

మండోదరి మఱియును

కం॥ రామచంద్రుడా యాదినారాయణుండు కపులు దేవతలని నీకుగనబడంగ నల్లవే
కలనే, జెవినిల్లుకట్టి విన్నపముచేయ నామాటవినవు నీవు ఆనరులు నరులుగాకా ।

వానరులును గూడగారు వానరులరయం గానిది
నీదుదైవం బౌనుమిమచ్చిన్నమాటసజ్జాతముగన్

ఉ॥ అడచెను ద్రోల్త దాటక ననంతరమందు సుబాహుముఖ్యులన్
బొడిచెను నీదుచెల్లి యలిముక్కు చెవుల్ నఱికించె బిమ్మటన్
గడపట జంపి నీభటుల గట్టెను వంతెన నయ్యతండు నీ
పొడవు క్షణంబులోనడుపు గోరున నింకను భ్రాంతియేటికిన్ ॥

దానవేశ్వరా ! మొదట వసుంధరాత్మజను మోసముజేసి హరించినావు నీ
యక్యాది యొకతప్పు. రెండవది యప్పుడయారసి రామునికి యదలం
మిద్ది మూడవది యాను గవులేజలరాశిగట్ట నిష్ఠుడైన శ్రీరాముని
వద్ద మైత్రినొంది జానకిని నొప్పరికించుట నొప్పురావణా ॥ యనిబోధించెనట.

(తి. అ) మండోదరివలె భర్తకు హితోపదేశ మొనర్చినానా ?

# శ్రీ రా మా య ణ ము

అ॥ అహంవేద్మియెనేరినో విశ్వామిత్రునైప్పోలే ॥

తె॥ అహం వేద్మియన్నానా విశ్వామిత్రులవలె ॥

## ౨

రామా, ఓ దశరథా !

శ్లో॥ అహంవేద్మిమహాత్మానం రామం సత్యపరాక్రమం ।
వసిష్ఠో పి మహాతేజాః యేచేమే తపసి స్థితాః ॥

తా॥ నేనీ రామచంద్రుని అపరిచ్ఛిన్న మహిమాంచితుడనియును, నాశములేని బలముగల వానిగాను యెరుగుచున్నాను. గొప్ప ప్రభావము గల యీ వశిష్ఠులున్ను యెరుగుదురు. ఈ సమీపమున నున్న యోగమునందు సుస్థిరులైన ఋషులున్ను యెరుగుదురు. మరియు శ్రీరామచంద్రుని మహిమను దెలియము.

శ్రీరాముడు మహాత్ముడని యోగపరిశుద్ధమైన నాయాంతరచక్షుస్సుచేత నెరుగుదును. బాహ్యచక్షుస్సుచేత చూచెడు నీ వెరుగవు.

పలువురాచార్యులకు సేవజేసిన నేనెరుంగుదును గాని జానపములచేత సేవింపబడునట్టి నీ వెరుగవు.

దర్భలను ధరించునట్టి నేనెరుగుదును గాని ధనస్సును ధరించు నీ వెరుగవు.
జడలు ధరించిన నేనెరుగుదును గాని కిరీటము ధరించిన నీ వెరుగవు.
సాత్విక ప్రకృతియగు నేనెరుగుదును గాని రాజసప్రకృతివగు నీ వెరుగవు.
ఆసనము క్రిందుగాగల నేనెరుగుదును గాని సింహాసనము మీదనున్న నీవెరుగవు.
యోగక్రమము నెరింగిన నే నెరుగుదును గాని భోగక్రమముల నెరింగిన నీవెరుగవు.
మోక్ష కాంక్షేష్టి జేసిన నేనెరుగుదును గాని పుత్రకామేష్టి జేసిన నీవెరుగవు.
ధర్మకాముడనగు నేనెరుగుదును గాని అర్థకాముడవైన నీ వెరుగవు,
సర్వసంగ పరిత్యాగియైన నేనెరుగుదును గాని అరిషడ్వర్గములలో జిక్కిన నీవెరుగవు.
విశ్వామిత్రు డిటుల శ్రీరాముల మహిమలను కొనియాడినప్పటికిని "దశరథునికి" పుత్ర వాత్సల్యమున ఓ మునీశ్వరా!

దశరథుడు ॥ పండుకొన లేదుతోడు నొక్కండులేక చీకటిని నొంటి సనుమన్న జికిలు జికిలు
నట్టినాపట్టి యడవుల గుట్టలందు నెట్టులుచరించు నాకడుపెట్టులోర్చు ॥

తే॥ పండుకొనతల్లి కేలదిదిండుగాగ మీదనొండొక చెయివైచి మేలికతలు
చెప్పనూకట్టుచుగను తెప్పమూయు కూన ముండ్లను రాళ్ళనుగూర్కు నెట్లు?॥

కం॥ పొడమినదాడిగనేడులు నడచెను నార్వదులవేలు నాకతిదుఃఖం
పడికొడుకును శ్రీరాముని బడసితి మమ్మెడలబాన బాడియెనీకున్॥

కం॥ రాముడు దనుజులయెడ సంగ్రామము చేయంగగలడె కావలసినచో
మిమ్ముగొలిచినేవచ్చెద నోముని రాజేంద్రియరుగు ముచితప్రోథిన్॥

కౌశికుడు మ॥ అనినన్ గౌశికుడాత్మనవ్వి వినవయ్యా! రాజ! నీచేతగా ।
దనరాదైనను రాక్షసుల్ విపులగర్వాటోప బాహాబలుల్।
ఘనుడీరాముడు తక్కవారి గెలువంగారాదు పిన్నంచు నీ।
వనుమానింపక పంపుమింక గ్రతురక్షార్థంబు భూవల్లభా!॥

అని ధైర్యపరచెనట.
(త్రి. అ.) విశ్వామిత్రునివలె శ్రీరామగుణ వర్ణనం బొనర్చినానా?



# తిరుప్పావై 26వ పాశురముయొక్క అర్ధ భావములు.

పా॥ మాలేమణివణ్ణా మార్గళి నీరాడువాన్ మేలైయార్, శెయ్వనగళ్, వేండువన కేట్టియేల్
ఞాలత్తై యెల్లాంనడుంగ మురల్వనపాలన్నవణ్ణత్తు ఉన్ పాంచశన్నియమే. పోల్వనశంగంగళ పో
య్ప్పాడుడయనవే. శాలప్పెరుంపఱయే, పల్లాండిశైప్పారే. కోలవిళక్కే కొడియేవితానమే
ఆలవిలయాయ్ అరుళేలో రెంబావాయ్.

(ప్ర)వేశము 5 లక్షల గృహములయందలి గోపికాస్త్రీలను వెంట నిడుకొని శ్రీగోదాదేవి అన్నిన్వుల గమళందాయ్. అడిపోత్తి శెన్నంగుతెన్నిలంగు శేత్తాయ్ తిరల్ పోత్తి అని, శ్రీకృష్ణ పరమాత్మకు మంగళాశాసనము చేయుచు ప్రవేసించుదురు.

గోపిక:—శ్రీకృష్ణపరమాత్మను సేవించి. ఆహాగోదాదేవి. ఏమి ఈబాలగోపాలుని లావణ్యము. త్రిజగన్మోహన మయిన నీలకాంతితో ఎట్లు ప్రకాశించుచున్నాడో!

గోదాదేవి :— ఒక సౌందర్యమేనా ? వాత్సల్యమే శరీరముగాగల్గిన ఈస్వామిని సేవించగానే నా కున్న పూర్వాభిప్రాయము పోయినది తల్లీ :—

గోపిక:—ఏమిటా అభిప్రాయము తల్లి.

గోదా:—ఏమియులేదు మనమంతా ఈమాసం దినాలనుంచి తెల్లవారఝామున లేచి గోపి మారు లనందరినీ లేపుకొని. నందయశోదలను లేపి, నప్పిన్నపిరాట్టని లేపి వారిని లేపి. మంగళాశాసనముచేసి. యింతకష్టము పరమాత్మని యందుండే వ్యామోహముచేత చేయుచున్నానను కొంటినిగాని, పరమాత్మను సేవించగనే నాఅభిప్రాయము పొరపాటని తెలుసుకున్నాను. శ్రీ వేదవ్యాస భగవాన్ మహాభారతమంతా ఏకృష్ణపరమాత్మ వ్యామోహగుణమును నిరూపించినారో. అటువంటి వ్యామోహం తిరుమేనుగావున్న పరమాత్మను సేవించిన తమపరి మనకు శ్రీకృష్ణపరమాత్మయందుండే వ్యామోహము గోష్పాదమంత, వానికి మనయందుం డేవ్యామోహము సముద్రమంత అని తెలుసుకొన్నాను.

గోపికలు:—సరి ఇకజాగేల ఇంత వ్యామోహము కలవాడు మనకోరికలు. ఎందుకు తీర్చరు తల్లి. వానిదగ్గరకు వెళ్ళి అడుగుదము రండి!

అందరు:—సరియే అటులనే పోవుదము అని. గోపాలుని సమీపించి. మాలే ఏమివ్యామోహము కలవాడవయ్యా! మేమంతా శరీరమందు స్పృహకల్గివుండి. నీవద్దకు రాగలిగినాము గాని, నీవు మాయందులవుండే అధికవ్యామోహముచే మేమువచ్చి లేపేవరకూ కూడా లేవకుండా పడుకొన్నావు. ఆశ్రితవాత్సల్యైకజలవే. అన్నిబిరుదు నీకేచెల్లును స్వామీ! రక్షమామ్!

శ్రీకృష్ణ:—గోదాదేవి! ఒకవేళ ఆశ్రితవ్యామోహంలేక కఠినప్రకృతికలవాడ నైతే మీ రేమి చేయుదురు.

గోదా:—మణివణ్ణాకృష్ణా! నీవు ఒకవేళ దదామిబుద్ధియోగంతం. అని. రక్షించకుండా. క్షిపామి, నక్షమామి అని ఆగ్రహించినప్పటికి. విడచిపెట్టే దివ్యమంగళ విగ్రహమటయ్యా నీది మణి వణ్ణా, సానపెట్టిన నీలరత్నములవంటి కాంతిగల తిరుమేనికాదటయ్యా నీది. పిచ్చివానిచేతి లోనికి రత్నము లభ్యమైన ఎడల దానివిలువ తెలియక ఎవరడిగినా ఇచ్చివేయునటుల శమీదవుండే వ్యామోహముచే నిత్యసూరిభోగ్యమయిన ఆదివ్యమంగళ విగ్రహసేవను అస్మదాదులకు కూడా అనుభవ యోగ్యము చేయుచున్నావు గదా. (సశేషము)

# ప్రచార విభాగము.

భక్తి "నివేదన" అనుబంధము

## ★ శాశ్వతనిధి ★

| | | |
|---|---|---|
| వానరాశి సోమరాజుగారు | రాజమండ్రి | 2—0—0 |
| పారేపల్లి నాగేంద్రుడుగారు | మంగళగిరి | 3—0—0 |
| అంగలూరి వీరరాఘవాచార్యులుగారు | మంగళగిరి | 3—0—0 |
| వేదాల కోనమాచార్యులుగారు | మత్స్యపురి | 2—0—0 |
| ప్ర. భ. వెంకటాచార్యులుగారు | గొల్లప్రోలు | 1—0—0 |
| శృంగారం వెంకటశేషాచార్యులుగారు | శనివారపేట | 5—0—0 |
| చక్రవర్తి వెంకటాచార్యులుగారు | నెల్లూరు | 5—0—0 |
| కో. కం. అప్పన్ శఠగోప రామానుజాచార్య స్వామిగారు. ఉభయవేదాంత సంస్కృత కళాశాలాధ్యక్షులు. | సీతారాంబాగ్ | 6—0—0 |

---

భక్తి నివేదనకు నందన సంవత్సరము సహాయ చందాదారులుగా చేరినవారు

చక్రవర్తి వెంకటాచార్యులుగారు, నెలూరు.

---

## సంభావన

తణుకు కాపురస్థులు కలవగుంట శేషాచార్యులుగారి భార్య అలివేలుమంగ తాయారమ్మ గారు పరమపదోత్సవ సమయమందు శ్రీ విశిష్టాద్వైత ప్రచార సంఘమునకు సంభావనగా పంపినది రూ 1—0—0



శ్రీమతే రామానుజాయ నమః

# శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘ శ్రావణ మాస పండిత సభా

## ★ ఆహ్వాన పత్రిక ★

### శ్రీవాసుదాసాశ్రమము—(నడిగడ్డపాలెం) శ్రీపాదుకాక్షేత్రము.

స్వస్తిశ్రీ నందననామ సం॥ర శ్రావణ శుద్ధ ద్వాదశి 2-8-52 శనివారం మొదలు 3రోజులు నడిగడ్డపాలెమందలి శ్రీ వాసుదాసాశ్రమమున చెన్నపురి వాస్తవ్యులైన శ్రీ ఉ. వే. శ్రీమాన్ పండిత చక్రవర్తి శ్రీనివాసరంగాచార్య స్వామివారి అధ్యక్షత క్రింద శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘ శ్రావణమాస పండిత పరిషత్సమావేశము జరుపబడి యీ క్రింది పండితప్రకాండులచే వివిధ వేదాంత విషయములు ఉపన్యసింపబడును. శ్రీ శ్రీ శ్రీ వాసుదాసు గారి పరమపదోత్సవము జరుపబడును. గాన భక్తులెల్లరును యిందు పాల్గొని ఆనందింప గోరుచున్నాము.

—• కార్యక్రమము •—

1-8-52వ తేదీ రాత్రి గం 7 లకు ఆశ్రమమునందున్న శ్రీ కోదండరామప్పెరుమాళ్ళ సన్నిధిలో తిరువాయ్మొళి తొళక్కము గావింపబడును.

2-8-52 నుండి 4-8-52 వరకు 3 రోజులున్ను ఉదయం గం 7-0 నుండి గం 10-0 లు వరకు సేవాకాలము తీర్థప్రసాద వినియోగమున్ను, సాయంకాలము గం 3-0 నుండి గం 6-0 వరకు పండితులచే ఉపన్యాసములున్ను గావింపబడుచుండును.

చివరిరోజున [4-8-52] సోమవారమున

శ్రీ శ్రీ శ్రీ వాసుదాసు వారి పరమ పదోత్సవ మతివైభవముతో జరిపించబడును.

ఆనాటి రాత్రి శాత్తుమర్రై సభా సమాప్తి.

# : ఆహ్వానింపబడిన పండితులు :

| | | |
|---|---|---|
| శ్రీ ఉ. వే. శ్రీమాన్ | పరాశర సుదర్శన భట్టరయ్యవార్లంగారు | కోరుకొండ |
| ,, | కో. యి. వెంకటాచార్యులుగారు | గుంటూరు |
| ,, | మొలుగు రామానుజాచార్యులుగారు | ముగ్గుళ్ళఅగ్రహారం |
| ,, | కవిరత్న గుదిమెళ్ళ రామానుజాచార్యులుగారు | ముక్తిపల్లి అగ్రహారం |
| ,, | ఈయుణ్ణి రాఘవాచార్యులుగారు | గుంటూరు |
| ,, | శ్రీమత్తిరుమల పురిగళ్ళ ధర్మాచార్యులుగారు | వేడిద |
| ,, | శ్రీమత్తిరుమల పురిగళ్ళ వెంకటాచార్యులుగారు | మాధవరం |
| ,, | బెల్లంకొండ రాఘవాచార్యులుగారు | బందరు |
| ,, | ఆ. చి. శ్రీమన్నారాయణాచార్యులుగారు | అత్తమూరు |
| ,, | తె. కం. గోపాలాచార్యులుగారు | కోరుకొండ |
| ,, | శ్రీన. చ. సంపత్కుమార జగన్నాథతిరువేంకటాచార్యులుగారు | విజయవాడ |
| ,, | శ్రీమత్తిరుమల పల్లెర్లమూడి రామస్వామిగారు | శ్రీరామతీర్థం |
| ,, | మహాభాష్యం వరదాచార్యులుగారు | చీరాల |
| ,, | గొట్టుముక్కల రమాకాంతాచార్యులుగారు | బాపట్ల |
| ,, | ఈయుణ్ణి శ్రీనివాసాచార్యులుగారు | మంగళగిరి |
| ,, | తిరుమల ఆ. శ్రీనివాసాచార్యులుగారు | మంగళగిరి |
| ,, | కోడూరి వెంకటాచార్యులుగారు | నడిగడ్డపాలెం |

కేంద్ర కార్యదర్శులు
తె. కం. గోపాలాచార్యులు.
ఆ. చి. శ్రీమన్నారాయణాచార్యులు.

ఇట్లు,
భగవత్పాదరేణువు.
కూ. వెంకటప్పదాసుడు.
శ్రీ కోదండరామ సేవక సమాజము, నడిగడ్డపాలెం.

---

మార్గము:- తెనాలికి అవతల స్టేషనగు చుండూరులో రైలు దిగిన ఆశ్రమము ఒక మైలుండును.

# శ్రీ యతిరాజ సేవా మహిళా మండలి శుక్రవార
# ద్వితీయ. వార్షికోత్స వాహ్వాన పత్రిక

★

అయ్యా
అమ్మా

నందననామ సంవత్సర శ్రావణ బహుళ తదియా శుక్రవారం అనగా 8–8–52 మొదలు 10–8–52 వరకూ మూడు దినములు బందరు పాతచల్లరస్తా వేణుగోపాలస్వామి వారి దేవాలయములో శ్రీ యతిరాజ సేవా నుహిళా మండలి శుక్రవార సభలు జరుపుటకు యేర్పాటు చేయబడినవి. ఈ సభలకు యేలూరు వాస్తవ్యురాలు పరమ భాగవతోత్తములైన శ్రీమతి నండూరి ఆనందమ్మగారు అధ్యక్షత వహించెదరు. శ్రీమత్ పరమహంస పరివ్రాజకాచార్య శ్రీ శ్రీ శ్రీ సీతారామ యతీంద్రులవారి ఉపన్యాసములు భజనలు మూడు రోజులు జరుగును. చిన్నపిల్లల నాట్యనాటక, భగవద్గీత సంభాషణలు మొదలగు వినోదములు జరుగును గాన యిందలి సభ్యులు, అభిమానులు, భక్తులు, స్త్రీ పురుషు లందరూ దయతో విచ్చేసి యిందు పాల్గొని వీనిని జయప్రదముగా జరిపించ కోరుచున్నాము.

అధ్యక్షురాలు:— శ్రీపతి సీతమ్మ.

కార్యదర్శిని:— మరంగంటి సీతమ్మ, కంతేటి తాయారమ్మ.

అర్తమూరు

## శుక్రవార పూజలు

ద్వారంపూడి బుల్లివీరయ్యభార్యఆదెమ్మ 0-4-3
కర్రి వీర్రెడ్డి భార్య వెంకమ్మ 0-4-3
కర్రి సత్తిరెడ్డి భార్య మంగయ్య 0-4-3
కర్రి సత్తిరెడ్డి భార్య బుల్లి వెంకమ్మ 0-4-3
కర్రి సుబ్బరెడ్డి భార్య ఆదెమ్మ 0-4-3
కొవ్వూరి వెంకటరెడ్డి భార్యకామేశ్వరమ్మ 0-4-3

వైశాఖ మాసములో

చిన్నం వీర్రెడ్డి భార్య ఆదెమ్మ 0-4-3
నల్లమిల్లి అప్పారావు భార్య బుల్లెమ్మాయి 0-4-3
వైరడ బ్రహ్మయ్య భార్య మాణిక్యం 0-4-3
లంక చినవెంకన్న భార్య సుందరమ్మ 0-4-3
వేపర్తి సత్యన్న భార్య గంగరాజు 0-4-3
గనేసుల తాతయ్య భార్య సూరమ్మ 0-4-3
పులగం వీరమ్మ 0-4-3
పోతుల బుల్లెమ్మ 0-4-3
ప్రగడ సూర్యారావు భార్య మంగమ్మ 0-4-3
లంక రాజులు భార్య సూర్యాకాంతం 0-4-3
గరగ సోమరాజు భార్య బుల్లాలు 0 4 3
దాసరి వీర్రాజు భార్య సూర్యకాంతమ్మ 0 4 3
గనేసుల సత్యం భార్య వెంకటరత్నం 0 4 3
మేడపాటి వెంకన్న భార్య బుల్లెమ్మాయి 0 4 3
చిర్ల అమ్మిరెడ్డి భార్య వీరమ్మ 0 4 3
చిర్ల రాజిరెడ్డి భార్య సూర్యకాంతం 0 4 3
పడాల వెంకన్న భార్య అమ్మాయి 0 4 3
కర్రి భద్రియ్య భార్య వెంకమ్మ 0 4 3
గోటిపల్లి అప్పన్న భార్య సుబ్బమ్మ 0 4 3
సంగుల సత్తెయ్య భార్య వెంకమ్మ 0 4 3
తాడి వెంకన్న భార్య గంగమ్మ 0 4 3
పోతంశెట్టి వెంకన్న భార్య మాణిక్యం 0 4 3
పోతంశెట్టి వెంకటరెడ్డి భార్య మహాలక్ష్మి 0 4 3
కర్రి అబ్బాయి భార్య అమ్మాయి 0 4 3

## ఏకాదశి పూజలు

పడాల శ్రీరాముని భార్య గంగమ్మ 0 4 3
కర్రి నరిసిరెడ్డి భార్య సీతమ్మ 0 4 3
ఉండపాటి రామన్న భార్య అమ్మన్న 0 4 3
తేతల గోవిందు భార్య సూరమ్మ 0 4 3
కర్రి కొండయ్య భార్య బుల్లెమ్మాయి 0 4 3
కర్రి వెంకన్న భార్య బుల్లెమ్మాయి 0 4 3
ద్వారంపూడి సూర్రెడ్డి భార్య సావిత్రి 0 4 3
లంక లక్ష్మయ్య భార్య 0 4 3
వేపర్తి సత్యన్న భార్య గంగరాజు
శ్రీరామనవమి పూజజరిపించినది. 0 4 3
కర్రి వీర్రెడ్డి భార్య సత్తెమ్మ 0 4 3

రిజష్టరు నెం 5049

# భక్తినివేదన

(వేదాంత మాసపత్రిక)

ఇందు వేదాంత విషయ రాజములున్ను; భక్తిప్రచార విషయమైన వార్తలున్ను వేదాంత సాంప్రదాయ విషయకమైన ప్రశ్నోత్తరములున్ను ప్రకటించబడును.

చందాలు;

| | | |
|---|---|---|
| సాధారణ చందా సం. 1 కి॥ | | రు 5-0-0. |
| సహాయ చందా | ,, | రు. 10-0-0. |

To

**Book-Post**



Sri Venkatesvara Oriental Library,
THIRUPATHI. Chittur Dt.

1. శ్రీమన్నారాయణుడే సృష్టి - స్థితి - లయ కారకుడు.
2. ఆయనే మోక్షప్రదాత.
3. ఆయనే పరతత్త్వము-పరమాత్మ
4. ఆయన అఖిలహేయ ప్రత్యనీక కల్యాణ గుణకుడు.
5. ఆయనకు జీవుడు శరీరభూతుడు; శేషభూతుడు, పరతంత్రుడు, నియామ్యుడు, అనుభావ్యుడు.
6. జీవులు జ్ఞానైకాకారులు.
7. జీవులు అనంతములు.
8. జీవులు పరమాత్మకంటె భిన్నులు; ఈ భేదము సత్యమైనది; నిత్యమైనది.
9. జీవ-పరమాత్మలకు ప్రకృతి శరీరభూతమైనది; శేషభూతమైనది; పరతంత్రమైనది; నియామ్యమైనది; అనుభావ్యమైనది.
10. ప్రకృతి వికారాస్పదమైనది. జీవపరమాత్మలకంటె భిన్నమైనది, ఈ భేదము సత్యమైనది; నిత్యమైనది.
11. జీవుడు ప్రకృతి వియుక్తుడై పునరావృత్తి రహితమైన పరమాత్మ సాన్నిధ్యమగు పరమపదమును పొందుటయే మోక్షము.
12. భక్తి ఒక్కటియే మోక్షసాధనము.
13. భక్తి యనగా తైలధారవలె అవిచ్ఛిన్నమైన స్మృతి పరంపర.
14. వివేక-విమోక-అభ్యాస-క్రియా-కల్యాణ అనవసాద-అనుద్ధర్షలు భక్తి అంగములు.
15. ఇవి సదాచార్య సమాశ్రయణ లభ్యములు
16. జగద్గురువగు శ్రీ రామానుజాచార్యులవారును; వారి యనుయాయులున్ను సదాచార్యులు.

"నగురుర్వైష్ణవాత్ పరః" భా. సం.

Printed by A. Ch, Srimannarayanacharya at Sriman Press, Kakinada.

శ్రీమతే రామానుజాయనమః

భక్తి

# నివేదన

వేదాంత మాసపత్రిక

| సంపుటి ౪ | నందన-ఆషాఢమాసం | సంచిక ౪ |
|---|---|---|

## ★ సంధ్యావందనము — దాని మహిమ ★

శ్రీ ఉ. వే. శ్రీమాన్ తె. కం. గోపాలాచార్యులుగారు

విశ్వామిత్ర మహర్షి పెక్కు సంవత్సరములు రాజ్యమును పాలించి ఒక్కతరి గొప్పసేనను సమకూర్చుకొని దేశములన్నియు తిరిగి తిరిగి వశిష్టమహర్షి ఆశ్రమమున కేతెంచెను, వశిష్టు డాతనిచే పూజింపబడి విశ్వామిత్రునకును ఆతని సమస్త సైన్యమునకును ఆతిథ్యమొసంగ నిశ్చయించి యాతనిని నిర్బంధించెను. విశ్వామిత్రు డందుల కంగీకరింపగా వశిష్ఠమహర్షి తన కామధేను ప్రభావముచే బ్రహ్మాండమగు విందు గావించెను. విశ్వామిత్రుడది గాంచి యా కామధేనువు నపేక్షించి యాతడీయ కుండుటచే బలాత్కారముగా తీసుకొని పోజొచ్చెను. అంతట వారిద్దరకును గొప్ప యుద్ధము సంభవించెను. కామధేనువు సహాయముచే వశిష్ట మహర్షికే జయము చేకూరెను. అంత విశ్వామిత్రుడుగొప్ప తపస్సు గావించి అమోఘములగు శస్త్రాస్త్రములను సంపాదించి వశిష్ఠు నెదుర్కొనెను. కాని విశ్వామిత్రుడు ప్రయోగించిన శస్త్రాస్త్రాదుల నన్నింటిని యా వశిష్ఠుని బ్రహ్మదండ మొక్కటియే మ్రింగి వేయజొచ్చెను. తుదకు బ్రహ్మాస్త్రమునకు గూడనిదే గతి పట్టుటను గాంచి విశ్వామిత్రుడు మిక్కిలి ఆశ్చర్యపడి

"దిగ్బలం క్షత్రియబలం
బ్రహ్మతేజోబలం బలం
ఏకేన బ్రహ్మదండేన
సర్వాస్త్రాణి హతాసి మే॥

ఛీ! క్షత్రియ బలమును కాల్చనా! బలమనిన బ్రాహ్మణతేజస్సే గదా బలము. ఆహా! ఒక్క అచేతనమగు కఱ్ఱతో చేయబడిన బ్రహ్మదండము నాలుగు ఫలమగు అస్త్రముల నన్నిటిని తన పొట్టను బెట్టుకున్నదే. నేనా బ్రహ్మతేజస్సును తపస్సుచే సంపాదించుటకే నాజీవితము నర్పింతు నని నిశ్చయించి నాలుగు దిక్కులయందును ఘోరతపము లాచరించి తుదకు బ్రహ్మనుండి బ్రహ్మర్షి పదవిని లభించెను.

ఇట్టి శక్తి దేనిలో నున్నదో విచారించవలసి యున్నది. దీనినే బ్రహ్మతేజమని విశ్వామిత్రుడు ప్రశంసించెను. ఈ బ్రహ్మతేజమున కేదిముఖ్య కారణము? దేనివలన వసిష్ఠు డంతప్రభావశాలి యయ్యెను? అనునది మనము ప్రకృతమున తెలుసుకొన దగిన ముఖ్యాంశము. అది నియమ బద్ధమగుగాయత్రీమంత్ర ప్రభావమనుట నిస్సంశయము.

ఇట్టి ప్రభావముచేతనే గదా నచికేతుడు యమునిగూడ గడగడ వడకించెను. ఇట్టి ప్రభావముచేతనే గదా అగస్త్యుడు సముద్రమును ఆచమించెను. ఇంకను పూర్వము మహర్షులు మహాత్ములు యెన్నెన్ని యలౌకిక అత్యద్భుత సంఘటనలు గావించిరనినను పరమపూజ్యులై యలరారిరనినను పరమనిశ్శ్రేయసము నందగల్గించినను అన్నిటికి మూలకారణ మీగాయత్రీ మంత్ర పురశ్చరణ ప్రభావమే.

ఈ ప్రభావమును సంపాదించు యధికారము ప్రతియుప నీతునకును గలదు. కలికాల ప్రభావముచే నాశక్తి మనలో క్షీణించుటచేతనే బ్రహ్మణ్య మీనాడింత దుస్థితిలో నున్నది.

నూతన వటువు నాయనా! సంధ్యావందనము చెప్పమని తండ్రిని యడుగగా ఛీ! కుంకా వడుగయి వారమైనను కాలేదే నీకేరానిచ్చో నలబది సంవత్సరముల క్రిందట ఉపనయనమైన నాకెట్లు వచ్చునురా! యని గద్దించు తండ్రులును ఒకవేళ తండ్రులకు సంధ్యావందనమందాసక్తిచే బిడ్డలకు చెప్పించ బూనినను వాడు, ముక్కు పట్టుకొనుమనిన, పురోహితుని ముక్కుపట్టుకొనుటయో, కొట్టియో, తిట్టియో వానిముక్కు వాడిచే పట్టించినను'

> బాలో య మితి జ్ఞానాత్ నాసాం గ్రహ
> యసే బలాత్ నాఽహ మోంభూరితి బ్రూ
> యాం పితరి త్వయి మృతేపి వా"

"నేను పిల్లవానిని గదాయని తలంచి బలాత్కారముగా నాముక్కు పట్టించితివి. సరే కానిమ్ము నేను మాత్రము నీవును నీయబ్బయు చచ్చినను సరే, ఓంభూః అని మాత్రమనను" అనెడు బిడ్డలు తయారగు రోజులమహిమ దాపరించినది. ఇక గాయత్రీ మహిమకు తావేది?

## సంధ్యావందనము యొక్క అభిప్రాయము

సకల ఫలప్రదుడు సర్వేశ్వరుడు ఆయనచతుర్భుజుడు చతుర్విధ పురుషార్థములను ప్రసాదించుటకే వాటిని ధరించుచున్నాడు. కాని "అడిగిన గాని అమ్మైనను పెట్టదన్నట్లు ఆయన మన ఆర్తిని నిరీక్షించు చుండును,

మన యపేక్షితములను గూర్చి ఆభగవంతుని ప్రార్థించుటయే యీ సంధ్యావందనములోని యంతరార్థము.

## ఇదియొక దరఖాస్తు

మనకొక పర్మిట్టు కావలసియున్నది. అది మన జిల్లా కలెక్టరు నుండి బడయ వలసియున్నది. అందుకొక నిర్ణీత దరఖాస్తు ఫారముండును. అది ఆకలెక్టరుచేతనే ఏర్పాటు గావింపబడియుండును.

అందు మునుముందు మనగ్రామము తారీఖు పేరు వ్రాయవలెను. పిమ్మట దరఖాస్తులోని ప్రార్థనా సారాంశమును సబ్జెక్టుగా వ్రాయవలెను. పిమ్మట కావలసిన వివరముల నన్నిటిని వేరు వేరు పేరాలలో సవినయముగాను స్పష్టముగాను తెలుపవలెను. చివరకు మన వినయమంతయు చూపించుచు మన పూర్తి పేరుతో సంతకము చేయవలెను.

ఈదరఖాస్తును నిర్ణీతమగు స్థలమునకు తీసుకొనిపోయి నిర్ణీతమగు వేళకు దాఖలు చేయవలెను. ఆవేళ దాటిపోయినచో ఆదరఖాస్తు మంజూరు చేయబడదు. ఆదరఖాస్తులో మనము కోరు విషయ గౌరవమునుబట్టి పని యగువరకును దాఖలు చేయుచునే యుండవలెను.

అట్లే సంధ్యావందనము కూడా మనము మన యపేక్షితములను బడయుటకు మనకు సర్వరక్షకుడగు సర్వేశ్వరునకు సమర్పించుకొను దరఖాస్తువంటిదే.

ముందు సంకల్పములో బ్రహ్మణా ద్వితీయ పరార్థే శ్వేతవరాహకల్పే మేరోర్దక్షిణ దిగ్భాగే గంగాగోదావర్యో ర్మధ్యదేశే ఇత్యాదులచే మన నివాసమునున్ను నందననామ సంవత్సరే ఇత్యాదులచే తిథియు......నామధేయోహం అని పేరును విన్నవించుచున్నాము,

పిమ్మట భగవదాజ్ఞయా "భగవత్కైంకర్యార్థం" అనిగాని మమోపాత్త దురితక్షయద్వారా ఆయురారోగ్యైశ్వర్యాభి వృద్ధ్యర్థం అనియో మఱియొక విధముగనో మన యభీష్టమును సంగ్రహపరచుచున్నాము,

పిమ్మట లోతస్పేలుగా సూర్యశ్చమా మనుశ్చ—దధిక్రావిణ్ణో—అకార్షం—ఆయాతువరదాదేవి ఓంభూర్భువస్సువ ఇత్రిస్యచర్షణీత్యాది మంత్రములచే మన యభీష్టములను సవినయముగా వివరించుచున్నాము. చివరకు చతుస్సాగర పర్యంతం అను ప్రవరరూపముగా వినయముతో మన పేరుజెప్పి సంతకమునుచేసి దరఖాస్తును ముగించుచున్నాము.

ఈదరఖాస్తును కూడా సకాలములోనే అనగా ధర్మశాస్త్రములలో నిర్ణయింపబడి ఆయాసంధ్యాకాలములలోనే దాఖలు చేయబడవలెను, గాని లేనిచో కొద్ది ఆలస్యమునకు పెనాల్టీతో (ముఖ్య) కాలాతిక్రమణ ప్రాయశ్చిత్తార్ఘ్యముతో దాఖలు చేయవలెను. ఇంకను హెచ్చుఆలస్యమైనచో మంజూరు చేయబడదు. మనకు ప్రతిక్షణము ఆయన సహాయ మవసరమగుటచే ప్రతిదినము మూడువేళలయందును యీదరఖాస్తులు కాలము నతిక్రమించకుండా దాఖలుచేయబడుచునే యుండవలెను.

ఇకముందే సంధ్యావందనమందలి ముఖ్యమంత్రములను పదచ్ఛేదము. అర్థక్రమము, ప్రతిపదార్థము తాత్పర్యములతో ప్రకటింపబడును. ఆస్తికులగు పాఠకులుపయోగపరచుకొందురుగాక !

# శ్రీమహాభారత కథా సామరస్యము — భగవద్గీత

శ్రీ శ్రీ శ్రీ మేకా వెంకటాద్రి అప్పారావు బహద్దరు జమీందారువారు నూజివీడు.

సాం॥ యో॥ శ్లో॥ 18 :

అంతవంత ఇమే దేహా ।
నిత్యస్యోక్తాః శరీరిణః ।
అనాశినోఽప్రమేయస్య ।
తస్మాద్యుధ్యస్వ భారత ॥

క్షత్రియకార్యమునగల యోగ్యతను నిర్వచించుచు స్వార్థపరత్వములేని సమభావన్యాయమును — యుక్తాయుక్తవివేచనగల శౌర్యధర్మని యోజకతా విధానమును వివరించుచు ప్రత్యక్ష యుద్ధమునందుగాని, యుద్ధపదముచే సూచింపబడు ప్రతి జీవియొక్క నిత్యజీవ సంఘర్షణమునందుగాని, యోధరూపవ్యక్తి అవలంబింపతగిన సాంఖ్య, కర్మ, జ్ఞాన, భక్త్యాది ఆయా భావములను యోగముచే అనగా మనస్సంకల్పముచే క్షత్రధర్మలో సమభాగములుగా సంయోగించుట గీతాభావము.

సాం॥ యో॥ శ్లో॥ 48 :

యోగస్థః కురుకర్మాణి ।
సంగం త్యక్త్వా ధనంజయ ।
సిద్ధ్య — సిద్ధ్యోస్సమో భూత్వా ।
సమత్వం యోగ ఉచ్యతే ॥

వ॥ అందుచే భగవద్గీత వీరగేయమనియే యెంచతగినది. ప్రతి యోధుడును పఠింపదగినది. పాటింపదగినది. క్షత్రియ ధర్మగౌరవమును ప్రబోధించునది. (Grusaders) అనబడు మధ్యయుగమునాటి క్రైస్తవయోధులు అవలంబించిన త్యాగ వైరాగ్య మతసూత్రములకు నిదానమైనది. ఈ భగవద్గీత వేదాంతపరిభాషా విషయయుక్తమై యున్నదికదా? హేతువేమి? ఉద్దేశమేమి? యోధులేగాక జన సామాన్యమంతయు చదువునట్లు శ్రద్ధకల్పించుటకును సామాన్యయోధులకు ఉండు పరుష స్వభావమును స్నిగ్ధపరచి ధైర్యధీరత ఆపాదించుటకును ఉద్దేశము. మరియు ఆ మహాయుద్ధమున యువకులనేకులు అర్జునునకు ప్రేమపాత్రులైనవారు అభిమన్యాదులు హతులు కావచ్చును. అని ముందుగనే యూహించి అర్జునుని మనస్సును ముందుగానేస్థిరపరచి స్వపర భేదభావరక్తిని కర్మప్రతిఫలాశక్తిని నిర్మూలపరచి కార్యదీక్షాశక్తిని సమకూర్చి పాండవపక్షమునకంతకు ప్రధానయోధుడౌ అర్జునునియుద్ధము తుదివరకు పోరించుటకే క్రమక్రమోన్నతమౌ యొకవిధానముగీతలో ప్రకటింపబడుటకు హేతువు.

అ॥ ప॥ యో॥ శ్లో॥ 7

తస్మాత్ సర్వేషు కాలేషు ।
మామనుస్మర యుద్ధ్య చ ।
మయ్యర్పిత మనో బుద్ధిః ।
మామేవైష్యస్య సంశయః ॥

అయితే యోధునకు సామాన్యముగాయుండతగిన ధీరతలో అర్జునునకు యే కొఱతయు లేదు. కాని అతడు పరమ కృపావిష్టుడయ్యెను. అది ఈ తరుణమున అనుచితము.

అట్టి కరుణా నిస్పృహా ఎట్లు పోగలదు? పై నుడివిన స్వపర సమత్వభావన, మృతి యెడల నిర్భయము, రణమృతిపై గౌరవము రణమృత్యనంతర దివ్యజీవితముపై నమ్మకము వలననే పోగలవు. భగవద్గీతలో వివరించబడిన విషయములు సంగతులు ఇవియే.

ఈ గీతాశాస్త్రమును పూర్తిగా నవగాహన చేసుకొని ఆచరించు యుద్ధయోగి శత్రువుల యొక్క అస్త్ర, శస్త్ర, సంఖ్యాబలములకు వెరవని ధీరుడు గాక కామక్రోధాది అంతశ్శత్రువులను పైకొననీయని మనోదార్ఢ్యముగలవీరనరుడే గాక నైమిత్తికముగా విధివశమున వచ్చు ఆది వ్యాధి, దుఃఖములను కూడ లెక్కపెట్టని ధీరవరోత్తముడు యోగసత్తముడు, కాగలడు. కావుననే భగవద్గీతను వీరగేయమని కొనియాడ వలసియున్నది.

మో॥ స॥ యో॥ శ్లో॥ 63

ఇతి తే జ్ఞాన మాఖ్యాతం।
గుహ్యాద్గుహ్యతరంమయా।
విమృశ్యైత దశేషేణ।
యథేచ్ఛసి తథాకురు॥

కొందరు వ్యాఖ్యాతల అభిప్రాయమేమనగా అర్జునునకు యుద్ధారంభముననే యుద్ధ విరక్తి గలుగవచ్చుననుట ముందుగనే ఊహించి శ్రీకృష్ణుడు అర్జునునితో సారథిగా సకరథస్థుడై యుండుటకును గీతాబోధను అర్జునుని ప్రమేయమున లోకమునకు వెల్లడి చేయుటకును ఉద్దేశించి ఉద్యోగ పర్వమున తన సైన్యమును దుర్యోధనునకు ఇచ్చి తాను అస్త్ర సన్యస్త సారధి దీక్ష పూనెను అని అందురు. కాని నా అభిప్రాయమేమన అర్జునవిషాదము స్వామికి సంభ్రమము కల్పించెననియు తత్కాలోప యోగ క్రియగా గీతాబోధ స్వామికి తన్మయ హఠాత్ సంకల్పమునజనితమైనవీరగానోపన్యాసమేయనియు నిర్ణయించుట స్వభావసిద్ధము, సహేతుకము, సమయసమ్మతముగా కన్పించుచున్నది.

---

## శ్రీ యతిరాజ భజన కీర్తనములు

కవితావతంస, గానకళానిపుణ, హరికథా చతురానన

శ్రీ ఉ. వే. శ్రీమాన్ కరి నారాయణాచార్య భాగవతార్.

కన్నడ—ఆది— "పావనగుణరామా" అనువానివలె

ప॥ ఆదరమున రారా! యతీశ్వరా! । నాదు మొఱన్ వినరా! నతోద్ధారా! ॥ఆద॥

1. నీదు మనసునవ నీతమొగాదా! । గాదిలి దాసుని గన్గొనరాదా!
మేదినిలో నిను మించిన దైవము । నే దెసగాననే మొంబెరుమానే! ॥ఆద॥

2. భరతఖండమునం బ్రజలలో భేదము । లరమర లన్నియు నడగంజేసి నీ
వరమగు మతమును వరలంజేసితివి । కరినారాయణకవివర పోషణ! ॥ఆద॥

# రామానుజ దివ్యయోగి

ప్రొ డి వాః ద

మొవ్వ దాశరథిసూరి

తే. కాలపరిణామమున ధరాఖండమెల్ల
నిహిత విధులేని పటుతమోహాని హితమయ్యె
సాంద్రకారుణ్య చంద్రికాసారరుచులు
నెరయ యతిరాజచంద్ర! పసుమ్మరయ రావె.

ఉ. మానిత విష్ణులోక మణిమందిర నిత్యవిహారి! భార్గవీ
దానవవైరి మానసపథంబుల కెక్కిన దివ్యశీల; మా
యా నిరయంబునం బడిన యాత్మలనెల్ల సముద్ధరింపఁగా
మానవదేహముం గనిన మౌని కులాభరణా! నమస్కృతుల్. 2

మ. పొడుపుంబ్రొద్దున విచ్చుతమ్మిన నకెంబో రేకు నెగ్గాడు నీ
కడకంటన్ జడిగొన్న సాంద్రకరుణా కల్యాణవర్షంబునన్
బొడమెన్ లేఁజిగురాకు మోటువులయందున్ బాపముల్ వాపు నీ
యడుగుందామర లెల్లవారికిని దేవా ముక్తి సోపానముల్. 3

ఉ. పాదరబుద్ధి మానవులు సంసరణాబ్ధి మునింగి దుర్భరా
వేదనఁ గట్టుఁగానక తపించుచునుండినఁ జూచి మాతృదే
వీ దయదోఁచునట్లు దురపిల్లెడు మంగళాదేవతామనః
ఖేదము వాపి ప్రీతిఁ గలిగింపఁగఁ గల్గిన దీవె పోగురూ. 4

చం. హరికి నసాధ్యమైన భువనావన మేనొనరింతునంచు నా
పరమ వికుంఠలోకమునఁ బంతములాడి బిఱాన వచ్చి యీ
ధరణి జనించు నీ బహుళధైర్య కృపాద్భుత సాహసంబులన్
దరమె ప్రశంససేయఁగ మదాదృశ మానవకోటికిన్ బ్రభూ. 5

మ. నుతకర్తల్ చతురర్ణవా వళితమా మా భారతక్షోణిలో
శతసంఖ్యాకులు పుట్టిరెల్లరును నీ చందాన మౌనీంద్ర సం
తతికిన్ దుర్లభమైన నిత్యపదమొందం బంపిరే కూర్మితో
యతిలోకాన్వయసింధు కౌస్తుభమ! తిర్యగ్జంతు సంతానమున్. 6

ఉ. రేపటివేళఁ బూర్వశిఖరిన్ వెలుగొందు దినేంద్రుకైవడిన్
గోపురమెక్కి నాడుమద కోకిల కూజిత మాధురీఝరుల్
దోఁపఁగ మంత్రరాజమును లోకములెల్ల నెఱుంగఁ బల్కి త
త్పాపభరంబు నొక్కమొగిఁ బాపవె భూతదయామయానయా.

ఉ. తెల్లని యజ్ఞసూత్రములు దీర్ఘ త్రిదండ మృగాజనంబులు
దల్లలితోర్ధ్వ పుండ్రములు తామరసాక్షసర ప్రతానముల్
దెల్లముగాఁగ నంబుధి గతిన్ బలు తెంచెదు శిష్యసేనతో
ఢిల్లిని ముట్టడించి ప్రకటింపవె నీ మహిత ప్రభావమున్. 8



★

## నారీవిభాగము

★

# తిరుక్కోళూర్ పెణ్ పిళ్ళై రహస్యము

రచయిత: శ్రీమద్భాగవత పాదరేణువు, మదరాసు.

అ॥ అంతరంగంశొన్నే నోత్రిజటైయైప్పోలే ॥

తె॥ ఆంతరంగికమును దెల్పి నానా త్రిజటవలె ।

౨

రామా. రావణుడు సీతాదేవితో మోహపు మాటలాడినందుకు ఆమె నిగ్రహించగా అశోకవనమున సీతకు కావలియున్న రాక్షస స్త్రీలతో

కం॥ ఎడయిచ్చితి నిరుమాసము లాడబరవుడు నేర్చినట్టి లాడబడకున్నన్ ।
గడికండలు గాగోయుచు బడతులు భక్షింపుడింతి పలలం బెల్లన్ ॥

ఆని ఆగ్రహముతో చెప్పి నగరికి వెళ్ళెను. సీత అత్యంత దుఃఖాక్రాంతురాలై యుండ చుట్టునున్న రాక్షస స్త్రీ లెంతో ఆమెకు బోధించిరి గాని ఆమె ఒప్పుకపోగా అల్లే అందరు నిద్రించిరి. అందులో విభీషణుని పుత్రియైన త్రిజట నిదుర మేల్కాంచి తనతోడి రాక్షస స్త్రీలను ఆశ్చర్యముతో లేపి

మ॥ కలగంటిన్ వినుడింతులార ఘన లంకాద్వీపమీయబ్ధిలో ।
పలవ్రాలన్ మనరావణేశ్వరుని శుంభద్రత్నకోటీరముల్ ।
కలనన్ గూల రఘూద్వహుండెలమితో గంధద్విపం బెక్కియు ।
జ్వలకాంతిన్ విలసిల్లు సీత గొనిపోవన్ మిన్నకే నిప్పుడే ॥

ఓ! చెలియలారా !

సీ॥ దశకంఠుని గంటి తైల లిప్తాంగుడై తైలంబు గ్రోలుచు నున్మత్తుడగుచు ।
గన్నేరుపూవులు గళమున వ్రేలంగ రక్తాంబరంబులు గ్రాలుచుండ ।
ముండుడై కృష్ణాంబరుండునై వెండియు బుష్పకంబుననుండి పుడమిగూల।
నెలనాగచేత వాడీడ్వంగబడుచుండ గాంటినే గల మత్స్యకంటులార ॥

మరియు ఖరయుక్త రథమున మలయువాని।
రక్తమాల్యాను లేపన యుక్తుడగుచు ।
భ్రాంతమతి నూనె గ్రోలుచు గంతులిడుచు।
నగుచు బరిగె నది దక్షిణంబు గాగ ॥

సీ॥ అల కుంభకర్ణుపై గలగంటినే నిట్టిరీతిన మరి దశగ్రీవు సుతులు ।
మానెగు గ్రుంగుట గంటి దానవనాథుండు పందిని నింద్రజిబులు మొసలిని ।
కుంభకర్ణుడొంటెగొని వాహనములుగ దక్షిణదిశకై తరలగంటి।
వీరలలోన విభీషణుండొక్కడే తెల్లనిగొడుగును తెల్లచేలములును॥

తెల్లని గంధంపు బూతలునై ।
శంఖదుందుభి నిర్ఘోషసంయుతముగ ।
నృత్తగీతాదు లొప్పభూభృత్సమంబు ।
మేఘరావంబునగు నొక్క మేలిగజము ॥

చెలులారా మనమింక

ఉ॥ చాలును చాలు రక్కసలు సాధ్వి నభామల పుస్తకంబులా ।
మూలను గట్టివేయుడిక మోసము వచ్చును మంచిమాటలన్।
లాలనసేయుడీమె మనలన్ క్షమియింపగ వేడుకొంటయే ।
పోలును సీతయాత్మ విభుబొందుట నిక్కము నిక్కలన్ గనన్॥

అంత త్రిజట సీత నూరడించి

కం॥ అమ్మా! వెరువకుమదిలో నిమ్ముగ మరి వేడ్కనుండిమిక నీవిభుడున్
నెమ్మదినినుగొనిపోవును మమ్మందరమనుపుమమ్మ మనువక కరుణన్॥

కం॥ ఉన్నాడు లెస్స రాఘవుడున్నాడిదె కపులగూడి యురుగతి రాబో
చున్నాడు నిన్నుకొనిపో నున్నాడిది నిజమునమ్మ ముర్వీతనయా॥

కం॥ శుద్ధాత్ముడైన రాముని శుద్ధాంతపుదేవిగాన శుభసూచకముల్
శుద్ధంబై తోచుచునుమది సిద్ధంబీమాటనిజము వేదసిద్ధాంతమగున్॥

అని సీతను సమాధానపరచెనట.

[త్రి. అ.] త్రిజటవలె విపత్తులో సీతమ్మ నూరడించినానా?

అ॥ అవన్‌దెయ్యమనేని మండోదరియైపోవలె ।

తె॥ అతడే పరాత్పరుడన్నాన మండోదరివలె ॥

౨

రామాయణము శ్రీరామలక్ష్మణులు సేతుబంధనమొనర్చి కపివీరులతో లంకాప్రవేశ మొనర్చిన వెనుక అంగదుడు అంతఃపురముసొచ్చి మండోదరిని తలపట్టి ఈడ్చితెచ్చి రావణుని ముందుపెట్టగా

మ॥ మయదైత్యేంద్రుని కుందనూజనయి సేమంబాప్పనీ పత్నినై
జయవెట్టంగను నింద్రజిజ్జననినై సర్వాంగనాపూజ్యనై
భయమెన్నండు నెఱుంగనట్టినను నిభ్భంగిగా ఁ దనాటుఁడు
నిర్భయవృత్తిగా ఁ దలబట్టి ఈడ్వగను గోబాలైతినీ ముందటన్

అని దుఃఖించుచు

శ్లో॥ విజ్ఞాప్యంశృణురాజేంద్ర యద్యథాహం కృతాంజలిః
సచమానుషమాత్రోసౌ రామోదశరథాత్మజః ।

శ్లో॥ రామభార్యాసతీసీతా రాఘవాయ ప్రదీయతాం
యోగ్యశ్చరాఘవోమైత్రే కార్తవీర్యార్జునోయథా ॥

శ్లో॥ రాజైవఖలుకర్తవ్యం జారచోరనివారణం
రాజైవ జారశ్చోరశ్చేత్ కస్తన్నివారకః ప్రభో ॥

మండోదరి మఱియును

క౦॥ రామచంద్రుడా యాదినారాయణుండు కపులు దేవతలని నీకుగనబడంగ నెల్లవే
శిలనే, జెవినిల్లుకట్టి విన్నపముచేయ నామాటవినవు నీవు ఆనరులు నరులుగాతా ।

వానరులును గూడగారు వానరులరయం గానిది
నీదురైవం బౌనుమిషచ్ఛిన్నమాటస్జ్ఞాతముగన్

ఉ॥ అడచెను దొల్త దాటక ననంతరమందు సుబాహుముఖ్యులన్
బాడిచెను నీదుచెల్లి యలిముక్కుచెవిన్ నఱకించె బిమ్మటన్
గడపట జంపి నీభటుల గట్టెను వంతెన నయ్యతండు నీ
పొడవు క్షణంబులోనుడుపు బోరున నింకను భ్రాంతియేటికిన్ ॥

దానవేశ్వరా! మొదట వసుంధరాత్మజను మోసముజేసి హరించినావు నీ
య్యది యొకతప్పు, రెండవది యప్పుడయారసి రామునికీ యదలంప
మిద్ది మూడవది యీను గపులేజలరాశిగట్టు నిష్టుడైన శ్రీరాముని
వద్ద మైత్రితనొంది జానకిని నొప్పరికించుట నొప్పురావణా ॥ యనిబోధించెనట.

(తి. అ) మండోదరివలె భర్తకు హితోపదేశ మొనర్చినానా ?

# శ్రీ రా మా య ణ ము

**అ॥ అహంవేద్మియెన్రినో విశ్వామిత్రనైప్పోలే ॥**

**తె॥ అహం వేద్మియన్నానా విశ్వామిత్రులవలె ॥**

## ఏ

రామా, ఓ దశరథా !

శ్లో॥ అహంవేద్మిమహాత్మానం రామం సత్యపరాక్రమం ।
వసిష్ఠోపి మహాతేజాః యేచేమే తపసి స్థితాః ॥

తా॥ నేనీ రామచంద్రుని అపరిచ్ఛిన్న మహిమాంచితుడనియును, నాశములేని బలముగల వానిగాను యెరుగుచున్నాను. గొప్ప ప్రభావము గల యీ వశిష్ఠులున్ను యెరుగుదురు. ఈ సమీపమున నున్న యోగముఁందు సుస్థిరులైన ఋషులున్ను యెరుగుదురు. మరియు శ్రీరామచంద్రుని మహిమను దెలియము.

శ్రీరాముడు మహాత్ముడని యోగపరిశుద్ధమైన నాయాంతరచక్షుస్సుచేత నెరుగుదును. బాహ్యచక్షుస్సుచేత చూచెడు నీ వెరుగవు.

పలువురాచార్యులకు సేవజేసిన నేనెరుంగుదును గాని జానపదులచేత సేవింపబడునట్టి నీ వెరుగవు.

దర్భలను ధరించునట్టి నేనెరుగుదును గాని ధనస్సును ధరించు నీ వెరుగవు.
జడలు ధరించిన నేనెరుగుదును గాని కిరీటము ధరించిన నీ వెరుగవు.
సాత్విక ప్రకృతియగు నేనెరుగుదును గాని రాజసప్రకృతివగు నీ వెరుగవు.
ఆసనము క్రిందుగాగల నేనెరుగుదును గాని సింహాసనము మీదనున్న నీవెరుగవు.
యోగక్రమము నెరింగిన నే నెరుగుదును గాని భోగక్రమముల నెరింగిన నీవెరుగవు.
మోక్ష కాంక్షుప్తి జేసిన నేనెరుగుదును గాని పుత్రకామేష్టి జేసిన నీవెరుగవు.
ధర్మకాముడనగు నేనెరుగుదును గాని అర్థకాముడవైన నీ వెరుగవు,
సర్వసంగ పరిత్యాగినైన నేనెరుగుదును గాని అరిషడ్వర్గములలో జిక్కిన నీవెరుగవు.
విశ్వామిత్రుడిటుల శ్రీరాముల మహిమలను కొనియాడినప్పటికిని "దశరథునికి" పుత్ర వాత్సల్యమున ఓ మునీశ్వరా!

దశరథుడు ॥ పండుకొన లేడుతోడు నొక్కండులేక చీకటిని నొంటి సనుమన్న జికిలు జికిలు
నట్టినాపట్టి యడవుల గుట్టలందు నెట్టులుచరించు నాకడుపెట్టులోర్చు ॥
తే॥ పండుకొనతల్లి కేలదిదిండుగాగ మీదనొండొక చెయివైచి మేలికతలు
చెప్పనూకట్టుచుగను తెప్పమూయు కూన ముండ్లను రాళ్ళనుగూర్కు నెట్లు?॥
కం॥ పొడమినదాడిగనేడులు నడచెను నార్వదులవేలు నాకతిదుఃఖం
పడికొడుకును శ్రీరాముని బడసితి మమ్మెడలబాన బాడియెనీకున్॥
కం॥ రాముడు దనుజులయెడ సంగ్రామము చేయంగగలడె కావలసినచో
మిమ్ముగొలిచినేవచ్చెద నోముని రాజేంద్రయురుగు ముచితప్రోథిన్॥

కౌశికుడు మ॥ అనినన్ గౌశికుడాత్మనవ్వి వినవయ్యా! రాజ! నీచేతగా ।
దనరాదైనను రాక్షసుల్ విపులగర్వాటోప బాహాబలుల్।
ఘనుడీరాముడు తక్కువారి గెలువంగారాదు పిన్నంచు నీ।
వనుమానింపక పంపుమింక గ్రతురక్షార్థంబు భూవల్లభా!॥

అని ధైర్యపరచెనట.
(తి. అ.) విశ్వామిత్రునివలె శ్రీరామగుణ వర్ణనం బొనర్చినానా?

# తిరుప్పావై 27వ పాశురముయొక్క అర్థ భావములు.

పా॥ కూడారై వెల్లుమ్ శీర్ కోవిందా ఉన్ఱన్నై ప్పాడిప్పఱైకొణ్డు యామ్ పెఱుశమ్మానమ్. నాడుపుగழுమ్ పరిశినాల్ నన్ఱాగ చూడగమే, తోళ్వళైయే, తోడే, శెవిప్పూవే, పాడగమే, యెన్ఱనైయ పల్కలనుమ్ యామణివోమ్ ఆడైయుడుప్పోమ్ అదన్ పిన్నే పాల్ శోఱు మూడనెయ్ పెయ్దు ముழங్కైవழிవార కూడియిరున్దు కుళిర్న్దేలోరెమ్బావాయ్.

(ప్ర)వేశము 5 లక్షల గృహములయందలి గోపికాస్త్రీలను వెంట నిడుకొని శ్రీగోదాదేవి అన్నివ్వాల గమళించాయ్. అడిపోత్తి శెన్ఱంగుత్తెన్నిలంగు శెత్తాయ్ తిఱల్ పోత్తి అని, శ్రీకృష్ణ పరమాత్మకు మంగళాశాసనము చేయుచు ప్రవేసించుదురు.

గోపిక:—శ్రీకృష్ణపరమాత్మను సేవించి, ఆహాగోదాదేవి, ఏమి ఈబాలగోపాలుని లావణ్యము, త్రిజగన్మోహన మయిన నీలకాంతితో ఎట్లు ప్రకాశించుచున్నాడో !

గోదాదేవి :— ఒక సౌందర్యమేనా ? వాత్సల్యమే శరీరముగాగల్గిన ఈస్వామిని సేవించగానే నాకున్న పూర్వాభిప్రాయము పోయినది తల్లీ :—

గోపిక:—ఏమిటా అభిప్రాయము తల్లీ,

గోదా:—ఏమియులేదు మనమంతా ఈమాసం దినాలనుంచి తెల్లవారుఝామున లేచి గోపి మారులనందరినీ లేపుకొని, నాదయశోదలను లేపి, నప్పిన్నపిరాట్టని లేపి వారిని లేపి. మంగళాశాసనముచేసి. యింతకష్టము పరమాత్మని యందుండే వ్యామోహముచేత చేయుచున్నానను కొంటినిగాని, పరమాత్మను సేవించగనే నాఅభిప్రాయము పొరపాటని తెలుసుకున్నాను. శ్రీ వేదవ్యాస భగవాన్ మహాభారతమంతా ఏకృష్ణపరమాత్మ వ్యామోహగుణమును నిరూపించినారో, అటువంటి వ్యామోహం తిరుమేనుగావున్న పరమాత్మను సేవించిన తదుపరి మనకు శ్రీకృష్ణపరమాత్మయందుండే వ్యామోహము గోష్పాదమంత, వానికి మనయందుండేవ్యామోహము సముద్రమంత అని తెలుసుకొన్నాను.

గోపికలు:—సరి ఇకజాగేల ఇంత వ్యామోహము కలవాడు మనకోరికలు, ఎందుకు తీర్చరు తల్లి, వానిదగ్గరకు వెళ్ళి అడుగుదము రండి!

అందరు:—సరియే అటులనే పోవుదము అని, గోపాలుని సమీపించి. మాలే ఏమివ్యామోహము కలవాడవయ్యా ! మేమంతా శరీరమందు స్పృహకల్గివుండి, నీవద్దకు రాగలిగినాము గాని, నీవు మాయందులవుండే అధికవ్యామోహముచే మేమువచ్చిలేపేవరకూ కూడా లేవకుండా పడుకొన్నావు, ఆశ్రితవాత్సల్యైకజలవే, అన్నబికుడు నీకేచెల్లును స్వామీ ! రక్షమామ్ !

శ్రీకృష్ణ:—గోదాదేవి ! ఒకవేళ ఆశ్రితవ్యామోహంలేక కఠినప్రకృతికల వాడనైతే మీ రేమి చేయుదురు,

గోదా:—మణివణ్ణాకృష్ణా ! నీవు ఒకవేళ దదామిబుద్ధియోగంతం, అని, రక్షించకుండా, క్షిపామి, నక్షమామి అని ఆగ్రహించినప్పటికి, విడచిపెట్టే దివ్యమంగళ విగ్రహమటయ్యా నీది మణివణ్ణా, సానపెట్టిన నీలరత్నములవంటి కాంతిగల తిరుమేనికాదటయ్యా నీది, పిచ్చివానిచేతిలోనికి రత్నము లభ్యమైన ఎడల దానివిలువ తెలియక ఎవరడిగినా ఇచ్చివేయునటుల శమీదవుండే వ్యామోహముచే నిత్యసూరిభోగ్యమయిన ఆదివ్యమంగళ విగ్రహసేవను అస్మదాదులకు కూడా అనుభవ యోగ్యము చేయుచున్నావు గదా. (సశేషము)

భక్తి "నివేదన"

# ప్రచార విభాగము. అనుబంధము

## ★ శాశ్వతనిధి ★

| | | |
|---|---|---|
| వానరాశి సోమరాజుగారు | రాజమండ్రి | 2—0—0 |
| పారేపల్లి నాగేంద్రుడుగారు | మంగళగిరి | 3—0—0 |
| అంగలూరి వీరరాఘవాచార్యులుగారు | మంగళగిరి | 3—0—0 |
| వేదాల కోనమాచార్యులుగారు | మత్స్యపురి | 2—0—0 |
| ప్రి. భ. వెంకటాచార్యులుగారు | గొల్లప్రోలు | 1—0—0 |
| శృంగారం వెంకటశేషాచార్యులుగారు | శనివారపేట | 5—0—0 |
| చక్రవర్తి వెంకటాచార్యులుగారు | నెల్లూరు | 5—0—0 |
| కో. కం. అప్పన్ శఠగోప రామానుజాచార్య స్వామిగారు. ఉభయవేదాంత సంస్కృత కళాశాలాధ్యక్షులు. | సీతారాంబాగ్ | 6—0—0 |

---

భక్తి నివేదనకు నందన సంవత్సరము సహాయ చందాదారులుగా చేరినవారు

చక్రవర్తి వెంకటాచార్యులుగారు, నెలూరు.

---

## సంభావన

తణుకు కాపురస్థులు కలవగుంట శేషాచార్యులుగారి భార్య అలివేలుమంగ తాయారమ్మ గారు పరమపదోత్సవ సమయమందు శ్రీ విశిష్టాద్వైత ప్రచార సంఘమునకు సంభావనగా పంపినది రూ 1—0—0



శ్రీమతే రామానుజాయ నమః

# శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘ శ్రావణ మాస పండిత సభా

## ★ ఆహ్వాన పత్రిక ★

### శ్రీవాసుదాసాశ్రమము—(నడిగడ్డపాలెం) శ్రీపాదుకాక్షేత్రము.

స్వస్తిశ్రీ నందననామ సం॥ర శ్రావణ శుద్ధ ద్వాదశి 2-8-52 శనివారం మొదలు 3రోజులు నడిగడ్డపాలెమందలి శ్రీ వాసుదాసాశ్రమమున చెన్నపురి వాస్తవ్యులైన శ్రీ ఉ. వే. శ్రీమాన్ **పండిత** చక్రవర్తి శ్రీనివాసరంగాచార్య స్వామివారి అధ్యక్షత క్రింద శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘ శ్రావణమాస పండిత పరిషత్సమావేశము జరుపబడి యీ క్రింది పండితప్రకాండులచే వివిధ వేదాంత విషయములు ఉపన్యసింపబడును. శ్రీ శ్రీ శ్రీ వాసుదాసు గారి పరమపదోత్సవము జరుపబడును. గాన భక్తులెల్లరును యిందు పాల్గొని ఆనందింప గోరుచున్నాము.

—• కార్యక్రమము •—

1-8-52వ తేదీ రాత్రి గం 7 లకు ఆశ్రమమునందున్న శ్రీ కోదండరామ పెరుమాళ్ళ సన్నిధిలో తిరువాయ్మొళి తొళక్కము గావింపబడును.

2-8-52 నుండి 4-8-52 వరకు 3 రోజులున్ను ఉదయం గం 7-0 నుండి గం 10-0 లు వరకు సేవాకాలము తీర్థప్రసాద వినియోగమున్ను, సాయంకాలము గం 3-0 నుండి గం 6-0 వరకు పండితులచే ఉపన్యాసములున్ను గావింపబడుచుండును.

చివరిరోజున [4-8-52] సోమవారమున

శ్రీ శ్రీ శ్రీ వాసుదాసు వారి పరమ పదోత్సవ మతివైభవముతో జరిపించబడును.

ఆనాటి రాత్రి శాత్తుమఱై సభా సమాప్తి.

# : ఆహ్వానింపబడిన పండితులు :

| | | |
|---|---|---|
| శ్రీ ఉ. వే. శ్రీమాన్ | పరాశర సుదర్శన భట్టరయ్యవార్లంగారు | కోరుకొండ |
| ,, | కో. యి. వెంకటాచార్యులుగారు | గుంటూరు |
| ,, | మొలుగు రామానుజాచార్యులుగారు | ముగ్గళ్ళఅగ్రహారం |
| ,, | కవిరత్న గుదిమెళ్ళ రామానుజాచార్యులుగారు | ముక్తిపల్లి అగ్రహారం |
| ,, | ఈయుణ్ణి రాఘవాచార్యులుగారు | గుంటూరు |
| ,, | శ్రీమత్తిరుమల పురిగళ్ళ ధర్మాచార్యులుగారు | ఏడిద |
| ,, | శ్రీమత్తిరుమల పురిగళ్ళ వెంకటాచార్యులుగారు | మాధవరం |
| ,, | బెల్లంకొండ రాఘవాచార్యులుగారు | బందరు |
| ,, | ఆ. చి. శ్రీమన్నారాయణాచార్యులుగారు | అత్తమూరు |
| ,, | తె. కం. గోపాలాచార్యులుగారు | కోరుకొండ |
| ,, | శ్రీన. చ. సంపత్కుమార జగన్నాథతిరువేంకటాచార్యులుగారు | విజయవాడ |
| ,, | శ్రీమత్తిరుమల పల్లెర్ల మూడి రామస్వామిగారు | శ్రీరామతీర్థం |
| ,, | మహాభాష్యం వరదాచార్యులుగారు | చీరాల |
| ,, | గొట్టుముక్కల రమాకాంతాచార్యులుగారు | బాపట్ల |
| ,, | ఈయుణ్ణి శ్రీనివాసాచార్యులుగారు | మంగళగిరి |
| ,, | తిరుమల అ. శ్రీనివాసాచార్యులుగారు | మంగళగిరి |
| ,, | కోడూరి వెంకటాచార్యులుగారు | నడిగడ్డపాలెం |

కేంద్ర కార్యదర్శులు
తె. కం. గోపాలాచార్యులు.
ఆ. చి. శ్రీమన్నారాయణాచార్యులు.

ఇట్లు,
భగవత్పాదరేణువు,
కూ. వెంకటప్పదాసుడు.
శ్రీ కోదండరామ సేవక సమాజము, నడిగడ్డపాలెం.

మార్గము:- తెనాలికి అవతల స్టేషనగు చుండూరులో రైలు దిగిన ఆశ్రమము ఒక మైలుండును.

# శ్రీ యతిరాజ సేవా మహిళా మండలి శుక్రవార

## ద్వితీయ వార్షికోత్సవాహ్వాన పత్రిక

అయ్యా
అమ్మా

నందననామ సంవత్సర శ్రావణ బహుళ తదియా శుక్రవారం అనగా 8–8–52 మొదలు 10–8–52 వరకూ మూడు దినములు బందరు పాతచల్లరస్తా వేణుగోపాలస్వామి వారి దేవాలయములో శ్రీ యతిరాజ సేవా మహిళా మండలి శుక్రవార సభలు జరుపుటకు యేర్పాటు చేయబడినవి. ఈ సభలకు యేలూరు వాస్తవ్యురాలు పరమ భాగవతోత్తములైన శ్రీమతి నండూరి ఆనందమ్మగారు అధ్యక్షత వహించెదరు. శ్రీమత్ పరమహంస పరివ్రాజకాచార్య శ్రీ శ్రీ శ్రీ సీతారామ యతీంద్రులవారి ఉపన్యాసములు భజనలు మూడు రోజులు జరుగును. చిన్నపిల్లల నాట్యనాటక, భగవద్గీత సంభాషణలు మొదలగు వినోదములు జరుగును గాన మండలి సభ్యులు, అభిమానులు, భక్తులు, స్త్రీ పురుషు లందరూ దయతో విచ్చేసి యిందు పాల్గొని వీనిని జయప్రదముగా జరిపించ కోరుచున్నాము.

అధ్యక్షురాలు:— శ్రీపతి సీతమ్మ.

కార్యదర్శిని:—మరంగంటి సీతమ్మ, కంతేటి తాయారమ్మ.

ఆర్తమూరు

## శుక్రవార పూజలు

ద్వారంపూడి బుల్లివీరయ్య భార్య ఆదెమ్మ 0-4-3
కర్రి వీరారెడ్డి భార్య వెంకమ్మ 0-4-3
కర్రి సత్తిరెడ్డి భార్య మంగమ్మ 0-4-3
కర్రి సత్తిరెడ్డి భార్య బుల్లివెంకమ్మ 0-4-3
కర్రి సుబ్బారెడ్డి భార్య ఆదెమ్మ 0-4-3
కొప్పూర్తి వెంకటరెడ్డి భార్య కామేశ్వరమ్మ 0-4-3

వైశాఖ మాసములో

చిన్నం వీరారెడ్డి భార్య ఆదెమ్మ 0-4-3
నల్లమిల్లి అప్పారావు భార్య బుల్లెమ్మాయి 0-4-3
పెరడ బ్రహ్మయ్య భార్య మాణిక్యం 0-4-3
లంక చినవెంకన్న భార్య సుందరమ్మ 0-4-3
వేపర్తి సత్యన్న భార్య గంగరాజు 0-4-3
గనేసుల తాతయ్య భార్య సూరమ్మ 0-4-3
పులగం వీరమ్మ 0-4-3
పోతుల బుల్లెమ్మ 0-4-3
పరిగడ సూర్యారావు భార్య మంగమ్మ 0-4-3
లంక రాజులు భార్య సూర్యకాంతం 0-4-3
గరగ సోమరాజు భార్య బుల్లాలు 0 4 3
దాసరి వీరరాజు భార్య సూర్యకాంతమ్మ 0 4 3
గనేసుల సత్యం భార్య వెంకటరత్నం 0 4 3
మేడపాటి వెంకన్న భార్య బుల్లెమ్మాయి 0 4 3
చిర్ల అమ్మిరెడ్డి భార్య వీరమ్మ 0 4 3
చిర్ల రాజులురెడ్డి భార్య సూర్యకాంతం 0 4 3
పడాల వెంకన్న భార్య అమ్మాయి 0 4 3
కర్రి భద్రయ్య భార్య వెంకమ్మ 0 4 3
గోటికల్లి అప్పన్న భార్య సుబ్బమ్మ 0 4 3
సంగుల సత్తెయ్య భార్య వెంకమ్మ 0 4 3
ఆకి వెంకన్న భార్య గంగమ్మ 0 4 3
పోతంశెట్టి వెంకన్న భార్య మాణిక్యం 0 4 3
పోతంశెట్టి వెంకటరెడ్డి భార్య మహా 0 4 3
కర్రి అబ్బాయి భార్య అమ్మాయి 0 4 3

## ఏకాదశి పూజలు

పడాల శ్రీరాముని భార్య గంగమ్మ 0 4 3
కర్రి నరసిరెడ్డి భార్య సీతమ్మ 0 4 3
ఉండపాటి రామన్న భార్య అమ్మన్న 0 4 3
తేతల గోవిందు భార్య సూరమ్మ 0 4 3
కర్రి కొండయ్య భార్య బుల్లెమ్మాయి 0 4 3
కర్రి వెంకన్న భార్య బుల్లెమ్మాయి 0 4 3
ద్వారంపూడి సూరారెడ్డి భార్య సావిత్రి 0 4 3
లంక లక్ష్మయ్య భార్య 0 4 3
వేపర్తి సత్యన్న భార్య గంగరాజు
శ్రీరామనవమి పూజజరిపించినది. 0 4 3
కర్రి వీరారెడ్డి భార్య సత్తెమ్మ 0 4 3



రిజిస్టరు నెం 5049

# ప్రతినివేదన

(వేదాంత మాసపత్రిక)

యిందు వేదాంత విషయ రాజకీయములున్ను; భక్తి ప్రచార విషయమైన వార్తలున్ను వేదాంత సాంప్రదాయ విషయకమైన ప్రశ్నోత్తరములున్ను ప్రకటించబడును.

చందాలు;

సాధారణ చందా సం. 1 కి || రు 5-0-0.
సహాయ చందా ,, రు. 10-0-0.

To

**Book-Post**



1. శ్రీమన్నారాయణుడే సృష్టి - స్థితి - లయ కారకుడు.
2. ఆయనే మోక్షప్రదాత.
3. ఆయనే పరతత్త్వము-పరమాత్మ
4. ఆయన అఖిలహేయ ప్రత్యనీక కల్యాణ గుణకరుడు.
5. ఆయనకు జీవులు శరీరభూతులు; శేషభూతులు, పరతంత్రులు, నియామ్యులు, అనుభావ్యులు.
6. జీవులు జ్ఞానాకారులు.
7. జీవులు అనంతములు.
8. జీవులు పరమాత్మకంటె భిన్నులు; భేదము సత్యమైనది; నిత్యమైనది.
9. జీవ-పరమాత్మలకు ప్రకృతి శరీరభూతమైనది; శేషభూతమైనది; పరతంత్రమైనది; నియామ్యమైనది; అనుభావ్యమైనది.
10. ప్రకృతి వికారాస్పదమైనది. జీవపరమాత్మలకంటె భిన్నమైనది, ఈ భేదము సత్యమైనది; నిత్యమైనది.
11. జీవుడు ప్రకృతి వియుక్తుడై పునరావృత్తి రహితమైన పరమాత్మ సాన్నిధ్యమగు పరమపదమును పొందుటయే మోక్షము.
12. భక్తి ఒక్కటియే మోక్షసాధనము.
13. భక్తియన తైలధారవలె అవిచ్ఛిన్నమైన స్మృతి సంతతి.
14. వివేక-విమోక-అభ్యాస-క్రియా-కల్యాణ అనవసాద-అనుద్ధర్షలు భక్తి అంగములు.
15. ఇవి సదాచార్య-సమాశ్రయణ-లభ్యములు
16. జగద్గురువగు శ్రీరామానుజాచార్యులు వారును; వారి యనుయాయులున్ను సదాచార్యులు.

"నగురుర్వైష్ణవాత్ పరః" భా. పం.

# భక్తి నివేదన

వేదాంత మాసపత్రిక

| సంపుటి ౪ | నందన–భాద్రపదమాసం | సంచిక ౬ |
|---|---|---|


## సగుణ నిర్గుణ శ్రుతులు

కె. జి. కృష్ణమాచార్యులు పండిట్,
గుంటూరు.

శ్లో॥ నిర్గుణ శ్రుతిభిః కేచిద్బాధన్తే సగుణ శ్రుతీః ।
తాసామన్యోన్య సౌహార్ద మాహుర్యతి వరాశ్రియాః ॥

ఉపనిషత్తులలో బ్రహ్మస్వరూపమును గూర్చి సగుణ నిర్గుణ వాదములు సుప్రసిద్ధములు. 1. యస్సర్వజ్ఞస్సర్వవిత్ 2, పరాస్యశక్తిర్వివిధైవ శ్రూయతే స్వాభావికీ జ్ఞానబలక్రియాచ 3. సత్యకామ స్సత్యసంకల్పః 4. బ్రహ్మణా విపశ్చితా—ఇత్యాద్యనేక వాక్యములు గుణనిరూపకములు గలవు.

ఇట్లే 1. నిర్గుణం నిరంజనం నిష్క్రియం శాంతం. 2. అపహతపాప్మావిజరః 3. యత్తదద్రేశ్య మగ్రాహ్య మగోత్ర మచక్షుశ్శ్రోత్రం తదపాణిపాదం 4. అస్థూలమనణు, ఇత్యాది నిర్గుణ వాక్యములును గలవు.

, వేదాంతశాస్త్ర ప్రతిపాద్యమగు బ్రహ్మస్వరూపము సగుణ నిర్గుణ భేదమున ద్వివిధమా? అని శంక. వేదాంతరాద్ధాంతములయందు ఒక్క అద్వైత ప్రస్థానమే సగుణ నిర్గుణ బ్రహ్మములకు భేదము సంగీకరించుచున్నది. శ్రుతి స్మృత్యుదాహరణ పూర్వకముగా నీ యర్థమును ద్వైతాచార్యులు సమర్థించుచున్నారు. ఈ భేదము నంగీకరించియే సద్విద్యానంద మయోభయలింగ కార్యాధికరణములకు శంకరాచార్యుల వారు భాష్యమును రచించియున్నారు. సద్విద్యయందు సత్పదార్థము నిర్గుణతత్వము బహుభవన సంకల్పోత్తర కాలమున స్వగత నానాత్వ మంగీకరించుట వలన శుద్ధచైతన్యము ఈశ్వర భావము నందు బద్ధమగుచున్నది. దృగ్దృశ్య వివేకరహిత

మగు శుద్ధచైతన్యముడగ్రప్రత్యగ్రూపమునందు చున్నది.

ఇట్లే ఆనందమయాధికరణమునను ఆనంద మయత్వము సగుణము. ఆనందమయ మనగా ప్రాచుర్యార్థమును గ్రహించినచో నల్పదుఃఖ విశిష్టుని శాంకరపక్షము.

"అపిచ ఆనందప్రచుర ఇత్యుక్తే దుఃఖాస్తిత్వమపి గమ్యతే" ప్రాచుర్యస్యలోకే ప్రతియోగ్యల్పత్వాపేక్షత్వాత్ [1-6-11] ఆనందమయాధికరణె [శం. భా.].

ఉభయలింగాదికరణమునను ఈశ్వరతత్త్వము సగుణమనియు, శుద్ధచైతన్యముపరమార్థమనియు సూచించియున్నారు. కార్యబ్రహ్మ ముపాసనార్థమనియు, నిది ఈశ్వరశబ్దవాచ్యమనియు, శుద్ధబ్రహ్మస్వరూపము పరమార్థమనియును వక్కాణించియున్నారు.

ఇట్టి బ్రహ్మ ద్వయవాదమును రామాను జీయులంగీకరింపరు. ఇతర వేదాంతులలో భేదాభేదవాదులగు భాస్కరీయులీ వాదమును నిరసించియున్నారు. పరిణామవాదులగు యాదవీయులు నీ వాతమును దూషించియున్నారు.

భగవద్రామానుజాచార్యులవారు భేదాభేద వాదులను కటాక్షించుటకు కారణమేమన శ్రీవారిపలెనే వారున్నూ నిర్గుణవాదమును నిరసించి యుండుటయే.

యతిరాజ సిద్ధాంతమున నామరూప విభాగానర్హమగు సూక్ష్మ చిదచిద్విశిష్ట తత్త్వము సృష్టికి పూర్వము ఏకమును అద్వితీయము నై యుండెను. అప్పుడిది అవిభక్తనామరూపము, సృష్ట్యుత్తర కాలమున భోక్తృ భోగ్యరూపమగు ప్రపంచపరిణామమునంది యిది వ్యాకృత నామ రూపమయ్యెను. ఇట్టి సందర్భమున బ్రహ్మమే అవిద్యాభిభూతమై స్వగత నానాత్వము ననుభవించుచుండెననియు, ఈ అవిద్య అనాదియు, సదసదనిర్వచనీయమనియు వాదించు శుష్కాంతరముల సయుక్తికముగా నిరసించి సమస్త దోషములకును చిదచిత్తులే ఆశ్రయ భూతములనియు, చిదచిచ్ఛరీర విశిష్టమగు పరమాత్మ తత్త్వము సృష్టికి పూర్వోత్తర కాలములందును సదా దోషరహితమును, కళ్యాణ గుణాకరమనియు, స్థాపించియున్నారు. సగుణ శ్రుతులు కళ్యాణ గుణములను స్థాపించును. నిర్గుణ వాక్యములు హేయగుణ సంబాధమును నిరాకరించును. కావున శ్రుతులకు పరస్పర విరోధము లేదు. శ్రుతులన్నియును ప్రమాణ భూతములే. ఇట్టి శుద్ధతత్త్వమగు శ్రీనివాసుడే ముముక్షూపాస్యుడు అని భగవద్రామానుజ సిద్ధాంతసారము. నిర్గుణవస్తువు తెలియరాదు. ఇది సర్వప్రమాణ బహిష్కృతము. ఉపాసనమనగా సగుణోపాసనమే.నిర్గుణోపాసనమనుటస్వవచన వ్యాఘాతము.

అద్వైత సిద్ధాంతమున జీవేశ్వర భేదమౌపాధికము. ఇది విశిష్టాద్వైతమున పారమార్థికము. అనాదియు ననిర్వాచ్యమును భూత ప్రకృతియు, చిన్మాత్ర సంబంధినియగు మాయయందు చిత్ప్రతిబింబమీశ్వర తత్త్వమనియు, అవిద్యాప్రతిబింబిత చిత్త్వత్త్వము జీవస్వరూపమనియు నద్వైతులు వచించుచున్నారు. ఇట్టి మాయావాదమున నుపాసనకు స్థానము లేదు. విశిష్టాద్వైత ముపాసనాత్మక జ్ఞానమునే మోక్ష

సాధనముగా స్థాపించుచుండుటచే వీరికుపాసనమే ముఖ్యము.

ఐనను శంకరాచార్యుల వారి వ్యావహారికసత్య ప్రపంచమున నుపాసనము సగుణము. శుద్ధచైతన్య స్థాపనావసరమున నిరాకరింపబడిన ఈ యంశము వ్యావహారిక దశయందు వారిచే నంగీకరింపబడినది. వీరి భజగోవింద స్తవరాజము, సహస్రనామ భాష్యమునిందులకు ప్రమాణములు. వీరు కేవలము జ్ఞాని మాత్రమే గాక భక్తులు నగుదురు. జ్ఞానస్వరూపమగు సచ్చిదానంద తత్త్వమే భక్త్యావస్థయందు వీరికి వాసుదేవ స్వరూపమగుచున్నది. కావున వీరి మతమునను సగుణమే యుపాసనము. వీరు వేదాంతరాద్ధాంతమున గౌడపాదుల మాధ్యమిక సిద్ధాంతము నవలంభించినను నిత్యారాధన పద్ధతియందు సగుణోపాసనమును స్థాపించిభగవద్రామానుజ సిద్ధాంత శాస్త్రోదయమునకు కరుణపాత్రులైరి.

వాస్తవమునను నిర్గుణ శ్రుతులవలెనే సగుణ శ్రుతులును పరమ ప్రమాణ భూతములు. కావుననే వానికి పరస్పరము బాధ్య బాధక భావము లేదు. "నీచాః కలహమిచ్ఛంతి సంధిమిచ్ఛంతి సాధవః" అను న్యాయము ననుసరించి శ్రుతి విరోధమును స్థాపించిన యుపసిద్ధాంతముల నిరసించి విషయ వ్యవస్థచే వానికి సౌహార్దమును కల్పించి సంధిని గూర్చిన వారు యతిసార్వభౌములు. "తత్రవిరోధ స్థిరీకరణేన బాధ్య బాధక భావ ఇతినీచాః। విషయ వ్యవస్థయా సంధిరితి సాధవః" అని నిగమాంత మహాదేశికులు నిరూపించియున్నారు. ఇందులకు ప్రమాణముగా శ్రీవరద గురువచనమను సంధేయము.

"యద్ బ్రహ్మణో గుణశరీర వికార జన్మకర్మాది గోచరవిధి ప్రతిషేధవాచః। అన్యోన్య భిన్న విషయా న విరోధ గంధమర్హంతితన్న విధయః ప్రతిషేధ బోధ్యాః"

శ్రీశంకరాచార్య ప్రతిపాదితమైన శుద్ధచైతన్యము పాసనానర్హమని యిదివరకే వక్కాణించియున్నాము. దీనికి ప్రమాణ భూతముగా రాధాకృష్ణ మహాశయుల వచనము నుదాహరించుచున్నాము.

"The alsdanse of Sankara rigid motiouless and totolly taking in inmitiative or in fluence cannot call forth our worship like Taj Mahal which is uncanseions of the edministration it anoprses. The alsduse remains in diferent to goan and love of its. Worshipers and for all those who regard the goal of religion as the goal of philosophy to know god is to know the great Sankara is view sunas to be a finished example of learned errar.

ఇందువలన శాంకరీయ నిర్గుణ తత్త్వముపాసనానర్హమని సుస్థాపితము.

ద్వాత్రింశ దుపనిషద్విద్యలున్నూ సగుణోపాసనమునే స్థాపించుచున్నవి. శ్లో॥ విద్యాప్రాతర్దనీసావదతి హితతమోపాస్తి కర్మేంద్రమేవ ఖ్యాతః ప్రాణేంద్ర బ్రహ్మన్విత మపితదసౌ విశ్వకర్తేతిచేన్న। బ్రహ్మత్వేధాహ్యుపాస్యం బహువిధ చిదచిత్కంచుకీం స్వాత్మనావ ప్రాణేంద్రాదిప్రకమోఽపిప్రబలతర మహాకాక్య వైఘట్య భగ్నః॥

ప్రతరన విద్యయందు-

సద్యోవాచప్రాణోఽస్మి ప్రజ్ఞాత్మాతం మామాయుర మృతమిత్యుపాస్స్వ" అని కౌషీతకి 3-1 వాక్యముదాహరింపబడినది. ఇందు విహితతమోపాసనము పరమాత్మోపాసనమే. ఈ విద్యయందు ఇంద్రాదివిశిష్టుడగు పరమాత్మ ఉపాస్యుడు. ఉపాసన మచిద్విశిష్టోపాసనమనియు, చిద్విశిష్టమనియు కేవలపరమాత్మ పరమనియు త్రివిధము.

శ్లో॥ నిత్యం హేయగుణా వధూనన
పరానైర్గుణ్య వాదాశ్రితా
ముఖ్యార్థాస్సగుణోక్త యస్సు
భగుణప్రఖ్యాప నాద్బ్రహ్మణః
అద్వైతశ్రుతయో విశిష్టవిషయా
నిష్కృష్ట రూపాశ్రయాః
భేదోక్తి స్తదిహాఖిల శ్రుతిహితం
రామానుజీయం మతం॥

---

# గీతారూపమగు శ్రీకృష్ణవాక్కు వచనమా? శ్లోకములా?

శ్రీమహాభారత గ్రంథకర్తయగు వ్యాసమహర్షి శ్రీకృష్ణార్జునులకు సమకాలికుడు సన్నిహితుడు పరమగురువు కావున గీతావిషయముల గూర్చి యుద్ధానంతరము వారివలన వివరముగా తెలుసుకొని గ్రంథస్థము చేసియుండును. అట్టి గ్రంథమును శ్రీకృష్ణునకు వినిపించి ఆయనయొక్క అనుమతిని పొందియుండును.

ఇంతేగాక శ్రీకృష్ణుడు సామాన్యవ్యక్తియా? భగవదవతారము, ఈపరిపూర్ణతముడు సులభమైన అనుష్టుప్ఛందస్సులో గీతను శ్లోకరూపముగనే ఆశువవనముగా సమయోచితముగ పలుకగలిగెను. అనుట ఏమియు అతిశయోక్తి కాదు.

కావున ప్రథమ ప్రబోధమునగాని, వ్యాసవచనమును శ్రీకృష్ణుడు సమ్మతించుట వలనగాని, గీతపూర్తిగా శ్రీకృష్ణభగవానుల అభిప్రాయవచనమేయనినమ్మి మనము సేవింపవచ్చును.

మో॥స॥యో॥శ్లో॥64 సర్వగుహ్యతమం భూయః।
శృణు మే పరమంవచః।
ఇష్టోఽసిమేదృఢమితి।
తతోవక్ష్యామి తేహితమ్॥

మో॥స॥యో॥శ్లో॥75 వ్యాసప్రసాదాచ్ఛ్రుతవాన్
ఏతద్గుహ్యమహం పరమ్।
యోగంయోగేశ్వరాత్ కృష్ణాత్।
సాక్షాత్ కథయతస్స్వయమ్॥

గీత పదునెనిమిది యోగములక్రింద విభజింపబడినది. ఒక్కొక్కయోగమును ఒక్కొక్క అధ్యాయముగా పలుకబడుట వాడుక. ప్రతియోగము అందలి విషయముల ననుసరించి కర్మజ్ఞానాది నామధేయములచే నెన్నబడును. యోగము అనగా సంయోగము కూర్పబడుట. ఆయా యోగములోని ప్రతిభావమును గీతాసముదా

యముఖ్యసూత్రప్రమాణతృ్ర ధర్మభావములో సమగ్రమక్రమముగా సంయోగించి అనుసంధించి ఆచరణలో అనుసరించుట గీతాబోధనోద్దేశము.

ఈయోగముల [అధ్యాయముల]లో మొదటిది గీతాప్రవచనకు కారణమైన కధను చెప్పు అర్జునవిషాదయోగము.

ఇక రెండవ అధ్యాయమగు సాంఖ్యయోగమున పదునొకండవ శ్లోకమగు

శ్లో॥ అశోచ్యానన్వశోచస్త్వం।
ప్రజ్ఞావాదాంశ్చభాషసే।
గతాసూనగతాసూంశ్చ।
నానుశోచంతి పండితాః॥

అనుశ్లోకమునుండియే భగవద్గీత ఆరంభము అనుకొనవచ్చును.

రెండవయోగమున ఇతరసంగతులుకూడ గుర్తింపతగినవి.

సంఖ్యల [అంకెల] ప్రాధాన్యముకలది ఎట్లన భారతము 18 వ సంఖ్యకు ప్రాధాన్యముకలది.

18 పర్వములు
18 అక్షౌహిణులు.
18 యుద్ధదినములు.
18 గీతాయోగములు.

ఈ 18ని 4 చే గుణించినయెడల [18 × 4=72] శ్లోకములుగలది. ఈసాంఖ్యయోగము ప్రతినాలుగు శ్లోకములలోని విషయము క్రమముగా గీతలో ఆయావరుసల అధ్యాయమునందు వివరింపబడిన విషయములకు క్లుప్తమైనసూచన అందుచే సాంఖ్యయోగము భగవద్గీతకంతకు విషయసూచికవంటిది.

2, సంఖ్య-యుద్ధము-యుద్ధసంబంధమైన ప్రవచన విశేషముగా గలది.

3, సాంఖ్యము_బుద్ధి_మనీష_అనగా విచక్షణజ్ఞానమును శౌర్యముతో సమభాగముగా సమ్మేళనపరచి యుద్ధమునందు ఆచరణలో పెట్టదగిన బోధనగలది.

ఈసాంఖ్యయోగమునందును— గీతాశాస్త్రమునందంతటను యుద్ధరంగము జీవితముగాను యోధుడు యోగజీవిగాను—ధర్మము ధర్మరాజుగాను—ఉత్ప్రేక్షించినట్లు అర్థ సూచనలున్నవి. ఈసూచనలను గుర్తించుటకై గీతలో తరచుగా వాడబడు పదములకు వివిధములైన అర్థములు ఈదిగువ వివరింపబడినవి.

[1] ధర్మః-ధర్మము-ధర్మరాజు
[2] గీత–గేయము-గానము
[3] యోగము-సంయోగము-కలుపుట- అభ్యాసము-ప్రయత్నము-వ్యాయామము- కృషి-వేదాంతచింతన.
[4] యోగి_అభ్యాసకుడు-జిజ్ఞాసకుడు_యోధుడు
[5] క్షేత్రము యుద్ధము_ధర్మము_కృషి మొదలగు ప్రయత్నములకు ప్రదేశము-శరీరము
[6] ఆత్మ-జీవుడు-వ్యక్తి_యోధుడు.
[7] ప్రకృతి-సృష్టికి మూలతత్వము – సైన్యసామగ్రి
[8] జగత్తు-ప్రపంచము_ప్రజ_సైన్యము
[9] కర్మ-క్రియ_ప్రతిక్రియ_కార్య కారణపరంపర_విధాయక కృత్యము కరణీయము.
[10] బ్రహ్మ—పరమాత్మ—అంతరాత్మ—యజ్ఞాధికారి—సర్వసేనాపతి ఖగోళమధ్య మహామండలాధిదైవము,

[11] యజ్ఞము—మంత్రహోమక్రియ— యుద్ధము శరీరకతత్త్వ సత్త్వపరిణామక్రమము రసాయన వస్తుసమ్మేళనము—విభజన — పర్యవసానముగా క్లుప్తముగా, శ్రీ భగవద్గీతాసారము ను ఈదిగువ నొసఁగి సూచించుచు,

శ్రీ భగవద్గీతా సారసోపదీ గేయము కలదు.
శస్త్రాస్త్రములు చాలాబలము శౌర్యము చూప వేలా?

3—నెలయు యోధపరేణ్య! యీలా వివశత కువేళా?
వలదుస్వార్థము నీకు వేలా?
అలుగు! గొని—ఫలత్యాగశీలా!
6 కలుగు ధర్మత్వేచ్ఛ యోగక్రమము నీపాలా
నిలుపు! కనునమ్ము! హేలా
వీఁ మమున్నత మోక్షలోలా
నీయుజేసెద, రమ్ము! పోరుము! నీరసము మేలా?

"వేదాన్త విలాసము" [అనెడు]

# యతిరాజ విజయనాటకము

## ఐదవ యంకములో నొక భాగము.

అనువాదకులు: శ్రీ ఉ. వే. శ్రీమాన్ తె. కం. గోపాలాచార్యులుగారు, కోరుకొండ.

### కథా సందర్భము —

[శ్రీ వేదవాళి మహారాజునకు గల మాయావాది పిశాచ బాధను రామానుజులు ప్రభావమాత్ములై వదల గొట్టిరి. రాజు సుమతితో సుఖముగ కాలము గడుపుచుండును. మాయావాది క్షుద్ర శత్రువగుటచే నాతని ప్రవృత్తిని సర్వదా కనిపెట్టియే యుండవలెనని శ్రీ వేదవాళి మహారాజు సుదర్శుడను నొక గూఢచారిని పంపును.]

సుదర్శనుడు:- నన్ను మహారాజు మాయావాది వృత్తాంతము నారయుట కంపెను. ఒక బాటసారి వలన నేనా వృత్తాంతము నాతను సంగ్రహించితిని.

వాడిప్పుడు శంకరుని పురస్కరించుకొని కేర ళులతో గూడి యిరుకగు రహస్య స్థలమున దుర్గ నారాధించి యామె యనుగ్రహము వలన ననేక విధములగు మాయాశస్త్రులను యుక్తు లను లభించి రామానుజుల జయించుట కింద్ర జిత్తువలెనే బయలువెడలెనట. ధ్యాన నియోగ వాదియు నిష్ప్రపంచీకరణ నియోగవాదియును వృద్ధులయ్యు నాతనికి సహాయమొనరింప నుద్యు

క్తులై శంకర ద్వేషముచే మరలిపోయిరి. శంకర శిష్యులగు వాక్యార్థ జ్ఞానవాదులు జీవులనేకులని యొకడును, ఒక్కడే జీవుడని మరియొకడును పరస్పరము కలహించి యెచ్చటకు పోయిరో గాన రారట. ఈ వృత్తాంతము నంతను గురువు గారికి కెరుకపరతును. (అని పోవును.

: విష్కంభము :

పిమ్మట కోపముతో సన్యాసియు (ఏకజీవవాది) శుక్లపటుడు[బహుజీవవాదియు]ను ప్రవేశింతురు.

సన్యాసి:- ఓరోరీ ! దుర్మార్గుడా ! శంకర శిష్యుడవయ్యును జందెమువలె నీ కుత్తెను బంధించు నీ భేదవాసనా పిశాచమును వీడువకున్నావేమిరా?

శుక్లపటుడు:- (కోపముతో) ఓరీ ఆత్మజ్ఞాన విహీనుడా ! ప్రచ్ఛన్న బౌద్ధసన్యాసీ! సకల మర్మముల నెరింగిన నాకు గూడ కోపమును దెప్పించుచున్నావా? దిగంబరి నలంకరించునట్లు సుతరా మవైదికమగు నీ సిద్ధాంతమును బంధ మోక్షాది నిబంధనలను బోధించు వేదవాక్యములతో నలంకరించు నిమిత్తమై యేదో యొక విధముగ రెల్లునో దర్భనో యాధారముగ జేసుకొని మోక్షదశలో జీవులనేకు లగుటను కల్పించుచున్నాను. దానిని కూడ నీవు సహింపజాలవా?

సన్యాసి:- [కోపముతో దంతములను కొరుకుచు]

పాడు తర్కములతో వాదించు నీ పాండిత్యమును నేనెట్లు సహింతురా? ఓరీ ! చెప్పుము. పతివ్రతవలె బ్రహ్మనే యాశ్రయించి యేకపత్నీవ్రతము నాచరించు నీ యవిద్య యెందఱు జీవ చండాలుల నాలింగనము గావించునో చెప్పుము.

శుక్ల:- అయినచో నవిద్య యజ్ఞాన రూపమైనది గదా! ఇది జ్ఞానరూపమైన బ్రహ్మను పిలకబుచ్చుకొని యెట్లు బజాయించునో నీవు చెప్పుము చూతుము.

సన్యా:- [కోపాటోపముతో వాని పిలకను జందెమును పట్టుకొని] ఒరే! జీవభేదమనెడు యగాధమున బడి నోటికి వచ్చినట్లు ప్రేలెదు నీ పండ్లను విరుగ గొట్టెదను. [అని దండము నెత్తును.]

శుక్ల:- [కోపముతో జూచుచు] సర్వాశ్రమ భ్రష్టుడు. వీని నెట్లు పట్టుకొందును? వీనికి పిలకయును లేదు. జందెమును లేదు. గుడ్డ మొదలే సున్న. ఇంక దేనిని పట్టుకొందును? ఈ పతితుని మెడబట్టి పడద్రొబ్బుదును. [అని హఠాత్తుగా మెడను బట్టుకొని, ముందునకు జూచి భయముతో] అయ్యో! ఎట్లు? రాజిట్లే వచ్చుచున్నాడే. ఇట్లు పారిపోవుదును. [అని ఆ సన్యాసి గోలబెట్టుచుండగనే వానిని యీడ్చుకొని పోవును.]

[రాజు సుమతితో సరస సల్లాపము లాడుచుండ కోపముతో రామానుజుల నన్వేషించుచు శంకరునితో మాయాకాది ప్రవేశించుచు తెర లోనుండి గర్జించును.]

శంకరుడు:- ఓరోరీ! రాజుకుల పాంసులారా! లోకమున ననేకమందిచే హెచ్చుగ నాదరింపబడిన ద్వైత సిద్ధాంత విజ్ఞాన గర్విష్ఠు లితరు

తెలిసికో యుండనేయున్నారు. కాని యద్వైత సిద్ధాంతమనెడు మహావృక్షము గాలి సోకినంతనే భయభ్రాంతి చిత్తులగు వారితో మాకేమి పని? ఇక శాస్త్రవ్యాఖ్యాతులనెడు ప్రతియోధులయొక్క సిద్ధాంతములనెడు ప్రాణములనెల్ల హానము జేయు శంకరుడ నిదిగో వచ్చియున్నాను. మీ రామానుజు డెచ్చట నున్నాడో చెప్పుడు. [శ్లో] అని రంగమున ప్రవేశించును.]

[ఇంతలో రామానుజులు సునీతి సుదూహుడు ప్రవేశింతురు.]

శంక:- ఎవడురా! రామానుజుడు?

సదూ:- నేను వారి శిష్యుడనే

శంక:- వాడెవడో తెలియగోరుచున్నాను

సదూ:- వాదములకు బాహ్యుడను నేనుండగా మా గురువుజాడ నీకేల? ముల్లెచ్చట నైనను చెప్పను. (గుచ్చుకొనక పాదమును గుచ్చుకొనునా?

శంక:- (నిర్లక్ష్యముగా మఱియొక వైపునకు జూచును.)

సదూ:- [కోపముతో] ఓరీ జాల్మూడా! నన్నేల లక్ష్యపెట్టవు? అరే! [నేనెవరో యెఱుంగుదువా?]

సప్తద్వీప ముద్రితమగు నీ భూమండలమున కేకైక దీప జ్యోతియై వెలుంగువాడ. సకల మనుజ విజ్ఞానము నాచ్ఛాదింప సమకట్టిన మాయా సిద్ధాంతమనెడు పెంద బొంతలనైన నొక్క క్షణములో కత్తిరించి పారవేయు నేర్పు గల కత్తిరనైనవాడ. మదించు తిరుగు నీవంటి దుర్వాదుల వాదమడగించుటను యజ్ఞ దీక్షగా నవలంభించినవాడ. శ్రీరామానుజుల సభలో తంత్రిపాలోద్యోగమునను న్న సప్తవ్యూహములు [ఏడు సైనిక దళములు - శ్రీరామానుజులు సాధించిన నేడు ప్రబాధములు] గల సదూహుడను నీకంటికి గాన్పించుట లేదా! [శ్లో]

శంక:- [కోపముతో తిరిగి చూచుచు] వాడెకేమి? శంకరుడనకువలె నాకును నీవంటి దురాత్ముల నీక్షించుటకు తేజః పుంజమనదగు మూడవకన్ను కలదు గదా!

సదూ:- [గట్టిగనవ్వి] ఆ నీకన్ను శిశుపాలుని కన్నువలె మా రామానుజుని దరిజేరిన చట్టున చల్లారును.

శంక:- అదిగో! అట్టివానినే చూడగోరియు గాంచకున్నాను.

మాయా:- వత్సా! దీపమును చేబూనియు గోతిని గాంచజాలవా? నేనే నీకు తెలుపుదును. వీడు దురూహుడు. మేము వీనిని వేదమౌళిచెంత నుండి వెళ్ళగొట్టిన పిమ్మట యిప్పటికి సదూహుడయ్యెను. ఇది సుమతి చెలికత్తెయగు సునీతి నా కూతురగు మిథ్యాదృష్టి దీనిని దుర్నీతి యని వెడలగొట్టినది. మహారాజును బ్రతికియుండగనే యేనుగునువలె నంధికూపమున కూలద్రోసిన మిత్రుని వేషముతోనున్న శత్రువగు యా మునుడు వీడే. బిడ్డా! ఇక మిగిలినవాడు నీకిప్పుడు కావలసిన రామానుజుడేయని నమ్ముము.

శంక:- [బాగుగ జూచి తనలో] ఆహా! గంగానదిలోని నీరు తనలో నున్న నిర్మల రత్నమును వలె యీతని యాకారమే లోకాతీతమగు నీతని మహిమను సాటుచున్నది. ఇదియొక యాశ్చర్యకరమైన తేజఃపుంజము. పరులు దీని

నెదుర్కొనుట దుస్సాహసమే. [శ్లో]

[పైకి రోషముతో గుర్రు త్రిప్పుచు] ఆహా! చాలకాలము నుండి ప్రార్థించుచున్న మహా సర్పము నేటికి గరుడుని కంటబడినది.

సదా:- ఔను నిజమే.

మాయా:- [కోపముతో నీతనిని జూచును]

శంక:- వీడిప్పుడు ప్రళయకాలయమంతుబుట్టిన సముద్రతరంగ పరంపరల యాటోపము ననుకరించు నాయుక్తిపరంపరలతో క్షోభిల్లు వాయు మండలిచే నెగురగొట్టబడిన క్రొందూదివలె చిందరవందరమై యెగిరిపోవును. [శ్లో]

మాయా:- (రామానుజులతో) మూర్ఖాగ్రేసరా! నా పదవి నధిరోహించి మహారాజు యొక్క సుకుమార హృదయమును మోసగించి సంశప్తకులవలె నేను నీయెదుట నిలచియున్నను నీ బుద్ధిని నీతినై పుణ్యమును జూపవేల?

సదా:- (కోపముతో) బాగుబాగు. నీవు సంశప్తకుడవేకమ్మ. రామానుజుల శిష్యుడనగు నేను మాత్రమర్జునుడ నేలగాను?

యామ:- ఈ మాయతీంద్రులు తర్కయుక్తి కుశలులైనచో వారితో మీరసముగా వాదించి వారినెల్లర మరలింపరా?

గజఘటములతో డీకొను పంచాస్య మెదుట నున్నను కుక్కల గుంపుపై కురుకునా?

శంక:- [కోపాటోపముతో] ఓహో! ఏమంటివి? నాకంటెను వాదమర్యాదాభిజ్ఞుడును పండిత ప్రవరు డొకడు కలడా?

యతి:- [యామునుల ముఖమును జూచి నవ్వును]

యాము:- ప్రతివాదును తనను తానే పొగడుకొనును.

యతి:- పూజ్యా! శంకరుని మాత్రమిట్లను కొనకుడు. ఈతడు మతాంతర కలహములలో తనను తాజూచుకొనకయే యుండును.

సదా:- (నవ్వి) అయినచో తనదెబ్బ తనకే తగులుట గూడ నీత డెఱుంగడన్నమాట.

రాజు:- [నవ్వి] అయిన తన రక్షణ నుపేక్షించి శత్రువీరుల సంహరింప సమకట్టిన యోధునివలె నీతడు నశించును.

సదా:- సర్వము మిథ్యయనువానికి మొదట తన మాటయే మిథ్య యగును గాన శత్రువు దెబ్బతినకయే గెలుపొందును.

మాయా:- [నవ్వి] సమస్తమును ఖండించువానికి తన మాటయు ఖండింపదగినదియే గాన, నా పనికి పూనుకొనుటచే నా ఖండించు యుక్తులచేతనే నిదియు ఖండింప బడుట యిష్టమే యగును.

సునీ:- [నవ్వుచు] అయినచో వాదమునకు ఫలము గెలుపువలె నోటమియు ఫలమగు నన్నమాట!

సదా:- [పెద్దనవ్వునవ్వి] యుద్ధమును జేయు వీరునకు శత్రువు తన చేతనున్న కత్తిని లాగుకొని దానితో తన తలను నరుకుటయు యిష్టమే యగునా?

మాయా:- ఓరీ! వదరుపోతు దురభిమానీ! నేనెదురుగ నుండగనే కుయుక్తులనెడు నెరుసులను గ్రక్కుచున్నావా? చూడుము! నే నొక బ్రహ్మాస్త్రమును చేబూని యుద్ధమున విహరిం

చుచు ప్రపంచమునంతను తుష్టియులు గావిం తును. నా పాండిత్యమును గాంచుడు.

శ్లో॥ యస్మిన్ విశ్వమశేషమేత త్త్రిభువన
మఖిలం యచ్ఛ పశ్యత్యవిద్యాం
ముగ్ధం స్వాత్మాశ్రయమేత త్తదపి
నిజవపుర్వీక్షణే ముచ్యతే యః
జ్ఞానం జ్ఞేయాదిహీనం భవతి చ యత
పదం సంవిదాం నిర్విశేషం
సత్యం తద్బ్రహ్మ మిథ్యా త్వదితర
దఖిలం కో౽న్యథా వక్తు మీశః

సమస్తమగు నీ లోకత్రయమును యెవ్వని యందు కల్పింపబడెనో, యెవ్వడు మాయచే నాచ్ఛాదింపబడి స్వస్వరూపమును గానక తన యందు కల్పితమగు నీ సంసారమును గాంచునో యెవ్వడధిష్ఠానమగు తన నిజస్వరూపమును గాంచుటచే యీ మాయాబంధము నుండి విముక్తుడగునో యెవ్వడు జ్ఞానస్వరూపుడై జ్ఞేయములగు ధర్మము లొక్కటియు లేనివాడో, యెవ్వడెట్టి జ్ఞానమునకును విషయభూతుడు కాడో, యెవ్వడు సజాతీయ విజాతీయ స్వగతభేద విరహితుడో యట్టి బ్రహ్మయొక్కడే సత్యము. మిగిలినదంతయు మిథ్యయే. ఈ సిద్ధాంతమును కాదను సమర్థుడెవ్వడు?

[అని గర్వముతో తన భుజమునుతట్టుకొనును]

[యతిరాజు చిరునగవుతో సదూహుని ముఖమును జూచును]

సదూ:- [ఆటోపముతో భుజమును తట్టుకొనుచు] నేను రా సమర్థుడను !

భిన్నభిన్న ఆకారముల నంగీకరించి సాధింప దగినదిదియంతయు బ్రహ్మనిర్విశేషమని వాదించను నీ కెట్లు పొసగును.

అదియును గాక

శ్లో॥ నాధ్యాస స్స్వప్రకాశే తిమిర మివ రవౌ
జ్ఞానబాధ్యా చ మాయా
న బ్రహ్మ జ్ఞానరూపం స్థగయతి
న తతో బన్ధమోక్షౌ చ తస్య
న జ్ఞానం జ్ఞేయహీనం న
స దమతిపదం నిర్విశేషం న కిఞ్చిత్
సత్యం స్యాన్మానసిద్ధం జగదపి
న యది స్యాత్క్రియాబాధాదయ స్స్యుః॥

చీకటి సూర్యుని యావరింప జాలనట్లే స్వప్రకాశ స్వరూపుడగు పరబ్రహ్మయందు మాయ ప్రపంచాధ్యాసను ఘటింపజేయనేరదు. [అధిష్ఠాన స్వరూపము వాస్తవముగ గోచరించనప్పుడే అధ్యాసఘటించును. స్వయంప్రకాశమగు బ్రహ్మ యధిష్ఠానమగుచో నాతడెప్పుడును స్వస్వరూపముతో ప్రకాశించుచునే యుండును గాన నచ్చట యధ్యాస ఘటింపదు.]

బ్రహ్మజ్ఞాన స్వరూపునకు మాయ జ్ఞానబాధ్యము. అట్టితరి నత్యంత విశుద్ధములగు నీ రెంటికిని యావరించుటయు నావరింపబడుటయు నెట్లు సమకూడును?, కావున బ్రహ్మకు బంధము గాని మోక్షము గాని సున్న., జ్ఞేయములేని జ్ఞానముండదు. జ్ఞానవిషయము కాని [తెలియబడని] సత్పదార్థముండదు. నిర్విశేషమగు [సజాతీయ విజాతీయ స్వగత భేదములు లేని] సత్యవస్తువే సంసారమునందు మృగ్యము. [సత్యమైన వస్తువెల్లప్పుడును సవిశేషమే. ప్రమాణసిద్ధమైన

జగత్తే లేదన్నచో నీమాటయు ప్రమాణ సిద్ధమనుచున్నావు గాన [కానిచో దేనిని సాధింప లేవు గదా] నిజమే నీకు బాధకమగును ఇట్లెన్నియో దోషములు నీవాదము నంటియున్నవి.

మరియు-

శ్లో॥ ప్రత్యక్షప్రభృతిప్రమాణవిదితం
సత్యం చ భిన్నం జగత్
బాధ స్తస్య న కేనచిత్ స్వవిహతే
ర్బ్రహ్మాత్మకం త జ్జగత్
ద్వైతాద్వైతగిరో విభిన్నవిషయా
బాధాయ నాలం మిథః
పశ్వాలమ్భనిషేధవాక్యవ
దతో విశ్వాపలాపః కుతః॥

ప్రత్యక్షాది ప్రమాణములచే దెలియబడు ప్రపంచమంతయు సత్యమే. ఇయ్యది ఆత్మ పరమాత్మలకంటె వేరైనది. దాని నేదియు బాధింప జాలదు. అట్లు బాధించునెడల [ఒక ప్రమాణము తనకు సజాతీయమైనట్టి గాని విజాతీయమైనట్టిగాని ప్రమాణాంతరముచే బాధింపబడిన యెడల] ప్రమాణములు తమలో తామే బాధించుకొనవలసి యుండును. [అట్లగుచో నేమర్థమును సిద్ధించనేరదు గదా!] ఆ ప్రపంచము పరమాత్మయే యాత్మగా కలిగి యుండును. భేదశ్రుతులకును అభేదశ్రుతులకును విషయభేదముండుటచే వాటికి పరస్పర విరోధము లేదు గాన నొకదాని నొకటి బాధింపనేరవు. అట్లగుచో 'నహింస్యాత్సర్వాభూతాని' యను శ్రుతి, 'వాయవ్యం శ్వేత మాలభేతభూతి కామః' యను శ్రుతిని బాధించవలసియే యుండును. అట్లు బాధింపబడిన నా వాక్యము బాధితార్థ బోధకమగుటచే మిథ్యయే యగును. కావున ప్రపంచము మిథ్యయనుట దుస్సాహసము.

సునీతి:- ఏమి స్థానముల యందును లెస్సగా నోహాద్ఘాటన చేయజాలినది.

సుమతి:- [నవ్వుచు] అయిన నీవితో మహారాజునకు మాయావాదిశిరోమణి నా ప్రసదీనమునకు [స్నేహమునకు] స్వస్తిని చెప్పినట్లు.

మాయా:- [శంకరునితో రహస్యముగా] దుర్మార్గుడగు నీ డింభకుడు తగినట్లు సమాధానము జెప్పుచున్నాడు. ఔను నిజమే మరి నిషేధము విధి నెన్నటికిని బాధింపనేరదు.

ఇంకేమి చేయుదుము.

[ఇంతలో శిక్షకులగు పరాఙ్కుశులు విచ్చేయుదురు].

యతి:- పూజ్యా! పరాంకుశా! నిరంకుశముగ సంచరించు వీరిని వెడల గొట్టుడు.

పర:- వీరిరువురికును శిక్షయేమి?

యతి:- దుర్బ్రాహ్మణులకు శిఖాయజ్ఞోపవీతములు ఖండించుటయే శిక్ష. ప్రపంచ చోరులగు వీరిరువురకు నా శిక్ష నిదివరకే భగవంతుడు ప్రసాదించెను. శరీరమును విడిచిన పిమ్మట నను గూడ నిట్టి యతుల నా యింద్రుడు తోడేళ్ళకెర గావించును.

శంక:- పూజ్యుడవగు నో పరాంకుశా! మహాద్వైత పక్షపాతీ! నీవు విష్ణు భక్తుడవు. నేనును భావనా ప్రకర్షచే జీవన్ముక్తుడనై విష్ణువునే యైతిని. కావున నన్ను హింసింప రాదు సుమా!

# ప్రచార విభాగము.

## శ్రీయతిరాజ సేవామహిళామండలి (మదరాసు శాఖ)

## తిరువాడిప్పూరం ఆండాళ్ల ఉత్సవం

ఈనగరమున మూడు సంవత్సరములనుండియు సత్సంప్రదాయ పరిజ్ఞాతయు, చిరోపాసిత జ్ఞానవృద్ధయు, సదాచారసంపన్నయునగు శ్రీమతి పువ్వాడ మంగమ్మగారు ఇచ్చుటి 107 వరదా ముత్తియప్పన్ వీధిలో వేంచేసియున్న శ్రీ ఉడయవరుల కోవెలకు ఎదురుగానున్న సుధానిధిలో పై మండలి యాజమాన్యమున "తిరువాడిప్పూరం" అనెడు ఆండాళ్ళ ఉత్సవమును తిరునక్షత్రముతో చాత్తుమర అగునట్లు 10 దినములు కనులపండువుగా జరుపుచున్నారు. క్రమక్రమముగ ఉత్సవ మతిశయించుటచేతను స్థలము సంకుచితమగుటచేతను యీసంవత్సరం గీతామందిరమున యీఉత్సవము జరుపదలంచియు అనివార్యముగా శ్రీ ఉప్పుటూరువారి రామానుజకూటమున బ్రహ్మాండముగా జరుపబడినది.

ఈఉత్సవము 16_7-52 తేదీ మొదలు 30-7-52 వ తేదీవరకు ప్రతిదినం మధ్యాహ్నము గం 3_0 లు మొదలు సాయంకాలం గం 8-0 ల వరకు వేలకొలది స్త్రీలసమావేశముతో జరుపబడినది.

ఇందు 17_7_52 వ తేదీని శ్రీ గోదాదేవి అవతార మహోత్సవమున్ను
21-7-52 వ తేదీని ముత్తుకురి ఉత్సవమున్ను
26-7-52 వ తేదీని తిరుమంజన, తిరుక్కల్యాణ మహోత్సవమున్ను
27_7_52 వ తేదీని శీర్ పాడల్ ఉత్సవమున్ను
28,29,30 వ తేదీలలో యడాయత్తు ఉత్సవమున్ను
31-7_52 వ తేదీని గీతామందిరములో జరుపబడిన "పెరియాళ్వారుల విందు"న్ను
సేవించదగిన ప్రధానోత్సవములు.

ఈ పెరియాళ్వారులు విందు ఉత్సవమునాడు గం 4-0 లకు శ్రీ ఉప్పుటూరువారి రామానుజకూటమున మేళతాలములతో విమానములో పెరుమాళ్ళు వేంచేయుచుండగా వెనుక వందల

దర్శించు నాశలో పెక్కురు మతాభిమానులు విచ్చేయుటచే ఉత్సవము ద్విగుణీకృత వైభవముతో నలరారెను.

అచ్చట కార్యనిర్వాహక ధురంధరులగు శ్రీ కొ. వెంకటప్పదాసుగారి ఆదరసన్మానము లకు ఈడుపడిన భాగవత బృందమునకు చివరకు ఆ యాశ్రమమును విడిచివచ్చుట చేపునకు విడిచిన అవుదూడను రాటకు చేర్చి కట్టినంత శ్రమకరమైనది.

ఆ మూడు దినములలో ఉదయము పరమవైదికముగా భాగవత బృందముచే శ్రావ్యముగా తిరుహాయ్ మొళ్ళి సేవ గావింపబడెను. అచ్చట అర్చనా విధానమును గావించుచున్న కైంకర్య నిధులగు శ్రీమాన్ కొ. వెంకటాచార్యులుగారి శ్రద్ధాభక్తులు ప్రశంసనీయములు. చివర దినము రాత్రి ఆ యాశ్రమవాసులు సన్మయావస్థలో భజన గావించి వారికి శ్రీ వాసుదాసుగారియందున్న శ్రీ భాగవత బృందమునందును గల భక్తిని మూర్తీభవింపజేసిరి. స్వాములు ఆదరసన్మానము లతో వీడ్కొల్పబడిరి.

మన సంఘ కార్యదర్శిగారగు శ్రీ ఉ. వే. శ్రీమాన్ ఆ. చి. శ్రీమన్నారాయణాచార్యులు గారు విశ్రాంతి ఆనుషంగికముగను, ఆశ్రమ సంస్కరణము ప్రధానోద్దేశముగను సుమారు 3 మాసములు అచ్చటనే యుండ నిశ్చయించుకొనిరి. వారచ్చట అచిరకాలములో తిరుమంత్రాది కాలక్షేపముగూడ సుబోధకముగా కొద్దికొద్దిగా సాయించుదురు. ఆసక్తిగలవారం దన్వయించి సదవకాశమును సద్వినియోగ పరచుకొందురు గాక.

★

## ★ విజ్ఞప్తి ★

శ్రీ భాష్యరచనకు మూలాధారమై యొప్పు "సిద్ధిత్రయమును" శ్రీ ఆళ్వందారు సాయించిరి. అది వ్యాఖ్యాన సాపేక్షిత గ్రంథమగుటచే పాఠప్రవచనలో లేదు. దాని కింతవరకు మంచి వ్యాఖ్యానమును సమగ్రముగా రచించిన వారేలేరు. కాని దైవవశమున యీ మధ్య శ్రీపెరుంబూధూరులో వేంచేసియున్న శ్రీ ఉ. వే. శ్రీమాన్ అనూరి రామానుజాచార్య స్వామి వారి ప్రియశిష్యులగు న్యాయవ్యాకరణ వేదాంత శిరోమణులైన శ్రీ ఉ. వే. శ్రీమాన్ ప్ర. భ. అణ్ణంగరాచార్యులవారు "సిద్ధాంజన" మనుపేరుతో రచించిన సమగ్రమగు చక్కని వ్యాఖ్యాన మొకటి కార్యాలయమున కందజేయబడినది. అది పరిశోధనకై పండిత పరిషత్తున కందజేయబడినది. మతాభిమానులగు ధనాఢ్యుల ఆర్థికసహాయముతో నది త్వరలో ముద్రింపబడవలసియున్నది. అట్టి ఆదరముగల ఉదారులు ద్రవ్యసహాయము చేయుదురు గాక యని ప్రార్థించుచున్నాము.

మ రి యు

బ్రాహ్మణ్యాపాదకమగు ప్రధాన నిత్యకర్మగా జరగు సంధ్యావందనమునకు మన సంప్రదాయానుసారముగ వ్యాఖ్యానము లేదనెడు చింత చాలకాలము నుండి బాధించుచున్నది. కాని యీ మధ్య నెల్లూరు వాస్తవ్యులగు శ్రీ ఉ. వే శ్రీమాన్ శ్రీమత్తిరుమల నల్లాన్ చక్రవర్తుల తిరువేఙ్కటాచార్యుల అయ్యవార్లంగారు శ్రీ పవిత్రప్రకాశకాచార్యులను శ్రీవరదాచార్యులను అపర నామధేయముగల శ్రీ సుదర్శన సూరులచే రచింపబడిన ప్రాచీన సంధ్యాభాష్యమును కార్యాలయమున కందజేసిరి. అదియు ముద్రింపబడవలసిన అత్యంతావశ్యకత గలిగియున్నది. ఉదారుల ద్రవ్య సహాయమునకై నిరీక్షించుచున్నాము.

---

## శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘముయొక్క పాలకొల్లులోని స్త్రీ శాఖ యగు

# శ్రీ యతిరాజ సేవా మహిళా మండలి

పాలకొల్లులో శ్రీ అష్టభుజ లక్ష్మీనారాయణ స్వామివారి దేవస్థానమున కనుమూరి రంగనాయకమ్మ గారి అధ్యక్షతను ది 23_7_52 తేదీ నుండిమూడు దినములు తన శాఖా వార్షికోత్సవమును చాల వైభవముగ జరిపిరి. అనేకమంది పండితులు విదుషీమణులు వేదాంత విషయముల ఉపన్యసించిరి.

అధ్యక్షురాలు:_ సచ్ఛిష్యలక్షణము; పిళ్లైయరంగావిల్లు దాస చరిత్ర.

| | |
|---|---|
| శ్రీ ఉ. వే. శ్రీమాన్ శ్రీ త్రి. పు. ధర్మాచార్యులుగారు | రామానుజ వైభవము |
| ,, ,, ,, ఆరవిల్లి అళహశింగరాచార్యులుగారు | ఆచార్య వైభవము.<br>భాగవత వైభవము. |
| ,, ,, ,, గో. వెం. శేషభట్టరాచార్యులుగారు | పురుషకార వైభవము. |
| ,, ,, ,, ము. కృష్ణమాచార్యులుగారు | సౌందర్య మంతరాయము<br>ఆండాళు వైభవము. |
| ,, ,, ,, బెల్లంకొండ రాఘవాచార్యులుగారు | ఆచార్య వైభవం,<br>తిరుప్పారుపారం. |
| ,, ,, ,, ఆరవిల్లి శ్రీరంగాచార్యులుగారు | ఆండాళు వైభవం. |

మున్నగు విషయముల ఉపన్యసించిరి. వందలకొలది భక్తజనమిందు పాల్గొని ఆనందించిరి. నూతన కార్యకారిణి సమితి ఎన్నికలు జరిగినవి.

# శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘ శాఖ యతిరాజ సేవా మహిళా సంస్థ

## పాలకొల్లుశాఖ కార్యకారిణీ సమితి సభ్యులు

అధ్యక్షులు: సలాది ఆండాళమ్మగారు
ఉపాధ్యక్షురాలు: మాచేపల్లి రత్నమాణిక్యంగారు
కోశాధికారి: మోటమఱ్ఱి అప్పలనరసమ్మగారు
కార్యదర్శి: కనుమూరి రంగనాయకమ్మగారు
సహాయకార్యదర్శి: శిరం అంబిరాజుగారు

### కార్యకారిణీ సభ్యురాండ్రు

చెక్కా తాయారుగారు
చెక్కా అనసూయగారు
కాదుమూరి వనమరాజుగారు
మాచేపల్లి కస్తూరిగారు
సలాది రామలక్ష్మమ్మగారు
బంగారు సత్యవతిగారు
రేపాక సీతారత్నంగారు
బంగారు రత్తమ్మగారు
జూపూడి శకుంతలమ్మగారు
కంచర్ల విజయమ్మగారు
తుమ్మలపల్లి సుభద్రమ్మగారు

### ఉత్సవ జమ ఖర్చులు

#### జమలు

| | |
|---|---|
| భక్తుల వలన వసూలైన చందాలు | 123- 0-9 |
| క్రిందటి సంవత్సరం నిల్వ | 69-15-9 |
| డిబ్బీవల్ల వసూలు | 14- 0-3 |
| | 207-0-9 |

#### ఖర్చులు

| | |
|---|---|
| మా[illegible]లు భోగములకు | 41- 0-0 |
| పండితులకు శాలువలకు | 20- 0-0 |
| పండితులకు సన్మానములు | 22- 8-0 |
| [illegible] | 4- 4-0 |
| ప్రయాణ ఖర్చులు | 0-10-0 |
| సాపాట్లు | 1- 8-0 |
| విదుషీమణికి బట్టలు | 7- 1-3 |
| చిల్లర ఖర్చులు | 2-13-0 |
| సంఘ సంభావనకై | 5- 0-0 |
| | 104-12-3 |

రాబడిలో ఖర్చులు పోగా మిగత నిల్వ రూ 102-5-6 మండలి అధ్యక్షురాలగు శ్రీమతి సలాది ఆండాళమ్మ గారివద్ద ఉంచడమైనది.

---

శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘ మదరాసు శాఖా కార్యదర్శులైన శ్రీమాన్ కరాలపాటి రాధాకృష్ణయ్యగారు శ్రీవిష్ణుసహస్రనామమును సూచించు ఒక్కొక్క చిత్రముగా వ్రాయించ దలంచుచున్నారు. ఆ చిత్రమును చూచిన తోడనే ఆనామార్థము హృదయారూఢము కావలెను. అట్టి చిత్ర సూచనలు బుద్ధిమంతులు యథామతి కార్యాలయమునకు తెలుపుదురు గాక. ఎవరికేనామమున కేచిత్రము స్ఫురించిన దానిని మాత్రమైనను తెలుపవచ్చును.

రిజిష్టరు నెం. 5049

# భక్తినివేదన

(వేదాంత మాసపత్రిక)

ఇందు వేదాంత విషయ రాజములున్ను; భక్తప్రచార విషయమైన వార్తలున్ను వేదాంత సాంప్రదాయ విషయకమైన ప్రశ్నోత్తరములున్ను ప్రచురించబడును.

చందాలు:

సాధారణ చందా సం. ర 1కి॥ రు 5-0-0.

సహాయ చందా ,, రు. 10-0-0.

To

శ్రీ శ్రీ శ్రీ గారికి:

**Book-Post**

Sri Paravastu Ramanujacharyulu garu,
Director Sri Venkateswara Oriental Institution
THIRUPATHI, Chittur Dt.

1. శ్రీమన్నారాయణుడే సృష్టి - స్థితి లయ - కారకుడు.
2. ఆయనే మోక్షప్రదాత.
3. ఆయనే పరతత్త్వము-పరమాత్మ
4. ఆయన అఖిలహేయ ప్రత్యనీక కల్యాణ గుణకుడు.
5. ఆయనకు జీవుడు శరీరభూతుడు; శేషభూతుడు, పరతంత్రుడు, నియామ్యుడు, అనుభావ్యుడు.
6. జీవులు జ్ఞానైకాకారులు.
7. జీవులు అనంతములు.
8. జీవులు పరమాత్మకంటె భిన్నులు; ఈ భేదము సత్యమైనది; నిత్యమైనది.
9. జీవ-పరమాత్మలకు ప్రకృతి శరీరభూతమైనది; శేషభూతమైనది; పరతంత్రమైనది; నియామ్యమైనది; అనుభావ్యమైనది.
10. ప్రకృతి వికారాస్పదమైనది. జీవపరమాత్మలకంటె భిన్నమైనది, ఈ భేదము సత్యమైనది; నిత్యమైనది.
11. జీవుడు ప్రకృతి వియుక్తుడై పునరావృత్తిరహితమైన పరమాత్మ సాన్నిధ్యమగు పరమ పదమును పొందుటయే మోక్షము.
12. భక్తి ఒక్కటియే మోక్షసాధనము.
13. భక్తియన తైలధారవత్ అవిచ్ఛిన్నమైన స్మృతి పరంపర.
14. వివేక-విమోక-అభ్యాస-క్రియా- కల్యాణ అనవసాద-అనుద్ధర్షలు భక్తికంగములు.
15. ఇవి సదాచార్య-సమాశ్రయణ-లభ్యములు
16. జగద్గురువగు శ్రీరామానుజాచార్యులు వారును; వారి యనుయాయులున్ను సదాచార్యులు.

"నగురుర్వైష్ణవాత్ పరః" భా. సం.

Edited Published & Printed by A. Ch, Srimannarayanacharya at Sriman Press, Kakinada.

శ్రీమతే రామానుజాయనమః

# భక్తి
# నివేదన

వేదాంత మాసపత్రిక

సంపుటి ౪ | నందన-భాద్రపదమాసం | సంచిక ౬.

## సగుణ నిర్గుణ శృతులు

కె. జి. కృష్ణమాచార్యులు పండిట్,
గుంటూరు.

శ్లో॥ నిర్గుణ శృతిభిః కేచిద్బాధన్తే సగుణ శృతీః ।
తాసామన్యోన్య సౌహార్ద మాహుర్యతి వరాశ్రయాః ॥

ఉపనిషత్తులలో బ్రహ్మస్వరూపమును గూర్చి సగుణ నిర్గుణ వాదములు సుప్రసిద్ధములు. 1. యస్సర్వజ్ఞస్సర్వవిత్ 2, పరాస్యశక్తిర్వివిధైవ శ్రూయతే స్వాభావికీ జ్ఞానబలక్రియాచ 3. సత్యకామ స్సత్యసంకల్పః 4. బ్రహ్మణా విపశ్చితా—ఇత్యాద్యనేక వాక్యములు గుణనిరూపకములు గలవు.

ఇట్లే 1. నిర్గుణం నిరంజనం నిష్క్రియం శాంతం. 2. అపహతపాప్మావిజరః 3. యత్తదద్రేశ్య మగ్రాహ్య మగోత్ర మచక్షుశ్శ్రోత్రం తదపాణిపాదం 4. అస్థూలమనణు, ఇత్యాది నిర్గుణ వాక్యములును గలవు.

వేదాంతశాస్త్ర ప్రతిపాద్యమగు బ్రహ్మ స్వరూపము సగుణ నిర్గుణ భేదమున ద్వివిధమా? అని శంక. వేదాంతరాద్ధాంతములయందు ఒక్క అద్వైత ప్రస్థానమే సగుణ నిర్గుణ బ్రహ్మములకు భేదము నంగీకరించుచున్నది. శ్రుతి స్మృత్యుదాహరణ పూర్వకముగా నీ యర్థమును ద్వైతాచార్యులు సమర్థించుచున్నారు. ఈ భేదము నంగీకరించియే సద్విద్యానంద మయోభయలింగ కార్యాధికరణములకు శంకరాచార్యుల వారు భాష్యమును రచించియున్నారు. సద్విద్యయందు సత్పదార్థము నిర్గుణతత్వము బహుభవన సంకల్పోత్తర కాలమున స్వగత నానాత్వ మంగీకరించుట వలన శుద్ధచైతన్యము ఈశ్వర భావమునందు బద్ధమగుచున్నది. దృగ్దృశ్య వివేకరహిత

మగు శుద్ధచైతన్యముదృష్టప్రపృక్త్యరూపమునందు చున్నది.

ఇట్లే ఆనందమయాధికరణమునను ఆనంద మయత్వము సగుణము. ఆనందమయ మనగా ప్రాచుర్యార్థమును గ్రహించినచో నల్పదుఃఖ విశిష్టుని శాంకరపక్షము.

"అపిచ ఆనందప్రచుర ఇత్యుక్తే దుఃఖాస్తిత్వమపి గమ్యతె" ప్రాచుర్యస్యలోకే ప్రతియోగ్యల్పత్వాపేక్షత్వాత్ [1-6-11] ఆనంద మయాధికరణె [శం. భా.]

ఉభయలింగాదికరణమునను ఈశ్వరతత్వము సగుణమనియు, శుద్ధచైతన్యముపరమార్థమనియు సూచించియున్నారు. కార్యబ్రహ్మ ముపాసనార్థ మనియు, నిది ఈశ్వరశబ్దవాచ్యమనియు, శుద్ధ బ్రహ్మస్వరూపము పరమార్థమనియును వక్కాణించియున్నారు.

ఇట్టి బ్రహ్మ ద్వయవాదమును రామాను జీయులంగీకరింపరు. ఇతర వేదాంతులలో భేదా భేదవాదులగు భాస్కరీయులీ వాదమును నిర సించియున్నారు. పరిణామవాదులగు యాదవీయులు నీ వాదమును దూషించియున్నారు.

భగవద్రామానుజాచార్యులవారు భేదాభేద వాదులను కటాక్షించుటకు కారణమేమన శ్రీ వారిపలెనే వారునూ నిర్గుణవాదమును నిరసించి యుండుటయే.

యతిరాజ సిద్ధాంతమున నామరూప విభాగానర్హమగు సూక్ష్మ చిదచిద్విశిష్ట తత్వము సృష్టికి పూర్వము ఏకమును అద్వితీయమునై యుండెను. అప్పుడిది అవిభక్తనామరూపము, సృష్ట్యుత్తర కాలమున భోక్తృ భోగ్యరూపమగు ప్రపంచపరిణామమునంది యిది వ్యాకృత నామ రూపమయ్యెను. ఇట్టి సందర్భమున బ్రహ్మమే అవిద్యాభిభూతమై స్వగత నానాత్వము ననుభ వించుచున్నదనియు, ఈ అవిద్య అనాదియు, సదసదనిర్వచనీయమనియు వాదించు ఈ తాంత రముల సయుక్తికముగా నిరసించి సమస్త దోష ములకును చిదచిత్తులే ఆశ్రయ భూతములనియు, చిదచిచ్ఛరీర విశిష్టమగు పరమాత్మ తత్వము సృష్టికి పూర్వోత్తర కాలములందును సదా దోషరహితమును, కళ్యాణ గుణాకరమనియు, స్థాపించియున్నారు. సగుణ శ్రుతులు కళ్యాణ గుణములను స్థాపించును. నిర్గుణ వాక్యములు హేయగుణ సంబంధమును నిరాకరించును. కావున శ్రుతులకు పరస్పర విరోధము లేదు. శ్రుతులన్నియును ప్రమాణ భూతములే. ఇట్టి శుద్ధతత్వమగు శ్రీనివాసుడే ముముక్షూపా స్యుడు అని భగవద్రామానుజ సిద్ధాంతసారము. నిర్గుణవస్తువు తెలియరాదు. ఇది సర్వప్రమాణ బహిష్కృతము. ఉపాసనమనగా సగుణోపాస నమే.నిర్గుణోపాసనమనుటస్వవచన వ్యాఘాతము.

అద్వైత సిద్ధాంతమున జీవేశ్వర భేదమౌ పాధికము. ఇది విశిష్టాద్వైతమున పారమార్థి కము. అనాదియు ననిర్వాచ్యమును భూత ప్రకృతియు, చిన్మాత్ర సంబంధినియగు మాయ యందు చిత్ప్రతిబింబమీశ్వర తత్త్వమనియు, అవిద్యాప్రతిబింబిత చిత్త్వత్త్వము జీవస్వరూప మనియు నద్వైతులు వచించుచున్నారు. ఇట్టి మాయావాదమున నుపాసనకు స్థానము లేదు. విశిష్టాద్వైత ముపాసనాత్మక జ్ఞానమునే మోక్ష

సాధనముగా స్థాపించుచుండుటచే వీరికుపాసనమే ముఖ్యము.

ఏనను శంకరాచార్యుల వారి వ్యావహారికసత్య ప్రపంచమున నుపాసనము సగుణము. శుద్ధచైతన్య స్థాపనావసరమున నిరాకరింపబడిన ఈ యంశము వ్యావహారిక దశయందు వారిచే నంగీకరింపబడినది. వీరి భజగోవింద స్తవరాజము, సహస్రనామ భాష్యమువిందులకు ప్రమాణములు. వీరు కేవలము జ్ఞాని మాత్రమే గాక భక్తులు నగుదురు. జ్ఞానస్వరూపమగు సచ్చిదానంద తత్త్వమే భక్తావస్థయందు వీరికి వాసుదేవ స్వరూపమగుచున్నది. కావున వీరి మతమునను సగుణమే యుపాసనము. వీరు వేదాంతరాద్ధాంతమున గౌడపాదుల మాధ్యమిక సిద్ధాంతము నవలంబించినను నిత్యారాధన పద్ధతియందు సగుణోపాసనమును స్థాపించి భగవద్రామానుజ సిద్ధాంత భాస్కరోదయమున కరుణపాత్రులైరి.

వాస్తవమునను నిర్గుణ శ్రుతులవలెనే సగుణ శ్రుతులును పరమ ప్రమాణ భూతములు. కావుననే వానికి పరస్పరము బాధ్య బాధక భావము లేదు. "నీచాః కలహమిచ్ఛంతి సంధిమిచ్ఛంతి సాధవః" అను న్యాయము ననుసరించి శ్రుతి విరోధమును స్థాపించిన యపసిద్ధాంతముల నిరసించి విషయ వ్యవస్థచే వానికి సౌహార్దమును కల్పించి సంధిని గూర్చిన వారు యతిసార్వభౌములు. "తత్రవిరోధ స్థిరీకరణేన బాధ్య బాధక భావ ఇతినీచాః । విషయ వ్యవస్థయా సంధిరితి సాధవః" అని నిగమాంత మహాదేశికులు నిరూపించియున్నారు. ఇందులకు ప్రమాణముగా శ్రీవరద గురువచనమును సంధేయము.

"యస్తు బ్రహ్మణో గుణాశరీర వికార జన్మకర్మాది గోచరవిధి ప్రతిషేధవాచః । అన్యోన్యస్య భిన్న విషయా న విరోధ గంధమర్హంతీతన్న విధయః ప్రతిషేధ జోద్యాః"

శ్రీశంకరాచార్య ప్రతిపాదితమైన శుద్ధచైతన్యము పాసనానర్హమని ఇంతవరకే వక్కాణించియున్నాము. దీనికి ప్రమాణ భూతముగా రాధాకృష్ణ మహాశయుల వచనము నుదాహరించుచున్నాము.

"The alsdanse of Sankara rigid motiouless and totolly taking in inmitiative or in fluence cannot call forth our worship like Taj Mahal which is uncanseions of the edmistration it anoprses. The alsduse remains in diferent to goan and love of its. Worshipers and for all those who regard the goal of religion as the goal of philosophy to know god is to know the great Sankara is view sunas to be a finished example of learned errar.

ఇందువలన శాంకరీయ నిర్గుణ తత్త్వముపాసనానర్హమని సుస్థాపితము.

ద్వాత్రింశ దుపనిషద్విద్యలున్నూ సగుణోపాసనమునే స్థాపించుచున్నవి. శ్లో॥ విద్యాప్రాతర్దనీసావదతి హితతమోపాస్తి కర్మేంద్రమేవ ఖ్యాతప్రాణేంద్ర బ్రహ్మాన్వితమపితదసౌ విశ్వకర్తేతి చేన్న । బ్రహ్మత్రేధాహ్యుపాస్యం బహువిధ చిదచిత్కంచుకీం స్వాత్మనా చ ప్రాణేంద్రే ప్రక్రమోఽపిప్రబలతర మహావాక్య వైఘట్య భగ్నః॥

ప్రతరన విద్యయందు-

సద్యోవాచప్రాణోఽస్మి ప్రజ్ఞాత్మాతం మామా యుర మృతమిత్యుపాస్వ" అని కౌషీతకి 3-1 వాక్యముదాహరింపబడినది. ఇందు విహితతమోపాసనము పరమాత్మోపాసనమే. ఈ విద్యయందు ఇంద్రాదివిశిష్టుడగు పరమాత్మ ఉపాస్యుడు. ఉపాసన మచిద్విశిష్టోపాసనమనియు, చిద్విశిష్టమనియు కేవలపరమాత్మ పరమనియు త్రివిధము.

శ్లో॥ నిత్యం హేయగుణా వమానన
పరానైర్గుణ్య వాదాశ్రితా
ముఖ్యార్థాస్సగుణోక్త యశ్శ్మ
భగుణాప్రఖ్యాప నాద్బ్రహ్మణః
అద్వైతశ్రుతయో విశిష్టవిషయా
నిష్కృష్ట రూపాశ్రయాః
భేదోక్తిస్తదిహాఖిల శ్రుతిహితం
రామానుజీయం మతం॥

# గీతారూపమగు శ్రీకృష్ణవాక్కు వచనమా? శ్లోకములా?

శ్రీమహాభారత గ్రంథకర్తయగు వ్యాసమహర్షి శ్రీకృష్ణార్జునులకు సమకాలికుడు సన్నిహితుడు పరమగురువు కావున గీతావిషయముల గూర్చి యుద్ధానంతరము వారివలన వివరముగా తెలుసుకొని గ్రంధస్తము చేసియుండును. అట్టి గ్రంధమును శ్రీకృష్ణునకు వినిపించి ఆయనయొక్క అనుమతిని పొందియుండును.

ఇంతేగాక శ్రీకృష్ణుడు సామాన్యవ్యక్తియా? భగవదవతారము, ఈపరిపూర్ణతముడు సులభమైన అనుష్టుప్ఛందస్సులో గీతను శ్లోకరూపముగనే ఆశుకవనముగా సమయోద్రేకమున పలుకగలిగెను. అనుట ఏమియు అతిశయోక్తి కాదు.

కావున ప్రథమ ప్రబోధమునగాని, వ్యాసకవనమును శ్రీకృష్ణుడు సమ్మతించుట వలనగాని, గీతపూర్తిగా శ్రీకృష్ణభగవానుల అభిప్రాయవచనమేయనినమ్మి మనము సేవింపవచ్చును.

మో॥స॥యో॥శ్లో॥64 సర్వగుహ్యతమం భూయః।
శృణు మే పరమంవచః।
ఇష్టోఽసిమేధృఢమితి।
తతో వక్ష్యామి తేహితమ్॥

మో॥స॥యో॥శ్లో॥75 వ్యాసప్రసాదాచ్ఛ్రుతవాన్
ఏతద్గుహ్యమహం పరమ్।
యోగంయోగీశ్వరాత్కృష్ణాత్।
సాక్షాత్కథయతస్స్వయమ్॥

గీత పదునెనిమిది యోగములక్రింద విభజింపబడినది. ఒక్కొక్కయోగమును ఒక్కొక్క అధ్యాయముగా పలుకబడుట వాడుక. ప్రతియోగము అందలి విషయముల ననుసరించి కర్మజ్ఞానాది నామధేయములచే నెన్నబడును. యోగము అనగా సంయోగము కూర్పబడుట. ఆయా యోగములలోని ప్రతిభావమును గీతాసముదా

య ముఖ్యసూత్రమాత్రే ధర్మభావముతో సమగ్రమముగా సంయోగించి అనుసంధించి ఆచరణలో అనుసరించుట గీతాబోధనోద్దేశము:

ఈయోగముల [అధ్యాయముల]లో మొదటిది గీతాప్రవచనకు కారణమైన కథను చెప్పు అర్జునవిషాదయోగము.

ఇక రెండవ అధ్యాయమగు సాంఖ్యయోగమున పదునొకండవ శ్లోకమగు

శ్లో॥ అశోచ్యానన్వశోచస్త్వం।
ప్రజ్ఞావాదాంశ్చభాషసే।
గతాసూనగతాసూంశ్చ।
నానుశోచంతి పండితాః॥

అనుశ్లోకమునుండియే భగవద్గీత ఆరంభము అనుకొనవచ్చును.

రెండవయోగమున ఇతరసంగతులుకూడ గుర్తింపతగినవి.

సంఖ్యల [అంకెల] ప్రాధాన్యము కలది ఎట్లన భారతము 18 వ సంఖ్యకు ప్రాధాన్యముకలది.

18 పర్వములు
18 అక్షౌహిణులు.
18 యుద్ధదినములు.
18 గీతాయోగములు.

ఈ 18ని 4 చే గుణించిన యెడల [18 × 4 = 72] శ్లోకములుగలవి. ఈసాంఖ్యయోగము ప్రతినాలుగు శ్లోకములలోని విషయము క్రమముగా గీతలో ఆయావరుసల అధ్యాయమునందు వివరింపబడిన విషయములకు క్లుప్తమైనసూచన అందుచే సాంఖ్యయోగము భగవద్గీతకంతకు విషయసూచికవంటిది.

2. సంఖ్య-యుక్తము-యుక్తసంబంధమైన ప్రవచన విశేషముగా గలది.

3. సాంఖ్యము-బుద్ధి-మనీష-అనగా వివేకజ్ఞానమును శౌర్యముతో సమభావముగా సమ్మేళనపరిచి యుక్తముగను ఆచరణలో చెప్పబడిన బోధనగలది.

ఈసాంఖ్యయోగమునందును- గీతాశాస్త్రమునందంతటను యుద్ధరంగము జీవితముగాను యోధుడు యోగజీవిగాను-ధర్మము ధర్మరాజుగాను-ఉత్ప్రేక్షించినట్లు అర్థ సూచనలున్నవి. ఈసూచనలను గుర్తించుటకై గీతలో తరచుగా వాడబడు పదములకు వివిధములైన అర్థములు ఈదిగువ వివరింపబడినవి.

[1] ధర్మ-ధర్మము-ధర్మరాజు
[2] గీత-గేయము-గానము
[3] యోగము-సంయోగము-కలుపుట- అభ్యాసము-ప్రయత్నము-వ్యాయామము- కృషి-వేదాంతచింతన.
[4] యోగి-అభ్యాసకుడు-జిజ్ఞాసకుడు-యోధుడు
[5] క్షేత్రము యుద్ధము-ధర్మము-కృషి మొదలగు ప్రయత్నములకు ప్రదేశము-శరీరము
[6] ఆత్మ-జీవుడు-వ్యక్తి-యోధుడు.
[7] ప్రకృతి-సృష్టికి మూలతత్వము - సైన్యసామగ్రి
[8] జగత్తు-ప్రపంచము-ప్రజ-సైన్యము
[9] కర్మ-క్రియ-ప్రతిక్రియ-కార్య కారణపరంపర-విధాయక కృత్యము కరణీయము.
[10] బ్రహ్మ-పరమాత్మ-అంతరాత్మ-యజ్ఞాధికారి-సర్వసేనాపతి ఖగోళమధ్య మహామండలాధిదైవము,

[1] యజ్ఞము—మంత్రహోమక్రియ— యుద్ధము
ఏకైకతత్త్వ సత్యాన్వేషణాక్రమము రసాయ
న వస్తుసమ్మేళనము—విభజన — పర్యవసాన
ముగా క్లుప్తముగా, శ్రీభగవద్గీతాసారము
ను ఈదిగువ నొసఁగి సూచింతును,

శ్రీభగవద్గీతా సారసౌందీ గేయము కలదు.
శస్త్రాస్త్రములు చాలాబలము శౌర్యము చూప
వేలా ?

3— వెలయు యోధపరేణ్యా! యీలా వివశత్వ
కు వేళా ?

వలదుస్వార్థము నీకు వేలా?
అలుగు! గాని—ఫలత్యాగశీలా!
కలుగు ధర్మక్షేమ యోగక్రమము నీపాలా (6)
నిలుపు! కనుననునమ్ము! హేలా
వింక మహోన్నత మోక్షలోలా
నింకయు జేసెద, నమ్ము! పోరుము! నీరసము,
మేలా ?

---

"వేదాన్త విలాసము" [అనెడు]

# యతిరాజ విజయనాటకము

## ఐదవ యంకములో నొక భాగము.

అనువాదకులు: శ్రీ ఉ. వే. శ్రీమాన్ తె. రం. గోపాలాచార్యులుగారు, కోరుకొండ.

### —కథాసందర్భము—

[శ్రీ వేదమౌళి మహారాజునకు గల మాయావాది పిశాచ బాధను రామానుజులు స్వ నామాత్మ్యులై వదలగొట్టిరి. రాజు సుమతితో సుఖముగ కాలము గడుపుచుండును. మాయావాది క్షుద్రశత్రువగుటచే నాతని ప్రవృత్తిని సర్వదా కనిపెట్టియే యుండవలెనని శ్రీ వేదమౌళి మహారాజు సుదర్శుడను నొక గూఢచారిని పంపును.]

సుదర్శనుడు:- నన్ను మహారాజు మాయావాది వృత్తాంతము నారయుట కంపెను. ఒక బాటసారి వలన నేనా వృత్తాంతము నంతను సంగ్రహించితిని.

వాడిప్పుడు శంకరుని పురస్కరించుకొని కేరళులతో గూడి ఎరుకగు రహస్య స్థలమున దుర్గ నారాధించి యామె యనుగ్రహము వలన ననేక విధములగు మాయాశక్తులను యుక్తులను లభించి రామానుజుల జయించుట కిందు జితుడవలెనే బయలువెడలెనట. ధ్యాన నియోగవాదియు నిష్ప్రపంచీకరణ నియోగవాదియును వృద్ధులయ్యు నాతనికి సహాయ మొనరింప నుద్యు

క్తులై శంకర ద్వేషముచే మరలిపోయిరి. శంకర శిష్యులగు వాక్యార్థ జ్ఞానవాదులు జీవులనేకులని యొకడును, ఒక్కడే జీవుడని మరియొకడును పరస్పరము కలహించి యెచ్చటకు పోయిరో గాన రారట. ఈ వృత్తాంతము నంతను గురువు గారికి తెలుకపరతును. [అని పోవును.

: విష్కంభము :

పిమ్మట కోపముతో సన్యాసియు (ఏకజీవవాది) శుక్లపటుడు[బహుజీవవాదియు]ను ప్రవేశింతురు.

సన్యాసి:- ఓరోరీ ! దుర్మార్గుడా ! శంకర శిష్యుడవయ్యును జందెమువలె నీ కుత్తెను బంధించు నీ భేదవాసనా పిశాచమును వీడువకున్నావేమిరా?

శుక్లపటుడు:- (కోపముతో) ఓరీ ఆత్మజ్ఞాన విహీనుడా ! ప్రచ్ఛన్న బౌద్ధసన్యాసీ ! సకల మర్మముల నెరింగిన నాకు గూడ కోపమును దెప్పించుచున్నావా? దిగంబరి నలంకరించునట్లు సుతరా మవైదికమగు నీ సిద్ధాంతమును బంధ మోక్షాది నిబంధనలను బోధించు వేదవాక్యము లతో నలంకరించు నిమిత్తమై యేదో యొక విధముగ నెల్లునో దర్భనో యాధారముగ జేసుకొని మోక్షదశలో జీవులనేకు లగుటను కల్పించుచున్నాను. దానిని కూడ నీవు సహింపజాలవా?

సన్యాసి:- [కోపముతో దంతములను కొరుకుచు]

పాడు తర్కములతో వాదించు నీ పాండిత్యమును నేనెట్లు సహింతురా? ఓరీ ! చెప్పుము. పతివ్రతవలె బ్రహ్మనే యాశ్రయించి యేక పత్నీవ్రతము నాచరించు నీ యవిద్య నెందఱు జీవ చండాలుల నాలింగనము గావించునో చెప్పుము.

శుక్ల:- అయినచో నవిద్య యజ్ఞాన రూపమైనది గదా! ఇది జ్ఞానరూపమైన బ్రహ్మను పెలకి బుచ్చుకొని యెట్లు బజాయించునో నీవు చెప్పుము చూతుము.

సన్యా:- [కోపాటోపముతో వాని పిలకను జందెమును పట్టుకొని] ఒరే! జీవభేదమనెడు యగాధమున బడి నోటికి వచ్చినట్లు ప్రేలెదు నీ పండ్లను విరుగ గొట్టెదను. [అని దండము నెత్తును.]

శుక్ల:- [కోపముతో జూచుచు] సర్వాశ్రమ భ్రష్టుడు. వీని నెట్లు పట్టుకొందును? వీనికి పిలకయును లేదు. జందెమును లేదు. గుడ్డ మొదలే సున్న. ఇంక దేనిని పట్టుకొందును? ఈ పతితుని మెడబట్టి పడద్రొబ్బెదను. [అని హఠాత్తుగా మెడను బట్టుకొని, ముందునకు జూచి భయముతో] అయ్యో! ఎట్లు? రాజిట్లే వచ్చుచున్నాడే. ఇట్లు పారిపోవుదును. [అని ఆ సన్యాసి గోలబెట్టుచుండగనే వానిని యీడ్చుకొని పోవును.]

[రాజు సుమతితో సరస సల్లాపము లాడుచుండ కోపముతో రామానుజుల నన్వేషించుచు శంకరునితో మాయాకాది ప్రవేశించుచు తెర లోనుండి గర్జించును.]

శంకరుడు:- ఓరోరీ! రాజుకుల వాసులారా! లోకమున ననేకమందిచే మెచ్చుగ నాదరింపబడిన ద్వైత సిద్ధాంత విజ్ఞాన గర్విష్ఠు లితరు

తెంపుతో యుండజేయున్నారు. కాని యద్వైత సిద్ధాంతమనెడు మహాప్రచండగాలి సోకిన తనే భగ్నభ్రాంతి చిత్తులగు వారితో మాకేమి పని? ఇక భట్టప్రభాకరుల నెడుప్రతి యోధులయొక్క సిద్ధాంతములనెడు ప్రాణములనెల్ల దానముజేయు శంకరుడ నిదిగో వచ్చియున్నాను. మీ రామానుజుడెచ్చట నున్నాడో చెప్పుడు. [శ్లో] అని రంగమున ప్రవేశించును.]

[ఇంతలో రామానుజులు సునీతి సదూహుడు ప్రవేశింతురు.]

శంక:- ఎవడురా! రామానుజుడు?

సదూ:- నేను వారి శిష్యుడనే

శంక:- వాడెవడో తెలియగోరుచున్నాను

సదూ:- వాదములకు బాధ్యుడను నేనుండగా మా గురువుజాడ నీకేల? ముల్లెచ్చట నైనను చెప్పను. [గుచ్చుకొనక పాదమును గుచ్చుకొనునా?

శంక:- (నిర్లక్ష్యముగా మరియొక వైపునకు జూచును.)

సదూ:- [కోపముతో] ఓరీ జాల్ముడా! నన్నేల లక్ష్యపెట్టవు? అరే! [నేనెవరో యెఱుంగుదువా?]

సప్తద్వీప ముద్రితమగు నీ భూమండలమున కేకైక దీప జ్యోతినై వెలుంగువాడ. సకల మనుజ విజ్ఞానము నాచ్ఛాదింప సమకట్టిన మాయా సిద్ధాంతమనెడు వెదబొంగలనైన నొక్క క్షణములో కత్తిరించి పారవేయు నేర్పు గల కత్తిరనైనవాడ. మదించు తిరుగు నీవంటి దుర్వాదుల మదమడగించుటను యజ్ఞ దీక్షగా నవలంభించినవాడ. శ్రీరామానుజుల సభలో తంత్రిపాలోద్యోగమునున్న సప్తవ్యూహములు [ఏడు సైనిక దళములు - శ్రీరామానుజులు స్థాపించిన ఏడు ప్రతిబంధములు] గల సదూహుడను నీకంటికి గాన్పించుట లేదా! [శ్లో]

శంక:- [కోపముతో తిరిగి చూచుచు] మూడకేమి? శంకరునకువలె నాకును నీ వంటి దురాత్ముల నీక్షించుటకు తేజః పుంజమనదగు మూడవకన్ను కలదు గదా!

సదూ:- [కట్టిగనవ్వి] ఆ నీకన్ను శిశుపాలుని కన్నువలె మా రామానుజుని దరిజేరిన చట్టున చల్లారును.

శంక:- అదిగో! అట్టివానినే చూడగోరియు గాంచకున్నాను.

మాయా:- వత్సా! దీపమును చేబూనియు గోతిని గాంచజాలవా? నేనే నీకు తెలుపుదును. వీడు దురూహుడు. మేము వీనిని వేదమార్గచెంత నుండి వెళ్ళగొట్టిన పిమ్మట యిప్పటికి సదూహుడయ్యెను. ఇది సుమతి చెలికత్తెయగు సునీతి నా కూతురగు మిధ్యాదృష్టి దీనిని దుర్నీతి యని వెడలగొట్టినది. మహారాజును బ్రతికియుండగనే యేనుగునువలె నంధకూపమున కూలద్రోసిన మిత్రుని వేషముతోనున్న శత్రువగు యీ మనుడు వీడే. బిడ్డా! ఇక మిగిలినవాడు నీకిప్పుడు కావలసిన రామానుజుడేయని నమ్ముము.

శంక:- [బాగుగ జూచి తనలో] ఆహా! గంగానదిలోని నీరు తనలో నున్న నిర్మల రత్నమును వలె యీతని యాకారమే లోకాశ్రిత మగు నీతని మహిమను చాటుచున్నది. ఇదియొక యాశ్చర్యకరమైన తేజఃపుంజము. పరులు దీని

నెదుర్కొనుట దుస్సాహసమే. [శ్లో]

[పైకి రోషముతో గుర్రిస్సు త్రిప్పుచు] ఆహా! చాలకాలము నుండి ప్రార్థించుచున్న మహా సర్పము నేటికి గరుడుని కంటబడినది.

సదా:- ఔను నిజమే.

మాయా:- [కోపముతో నీతనిని జూచును]

శంక:- వీడిప్పుడు ప్రళయకాలయమందుబ్బిన సముద్రతరంగ పరంపరల యాటోపము ననుకరించు నాయుక్తి పరంపరలతో క్షోభిల్లు వాయు మండలిచే నెగురగొట్టబడిన కొఱ్ఱిందూదివలె చిందరవందరమై యెగిరిపోవును. [శ్లో]

మాయా:- (రామానుజులతో) మూర్ఖాగ్రేసరా! నా పదవి నధిరోహించి మహారాజు యొక్క సుకుమార హృదయమును మోసగించి సంశప్తకులవలె నేను నీయెదుట నిలచియున్నను నీ బుద్ధిని నీతినై పుణ్యమును జూపవేల?

సదా:- (కోపముతో) బాగుబాగు. నీవు సంశప్తకుడవేకమ్మా. రామానుజుల శిష్యుడనగు నేను మాత్రమర్జునుడనేలగాను?

యాము:- ఈ మాయతీంద్రులు తర్కయుక్తి కుశలులైనచో వారితో మీసముగా వాదించి వారినెల్లర మరలింపరా?

గజఘటములతో డీకొను పంచాస్య మెదుట నున్నను కుక్కల గుంపుపై కురుకునా?

శంక:- [కోపాటోపముతో] ఓహో! ఏమంటివి? నాకంటెను వాదమర్యాదాభిజ్ఞుడను పండిత ప్రవరు డొకడు కలడా?

యతి:- [యామునుల ముఖమును జూచి నవ్వును]

యాము:- ప్రతివాదును తనను తానే పొగడుకొనును.

యతి:- పూజ్యా! శంకరుని మాత్రమిట్లను కొనకుడు. ఈతడు మతాంతర కలహములలో తనను తాజూచుకొనకయే యురుకును.

సదా:- (నవ్వి) అయినచో తినదెబ్బ తనకే తగులుట గూడ నీత డెఱుంగకున్నమాట.

రాజు:- [నవ్వి] అయిన తన రక్షణ నుపేక్షించి శత్రువీరుల సంహరింప సమకట్టిన యోధునివలె నీతడు నశించును.

సదా:- సర్వము మిథ్యయనువానికి మొదట తన మాటయే మిథ్య యగును గాన శత్రువు దెబ్బతినకయే గెలుపొందును.

మాయా:- [నవ్వి] సమస్తమును ఖండించు వానికి తన మాటయు ఖండింపదగినదియే గాన, నా పనికి పూనుకొనుటచే నా ఖండించు యుక్తులచేతనే నిదియు ఖండింప బడుట యిష్టమే యగును.

సునీ:- [నవ్వుచు] అయినచో వాదమునకు ఫలము గెలుపువలె నోటమియు ఫలమగు నన్న మాట!

సదా:- [పెద్దనవ్వునవ్వి] యుద్ధమును జేయు వీరునకు శత్రువు తన చేతనున్న కత్తిని లాగుకొని దానితో తన తలను నరుకుటయు యిష్టమే యగునా?

మాయా:- ఓరీ! వదరుపోతు దురభిమానీ! నేనెదురుగ నుండగనే కుయుక్తులనెడు నెరుసులను గ్రుక్కుచున్నావా? చూడుము! నేనొక బ్రహ్మాస్త్రమును చేబూని యుద్ధమున విహరిం

చుచు ప్రపంచమునంతను తుచ్ఛేంద్రియములు గావిం తును. నా పాండిత్యమును గాంచుడు.

శ్లో॥ యస్మిన్ విశ్వ మశేష మేత త్త్రిభువన
సంఖిలం యచ్చ పశ్య త్యవిద్యా
ముగ్ధం స్వాద్య స్త మేత ద్యదపి
నిజవపుర్యత్ర తద్ నాచ్ఛాద్యతే యత్
జ్ఞానం జ్ఞేయాదిహీనం భవతి యః న
పదం సంవిదాం నిర్విశేషం
సత్యం తద్బ్రహ్మ మిథ్యా తదితర
దఖిలం కోఽన్యథా వక్తు మీశః

సమస్తమగు నీ లోకత్రయమును యెవ్వని యందు కల్పింపబడెనో, యెవ్వడు మాయచే నాచ్ఛాదింపబడి స్వస్వరూపమును గానక తన యందు కల్పితమగు నీ సంసారమును గాంచునో యెవ్వడధిష్ఠానమగు తన నిజస్వరూపమును గాంచుటచే యీ మాయాబంధము నుండి విముక్తుడగునో యెవ్వడు జ్ఞానస్వరూపుడై జ్ఞేయములగు ధర్మము లొక్కటియు లేనివాడో, యెవ్వడెట్టి జ్ఞానమునకును విషయభూతుడు కాడో, యెవ్వడు సజాతీయ విజాతీయ స్వగతభేద విహీనుడో యట్టి బ్రహ్మయొక్కడే సత్యము. మిగిలినదంతయు మిథ్యయే. ఈ సిద్ధాంతమును కాదను సమర్థుడెవ్వడు?

[అని గర్వముతో తన భుజమునుతట్టుకొనును]

[యతిరాజు చిరునగవుతో సదూహుని ముఖమును జూచును]

సదూ:- [ఆటోపముతో భుజమును తట్టుకొనుచు] నేను రా సమర్థుడను !

భిన్నభిన్న ఆకారముల నంగీకరించి సాధింపదగినదదియంతయు బ్రహ్మనిర్విశేషమని వాదించు నీ కెట్లు పొసగును.

అదియును గాక

శ్లో॥ నాధ్యాస స్స్వప్రకాశే తిమిర మివ రవౌ
జ్ఞానబాధ్యా చ మాయా
న బ్రహ్మ జ్ఞానరూపం స్థగయతి
న తతో బన్ధమోక్షౌ చ తస్య
న జ్ఞానం జ్ఞేయహీనం న
న చ మతిపదం నిర్విశేషం న కిఞ్చిత్
సత్యం స్యా న్మానసిద్ధం జగదపి
న యది స్యో క్తిబాధాదయ స్స్యుః॥

చీకటి సూర్యుని యావరింప జాలనట్లే స్వప్రకాశ స్వరూపుడగు పరం బ్రహ్మయందు మాయ ప్రపంచాధ్యాసను ఘటింపజేయనేరదు. [అధిష్ఠాన స్వరూపము వాస్తవముగ గోచరించనప్పుడే అధ్యాసఘటించును. స్వయంప్రకాశమగు బ్రహ్మ యధిష్ఠానమగుచో నాతడెప్పుడును స్వస్వరూపముతో ప్రకాశించుచునే యుండును గాన నచ్చట యధ్యాస ఘటింపదు.]

బ్రహ్మజ్ఞాన స్వరూపునకు మాయ జ్ఞానబాధ్యము. అట్టితరి నత్యంత విరుద్ధములగు నీ రెండింటికిని యావరించుటయు నావరింపబడుటయు నెట్లు సమకూడును?, కావున బహ్మకు బంధము గాని మోక్షము గాని సున్న., జ్ఞేయములేని జ్ఞానముండదు. జ్ఞానవిషయము కాని [తెలియబడని] సత్పదార్థముండదు. నిర్విశేషమగు [సజాతీయ విజాతీయ స్వగత భేదములులేని] సత్యవస్తువే సంసారమునందు దుర్గ్రాహ్యము. [సత్యమైన వస్తువెల్లప్పుడును సవిశేషమే] ప్రమాణసిద్ధమైన

జగత్తే లేదన్నచో నీమాటయు ప్రమాణ సిద్ధమనుచున్నావు గాన [కానిచో దేనిని సాధింప నేరదు గదా] నిదియే నీకు బాధకమగును ఇట్లెన్నియో దోషములు నీవాదము నంటుకున్నవి.

మరియు-

శ్లో॥ ప్రత్యక్షప్రభృతిప్రమాణవిదితరం
సత్యం చ భిన్నం జగత్
బాధ స్తస్య న కేనచిత్ స్వవిహతే
ర్బ్రహ్మాత్మకం త జ్జగత్
ద్వైతాద్వైతగిరో విభిన్నవిషయా
బాధాయ నాలం మిథః
పశ్చాలమ్బనిషేధవాక్యవ
దతో విశ్వాపలాపః కుతః॥

ప్రత్యక్షాది ప్రమాణములచే దెలియబడు ప్రపంచమంతయు సత్యమే. ఇయ్యది ఆత్మ పరమాత్మలకంటె వేరైనది. దాన్ని నేదయు బాధింప జాలదు. అట్లు బాధించునెడల [ఒక ప్రమాణము తనకు సజాతీయమైనట్టి గాని విజాతీయమైనట్టిగాని ప్రమాణాంతరముచే బాధింపబడిన యెడల] ప్రమాణములు తమలో తామే బాధించుకొనవలసి యుండును. [అట్లగుచో నే యర్థమును సిద్ధించనేరదు గదా!] ఆ ప్రపంచము పరమాత్మయే యాత్మగా కలిగి యుండును భేదశ్రుతులకును అభేదశ్రుతులకును విషయభేదముండుటచే వాటికి పరస్పర విరోధము లేదు గాన నొకదాని నొకటి బాధింపనేరదు. అట్లగుచో 'నహింస్యాత్సర్వాభూతాని' యను శ్రుతి, 'వాయువ్యం శ్వేత మాలభేతభూతి కామః' యను శ్రుతిని బాధించవలసియే యుండును. అట్లు బాధింపబడిన నా వాక్యము బాధితార్థ బోధమగుటచే మిథ్యయే యగును. కావున ప్రపంచముమిథ్యయనుట దుస్సాహసము.

సునీతి:- ఏమి స్థానముల యందును లెస్సగా నోషోద్ఘాటన చేయబడినది.

సుమతి:- [నవ్వుచు] అయిన దీనితో మహారాజునకు మాయావాదితోటి నాస్తికవీనము నకు [స్నేహము నకు] స్వస్తిని చెప్పినట్లే.

మాయా:- [శంకరునితో రహస్యముగా] దుర్మార్గుడగు నీ డింభకుడు తగినట్లు సమాధానమును జెప్పుచున్నాడు. ఔను నిజమే మరి నిషేధము విధి నెన్నటికిని బాధింపనేరదు.

ఇంకేమి చేయుదుము.

[ఇంతలో శిక్షకులగు పరాఙ్కుశులు విచ్చేయుదురు].

యతి:- పూజ్యా! పరాంకుశా! నిరంకుశముగ సంచరించు వీరిని వెడల గొట్టుడు.

పరా:- వీరిరువురకును శిక్షయేమి?

యతి:- దుర్బ్రాహ్మణులకు శిఖాయజ్ఞోపవీతములు ఖండించుటయే శిక్ష. ప్రపంచ చోరులగు వీరిరువురకు నా శిక్ష నిదివరకే భగవంతుడు ప్రసాదించెను. శరీరమును విడిచిన పిమ్మట నను గూడ నిట్టి యతుల నా యింద్రుడు తోడేళ్ళకెర గావించును.

శంక:- పూజ్యుడవగు నో పరాంకుశా! మహాద్వైత పక్షపాతీ! నీవు విష్ణు భక్తుడవు. నేనును భావనా ప్రకర్షచే జీవన్ముక్తుడనై విష్ణువునే యైతిని. కావున నన్ను హింసింప రాదు సుమా!

సదా:- [నవ్వి] నిన్ను భావనాప్రకర్ష చే దేవదాసవుల శిరఃకిరీటాగ్రములయందు రాజిల్లు రత్నకాంతులచే గాంచదగిన పాదద్వంద్వము గల ముకుందుకవని యెవరు గాంచిరి.

సునీతి:- అదేమి? తానే గాంచెను.

సదా:- అయిన నిజమును జెప్పుము. భగవంతుడు కర్మపరతంత్రుడు కాడుగదా! ఆతడు భ్రమించునా? దుఃఖించునా [నవ్వి] ఆహా! ఇది యెంత సుస్పష్టవిషయము. ఐనను యీ యాట రీతి యేమియో తెలియదు. ఇది యుని ర్వాచమే.

పరా:- [రోషముతో] స్వామికిని సాత్మునకును అభేదమును భావించు ఓ పాపీ! నీవు పౌండ్రక వృత్తాంతమును వినలేదా?

పౌండ్రకునివలె నీవును "నేనే వాసుదేవుడన"ని వదరుచు కౌశిని భస్మము గావించిన సుదర్శనముచే [సుదర్శనాంశావతారులగు రామానుజులచే] రూపుమాపబడెదవు సుమా! [శ్లో]

[షెరలో] నేనుండగ నెవ్వడురా మా విజ్ఞానాత్మకాదినాక్షేపించుచున్నాడు?

మా కిరువురకునుచిన్మాత్రబ్రహ్మైకత్వము అవిద్యా కల్పితమగుటచే ప్రపంచము మిథ్య కాని యా బ్రహ్మ నా మిత్రునకు సత్యము. నాకు మాత్రి మనిత్యము. [శ్లో]

కాక- తత్త్వము నిర్విశేషమను నామిత్రుడా బ్రహ్మకు నిత్యత్వాది ధర్మముల నెట్లుజెప్పునో!

సదా:- [కోపముతో] ఓరీ! మీరు యోగాచార మాధ్యమికులా? ఇదిగో మీ యుభయులకిదే యేకైక రామబాణము కాచికొనుడు.

సర్వమును శూన్యమనుచున్నారే. ఆ మాట సత్యమా? అసత్యమా? చెప్పుడు. సత్యమందురా? సర్వమును శూన్యమెట్లగును? ఆమాట మాత్రము సర్వములోనిది కాదా! కావున స్వవచన విరోధము వాటిల్లును.

లేక అసత్యమందురా! అయినచో సర్వమున్ను సత్యమే యగును.

మిథ్యా సర్వమునకు విషయముండునా?

సునీతి:- [సాభిప్రాయముగా మాయావాది ముఖము నవలోకించి] తేలుకాటునకు విషదరుడు కూడ చచ్చునే!

[మాయావాది సిగ్గుతో తలవంచుకొనును]

పరా:- [కోపముతో] ఏమిరా! మీరు బౌద్ధుని మిత్రులా! అని దండమును తీయును. భయముతో వారిద్దరు పారిపోవుదురు.

[దండకమండలములు ధరించి యాదవుడును పుస్తకమును చదువుచుశిష్యుడునుప్రవేశింతురు]

యాదవుడు:- ఓరీ వత్సా వాదిసింవన్! ఊఁ ఏదీ మన వేదాంత సంగ్రహశ్లోకము రానీ.

శిష్యుడు:- చిత్తము. ఇదుగో వచ్చుచున్నది.

శ్లో॥ బ్రహ్మైకం తత్త్వమేత ద్బహువిధ
చిదచిత్తన్ని యన్తృప్రభేదా
త్తచ్ఛక్తిస్వరూపం పరిణమతి
యథా నారి ఫేనాదిరూపం
సత్వం సర్వానువృత్తం మణిషు
పరిమళన్యాయతోఽచిత్పదార్థే
చైతన్యం త్వప్రకాశం శ్రుతి రిహ
విషయే స్థాపితా యాదవేన॥

# ప్రచార విభాగము

భక్తి "నివేదన"
అనుబంధము

## శ్రీయతిరాజ సేవామహిళాసంఘం (మదరాసు శాఖ)

## తిరువాడిప్పూరం ఆండాళ్ల ఉత్సవం

ఈనగరమున మూడు సంవత్సరములనుండియు సత్సంప్రదాయ పరిజ్ఞాతయు, చిరోపాసిత జ్ఞానవృద్ధయు, సదాచారసంపన్నయునగు శ్రీమతి పువ్వాడ మంగమ్మగారు ఇచ్చటి 107 వరదా ముత్తియప్పన్ వీధిలో వేంచేసియున్న శ్రీ ఉడయవరుల కోవెలకు ఎదురుగానున్న సుధానిధిలో పై మండలి యాజమాన్యమున "తిరువాడిప్పూరం" అనెడు ఆండాళ్ళ ఉత్సవమును తిరునక్షత్రముతో చాత్తుమర అగునట్లు 10 దినములు కనులపండువుగా జరుపుచున్నారు. క్రమక్రమముగ ఉత్సవ మతిశయించుటచేతను స్థలము సంకుచితమగుటచేతను యీసంవత్సరం గీతామందిరమున యీఉత్సవము జరుపదలంచియు అనివార్యముగా శ్రీ ఉప్పుటూరువారి రామానుజకూటమున బ్రహ్మాండముగా జరుపబడినది.

ఈఉత్సవము 16-7-52 తేదీ మొదలు 30-7-52 వ తేదీవరకు ప్రతిదినం మధ్యాహ్నము గం 3-0 లు మొదలు సాయంకాలం గం 8-0 ల వరకు వేలకొలది స్త్రీలసమావేశముతో జరుపబడినది.

ఇందు 17-7-52 వ తేదీని శ్రీ గోదాదేవి అవతార మహోత్సవమున్ను
21-7-52 వ తేదీని ముత్తుకురి ఉత్సవమున్ను
26-7-52 వ తేదీని తిరుమంజన, తిరుకల్యాణ మహోత్సవమున్ను
27-7-52 వ తేదీని శీర్ పాడల్ ఉత్సవమున్ను
28,29,30 వ తేదీలలో యడాయత్తు ఉత్సవమున్ను
31-7-52 వ తేదీని గీతామందిరములో జరుపబడిన "పెరియాళ్వారుల విందు"న్ను సేవించదగిన ప్రధానోత్సవములు.

ఈ పెరియాళ్వారులు విందు ఉత్సవమునాడు గం 4-0 లకు శ్రీ ఉప్పుటూరువారి రామానుజకూటమున మేళతాళములతో విమానములో పెరుమాళ్ళు వేంచేయుచుండగా వెనుక వందల

కొలది పత్త్రైరములలో వివిధ చిత్రవిచిత్రకానుకల నుంచుకొని సుందరముగ సలంకరించుకొనిన పెక్కురు నారీమణులు శ్రీమతి మంగమ్మగారిచే క్రమబద్ధముగ నడిపించబడుచు గీతామందిరము నకు గంట లకు విచ్చేసిరి. గీతామందిర కార్యకర్తలగు శ్రీమతి పాతాళం వేదమ్మగారు వారినెదు ర్కొని హారతులర్పించి స్వాగతమిచ్చి మందిరములో ప్రవేశపెట్టి పెరుమాళ్ళకు, తాయారులకు అష్టోత్తర అర్చనలు జరిపించి శర్కరప్రసాద వినియోగము జరిపించిరి.

పిమ్మట శ్రీమతి పువ్వాడ మంగమ్మగారు యీఉత్సవ విశేషములను ఉపన్యసించిన పిమ్మట శ్రీమాన్ తె. కం. గోపాలాచార్యులుగారు పెరియాళ్వారుల అవతారవైభవమును వారుగావించిన శ్రీసూక్తి విందునుగూర్చి ఉపన్యసించిరి. జనము క్రిక్కిరిసి పోవుటచే కార్యక్రమమును సంకుచింప జేసి తీర్థప్రసాద వినియోగములు జరిపించి ముగించిరి. ఈవిందునకగు ఖర్చునంతను శ్రీమతి శ్రీశ్రీ మీర్జాపురం జమీందారిణీ వారుభరించి వానికి గల అభిమానమును ప్రకటించిరి.

ఇట్టిమహోత్సవమునకు కారణభూతులగు శ్రీమతి పువ్వాడ మంగమ్మగారిని నారీరత్నములు వేనోళ్ళకొనియాడి వేంచేసిరి.

ఈఉత్సవములో శ్రీమతి పూర శ్రీదేవమ్మగారు, శ్రీమతి కొత్తూరు రంగనాయకమ్మగారు బెవల అలివేలతాయారమ్మగారు మొదలగువారు గావించినసేవ వర్ణనాతీతము.

## శ్రీవిశిష్టాద్వైత ప్రచారకసంఘ శ్రావణమాస పండితసభ

నడిగడ్డపాలెమున నెలకొల్పబడిన శ్రీపాదుకాక్షేత్రమందలి శ్రీ వాసుదాసాశ్రమము నందు శ్రీవాసుదాసుగారి ప్రియభక్తులును జ్ఞానవయోవృద్ధులను నగు శ్రీమాన్ కూ. వెంకటప్పదాసు గారు శ్రీవారి తిరువధ్యయన మహోత్సవసందర్భమున ఈనెల 2వ తేదీ మొదలు 3 రోజులు యీ సభలను అతివైభవముగా జరిపించిరి. ఈ సభలకు ప్రస్తుతము చెన్నపట్టణ వాస్తవ్యులగు శ్రీ ఉ. వే. శ్రీమాన్ పండిత చక్రవర్తి శ్రీనివాసరంగాచార్య స్వామివారు అధ్యక్షత వహించిరి. చీరాలలో వేంచేసియున్న శ్రీ శ్రీ శ్రీ అద్దంకి అయ్యావార్లంగారు బాపట్లలో వేంచేసియున్న శ్రీ ఉ వే. శ్రీమాన్ కొ. యి. శ్రీనివాసరామానుజాచార్యులుగారు విజయవాడ కాపురస్తులగు శ్రీ ఉ. వే. శ్రీమాన్ శ్రీమత్తిరుమల పల్లేర్లముడి రామస్వామివారు, శ్రీ ఉ. వే. శ్రీమాన్ తి. న. చ. సం. జగన్నాథ తిరువెంకటాచార్యులుగారు వగైరా పెక్కుమంది పండితులు విచ్చేసి సభల నతివైభవముగా జరిపిరి. ఆసేతు సీతాచలము శ్రీవిశిష్టాద్వైత విజయధ్వజముల నెగిరింప సంకల్పించి తమ జీవితసర్వస్వముల ధారబోయుచు నహోరాత్రములు కృషి సల్పుచున్న మన సంఘ కార్యదర్శిగారైన శ్రీ ఉ. వే. శ్రీమన్నారాయణాచార్యులుగారు యీ మధ్య 4 మాసములు మిక్కిలి అస్వస్థులై శ్రీవైష్ణవలోక మహాభాగ్య విశేషముచే పల్లాండు పల్లాండుగా వేంచేసియుండి యీ ఆశ్రమమును కొంతకాలము తమకు విశ్రాంతి స్థానముగా కల్పించుకొని యుండుటచే వారిని

దర్శించు నాశతో పెక్కురు మతాభిమానులు విచ్చేయుటచే ఉత్సవము ద్విగుణీకృత వైభవముతో నలరారెను.

అచ్చట కార్యనిర్వాహక ధురంధరులగు శ్రీ కొ. వెంకటప్పదాసుగారి ఆదర సన్మానములకు ఈడుపడిన భాగవత బృందమునకు చివరకు ఆ యాశ్రమమును విడిచివచ్చుట చేపునను విడిచిన ఆవుదూడను రాటకు చేర్చి కట్టినంత శ్రమకరమైనది.

ఆ మూడు దినములలో ఉదయము పరమవైదికముగా భాగవత బృందముచే శ్రావ్యముగా తిరుహాయ్ మొళి సేవ గావింపబడెను. అచ్చట అర్చనా విధానమును గావించుచున్న కైంకర్య నిధులగు శ్రీమాన్ కొ. వెంకటాచార్యులుగారి శ్రద్ధాభక్తులు ప్రశంసనీయములు. చివర దినము రాత్రి ఆ యాశ్రమవాసులు తన్మయావస్థలో భజన గావించి వారికి శ్రీ వాసుదాసుగారియందున్న శ్రీ భాగవత బృందమునందును గల భక్తిని మూర్తీభవింపజేసిరి. స్వాములు ఆదరసన్మానములతో వీడ్కొల్పబడిరి.

మన సంఘ కార్యదర్శిగారగు శ్రీ ఉ. వే. శ్రీమాన్ ఆ. చి. శ్రీమన్నారాయణాచార్యులుగారు విశ్రాంతి ఆనుషంగికముగను, ఆశ్రమ సంస్కరణము ప్రధానోద్దేశముగను సుమారు 3 మాసములు అచ్చటనే యుండ నిశ్చయించుకొనిరి. వారచ్చట అచిరకాలములో తిరుమంత్రాది కాలక్షేపములుగూడ సుబోధకముగా కొద్దికొద్దిగా సాయించుదురు. ఆసక్తిగలవారం దన్వయించి సదవకాశమును సద్వినియోగ పరచుకొందురు గాక.

★

## ★ విజ్ఞప్తి ★

శ్రీ భాష్యరచనకు మూలాధారమై యొప్పు "సిద్ధిత్రయమును" శ్రీ ఆళ్వందారు సాయించిరి. అది వ్యాఖ్యాన సాపేక్షిత గ్రంథమగుటచే పాఠప్రవచనలో లేదు. దాని కింతవరకు మంచి వ్యాఖ్యానమును సమగ్రముగా రచించిన వారేలేరు. కాని దైవవశమున యీ మధ్య శ్రీపెరుంబూదూరులో వేంచేసియున్న శ్రీ ఉ. వే. శ్రీమాన్ అనూరి రామానుజాచార్య స్వామి వారి ప్రియశిష్యులగు న్యాయవ్యాకరణ వేదాంత శిరోమణులైన శ్రీ ఉ. వే. శ్రీమాన్ ప్ర. భ. అణ్ణంగరాచార్యులవారు "సిద్ధాంజన" మనుపేరుతో రచించిన సమగ్రమగు చక్కని వ్యాఖ్యానమొకటి కార్యాలయమున కందజేయబడినది. అది పరిశోధనకై పండిత పరిషత్తున కందజేయబడినది. మతాభిమానులగు ధనాఢ్యుల ఆర్థికసహాయముతో నది త్వరలో ముద్రింపబడవలసియున్నది. అట్టి ఆదరముగల ఉదారులు ద్రవ్యసహాయము చేయుదురు గాక యని ప్రార్థించుచున్నాము.

మరియు

బ్రాహ్మణ్యాపాదకమగు ప్రధాన నిత్యకర్మగా బరగు సంధ్యావందనమునకు మన సంప్రదాయానుసారముగ వ్యాఖ్యానము లేదనెడు చింత చాలకాలము నుండి బాధించుచున్నది. కాని యీ మధ్య నెల్లూరు వాస్తవ్యులగు శ్రీ ఉ. వే శ్రీమాన్ శ్రీమత్తిరుమల నల్లాన్ చక్రవర్తుల తిరువేఙ్కటాచార్యుల అయ్యవార్లంగారు శ్రీ శ్రుతప్రకాశకాచార్యులను శ్రీవరదాచార్యులను అపర నామధేయముగల శ్రీ సుదర్శన సూరులచే రచింపబడిన ప్రాచీన సంధ్యాభాష్యమును కార్యాలయమున కందజేసిరి. అదియు ముద్రింపబడవలసిన అత్యంతావశ్యకత గలిగియున్నది. ఉదారుల ద్రవ్య సహాయమునకై నిరీక్షించుచున్నాము.

---

## శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘముయొక్క పాలకొల్లులోని స్త్రీ శాఖ యగు

# శ్రీ యతిరాజ సేవా మహిళా మండలి

పాలకొల్లులో శ్రీ అష్టభుజ లక్ష్మీనారాయణ స్వామివారి దేవస్థానమున కనుమూరి రంగనాయకమ్మ గారి అధ్యక్షతను ది 23–7–52 తేదీ నుండిమూడు దినములు తన శాఖా వార్షికోత్సవమును చాల వైభవముగ జరిపిరి. అనేకమంది పండితులు విదుషీమణులు వేదాంత విషయముల ఉపన్యసించిరి.

అధ్యక్షురాలు:— సచ్ఛిష్యలక్షణము; పిళ్ళైయరంగావిల్లు దాస చరిత్ర.

| | |
|---|---|
| శ్రీ ఉ. వే. శ్రీమాన్ శ్రీ త్రి. పు. ధర్మాచార్యులుగారు | రామానుజ వైభవము |
| ,, ,, ,, ఆరవిల్లి అళహశింగరాచార్యులుగారు | ఆచార్య వైభవము.<br>భాగవత వైభవము. |
| ,, ,, ,, గో. వెం. శేషభట్టరాచార్యులుగారు | పురుషకార వైభవము. |
| ,, ,, ,, ము. కృష్ణమాచార్యులుగారు | సౌందర్య మంతరాయము<br>ఆండాళు వైభవము. |
| ,, ,, ,, బెల్లంకొండ రాఘవాచార్యులుగారు | ఆచార్య వైభవం,<br>తిరుప్పావుసారం. |
| ,, ,, ,, ఆరవిల్లి శ్రీరంగాచార్యులుగారు | ఆండాళు వైభవం. |

మున్నగు విషయముల ఉపన్యసించిరి. వందలకొలది భక్తజనమిందు పాల్గొని ఆనందించిరి. నూతన కార్యకారిణి సమితి ఎన్నికలు జరిగినవి.

# శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘ శాఖ యతిరాజ సేవా మహిళా సంస్థ

## పాలకొల్లుశాఖ కార్యకారిణి సమితి సభ్యులు

అధ్యక్షులు: సలాది ఆండాళమ్మగారు

ఉపాధ్యక్షురాలు: మాచేపల్లి రత్నమాణిక్యంగారు

కోశాధికారి: మోటమఱ్ఱి అప్పలనరసమ్మగారు

కార్యదర్శి: కనుమూరి రంగనాయకమ్మగారు

సహాయకార్యదర్శి: శిరం అంబిరాజుగారు

### కార్యకారిణి సభ్యురాండ్రు

చెక్కా తాయారుగారు

చెక్కా అనసూయగారు

కారుమూరి వనమరాజుగారు

మాచేపల్లి కస్తూరిగారు

సలాది రామలక్ష్మమ్మగారు

బంగారు సత్యవతిగారు

రేపాక సీతారత్నంగారు

బంగారు రత్తమ్మగారు

జూపూడి శకుంతలమ్మగారు

కంచర్ల విజయమ్మగారు

తుమ్మలపల్లి సుభద్రమ్మగారు

### ఉత్సవ జమ ఖర్చులు

#### జమలు

| | |
|---|---|
| భక్తుల వలన వసూలైన చందాలు | 123- 0-9 |
| క్రిందటి సంవత్సరం నిల్వ | 69-15-9 |
| డిబ్బీవల్ల వసూలు | 14- 0-3 |
| | 207-0-9 |

#### ఖర్చులు

| | |
|---|---|
| మూలవిరాట్టుల భోగములకు | 41- 0-0 |
| పండితులకు శాలువలకు | 20- 0-0 |
| పండితులకు సన్మానములు | 22- 8-0 |
| [illegible] | 4- 4-0 |
| ప్రయాణ ఖర్చులు | 9-10-0 |
| సామాన్లు | 1- 8-0 |
| విద్యుచ్ఛక్తి బల్బులు | 7- 1-3 |
| చిల్లర ఖర్చులు | 2-13-0 |
| సంఘ సంభావన | 5- 0-0 |
| | 104-12-3 |

రాబడిలో ఖర్చులు పోగా మిగత నిల్వ రూ 102-5-6 మండలి అధ్యక్షురాలగు శ్రీమతి సలాది ఆండాళమ్మ గారివద్ద ఉంచడమైనది.

---

శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘ మదరాసు శాఖా కార్యదర్శులైన శ్రీమాన్ కరాలపాటి రాధాకృష్ణయ్యగారు శ్రీవిష్ణుసహస్రనామమును సూచించు ఒక్కొక్క చిత్రముగా వ్రాయించ దలంచుచున్నారు. ఆ చిత్రమును చూచిన తోడనే ఆనామార్థము హృదయారూఢము కావలెను. అట్టి చిత్ర సూచనలు బుద్ధిమంతులు యథామతి కార్యాలయమునకు తెలుపుదురుగాక. ఎవరికేనామమున కేచిత్రము స్ఫురించిన దానిని మాత్రమైనను తెలుపవచ్చును.

రిజష్టరు నెం. 5049

# భక్తి నివేదన

(వేదాంత మాసపత్రిక)

ఇందు వేదాంత విషయ రాజములున్ను; భక్తి ప్రచార విషయమైన వార్తలున్ను వేదాంత సాంప్రదాయ విషయకమైన శ్లోకార్థములున్ను ప్రచురించబడును.

చందాలు;

సాధారణ చందా సం. ఒ 1కి రు 5-0-0.

సహాయ చందా ,, రు. 10-0-0.

Book-Post

Sri Venkateswara Oriental Library,
TIRUPATHI, Chittur Dt.

1. శ్రీమన్నారాయణుడే సృష్టి - స్థితి లయ - కారకుడు.
2. ఆయనే మోక్షప్రదాత.
3. ఆయనే పరతత్త్వము-పరమాత్మ
4. ఆయన అఖిలహేయ ప్రత్యనీక కల్యాణ గుణకుడు.
5. ఆయనకు జీవుడు శరీరభూతుడు; శేషభూతుడు, పరతంత్రుడు, నియామ్యుడు, అనుభావ్యుడు.
6. జీవులు జ్ఞానైకాకారులు.
7. జీవులు అనంతములు.
8. జీవులు పరమాత్మకంటె భిన్నులు; ఈ భేదము సత్యమైనది; నిత్యమైనది.
9. జీవ-పరమాత్మలకు ప్రకృతి శరీరభూతమైనది; శేషభూతమైనది; పరతంత్రమైనది; నియామ్యమైనది; అనుభావ్యమైనది.
10. ప్రకృతి వికారాస్పదమైనది. జీవపరమాత్మలకంటె భిన్నమైనది, ఈ భేదము సత్యమైనది; నిత్యమైనది.
11. జీవుడు ప్రకృతి వియుక్తుడై పునరావృత్తి రహితమైన పరమాత్మ సాన్నిధ్యమగు పరమ పదమును పొందుటయే మోక్షము.
12. భక్తి ఒక్కటియే మోక్షసాధనము.
13. భక్తి యన తైలధారవలె అవిచ్ఛిన్నమైన స్మృతి పరంపర.
14. వివేక-విమోక-అభ్యాస-క్రియా- కల్యాణ అనవసాద-అనుద్ధర్షలు భక్తికంగములు.
15. ఇవి సదాచార్య-సమాశ్రయణ-లభ్యములు
16. జగద్గురువగు శ్రీరామానుజాచార్యులు వారును; వారి యనుయాయులున్ను సదాచార్యులు.

"నగురుర్వైష్ణవాత్ పరః" భా, పం.

Edited Published & Printed by A. Ch, Srimannarayanacharya at Sriman Press, Kakinada.

# ★ విజ్ఞప్తి ★

## శరన్నవరాత్రోత్సవములు.

స్వస్తి శ్రీ నందననామ సంవత్సర ఆశ్వయుజ శుద్ధ పాడ్యమీ శనివారము (20-9-52) తేది లగాయతు ఈ శుద్ధనవమీ ఆదివారము (28-9-52) వరకు శరన్నవరాత్రోత్సవములు. ఇవి ప్రపన్నులగు శ్రీవైష్ణవులకు కూడ ముఖ్యమగు పర్వదినములు.

అగ్నిహోత్రము సర్వత్ర పవిత్రమైనదియు, పూజ్యమైనదియు, అయినను యజ్ఞవేదిక యందలి యగ్ని అతిపవిత్రవంతమైనదిగను, సద్గృహస్థునింటి యగ్ని సాధారణ పవిత్రమైనదిగను, శ్మశానమందలి యగ్ని అపవిత్రమైనదిగను భావించబడునటులనే సర్వేశ్వరుడు సర్వదేశ సర్వకాలముల యందును సర్వవ్యాపకుడై యున్నను, ఆయా దేశ-కాల-పాత్రలనుబట్టి ఆయనయొక్క తేజ-శక్తి-గుణములు హెచ్చు-తగ్గులై ప్రకాశించుచుండును. దీనిననుసరించియే ఆయాయధికారులు ఆయా దేశ విశేషములందును, కాలవిశేషములందును సర్వేశ్వరుని ఆరాధించి అనుభవించి, ఆనందించుచుందురు. ప్రపన్నులు దేవతాంతర్యామిని ఆరాధించకుండుటకున్ను ఇదియే కారణము.

ఇట్టి కాలవిశేషములలో ప్రపన్నులకు శరన్నవరాత్రములు సర్వేశ్వర విశేషారాధనలకు మిక్కిలి యోగ్యములు. ఈకాలము శ్రీ-శ్రియఃపతులకు మిక్కిలి ప్రీతిపాత్రమైనది. ఈనవరాత్రములలో కొంతమంది శ్రీమద్రామాయణమును గాని, లేక కనీసము సుందరాకాండను గాని పారాయణ చేయుదురు.

కొందరు శ్రీ-శ్రియఃపతుల ప్రతినిత్యము విశేషముగ ఆరాధించుచుందురు. శ్రీవిశిష్టాద్వైత సాంప్రదాయస్థులైన ప్రపన్నులగు స్త్రీపురుషులందరున్ను ప్రతినిత్యము ఉదయమున తిరువారాధనములో పెరుమాళ్ళకు తాయార్లకు పంచసూక్తములతో పంచామృత తిరుమంజనము సమర్పించి శ్రీవిష్ణు సహస్రనామములతోను, శ్రీలక్ష్మీ అష్టోత్తర శతనామములతోను, తులసీతో అర్చననుచేసి పాయసమును విశేషారగింపును చేసియథాశక్తిని తదీయారాధనమున్ను, సాయంకాలము తిరువారాధనవద్ద దీపారాధనను సమర్పించినవెంటనే అష్టోపచారముల సమర్పించి పిమ్మట శ్రీకృష్ణాష్టోత్తర శతనామములతోను శ్రీలక్ష్మీ సహస్రనామములతోను శ్రీచూర్ణముతో గాని లేక తులసితో గాని అర్చననుచేసి శక్తిను సారముగ తీపి అప్పములు. (గోధుమపిండితో చేసినవి శ్రేష్టములు లేనిచో వరిపిండితో గాని చేయవచ్చును.) విశేషారగింపుచేసి మంగళాశాసనమును సమర్పించవలెను.

ఇంతియేగాక ఉదయమున శ్రీరంగగద్యను క్షమాషోడశిస్తోత్రమును సాయంకాలము శరణాగతిగద్యను శ్రీగుణరత్నకోశస్తోత్రమును విన్నవించుచుండుట విశేషము వీనిని అందరు విన్నవించవచ్చును.

మరియు ఉపనీతులగువారు తమ శాఖీయవేదములనుగాని లేక అథర్వశిఖోపనిషత్తును గాని విన్నవించవచ్చును. ఇంతియెగాక శ్రీభాష్యము గీతాభాష్యము. వేదార్థసంగ్రహములు విన్నవించుట విశేషము. శ్రీమద్రామాయణమును పారాయణము చేయువారు అటులనే చేయవచ్చును.

శ్రీవిశిష్టాద్వైత ప్రచారకసంఘము వారున్ను శ్రీయతిరాజసేవా మహిళామండలి వారున్ను తమతమ ప్రాంతములయందు ఈపర్వదినము సమిష్టిఉత్సవములు జరిపి వాటి వివరములు క్లుప్తముగా ప్రధానకార్యాలయమునకు తెలిపిన ప్రచురించగలము.

శ్రీవిశిష్టాద్వైత ప్రచారకసంఘ కార్యాలయం
గీతామందిరము 107, వరదాముత్తియప్పన్‌వీధి,
మదరాసు—1

శ్రీమతే రామానుజాయనమః

# భక్తి నివేదన

వేదాంత మాస పత్రిక

| సంపుటి ౪ | నందన-ఆశ్వీయుజమాసం | సంచిక ౭ |
|---|---|---|

## ★ యాదార్థ విద్య ★

స్థలము:-శ్రీభట్టరువారి కాలక్షేపమందిరము

సన్నివేశము:-శ్రీభట్టరువారు కాలక్షేపము సాయించుటకై ఎత్తైనఆసన మందు వేంచేసి యుందురు వారికి ఎదురుగ వారిశిష్యులు కూర్చొనియుందురు శ్రీభట్టరు వారి ఎదురుగ వ్యాసపీటముపై ఆచార్యహృదయ కోశము ఉండును. వారు ఎవరిరాకకొరకో నిరీక్షించు చుందురు.

కాలము:-ఉదయము గం. 8-0 లువేళ

భట్టరువారు:-ఏమాత్రము ప్రొద్దెక్కినది ?

ఒకశిష్యుడు:-స్వామి ! సుమారొక ఝాము ప్రొద్దెక్కినది.

భట్టరువారు:-అబ్బ అలాగునా ? ఇంకను మన నరశింహాచార్య స్వామివారు వేంచేయ లేదేమో ?

మరొకశిష్యుడు:-మామూలుగ వచ్చువేళ కొద్దిగ అతిక్రమించినది. వచ్చుచునే యుండవచ్చును,

మరొకశిష్యుడు:-ఏమో ఆయన ఎపుడువచ్చినను వకటే. శాస్త్రజ్ఞానమా? మన్నా? అన్నీ సున్నా !

అత్యంత శాస్త్రీయ విషయములతో నిగూఢమై, రత్నాకరముకంటె గంభీరమై విశేషధర్మ విభూషితమై, సహృదయ హృదయవిధేయమై విరాజిల్లు ఈ ఆచార్యహృదయము సాహిత్యజ్ఞాన శూన్యు

లైన, రామశబ్దమే రానటువంటి శ్రీ సీతారామాభ్యాన్నమః గార్లకు కొరకుప డునా ? భావమేనా స్ఫురించునా? వారి కొరకై నిరీక్షించుట వృథా కాలహరణము స్వామీ !

(ఈమాటలను శిష్యులలో కొందరు నివ్వెరపడి జూచుచుందురు. కొందరు చేతితో నోరుమూసుకొని ఆమాటాడు శిష్యుని కనుసైగతో సహా నివారించుచుందురు. మరికొందరు బట్టయడ్డము పెట్టుకొని ముసిముసినవ్వులునవ్వుచుందురు)

భట్టరువారు:—(ఆమాటలాడిన శిష్యునివైపు తల పంకించుచు చిరునవ్వు నవ్వుచుందురు. ఆనవ్వులో ఆశిష్యుని యజ్ఞానమును, దాష్ట్యమును అనుచిత సాహసమును అధిక్షేపించు చిహ్నాలుండును.)

[ప్రకాశముగ]

మీయందరికి ఆయన రాకుండగ ప్రారంభించుటే యభిప్రాయమైనచో అలాగు ననే చేతము. వారు వేంచేసినచో తిరిగి వారికి వేరుగా విన్నవించుకొందును.

ఇంతలో బీదవేషముతో, చంకని గుమ్మడికాయ రాగిచెంబు జోలితో నరశింహాచార్యస్వామి చేతులురెండు జోడించుకొని పరుగుపరుగున వచ్చుదురు. గోష్ఠికి ఎదురు సాష్టాంగ దండప్రణామములాచరించి, స్వాముల వెనుకనుండి శ్రీభట్టరు వారివద్దకు వత్తురు. శ్రీభట్టరువారుకూడ వెంటనే లేచి ఆస్వామికిసాష్టాంగదండము సమర్పించి, లేచి, తమదగ్గరగ ఆస్వామిని కూర్చుండ నియోగింతురు. మిగతశిష్యులు కొద్దిగవంగి దండము సమర్పింతురు)

నరశింహాచార్యస్వామి:—స్వామి రాత్రి శ్రీరంగనిభజన సమాప్తమగుసరికి చాల పొద్దుపోయినది. అందుచే తెల్లవారుఝామున లేచుటలో కొద్దిగ ఆలస్యమైనది. మరియు నేను ఆచార్యమాస తిరునక్షత్రమగుటచే పెరుమాళ్ళ తిరుమంజనము, సేవకాలము అగుటలో పొద్దు తెలియక ఆలస్యముచేశి అపచారపడితిని. దాసునిక్షమించవలెను.

భట్టరువారు:—అబ్బే ! ఆలస్యమేమైనది పరవాలేదులెండి.

నరశింహాచార్యస్వామి:—అడియేను,

భట్టరువారు:—ఆజ్ఞ ! ప్రారంభించుదామా.

నరశింహాచార్యస్వామి:—అడియేను,

భట్టరువారు:—[ఆచార్య హృదయ శ్రీకోశమును తెరచి చదువుదురు]

"అజ్ఞర్ భ్రమిక్కిఅ వర్ణాశ్రమ విద్యావృత్తంగళై గార్దభజన్మం శ్వపచాధమం. శిల్పనైపుణ్యం. భస్మాహుతి, శవ, విధవాలంకారంఎన్ఱు కజికప్పర్‌కళ్"

లోకములో తత్త్వ—హిత—పురుషార్థముల యథార్థస్వరూపమును తెలియనట్టియు, తెలిసిననునమ్మకము కుదురనట్టియు, నమ్మకము కుదిరినను మానసికమైన సంపూర్ణవిశ్వాసము లేనట్టియు, సంపూర్ణవిశ్వాసము కలిగినను ఒరుల కుపదేశించుటయేగాని తామనుష్ఠించ ప్రయత్నించనట్టియు, తామనుష్ఠించ ప్రయత్నించినను అధ్యవసాయ లోపముచే వాసనావాసిత సంస్కారవిశేషముచే

ఆకర్షితులై పూర్వపుస్థోరణిలో పడువారలందరు కూడ అజ్ఞానులే. కాని అట్టివారు కూడ మేము సత్కులజాతులమనియో, ఉత్తమాశ్రమస్థులమనియో విద్యానిపుణులమనియో, గొప్పవృత్తుల గలవారలమనియో, విఱ్ఱవీగుచుందురు. అంతియేకాదు యితరులను అవమానపరచి కించపరచుచుందురు అదికాలమహిమ,

శ్లో॥ విద్యానిపుణావయ మిత్యన్యే ।
హృద్యా ధనినో వయ మిత్యన్యే ।
సత్కులజాతా వయ మిత్యన్యే ।
తేషు కలిం పరిపూర్ణం మన్యే ॥

ఇట్లు అహంకారము, ఆత్మశ్లాఘ్యము, పరనైచ్యానుసంధానము చాల అపచారకరమైనది, స్వరూపనాశకరమైనది.

గాన (భ్రమాత్మక వర్ణ–ఆశ్రమ–విద్యా–వృత్తులు గాడిదయొక్క జన్మమువలెను. శ్వపచాధమునివలెను. దొమ్మరివిద్య నాటకముల యందలి వేషములు కాగితములమీద గీయుబొమ్మలు వలెను, బూడిదలో చేయబడు ఆహుతులవలెను శవములకు విగతభర్తృకలకు చేయబడు అలంకారములు వలెను వ్యర్థములు. అంతియే కాదు. నీచములు, నిషిద్ధములు యగుచున్నవి. జ్ఞానమే ప్రధానమైనది, అదియే ఆదరించబడవలశినది. దానిని బట్టియే ఉచ్చనీచ తారతమ్యములు నిర్ణయించబడయును. అందుచే జ్ఞానులకు పెద్దలు కేవల బాహ్యములగు వర్ణ–ఆశ్రమ–విద్యా–వృత్తులనుబట్టి మాత్రమే చూడక ఆంతరంగిక జ్ఞానమును బట్టియే ఎవరినైనను ఆదరింతురు. తామును అటులనే తరింప ప్రయత్నింతురు.

[ఇంతలో ఒక శ్రీవైష్ణవ సన్నిధి స్వామి వచ్చి భట్టరు వారితో ప్రకాశముగా]

సన్నిధిస్వామి:– అడియేను

భట్టరువారు:– [కాలక్షేపమాపి, ఆ వచ్చిన స్వామికేసి తిరిగి] ఏమండీ ఏమిటి విశేషం.

సన్నిధిస్వామి:– అడియేను. ఎవరో ఒక విద్వాంసులు విచ్చేసిరి. ఆయన షట్‌శాస్త్ర పండితులట. అనేక విద్వత్సభలలో, రాజ మహారాజ సన్నిధిలలో జయశ్రీని వరించి సన్మానముల బొందియుండెనట. తనకీ లోకమున సమాన పండితు లెవరును లేరట. చాల దూర దేశమునుండి వచ్చిదాడట. దేవరవారి నొక పర్యాయము జూచి పోదలచి వచ్చినారట. అవల తెన్నెపై కూర్చుండబెట్టి దేవరవారి యాజ్ఞకై వచ్చినాడ.

భట్టరువారు:– అలాగునా? ఎవరైతేనేమి? ఎవరోవకరు కాలక్షేప విరోధి. అయినను నేడు కొద్ది ఆలస్యమైనది. మన స్వాములకు పొద్దు పోయినది. సరే. నిమ్మళముగా వారిని తీసుకొని రమ్ము.

[నరశింహాచార్యులవారి వైపు తిరిగి నేటికి శాంతి చెప్పుటకు యాజ్ఞ.

నరశింహాచార్యులు: అడియేను. దేవరవారి కటాక్షం. [భట్టరువారు ఆసనము నుండి లేవగా శిష్యులందరు కూడ లేతురు. అందరు శాంతి పాఠమును చదివి సాష్టాంగ దండము సమర్పింతురు.

నరశింహాచార్యులువారు:– స్వామి ఆజ్ఞ–

భట్టరువారు:– అడియేను: [అనుచు నరశింహాచార్యులువారు వెళ్ళుచుండగా భట్టరువారు

తాము కూడ వారితో కొన్ది దూరము వెళ్ళి సాగనంపి వచ్చి తిరిగి తమ ఆసన మలంకరింతురు. శిష్యులు కూర్చొనియుందురు. ఇంతలో మొగమున పెద్దకుంకుమ బొట్టును ధరించి పెద్ద ఎర్రని జరీఅంచుల కాశ్మీర శాలువను గప్పుకొని, తలకు బనారసు కండువా తలపాగా చుట్టుకొని యున్న పండితుని సన్నిధిస్వామి తీసుకొని వత్తురు. ఆ పండితుడు ఏమాత్రము వినయము లేనివాడై గర్విష్టిగా కనబడుచుండును. నమస్కారాదుల నేమియు చేయబడు భట్టరువారు కూడ దూరమునుండిరో ఆ పండితుని వాలకిమును గ్రహించి తామాసనమునుండి లేవకయే నమస్కారాదుల చేయకయే] [ప్రకాశముగ]

పండితవర్యా దయచేయుడు. (అని తమ ప్రక్కనే ఒక ఆసనమును జూపుదురు)

పండితుడు నలుప్రక్కల వింతల జూచుచు సగర్వముగ ఆధత్యాసనముపై కూర్చొనును.

భట్టరువారు:- మహాశయా తమదే ప్రాంతమువారు. ఇచ్చటి కెపుడు దయచేసినారు? తమ విశేషముల తెలియగోరుచున్నాను.

పండితులు:- మేము కాశ్మీర పురవాసులము కాశీలో 22 వత్సరములు షట్ఛాస్త్రములను చదివినాము. క్రమాంత అధ్యయనమును జేసినాము. వేదాంతవిద్యయందు మాకభిమానము హెచ్చు. దిగ్విజయ యాత్ర జేయుచు నిన్ననే యిచ్చటికి వచ్చినాము.

భట్టరువారు:- ఓహో అలాగా చాల సంతోషము.

పండితులు:- నిన్న సాయంకాలమున దేవాలయమునకు వెళ్ళినపుడు ఈ మీ శిష్యులచ్చట పాఠముల వల్లించుకొనుచుండిరి. వీరందరిని న్యాయములో నకరిని, వ్యాకరణమున నొకరిని, మీమాంసలో నొకరిని, అధ్యయనములో నొకరిని, బ్రహ్మసూత్ర భాష్యములో నొకరిని పరీక్షించి జూచితిమి. వీరందరు చాల బాగుగా చాల వ్యాసంగము చేసిన శాస్త్రీయపండితులే వీరందరు మీ సర్వతోముఖ పాండిత్య ప్రతిభల గూర్చి నాకు తెలిపిరి. మిమ్ముల జూచి పోదమని మేమే వచ్చితిమి.

భట్టరువారు:- చాల సంతోషము, మీ వంటి విద్వచ్ఛిఖామణుల కలుసుకొని నందులకు చాల ఆనందముగ నున్నది.

[సన్నిధి స్వామితో]

పండితులకై ఒక తాంబూలము తేవయ్యా

సన్నిధిస్వామి:- అడియేను. [అని ఒక పళ్ళెములో ఒక తాంబూలమును రెండరిటి పళ్ళను తెచ్చి పండితుల కందించును. పండితులు మొగము చిట్లించుకొనుచు ఆ తాంబూలమును తీసుకొని లేచును.]

పండితులు:- పోయివత్తుము.

భట్టరువారు:- [ఆసనముపై కూర్చొనియుండియే] చిత్తము. [పండితులు అసంతుష్టితో వెళ్ళిపోవును.]

ఒక శిష్యుడు:- స్వామి ఈ పండితుడుచాల గొప్పవాడు. నిన్న మాతో చాల ప్రొద్దు వాదించెను. ఆయన వాదనా నైపుణ్యము శాస్త్రీయవ్యాసంగం యుక్తి సమర్థన చాల అద్భుతముగ నున్నవి. మన ప్రాంతమందే కాదు మనదేశమందే యిట్టి సర్వతోముఖ శాస్త్రీయపాండిత్యము కలవారున్నారా యని

సందేహము మాకు కలిగినది.

పండితులెవరైన వచ్చినచో దేవరవారు వారి నెంతో గౌరవింతురు. ప్రత్యుత్థానము చేతురు. ఎంతో సేపు ప్రసంగింతురు. చివరకు శాలువో, దోవతులచాపో, బహూకరింతురు. గాని నేడీ పండితుని పట్ల దేవరవారేలనో ఔదాసీన్యము వహించితిరి. ఔదాసీన్యమే కాదు అప్రియభావమును వెళ్ళడించిరి. మన భైష్మక నిశానీ-నిర్మాత-నరసింహాచార్యులువారు వచ్చినపుడు దేవరవారు చేయు గౌరవ మర్యాదలలో సహస్రాంశమైన దేవరవారీ పండితుని పట్ల జూపక పోవుట మాకమితాశ్చర్యముగ నున్నది. నిన్న మేమే ఈయన నిచ్చటి కాహ్వానించితిమి కూడ...

భట్టరువారు:- ఓహో అలాగునా? ఈయన గొప్ప పండితుడే అయి యుండవచ్చును. గాని ఆయనను జూడడము తోడే నాకదేమో మనస్సున గౌరవభావ మంకురించలేదు.

శ్లో॥ విద్యా దదాతి వినయం వినయేన పాత్రతా!
పాత్రత్వాత్ ధనమాప్నోతి ధనాత్ ధర్మం తతస్సుఖం॥

కదా- ఈయనయందు విద్య పుష్కలముగా యుండవచ్చును గాని దానివల్ల కలుగవలసిన వినయాదులు ఆయనయందు సున్న. అసలాయన యందున్న ఆ విద్యా సంపత్తియు నిజమైన విద్య కాదు. అది భ్రమాత్మకమైనది. సందేహముల కాకరమైనది.

తత్త్వ-హిత-పురుషార్థ నిశ్చయ జ్ఞాన మీయని విద్య విద్యయా? అట్టి విద్యా భ్రాంతి వలన నిశ్చిత భ్రాంతియే గాని శాంతి ఎక్కడిది?

శిష్యుడు:- దేవరవారు ఆ పండితునితో శాస్త్రీయ ప్రసంగమే నొనర్చలేదే. ఆయన జ్ఞానమును యిటుల నిర్ధారణ జేయుట...

భట్టరువారు:- మనిషిని జూచినచో, ఏదు మాటలు మాట్లాడినచో, తెలియకటయ్యా, ఆ మనిషి స్వరూప స్వభావములు.

శ్లో॥ యతీశ్వర సరస్వతీసురభితాశయానాంసతాం
వహామిచరణాంబుజం(ప్రణతశాలినామాళినా॥

అని దేశికులు గాయించినటుల శ్రీమద్రామానుజ దివ్య శ్రీసూక్తి గలవారి పాదపద్మముల శిరస్సున ధరించవలసిన [illegible] అంతేకాని

శ్లో॥ ఘ్నంతం శపంతం పరుషం వదంతం ।
న వైష్ణవం ప్రతికుర్వీత విద్వాన్ ॥

ఆత్మస్తుతి-పరనింద-పరుషవాక్యములు గలవారిని పరమార్థజ్ఞానులు లాగ యాదరించుట ఎటుల? పోనిండు నేనే పొరబడితినేమో, రేపు తిరిగి ఆయనను తీసుకొని రండు. వారి పాండిత్య ప్రతిభను అనుభవించి ఆదరింతును.

శిష్యు:- అడియేను. మహాభాగ్యము.

## రెండవ రంగము.

స్థలము:- శ్రీభట్టరువారి కాలక్షేపకూటము.

కాలము:- మరుచటిదినము ఉదయము గం 11-0 వేళ

సన్నివేశము:- భట్టరువారు ఒకఆసనముమీదను పండితుడొక ఆసనము మీదను అధిష్ఠించి యుందురు.

వారిని పరివేష్టించి శిష్యులుందురు.

భట్టరువారు:—ఆర్యా! తత్త్వ-హిత-పురుషార్థములగురించి తమ నిశ్చయమైన విశ్వాసమేమి?

పండితులు:—అయ్యా! ఏనిని గురించి ఇదమిత్థమని నిర్ణయించి నిశ్చయించుట చాలకష్టము. ఎందుచేతననగా శాస్త్రములన్నియు ప్రమాణతమములే. ఒక్కొక్క-శాస్త్రము ఒక్కొక్క-విధముగ తెలుపుచున్నది, వీటన్నింటికి తలబాదుకున్నను ఏకవాక్యత కుదురదు. ఏశాస్త్రమును కాదని త్రోసివేయగలము. దేనికదేగొప్పది. మేము భాష్యములు జూచియున్నాము. కాని ఏభాష్యము ఇదమిత్థమని సిద్ధాంతరీకరించ లేకున్నవి. జ్ఞానమాత్రమే తత్త్వమనియు, జ్ఞానాజ్ఞానభేద ధర్మనమే హితమనియు, జ్ఞానస్వరూపమైన యాత్మయొక్క స్వరూపోచ్ఛిత్తియే మోక్షమనియు ప్రపంచప్రచార మొనర్చె బౌద్ధాదులు.

జగజ్జన్మాదికారణరహిత పంగు సమాన కేవల అధిష్ఠానభూత పురుషవిశేషుడు మాత్రమే తత్త్వమనియు, అట్టిజగత్ప్రసూతి అంధురాలైన ప్రకృతియనియు, పురుష-ప్రకృతి వివేకమే హితమనియు, ప్రకృత్యతీతుడై పాషాణకల్పుడైయుండుస్థితిని సంపాదించుటే పురుషార్థమనియు వక్కాణించును సాంఖ్యశాస్త్రకర్త కపిలమహర్షి

జీవాత్మ-పరమాత్మలు భిన్నులుగాక వక్కటే యందురు, సాంఖ్యులున్ను, యోగులున్నుసర్వాత్మనా జీవవిశేష సమానుడు, అనుమానికుడు అగు పురుషవిశేషుడే తత్త్వమనియు, సప్తపదార్థతత్త్వజ్ఞానమే హితమనియు, ఆనందాది రహితమైన అపురుషవిశేష సాన్నిధ్యలాభమే పురుషార్థమనియు పలుకును వైశేషికశాస్త్ర భర్తక ణాదమహర్షి.

సర్వజ్ఞ-సర్వశక్తి సమన్వితుడే అయినను ఊహాసంజనిత బుద్ధిగ్రాహ్యుడై పరిమిత పరిమాణాది గుణాన్విత పురుషవిశేషుడేతత్త్వమనియు, షోడశపదార్థ నిశ్చయజ్ఞానమే హితమనియు, చతుర్వింశతి దుఃఖధ్వంసమే పురుషార్థమనియు ఢంకా బజాయించును. న్యాయశాస్త్రగురుడు గౌతమమహర్షి.

సర్వసాధకశక్తి విశిష్టపరమాపూర్వమే తత్త్వమనియు స్వర్గాదిఫలసాధకమగు జ్యోతిష్టోమాది యజ్ఞ-యాగాదులే హితమనియు, స్వర్గాద్యనుభవమే పురుషార్థమనియు విధించుచున్నాడు మీమాంసాచార్యుడగు జైమిని మహానుభావుడు.

పశుపతియే తత్త్వమనియు, తదుపాసనయేహితమనియు పశుపతి సాన్నిధ్యరూప కైవల్యప్రాప్తియే పురుషార్థమనియు ప్రతిపాదించుచున్నాడు, పాశుపత మతసంస్థాపకుడగు బసవాచార్యుడు.

గణపతియే తత్త్వమనియు, వామాచార విశిష్టత చారధనమే హితమనియు, ఇంద్రియతృప్తి నిచ్చు భోగాది విశిష్ట ఇహపరలోకానుభవమే పురుషార్థమనియు వ్రాక్కుచ్చియున్నారు. శక్త్యాది మతప్రవర్తకుడు శుక్రుడు మున్నగువారు

భ్రమ-ప్రేమవిశిష్టుడైన బ్రహ్మ వక్కడే తత్త్వమనియు, జీవాత్మ పరమాత్మైకత్వానుసంధాన పూర్వక మహావాక్యార్థానుసంధానమే హితమనియు, బ్రహ్మయొక్క భ్రమ స్వరూపమైన జీవస్వరూపోచ్ఛిత్తియే మోక్షస్వరూపమనియు నొక్కి వక్కాణించుచున్నాడు.

అద్వైతాచార్యవర్యుడగు శంకరుడు.

అపహత పాప్మడైన పరమాత్మ వక్కడే

తత్త్వమనియు, తత్ప్రతిబింబమో, తదుపాదియో తత్పరిణామమో, తద్విపర్తమో యగు జీవునికి గల భేదబుద్ధియో, అభేదబుద్ధియో, భేదాభేద బుద్ధియో పోగొట్టునట్టి జ్ఞానము లేక జ్ఞాన-కర్మ సముచ్చయము హితమనియు, జీవునికి పరమాత్మ రూప స్వస్వరూపావిర్భావమే పురుషార్థమనియు బోధించుచున్నారు భాస్కరుడు యాదవప్రకాశుడు మున్నగువారు.

బ్రహ్మచారి విష్ణువే పరతత్త్వమనియు, భక్తియే హితమనియు, నీచోచ్చభావంగతుడై జీవుడు పరమాత్మను దేహాంతరనుండు దేశవిశేషమున యనుభవించుటె పురుషార్థమని వచింతురు ద్వైతవాదులు.

నిఖిల జగదేకకారణుడు, అశేషహేయప్రత్యనీకానంత జ్ఞానానందైక స్వరూపుడు, స్వాభావికానవధికాతిశయాసంఖ్యేయ కల్యాణగుణాకరుడు, సకలేతర విలక్షణుడు, సర్వాత్మభూతుడు యగు శ్రీమన్నారాయణుడే తత్త్వము.

తదుపాసన రూపభక్తి ప్రపత్తులే హితము.

[పరమాత్మ శరీరభూతుడై తత్ప్రకారతయా భాసిల్లునట్టియు అనుకూలాపరిచ్ఛిన్నజ్ఞానస్వరూపుడైనట్టియు పరమాత్మానుభవై కరసుడైనట్టి జీవునికి] అనాది కర్మరూపావిద్యోచ్ఛేద పూర్వమైన స్వాభావికమైన దేశవిశేషగత దేహాంతైక భోగ్యమైన పరమాత్మానుభవమే పురుషార్థమని నిర్ధారణ చేయుదురు త్రయ్యంతనిష్ణాతలగు విశిష్టాద్వైతులు.

స్వామి- ఈ విధముగ శాస్త్రములు ఏ విషయములోను కూడ ఏకాభిప్రాయము లేనివై తలతోక లేనివై తలకొకదారి, తలకొక యభిప్రాయము, తలకొక సిద్ధాంతము కలవై పరస్పర భిన్నములై యున్నవి. వీనియొక్క కర్తలో మహామహులు, మహర్షి సత్తములున్న; వాని ప్రచారకులో అపరిమిత మేధా సంపన్నులగు మహాత్ములు; ఆమతానుయాయులో మహిని అపరిమితులు; ఆ మతములో అనాది సిద్ధములు; తత్వ్యాప్తియో దిగంత వ్యాపకములు. అందుచే వీనిలో ఇది సత్యము. ఇది సరియైనది. ఇది మంచిది అని గాని ఇది అసత్యము. ఇది సరియైనది కాదు. ఇది చెడ్డది అని గాని నిర్ణయించుటకు ఆ సర్వజ్ఞుడైన సర్వేశ్వరునకు కూడ శక్యము కాదు. ఇక మన సంగతి చెప్పవలసినదేమి?

భట్టరువారు:- అయితే మనము దేనినో ఒకదానిని విశ్వసించి నడువక తప్పదు కదా- ఇన్నింటియొక్క యాథావస్థని కూలంకషముగ తరచి జూచిన మీరు దేనిని విశ్వసించితిరి?

పండితులు:- ఆ విషయమై గట్టిగ ప్రశ్నించ కూడదు. ఏదో ముక్కు మూసుకొని ఆ సమయమునకు తోచిన దారిని త్రొక్కి ఏదో ఒక లాగున కాలక్షేపము జేయుటయే గాని దేని మీదను విశ్వాసము లేదు. అవిశ్వాసము లేదు.

భట్టరువారు:- చిత్రము. ఆలాగుననే మరి. ఒక మాధ్యాహ్నికమునకు లేద్దుమా. మీకు చాల శ్రమయిచ్చితిని. తిరిగి మరొకమారు సావకాశముగ కలుసుకొందుము గాక.

పండితులు:- చిత్రము-చిత్రము.

భట్టరువారు:- ఎవరయ్యా అక్కడ. చూడు ఈ పండితులను సత్కరించి పంపుము.

[ఒక సన్నిధిస్వామి ఒక పళ్ళెములో తాంబూలము పండ్లు పది రూపాయలు పెట్టి పండి

తుల కందించును. పండితులు దానిని తీసుకొని]

పండితులు:- మహాప్రసాదము. చిత్తము. శెలవు. [అని లేచి వెళ్ళెను.]

భట్టరువారు:- చిత్తము. [అని కూర్చొనియే పలుకుదురు.] పండితుడు వెళ్ళగానే

భట్టరువారు:- అబ్బ. ఈనాస్తికాగ్రేసరుని తిరిగి తీసుకొని వచ్చి కంఠముమీద కూర్చొన బెట్టిరి. కాలక్షేపమూ పాడైనది. కుత్సిత వాక్కుల వినవలసివచ్చినది. కట్టుబట్టలతో సచేల స్నానము చేసినగాని ఈ ప్రసంగదోషముపోదు. అమ్మయ్య బ్రతికితిమి. అదుగో ప్రపన్నాగ్రేసరులగు శ్రీమాన్ నరశింహాచార్య స్వామివారు వేంచేయుచున్నారు. వీరి దర్శన-స్పర్శ-ఆలాపాదులవలన ఈ ప్రసంగ పాపము పోగలదు. [అని లేచి యెదురువెళ్ళి వచ్చుచున్న శ్రీమాన్ నరశింహాచార్యులు వారికి సాష్టాంగనమస్కారమాచరించి కౌగలించుకొందురు. ఇద్దరు కలిసి లోపలికి వచ్చుదురు.]

భట్టరువారు:- అడియేను. దాసోహం.

నరశింహాచార్యులుగారు:- స్వామి వేంచేయుడి. దేవరవారి కోసమే ఎదురు జూచుచున్నాను. ధన్యుణ్ణి. [ఇద్దరు కూర్చొందురు. సన్నిధి స్వాములు యిదంతయు అత్యాశ్చర్యముతో తమలో తాము గొణుగుకొనుచు ఈర్ష్యతో జూచుచుందురు. భట్టరు వారి విషయమంతయు కనిబెట్టుచుందురు.]

భట్టరువారు :- నరశింహాచార్యస్వామీ - యిప్పుడొక ఆభాస పండితమ్మన్యుడు వచ్చెను. తత్త్వ-హిత-పురుషార్థము లెవ్వి యని ప్రశ్నించగా చేటభారతమంతయు వదరి చివరకు దేనిని విశ్వసించవలెనయ్యా యుంటె ఘూర్ణానుస్వారమును జూపించిపోయెను. మా మనస్సంతయు వ్యాకులత జెందియున్నది. దేవరవారు ఏవేవి తత్త్వ-హిత - పురుషార్థములో సిద్ధాంతమును జెప్పి మా మనస్సును కొంత శాంతి పరుతురు గాక. [ఈ మాటలు విని నరశింహాచార్యులు వారు చంటిపిల్లవానివలె వెక్కి వెక్కి బోరున రోదన చేయుదురు.]

[సన్నిధిస్వాము లందరు తెల్లబోయి భీతితో తొట్రుపాటు పడుచుందురు. భట్టరువారికి కూడ కంటి వెంట నీరు కారుచుండును. గద్గదస్వరముతో]

భట్టరువారు:- స్వామీ, ఇదేమి. దేవరవారు సిద్ధాంతమును తెలిపి మనస్సునకు శాంతి కూర్చెదరని అనుకుంటే ఈ విపరీతమేమి?

నరశింహాచార్యులవారు:- [కొంచెము తొరట చెంది, విచారమున గద్గద స్వరములో] ఆచార్యవర్యా! అకించనుడను, అగతికుడను, దేవరవారి శ్రీపాదముల నాశ్రయించినాను. పరమదయాస్వరూపులై, ఆర్తత్రాణ పరాయణులై అఖిల చేతనోజ్జీవన హేతులైన దేవరవారు దాసుని కటాక్షించిరి.

స్వాచార్య సాన్నిధ్య విశిష్ట రంగడే తత్త్వమనియు, వారికి ఆత్మ, ఆత్మీయ సమర్పణ రూప ప్రపత్తియే హితమనియు, యావదాత్మ భావినైన నిరంతర, నిరవచ్ఛిన్న, నిరవధిక, నిరుపాధిక, నిత్య సర్వకాలోచిత సర్వవిధ కైంకర్యమే పురుషార్థమనియు, దేవరుపదేశించిన దానినే సదా జ్ఞాపకముంచుకొని మననము చేయుచు యథాశక్తిని ఆప్రకారమే నడచుకొనుచున్నాను.

ఇపుడు దేవరవారు ప్రశ్నించుటచే దాసు డేమి యపరాధ మొనర్చెనో, లేక దేవరవారి యుపదేశమును అన్యథా గ్రహించి పాడగు చుండెనో, లేక దాసుని యాచరణ సిద్ధాంత విరుద్ధముగ యుండెనో, తెలియక దుఃఖము కలుగుచున్నది. స్వామీ దాసుని యపరాధ ముల క్షమించి దిద్దుబాటు చేయవలెను. దేవర వారి శ్రీపాదముల తప్ప మరి దిక్కులేనివాడను. అన్యమేమియు యెరుగను. దేవరవారి యుపదే శమునందు తప్ప మరిదేనియందును లేశ మాత్ర మైన బుద్ధిపోయి యుండలేదు. ఇది ముమ్మాటికి సత్యము. నేనసత్యము పలికి యున్నచో రౌర వాది నరకము పాలగుదును. స్వామీ కటా క్షించవలెను. కృపజూడవలెను. ఉద్ధరించ వలెను.

[అని తిరిగి ఏడ్చుచు స్పృహతప్పి భట్టరు వారి కాళ్ళపై పడును.] సన్నిధి స్వాములు కం గారుపడి వెంటనే నరశింహాచార్యస్వామివారిని లేవనెత్తి శైత్యోపచారములు చేయుదురు. కొంతసేపటికి తెలివిరాగా ఆయన తిరిగి భట్టరు వారి కాళ్ళపై పడును. భట్టరువారు వారిని లేవదీసి కౌగలించుకొని వీపునుమురుచు]

భట్టరువారు:- స్వామీ నాకు మీయందు సందేహమేమియు కలిగి ఈ ప్రశ్నవేయలేదు. దేవరవారి జ్ఞానానుష్టానములు దాసునకు పూర్ణ ముగా తెలియును. అందులో అణుమాత్రము తప్పులేదు. ఎప్పటికైనను దేవరవారి సంబం ధము చేతనే అస్మదాదు లందరికి ఉత్తారణ యని నమ్మియున్నాము.

[సన్నిధిస్వాములవైపు తిరిగి వారిని జూపుచు] వీరందరు దేవరవారి సిద్ధాంతమును, విశ్వాస మును, జ్ఞానవిశేషమును తెలుసుకొన గోరుటచే దేవరవారికి వ్యధను కలిగించ సాహసించి పాపిష్టి తిని.

నరశింహాచార్యులు వారు:- అమ్మ య్యా బ్రతికితిని. నా విశ్వాసము వమ్ము కాలేదుకద. నా యనుష్టానము అన్యథా జ్ఞానము జన్యము కాలేదు కద.

[సన్నిధిస్వాములందరు నరశింహాచార్యులు వారి కాళ్ళమీదపడి లేచి దాసోహంసమర్పించి లెంపలు వాయించుకొందురు.]

ఒకసన్నిధిస్వామి:- స్వామి. అంతము లేని అపరాధము జేసితిమి. నరశింహాచార్యస్వామి వారిని సిశాసీ పద్దనియు, అక్షర శూన్యులనియు జ్ఞానహీనులనియు, బైక్షవిద్యాపారంగతులనియు ఏమేమో అనరాని, వినరాని మాటలని, నిర్లక్ష్య భావము కలవారమై ఎన్ని జన్మములకైనను శమించని పాపమార్జించితిమి.

మరివకసన్నిధిస్వామి:- తనకుగాని యితరు లకుగాని అర్థము కాని నాలుగు డాబు, బడాయి మాటలాడునప్పటి కాయనెంతో పండితుడను కొంటిమి. చిలకపలుకులవలె రెండక్షరముక్కలు వచ్చేటప్పటికల్లా మామాధత్వమును గ్రహించ లేక మహాపండితులమని విర్రవీగితిమి. ఎన్ని చదివిన, ఎన్ని వినిన ఏమిలాభము.

మరివక సన్నిధిస్వామి:- మాతప్పు క్షమించ వలెను. ఎన్నాళ్ళకు, ఎన్ని మారులు వినినా తత్వ-హిత-పురుషార్థముల స్వరూప స్వభావ ముల తెలుసుకొన లేకపోయిన తర్వాత ఎందు

ఒక జన్మ ఎందులకీ చదువు, ఎందులకీ జ్ఞానము, ఎందులకీ వేషభాషలు ఇన్నీ.

మాణిక సన్నిధిస్వామి:- స్వామి క్షమించవలె. చేసిన మా యపరాధములక్షమించవలెను' క్షమించి రక్షించువరకు దేవరవారి శ్రీపాదములు వదలము.బుద్ధి వచ్చినది. [అని తిరిగి లెంపలు వాయించుకొని భట్టరువారి పాదములపై పడినారు. భట్టరువారు వారినందరను నెమ్మదిగ లేవనెత్తుదురు.]

భట్టరువారు:- అయ్యో దేవరవార్లందరు క్షమార్పణ వేడవలసినది నన్నుకాదు. అరుగో ఆ నరశింహాచార్య స్వామివారిని మనమందరము వారి విషయములో అపచార మొనర్చితిమి.

నరశింహాచార్యులువారు:-అయ్యో అయ్యో దాస్నుణ్ణి ఆలా అనతగదు. [అని ఆయన అందరికి సాష్టాంగపడుదురు.] స్వాములందరు నరశింహాచార్యులువారికి సాష్టాంగ పడుదురు.

భట్టరువారు అందరిని లేవనెత్తుదురు.

భట్టరువారు:-

శ్లో॥ చతుర్వేదధరో విప్రో।
వాసుదేవం సనిందతి ।
వేదభారభరా క్రాన్తః।
స వై బ్రాహ్మణగర్దభః॥

శ్లో॥ శాస్త్రజ్ఞానం బహు క్లేశం ।
బుద్ధేశ్చలన కారణం ।
ఉపదేశాద్ధరిం బుధ్వా ।
విరమేత్ సర్వకర్మసు ॥

---

# శ్రీమద్యతీంద్రస్తుతి పంచదశి

ఎస్. వి. కె. శ్రీరంగశఠకోపాచార్యస్వామివారు
నిడిచిన మెట్లు.

శ్రీ మహితాచ్యుతాంఘ్రిసరసీరుహాయుగ్మ మరన్ద మాధురీ
ప్రేములునై దురంతయఘ భీతమనస్కులునైన చేతన
స్తోమములన్ రహీంన్మనుప సువ్రతమూని నశేషరూపకాం
తీ మతిపుత్రులా ఘనసుధీధుల గొల్చెద శ్రీయతీంద్రులన్ ॥

వ్రతముల నెల్లలోనడచి మాతరుణీశ పదాబ్జ చింతనో
న్నతిని ఘటించి వారల మనంబుల నిర్మల మొందచాతురీ
గతిని విలక్షణాత్మ గుణకాన్దము బోధ యొనర్చినట్టి ధీ
యుతులగు భ కరక్షణ గుణోదధి గొల్చెద శ్రీయతీంద్రులన్॥

ద్రావిడ సంస్కృతాగమ సుధామయతత్త్వ మహార్థసారమీ
జీవులకెల్ల జీవనము జేయగ తానట బ్రహ్మసూత్రి స
ద్భావముల న్మహామతిని భాష్యముగాగ రచించినట్టి శ్రీ
దేవవరేణ్యులన్నతత తేజుల గొల్చెద శ్రీ యతీంద్రులన్ ॥

ప్రవరా సుధీశ్వరాజ్ఞ బహుమానముగాగొని చేతనస్థ ము
ర్మాన్న మడంప ఘాతపురి మార్గముగా దిశలెల్ల నేగి స
న్మానములన్ని దాసుల కమానుష తత్త్వము బోధజేయు శ్రీ
మానగురామ సోదరుల మానక నెంచెద శ్రీ యతీంద్రులన్ ॥

నుతులను జేయగా మది వినోదమునొంది ఫలంబు నీయనే
గతిని యెరుంగలేని శిశికంఠము భ్రామర దుర్మతంబులన్
పలితముగా నొనర్చి హరిపద్ధతి నిల్పి జయించినట్టిమా
గతియగు భక్తవత్సలున కల్మషు గొల్చెద శ్రీయతీంద్రులన్ ॥

జ్వలజభవామరేశ ముఖజన్ములు కర్మనిబద్ధదేహులై
పలుమరు దానవా ఘుకృతబాధల గాసిల శ్రీశసత్కృపా
ఫలమున దారిగన్న బుధపంక్తికి గౌరవనీయులైన శ్రీ
లలితకళాభిమానుల నిరంతర మెన్నద శ్రీయతీంద్రులన్ ॥

గురుతరశాస్త్ర సారములకుంఠిత రీతిలభించిస్వామికే
గురువనకీర్తిగాంచి తమకుంగల వైభవముజ్వరిల్లనే
గురువులు తాభ్రమన్దవిలికూర్మి నమస్కృతి శాయనొప్పుమా
గురుమణియైన దేశికులకోరిభజించెద శ్రీయతీంద్రులన్.

ఋషియను స్వార్థకాఖ్యన తిరూదియొనర్పగ శ్రీరమేశప
ద్విషయములన్నదింప దిగవేమరునాత్మ గడించిప్రీతిచే
విషధరవర్ణనీ బలుకువేద శిరస్సుల గౌరవించునా
విష ధరరాట్స్వరూపులను వేడుకగొల్చెద శ్రీయతీంద్రులన్

వసుధ నపారవైభవము నర్ధిలవాసన తుల్యసంపదల్
అసమతరంబులై హరికృపాంబుధిలోన మునింగి ప్రీతిపెం
పెనగనమస్త సన్నిధుల పెద్దయుకాలము శ్రీశమంగళా
భ్యసనముగన్న భవ్యగుణవారిధి గొల్చెద శ్రీయతీంద్రులన్

రఙ్గకరీశ వేంకటవరాది సుకేశులనాజ్ఞతోడ శ్రీ
రఙ్గము నన్విభూతియుగ రాజ్యరమాధిపతిత్వమొంది నా
రఙ్గనుసీషతో గురుపరంపర నాయకరత్నమైన శ్రీ
రఙ్గపురీశులన్ గురువరాధ్యులగొల్చెద శ్రీయతీంద్రులన్

విజయున కాజియన్దుయదువీరుడు కృష్ణుడు తేరుపైన భూ
భుజులు తదన్యులు న్గలుగ పూని తురీయహితంబు దెల్పి స
ద్విజయుని జేసినట్లు పృథివింగలవారికి భూరిదానము
న్నిజగతి దెల్పినట్టి మహనీయులగొల్చెద శ్రీయతీంద్రులన్

జన్మము నెత్తి సంసరణసాగరమందు మునింగి స్త్రీలకై
తన్మయమొంద్ది మోసమనితల్పగ వెర్రులునై చరించుదు
గ్జన్ముల కూటముల్ జెడగజూచి ధరించక బ్రోచియున్న స
జ్జన్ముల వేనుతింతు మనసారగసారెకు శ్రీయతీంద్రులన్.

ఈవిధినీ ధరిత్రిగణియించగ తామవతార మొందిస
ద్భావతనూట నిర్వదిశుభత్సమముల్ విలశిల్లపాప సం
భావిత తత్వమున్గని ప్రపంచవిరక్తిని బొందినంత శ్రీ
దేవుని జేరియున్న జగదీశులగొల్చెద శ్రీయతీంద్రులన్.

భక్తియు నాతురీయమును భాష్యముఖంబున వ్యాప్తిజేసియా
సక్తిజనంగు వారలకు సాంద్రరమాస్యము బోధసల్పిప
ద్రక్తిమతోడ భక్తవతిరాజిల నీభువనాళికెల్లచి
చ్ఛక్తినొసంగి బ్రోచిన విశారదునెంచెద శ్రీయతీంద్రులన్.

వరద కృపాధిగమ్యపర మార్ధరసాశ్న తేనమోస్తు శ్రీ
వరచరణాంబు జాతరుచి వర్ధనసద్గుణ తేజసోస్తుసుం
దరశఠ వైరిసూక్త్యయుత తత్వహృదిస్థితతే శుభోస్తుయం
చిరవుగసం స్మరించితరియించగ నెంచెద శ్రీయతీంద్రులన్

యాద:- దీనియర్థమిది.

సత్ చిత్ ఆనందమయుడగు బ్రహ్మ యొక్కడే కాలత్రయా బాధ్యమగు) తత్త్వము. ఆ బ్రహ్మయే నీరు, నురుగు, బుడగ, కెరటముగా పరిణమించినట్లు ఆయాశక్తి ప్రచురమై భోక్త యగు జీవుడుగను భోగ్యములగు ప్రకృతి ప్రాకృతములుగను నియంతయగు నీశ్వర రూపము గను పరిణమించును. కారణభూతుడగు నీ బ్రహ్మయొక్క గుణమగు చైతన్యము చిద్వస్తువు నందును ఉండును. అట్లు డియు పృథివీగుణమగు గంధము రత్నమున అనుద్భూతమై యుండు నట్లు పైకి గోచరింపకయే యుండును. కుండ మూకుడు మొదలగు మట్టి వస్తువులు కారణ వస్తురూపమున మన్నగనే గోచరించుటచే నభిన్నములును కార్యవస్తురూపమున కుండయనియు మూకుడనియు వేరువేరుగా గోచరించుటచే భిన్నములును నగుచున్నవి. ఇట్లే ప్రపంచమంతయు భిన్నాభిన్నములుగ నుండును. కావుననే భేదశ్రుతులును నభేదశ్రుతులును నీ సిద్ధాంత వ్యవస్థాపన కనుగుణముగ మాచే లెస్సగ సమన్వయింప బడుచున్నవి.

సదూ:- [నవ్వు నాపుకొనజాలక] ఓ మంత్రి పుంగవా! ఇదియేమి? ఇట్లు మహారాజు దేశము నంతను గంగలో ముంచుచున్నావే!

బ్రహ్మ నిర్వికారుడని బోధించు వేదవాక్కు ఆతని కెట్టి వికారములను సహింపదు గదా! నీవు చెప్పిన వికారము లాతని కెట్లు సంభవించును? జీవతత్త్వము ఆ బ్రహ్మయొక్క పరిణామ మనుచున్నావే. అట్లగుచో జీవునకు నిత్యత్వమును బోధించు శ్రుతులగతి గంగా ప్రవేశము గాక మరియేమగును? ఇట్లనేక ప్రామాణికారములను నూటగలుపుచు నీవు మా మహారాజు చేతనుండ నర్హుడవు కావు.

[యాదవుడు తాను గావించిన ధర్మ నిర్మూలనమును తలంచి సిగ్గుతో తలవాల్చి నిలుచును]

పరా:- దేవా! ఇట్టి ప్రబల రాజద్రోహి కేమి శిక్ష?

రాజు:- [నవ్వుచు] యతని దండించు రీతి యతిరాజునకే యెఱుక.

[యతిరాజు యామునులవైపు జూచును]

యాము:- శమదమాది ఆత్మ గుణోపేతుడైనను సన్యాసి దుష్టుడగుచో నాతనిని దేశము నుండి వెడల గొట్టుటకంటె వేరు శిక్షలేదు.

యాద:- [సవినయముగా] దేవా! నాకు తమ పాదసేవను పరిత్యజించుటకంటె ప్రాణ త్యాగమే సుకరము.

రాజు:- అయినచో రామానుజుల శరణ జొచ్చుము.

[యాదవుడు రామానుజుల పాదములపై బడును]

యతి:- [అంతటను జూచి]

వీడు సన్మార్గుడే కానిండు, దుర్మార్గుడే కానిండు. నన్ను శరణుజొచ్చినాడు. కావున భగవంతునివలె పూజ్యులగు తమ రీతని యనుగ్రహింపవలెను. [శ్లో]

రాజు:- [ఆనందముతో] వీడు మాశత్రువే కాడు. సకల పాపాచరణ నిరతుడైనను మీ యనుగ్రహ పాత్రుడైనచో వాడు నా దేశము నందున్న వారి కందరకును పుష్పమాలవలె శిరసావహ్యుడే యగును. [శ్లో]

యాము:- అట్లే యగుగాక.

[ఆకాశము నుండి పుష్పవర్షము కురియును. దుందుభులు మ్రోగును.]

యతి:- ఇది నామ యనుగ్రహము.

పరా:- ఓ సన్యాసీ! భగవద్రామానుజుల యనుగ్రహ పాత్రుడవైతివి గాన సర్వోత్కృష్టుడవైతివి. నీవు పోయి నీ పనిని చేసికొనుము.

[యాదవుడు శిష్యునితో వెళ్ళిపోవును.]

(భాస్కరుడు శిష్యులతో ప్రవేశించును.)

భాస్కరుడు:- (ఆనందముతో) మాయావాది పీడ విరగడాయెను. ఇక నీ రాజకులమును నే నొక వెలుగు వెలిగింతును. రామానుజుని ధర్మము నా ధర్మము నొక్కటియే కావున నాతడు నా విషయమై యంత ద్రోహము నాచరింపడు.

[రాజు యెదుట కేగును కాని యాతడనాదరముతో వీక్షించును]

భాస్క:- దేవ! జయ! జయ! నన్నిట్లేల యనాదరించుచున్నావు. నన్ను కొంచ మనుగ్రహింపుము.

మనుష్యునకు రెండు కన్నులును, రెండు పాదములును నెట్లవసరమో అట్లే రాజ్యమున కిద్దరు మంత్రులును అవసరము. కావున నేను కూడా రామానుజునకు సహాయమంత్రిగా నుందును. [అనుగ్రహింపుడు.]

సునీతి:- భాస్కరుని గూడ తమస్సావరించు చున్నదే.

శ్లో॥ ప్రమాణేష్వేవ వేదాన్తః
ప్రమేయేషు పరఃపుమాన్
ప్రమాతృషు యతీన్ద్రోఽ
యం న ద్వితీయ ముపేక్ష్యతే॥

ప్రమాణములలో వేదాంతమునకును. ప్రమేయములలో [పదార్థములలో] పరమపురుషునకును, ప్రమాణజ్ఞులలో నీ మా యతీంద్రులకు సహోదరాంతర మనవసరము.

సదా:- పోనిమ్ము! తప్పేమి? మహారాజు విషయమును నీ వెట్లు యోజించుచున్నావో చెప్పుము. దీనివలన నీ నీతికుశలత వ్యక్తమగును

భాస్క:- సావధానముగ వినుడు-

శ్లో॥ బ్రహ్మైకం స దుపాధిభేద
భిదురం జీవత్వ మభ్యేతి
తజ్జీవత్వే చ వివర్తయోః ఉప
పహితం బ్రహ్మైవ శాస్త్రం శివం
బ్రహ్మైక్యం ఖలు ముక్తి రేత
దఖిలోపాధిక్షయే దేహినాం
కర్మజ్ఞానసముచ్చయాదియ
మితి త్రయ్యన్తరాజ్యస్థితిః॥

బ్రహ్మ యొక్కటియే తత్వము. ఆ బ్రహ్మ వేరువేరు ఉపాధులచే వేరువేరుగా పరిగణింపబడి జీవుడగుచున్నాడు. ఆ యుపాధులు సత్యమైనవి. అట్లు జీవుడుగా నున్నప్పుడే యనేక యాపదలకు గురియగును. అట్టి యుపాధి వినిర్ముక్తుడగు బ్రహ్మ షోడ్మిషట్క రహితుడై మంగళ ప్రదుడగుచున్నాడు. ఆత్మలకీ యుపాధులన్నియు నశించిన పిమ్మట బ్రహ్మతో నభేదము సిద్ధించును. అదియే ముక్తి. ఈ ముక్తి కర్మజ్ఞానముల సముచ్చయము [కూడిక] వలన సిద్ధించును. ఇదియే వేదాంత తత్వము.

సదా:- [కోపముతో]

పరమపురుషుడు జీవరూపముతో నానావిధములై దుఃఖించుచున్నాడని వదరుచున్న నీ నాలుక నూరుముక్కలేల కాలేదురా?

పరాం:- ఓరీ! భగవంతునకు ద్రోహముగ బలుకు నీ జిహ్వను నరికి వేసినను పాపములేదు. [అని ప్రక్కకు జూచును. దివ్య పురుషుడు ప్రవేశించును.]

దివ్యపురుషుడు:- భగవద్ద్రోహము నాచరించు నా దురాత్ముడెవడురా? [అని కత్తిని దూయును.]

భాస్క:- [చూచి] అయ్యో! అయ్యో! ఎంతకష్ట మెంతకష్టము. అని పారిపోవును. దివ్య పురుషుడు కత్తిని ఝుళిపించుచు వెంట పరిగెత్తును.]

సునీ:- [నవ్వి] దేవీ! ప్రమాణము నంగీకరింపని వానికి కత్తియే సమాధానము.

సుమ:- ఔను, ఈ మాత్ర మెఱుంగకయే సునీతి నైతివా మరి.

## ఆరవ యంకము.

[రామానుజులు సదూహనితో ప్రవేశింతురు.]

యతి:- [ఆలోచించి] శిష్యునితో]

అందర నటుండనిమ్ము, కానిఆధారమేమియు లేకయే తన మతము నిట్లు సాధించుచున్న శంకరుని యీ మతము ఆకసమున చిత్తరవులు చిత్రించి నట్లొక లీలయే సుమా!

[శంకరుడు ప్రవేశించును]

శంక:- భళీ! యతిరాజా! లెస్సగా గనుగొంటివి. ప్రమేయమగు ప్రపంచ మంతయు మిథ్యయనియు, పరబ్రహ్మయే ప్రమాణమునకును గోచరించదనియు, యదార్థస్థితికి విరుద్ధముగా నేసి సిద్ధాంతమార్గము నిట్లు కల్పించుట నా బుద్ధికౌశలమును లోకమునకు జూపుటకే.

(నవ్వి) అదియేమి చిత్రమోగాని యెంత ప్రాజ్ఞుడైనను యీ సిద్ధాంతమును జూచి భ్రమింపని వాడుండడు. ఇట్లాకాశమున చిత్తరువులుచిత్రించునానేర్పు బ్రహ్మయైన నెఱుంగడు.

యతి:- నీవు చాల బాగుగ జెప్పితివోయి. నేను మరి ఆకాశము నందలి పద్మోత్పత్తిని చూచువాడంగీకరింపనిచో చూపించు వాని కపట శిల్ప నైపుణ్యమింకేది?

శంక:- (నవ్వి) నేను పర్యంక విద్యోపాసనకై యనంతపుర మేగుదును. సెలవిందు. [అని వెడలిపోవును.]

యతి:- [నవ్వి] లోకులిది యెరుంగరు. వేళము వెర్రిగా నొకడే దారిని పోయిన నా దారినే తామునుపోయి చీకటినూతిలోబడుదురు.

సదూ:- [ఆలోచించి] ఆహా! ఎంతకష్ట మెంతకష్టము. వీడెంతపని చేసినాడు. *వీడాత్మద్రోహులలో మొదటివాడు గదా! బుద్ధిమంతుడైనను ఏమి యెరింగెను. ఆలోచనా విహీనుడై నిష్ఫలకృత్యములలో పడెను. ఎంత సర్వజ్ఞుడైననేమి? ఎన్ని యజ్ఞయాగాదులు చేసిన వాడైననేమి? అయ్యో! ఇట్లు జనుల సందర నంధులగావించి కపట శాస్త్రములనెడు చీకటి నూతులలో కూలద్రోసిన వాడెవ్వడైనను కుంభీపాకములనెడు నుసిగుండములలో మడియకుండునా?

యతి:- అది యెవడెరుంగును. ఐనను ప్రతివాడును తన బుద్ధికుశలతనే జూపుచుండును.

ఇట్లే తమ్ము తామే యెఱుగని యితర మతస్థులు కొందరు, ఒకే శరీరమో యనునట్లుండెడు వేదమాళి వేధవిచారులకు (పూర్వోత్తర మీమాంసలకు) పరస్పరము కలహమును కల్పించిరి. దానిని శమింపజేయవలెనని వేద విచారుని తోడి తెచ్చుటకై పురాణమును తోడ్కొచ్చి భారతము నంపితిని. కావున నేనువేదమాళి సన్నిధిని వేచియుండవలెను. నీవు మాత్రము యామునాదుల పురస్కరించుకొని వసంతోత్సవమును నిర్వర్తింపుము. (అని వెడలి పోవుదురు)

## ప్రశ్నోత్తరములు:



జిజ్ఞాసువు:— శ్రీ చిలకమర్తి వరాహలక్ష్మీనరసింహాచార్యులుగారు

### ప్రశ్న:— పితృదేవతలంటూ యున్నారా ? ఉన్నచో వారినేల యారాధించవలెను?

"శ్రీమన్నారాయణ"

సమాధానము

పితృదేవతలున్నారను నమ్మకము, విశ్వాసము శుభాశుభముల యందు తదారధనమున్న కేవలము ఆస్తికులగు భారతీయులలోనే గాదు, నాస్తికులగు భారతీయులలోను, చైనీయులు, జపానీయులు, రష్యనులు, అరబ్బులు, యూదులు పారశీయులు, రోమనులు, గ్రీకులు, యూరోపియనులు, అమెరికనులు వీరు వారననేల సకల ప్రజాసామాన్యమునందును గాఢముగ నున్నది.

ఇందులకు ఇప్పటికి ఆయామతస్థుల దేశ—కాల-పాత్రానుసారములైన వివిధ సాంప్రదాయ రూపములై విలసిల్లుచున్న పితృదేవతారాధనములే సాక్ష్యములు. పితృదేవతారాధనమ్మున సజాతీయ అన్నసంతర్పణ యనునది కూడ అన్ని జాతులలోను ఏదో రూపమున జరుగుచునే యున్నది.

దీనికంత ప్రాముఖ్యమేల? ప్రతిజీవికి కావలసినది తన సౌఖ్యము—తన యానందము. ఇది తన యాత్మతృప్తివలన మాత్రమే కలుగుచున్నది. ఇట్టి తృప్తికై ప్రయత్నించుట ప్రతి ఆత్మకు సహజమే గదా— భార్య భర్తను ప్రేమించును. ఎందులకు; భర్తతృప్తికై కాదు, తన తృప్తికై మాత్రమే. భర్త భార్యను ప్రేమించును. ఎందులకు; భార్య తృప్తికై కాదు తన తృప్తికై మాత్రమే. ఇటులనే తండ్రిపుత్రుని ప్రేమించినను, పుత్రుడు తండ్రిని ప్రేమించినను మిత్రుడు మిత్రుని ప్రేమించినను, ఇది యది యననేల చివరికి భక్తుడు భగవంతుని ప్రేమించినను కూడ అదంతయు తమ తమ తృప్తి కొరకేగాని

తనిచే ప్రేమించ బడువారి తృప్తికొరకు గాదు. ఇది సిద్ధాంతము.

ఆత్మ నిత్యమైనది. ఈ శరీర వియోగానంత రము కూడ అది స్థిరముగా యుండును. అది తన కిదివరలోని శరీర సంబంధులచే ఆదరించబడి ఆరాధించబడుటచే తృప్తి కలుగును. ప్రతి జీవియు కూడ ఎపుడో ఒకప్పుడు తాను ఈ శరీరమును విడిచిన పిమ్మట తన శరీర సంబంధులు తనను ఎట్లుల, ఎందుల కారాధింతురు? గాన ప్రతిమానవుడు ఏదో విధమున తన పితృదేవతల నారాధించుచుండుట విధాయకము, సాంప్రదాయము, శిష్టాచారము అయియున్నది.

తాను జచ్చిన తరువాత తన్ను తనవారు గౌరవించి పూజించుచుండ వలయునను వాంఛ తనకున్నప్పుడు తన పితృదేవతల యందు తన కట్టి మనోవైఖరి యేల యుండదు? అట్లుండక పోవుట దృష్టి యుండక పోవుటయే కాని మరొకటి కాదు. కీర్తి కాంక్ష సర్వప్రాణి సహజ స్వభావము.

---

జిజ్ఞాసు:— శ్రీ వ. చ. అండాళమ్మ.

## మానవునికి మతమేల?

"శ్రీమన్నారాయణ"

సమాధానము:

మానవునకే గాదు. సకల ప్రాణికోటికి సర్వదా కావలశినది తృప్తి. అందును పరిణామ క్రమమనుసరించియు, జ్ఞానవికాసత ననుసరించియు ఈ తృప్తి యనునది మానవునికి మరింతావశ్యకమై యున్నది. భార్యయుండని, బిడ్డలుండని, ఆయువుండని, ఆరోగ్యముండని, భోగముండని, భాగ్యముండని, శక్తియుండని, కీర్తి యుండని యెన్నియున్నను తృప్తిలేని మానవునికి ఆనందములేదు. సౌఖ్యము లేదు. జీవచ్ఛవమే. ఎపుడును మనోవ్యథయే. జీవితమే వ్యర్థము.

మానవుడనగా దేహేంద్రియములతో గూడుకున్న ఆత్మ యని యర్థము.

దేహమునకు అన్నపానీయములవలన తృప్తి. ఇంద్రియములకు విషయానుభవముల వలన తృప్తి మరి ఆత్మకు? ఆత్మకు కూడ ఆకలి దప్పులు అనుభవ విశేషములు గలవు. అవి శాంతించిన గాని ఆత్మకు తృప్తిలేదు.

ఆత్మ జ్ఞానాత్మకమైనది. జ్ఞానగుణకమైనది. గాన తత్సంబంధము వలన గాని ఆత్మ యొక్క— ఆకలి—దప్పులు—అనుభవ విశేషములు శాంతించవు. ఆత్మకు శాంతిని కలిగించునది మోక్ష

మార్గమును జూపించు అర్థపంచక జ్ఞానము మాత్రమే.

మత శబ్దమునకు వందలకొలది అర్థవిశేషము లున్నను అసలైన సిసలైన అర్థము. స్వస్వరూప పరస్వరూప-ఉపాయస్వరూప-ఫలస్వరూప-విరోధిస్వరూపముల తెలుపు అర్థపంచక జ్ఞానము మాత్రమే.

ఎంత కరడుకట్టిన నాస్తికునికైనను తన యాత్మశాంతి లేనిదే తన దేహేంద్రియములకు శాంతి యుండదు.

కాన అట్టి ప్రధానమైన ఆత్మశాంతి నిమిత్తమై అర్థపంచక జ్ఞానార్థకమైన మతము అవసరమై యున్నది.

ఈ లోకము మృత్యువుచే గొట్టువడి యున్నది.
దీనిని ముదిమి చుట్టు ముట్టుకొని యున్నది.
రేయును బవళ్ళను పిడుగువలె నెప్పుడును బడుచున్నవి.
మృత్యువు ఎవ్వనిని ఊరక ముందెచ్చరింపకయే తటాలున బయిపడి
లాగికొని బోవుచున్నది.
కావున భక్తిరూపాపన్న జ్ఞానివై మోక్షము గూర్చి నాలోచించుము.
దానిని పొందుటకై ఈ క్షణము నుండియే ప్రయత్నించుము.

రేపటికి జేయవలయు దానిని నేటికే చేయుము.
మాపు చేయవలసిన దానిని రేపు చేయవలెను.
మానవుడు తన కార్యమును చేసినను జేయకున్నను మృత్యువెదురు చూడదు.
కావున శ్రేయస్సును కలిగించుదానిని నిపుడే చేసుకొనవలయును.



# నారీవిభాగము



## మోక్షము నెట్లు పడయ తగును?

జిజ్ఞాసువు: శ్రీమతి మాదంశెట్టి రాధమ్మగారు, విజయవాడ.

ప్రశ్న: మోక్షమనెడు పురుషార్థ స్వరూప మెట్టిది?

సమాధానము: "శ్రీమన్నారాయణ"

వ్యాసమహర్షికి సర్వేశ్వరుని సంకల్పముచే యజ్ఞార్థమై అగ్ని మదనము జేయుచుండగా ఘృతాచియను నొక యప్సరసా సందర్శనముచే అరణియందు రేతస్ఖలన మాయెను. వ్యాసుడు దానిని మథించగా అందుండి పంచభూతముల ధిక్కరించు మహాయోగి యగు శ్రీ శుకుడు బుట్టెను. వాసు డతనికి వేద-వేదాంగ-వేదాంత యితిహాస-పురాణముల ఫఠింపజేసి మోక్షపురుషార్థ స్వరూప జ్ఞానమునకై తన శిష్యుడగు జనకుని వద్దకు పంపెను.

జనకుడు చక్రవర్తి, గృహస్థుడు. ప్రవృత్తి మార్గములో నున్నవాడు. అయినను ఆయన మనస్సు నిష్కలషమై సదా శ్రీహరి యందే తగుల్కొని యుండెను. సరస్సున బుట్టి దాని నాశ్రయించుకొని యుండి, దానివలననే పెరుగుచున్న తామరాకు ఆ నీటి సంబంధములేనిదై యుండునటులనే జనక చక్రవర్తికూడ ప్రకృతిలోలీనుడై యున్నప్పటికిన్ని, నివృత్తిమార్గ నిష్ఠాగరిష్ఠుడై కేవల మోక్ష ధర్మానుష్ఠానపరుడై యుండును. మహామహులగు మహర్షులకు సహితము శక్యము గాని జ్ఞానానుష్ఠానములు జనకుని యందు వెల్లుంగుచుండెను. గనుకనే వ్యాస మహర్షి సహితము తనయేకైక పుత్రరత్నమును ఆయన కడకు పంపెను. జనకుడు శ్రీ శుకుని అనేక విధముల పరీక్షించి చివర కిటుల నుపదేశించెను.

"మోక్షమార్గము ననుసరించుటకు శాస్త్ర జ్ఞానము, లౌకిక జ్ఞానము యుండవలయును. ఈ జ్ఞానము కేవలము గురూపదేశముచే మాత్రమే కలుగును. మరేవిధమునను కలుగజాలదు.

రాజస-తామస దోషముల వర్జింపవలెను. సాత్త్వమార్గము ననుసరించి ఆత్మను దెలుసుకొనవలెను. సర్వభూతముల యందు ఆత్మ యున్నది. అన్ని ఆత్మల స్వరూపములు నొక్క-

టియే. గాన సర్వభూతములయందు తన్నును తన యందు సర్వభూతములను లెస్సగా గనుగొనుచు జలమందలి జంతువులవలె వానియందు తగులు లేకుండగ నుండవలయును. ప్రతిజీవియందును పరమాత్మ వసించుచున్నాడు. పరమాత్మలేని జీవి యనునది లేనేలేదు. సమాహిత చిత్తము గల ప్రతివాడు పరమాత్మను దర్శించగలడు. ఈ దర్శనమున గాని శాంతి కలుగదు. శాంతి లేనివానికి ముక్తి లేదు.

ఎవ్వనివలన పరులు భయపడరో, పరుల వలన నెవ్వడు భయపడడో ఎవ్వడు ఏ ఒక్క దానిని గోరకయు, ద్వేషింపకయు నుండునో అట్టివాడు పరమాత్మను తెలుసుకొనగలడు. మనస్సు చేతగాని, వాక్కు చేతగాని, కర్మము చేతగాని ఎపుడు సర్వభూతములయందు పాప మగు భావన లేకుండునో యపుడు పరమాత్మను తెలుసుకొన గలడు.

మనస్సును మోహపెట్టినట్టి అసూయను విడిచి కామమును మోహమును త్యజించినచో పరమాత్మను తెలుసుకొనగలడు. చెవికిని, గం టికిని మరియు తక్కిన యింద్రియములకును విష యములగు వానియందెల్లను, మరియు సర్వ భూతములయందును సముడై ద్వంద్వముల నెపుడు వీడునో యపుడు పరమాత్మను తెలుసు కొనగలడు.

స్తుతిని-నిందను, బంగారమును – ఇనుమును సుఖమును-దుఃఖమును, చలువను-వేడిని, అర్థ మును-అనర్థమును, ప్రియమును-అప్రియమును జీవితమును-మరణమును, సమముగా నెపుడు భావించగలడో యపుడు పరమాత్మను తెలుసు కొనగలడు.

తాబేలు తన యవయవముల తనలోనికి ముడుచుకొనునటుల ఎవడు తన మనస్సును, యింద్రియములను విషయములనుండి నుపసంహ రించుకొనగలడో అట్టివాడు పరమాత్మను తెలుసుకొనగలడు. చీకటి గ్రమ్మిన యింటిని దీపముచే స్పష్టముగా చూడగలిగినటుల బుద్ధి యనెడి దీపముచే తనలోపల యాత్మను చూడ శక్యమగును. ఇట్టివాడు తనయందలి పరమా త్మను తెలుసుకొని, దానిని దర్శించి సదా దానినే స్మరించుచుండవలెను. దీనిచే వీని హృదయమందలి గ్రంధులన్నియు ఛిన్నాభిన్న ములగును. సర్వసంశయములు పటాపంచలగును. సమస్త కర్మములు సమూలముగ నశించును. దివ్యజ్ఞానము కలుగును. అట్టి పరమాత్మను ప్రీతితో నిరంతరము ధ్యానించుచు ఆత్మ-ఆత్మీ యుల నాతనికి సమర్పణము చేయవలెను. దీనిచే పరమాత్మ ప్రీతికి పాత్రుడై ఆయనయొక్క నిర్హే తుక జాయమాన కటాక్షమునకు పాత్రుడై శరీరావసానమున మోక్షమును పొందగలడు. ఏ యోగమవలంభించినను ఈ పైన తెలిపిన జ్ఞానానుష్టానములున్న గాని మోక్షప్రాప్తి లేదు. అన్ని యోగములు యిట్టిస్థితికై మాత్రమే ఉపకరించును.

★ ★ ★

# మదరాసులో గీతామందిరమందలి ఉభయ వేదాంతకాలక్షేప గోష్ఠి

ఈ భాద్రపదశుద్ధ విదియనుండి యిచ్చట ఉభయవేదాంత కాలక్షేపగోష్ఠి ప్రారంభింపబడినది. ఇందు అధ్యయనము గావించు యిద్దరు అధికారులకు విద్యార్థులకు ఒక్కొక్కరికి నెలకు రు 50/లు చొప్పున విద్యార్థివేతనమును ఒసంగుటకు శ్రీ శ్రీ శ్రీ మీర్జాపూరు మహారాణి వారును, శ్రీ శ్రీ శ్రీ వుయ్యూరు మహారాణి వారును, వాగ్దానము గావించిరి. ప్రస్తుతము శ్రీ పేరుంబూధూరునుండి ఒక వ్యాకరణ శిరోమణి శ్రీ ఉ. వే. శ్రీమాన్ కొ. యి. నరసింహరామానుజాచార్యులుగారు, అధ్యయనము చేయుచున్నారు. ఆశ్వయుజమాస ప్రారంభనుండియు కాంచికాపురస్థులగు న్యాయశిరోమణి శ్రీ ఉ. వే. శ్రీమాన్ కిళాంబి శ్రీనివాసవరదాచార్యులుగారు వేంచేసి అధ్యయనము గావింతురు. ప్రస్తుతం తాత్పర్య చంద్రికావివరములతో గీతాభాష్యమున్ను తత్త్వత్రయమున్ను ప్రారంభింపబడినవి. తత్త్వత్రయమునకు పెక్కురు స్త్రీలుకూడా అన్వయించుచున్నారు. కాలక్షేపము సుబోధకముగను సావకాశముగాను గావింపబడుచున్నది. తగినఅధికారము గలిగి సంఘసేవగావించుచు పరిచితులగు స్త్రీలు వేంచేసి కాలక్షేపగోష్ఠిలో సన్వయించగోరుచో గీతామందిర కార్యదర్శిగారికి దరఖాస్తుపెట్టుకొనిన ఉచితముగా తగు మాత్రము బసయు కాలక్షేపావకాశమును కల్గింతురు. ఎవరిసాపాటు ఏర్పాట్లువారే చేసుకొనవలసియుండును. ముందుముందు కడుబీదలగు అర్హ అధికారులైన స్త్రీలకు యథాశక్తి స్కాలర్షిప్పు కూడా యిచ్చుటకు ఏర్పాటులు గావింపవలెనని సంకల్పించుచున్నారు.

## గీతా పరీక్షలు

గీతామందిర యాజమాన్యమున గీతాపరీక్షలు జరుపబడుననియు అందుత్తీర్ణులైన వారికి యథోచిత సన్మానములుకూడా ఆ ఉత్తీర్ణత ననుసరించి ఒసంగుబడుననియు ప్రకటింపబడినది, ప్రస్తుతము తగినంత ప్రోత్సాహము కాన్పించనందున యీసంవత్సరమునకు మాత్రము గీతలో మూడు అధ్యాయములలోని విషయము మాత్రమే అడిగినప్రశ్నలకు తెనుగుభాషలో సులభశైలిలో సమాధానమువ్రాసి 3 అధ్యాయములలోని యీదిగువ శ్లోకముల మాత్రము ప్రతిపదార్థముగా గట్టిగా వల్లించిఅడిగిన శ్లోకముల కర్థమును వ్రాయవలసియుండును. తత్త్వత్రయప్రకరణ మీసంవత్సరమునకు పాఠ్యవిభాగమునుండి తగ్గించబడినది. బహుమతులు యీసంవత్సరమునకు మాత్రము యథోచితముగా నొసంగబడును. 5 గురు అభ్యర్థినిలగుచోట పరీక్షా కేంద్ర మేర్పరుపబడును. పరీక్ష యీసంవత్సరమంతటను నవంబరు 20 తేదీ ఆదివారం జరుపబడును. దరఖాస్తులు అక్టోబరు 15 వ తేదీ లోగా యీదిగువ అడ్రసునకు యీదిగువ వివరములతో చేరవలెను.

| | | |
|---|---|---|
| 1. పరీక్షాభ్యర్థిని పేరు అడ్రసు. | 1 అధ్యాయము | 1.10.14.40.41 42, |
| 2. వయస్సు, | 2 అధ్యాయము | 2.7.11.12,17.22.27. 38. |
| 3. ఎవరివద్ద చదివినది. | | 46.47.49.55.56.57.58.62 |
| 4. ఏ కేంద్రములో పరీక్ష నొసంగునది. | | 69.70. |
| 5. ఉపాధ్యాయుల సంతకము. | 3 అధ్యాయము | 6,8.13.14,15.21.23. 14. 27. |
| 6 అభ్యర్థిని సంతకము. | | 30 36.37,42.43. |

పరీక్షకు చదువవలసిన భగవద్గీతా గ్రంథముల యీదిగువ అడ్రసునకే వ్రాసిన బడయగలరు.

కేంద్రమునకు 5 గురున్నచో ఆగ్రామ దేవస్థానములోనే పరీక్షలు గావింపబడును. గాని సదరు దేవస్థానం ధర్మకర్త గారియొక్క గాని మెనేజరుగారియొక్క గాని అడ్రసు తెలపవలెను. అంతకు తక్కువ అభ్యర్థిను లుండి సమీపములో కేంద్రములు లేనిచో తెలిపిన తగు ఏర్పాట్లు చేయబడును.

గీతామందిరం కార్యదర్శినీ

107 వరదాముత్తియప్పన్ వీధి, మదరాసు 1

షరా. అడ్రసు ఇంగ్లీషులో వ్రాయవలెను.

# ప్రచార విభాగము

శ్రీయతిరాజ సేవా మహిళా మండలి (మదరాసు శాఖ) వారి గీతామందిరమండలి కార్యక్రమము

## శ్రీ కృష్ణ జయంతి మహోత్సవము

ఇచ్చటి శ్రీ గీతామందిర కార్యకారిణీ సమితివారు 26-8-1952వ తేదీని శ్రీ శ్రీ శ్రీ మిర్జాపురం మహారాణీగారి అధ్యక్షత క్రింద సమావేశమై 9-9-52వ తేదీ నుండి 16-9-52వ తేదీవరకు శ్రీ జయంతి మహోత్సవమును వైభవముతో జరుప నిశ్చయించి కార్యదర్శినియగు శ్రీమతి మ. చంద్రమ్మగారిని ఏతత్కార్య నిరీక్షకురాలుగా నిర్ణయించిరి. ఆమె అతి చాకచక్యముతో కార్యక్రమమును నిర్ణయించి ఈ 8 రోజులున్ను నేత్రానందకరముగాను, శ్రోత్రపేయముగాను ఈ కార్యమును యీ క్రిందివిధముగా నిర్ణయించి నగర ప్రముఖుల మన్ననకు పాత్రులైరి.

♦ కార్యక్రమము ♦

గీతామందిరమండలి పెరుమాళ్ళగది ప్రతిదినము మార్పులతో గీతారథ శృంగారింపు పరమపదనాథ శృంగారింపు, జూలాశృంగారింపు, రాసక్రీడ శృంగారింపులతో నలంకరింపబడెను.

మేడ పైభాగమున హాలునందు దివ్యసింహాసనమున వేంచేపు చేయబడిన శ్రీ రాధా కృష్ణులకు ఉదయము గం 6 లు మొదలు సాయంకాలము గం 6 ల వరకు అవిచ్ఛిన్నముగా 5 దినములు స్త్రీల చేతనే శ్రీకృష్ణాష్టోత్తరార్చనలు జరుపబడెను.

ప్రతిదినము మధ్యాహ్నము గం 3 లకు మొదలుపెట్టి గం 4-0లు వరకు స్త్రీలచేతనే ముదలాయిర సేవాకాలము శ్రావ్యముగా గావింపబడుచు చివరకు గం 4-30 మొ గం 6వరకు శ్రీమతి పువ్వాడ మంగమ్మ గారిచేతను, శ్రీమతి మరంగంటి రంగనాయకమ్మగారిచేతను శ్రీ కణ్ణన్ వైభవమును గూర్చి దివ్యప్రబంధ గాథలతోను ఉపన్యసింపబడుచుండెను.

రాత్రులయందు గం 7 మొదలు గం 9 ల వరకు ఆంధ్రమహిళా సభా ఆర్కెష్ట్రావారున్ను చిరంజీవులైన శ్రీ హేమ-ప్రేమ పార్టీవారున్ను వీణాదిగానము, భరతనాట్యము, పాటకచ్చేరీ, శ్రీ శ్రీ రుక్మిణీ కళ్యాణ ప్రదర్శనములతో ప్రేక్షకులగు బహునారీమణుల హృదయములయందు భక్తిరసమును రేకెత్తించి తన్మయుల గావించిరి.

11-9-52 తేదీ గురువారం ఉదయము పెరుమాళ్ళకు తిరుమంజనము గావించి అర్చాశృంగారింపుతో మాత్రమే పెరుమాళ్ళను పుష్పాలంకృతలను గావించి వేంచేపుచేసి మధ్యాహ్నం శ్రీమాన్ తె.కం. గోపాలాచార్యులుగారు శ్రీమద్భాగవతమునుండి శ్రీకృష్ణావతారఘట్టమును సన్యాసరూపముగా అపూర్వవిషయములతోనుపన్యసించి శ్రోతలనానందాబ్ధినోలలాడించిరి.

14వ తేదీ నుండి ఎడాయిత్తోత్సవములు 3 దినములు నాచ్చియార్ తిరుమొழி సేవతోను అర్చనలతోను బాలికల ఉపన్యాస నృత్యాదులతోను వైభవముగా జరుపబడెను.

గీతామందిర కార్యకారిణీ సమితివారు శ్రీ ఆంధ్రమహిళా సభా ఆర్కెష్ట్రా వారిని రజత పాత్రముతో సన్మానించి కృతజ్ఞతను వెల్లడించిరి.

చిరంజీవి హేమ-ప్రేమ పార్టీవారికి కూడా కొందరు ప్రేక్షకులును, శ్రీ గీతామందిర యజమానులును రజత పాత్రల నొసంగి సన్మానించిరి.

ఈ ఉత్సవములలో వేలకొలది స్త్రీలు అత్యుత్సాహముతో పాల్గొనిరనిన అతిశయోక్తి కానేరదు.

# ప్రచారవిభాగము

## అర్తమూరు

తూర్పుగోదావరిజిల్లాలోని అర్తమూరు గ్రామ శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘమున్ను శ్రీయతిరాజసేనా ఎహిళామండలి వారున్ను, అచ్చటి శ్రీవేణుగోపాలస్వామివారి సన్నిధియందు భాద్రపద బ ౧౩ మంగళవారమున గోవర్ధనోద్ధరణప్రయుక్త అన్నకోటి ఉత్సవమును అతివైభవముగ జరిపిరి.

శ్రీమాన్ శ్రీమత్తిరుమల పురిఘళ్ళ వెంకటాచార్యస్వామివారు 'గోవర్ధనోద్ధరణమును' గురించి ఉపన్యసించిరి.

గీతామందిరము. 107. వరదా ముత్తియప్పన్ వీధి
మదరాసు I

---

## పైసాఫండు వసూలు.

శ్రీ. ఉ. వే. శ్రీమత్తిరుమల పురిఘళ్ళ వెంకటాచార్యులుగారు ప్రస్తుతం మకాం అర్తమూరు.
నందన. సం॥రం కు. జమ—రూ 2—0—0

---

## ★సంభావన★

బల్లిపాడు కాపురస్తులు వంగల అప్పన్ జగన్నాథాచార్యులుగారి పరమపదోత్సవ సందర్భమున శ్రీవిశిష్టాద్వైత సంఘమునకు సంభావనగా రు 2-0-0 లు సమర్పించినారు. ఇది తెనుకు కా॥ కలవగుంట శేషాచార్యులుగారి ద్వారా పంపిరి.

రిజిష్టరు నెం. 5049

# భక్తినివేదన

(వేదాంత మాసపత్రిక)

ఇందు వేదాంత విషయ రాజములున్ను; భక్తి ప్రచార విషయమైన వార్తలున్ను వేదాంత సాంప్రదాయ విషయకమైన శ్లోకత్రములున్ను ప్రచురించబడును.

చందాలు;

| | | |
|---|---|---|
| సాధారణ చందా | సం. ర 1కి॥ | రు 5-0-0. |
| సహాయ చందా | ,, | రు. 10-0-0. |

To

**Book-Post**

S. V. S.

1. శ్రీమన్నారాయణుడే సృష్టి - స్థితి లయ - కారకుడు.
2. ఆయనే మోక్షప్రదాత.
3. ఆయనే పరతత్వము-పరమాత్మ
4. ఆయన అఖిలహేయ ప్రత్యనీక కల్యాణ గుణకుడు.
5. ఆయనకు జీవుడు శరీరభూతుడు; శేషభూతుడు, పరతంత్రుడు, నియామ్యుడు, అనుభావ్యుడు.
6. జీవులు జ్ఞానైకాకారులు.
7. జీవులు అనంతములు.
8. జీవులు పరమాత్మకంటె భిన్నులు. ఈ భేదము సత్యమైనది; నిత్యమైనది.
9. జీవ-పరమాత్మలకు ప్రకృతి శరీరభూతమైనది; శేషభూతమైనది; పరతంత్రమైనది; నియామ్యమైనది; అనుభావ్యమైనది.
10. ప్రకృతి వికారాస్పదమైనది. జీవపరమాత్మలకంటె భిన్నమైనది, ఈ భేదము సత్యమైనది; నిత్యమైనది.
11. జీవుడు ప్రకృతి వియుక్తుడై పునరావృత్తి రహితమైన పరమాత్మ సాన్నిధ్యమగు పరమ పదమునుపొందుటయే మోక్షము.
12. భక్తి ఒక్కటియే మోక్షసాధనము.
13. భక్తియన తైలధారవలె అవిచ్ఛిన్నమైన స్మృతి పరంపర.
14. వివేక-విమోక-అభ్యాస-క్రియా- కల్యాణ అనవసాద-అనుద్ధర్షలు భక్త్యంగములు.
15. ఇవి సదాచార్య-సమాశ్రయణ-లభ్యములు
16. జగద్గురువగు శ్రీరామానుజాచార్యులు వారును; వారి యనుయాయులున్ను సదాచార్యులు.

"నగురుర్వైష్ణవాత్ పరః" భా, సం.

Edited, Published & Printed by A. Ch. Srimannarayanacharya at Sriman Press, Kakinada.

# ★ విజ్ఞప్తి ★

## శరన్నవరాత్రోత్సవములు.

స్వస్తి శ్రీ నందననామ సంవత్సర ఆశ్వయుజ శుద్ధ పాడ్యమి శనివారము (20-9-52) మొదిలగాయతు ఈశుద్ధనవమీ ఆదివారము (28-9-52) వరకు శరన్నవరాత్రోత్సవములు. ఇవి ప్రపన్నులగు శ్రీవైష్ణవులకు కూడ ముఖ్యమగు పర్వదినములు.

అగ్నిహోత్రము సర్వత్ర పవిత్రమైనదియు, పూజ్యమైనదియు. అయినను యజ్ఞవేదిక యందలి యగ్ని అతిపవిత్రవంతమైనదిగను, సద్గృహస్థునింటి యగ్ని సాధారణ పవిత్రమైనదిగను, శ్మశానమందలి యగ్ని అపవిత్రమైనదిగను భావించబడునటులనే సర్వేశ్వరుడు సర్వదేశ సర్వకాలముల యందును సర్వవ్యాపకుడై యున్నను, ఆయా దేశ-కాల-పాత్రలనుబట్టి ఆయనయొక్క-తేజ-శక్తి-గుణములు హెచ్చు-తగ్గులై ప్రకాశించుచుండును. దీనిననుసరించియే ఆయాయధికారులు ఆయా దేశ విశేషములందును, కాలవిశేషములందును సర్వేశ్వరుని ఆరాధించి అనుభవించి, ఆనందించుచుందురు. ప్రపన్నులు దేవతాంతర్యామిని ఆరాధించకుండుటకున్ను ఇదియే కారణము.

ఇట్టి కాలవిశేషములలో ప్రపన్నులకు శరన్నవరాత్రములు సర్వేశ్వర విశేషారాధనలకు మిక్కిలి యోగ్యములు. ఈకాలము శ్రీ-శ్రియఃపతులకు మిక్కిలి ప్రీతిపాత్రమైనది. ఈనవరాత్రములలో కొంతమంది శ్రీమద్రామాయణమును గాని, లేక కనీసము సుందరాకాండను గాని పారాయణ చేయుదురు.

కొందరు శ్రీ-శ్రియఃపతుల ప్రతినిత్యము విశేషముగ ఆరాధించుచుందురు. శ్రీవిశిష్టాద్వైత సాంప్రదాయస్థులైన ప్రపన్నులగు స్త్రీపురుషులందరున్ను ప్రతినిత్యము ఉదయమున తిరువారాధనములో పెరుమాళ్ళకు తాయార్లకు పంచసూక్తములతో పంచామృత తిరుమంజనము సమర్పించి శ్రీవిష్ణు సహస్రనామములతోను, శ్రీలక్ష్మీఅష్టోత్తర శతనామములతోను, తులసీతో అర్చననుచేసి పాయసమును విశేషారగింపును చేసియథాశక్తిని తదీయారాధనమున్ను, సాయంకాలము తిరువారాధనవద్ద దీపారాధనము సమర్పించినవెంటనే అష్టోపచారముల సమర్పించి పిమ్మట శ్రీకృష్ణాష్టోత్తర శతనామములతోను శ్రీలక్ష్మీ సహస్రనామములతోను శ్రీచూర్ణముతో గాని లేక తులసితోగాని అర్చననుచేసి శక్త్యనుసారముగ తీపి అప్పములు. (గోధుమపిండితోచేసినవి శ్రేష్ఠములు లేనిచో వరిపిండితోగాని చేయవచ్చును.) విశేషారగింపుచేసి మంగళాశాసనమును సమర్పించవలెను.

ఇంతియేగాక ఉదయమున శ్రీరంగగద్యను క్షమాషోడశిస్తోత్రమును సాయంకాలము శరణాగతిగద్యను శ్రీగుణరత్నకోశస్తోత్రమును విన్నవించుచుండుట విశేషము వీనిని అందరు విన్నవించవచ్చును.

మరియు ఉపనీతులగువారు తమ శాఖీయవేదములనుగాని లేక అథర్వశిఖోపనిషత్తును గాని విన్నవించవచ్చును. ఇంతియేగాక శ్రీభాష్యము గీతాభాష్యము. వేదార్థసంగ్రహములు విన్నవించుట విశేషము. శ్రీమద్రామాయణమును పారాయణము చేయువారు అటులనే చేయవచ్చును.

శ్రీవిశిష్టాద్వైత ప్రచారకసంఘము వారున్ను శ్రీయతిరాజసేవా మహిళామండలి వారున్ను తమతమ ప్రాంతములయందు ఈపర్వదినము సమిష్టిఉత్సవములు జరిపి వాటి వివరములు క్లుప్తముగా ప్రధాన కార్యాలయమునకు తెలిపిన ప్రచురించగలము.

శ్రీవిశిష్టాద్వైత ప్రచారకసంఘ కార్యాలయం
గీతామందిరము 107, వరదాముత్తియప్పన్ వీధి.
మదరాసు—1

శ్రీమతే రామానుజాయనమః

# భక్తి
# నివేదన

వేదాంత మాస పత్రిక

సంపుటి ౪ || నందన-ఆశ్వీయుజమాసం || సంచిక ౨

## ★ యాదార్థ విద్య ★

స్థలము:-శ్రీభట్టరువారి కాలక్షేపమందిరము

సన్నివేశము:-శ్రీభట్టరువారు కాలక్షేపము సాయించుటకై ఎత్తైనఆసనమందు వేంచేసి యుందురు వారికి ఎదురుగ వారిశిష్యులు కూర్చొనియుందురు శ్రీభట్టరు వారి ఎదురుగ వ్యాసపీటముపై ఆచార్యహృదయ కోశము ఉండును. వారు ఎవరిరాకకొరకో నిరీక్షించు చుందురు.

కాలము:-ఉదయము గం. 8-0 లువేళ

భట్టరువారు:-ఏమాత్రము ప్రొద్దెక్కినది ?

ఒకశిష్యుడు:-స్వామి ! సుమారొక ఝాము ప్రొద్దెక్కినది.

భట్టరువారు:-అబ్బ అలాగునా ? ఇంకను మన నరశింహాచార్య స్వామివారు వేంచేయ లేదేమో ?

మరొకశిష్యుడు:-మామూలుగ వచ్చువేళ కొద్దిగ అతిక్రమించినది. వచ్చుచునే యుండ వచ్చును,

మరొకశిష్యుడు:-ఏమో ఆయన ఎపుడువచ్చినను వకటే. శాస్త్రజ్ఞానమా? మన్నా? అన్నీ సున్నా !

అత్యంత శాస్త్రీయ విషయములతో నిగూఢమై, రత్నాకరముకంటె గంభీరమై విశేషధర్మ విభూషితమై, సహృదయ హృదయవిధేయమై విరాజిల్లు ఈ ఆచార్యహృదయము సాహిత్యజ్ఞాన శూన్యు

తైన, రామశబ్దమే రానటువంటి శ్రీ సీతారామాభ్యాన్నమః గాగ్లకు కొరకుపడునా ? భావమేనా స్ఫురించునా? వారి కొరకై నిరీక్షించుట వృథా కాలహరణము స్వామీ !

(ఈమాటలకు శిష్యులలో కొందరు నివ్వెరపడి జూచుచుందురు. కొందరు చేతితో నోరుమూసుకొని ఆమాటాడు శిష్యుని కనుసైగతో సహా నివారించుచుందురు. మరికొందరు బట్టయడ్డము పెట్టుకొని ముసుగుగ ముసిముసినవ్వులునవ్వుచుందురు)

భట్టరువారు:—(ఆమాటలాడిన శిష్యునివైపు తల పంకించుచు చిరునవ్వు నవ్వుచుందురు. ఆనవ్వులో ఆశిష్యుని యజ్ఞానమును, దార్ఢ్యమును అనుచిత సాహసమును అధిక్షేపించు చిహ్నాలుండును.)

[ప్రకాశముగ]

మీయందరికి ఆయన రాకుండగ ప్రారంభించుటే యభిప్రాయమైనచో ఆలాగుననే చేతము. వారు వేంచేసినచో తిరిగి వారికి వేరుగా విన్నవించుకొందును.

ఇంతలో బీదవేషముతో, చంకని గుమ్మడికాయ రాగిచెంబు జోలితో నరశింహాచార్యస్వామి చేతులురెండు జోడించుకొని పరుగుపరుగున వచ్చుదురు. గోష్ఠికి ఎదురు సాష్టాంగ దండప్రణామములాచరించి, స్వాముల వెనుకనుండి శ్రీభట్టరువారివద్దకు వత్తురు. శ్రీభట్టరువారుకూడ వెంటనేలేచి ఆస్వామికిసాష్టాంగదండము సమర్పించి, లేచి. తమదగ్గరగ ఆస్వామిని కూర్చుండ నియోగింతురు. మిగతశిష్యులు కొద్దిగవంగి దండము సమర్పింతురు)

నరశింహాచార్యస్వామి:—స్వామి రాత్రి శ్రీరంగనిభజన సమాప్తమగుసరికి చాల పొద్దుపోయినది. అందుచే తెల్లవారుఝామున లేచుటలో కొద్దిగ ఆలస్యమైనది. మరియు నేను ఆచార్యమాస తిరునక్షత్రమగుటచే పెరుమాళ్ళ తిరుమంజనము. సేవకాలము అగుటలో పొద్దుతెలియక ఆలస్యముచేసి అపచారపడితిని. దాసుని క్షమించవలెను.

భట్టరువారు:—అబ్బే ! ఆలస్యమేమైనది పరవాలేదులెండి.

నరశింహాచార్యస్వామి:—అడియేను.

భట్టరువారు:—ఆజ్ఞ ! ప్రారంభించుదామా.

నరశింహాచార్యస్వామి:—అడియేను.

భట్టరువారు:—[ఆచార్య హృదయ శ్రీకోశమును తెరచి చదువుదురు]

“అజ్ఞర్ భ్రమిక్కిఉ వర్ణాశ్రమ విద్యావృత్తంగళై గార్దభజన్మం శ్వపచాధమం. శిల్పపుణ్యాం. భస్మాహుతి, శవ, విధవాలంకారం ఎన్ఱు కజికప్పర్ కళ్”

లోకములో తత్త్వ—హిత—పురుషార్థముల యథార్థస్వరూపమును తెలియనట్టియు, తెలిసినను నమ్మకము కుదురనట్టియు, నమ్మకము కుదిరినను మానసికమైన సంపూర్ణవిశ్వాసము లేనట్టియు, సంపూర్ణవిశ్వాసము కలిగినను ఒరుల కుపదేశించుటయేగాని తామనుష్ఠించ ప్రయత్నించనట్టియు, తామనుష్ఠించ ప్రయత్నించినను అధ్యవసాయ లోపముచే వాసనావాసిత సంస్కారవిశేషముచే

ఆకర్షితులై పూర్వపుశ్రేణిలో పడువారలందరు కూడ అజ్ఞానులే. కాని అట్టివారు కూడ మేము సత్కులజాతులమనియో, ఉత్తమశ్రీమస్థులమనియో విద్యానిపుణులమనియో, గొప్పవృత్తుల గలవారలమనియో, విర్రవీగుచుందురు. అంతియేకాదు యితరులను అవమానపరచి కించపరచుచుందురు. అది కాలమహిమ,

శ్లో॥ విద్యానిపుణావయ మిత్యన్యే ।
హ్యాద్యా ధనినో వయ మిత్యన్యే ।
సత్కులజాతా వయ మిత్యన్యే ।
తేషు కలిం పరిపూర్ణం మన్యే ॥

ఇట్లు అహంకారము, ఆత్మశ్లాఘ్యము, పరన్యాసనసంధానము చాల అపచారకరమైనది. స్వరూపనాశకరమైనది.

గాన గ్రథమాత్మక వర్ణ–ఆశ్రమ–విద్యా–వృత్తులు గాడిదయొక్క జన్మమువలెను. శ్వపచాధమునివలెను. దొమ్మరివిద్య నాటకముల యందలి వేషములు కాగితములమీద గీయుబొమ్మలు వలెను, బూడిదలో చేయబడు ఆహుతులవలెను శవములకు విగతభర్తృకలకు చేయబడు అలంకారములు వలెను వ్యర్థములు. అంతియే కాదు. నీచములు, నిషిద్ధములు యగుచున్నవి. జ్ఞానమే ప్రధానమైనది, అదియే ఆదరించబడవలసినది. దానిని బట్టియే ఉచ్చనీచ తారతమ్యములు నిర్ణయించబడయును. అందుచే జ్ఞానులకు పెద్దలు కేవల బాహ్యములగు వర్ణ–ఆశ్రమ–విద్యా–వృత్తులనుబట్టి మాత్రమే చూడక ఆంతరంగిక జ్ఞానమును బట్టియే ఎవరినైనను ఆదరింతురు. తామును అటులనే తరింప ప్రయత్నింతురు.

[ఇంతలో ఒక శ్రీవైష్ణవ సన్నిధి స్వామి వచ్చి భట్టరు వారితో ప్రకాశముగా]

సన్నిధిస్వామి:– అడియేను

భట్టరువారు:– [కాలక్షేపమాపి, ఆ వచ్చిన స్వామికేసి తిరిగి] ఏమండీ సమిట్రి విశేషం.

సన్నిధిస్వామి:– అడియేను. ఎవరో ఒక విద్వాంసులు విచ్చేసిరి. ఆయన షట్చాస్త్ర పండితులట. అనేక విద్వత్సభలలో, రాజ మహారాజ సన్నిధిలలో జయశ్రీని వరించి సన్మానముల బొందియుండెనట. తనకీ లోకమున సమాన పండితు లెవరును లేరట. చాల దూర దేశమునుండి వచ్చిదాడట. దేవరవారి నొక పర్యాయము జూచి పోదలచి వచ్చినారట. ఆవల తిన్నెపై కూర్చుండబెట్టి దేవరవారి యాజ్ఞకై వచ్చినాడ.

భట్టరువారు:– అలాగునా? ఎవరైతేనేమి? ఎవరోవకరు కాలక్షేప విరోధి. అయినను నేడు కొద్ది ఆలస్యమైనది. మన స్వాములకు పొద్దుపోయినది. సరే. నిమ్మళముగా వారిని తీసుకొని రమ్ము.

[నరశింహాచార్యులవారి వైపు తిరిగి నేటికి శాంతి చెప్పుటకు యాజ్ఞా.

నరశింహాచార్యులు: అడియేను. దేవరవారి కటాక్షం. [భట్టరువారు ఆసనము నుండి లేవగా శిష్యులందరు కూడ లేతురు. అందరు శాంతి పాఠమును చదివి సాష్టాంగ దండము సమర్పింతురు.

నరశింహాచార్యులువారు;– స్వామి ఆజ్ఞా–

భట్టరువారు:– అడియేను: [అనుచు నరశింహాచార్యులువారు వెళ్ళుచుండగా భట్టరువారు

తాము కూడ వారితో కొద్ది దూరము వెళ్ళి సాగనంపి వచ్చి తిరిగి తమ ఆసన మలంకరింతురు. శిష్యులు కూర్చొనియుందురు. ఇంతలో మొగమున పెద్దకుంకుమ బొట్టును ధరించి పెద్ద ఎర్రని జరీఅంచుల కాశ్మీర శాలువను గప్పుకొని, తలకు బనారసు కండువా తలపాగా చుట్టుకొని యున్న పండితుని సన్నిధిస్వామి తీసుకొని వత్తురు. ఆ పండితుడు ఏమాత్రము వినయము లేనివాడై గర్విష్టిగా కనబడుచుండును. నమస్కారాదుల నేమియు చేయబడు భట్టరువారు కూడ దూరమునుండిరే ఆ పండితుని పాలకిమును గ్రహించి తామాసనమునుండి లేవకయే నమస్కారాదుల చేయకయే] [ప్రకాశముగ]

పండితవర్యా దయచేయుడు. (అని తమ ప్రక్కనే ఒక ఆసనమును జూపుదురు)

పండితుడు నలుప్రక్కల వింతల జూచుచు సగర్వముగ ఆధత్భాసనముపై కూర్చొనును.

భట్టరువారు:- మహాశయా తమదే ప్రాంతమువారు. ఇచ్చటి కెపుడు దయచేసినారు? తమ విశేషముల తెలియగోరుచున్నాను.

పండితులు:- మేము కాశ్మీర పురవాసులము కాశీలో 22 వత్సరములు షట్ఛాస్త్రములను చదివినాము. క్రమాంత అధ్యయనమును జేసినాము. వేదాంతవిద్యయందు మాకభిమానము హెచ్చు. దిగ్విజయ యాత్ర జేయుచు నిన్ననే యిచ్చటికి వచ్చినాము.

భట్టరువారు:- ఓహో అలాగా చాల సంతోషము.

పండితులు:- నిన్న సాయంకాలమున దేవాలయమునకు వెళ్ళినపుడు ఈ మీ శిష్యులచ్చట పాఠముల వల్లించుకొనుచుండిరి. వీరందరిని న్యాయములో నొకరిని, వ్యాకరణమున నొకరిని, మీమాంసలో నొకరిని, అధ్యయనములో నొకరిని, బ్రహ్మసూత్ర భాష్యములో నొకరిని పరీక్షించి జూచితిమి. వీరందరు చాల బాగుగా చాల వ్యాసంగము చేసిన శాస్త్రీయపండితులే వీరందరు మీ సర్వతోముఖ పాండిత్య ప్రతిభల గూర్చి నాకు తెలిపిరి. మిమ్ముల జూచి పోదమని మేమే వచ్చితిమి.

భట్టరువారు:- చాల సంతోషము. మీ వంటి విద్వచ్ఛిఖామణుల కలుసుకొని నందులకు చాల ఆనందముగ నున్నది.

[సన్నిధి స్వామితో]

పండితులకై ఒక తాంబూలము తేవయ్యా

సన్నిధిస్వామి:- అడియేను. [అని ఒక పళ్ళెములో ఒక తాంబూలమును రెండరటి పళ్ళను తెచ్చి పండితుల కందించును. పండితులు మొగము చిట్లించుకొనుచు ఆ తాంబూలమును తీసుకొని లేచును.]

పండితులు:- పోయివత్తును.

భట్టరువారు:- [ఆసనముపై కూర్చొనియుండియే] చిత్తము. [పండితులు అసంతుష్టితో వెళ్ళిపోవును.]

ఒక శిష్యుడు:- స్వామి ఈ పండితుడుచాల గొప్పవాడు. నిన్న మాతో చాల ప్రొద్దు వాదించెను. ఆయన వాదనా నైపుణ్యము శాస్త్రీయవ్యాసంగం యుక్తి సమర్థన చాల అద్భుతముగ నున్నవి. మన ప్రాంతమందే కాదు మనదేశమందే యిట్టి సర్వతోముఖ శాస్త్రీయపాండిత్యము కలవారున్నారా యని

సందేహము మాకు కలిగినది.

పండితులెవరైన వచ్చినచో దేవరవారు వారి నెంతో గౌరవింతురు. ప్రత్యుత్థానము చేతురు. ఎంతో సేపు ప్రసంగింతురు. చివరకు శాలువో, దోవతులచాపో, బహూకరింతురు. గాని నేడీ పండితుని పట్ల దేవరవారేలనో ఔదాసీన్యము వహించితిరి. ఔదాసీన్యమే కాదు అసహ్యభావమును వెళ్ళడించిరి. మన ఖైక్షుక నిశానీ-నిర్మాత-నరశింహాచార్యులువారు వచ్చినపుడు దేవరవారు చేయు గౌరవ మర్యాదలలో సహస్రాంశమైన దేవరవారి పండితుని పట్ల జూపక పోవుట మాకమితాశ్చర్యముగ నున్నది. నిన్న మేమే ఈయన నిచ్చటి కాహ్వానించితిమి కూడ...

భట్టరువారు:- ఓహో అలాగునా? ఈయన గొప్ప పండితుడే అయి యుండవచ్చును. గాని ఆయనను జూడడము తోడే నాకదేమో మనస్సున గౌరవభావ మంకురించలేదు.

శ్లో॥ విద్యా దదాతి వినయం వినయేన పాత్రతా।
పాత్రత్వాత్ ధనమాప్నోతి ధనాత్ ధర్మం తతస్సుఖం॥

కదా- ఈయనయందు విద్య పుష్కలముగా యుండవచ్చును గాని దానివల్ల కలుగవలసిన వినయాదులు ఆయనయందు సున్న. అసలాయన యందున్న ఆ విద్యా సంపత్తియు నిజమైన విద్య కాదు. అది భ్రమాత్మకమైనది. సందేహముల కాకరమైనది.

తత్త్వ-హిత-పురుషార్థ నిశ్చయ జ్ఞాన మీయని విద్య విద్యయా? అట్టి విద్యా భ్రాంతి వలన నిశ్చిత భ్రాంతియే గాని శాంతి ఎక్కడిది?

శిష్యుడు:- దేవరవారు ఆ పండితునితో శాస్త్రీయ ప్రసంగమే నొనర్చలేదే. ఆయన జ్ఞానమును యిటుల నిర్ధారణ జేయుట...

భట్టరువారు:- మనిషిని జూచినచో, ఏదు మాటలు మాట్లాడినచో, తెలియదటయ్యా, ఆ మనిషి స్వరూప స్వభావములు.

శ్లో॥ యతీశ్వర సరస్వతీసురభితాశయానాంసతాం
వహామిచరణాంబుజం ప్రణతశాలినామాళినా॥

అని దేశికులు పాయించినటుల శ్రీమద్రామానుజ దివ్య శ్రీసూక్తి గలవారి పాదపద్మముల శిరస్సున ధరించవలసినదే. అంతేకాని

శ్లో॥ ఘ్నంతం శపంతం పరుషం వదంతం।
న వైష్ణవం ప్రతికుర్వీత విద్వాన్॥

ఆత్మస్తుతి-పరనింద-పరుషవాక్యములు గల వారిని పరమార్థజ్ఞానులు లాగ యాదరించుట ఎటుల? పోనిండు నేనే పొరబడితినేమో. రేపు తిరిగి ఆయనను తీసుకొని రండు. వారి పాండిత్య ప్రతిభను అనుభవించి ఆదరింతుము.

శిష్యు:- అడియేను. మహాభాగ్యము.

రెండవ రంగము.

స్థలము:- శ్రీభట్టరువారి కాలక్షేపకూటము.

కాలము:- మరుచటిదినము ఉదయము గం 11-0 వేళ

సన్నివేశము:- భట్టరువారు ఒకఆసనముమీదను పండితుడొక ఆసనము మీదను అధిష్ఠించి యుందురు.

వారిని పరివేష్టించి శిష్యులుందురు.

భట్టుగారు:—ఆర్యా ! తత్త్వ-హిత-పురుషార్థములగురించి తమ నిశ్చయమైన విశ్వాసమేమి?

పండితులు:—అయ్యా ! వీనిని గురించి ఇదమిత్థమని నిర్ణయించి నిశ్చయించుట చాలకష్టము. ఎందుచేతననగా శాస్త్రములన్నియు ప్రమాణతమములే. ఒక్కొక్క-శాస్త్రము ఒక్కొక్క-విధముగ తెలుపుచున్నది, వీటన్నింటికి తలబాదుకున్నను ఏకవాక్యత కుదురదు. ఏశాస్త్రమును కాదని త్రోసివేయగలము. దేనికదేగొప్పది. మేము భాలబాష్యములు జూచియున్నాము. కాని ఏభాష్యము ఇదమిత్థమని సిద్ధాంతరీకరించ లేకున్నవి. జ్ఞానమాత్రమే తత్త్వమనియు, జ్ఞానాజ్ఞాన భేద ధర్మనమే హితమనియు, జ్ఞానస్వరూపమైన యాత్మయొక్క-స్వరూపోచ్ఛిత్తియేమోక్షమనియు ప్రపంచప్రచార మొనర్చె బౌద్ధాదులు.

జగజన్మాదికారణ రహిత పంగు సమాన కేవల అధిష్టానభూత పురుషవిశేషుడు మాత్రమే తత్త్వమనియు, అట్టిజగత్ప్రసూతి అంధురాలైన ప్రకృతియనియు, పురుష-ప్రకృతి వివేకమే హితమనియు. ప్రకృత్యతీతుడై పాషాణకల్పుడైయుండుస్థితిని సంపాదించుటే పురుషార్థమనియు వక్కా-ణించును సాంఖ్యశాస్త్రకర్త కపిలమహర్షి జీవాత్మ-పరమాత్మలు భిన్నులుగాక వక్క-టే యందురు, సాంఖ్యులున్ను, యోగులున్నుసర్వాత్మనా జీవవిశేష సమానుడు, అనుమానికుడు అగు పురుషవిశేషుడే తత్త్వమనియు, సప్తపదార్థతత్త్వజ్ఞానమే హితమనియు, ఆనందాది రహితమైన అపురుషవిశేష సాన్నిధ్యలాభమే పురుషార్థమనియు పలుకును వైశేషికశాస్త్ర భర్తక ణాదమహర్షి.

సర్వజ్ఞ-సర్వశక్తి సమన్వితుడే అయినను ఊహాసంజనిత బుద్ధిగ్రాహ్యుడై పరిమిత పరిమాణాది గుణాన్విత పురుషవిశేషుడేతత్త్వమనియు, షోడశపదార్థ నిశ్చయజ్ఞానమే హితమనియు,చతుర్వింశతి దుఃఖధ్వంసమే పురుషార్థమనియు డంకా బజాయించును. న్యాయశాస్త్రగురుడు గౌతమమహర్షి.

సర్వసాధకశక్తి విశిష్టపరమాపూర్వమే తత్త్వమనియు స్వర్గాదిఫలసాధకమగు జ్యోతిష్టోమాది యజ్ఞ-యాగాదులే హితమనియు, స్వర్గాద్యనుభవమే పురుషార్థమనియు విధించుచున్నాడు మీమాంసాచార్యుడగు జైమిని మహానుభావుడు.

పశుపతియే తత్త్వమనియు, తదుపాసనయేహితమనియు పశుపతి సాన్నిధ్యరూప కైవల్యప్రాప్తియే పురుషార్థమనియు ప్రతిపాదించుచున్నాడు, పాశుపత మతసంస్థాపకుడగు బసవాచార్యుడు.

గణపతియే తత్త్వమనియు, వామాచారవిశిష్టత దారధనమే హితమనియు, ఇంద్రియతృప్తినిచ్చు భోగాది విశిష్ట ఇహపరలోకానుభవమే పురుషార్థమనియు వ్రాక్కుచ్చియున్నారు .శక్తేయాది మతప్రవర్తకుడు శుక్రుడు మున్నగువారు

భూమ- ప్రేమవిశిష్టుడైన బ్రహ్మ వక్క-డే తత్త్వమనియు, జీవాత్మ పరమాత్మైకత్వానుసంధాన పూర్వక మహావాక్యార్థానుసంధానమే హితమనియు, బ్రహ్మయొక్క- భూమస్వరూపమైన జీవస్వరూపోచ్ఛిత్తియే మోక్షస్వరూపమనియు నొక్కి- వక్కా-ణించుచున్నాడు.

అద్వైతాచార్యవర్యుడగు శంకరుడు.

అపహత పాప్ముడైన పరమాత్మ వక్క-

తత్త్వమనియు, తత్ప్రతిబింబమో, తదుపాధియో తత్పరిణామమో, తద్విగ్రహమో యగు జీవునికి గల భేదబుద్ధియో, అభేదబుద్ధియో, భేదాభేద బుద్ధియో పోగొట్టునట్టి జ్ఞానము లేక జ్ఞాన-కర్మ సముచ్చయము హితమనియు, జీవునికి పరమాత్మ రూప స్వస్వరూపావిర్భావమే పురుషార్థమనియు బోధించుచున్నారు భాస్కరుడు యాదవప్రకాశుడు మున్నగువారు.

బ్రహ్మచారి విష్ణువే పరతత్త్వమనియు, భక్తియే హితమనియు, నీచోచ్చభావంగతుడై జీవుడు పరమాత్మను దేహాంతరమందు దేశవిశేషమున ననుభవించుటె పురుషార్థమని వచింతురు ద్వైతవాదులు.

నిఖిల జగదేక కారణుడు, అశేష హేయప్రత్యనీకానంత జ్ఞానానందైక స్వరూపుడు, స్వాభావికానవధికాతిశయాసంఖ్యేయ కల్యాణగుణాకరుడు, సకలేతర విలక్షణుడు, సర్వాత్మభూతుడు యగు శ్రీమన్నారాయణుడే తత్త్వము.

తదుపాసన రూపభక్తి ప్రపత్తులే హితము.

[పరమాత్మ శరీరభూతుడై తత్ప్రకారతయా భాసిల్లునట్టియు అనుకూలాపరిచ్ఛిన్న జ్ఞానస్వరూపుడైనట్టియు పరమాత్మానుభవైకరసుడైనట్టి జీవునికి] అనాది కర్మరూపావిద్యోచ్ఛేద పూర్వమైన స్వాభావికమైన దేశవిశేషగత దేహాంతైక భోగ్యమైన పరమాత్మానుభవమే పురుషార్థమని నిర్ధారణ చేయుదురు త్రయ్యంతనిష్ణాతులగు విశిష్టాద్వైతులు.

స్వామి- ఈ విధముగ శాస్త్రములు ఏ విషయములోను కూడ ఏకాభిప్రాయము లేనివై తల తోక లేనివై తలకొకదారి, తలకొక యభిప్రాయము, తలకొక సిద్ధాంతము కలవై పరస్పర భిన్నములై యున్నవి. వీనియొక్క కర్తలో మహామహులు, మహర్షిసత్తములున్ను; వాని ప్రచారకులో అపరిమిత మేధా సంపన్నులగు మహాత్ములు; ఆ మతానుయాయులో మహిని అపరిమితులు; ఆ మతములో అనాది సిద్ధములు; తద్వ్యాప్తియో దిగంత వ్యాపకములు. అందుచే వీనిలో ఇది సత్యము. ఇది సరియైనది. ఇది మంచిది అని గాని ఇది అసత్యము. ఇది సరియైనది కాదు. ఇది చెడ్డది అని గాని నిర్ణయించుటకు ఆ సర్వజ్ఞుడైన సర్వేశ్వరునకు కూడ శక్యము కాదు. ఇక మన సంగతి చెప్పవలసినదేమి?

భట్టరువారు:- అయితే మనము దేనినో ఒకదానిని విశ్వసించి నడువక తప్పదు కదా- ఇన్నింటియొక్క యాథావస్థిని కూలంకషముగ తరచి జూచిన మీరు దేనిని విశ్వసించితిరి?

పండితులు:- ఆ విషయమై గట్టిగ ప్రశ్నించ కూడదు. ఏదో ముక్కు మూసుకొని ఆ సమయమునకు తోచిన దారిని త్రొక్కి ఏదో ఒక లాగున కాలక్షేపము జేయుటయే గాని దేని మీదను విశ్వాసము లేదు. అవిశ్వాసము లేదు.

భట్టరువారు:- చిత్తము. ఆలాగుననే మరి. ఒక మాధ్యాహ్నికమునకు లేద్దుమా. మీకు చాల శ్రమయిచ్చితిని. తిరిగి మరొకమారు సావకాశముగ కలుసుకొందుము గాక.

పండితులు:- చిత్తము-చిత్తము.

భట్టరువారు:- ఎవరయ్యా అక్కడ. చూడు ఈ పండితులను సత్కరించి పంపుము.

[ఒక సన్నిధిస్వామి ఒక పళ్ళెములో తాంబూలము పండ్లు పది రూపాయలు పెట్టి పండి

తుల కందించును. పండితులు దానిని తీసుకొని]

పండితులు:- మహాప్రసాదము. చిత్తము. శెలవు. [అని లేచి వెళ్ళెను.]

భట్టరువారు:- చిత్తము. [అని కూర్చొనియే పలుకుదురు.] పండితుడు వెళ్ళగానే

భట్టరువారు:- అబ్బ. ఈనాస్తికాగ్రేసరుని తిరిగి తీసుకొని వచ్చి కంఠముమీద కూర్చొన బెట్టిరి. కాలక్షేపమూ పాడైనది. కుత్సిత వాక్కుల వినవలసివచ్చినది. కట్టుబట్టలతో సచేల స్నానము చేసినగాని ఈ ప్రసంగదోషముపోదు. అమ్మయ్య బ్రతికితిమి. అదుగో ప్రపన్నాగ్రేసరులగు శ్రీమాన్ నరశింహాచార్య స్వామివారు వేంచేయుచున్నారు. వీరి దర్శన-స్పర్శ-ఆలాపాదులవలన ఈ ప్రసంగ పాపము పోగలదు. [అని లేచి యెదురువెళ్ళి వచ్చుచున్న శ్రీమాన్ నరశింహాచార్యులు వారికి సాష్టాంగనమస్కారమాచరించి కౌగలించుకొందురు. ఇద్దరు కలిసి లోపలికి వచ్చుదురు.]

భట్టరువారు:- అడియేను. దాసోహం.

నరశింహాచార్యులుగారు:- స్వామి వేంచేయండి. దేవరవారి కోసమే ఎదురు జూచుచున్నాను. ధన్యుణ్ణి. [ఇద్దరు కూర్చొందురు. సన్నిధి స్వాములు యిదంతయు అత్యాశ్చర్యముతో తమలో తాము గొణుగుకొనుచు ఈర్ష్యతో జూచుచుందురు. భట్టరు వార విషయమంతయు కనిపెట్టుచుందురు.]

భట్టరువారు :- నరశింహాచార్యస్వామీ - యిప్పుడొక ఆభాస పండితమ్మన్యుడు వచ్చెను. తత్త్వ-హిత-పురుషార్థము లెవ్వి యని ప్రశ్నించగా చేటభారతమంతయు వదరి చివరకు దేనిని విశ్వసించవలెనయ్యా యంటె ఘూర్ణానుస్వారమును జూపించిపోయెను. మా మనస్సంతయు వ్యాకులత జెందియున్నది. దేవరవారు ఏవేవి తత్త్వ-హిత - పురుషార్థములో సిద్ధాంతమును జెప్పి మా మనస్సును కొంత శాంతి పరుతురు గాక. [ఈ మాటలు విని నరశింహాచార్యులు వారు చంటిపిల్లవానివలె వెక్కి వెక్కి బోరున రోదన చేయుదురు.]

[సన్నిధిస్వాములందరు తెల్లబోయి భీతితో తొట్రుపాటు పడుచుందురు. భట్టరువారికి కూడ కంటి వెంట నీరు కారుచుండును.

గద్గదస్వరముతో]

భట్టరువారు:- స్వామీ, ఇదేమి. దేవరవారు సిద్ధాంతమును తెలిపి మనస్సునకు శాంతి కూర్చెదరని అనుకుంటే ఈ విపరీతమేమి?

నరశింహాచార్యులవారు:- [కొంచెము తొరట చెంది, విచారమున గద్గద స్వరములో] ఆచార్యవర్యా! అకించనుడను, అగతికుడను, దేవరవారి శ్రీపాదముల నాశ్రయించినాను. పరమదయాస్వరూపులై, ఆర్తత్రాణ పరాయణులై అఖిల చేతనోజ్జీవన హేతులైన దేవరవారు దాసుని కటాక్షించిరి.

స్వాచార్య సాన్నిధ్య విశిష్ట రంగడే తత్త్వమనియు, వారికి ఆత్మ, ఆత్మీయ సమర్పణ రూప ప్రపత్తియే హితమనియు, యావదాత్మ భావియైన నిరంతర, నిరవచ్ఛిన్న, నిరవధిక, నిరుపాధిక, నిత్య సర్వకాలోచిత సర్వవిధ కైంకర్యమే పురుషార్థమనియు, దేవరుపదేశించిన దానినే సదా జ్ఞాపకముంచుకొని మననము చేయుచు యథాశక్తిని ఆప్రకారమే నడచుకొనుచున్నాను.

ఇపుడు దేవరవారు ప్రశ్నించుటచే దాసు డేమి యపరాధ మొనర్చెనో, లేక దేవరవారి యుపదేశమును అన్యథా గ్రహించి పాడగు చుండెనో, లేక దాసుని యాచరణ సిద్ధాంత విరుద్ధముగ యుండెనో, తెలియక దుఃఖము కలుగుచున్నది. స్వామీ దాసుని యపరాధ ముల క్షమించి దిద్దుబాటు చేయవలెను. దేవర వారి శ్రీపాదముల తప్ప మరి దిక్కులేనివాడను. అన్యమేమియు యెరుగను. దేవరవారి యుపదే శమునందు తప్ప మరిదేనియందును లేశ మాత్ర మైన బుద్ధిపోయి యుండలేదు. ఇది ముమ్మాటికి సత్యము. నేనసత్యము పలికి యున్నచో రౌర వాది నరకము పాలగుదును. స్వామీ కటా క్షించవలెను. కృపజూడవలెను. ఉద్ధరించ వలెను.

[అని తిరిగి ఏడ్చుచు స్మృహతప్పి భట్టరు వారి కాళ్ళపై పడును.] సన్నిధి స్వాములు కం గారుపడి వెంటనే నరశింహాచార్యస్వామివారిని లేవనెత్తి శైత్యోపచారములు చేయుదురు. కొంతసేపటికి తెలివిరాగా ఆయన తిరిగి భట్టరు వారి కాళ్ళపై పడును. భట్టరువారు వారిని లేవదీసి కౌగలించుకొని వీపునుమురుచు]

భట్టరువారు:- స్వామీ నాకు మీయందు సందేహమేమియు కలిగి ఈ ప్రశ్నవేయలేదు. దేవరవారి జ్ఞానానుష్టానములు దాసునకు పూర్ణ ముగః తెలియును. అందులో అణుమాత్రము తప్పులేదు. ఎప్పటికైనను దేవరవారి సంబం ధము చేతనే అస్మదాదు లందరికి ఉత్తారణ యని నమ్మియున్నాము.

[సన్నిధిస్వాములవైపు తిరిగి వారిని జూపుచు] వీరందరు దేవరవారి సిద్ధాంతమును, విశ్వాస మును, జ్ఞానవిశేషమును తెలుసుకొన గోరుటచే దేవరవారికి వ్యథను కలిగించ సాహసించి పాపినైతిని.

నరశింహాచార్యులు వారు:- అమ్మయ్య బ్రతికితిని. నా విశ్వాసము వమ్ము కాలేదుకద. నా యనుష్టానము అన్యథా జ్ఞానము జన్యము కాలేదు కద.

[సన్నిధిస్వాములందరు నరశింహాచార్యులు వారి కాళ్ళమీదపడి లేచి దాసోహంసమర్పించి లెంపలు వాయించుకొందురు.]

ఒకసన్నిధిస్వామి:- స్వామి. అంతము లేని అపరాధము జేసితిమి. నరశింహాచార్యస్వామి వారిని సిశాసీ పద్ధనియు, అక్షర శూన్యులనియు జ్ఞానహీనులనియు, భైక్షవిద్యాపారంగతులనియు ఏమేమో అనరాని, వినరాని మాటలని, నిర్లక్ష్య భావము కలవారమై ఎన్ని జన్మములకైనను శమించని పాపమార్జించితిమి.

మరివకసన్నిధిస్వామి:- తనకుగాని యితరు లకుగాని అర్థము కాని నాలుగు డాబు, బడాయి మాటలాడునప్పటి కాయనెంతో పండితుడను కొంటిమి. చిలకపలుకులవలె రెండక్షరముక్కలు వచ్చేటప్పటికల్లా మామూధత్వమును గ్రహించ లేక మహాపండితులమని విఱ్ఱవీగితిమి. ఎన్ని చదివిన, ఎన్ని వినిన ఏమిలాభము.

మరివక సన్నిధిస్వామి:- మాతప్పు క్షమించ వలెను. ఎన్నాళ్ళకు, ఎన్ని మారులు వినినా తత్త్వ-హిత-పురుషార్థముల స్వరూప స్వభావ ముల తెలుసుకొన లేకపోయిన తర్వాత ఎందు

ల‌కి జన్మ ఎందులకీ చదువు, ఎందులకీ జ్ఞానము, ఎందులకీ వేషభాషలు ఇన్నీ.

మగినక సన్నిధిస్వామి:- స్వామి క్షమించవలె. చేసిన మా యపరాధములక్షమించవలెను. క్షమించి రక్షించువరకు దేవరవారి శ్రీపాదముల వదలము. బుద్ధి వచ్చినది. [అని తిరిగి లెంపలు వాయించుకొని భట్టరువారి పాదములపై పడుదురు. భట్టరువారు వారినందరను నెమ్మదిగ లేవనెత్తుదురు.]

భట్టరువారు:- అయ్యా దేవరవార్లందరు క్షమార్పణ వేడవలశినది నన్నుకాదు. అదుగో ఆ నరశింహాచార్య స్వామివారిని మనమందరము వారి విషయములో అపచార మొనర్చితిమి.

నరశింహాచార్యులువారు:-అయ్యో అయ్యో దాసుణ్ణి ఆలా అనతగదు. [అని ఆయన అందరికి సాష్టాంగపడుదురు.] స్వాములందరు నరశింహాచార్యులువారికి సాష్టాంగ పడుదురు.

భట్టరువారు అందరిని లేవనెత్తుదురు.

భట్టరువారు:-

శ్లో॥ చతుర్వేదధరో విప్రో ।
వాసుదేవం నవిందతి ।
వేదభారభరా క్రాన్తః ।
స వై బ్రాహ్మణగర్దభః॥

శ్లో॥ శాస్త్రజ్ఞానం బహు క్లేశం ।
బుద్ధే శ్చలన కారణం ।
ఉపదేశాద్ధరిం బుధ్వా ।
విరమేత్ సర్వకర్మసు ॥

# శ్రీమద్యంతీంద్రస్తుతీ పంచదశీ

ఎస్. వి. కె. శ్రీరంగశఠకోపాచార్యస్వామివారు నిడిచిన మెట్లు.

శ్రీ మహితాచ్యుతాంఘ్రిసరసీరుహయుగ్మ మరన్ద మాధురీ
ప్రేములునై దురంతయఘ భీతమనస్కులునైన చేతన
స్తోమములన్ రహీన్మనుప సువ్రతమూని నశేషరూపకాం
తీ మ తిపుత్రిలా ఘనసుధీంధ్రుల గొల్చెద శ్రీయతీంద్రులన్ ॥

మతముల నెల్లలోనడచి మాతరుణీశ పదాబ్జ చింతనో
న్నతిని ఘటించి వారల మనంబుల నిర్మల మొందచాతురీ
గతిని విలక్షణాత్మ గుణకాన్డము బోధ యొనర్చినట్టి ధీ
యుతులగు భ కరక్షణ గుణోదధి గొల్చెద శ్రీయతీంద్రులన్॥

ద్రావిడ సంస్కృతాగమ సుధామయతత్త్వ మహార్థసారమీ
జీవులకెల్ల జీవనము జేయగ తానట బ్రహ్మసూత్ర స
ద్భావముల న్మహామతిని భాష్యముగాగ రచించినట్టి శ్రీ
దేవవరేణ్యులన్నతత తేజుల గొల్చెద శ్రీ యతీంద్రులన్ ॥

వ్రా నృసీశ్వరాజ్ఞ బహుమానముగాగొని చేతనస్థ దు
ర్మానన మడంప కాతపురి మార్గముగా దిశలెల్లనేగి స
న్మానములన్ని దాసుల కమానుష తత్త్వము బోధజేయు శ్రీ
మానగురామ సోదరుల మానక నెంచెద శ్రీ యతీంద్రులన్ ॥

నృతులను జేయగామది వినోదమునొంది ఫలంబు నీయనే
గతిని యెరుంగలేని శిశికంఠము ఖామర దుర్మతంబులన్
ఫలితముగా నొనర్చి హరిపద్ధతి నిల్పి జయించినట్టిమా
గతియగు భక్తవత్సలుని కల్మషు గొల్చెద శ్రీయతీంద్రులన్ ॥

జలజభవామరేశ ముఖజన్మలు కర్మ నిబద్ధదేహులై
పలుమరు దానవౌఘకృతబాధల గాసిల శ్రీశసత్కృపా
ఫలమున దారిగన్న బుధపంక్తికి గౌరవనీయులైన శ్రీ
లలితకళాభిమానుల నిరంతర మెన్నద శ్రీయతీంద్రులన్ ॥

గురుతరశాస్త్ర సారములకుంఠిత రీతిలభించిస్వామికే
గురువనకీర్తిగాంచి తమకుంగల ప్రాభవముజ్వరిల్లనే
గురువులు తాభ్రమన్దవిలికూర్మి నమస్కృతి శాయనొప్పుమా
గురుమణులైన దేశికులకోరిభజించెద శ్రీయతీంద్రులన్.

ఋషియను స్వార్థకాఖ్యన తిరూదియొనర్పగ శ్రీరమేశప
ద్విషయములన్నదింప దిగవేమరునాత్మ గడించిప్రీతిచే
విషధరవర్ణునిన్ బలుకువేద శిరస్సుల గౌరవించునా
విష ధరరాట్స్వరూపులను వేడుకగొల్చెద శ్రీయతీంద్రులన్

వసుధ నపారవైభవము నర్థిలవాసన తుల్యసంపదల్
అసమతరంబులై హరికృపాంబుధిలోన మునింగి ప్రీతిపెం
పెనగనమస్త సన్నిధుల పెద్దయుకాలము శ్రీశమంగళా
భ్యసనముగన్న భవ్యగుణవారిధి గొల్చెద శ్రీయతీంద్రులన్

రఙ్గకరీశ వేంకటవరాది శురేశులనాజ్ఞతోడ శ్రీ
రఙ్గము నన్విభూతియుగ రాజ్యరమాధిపతిత్వమొంది నా
రఙ్గమునీశతల్ప గురుపరంపర నాయకరత్నమైన శ్రీ
రఙ్గపురీశులన్ గురువరాధ్యులగొల్చెద శ్రీయతీంద్రులన్

విజయున కాజియన్దుయదువీరుడు కృష్ణుడు తేరుపైన భూ
భుజులు తదన్యులు న్గలుగఫూని తురీయహితంబుదెల్పి స
ద్విజయుని జేశినట్లు పృథివింగలవారికి భూరిదానము
న్నిజగతి దెల్పినట్టి మహనీయులగొల్చెద శ్రీయతీంద్రులన్

జన్మమునెత్తి సంసరణసాగరమందు మునింగి స్త్రీలకై
తన్మయమొన్ది మోసమనితల్పగ వెర్రులునై చరించుదు
ర్జన్మల కూటముల్ జెడగజూచి ధరించకబ్రోచియున్న స
జ్జన్మల వేనుతింతు మనసారగ సారెకు శ్రీయతీంద్రులన్.

యావిధినీ ధరిత్రిగణియించగ తామవతార మొందిన
ద్భావతసూట నిర్వదిశుభత్సమముల్ విలశిల్లపాప సం
భావిత తత్వమున్గని ప్రపంచవిరక్తిని బొందినంత శ్రీ
దేవుని జేరియున్న జగదీశులగొల్చెద శ్రీయతీంద్రులన్.

భక్తియు నాతురీయమును భాష్యముఖంబున వ్యాప్తి జేశియా
సక్తిజులంగు వారలకు సాంద్రరమాస్యము బోధసల్పిప
ద్రక్తిమతోడ భక్తవతిరాజిల నీభువనాళికెల్లచి
చ్ఛక్తినొసంగి బ్రోచిన విశారదునెంచెద శ్రీయతీంద్రులన్.

వరద కృపాధిగమ్యపర మార్ధరసాశ్నతేనమోస్తు శ్రీ
వరచరణాంబు జాతరుచి వర్ధనసద్గుణ తేజయోస్తుసుం
దరశత వైరిసూక్త్యయుత తత్వహృదిస్థితతే శుభోస్తుయం
చిరవుగసం స్మరించితరియించగ నెంచెద శ్రీయతీంద్రులన్

యాద:- దీనియర్థమిది.

సత్ చిత్ ఆనందమయుడగు బ్రహ్మ యొక్కడే కాలత్రయా బాధ్యమగు తత్త్వము. ఆ బ్రహ్మయే నీరు, నురుగు, బుడగ, కెరటముగా పరిణమించినట్లు ఆయాశక్తి ప్రచురమై భోక్త యగు జీవుడుగను భోగ్యములగు ప్రకృతి ప్రాకృతములుగను నియంతయగు నీశ్వర రూపము గను పరిణమించును. కారణభూతుడగు నీ బ్రహ్మయొక్క గుణమగు చైతన్యమ చిద్వస్తువు నందును ఉండును. అట్లుండియు పృథివీగుణమగు గంధము రత్నమున అనుద్భూతమై యుండు నట్లు పైకి గోచరింపకయే యుండును. కుండ మూకుడు మొదలగు మట్టి వస్తువులు కారణ వస్తురూపమున మన్నుగనే గోచరించుటచే నభిన్నములును కార్యవస్తురూపమున కుండయనియు మూకుడనియు వేరువేరుగా గోచరించుటచే భిన్నములును నగుచున్నవి. ఇట్లే ప్రపంచమంతయు భిన్నాభిన్నములుగ నుండును. కావుననే భేదశ్రుతులును నభేదశ్రుతులును నీ సిద్ధాంత వ్యవస్థాపన కనుగుణముగ మాచే లెస్సగ సమన్వయింప బడుచున్నవి.

సదూ:- [నవ్వు నాపుకొనజాలక] ఓ మంత్రి పుంగవా! ఇదియేమి? ఇట్లు మహారాజు దేశము నంతను గంగలో ముంచుచున్నావే!

బ్రహ్మ నిర్వికారుడని బోధించు వేదవాక్కు ఆతని కెట్టి వికారములను సహింపదు గదా! నీవు చెప్పిన వికారము లాతని కెట్లు సంభవించును? జీవతత్త్వము ఆ బ్రహ్మయొక్క పరిణామ మనుచున్నావే. అట్లగుచో జీవునకు నిత్యత్వ -మును బోధించు శ్రుతులగతి గంగా ప్రవేశము గాక మరియేమగును? ఇట్లనేక ప్రామాణికార్థములను నూటగలుపుచు నీవు మా మహారాజు చేతనుండ వధ్యుడవుకావు.

[యాదవుడు తాను గావించిన ధర్మ నిర్మూలనమును తలంచి సిగ్గుతో తలవాల్చి నిలుచును]

పరా:- దేవా! ఇట్టి ప్రబల రాజద్రోహి కేమి శిక్ష?

రాజు:- [నవ్వుచు] యతని దండించు రీతి యతిరాజునకే యెఱుక.

[యతిరాజు యామునులవైపు జూచును]

యాము:- శమదమాది ఆత్మ గుణోపేతుడైనను సన్యాసి దుష్టుడగుచో నాతనిని దేశము నుండి వెడల గొట్టుటకంటె వేరు శిక్షలేదు.

యాద:- [సవినయముగా] దేవా! నాకు తమ పాదసేవను పరిత్యజించుటకంటె ప్రాణత్యాగమే సుకరము.

రాజు:- అయినచో రామానుజుల శరణ జొచ్చుము.

[యాదవుడు రామానుజుల పాదములపై బడును]

యతి:- [అంతటను జూచి]

వీడు సన్మార్గుడే కానిండు, దుర్మార్గుడే కానిండు. నన్ను శరణుజొచ్చినాడు. కావున భగవంతునివలె పూజ్యులగు తమ రీతని యనుగ్రహింపవలెను. [శ్లో]

రాజు:- [ఆనందముతో] వీడు మాత్రమే కాడు. సకల పాపాచరణ నిరతుడైనను మీ యనుగ్రహ పాత్రుడైనచో వాడు నా దేశము నందున్న వారి కందరకును పుష్పమాలవలె శిరసా వాహ్యుడే యగును. [శ్లో]

యాము:- అట్లే యగుగాక.

[ఆకాశము నుండి పుష్పవర్షము కురియును. దుందుభులు మ్రోగును.]

యతి:- ఇది నీమ యనుగ్రహము.

పరా:- ఓ సన్యాసీ! భగవద్రామానుజుల యనుగ్రహ పాత్రుడనైతివి గాన సర్వోత్కృష్టుడవైతివి. నీవు పోయి నీ పనిని చేసికొనుము.

[యాదవుడు శిష్యునితో వెళ్ళిపోవును.]

(భాస్కరుడు శిష్యులతో ప్రవేశించును.)

భాస్కరుడు:- (ఆనందముతో) యాదవాది కీడ విరగడాయెను. ఇక నీ రాజకులమును నేనొక వెలుగు వెలిగింతును. రామానుజుని ధర్మము నా ధర్మము నొక్కటియే కావున నాతడు నా విషయమై యంత ద్రోహము నాచరింపడు.

[రాజు యెదుట కేగును కాని యాతడనాదరముతో వీక్షించును]

భాస్క:- దేవ! జయ! జయ! నన్నిట్లేల యనాదరించుచున్నావు. నన్ను కొంచ మనుగ్రహింపుము.

మనుష్యునకు రెండు కండ్లును, రెండు పాదములును నెట్లవసరమో అట్లే రాజ్యమున కిద్దరు మంత్రులును అవసరము. కావున నేను కూడా రామానుజునకు సహాయమంత్రిగా నుందును. [అనుగ్రహింపుడు.]

సునీతి:- భాస్కరుని గూడ తమస్సావరించుచున్నదే.

శ్లో॥ ప్రమాణేష్వేష వేదాన్తః
ప్రమేయేషు పరఃపుమాన్
ప్రమాతృషు యతీన్ద్రోఽ
యం న ద్వితీయ ముపేక్షతే॥

ప్రమాణములలో వేదాంతము నకును, ప్రమేయములలో [పదార్థములలో] పరమపురుషునకును, ప్రమాణజ్ఞులలో నీ మా యతీంద్రులకును సహాయాంతర మనవసరము.

సదా:- పోనిమ్ము! తప్పేమి? మహారాజు విషయమును నీవెట్లు యోజించుచున్నావో చెప్పుము. దీనివలన నీ నీతికుశలత వ్యక్తమగును

భాస్క:- సావధానముగ వినుడు-

శ్లో॥ త్రిహ్మైకం స దుపాధిభేద
భిదురం జీవత్వ మభ్యేతి
తజ్జీవత్వే చ వివర్తయో ఽను
పహితం బ్రహ్మైవ శాస్త్రం శివం
బ్రహ్మైక్యం ఖలు ముక్తి రేత
దఖిలోపాధిక్షయే దేహినాం
కర్మజ్ఞానసముచ్చయా దియ
మితి త్రియ్యన్తరాజ్యస్థితిః॥

బ్రహ్మ యొక్కటియే తత్త్వము. ఆ బ్రహ్మ వేరువేరు ఉపాధులచే వేరు వేరుగా పరిగణింపబడి జీవుడగు చున్నాడు. ఆ యుపాధులు సత్యమైనవి. అట్లు జీవుడుగా నున్నప్పుడే యనేక యాపదలకు గురియగును. అట్టి యుపాధి వినిర్ముక్తుడగు బ్రహ్మ హేయ్మపట్క రహితుడై నుంగళ ప్రముడగు చున్నాడు. ఆత్మలకీ యుపాధులన్నియు నశించిన పిమ్మట బ్రహ్మతో నభేదము సిద్ధించును. అదియే ముక్తి. ఈ ముక్తి కర్మజ్ఞానముల సముచ్చయము [కూడిక] వలన సిద్ధించును. ఇదియే వేదాంత తత్త్వము.

సదా:- [కోపముతో]

పరమపురుషుడు జీవరూపముతో నానావిధములైన దుఃఖించుచున్నాడని వదరుచున్న నీ నాలుక నూరుముక్కలేల కాలేదురా?

పరాం:- ఓరీ! భగవంతునకు ద్రోహముగ బలుకు నీ జిహ్వను నరికి వేసినను పాపము లేదు. [అని పక్కకు నరుకును. దివ్యపురుషుడు ప్రవేశించును.]

దివ్యపురుషుడు:- భగవద్ద్రోహము నాచరించు నా దుర్మార్గుడెవడురా? [అని కత్తిని దూయును.]

భాస్క:- [చూచి] అయ్యో! అయ్యో! ఎంతకష్ట మెంతకష్టము. అని పారిపోవును. దివ్య పురుషుడు కత్తిని ఝుళిపించుచు వెంట పరిగెత్తును.]

సునీ:- [నవ్వి] దేవీ! ప్రమాణము నంగీకరింపని వానికి కత్తియే సదుత్తరము.

సుమ:- ఔను. ఈ మాత్ర మెఱుంగకయే సునీతి నైతివా మరి.

ఆరవయంకము.

[రామానుజులు సదూహనితో ప్రవేశింతురు.]

యతి:- [ఆలోచించి] శిష్యునితో]

అందర నటుండనిమ్ము. కాని ఆధార మేమియు లేకయే తన మతము నిట్లు సాధించుచున్న శంకరుని యీ మతము ఆకసమున చిత్తరవులు చిత్రించి నట్లొక లీలయే సుమా!

[శంకరుడు ప్రవేశించును]

శంక:- భళీ! యతిరాజా! తెస్సగా గనుగొంటివి. ప్రమేయమగు ప్రపంచ మంతయు మిథ్యయనియు, పరబ్రహ్మయే ప్రమాణమున కును గోచరించదనియు, యదార్థస్థితికి విరుద్ధముగా నేనీ సిద్ధాంతమార్గము నిట్లు కల్పించుట నా బుద్ధికౌశలమును లోకమునకు జూపుటకే.

(నవ్వి) అదియేమి చిత్రమోగాని యెంత ప్రాజ్ఞుడైనను యీ సిద్ధాంతమును జూచి భ్రమింపని వాడుండడు. ఇట్లాకాశమున చిత్తరువులు చిత్రించు నా నేర్పును బ్రహ్మయైన నెఱుంగడు.

యతి:- నీవు చాల బాగుగ జెప్పితివోయి. కాని మరి ఆకాశము నందలి పద్మోత్పత్తిని చూచునా డంగీకరించినచో చూపించు వాని కపట శిల్ప నైపుణ్యమింకేది?

శంక:- (నవ్వి) నేను పర్యంక విద్యోపాసనకై యనంతపురి మేగుదును. సెలవిండు. [అని వెడలిపోవును.]

యతి:- [నవ్వి] లోకులిది యెఱుంగరు. వేళము సరిగ్గా నొకడే దారిని పోయిన నా దారినే తామునుపోయి చీకటినూతిలో బడుదురు.

సదూ:- [ఆలోచించి] ఆహా! ఎంతకష్ట మెంతకష్టము. వీడెంతపని చేసినాడు. వీడాత్మద్రోహులలో మొదటివాడు గదా! బుద్ధిమంతుడైనను ఏమి యెఱింగెను. ఆలోచనా విహీనుడై నిష్ఫలకృత్యములలో పడెను. ఎంత సర్వజ్ఞుడైన నేమి? ఎన్ని యజ్ఞయాగాదులు చేసిన వాడైన నేమి? అయ్యో! ఇట్లు జనుల సందర నంధుల గావించి కపట శాస్త్రములనెడు చీకటి నూతులలో కూలద్రోసిన వాడెవ్వడైనను కుంభీపాకములనెడు నుసిగుండములలో మడియకుండునా?

యతి:- అది యెవడెఱుంగును. ఐనను ప్రతివాడును తన బుద్ధికుశలతనే జూపుచుండును.

ఇట్లే తమ్ము తామే యెఱుగని యితర మతస్థులు కొందరు, ఒకే శరీరమో యనునట్లుండెడు వేదమౌళి వేదవిచారులకు (పూర్వోత్తర మీమాంసలకు) పరస్పరము కలహమును కల్పించిరి. దానిని శమింపజేయవలెనని వేదవిచారుని తోడితెచ్చుటకై పురాణమును తోడిచ్చి భారతము నంపితిని. కావున నేను వేదమౌళి సన్నిధిని వేచియుండవలెను. నీవు మాత్రము యామునాదుల పురస్కరించుకొని వసంతోత్సవమును నిర్వర్తింపుము. (అని వెడలి పోవుదురు)

# ప్రశ్నోత్తరములు:



జిజ్ఞాసువు:— శ్రీ చిలకమర్తి వరాహలక్ష్మీనరసింహాచార్యులుగారు

## ప్రశ్న:— పితృదేవతలంటూ యున్నారా? ఉన్నచో వారినేల యారాధించవలెను?

"శ్రీమన్నారాయణ"

సమాధానము

పితృదేవతలున్నారను నమ్మకము, విశ్వాసము శుభాశుభముల యందు తదారధనమున్న కేవలము ఆస్తికులగు భారతీయులలోనే గాదు, నాస్తికులగు భారతీయులలోను, చైనీయులు, జపానీయులు, రష్యనులు, అరబ్బులు, యూదులు పారశీయులు, రోమనులు, గ్రీకులు, యూరోపియనులు, అమెరికనులు వీరు వారననేల సకల ప్రజాసామాన్యమునందును గాఢముగ నున్నది.

ఇందులకు ఇప్పటికి ఆయామతస్థుల దేశ—కాల-పాత్రానుసారములైన వివిధ సాంప్రదాయ రూపములై విలసిల్లుచున్న పితృదేవతారాధనములే సాక్ష్యములు. పితృదేవతారాధనమున సజాతీయ అన్నసంతర్పణ యనునది కూడ అన్ని జాతులలోను ఏదో రూపమున జరుగుచునే యున్నది.

దీనికంత ప్రాముఖ్యమేల? ప్రతిజీవికి కావలసినది తన సౌఖ్యము_తన యానందము. ఇది తన యాత్మ తృప్తివలన మాత్రమే కలుగుచున్నది. ఇట్టి తృప్తికై ప్రయత్నించుట ప్రతి ఆత్మకు సహజమే గదా— భార్య భర్తను ప్రేమించును, ఎందులకు; భర్తతృప్తికై కాదు, తన తృప్తికై మాత్రమే. భర్త భార్యను ప్రేమించును. ఎందులకు; భార్య తృప్తికై కాదు తన తృప్తికై మాత్రమే. ఇటులనే తండ్రిపుత్రుని ప్రేమించినను, పుత్రుడు తండ్రిని ప్రేమించినను మిత్రుడు మిత్రుని ప్రేమించినను, ఇది యది యననేల చివరికి భక్తుడు భగవంతుని ప్రేమించినను కూడ అదంతయు తమ తమ తృప్తి కొరకేగాని

తనిచే ప్రేమించబడువారి తృప్తికొరకు గాదు. ఇది సిద్ధాంతము.

ఆత్మ నిత్యమైనది. ఈ శరీర వియోగానంతరము కూడ అది స్థిరముగా యుండును. అది తన కిదివరలోని శరీర సంబంధులచే ఆదరించబడి ఆరాధించబడుటచే తృప్తి కలుగును. ప్రతి జీవియు కూడ ఎపుడో ఒకప్పుడు తాను ఈ శరీరమును విడిచిన పిమ్మట తన శరీర సంబంధులు తనను ఎటుల, ఎందుల కారాధింతురు? గాన ప్రతిమానవుడు ఏదో విధమున తన పితృదేవతల నారాధించుచుండుట విధాయకము, సాంప్రదాయము, శిష్టాచారము అయియున్నది.

తాను జచ్చిన తరువాత తన్ను తనవారు గౌరవించి పూజించుచుండ వలయునను వాంఛ తనకున్నప్పుడు తన పితృదేవతల యందు తన కట్టి మనోవైఖరి యేల యుండదు? అట్లుండక పోవుట దృష్టి యుండక పోవుటయే కాని మరొకటి కాదు. కీర్తి కాంక్ష సర్వప్రాణి సహజ స్వభావము.

---

జిజ్ఞాసు:— శ్రీ న. చ. అండాళమ్మ.

# మానవునికి మతమేల?

"శ్రీమన్నారాయణ"

సమాధానము:

మానవునకే గాదు. సకల ప్రాణికోటికి సర్వదా కావలసినది తృప్తి. అందును పరిణామ క్రమమనుసరించియు, జ్ఞానవికాసత ననుసరించియు ఈ తృప్తి యనునది మానవునికి మరింతావశ్యకమై యున్నది. భార్యయుండని, బిడ్డలుండని, ఆయువుండని, ఆరోగ్యముండని, భోగముండని, భాగ్యముండని, శక్తియుండని, కీర్తియుండని యెన్నియున్నను తృప్తిలేని మానవునికి ఆనందములేదు. సౌఖ్యము లేదు. జీవచ్ఛవమే. ఎపుడును మనోవ్యధయే. జీవితమే వ్యర్థము.

మానవుడనగా దేహేంద్రియములతో గూడుకున్న ఆత్మ యని యర్థము.

దేహమునకు అన్నపానీయములవలన తృప్తి. ఇంద్రియములకు విషయానుభవముల వలన తృప్తి మరి ఆత్మకు? ఆత్మకు కూడ ఆకలి దప్పులు అనుభవ విశేషములు గలవు. అవి శాంతించిన గాని ఆత్మకు తృప్తిలేదు.

ఆత్మ జ్ఞానాత్మకమైనది. జ్ఞానగుణకమైనది. గాన తత్సంబంధము వలన గాని ఆత్మ యొక్క ఆకలి-దప్పులు-అనుభవ విశేషములు శాంతించవు. ఆత్మకు శాంతిని కలిగించునది మోక్ష

మార్గమును జూపించు అర్థపంచక జ్ఞానము మాత్రమే.

మత శబ్దమునకు వందలకొలది అర్థవిశేషము లున్నను అసలైన సిసలైన అర్థము. స్వస్వరూప పరస్వరూప-ఉపాయస్వరూప-ఫలస్వరూప-విరోధిస్వరూపముల తెలుపు అర్థపంచక జ్ఞానము మాత్రమే.

ఎంత కరడుకట్టిన నాస్తికునికైనను తన యాత్మశాంతి లేనిదే తన దేహేంద్రియములకు శాంతి యుండదు.

కాన అట్టి ప్రధానమైన ఆత్మశాంతి నిమిత్తమై అర్థపంచక జ్ఞానార్థకమైన మతము అవసరమై యున్నది.

ఈ లోకము మృత్యువుచే గొట్టుపడి యున్నది.
దీనిని ముదిమి చుట్టు ముట్టుకొని యున్నది.
రేయును బవళ్ళను పిడుగువలె నెప్పుడును బడుచున్నవి.
మృత్యువు ఎవ్వనిని ఊరక ముందెచ్చరింపకయే తటాలున బయిపడి
లాగికొని బోవుచున్నది.
కావున భక్తిరూపాపన్న జ్ఞానివై మోక్షము గూర్చి నాలోచించుము.
దానిని పొందుటకై ఈ క్షణము నుండియే ప్రయత్నించుము.

రేపటికి జేయవలయు దానిని నేటికే చేయుము.
మాపు చేయవలసిన దానిని రేపు చేయవలెను.
మానవుడు తన కార్యమును చేసినను జేయకున్నను మృత్యువెదురు చూడదు.
కావున శ్రేయస్సును కలిగించుదానిని నిపుడే చేసుకొనవలయును.



# నారీవిభాగము



## మోక్షము నెట్లు పడయ తగును?

జిజ్ఞాసువు: శ్రీమతి మాదంశెట్టి రాధమ్మగారు, విజయవాడ.

ప్రశ్న: మోక్షమనెడు పురుషార్థ స్వరూప మెట్టిది?

సమాధానము: "శ్రీమన్నారాయణ"

వ్యాసమహర్షికి సర్వేశ్వరుని సంకల్పముచే యజ్ఞార్థమై అగ్నిమదనము జేయుచుండగా ఘృతాచియను నొక యప్సరసా సందర్శనముచే అరణియందు రేతస్ఖలన మాయెను. వ్యాసుడు దానిని మథించగా అందుండి పంచభూతముల ధిక్కరించు మహాయోగి యగు శ్రీ శుకుడు బుట్టెను. వ్యాసు డతనికి వేద-వేదాంగ-వేదాంత యితిహాస-పురాణముల పఠింపజేసి మోక్షపురుషార్థ స్వరూప జ్ఞానమునకై తన శిష్యుడగు జనకుని వద్దకు పంపెను.

జనకుడు చక్రవర్తి, గృహస్థుడు. ప్రవృత్తి మార్గములో నున్నవాడు. అయినను ఆయన మనస్సు నిష్కలుషమై సదా శ్రీహరి యందే తగుల్కొని యుండెను. సరస్సున బుట్టి దాని నాశ్రయించుకొని యుండి, దానివలననే పెరుగుచున్న తామరాకు ఆ నీటి సంబంధములేనిదై యుండునటులనే జనక చక్రవర్తికూడ ప్రకృతిలో లీనుడై యున్నప్పటికిన్ని, నివృత్తిమార్గ నిష్ఠాగరిష్ఠుడై కేవల మోక్ష ధర్మానుష్ఠానపరుడై యుండును. మహామహులగు మహర్షులకు సహితము శక్యముగాని జ్ఞానానుష్ఠానములు జనకుని యందు వెల్లుంగుచుండెను. గనుకనే వ్యాస మహర్షి సహితము తనయేకైక పుత్రరత్నమును ఆయన కడకు పంపెను. జనకుడు శ్రీ శుకుని అనేక విధముల పరీక్షించి చివర కిటుల నుపదేశించెను.

"మోక్షమార్గము ననుసరించుటకు శాస్త్ర జ్ఞానము, లౌకిక జ్ఞానము యుండవలయును. ఈ జ్ఞానము కేవలము గురూపదేశముచే మాత్రమే కలుగును. మరేవిధముననను కలుగజాలదు.

రాజస-తామస దోషముల వర్జింపవలెను. సాత్త్విమార్గము ననుసరించి ఆత్మను దెలుసుకొనవలెను. సర్వభూతముల యందు ఆత్మ యున్నది. అన్ని ఆత్మల స్వరూపములు నొక్క

టియే. గాన సర్వభూతములయందు తన్నును తన యందు సర్వభూతములను తెన్నగా గనుగొనుచు జలమందలి జంతువులవలె వానియందు తగులు లేకుండగ నుండవలయును. ప్రతిజీవియందును పరమాత్మ వసించుచున్నాడు. పరమాత్మ లేని జీవి యనునది లేనే లేదు. సమాహిత చిత్తము గల ప్రతివాడు పరమాత్మను దర్శించగలడు. ఈ దర్శనమున గాని శాంతి కలుగదు. శాంతి లేనివానికి ముక్తి లేదు.

ఎవ్వనివలన పరులు భయపడరో, పరుల వలన నెవ్వడు భయపడడో ఎవ్వడు ఏ ఒక్క దానిని గోరకయు, ద్వేషింపకయు నుండునో అట్టివాడు పరమాత్మను తెలుసుకొనగలడు. మనస్సు చేతగాని, వాక్కుచేతగాని, కర్మము చేతగాని ఎపుడు సర్వభూతములయందు బాప మగు భావన లేకుండునో యపుడు పరమాత్మను తెలుసుకొన గలడు.

మనస్సును మోహపెట్టినట్టి అసూయను విడిచి కామమును మోహమును త్యజించినచో పరమాత్మను తెలుసుకొనగలడు. చెవికిని, గంటికిని మరియు తక్కిన యింద్రియములకును విష యములగు వానియందెల్లను, మరియు సర్వ భూతములయందును సముడై ద్వంద్వముల నెపుడు వీడునో యపుడు పరమాత్మను తెలుసు కొనగలడు.

స్తుతిని-నిందను, బంగారమును - ఇనుమును సుఖమును-దుఃఖమును, చలువను-వేడిని, అర్థ మును-అనర్థమును, ప్రియమును-అప్రియమును జీవితమును-మరణమును, సమముగా నెపుడు భావించగలడో యపుడు పరమాత్మను తెలుసు కొనగలడు.

తాబేలు తన యవయవముల తనలోనికి ముడుచుకొనునటుల ఎవడు తన మనస్సును, యింద్రియములను విషయములనుండి నుపసంహ రించుకొనగలడో అట్టివాడు పరమాత్మను తెలుసుకొనగలడు. చీకటి గ్రమ్మిన యింటిని దీపముచే స్పష్టముగా చూడగలిగినటుల బుద్ధి యనెడి దీపముచే తనలోపల యాత్మను చూడ శక్యమగును. ఇట్టివాడు తనయందలి పరమా త్మను తెలుసుకొని, దానిని దర్శించి సదా దానినే స్మరించుచుండవలెను. దీనిచే వీని హృదయమందలి గ్రంధులన్నియు చిన్నాభిన్న ములగును. సర్వసంశయములు పటాపంచలగును. సమస్త కర్మములు సమూలముగ నశించును. దివ్యజ్ఞానము కలుగును. అట్టి పరమాత్మను ప్రీతితో నిరంతరము ధ్యానించుచు ఆత్మ-ఆత్మీ యుల నాతనికి సమర్పణము చేయవలెను. దీనిచే పరమాత్మ ప్రీతికి పాత్రుడై ఆయనయొక్క నిర్హే తుక జాయమాన కటాక్షమునకు పాత్రుడై శరీరావసానమున మోక్షమును పొందగలడు. ఏ యోగమవలంభించినను ఈ పైన తెలిపిన జ్ఞానానుష్టానములున్న గాని మోక్షప్రాప్తి లేదు. అన్ని యోగములు యిట్టిస్థితికై మాత్రమే ఉపకరించును.

★ ★ ★

# మదరాసులో గీతామందిరమందలి ఉభయ వేదాంతకాలక్షేప గోష్ఠి

ఈ భాద్రపదశుద్ధ విదియనుండి యిచ్చట ఉభయవేదాంత కాలక్షేపగోష్ఠి ప్రారంభింపబడినది. ఇందు అధ్యయనము గావించు యిద్దరు అధికారులకు విద్యార్థులకు ఒక్కొక్కరికి నెలకు రు 50/లు చొ॥న విద్యార్థివేతనమును ఒసంగుటకు శ్రీ శ్రీ శ్రీ మీర్జాపూరు మహారాణి వారును, శ్రీ శ్రీ శ్రీ పుయ్యూరు మహారాణి వారును, వాగ్దానము గావించిరి. ప్రస్తుతము శ్రీ పెరుంబూదూరునుండి ఒకవ్యాకరణ శిరోమణి శ్రీ ఉ. వే. శ్రీమాన్ కో. ఋ. నరసింహరామానుజాచార్యులుగారు, అధ్యయనము చేయుచున్నారు. ఆశ్వీయుజమాస ప్రారంభమునుండియు కంచికాపురస్థులగు న్యాయశిరోమణి శ్రీ ఉ.వే. శ్రీమాన్ కిడాంబి శ్రీనివాసరామానుజాచార్యులుగారు నేంచేసి అధ్యయనము గావింతురు. ప్రస్తుతం తాత్పర్య చంద్రికావివరణములతో గీతాభాష్యమున్ను తత్త్వత్రయమున్ను ప్రారంభింపబడినవి. తత్త్వత్రయమునకు పెక్కురు స్త్రీలుకూడా అన్వయించుచున్నారు. కాలక్షేపము సుబోధకముగను సావకాశముగాను గావింపబడుచున్నది. తగినఅధికారముగలిగి సంఘసేవగావించుచు పరిచితులగు స్త్రీలు వేంచేసి కాలక్షేపగోష్ఠిలో నన్వయించగోరుచో గీతామందిర కార్యదర్శిగారికి దరఖాస్తుపెట్టుకొనిన ఉచితముగా తగు మాత్రము బసయు కాలక్షేపావకాశమును కల్గింతురు. ఎవరినాపాటు ఏర్పాట్లువారే చేసుకొనవలసియుండును. ముందుముందు కడుబీదలగు అర్హ అధికారులైన స్త్రీలకు యథాశక్తి స్కాలర్షిప్పు కూడా యిచ్చుటకు ఏర్పాటులు గావించవలెనని సంకల్పించుచున్నారు.

## గీ తా ప రీ క్ష లు

గీతామందిర యాజమాన్యమున గీతాపరీక్షలు జరుపబడుననియు అందుత్తీర్ణులైన వారికి యథోచిత సన్మానములుకూడా ఆ ఉత్తీర్ణత ననుసరించి ఒసంగబడుననియు ప్రకటింపబడినది, ప్రస్తుతము తగినంత ప్రోత్సాహము కాన్పించనందున యీసంవత్సరమునకు మాత్రము గీతలో మూడు అధ్యాయములలోని విషయము మాత్రమే అడిగిన ప్రశ్నలకు తెనుగుభాషలో సులభశైలిలో సమాధానమువ్రాసి 3 అధ్యాయములలోని యీదిగువ శ్లోకముల మాత్రము ప్రతిపదార్థముగా గట్టిగా వర్ణించిఅడిగిన శ్లోకముల కర్థమును వ్రాయవలసియుండును. తత్త్వత్రయప్రకరణ మీసంవత్సరమునకు పాఠ్యవిభాగమునుండి తగ్గించబడినది. బహుమతులు యీసంవత్సరమునకు మాత్రము యథోచితముగా నొసంగబడును. 5 గురు అభ్యర్థినిలగుచోట పరీక్షా కేంద్ర మేర్పరుపబడును. పరీక్ష యీసంవత్సరమంతటను నవంబరు 20 తేదీ ఆదివారం జరుపబడును. దరఖాస్తులు అక్టోబరు 15 వ తేదీ లోగా యీదిగువ అడ్రసునకు యీదిగువ వివరములతో చేరవలెను.

1. పరీక్షాభ్యర్థిని పేరు అడ్రసు.
2. వయస్సు.
3. ఎవరివద్ద చదివినది.
4. ఏ కేంద్రములో పరీక్ష నొసంగునది.
5. ఉపాధ్యాయుల సంతకము.
6 అభ్యర్థిని సంతకము.

1 అధ్యాయము 1.10.14.40.41 42,

2 అధ్యాయము 2.7.11.12,17.22.27. 38. 45 46.47.49.55.56.57.58 62.63 69.70.

3 అధ్యాయము 6,8.13.14,15.21.23. 14. 27. 30 36, 37,42.43.

పరీక్షకు చదువవలసిన భగవద్గీతా గ్రంథముల యీదిగువ అడ్రసునకే వ్రాసిన బడయగలరు.

కేంద్రమునకు 5 గురున్నచో ఆగ్రామ దేవస్థానములోనే పరీక్షలు గావింపబడును. గాని సదరు దేవస్థానం ధర్మకర్త గారియొక్క గాని మెనేజరుగారియొక్క గాని అడ్రసు తెలపవలెను. అంతకు తక్కువ అభ్యర్థిను లుండి సమీపములో కేంద్రములు లేనిచో తెలిపిన తగు ఏర్పాట్లు చేయబడును.

షరా. అడ్రసు ఇంగ్లీషుతో వ్రాయవలెను.

గీతామందిరం కార్యదర్శినీ
107 వరదాముత్తియప్పన్ వీధి, మదరాసు 1

# ప్రచార విభాగము

శ్రీయతిరాజ సేవా మహిళా మండలి (మదరాసు శాఖ) వారి గీతామందిరమండలి కార్యక్రమము

## శ్రీ కృష్ణజయంతి మహోత్సవము

ఇచ్చటి శ్రీ గీతామందిర కార్యకారిణీ సమితివారు 26-8-1952వ తేదీని శ్రీ శ్రీ శ్రీ మీర్జాపురం మహారాణీగారి అధ్యక్షత క్రింద సమావేశమై 9-9-52వ తేదీ నుండి 16-9-52వ తేదీవరకు శ్రీ జయంతి మహోత్సవమును వైభవముతో జరుప నిశ్చయించి కార్యదర్శినియగు శ్రీమతి మ. చంద్రమ్మగారిని ఏతత్కార్య నిరీక్షకురాలుగా నిర్ణయించిరి. ఆమె అతి చాకచక్యముతో కార్యక్రమమును నిర్ణయించి ఈ 8 రోజులున్ను నేత్రానందముగాను, శ్రోత్రపేయముగాను ఈ కార్యమును యీ క్రిందివిధముగా నిర్ణయించి నగర ప్రముఖుల మన్ననకు పాత్రులైరి.

♦ కార్యక్రమము ♦

గీతామందిరమండలి పెరుమాళ్ళగది ప్రతిదినము మార్పులతో గీతారథ శృంగారింపు పరమపదనాథ శృంగారింపు, జూలాశృంగారింపు, రాసక్రీడ శృంగారింపులతో నలంకరింపబడెను.

మేడ పై భాగమున హాలునందు దివ్యసింహాసనమున వేంచేపు చేయబడిన శ్రీ రాధా కృష్ణులకు ఉదయము గం 6 లు మొదలు సాయంకాలము గం 6 ల వరకు అవిచ్ఛిన్నముగా 5 దినములు స్త్రీల చేతనే శ్రీకృష్ణాష్టోత్తరార్చనలు జరుపబడెను.

ప్రతిదినము మధ్యాహ్నము గం 3 లకు మొదలుపెట్టి గం 4-0లు వరకు స్త్రీలచేతనే ముదలాయిర సేవాకాలము శ్రావ్యముగా గావింపబడుచు చివరకు గం 4-30 మొ గం 6వరకు శ్రీమతి పువ్వాడ మంగమ్మ గారిచేతను, శ్రీమతి మరంగంటి రంగనాయకమ్మగారిచేతను శ్రీ కణ్ణన్ వైభవమును గూర్చి దివ్యప్రబంధ గాథలతోను ఉపన్యసింపబడుచుండెను.

రాత్రులయందు గం 7 మొదలు గం 9 ల వరకు ఆంధ్రమహిళా సభా ఆర్కెష్ట్రావారున్ను చిరంజీవులైన శ్రీ హేమ-ప్రేమ పార్టీ వారున్ను వీణాదిగానము, భరతనాట్యము, పాటకచ్చేరీ, శ్రీ శ్రీ రుక్మిణీ కళ్యాణ ప్రదర్శనములతో ప్రేక్షకులగు బహునారీమణుల హృదయములయందు భక్తిరసమును రేకెత్తించి తన్మయుల గావించిరి.

11-9-52 తేదీ గురువారం ఉదయము పెరుమాళ్ళకు తిరుమంజనము గావించి అర్చా శృంగారింపుతో మాత్రమే పెరుమాళ్ళను పుష్పాలంకృతలను గావించి వేంచేపుచేసి మధ్యాహ్నం గం3లకు శ్రీమాన్ తె.కం. గోపాలాచార్యులుగారు శ్రీమద్భాగవతమునుండి శ్రీకృష్ణావతారఘట్టమును ఉపన్యాసరూపముగా అపూర్వవిషయములతోనుపన్యసించి శ్రోతలనానందాబ్ధినోలలాడించిరి.

14వ తేదీ నుండి ఎడాయిత్తోత్సవములు 3 దినములు నాచ్చియార్ తిరుమొళి సేవతోను అర్చనలతోను బాలికల ఉపన్యాస నృత్యాదులతోను వైభవముగా జరుపబడెను.

గీతామందిర కార్యకారిణీ సమితివారు శ్రీ ఆంధ్రమహిళా సభా ఆర్కెష్ట్రా వారిని రజత పాత్రముతో సన్మానించి కృతజ్ఞతను వెల్లడించిరి.

చిరంజీవి హేమ-ప్రేమ పార్టీ వారికి కూడా కొందరు ప్రేక్షకులును, శ్రీ గీతామందిర యజమానులును రజత పాత్రల నొసంగి సన్మానించిరి.

ఈ ఉత్సవములలో వేలకొలది స్త్రీలు అత్యుత్సాహముతో పాల్గొనిరనిన అతిశయోక్తి కానేరదు.

# ప్రచార విభాగము

## అర్తమూరు

తూర్పుగోదావరి జిల్లాలోని అర్తమూరు గ్రామ శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘమున్ను శ్రీయతిరాజసేవా మహిళామండలి వారున్ను, అచ్చటి శ్రీవేణుగోపాలస్వామివారి సన్నిధియందు భాద్రపద బ ౧౩ మంగళవారమున గోవర్ధనోద్ధరణప్రయుక్త అన్నకోటి ఉత్సవమును అతివైభవముగ జరిపిరి.

శ్రీమాన్ శ్రీమత్తిరుమల పురిఘళ్ళ వెంకటాచార్యస్వామివారు 'గోవర్ధనోద్ధరణమును' గురించి ఉపన్యసించిరి.

గీతామందిరము. 107. వరదా ముత్తియప్పన్ వీధి
మదరాసు I

---

## పైసాఫండు వసూలు.

శ్రీ. ఉ. వే శ్రీమత్తిరుమల పురిఘళ్ళ వెంకటాచార్యులుగారు ప్రస్తుతం మకాం అర్తమూరు.
నందన. సం॥రం కు. జమ—రూ 2—0—0

---

## ★ సంభావన ★

బల్లిపాడు కాపురస్థులు వంగల అప్పన్ జగన్నాథాచార్యులుగారి పరమపదోత్సవ సందర్భమున శ్రీవిశిష్టాద్వైత సంఘమునకు సంభావనగా రు 2-0-0 లు సమర్పించినారు. ఇది తణుకు తా॥ కలవగుంట శేషాచార్యులుగారి ద్వారా పంపిరి.

రిజిష్టరు నెం. 5049

# భక్తినివేదన

(వేదాంత మాసపత్రి:)

ఇందు వేదాంత విషయ రాజములున్ను; భక్తి ప్రచార విషయమైన వార్తలున్న వేదాంత సాంప్రదాయ విషయకమైన స్తోత్రములున్ను ప్రచురించబడును.

చందాలు;

| | | |
|---|---|---|
| సాధారణ చందా సం. ర 1కి | | రు 5-0-0. |
| సహాయ చందా | ,, | రు. 10-0-0. |

**Book-Post**

To

శ్రీ Sri Venkateswara Oriental Library,
TIRUPATI, Chittur Dt.

ప్రతి:



1. శ్రీమన్నారాయణుడే సృష్టి - స్థితి లయ - కారకుడు.
2. ఆయనే మోక్షప్రదాత.
3. ఆయనే పరతత్త్వము-పరమాత్మ
4. ఆయన అఖిలహేయ ప్రత్యనీక కల్యాణ గుణాకుడు.
5. ఆయనకు జీవుడు శరీరభూతుడు; శేషభూతుడు, పరతంత్రుడు, నియామ్యుడు, అనుభావ్యుడు.
6. జీవులు జ్ఞానైకాకారులు.
7. జీవులు అనంతములు.
8. జీవులు పరమాత్మకంటె భిన్నులు; ఈ భేదము సత్యమైనది; నిత్యమైనది.
9. జీవ-పరమాత్మలకు ప్రకృతి శరీరభూతమైనది; శేషభూతమైనది; పరతంత్రమైనది; నియామ్యమైనది; అనుభావ్యమైనది.
10. ప్రకృతి వికారాస్పదమైనది. జీవపరమాత్మలకంటె భిన్నమైనది, ఈ భేదము సత్యమైనది; నిత్యమైనది.
11. జీవుడు ప్రకృతి వియుక్తుడై పునరావృత్తి రహితమైన పరమాత్మ సాన్నిధ్యమగు పరమ పదమునుపొందుటయే మోక్షము.
12. భక్తి ఒక్కటియే మోక్షసాధనము.
13. భక్తియన తైలధారవలె అవిచ్ఛిన్నమైన స్మృతి పరంపర.
14. వివేక-విమోక-అభ్యాస-క్రియా- కల్యాణ అనవసాద-అనుద్ధర్షలు భక్తికంగములు.
15. ఇవి సదాచార్య-సమాశ్రయణ-లభ్యములు
16. జగద్గురువగు శ్రీరామానుజాచార్యులవారును; వారి యనుయాయులున్ను సదాచార్యులు.

"నగురర్వైష్ణవాత్ పరః" భా. సం.

Edited Published & Printed by A. Ch, Srimannarayanacharya at Sriman Press, Kakinada.

## పైషాషంతు వసూలు.

భాద్రపద మాసమునకు

| | | | |
|---|---|---|---|
| మైలవరము రాణిగారగు శ్రీ శ్రీ శ్రీ | | కేతేపల్లి సీతమ్మగారు | 0-2-0 |
| సూ. శ్రీ వరమంగయ్యమ్మగారు | 2-10-0 | మాదముచెట్టి సుబ్బమ్మగారు | 0-4-0 |
| సరిద్వారా బాలమ్మ | 0-2-0 | కాంతమ్మగారు | 0-4-0 |
| ,, రంగమ్మ | 0-2-0 | గౌరమ్మగారు | 0-4-0 |
| ,, రామదాసు | 0-2-0 | గొల్ల | 0-2-0 |
| ,, బడే | 0-2-0 | | 4-6-0 |
| ,, చాకలి | 0-2-0 | | |

వీరికి మా హృదయ పూర్వక ధన్యవాదములు. శ్రీవిశిష్టాద్వైత ప్రచారకసంఘము.

---

## కట్నము

పశ్చిమగోదావరిజిల్లా పాలకొల్లు పట్టణవాస్తవ్యులగు శ్రీమతి తుమ్మలపల్లి సుభద్రమ్మగారు తమ మేనకోడలి శుభకార్యమున శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘమునకు రూ 5—0—0లు కట్నమును, శ్రీమతి కనుమూరి రంగనాయకమ్మగారి ద్వారా సమర్పించిరి. వీరిని శ్రియఃపతి రక్షించుగాక.

---

శ్రీమతే రామానుజాయనమః

# భక్తి నివేదన

వేదాంత మాస పత్రిక

| సంపుటి ౪ | నందన-కార్తీకమాసం | సంచిక ౮ |
|---|---|---|


# ★ యజ్ఞములు - ప్రపన్నులు ★

జిజ్ఞాసువు. శ్రీశ్రీశ్రీ పాపాయమ్మారావు జమీందారిణిగారు.

ప్రశ్న:— తమతమ వర్ణాశ్రమాధికారాను సారముగ అందరు యజ్ఞముల చేయవలశిన దందురే. వాటి వివరము లెట్టివి ? ఇవి కర్మలగుటచే ముముక్షువులకు బంధకములు కావా ? పరమై కాంతులగు ప్రపన్నులు వీని విషయమై ఏమి చేయవలయును.

సమాధానము "శ్రీమన్నారాయణ"

శ్లో॥ సహ యజ్ఞాః ప్రజాస్సృష్ట్వా
పురోవాచ ప్రజాపతిః ।
అనేన ప్రసవిష్యధ్వం ।
ఏషవోఽస్త్విష్ట కామధుక్ ॥

(శ్రీమన్నారాయణుడు లోకములను సృజించునపుడే వాటితో పాటుగా యజ్ఞములను కూడ సృష్టించి, ఇవి మీకు కావలసిన వానినన్నింటిని యిచ్చును. గాన వీటిని ఆచరించి వృద్ధిపొందుడు అని ఆనతిచ్చెను.)

శ్లో॥ దేవాన్ భావయతానేన ।
తేదేవా భావయంతవః ।
పరస్పరం భావయంతః ।
శ్రేయః పర మవాప్స్యథ ॥

[ఈయజ్ఞముల నాచరించి మీరు దేవతల నారాధించిన, వారు మీకు అవసరమగు వాటి నొసంగి మిమ్ము పోషింతురు. ఇట్లొకరి కొకరు ఆదరించుకొనుచున్నచో మీకు తుదకు మోక్షము కూడ లభించును.]

శ్లో॥ ఇష్టాన్ భోగాన్ హి వో దేవాః ।
దాస్యంతే యజ్ఞ-భావితాః ।
తైర్దత్తా న ప్రదాయైభ్యో ।
యో భుంక్తేస్తేన ఏవసః ॥ భగ. 3-12

[మీరు యజ్ఞములచే దేవతల నారాధించిన చో వారు మీకు సమస్త సుఖములనే గాక తిరిగి తమ నారాధించుటకు వలయు వాటినికూడ నొసంగుదురు. అట్టివాటిని తిరిగి యజ్ఞముల నాచరించి వారి కర్పింపక తానే యనుభవించినచో నట్టివారు దొంగ యగును.

శ్లో॥ యజ్ఞ శిష్టాశిన స్సంతో
ముచ్యంతే సర్వకిల్బిషైః ।
భుంజతే తేత్వఘం పాపాః ।
యే పచం త్యాత్మకారణాత్ ॥ భగ 3_13

[న్యాయార్జిత పదార్థములను భగవంతుని కర్పించి తినువారిపాపము లన్నియు పటాపంచలైపోవును. కాని అట్లుచేయక తమపొట్టను నింపుకొను వారు మహాపాపులు. వారు తినునది పాపమే కాని అన్నముకాదు.]

శ్లో॥ కర్మ బ్రహ్మోద్భవం విద్ధి
బ్రహ్మాక్షర సముద్భవం ।
తస్మా త్సర్వగతం బ్రహ్మ ।
నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితం ॥ భగ. 3_15

[కర్మ సజీవశరీరము వలన పుట్టును. అట్టి కర్మలు చేయుశక్తి అన్నపానాదులచే తృప్తి జెందిన జీవుని వలన పుట్టును. కావున కర్మాధికారుల శరీరములు యజ్ఞమూలములు.]

శ్లో॥ యజ్ఞార్థాత్ కర్మణోఽన్యత్ర ।
లోకోఽయం కర్మ బంధనః ।
తదర్థం కర్మ కౌంతేయ ।
ముక్తసంగ స్సమాచర ॥ భగ. 39

[వేదము విధించిన కర్మలను సాగించుటకు ద్రవ్యార్జనాదుల గావించినను అవి వీనిని సంసారమున బంధింపవు. కావున అర్జునా! నీవు వేదోక్తకర్మల కొరకే అట్టి ద్రవ్యార్జనాదుల గావింపుము.]

శ్లో॥ గతసంగస్య ముక్తస్య ।
జ్ఞానా వస్థిత చేతసః ।
యజ్ఞా యాచరతః కర్మ ।
సమగ్రం ప్రవిలీయతే ॥ భగ. 4_23

[ఆత్మజ్ఞాని యగుటచే తదితర వస్తువులయందు ఆసక్తిని విడిచి భార్యాపుత్రాది పరివారమునందు తగులుకొనక యజ్ఞాదికర్మల నాచరించువాని ప్రాచీనకర్మమంతయు పూర్తిగానశించును

శ్లో॥ బ్రహ్మార్పణం బ్రహ్మహవిః ।
బ్రహ్మాగ్నౌ బ్రహ్మణాహుతం ।
బ్రహ్మైవ తేన గంతవ్యం ।
బ్రహ్మ కర్మ సమాధినా ॥ భగ. 4-24

[బ్రహ్మ కార్యమగుటచే బ్రహ్మమగు హోమసాధనములచే స్వతః బ్రహ్మమగు హవిస్సును బ్రహ్మమగు అగ్నిలో బ్రహ్మస్వరూపుడగు యజమానునిచే హోమము చేయబడుచున్నదని యిట్లు అన్నింటిని బ్రహ్మమయమని తలంచువాడు బ్రహ్మాత్మకమగు శుద్ధాత్మస్వరూపమునుపొందును

శ్లో॥ యజ్ఞ దాన తపః కర్మ
న త్యాజ్యం కార్యమేవ తత్ ।
యజ్ఞోదానం తపశ్చైవ ।
పావనాని మనీషిణాం ॥ భగ. 18-5

ముముక్షువులగు భగవదుపాసకులకు యజ్ఞము

దానము తపస్సు మున్నగు కర్మ విడువతగినది కాదు. అవి తప్పక చేసితీరవలెను. ఈయజ్ఞదాన తపస్సులు పవిత్రములైనవి.

శ్లో॥ యజ్ఞో యజ్ఞపతి ర్యజ్వా ।
యజ్ఞాంగో యజ్ఞవాహనః ।
యజ్ఞభృత్ యజ్ఞకృత్ యజ్ఞీ ।
యజ్ఞభుక్ యజ్ఞసాధనః ।
యజ్ఞాంతకృత్ యజ్ఞగుహ్యాం
అన్నం అన్నాద ఏవచ. విష్ణు.స.104-105

[యజ్ఞమునకు సంబంధించిన కర్త, భోక్త, జ్ఞాతా, భర్తా, భుక్త, సాధనం, సాధ్యం, సామగ్రి యాజమాన్యం అన్నియు శ్రీమహావిష్ణువే.]

అని ఈవిధముగా ప్రతి మానవమాత్రుడు యజ్ఞము నాచరించి తీరవలెననియు, ఆయజ్ఞములు అనేకవిధములనియు, అవి పాపహరములనియు, ఇష్టఫలప్రాపకములనియు, భగవదాత్మకములనియు తెలియుచున్నవి. వీటిని బద్ధులు ముముక్షువులు కూడ చేసి తీరవలసినదే. ముముక్షువులలో సర్వసంగపరిత్యాగులైన పరమైకాంతులగు ప్రపన్నులు కూడ వీటిని చేయవలసినదే. కాని వారి భావన వారిసామగ్రి వాటిఫలితము మాత్రము భిన్నమైనవి. అవి ఎటులనిన:—

శ్లో॥ దైవ మేవా పరే యజ్ఞం ।
యోగినః పర్యుపాసతే ।
బ్రహ్మాగ్నా వపరే యజ్ఞం ।
యజ్ఞే నైవోపజుహ్వతి ॥ భగ. 4-25

[కొందరు దేవతార్చనమునే యజ్ఞముగా నిష్ఠతో నాచరింతురు. మరికొందరు అగ్నిని బ్రహ్మగా భావించి సాధారణ యజ్ఞములు నాచరింతురు.]

శ్లో॥ ద్రవ్యయజ్ఞాః తపోయజ్ఞాః ।
యోగయజ్ఞాః తథాఽపరే ।
స్వాధ్యాయ జ్ఞాన యజ్ఞాశ్చ ।
యతయ స్సంశ్రిత వ్రతాః ॥ భగ. 4-28

కొందరు దేవతార్చన దానము, యాగము రూపమైన ద్రవ్యయజ్ఞమును, కొందరు ఉపవాసాదులయందు నిష్ఠను, కొందరు పుణ్యనదీస్నానము, పుణ్యక్షేత్రదర్శనము చేయు యజ్ఞమును, మరికొందరు వేదము దాని యర్థజ్ఞానమును అభ్యసించుటలో ఆశక్తి కలిగి యుందురు.

శ్లో॥ * * *
* * *
సర్వేఽప్యేతే యజ్ఞవిదో ।
యజ్ఞ క్షపిత కల్మషాః ॥ భగ. 4-30

ఇట్టి వీరందరు యజ్ఞయాచరణమును తెలిసినవారు, అట్టి యజ్ఞయాచరణముచే తమ పాపములను నశింపజేసుకునుచున్న వారలు అగుచున్నారు.

శ్లో॥ యజ్ఞ శిష్టామృత భుజో ।
యాంతి బ్రహ్మసనాతనం ।
నాయం లోకోఽస్త్యయజ్ఞస్య ।
కుతోఽన్యః కురుసత్తమ ॥

ఈవిధముగ యజ్ఞముల నాచరించి తచ్ఛేషభూత యన్నముచే శరీరమును నిలుపుకొనుచు శాశ్వతమైన ఆత్మస్వరూపమును పొందుచున్నారు. ఇట్టి యజ్ఞముల చేయనివానికి ఈలోకమందలి ధర్మార్థకామములే సిద్ధించవు. ఇక మోక్షమెట్లు సిద్ధించును?

# ఆత్మ సమర్పణరూప ప్రపన్న యజ్ఞము

## పు రు ష వి ద్యా

"శ్రీమన్నారాయణ"

ప్రపన్ననికి లౌకికమైన సాధనసామగ్రి అవసరములేదు. భరన్యాసముచే భగవదాలయముగ చేయ బడిన తనశరీరము, భగవత్పరమైన భావనాతిశయము భగవదర్పితమైన తనజీవిత విశేషము ఇవియే ఈయనకు సాధనసామగ్రులు ఈవిషయం తైత్తిరీయోపనిషత్తున యిటుల తెలుపబడినది.

| | |
|---|---|
| 1. తస్య ఏవం విదుషో యజ్ఞస్య | 1. సర్వేశ్వరునియందే తన సర్వస్వమును అర్పణముజేసిన ప్రపన్నుడు ప్రతినిత్యముచేయు ప్రపన్న యజ్ఞమునకు |
| 2. ఆత్మాయజమానః | 2. ప్రపత్తి జేయు [స్వాత్మసమర్పణజేయు]య జమానుడు. |
| 3. శ్రద్ధా పత్నీ | 3. ప్రపన్నుని శ్రద్ధయే [చిత్తవృత్తి] యజమానియొక్క భార్య |
| 4. ఉరో వేదిః | 4. ప్రపన్నుని వక్షస్థలమే యాగసంభారము లుంచు వేదిక |
| 5. లోమాని బర్హిః | 5. ప్రపన్నుని రోమములే దర్భలు |
| 6. వేద శ్శిఖా | 6. ప్రపన్నుని శిఖయే వేదము |
| 7. హృదయం యూపః | 7. ప్రపన్నుని హృదయమే పశువును గట్టు యూపస్తంభము |
| 8. కామ ఆజ్యం | 8. ప్రపన్నునికామమేహోమముచేయబడునేయి |
| 9. మన్యుః పశుః | 9. ప్రపన్నుని కోపమే యాగమందు బలనీయబడు పశువు |
| 10. తపోఽగ్నిః | 10. ప్రపన్నుని స్వాత్మసమర్పణ సంకల్పాత్మక జ్ఞానరూపతపస్సే యాగాగ్ని |
| 11. శమయితా దక్షిణా | 11. ప్రపన్నుని ఇంద్రియనిగ్రహమే [సర్వంబ్రహ్మాత్మకమనుజ్ఞానము] యాగదక్షిణ సర్వం ఖల్విదం బ్రహ్మతజ్జలానీతి శాంతఉపాసీత |
| 12. వాక్ హోతా | 12. ప్రపన్నుని భగవద్గుణానుసంధానమే యాగ హోమమును జేయించుహోత |
| 13. ప్రాణ ఉద్గాతా | 13. ప్రపన్నుని ప్రాణములే ఉద్గానముజేయు ఉద్గాత |
| 14. చక్షు రధ్వర్యుః | 14. ప్రపన్నుని నేత్రములే యాగమును నడుపు అధ్వర్యుడు |

| | |
|---|---|
| 15. మనో బ్రహ్మ | 15. ప్రపన్నుని మనస్సే యాగమును నిర్వహించు బ్రహ్మ |
| 16. శ్రోత్రం అగ్నిన్ | 16. ప్రపన్నుని చెవులే సమిధలు |
| 17. యావద్ధ్రియతే సా దీక్షా | 17. ప్ర: న్నుని జీవితకాలమంతయుయాగదీక్షయే |
| 18. యదశ్నాతి యత్పిబతి తదస్య సోమపానం | 18. ప్రపన్నుడు భగవత్ప్రసాదరూపమున ఏదితినునో, ఏదిత్రాగునో అదియే సోమపానము. |
| 19. యద్రమతే తదుపసదః | 19. ప్రపన్నుని భగవద్గుణాను భవసంజనిత ఆనందమేఉపసదము |
| 20. యత్సంచరతి ఉపవిశతి ఉత్తిష్ఠతే చ సప్రవర్గ్యః | 20. ప్రపన్నుని సంచారము. కూర్చొనుటయు. లేచుటయు మున్నగునవి ప్రవర్గ్యము |
| 21. యన్ముఖం తధావహనీయః | 21. ప్రపన్నుని ముఖము ఆవహనీ యాగ్నిహోత్రము |
| 22. యదస్య విజ్ఞానం తజ్జుహోతి | 22. ప్రపన్నుని అర్థపంచక విజ్ఞానమే యాగమందు హోమముచేయబడు దైవము |
| 23. యత్సాయం ప్రాతరత్తి తత్సమిధః | 23. ప్రపన్నుడు సాయంకాలమునందు, ప్రాతః కాలమునందు భుజించు భగవత్ప్రసాదమే యాగసమిధలు |
| 24. యత్సాయం ప్రాతర్మధ్యం దినంచ తాని సవనాని | 24. ప్రపన్నుడు సాయమున మధ్యాహ్నమున, ఉదయమున జరుపు భగవదారాధనయే సవనములు |
| 25. యే అర్ధమాసాశ్చ తే చాతుర్మాస్యాని | 25. ప్రపన్నుడు గడుపు పక్షోత్సవములే చాతుర్మాస్యములు. |
| 26. యే ఋతవః తే పశుబంధాః | 26. ప్రపన్నుడు గడుపు ఋతువోత్సవములే పశుబంధములు |
| 27. యేసంవత్సరాశ్చపరివత్సరాశ్చ తేఅహర్గణాః | 27. ప్రపన్నుడు గడుపు సంవత్సరోత్సవములు పరివత్సరోత్సవములే అహర్గణములు (అహర్గణములు ద్విరాత్ర త్రిరాత్రములు). |
| 28. సర్వవేదసంవా ఏతత్సత్రం. | 28. ప్రపన్నుడుచేయు ఈశరణాగతియే సర్వస్వదక్షిణాకమగు సత్రయాగ రూపమైనది |
| 29. యన్మరణం తదవబృథం | 29. ప్రపన్నుని శరీరవియోగమే ఈయాగము యొక్క అవబృథోత్సవము |
| 30. ఏతద్వై జరామర్యమగ్ని హోత్రగ్ంసత్రం | 30. ప్రపన్నుడు తన జీవితాంతము అనిష్ఠించు అగ్నిహోత్రము యాగమున్న తాను నిత్యముచేయు భగవదారాధనమే |

య ఏవం విద్వా నుదగయనే ప్రమీయతే దేవానామేవ మహిమానం గత్వా ఆదిత్య స్య సాయుజ్యం గచ్ఛతి

ఈ విధానుష్ఠానములు గల ప్రపన్నుడుఉత్త రాయణమున మరణించినచో దేవతల మహిమనుగలవాడై దేవలోక ప్రాప్తిపూర్వ కముగ సూర్యుని సాయుజ్యమునుపొంది పర మాత్మ సాయుజ్యమును పొందును

అథయో దక్షిణే ప్రజాయతే పిత్రూణామేవ మహిమానం గత్వా చంద్రమసస్సాయు జ్యం గచ్ఛతి

దక్షిణాయనమున ప్రపన్నుడు మరణించినచో అగ్నిష్వాత్తాది పితృలోకమునుపొంది తత్ స్థలయొక్క మహిమను అనుభవించి పిమ్మట చంద్రుని సాయుజ్యమును పొంది పిమ్మట పరమాత్మ సాయుజ్యమును పొందును.

ఏతౌ వై సూర్యాచంద్రమసోః మహిమానౌ బ్రాహ్మణోవిద్వాన్ అభిజయతి తస్మాద్బ్రహ్మణో మహిమాన మాప్నోతి తస్మాద్బ్రహ్మణోమహిమానమిత్యుపనిషత్.

బ్రహ్మజ్ఞానియగు ప్రపన్నుడు సూర్యచంద్రులయొక్క ఇట్టిమహిమను ఐశ్వర్యమును అనుభవించ గలిగియున్నాడు.
ఈవిధముగ ప్రపన్నుడు జేయు యోగమువలన బ్రహ్మయొక్క మహిమరూపస్థానం సతము పొందుచున్నాడు.

---

## ప్రహ్లాద హిరణ్యకశిపు సంవాదము

రచన:
తె. కం. గోపాలాచార్యులుగారు
కోదకొండ.

హిరణ్యకశిపు సింహాసనాసీనుడై యుండును.
గురువుతో ప్రహ్లాదుడు బడి బాలుని వేషముతో ప్రవేశించును.
ప్రహ్లాదుడు తండ్రి పాదములకు సాష్టాంగ వందన మాచరించును.
హిరణ్యకశిపు ఆతనిని లేవనెత్తి ముద్దిడి తొడపై కూర్చుండ బెట్టుకొని

హిరణ్యా: నాయనా! చాలకాలమైనది నిన్ను ఏది తండ్రీ సారవంతమైన ఒక్క సుభాషిత చదువవేసి గురుపుంగవులు నీ యెడల మిక్కిలి మును వినుపింపుము.
శ్రద్ధ తీసుకొని చదివించుచున్నట్లు వినుచున్నాను ప్రహ్లాద: క్రిందకు దిగి చేతులు జోడించి

విజయముతో ఆ తండ్రీ! తమ యాజ్ఞచే నేను గ్రహించిన సారతమార్గమును వినుపింతును. సావధానముగ వినుము.

[గొంతు సవరించుకొని]

అనాది మధ్యాంత మజం ।
అవృద్ధిక్షయ మచ్యుతం ।
ప్రణతోస్మ్యంత సంతానం ।
సర్వకారణకారణమ్ ॥

ఆది మధ్యాంతములు లేనట్టియు జన్మవృద్ధి వినాశములు లేనట్టియు, స్వస్వభావమును ఎన్న డును విడువనట్టియు అన్నిటిని పుట్టించి లయింప జేయు సర్వేశ్వరుని నమస్కరించుచున్నాను.

హిరణ్యా: [కోపముతో గండ్రెరజేసి పెదవి కొరికి గురువుతో] ఓరీ! కపటబ్రాహ్మణాధమా! ముల్లోకముల గడగడ వడికించు నా శాసనము నుల్లంఘించి నా బాలునకు నా శత్రుస్తవరాజ మును గఱపితివా! చూడు నిన్నేమి చేతునో

గురువు: [ఆపాదమస్తకము శరీరముచెమర్చ వడకుచు]

ప్రభో! ప్రభో! నేనంత యవివేకినా? నేను తమరు చండశాసనులని యెఱుఁగనా? నాయందు కోపగింపకుడు మహాత్మా! ఈ బాలుడు నేజెప్పిన దొక్కటియు చదువలేదు. ఇది యీతని కెవ రెప్పుడెట్లు చెప్పిరో నేనెఱుంగను ప్రభో!

హిరణ్యా: [ప్రహ్లాదునితో] బిడ్డా! గురువు చెప్పలేదనుచున్నారే! నీకిట్టి బుద్ధు లెవరు శాసించిరి తండ్రీ!

ప్రహ్లా: నాయనా! ముల్లోకములు శాసించుచు సకల ప్రాణుల హృదయకుహరములయం దుండు విష్ణువు తక్క మరి యెవ్వడెవనిని శాసిం చగలడు తండ్రీ!

హిరణ్యా: ఆ ఆ దుష్పుత్రా! ఏమనుచున్నావు జగదీశ్వరుడనగు నా మ్రోల నిర్భయముగా విష్ణువు విష్ణువు అని మాటిమాటికి వదరు చున్నావే ఎవడురా ఆ విష్ణువు విష్ణువును.

ప్రహ్లా: యోగులచే నిరంతరము ధ్యానింప బడు నే మహనీయుని స్వరూపము మాటలచే చెప్ప శక్యముగానిదో, ఏ మహనీయుని నుండీ ప్రపంచముద్భవించెనో ఏమహనీయుడీ విశ్వా కారముఁ ధరించి యుండెనో యట్టి పరమేశ్వ రుడే యా విష్ణువు తండ్రీ! తెలిసినదా?

హిర: ఛీ! లుచ్ఛా నేనుండ వేరొక పరమే శ్వరు డెవడురా? నీవు చావదలంచినట్లున్నావు లేకున్న నిట్లు మాటి మాటి కేలవదరెదవు?

ప్రహ్లా: నాయనా! అట్లేల కోపగింతువు. ఆతడు నాకే గాక నీకును యీ సమస్త ప్రజల కును కర్త్రయు, ధారకుడును, నియంతయు నగు చున్నాడు. నీవీమాత్ర మెఱుంగవా తండ్రీ!

హిర: ఇవి నీని మాటలు గావు. పాపిష్టి హృదయమున నేడెవడో చేరినట్లున్నాడు. లేనిచో నిట్లు గ్రహగ్రస్తునివలె యవాకులను చెవాకులను పేలడు.

ప్రహ్లా: తండ్రీ! నా హృదయమునే కాదు. ఆ విష్ణువు సకల లోకముల నాక్రమించి యు న్నాడు. లేకున్నచో నన్ను నిన్ను అందరను అన్ని చేష్టలయందును ఆతడెట్లు ప్రవర్తింప జేయుచున్నాడనుకొందువు.

హిర: [కోపముతో ప్రహ్లాదుని గట్టిగా ముందునకు త్రోసి] ఈ దుష్టుని తీసుకొని పొండు. గురు గృహమునందే ఇంకను కొంత కాలము శిక్షితుని జేయింపుడు.

[గురువు ప్రహ్లాదుని గొనిపోవును]

కొంతకాలమైన పిమ్మట తిరిగి గురువు ప్రహ్లాదునితో కొలువు కూటమున ప్రవేశించును. సింహాసనాసీనుడైన హిరణ్యునకు ప్రహ్లాదుడు సాష్టాంగముగ నమస్కరించును. తండ్రి ప్రహ్లాదుని లాలించి]

హిర: తండ్రీ! ఏది ఒక మంచి పద్యమును చదువు అమ్మా!

ప్రహ్లా: [చేతులు జోడించి]

యతః ప్రధానపురుషౌ యతశ్చైతచ్చరాచరం
కారణం సకలస్యాస్య సనో విష్ణుః ప్రసీదతు॥

ఎవనినుండి ప్రకృతి–పురుషు లావిర్భవించిరో ఎవనినుండి కార్యవర్గమంతయు పుట్టెనదో ఇట్లు సకలమునకు కారణమగు నా శ్రీ మహావిష్ణువు మనల ననుగ్రహించు గాత!

హిర: [పట్టజాలని కోపముతో భృత్యుల గాంచి] ఛీ ఛీ వీడు వంశవినాశకుడు. వీడిక బ్రతికిన లాభము లేదు. తక్షణము వీనిని సంహరింపుడు.

[భయంకరాకారులు పెక్కండ్రు కరాళ కరవాలములతోను ముద్గరములతోను మోదుచుందురు. ప్రహ్లాదుడు చిరునగవు మొగమున తళుకొత్త హరినామ సంకీర్తనము గావించుచుండును.]

హిర: [జాలిచే కారుచున్న కన్నీరుతుడుచుకొని] కుంతా! ఇప్పటికైనను ఆకూత కూయనుము. నీకభయ మొసంగుదును.

ప్రహ్లా: తండ్రీ! భయమున్న వానికి గదా అభయమొసంగుట. ఎవ్వాని నొక్కసారి పరిశుద్ధ స్వాంతమునందు తలంచినంతనే యెవ్వరును పోగొట్టజాలని జన్మ జరామృత్యు భయములే భయపడి దిక్కుతోచక పారుచుండ నట్టివాడు నా హృదయమందు నిత్యవాసము చేయుచుండ నాకు భయమెక్కడిది తండ్రీ!

హిర: అబ్బా! ఎంత పొగరు పట్టితివిరా దుర్మతీ! నీపని పట్టెద నుండుము.

ఓ తక్షక ప్రభృతి క్రూరసర్పములారా! రండు. ఈ దురాచార దురంధరుని మీ విష జ్వాలా పరంపరలచే నేను చూచుచుండగనే వినాశ మొనరింపుడు.

సర్పములు చుట్టుముట్టి ఘోరముగ కరచుచుండును. (ప్రహ్లాదుడు భగవద్ధ్యాన తత్పరుడై ఒడలెరుంగక ఆనందాబ్ధిని మునింగి యుండును]

సర్ప: మహాప్రభో! మా కోరలు చూర్ణమైనవి. మా మణులు ముక్కలైనవి. మా పడగలు తపించిపోవుచున్నవి. మా హృదయములు కంపించుచున్నవి. ఇంతయైనను యీ చిరుతని దేహ మొకింతయు కందదయ్యె. మే మేమి చేతుము. మాకు వేరొక కార్యమాదేశింపుము.

హిర: [ఆశ్చర్యముతో] ఏమీ చిత్రము. సరే మీరేగుడు. ఓ దిగ్గజములారా! మీరు రండు. మీరీనాడు మీ నాలుగు దంతములను సార్థకపరచుడు. వీనిని రూపడగింపుడు.

అంత నా దిగ్గజములు కోపోద్రిక్తములై ప్రచండ వేగముతో వచ్చి ప్రహ్లాదుని భూమిపై పడగొట్టి దంతములతో పొడుచుటకు ప్రారంభించెను. గోవిందునే ధ్యానించుచున్న ఆతని రొమ్ము సోకినతోడనే వాటి దంతములు గుండ పిండి కాజొచ్చెను. హిరణ్యకశిపు డాశ్చర్యముతో చూచుచుండును.]

ప్రహ్లా: [తనలో] పాపము! నా తండ్రి భగవంతుని మాహాత్మ్యము నెఱుంగక ఇట్లు ద్వేషించి చెడుచున్నాడు. వస్తు గౌరవము నెఱింగిన గదా దాని నాదరింతురు. గాన నేనా మాహాత్మ్యము నొకింత జెప్పి చూచెద [ప్రకాశముగా] తండ్రీ! ఏమట్లు నివ్వెర బోవుచున్నావు. మృణాలకోమలమగు నీ బాలుని దేహమెడ వజ్రనిష్ఠురములగు నీ గజదంతము లేడ. ఇవియేల యిట్లు గుండయగుచున్నవనియా? ఇది నాబలము కాదు! పాపాటవులకు కార్చిచ్చగు జనార్దన నామానుసంధానబలము సుమా యిది. దాని ముందు మన బలము లోక లెక్కయా!

హిర: [తనలో] ఆహా! ఏమి యీబాలుని ధైర్యము. ఏమి వీని విశ్వాసము. ఏమి వీని నిర్భయత. ఏమి వీని సామర్థ్యము. అయినను చూచెదను గాక.

[ప్రకాశముగా] ఓ దిగ్గజములారా! మీరు తొలంగుడు. ఓ అసురపుంగవులారా! వీనిని త్రాళ్ళతో బంధించి భూమిపై పడవైచి వీనిపై పర్వత సన్నిభములగు కాష్ఠనిచయమును చేర్చి నిర్దయగా దహింపుడు. ఇక వీడెట్లు తప్పించుకొనునో చూతును.

[అంతట నా యసురులాతని యాజ్ఞ చొప్పున కట్టెల చేర్చి యాతనిని దహించుచుండిరి.]

ప్రహ్లా: నాతండ్రీ! నేను కాలి మసినై తినను కొనుచున్నావా? లేదు. లేదు. నేను సుఖముగనున్నాను. ఆకసమునంటి నీమంటలు నన్ను తాకుటయే లేదు. నేనిచ్చట పద్మశయ్యపై పరుండినట్లున్నాను. దిక్కులన్నియు నాకుచల్లగ గోచరించుచున్నవి. ఇది నా ప్రభావము కాదు. జనార్దన భావనా బలము సుమా యిది. దాని ముందు మనబలము లోక లెక్కయా!

[అదినిని హిరణ్యకశిపుడు మారణోపాయములతో విసుగొంది ఆ ప్రయత్నము నుండి విరమించెను]

---

ఊరి యందుండువారికి గల విషయాసక్తి మృత్యువుపట్టు.
అడవి దేవతలు కూడుపట్టు.

---

విద్యకు సాటియైన కన్ను లేదు.
విద్యకు సాటియైన ఫలము లేదు.
ఆశకు సమమైన దుఃఖము లేదు,
సన్యాసమునకు సమమైన దుఃఖము లేదు.

# ★ మోక్షప్రదమార్గము ★

★ ★

జిజ్ఞాసువు:—శ్రీమతి పారేపల్లి శీతారామయ్య గారు వీరిభార్య తాయారమ్మగారు

ప్రశ్న:—మోక్షమార్గ ప్రదంబగు హితమేది?

సమాధానము "శ్రీమన్నారాయణ"

మంగళప్రదంబును, శాంతికరంబును, శోకనాశకంబును, సుఖప్రదంబును యగు శాస్త్రీయశిష్టాచారవిశిష్ట సద్గురూపదేశముచే మానవులు జ్ఞానమును పొందకలుగుచున్నారు. దానిచే సుఖము కలుగుచున్నది. శోకనిమిత్తములు వేయియు. భయకారణములు వందలును ప్రతిదినము మూఢునికి కలుగుచున్నవి. కాని పండితునికి కలుగజాలవు.

ఒకనికి బుద్ధి తనకు వశమైయుండునేని శోకనాశనమును, సుఖమును బొందుచున్నాడు. అనిష్టములతోడి కూడికవలనను, ప్రియముల నెడబాయుట వలనను, స్వల్పబుద్ధులగు మనుష్యులు మానసదుఃఖముల ననుభవించుచున్నారు. గడచిపోయిన ద్రవ్యముల గురించి. వాని గుణములనే తలంచుకొనుచు దుఃఖింపరాదు. అట్లు వానినే యాదరముతో దలంచుచు నుండు వానికి వానివలన స్నేహబంధము విడివడకుండును. దానివలన వానికి విముక్తి కలుగనేరదు.

దేనియందు అనురక్తిగలదో, దాని యందలి దోషములనే కనుగొనవలయును. అప్పుడే దేనియందును స్నేహబంధము కలుగకుండును. వారు దాని ననిష్టమువలె గనుగొనవలయును. అట్లు చేసిన దానియెడల వానికి వేగ విరక్తి కలుగుచున్నది, ఎవ్వడు కడచిపోయిన దానికి శోకించుచున్నాడో వానికి అర్థముగాని ధర్మముగాని యశముగాని కలుగనేరవు. అట్టిది గడచిపోయినపుడు అది మరలరాదు.

ప్రాణులోకప్పు డనేక పదార్థముల పొందుచున్నవి. కొన్ని సమయములయందు పోగొట్టుకొనుచున్నవి. ఈలోకమందు ఎవ్వరుగాని. తనకు కలుగువాని కన్నింటికిని శోకించుచుండుట తగదు. కడచిపోయిన దానిని గూర్చి అది నశించినను, నష్టమైనను. నెవడు శోకించుచుండునో. వాడా దుఃఖముచేతనే దుఃఖము నొందుచున్నాడు. అట్టివాడొక దుఃఖమునకు రెండనర్థముల నొందుచున్నాడు.

ఈలోకమందెవరు జనన మరణముల గతిని బుద్ధిచేత జూచి కన్నుల నీరునింపరో, వారే యన్నిటిని చక్కగా జూచునట్టివారగుదురు. అట్టివారికి నేది కలిగినను. కన్నుల నీరు నించుట సంభవింపనేరదు. శారీరమును మానసమును నగు దుఃఖమేదేని యెంత ప్రయత్నముచేసినను, వారింపరానిదై కలిగెనేనియు, నట్టిదానినే చింతించుచుండరాదు. తలంచుకొనకుండుటయే దుఃఖమునకు మందు. తలంచుకొనుట వలన నదిమానిపోదు. మరల మరల హెచ్చు పెరుగుచునే యుండును.

మానసదుఃఖమును ప్రజ్ఞచేతను. శారీరకదుఃఖమును నౌషధములచేతను పోగొట్టుకొనవలయును. ఇదియే విజ్ఞానమునకు గలబలము, ఇట్టి విషయములయందు బాలురవలె నడచుకొనరాదు.

యౌవ్వనము, రూపము, జీవితము, ద్రవ్యసంచయము, ఆరోగ్యము, ప్రియములగు వానితోకూడిక, ఇవియన్నియు ననిత్యములు పండితుడగువాడు వీనికై పేరాసబడరాదు. జనసమూహమునకు కలిగిన దుఃఖమునకు నొక్కడు శోకించుటతగదు. అందులకు శోకించుటకు మారుగా, నేదేని తెరపిగాంచిన యెడల దానికి ప్రతీకారముసేయుట మంచిది. జీవితమునందు సుఖమునకంటె దుఃఖమే అధికము.

ఎవడు సుఖదుఃఖముల రెండింటిని దిగవిడుచుచు నున్నాడో, వాడే పరమాత్మను పొందనర్హుడగుచున్నాడు, అట్టివాని మరణమునకుపండితులు శోకించరు. ధనమును ఖర్చు జేయునపుడు దుఃఖము కలుగుచున్నది. దానిని రక్షించునపుడు దుఃఖము కలుగుచున్నది, దానిని బడయునపుడు దుఃఖము కలుగుచున్నది. కనుక ధనమునాశమునొందినపుడు అందులకై చింతించరాదు, తృప్తి కలిగి యుండవలయును,

పెరుగున వన్నియు గడపట తరుగ కుండవు, పొడుగుగ నిగుడునవని యు బడకమానవు, కూడినవన్నియు నేడబాయుట తప్పదు, బ్రతుకునకు చివర జావుదప్పదు. దప్పికి అంత మెక్కడ ? తనివియె పరమసుఖము. కనుక పండితులగువారు సంతోషము, తృప్తి శాంతమే ధనమని యెన్నుదురు.

వయస్సు నిమిష మాత్రమైనను నిలువక బోవుచునే యున్నది. ధనమును గూడబెట్టుకొనుచుండుట యొక్కటియే పనిగాగలిగి, కామభోగములందెంత మాత్రము తనివి నొందక యుండువానిని, పులి పశువునుంబోలె, మృత్యువు తటాలున బట్టుకొని పోవుచున్నది,

శోకము నొందకయు, వ్యసనముల పాలుగాకయు, పట్టినకార్యముల నుల్లాసముతో జేసి పూర్తి చేయువలయును.

ధనికుడేగాని, దరిద్రుడేగాని రూప-రస-గంధ స్పర్శ-శబ్దముల ననుభవించిన పిదప నేమియు కలుగదు. ప్రాణులు తమ కూడికకు మునపు దుఃఖమునకెన్నడు పాలైనదిలేదు, గాన తనయొప్పటి ప్రకృతి యందుండువారు అట్టికూడికయంతయు నొందినందులకు శోకింపరు,

ధృతిచేత మర్మావయములను మన్మథార్తిని, ఉదరమును ఆకలినిన్ని; కంటిచేత కాలుచేతులను; మనస్సుచేత కంటిని చెవులను; విద్యచేత మనస్సును వాక్కును రక్షించుకొను చుండవలయును.

ఎవరియందును మక్కువ యుండరాదు. వినయముతో నడుచుకొనవలయును, అట్టివాడే సుఖి అట్టివాడే పండితుడు.

తనయాత్మయందు క్రీడించుచు యోగనిష్ఠుడై, ఏదియుకోరక, లోభమును దిగవిడచి, వేరొకరిపై నాధారపడక, తనకు తానే సహాయుడై, పరమాత్మకు శరణాగతుడై సుఖియగును. వానికే శాంతికలుగును. వారే మోక్షమును పొందనర్హులు.



# నారీవిభాగము



శ్రీమతే రామానుజాయనమః

జిజ్ఞాసువు :—శ్రీ మట్టపల్లి చంద్రమ్మగారు,

## "మనగతి యేమి?"

"శ్రీమన్నారాయణ"

ధర్మరాజు భీష్ముని యిటుల ప్రశ్నించెను.

ధర్మరాజు: భరతసత్తమా! గొప్ప యైశ్వర్యమును, గొప్ప ధనమునుం బడసి, దీర్ఘమయిన యాయువును బడసి యంత మృత్యువు నతిక్రమించుట యెటుల? అది గొప్ప తపస్సుచేత కలుగునా? వేదవిహితములగు కర్మముల చేత కలుగునా? వ్రతముచేత కలుగునా? రసాయన ప్రయోగములచేత కలుగునా? దేనిచేత జననమరణములపొందక యుండవచ్చును?

ఇందులకు భీష్ముడిటుల జవాబిచ్చెను.

భీష్ముడు: ధర్మజా, ఈవిషయమై ఒకచక్కటి యితిహాసముకలదు. దానిని తెలిపెదనువినుము. విదేహరాజగు జనకుడు పంచశిఖుడను భిక్షుడగు తన గురువును ఈప్రశ్నలనే అడిగెను. అంమల కామహర్షి జనకుని కిటుల యుపదేశించెను. జనకా, జరామరణములు రెండింటికిని నివృత్తి లేదు. వీని నేవిధమునను నివృత్తి గలుగదనుటయు నిజముకాదు. పగళ్ళు—రాత్రులు—పక్షములు—నెలలు— వత్సరములు అను సంజ్ఞలతో నొప్పుచుండు కాలచక్రము ఎప్పటికిని ఎవ్విధము ఆగకయే సదా దొర్లిపోవుచుండును. సమస్త ప్రాణులు తనాధీనమైయ్యే నడుచుకొనుచుందురే గాని దాని నెంతమాత్రము నతిక్రమించజాలరు.

ఎవడు తాను అధ్రువుండైనను, ధ్రువంబగు నివృత్తిమార్గమును బొందునో అట్టివాడే జరామరణములను మాన్ప నేర్చును.

సమస్త భూతములను నాశనము వశపరచుకొనుచున్నది. సమస్త ప్రాణులున్ను కాలప్రవాహమున ఎడతెగక కొట్టుకొని పోవుచుండును. దాటుటకు దెప్పయు లేనిదై, జననమరణములనెడి పెద్ద పెద్ద మొసళ్ళను గలిగియున్న యెడతెగని కాలప్రవాహము నందు గొనిపోవబడు చున్నవారు తోడెవరును లేక యందు మునిగిపోవుచుందురు.

ఆ ప్రవాహము నందు గొట్టుకొని పోవునప్పుడు వానికి దోడుపడగల సమర్థుడెవరు? ప్రాణిసామాన్యమంతయు పిపీలికాది బ్రహ్మపర్యంతము ఈకాలప్రవాహమునందు లోబడినదియే. ఆకొట్టుకొని పోవువాడును నెవ్వరికేని దోడుపడుటకు జూడదు. భార్య మొదలగు నితరబంధువులెల్ల దారిలోవచ్చి కూడుకున్నవారే కాని మరియొండు గాదు. వీరింతకు ముందును ఎవరితోనుగాని యెంతకాలమేని యిట్లు కూడిమాడి యుండినది లేదు. కాలప్రవాహమున బడిపోవునపుడు మబ్బులగుంపులుగాలిచే గొట్టుపడి బిట్టుగా నురుముచు నొకటితో నొకటి గూడుకొనునటుల దామునుమాటిమాటికి నొకరితో నొకరు బలవంతముగాగూర్పబడుచున్నారు.

జరామరణములు సకలభూతములను దోడేళ్ళవలె మ్రింగుచుండును. అని బలవంతుని దుర్బలునిని, పొట్టినిని, బాడుగునును నందరను సమానముగా నే మ్రింగుచున్న ది.

అధ్రువములగు ప్రాణులయందు నాత్మయొక్కటియే నిత్యమయినది. గనుక ప్రాణులు పుట్టినపుడు సంతోషింపనేల? గిట్టునపుడు దుఃఖింపనేల? నేనెక్కడనుండి వచ్చితిని? నేనెవ్వడను? నాస్వరూప స్వభావములెట్టివి? నేనిచ్చట కెటుల ఎందులకు వచ్చితిని? నా ఈ ప్రస్తుతస్థితియేమి? ఎక్కడికి బోగలను? ఎవ్వనివాడను? ఏమి కాగలను? ఏకారణమునుబట్టి దేనికొరకు శోకించెదవు? ఎవడు ఎట్టికర్మను జేయునో తత్ఫలితమును స్వర్గమునో, నరకమునో వాడు తప్పమరియెవరు ననుభవింతురు!

మరిసర్వాశక్తుడైన వీనికి గతియేమి?

సర్వజ్ఞుడు. సర్వశక్తిమంతుడు సర్వనియంత. సర్వశేషి. సర్వరక్షకుడు సర్వతంత్రుడు అగు శ్రియఃపతియే పరమగతి. అంతకంటె మరి ఏగతియు ఎప్పటికి ఎంతమాత్రమును లేదు. ఆయన యనుగ్రహమునకు ఆయన శరణాగతియే గతి. ఇదియె ముమ్మాటికిన్ని సత్యము,

సంకల్పరాహిత్యతచే ధర్మమును విడువుము.
లోభరాహిత్యతచే నధర్మమును విడువుము,
బుద్ధిచే సత్యాసత్యముల రెంటిని విడువుము.
పరమాత్మవిషయక దృఢాధ్యవసాయముచే బుద్ధిని విడువుము.
సమ్యగాలోచనచే కామమును విడువుము.
క్షమచే క్రోధమును విడువుము.

# ప్రచార విభాగము.

భక్తి "నివేదన"

అనుబంధము

శ్రీమతే రామానుజాయనమః

## ★ ప్రకటన ★

శ్రీ విశిష్టాద్వైత సిద్ధాంతమునకు సంబంధించిన అన్నిరకముల పుస్తకములు ఓకచోట దొరకునటుల చేయవలెనను ఆశయముతో మదరాసులోని మన సంఘకార్యాలయమగు, 107, వరదాముత్తియప్పన్ వీధిలోని, గీతామందిరమున పుస్తకవిక్రయశాఖ నొకదానిని స్థాపించితిమి. ఇందు మన సాంప్రదాయక పాత–క్రొత్త పుస్తకములు గొనబడును. కావలశినవారలకు అవి విక్రయించబడును. శ్రీవిశిష్టాద్వైత సాంప్రదాయస్థులందరున్ను తమవద్దయున్న పాత–క్రొత్త పుస్తకములను యిచ్చుటకై విక్రయమునకై పంపియు, తమకు కావలశిన పుస్తకములను ఖరీదునకు కొనుక్కొ–నియు ఈ మాసదుద్యమమును ప్రోత్సహించి, బలపరచుచు లాభమును పొంద గోరుచున్నాము. త్వరలో కేటలాగు ప్రచురించబోవుచున్నాము. గాన గ్రంధకర్తలందరు తమ గ్రంధముల వివరముల వెంటనే పంపగోరుచున్నాము.

[జవాబును గోరువారు రిప్లైకార్డునువ్రాయప్రార్థన]

శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘ పుస్తక విక్రయ శాఖ.

గీతామందరము 107, వరదా ముత్తియప్పన్ వీధి మదరాసు. I

## భక్తి "నివేదన" పత్రికా చందాదారులకు వినతి.

భక్తి "నివేదన" పత్రికను కేవల ప్రచార దృష్ట్యా ఎంతో వ్యయప్రయాసలతో నడుపుచున్న సంగతి తమకు తెలియని విషయముకాదు. వచ్చే సంవత్సరాదినుండి దీనిని వారపత్రికగ మార్చవలెననియు, ఒకవారమున వ్యాసములను ఒకవారమున అనుష్ఠానమునకు సంబంధించిన చిన్నచిన్ననిబంధన గ్రంధములను, ఒకవారమున సాంప్రదాయ పుస్తకములను కొద్దికొద్ది పారములక్రిందను, ఒకవారమున ప్రచారవిభాగము మాత్రమును యిటుల ప్రతిమాసము ప్రచురించవలెనని ఆశించుచున్నాము. ఇప్పటికే ఈపత్రిక చాలనష్టముకలదై అప్పులలోయున్నది. అందుచే

చందాల వసూళ్ళకై సంఘప్రచారకులగు శ్రీమాన్ వంగిపురం రంగాచార్యులగారిని తమవద్దకు పత్రిక చందాకై పంపుచున్నాము. దయయుంచి తాము తమ చందాద్రవ్యమును వారికిచ్చి రశీదును తీసుకొనుచు, తమ బంధుమిత్రులను, ప్రాంతీయులను క్రొత్త చందాదారులగ జేర్పించియు. పాతచందాల చెల్లించునటుల ప్రోత్సహించియు పత్రికాభివృద్ధికై తోడ్పడ మిక్కిలియు ప్రార్థించుచున్నాము.

ఇట్లు
భక్తి "నివేదన కార్యాలయము"
107. వరనాముత్తియప్పన్ వీధి మదరాసు I

# శ్రీవిశిష్టాద్వైత సాంప్రదాయస్థులకు సవినయ మనవి.

ఏ సంస్థయైనను తమ యాశయముల బాగుగా ప్రచారమును గావించవలెనన్నచో అందులకు రెండే ముఖ్యసాధనములు. [1] కలము, కాగితము; సభలు–సమావేశములున్ను; మనమీ రెండింటిని ప్రారంభించితిమి. గాని ఇది సమగ్రములుగ లేవు. సభలు-సమావేశములు చిన్నవియో పెద్దవియో అచ్చటచ్చట జరుగుచున్నవి. చాల మంది ప్రజలు పండితులు యిందులకు తోడ్పడుచునే యున్నారు. దీనిని యింకను బాగాసంస్కరించి మిగితపండితులతోడ్పాటును కూడ పొందుచు దేశము నలుదిక్కులయందు దీనిని బాగుగ వ్యాప్తము చేయవలశియున్నది. ఇందులకై తగు ప్రయత్నములు చేయబడుచున్నవి. త్వరలోనే క్రొత్త పథకము ఆచరణలోనికి రాగలదని ఆశించుచున్నాము, ఇక రెండవది యగు 'కలము–కాగితము' విధానముకై భక్తి "నివేదన"యను పత్రికను ప్రారంభించితిమి. గాని అది మనసంఘీయుల ప్రోత్సాహముసరిగా లేనందున తన యాశయమును ఏమాత్రము నెరవేర్చలేకున్నది. ఈపత్రికను వారపత్రికక్రింద మార్చికొన్ని అనుష్ఠానోపయోగ నిబంధన గ్రంథములను, అముద్రితమైనట్టియు, యిదివరతో ముద్రితమైనవైనను ప్రస్తుతము దొరకకుండగ యున్నట్టియు సాంప్రదాయ గ్రంథములను, కూడ వేయుచుండవలెననియు, ఈపత్రికనే ఒక తెలుగులోనేగాక త్వరలోనే అరవము, హిందీ. ఇంగ్లీషులలోకూడ ప్రచురించుచుండవలెననియు ప్రయత్నించుచున్నాము. ఈపనులన్నింటికిన్ని ఒకసమగ్రము ద్రణాలయము కావలసియున్నది. ఇది ప్రస్తుతధరవరులనుబట్ట ఇరువదివేలగునని అంచనావేయబడినది. మనసంఘమునకు సంఘీయుల అభిమాన ఆదరణలుతప్ప వేరే ఎట్టి మూలధనమేదియులేదనుసంగతి సంఘీయులందరకు తెలిసిన విషయమేకదా. అందుచే సంఘీయులకందరకు యిందునుగురించి ఒకరూపాయిమొదలు ఆపైని తమఉత్సాహము శక్తి అవకాశముల ననుసరించి ధనసహాయము చేయవలసినదిగ ప్రార్థించుచున్నాము. పూర్తి మొత్తమును ఎవరైన దాతలు దానము చేయుచో వారిపేరుతోనే ముద్రణాలయమును స్థాపించి నడుపగలము. ఒక్కొక్కరు నూరేశి రూపాయలు చొప్పున రెండు వందలమంది దాతలు సహాయపడదలచినచో యిదేనుంత పెద్ద

కార్యముకాదు. ఇట్టి సత్కార్యమున తమ ధనమును వినియోగపరచ దాతలను శ్రీయఃపతి ప్రోత్సాహపరచుగాక యని ప్రార్థించుచున్నాము.

విరాళములను ఈక్రింది చిరునామాకు పంపప్రార్థన

శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘకార్యదర్శి.
గీతామందిరము 107. వరదా ముత్తియప్పన్ వీధి మదరాసు I

## స్వచ్ఛమైన తులసిపూసల మాలికలు విక్రయమునకు దొరకును

జపాదులు జేసుకొనుటకున్ను, మెళ్లోధరించుటకున్ను అసలైన తులసి పూసలమాలికలు దొరకకుండుటచే భక్తుల కోరికపై ఇచ్చట శ్రీవాసుదాసా శ్రమములో పెంచబడిన తులసిమొక్కల కర్రతో ఇచ్చటనే మేము స్వయముగ పూసలను తయారుచేయించి వాటిని గోమూత్రము, తైలములతో యథావిధిగ సంస్కారముల నొనరించి, వేదోక్తముగ హోమాది ప్రక్రియతో ప్రతిష్ఠచేసి కావలసిన భక్తులకు సప్లైచేయ నిశ్చయించితిమి. 108 పూసలు గల సాదామాలి, ఖరీదు రూ 1-0-0 అగును. ప్యాకింగు పోస్టేజి రూ 0-8-0 అదనముగా అగును. ముందుగ సొమ్మును పంపినవారలకు పోస్టులో పంపగలము.

శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘ శాఖా కార్యదర్శి
వాసుదాసాశ్రమము. నడిగడ్డపాలెము
(వయా) చుండూరు.
తెనాలితాలూకా. గుంటూరుజిల్లా,

## కట్నములు

శ్రీమాన్ చి. మా. వెం. రాఘవాచార్యులుగారు వారికుమారుని ఉపనయన సందర్భములో శ్రీవిశిష్టాద్వైత ప్రచారసంఘమునకు కట్నముగా 2-0-0 లు సమర్పించినారు. ఈవటువునకు శ్రీయఃపతి ఆయురారోగ్యైశ్వర్యముల నొసంగిబ్రోచుగాక !

తణుకుతాలూకా రేలంగి గ్రామకాపురస్థులు వైశ్యశిఖామణులు సుగుణసంపన్నులు ధర్మశీలురు నగు బంగారు సుబ్బారావుగారు శ్యామలాంబగారి దంపతులు తమ మనుమడు జన్మదినోత్సవమున బంధుమిత్రులకు విందులు కానుకలొసగిన సందర్భమున శ్రీవిశిష్టాద్వైత ప్రచారకసంఘమునకు కానుకగా నొసగినవి. రూ 5-0-0 లు గాన వీరికి శ్రీయఃపతి ఆయురారోగ్యైశ్వర్యముల నొసంగి బ్రోచుగాక.

బందరు శ్రీయతిరాజసేవా మహిళామండలి వారు శుక్రవార పూజల ద్వితీయ వార్షికోత్సవమునకు కానుకగా 5-0-0 లు సమర్పించి మార్గదర్శకులైరి వీరి ఉద్యమమునకు శ్రియఃపతిపూర్ణ దోహద మొసంగుగాక,

## శుక్రవారపూజలు

కోనాల ధనరాజు భార్య సత్తిరాజు 0-4-3
నల్లమిల్లి సుబ్బిరెడ్డి భార్య మాణిక్యం 0-4-3
పోతంశెట్టి వెంకన్న భార్య మాణిక్యం 0-4-3
లంక సూరన్నభార్య వీరమ్మ 0-4-3
సత్తిబుల్లిస్వామిభార్య మంగమ్మ 0-4-3
ఉండమాటి రామయ్యభార్య అమ్మన్న 0-4-3
చిర్లవీరయ్యభార్య మంగయమ్మ ఏకాదశి 0-4-3
పోతంశెట్టివెంకన్న భార్యమహాలక్ష్మి ఏకా॥ 0-4-3

# ప్రచార విభాగము

## గీతా పరీక్షలు

గతసంచికలో గీతాపరీక్షలు నవంబరు 20 తేదీ ఆదివారం జరుపబడుననియు పరీక్షాదరఖాస్తులు అక్టోబరు 15 వ తేదీలోగా అందజేయబడవలెననియు ప్రచురించియుంటిమి. ఈసంవత్సరమునకు మాత్రము గీతమొదటి 3 అధ్యాయముల విషయము మాత్రమే పరీక్షింపబడును. చిత్రప్రకరణము పరీక్షకులేదు. 40 శ్లోకములు మాత్రమే అర్థముతో వర్ణించవలెను అనియు ప్రకటింపబడెను.

చావలినుండి శ్రీమాన్ విష్ణుమొలకల వీరరాఘవయ్యగారు అత్యుత్సాహముతో 10 సంవత్సరముల మొదలు 35 సంవత్సరముల వరకు వయస్సుగల 18 మంది నారీమణులను పరీక్షకుతయారుచేయుచు దరఖాస్తులను పంపియున్నారు. ఇంకను ఇతరస్థలములనుండి యిదేవిధముగా వేంటనే దరఖాస్తులను పంపవచున్నాము.

ఈ 3 అధ్యాయములతోను అడుగబడగిన ప్రశ్నలను ఇచ్చట ప్రకటించుచున్నాము. వాటికి సమగ్రముగా సమాధానములు తెలుసుకొనియున్నచో ప్రాయః అట్టివే సుమారు 8 ప్రశ్నలు అడుగబడవచ్చును. ఈప్రశ్నలకు ఉత్తరవులు విశిష్టాద్వైతసాంప్రదాయ టీకావ్యాఖ్యానములున్న ప్రతిగీతాకోశమునుండియు బడయవచ్చును. అవసరమైనచో పూర్తి 18 అధ్యాయములకు విశిష్టాద్వైత సాంప్రదాయాను సారముగా తాత్పర్యముతో ప్రచురింపబడిన గీతాకోశములను పంపగలము. పోష్టేజీకాక పుస్తకం ఖరీదు రు 1-4-0 అగును.

పైప్రశ్నలలో పెక్కింటికి సమాధానములు గతసంవత్సర భక్తినివేదన పత్రికలలో గానవచ్చును.

## ప్రశ్నలు

### మొదటి అధ్యాయము

1 గీతయే యుద్ధగ్రంథములోని యేభాగము (ప్రతి అధ్యాయము చివరగద్య చూడుము,

2 దీనిని మొదట ఎవరు ? ఎవరికి ? ఎందులకు ? ఉపదేశించిరి ?

3 దీనిని "ఉపనిషత్తు' అని పిలుచుటకు కారణమేమి ?

4 ఇది యెందులకు యోగశాస్త్రమైనది,

5 మొదటి అధ్యాయమునకు పేరేమి ? ఆపేరు దీనికెందుకు ఉంచబడినది,

6 సంజయుడు దీనిని ధృతరాష్ట్రున కెట్లు చెప్పగల్గెను ? ధృతరాష్ట్రుడు యుద్ధమునుగూర్చి సంజయు నేల ప్రశ్నించెను ?

7 భగవంతుడర్జునునకు శ్లోకరూపముగా నుపదేశించెనా ? అర్థములనుపదేశించెనా ?

8 భారతయుద్ధ మెవరికి ఎచ్చట జరిగెను ? (1 శ్లో)

9 ఉభయసేనా ప్రథమ సేనానాయకుల పేరులను, ప్రధాన వీరుల పేరులను పేర్కొనుడు ? 3.4,5,6,7,8,9,

10 భీష్మాచార్యు లేలసింహనాదముచేసి శంఖమునుపూరించెను

11 ఉభయసేనా పరిమాణమును వ్రాయుచు దుర్యోధనుడేల తనసేన అపర్యాప్తమును వారిసేన పర్యాప్తమును అనెనో సయుక్తికముగా వ్రాయుము. (2.3.4 10)

12 శ్రీకృష్ణుడు భారతయుద్ధములో ఎట్టిపాత్రను పరిగ్రహించెను? 14 ద్వి 2,10

13 మీరుచదివిన గీతాభాగమునుబట్టి శ్రీకృష్ణుడు భారతయుద్ధములో పాండవులకేమి సహాయమునుచేసెనో వ్రాయుడు. పాండవులు ఐదుగురయొక్కయు శ్రీకృష్ణునియొక్కయు శంఖముల పేరులను వరుసగా వ్రాయుడు. 15,16

14 యుద్ధమునకు సన్నద్ధుడైవచ్చిన అర్జునుడు హఠాత్తుగా యుద్ధవిముఖుడగుటకు కారణములెవ్వి ? 26 మొదలు చివరకు,

15 అర్జునునకు యుద్ధారంభమున కలిగిన అపశకునములేవి ? 29 టు 31,

16 అర్జునుడు ఆశంకించిన యుద్ధానర్థములను క్రమముగా పేర్కొనుడు 40,45,

## —: రెండవఅధ్యాయములోని ప్రశ్నలు :—

1 అర్జునుని విషాదమునకు శ్రీకృష్ణుడారోపించిన ప్రధానదోషములెవ్వి ? ఎందుచేత ? 2, ముందు గ్రంథములో 36 వరకు లేక అర్జునుని దుఃఖమేల అనార్యజుష్టము అస్వర్గ్యము, అకీర్తికరము అయినది ? 10-36వ.

2 శ్రీకృష్ణుడీయధ్యాత్మ శాస్త్రమగు గీతను అర్జుననకుపదేశించుటలో ప్రధానకారణమేమి ? 7

3 గీతాశాస్త్రమే శ్లోకమునుండి ప్రారంభమగుచున్నది? ఎందువలన ? సయుక్తికముగా వ్రాయుడు. (10)

4 అర్జునుడు పలికిన ప్రజ్ఞావాదములెవ్వి? (42)

5 "గతసూన్ అగతాసూన్ నానుశోచంతిపండితాః" అనుటకు శ్రీకృష్ణుడుపదేశించిన ఉపపత్తులను వ్రాయుడు. 11:30

6 శ్రీకృష్ణుడర్జుననకుపదేశించిన సాంఖ్యబుద్ధికిని వివరింపుము. 11;30

7 ఆత్మనిత్యమనుటకు శ్రీకృష్ణుడు కనుపరచినకారణములను వ్రాయుము. 11:25

8 మాత్రాస్పర్శలనగానేమి? వాటిని సహించుటవలన లాభమేమి ? 14;15

9 యుద్ధవిముఖుడగు నర్జునుని శ్రీకృష్ణుడెట్లు యుద్ధమునకు ప్రోత్సహించెనో మీకైన గ్రంథమునుండి వివరింపుడు. 16:37

10 యుద్ధమువలన అర్జుననకు కలిగిన పాపభీతిని శ్రీకృష్ణుడెట్లు పరిహరించెను ? 38

11 శ్రీకృష్ణుడర్జుననకుపదేశించిన యోగబుద్ధియెట్టిది ? 41:48

12 కర్మయోగమననేమి ? దానిమహాత్మ్యమెట్లువర్ణింపబడినది [39;47

13 వ్యవసాయాత్మికబుద్ధి యనగానేమి ? 41

14 కామ్యకర్మలను కృష్ణుడెట్లు నిందించెను ? 42,43,44

15 కామ్యకర్మలు వేదోక్తములేకదా? వాటిని పరిహరించుట తగునా? యను ఆక్షేపమునకు శ్రీకృష్ణుడు గావించిన పరిహారమేమి? 45:46 ]47.

16 కర్మయోగి ఎరుంగవలసిన ప్రధానకర్మ సూత్రములేవి ?

17 శ్రీకృష్ణుడు యోగశబ్దము నెట్లు నిర్వచించెను? 48.

18 యోగబుద్ధిని శ్రీకృష్ణుడెట్లు ప్రశంసించెను? 49.50,51

19 కర్మయోగమువలన కలుగుఫలపరంపరనువర్ణింపుము.52

20 స్థితప్రజ్ఞుని అవస్థాభేదములను వర్ణింపుచు వాటికి గల తారతమ్యమును పేర్కొనుము. 55,56,57,58.

21 ఈస్థిత ప్రజ్ఞావస్థఅందరకును కలుగకుండుట కేమికారణము. దానిని సంపాదించుటకు ప్రధానసాధనమేమి? 66,67,60,61.64,65.68.

22 విషయాను సంధానమువలన కలుగు అనర్థపరంపరలను పేర్కొనుడు. 62.63

23 మనకంటె స్థితప్రజ్ఞునికిగల వైలక్షణ్యమేమి? 69.80

24 ఎట్టివాడు శాంతిని పొందగలడు? 70,71

25 ఈఅధ్యాయమునకు పేరేమి? అది ఎందుల కుంచబడినది

## —: 3 వ అధ్యాయము :—

1 ఈ అధ్యాయమున అర్జునకు గలిగిన సందేహమేమి ? దానికికారణమేమి? దానిని శ్రీకృష్ణు డెట్లుపహరించెను ? 1.2.3,4,5,8.17,18

2 మోక్షేచ్ఛగల ప్రతి మానవుడును మొట్టమొదట కర్మయోగమునే అవలంబించవలెననుటకు శ్రీకృష్ణుడు చెప్పినకారణములెవ్వి ? 4,5,6,8,10,11,12.13.14.15,16,19. 20.21,25,26.

3 కర్మయోగము నాచరింపక విడుచుటఎట్టివానికి? ఏల17,18

4 కర్మ చక్రమును వర్ణింపుడు.

5 యజ్ఞముల నెవ్వరెప్పుడు యెందులకు సృజించిరి? 10, 11.12.13.

శ్రీకృష్ణుడు కర్మయోగము నాచరించెనా? ఏల 23.23.24

7 కర్మల నాచరించుటలో పండితునకు పామరునకును గల భేదమేమి? 27.28

8 కర్మలు బంధించకుండునట్లు చరించుటలో ప్రధానసూత్రమేమి; 30

9 పాపము నాచరించు తలంపులేకున్నను బలాత్కారముగా నాచరింపచేయు నదెవ్వరిని అర్జునుడడిగిన ప్రశ్నకు శ్రీకృష్ణు డొసంగిన సమాధానమేమి? 36,37

10 పురుషుడు దేనిచేనెట్లు పాపములయందు ప్రేరేపించబడు చున్నాడు ? 36 37.38.39.40.

దానిని జయించునుపాయమేమి ? 41.43

11 ఈఅధ్యాయమునకు పేరేమి? అదిఎందులకుంచబడినది ?

# శరదాశ్రీత్రి మహోత్సవము

## గీతామందిరమున

(107, వరదా ముత్తియప్పన్ వీధి, మదరాసు.)

శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘముయొక్క ఆదేశాను సారముగా గీతామందిరమున 22-9-52 సోమవారంనుండి 28-9-52 ఆదివారము వరకు శరదాత్రి మహోత్సవము ఈక్రింది కార్యక్రమము ననుసరించి జరుపబడెను.

## కార్యక్రమం

ఉదయం గం 6-00 ల నుండి 7-30 వరకు తిరువారాధన, పెరుమాళ్ళకు పంచసూక్తములతో పంచామృత తిరుమంజనము, శ్రీవిష్ణు సహస్రనామార్చనము, తిరుప్పావై సేవ, ఆరగింపు, మంగళాశాసనము, తీర్థప్రసాద వినియోగము. సాయంకాలం గం 4-30 ల నుండి గం 6-30 ల వరకు తిరువారాధనము, లక్ష్మీ సహస్రనామార్చనము శిరియ తిరుమడల్ సేవ-శ్రీస్తుతి-శ్రీగుణ రత్నకోశంఅనుసంధానము. మంగళాశాసనము తీర్థప్రసాద వినియోగము గం 6-30 ల నుండి గం 8-00 ల వరకు పండితులచే శ్రీమద్రామాయణ ఉపన్యాసములు జరుపబడెను.

## ఉపన్యాసములు

1 శ్రీమాన్ తె.కం. గోపాలాచార్యులుగారు బాలకాండము-యుద్ధకాండము.
2 శ్రీమాన్ మహాభాష్యం వరదాచార్యులుగారు అయోధ్యకాండము.
3 శ్రీమాన్ పండిత చక్రవర్తి శ్రీనివాసరంగాచార్యులుగారు అరణ్యకాండము.
4 శ్రీమాన్ పి. టి. రాజగోపాలాచార్యులుగారు కిష్కింధకాండము.
5 శ్రీమాన్ కె. నరసింహాచార్యులుగారు సుందరకాండము.

## కైంకర్యపరులు.

1 శ్రీమాన్ కరాలపాటి రాధాకృష్ణయ్యగారు.
2 శ్రీమతి మట్టపల్లి చంద్రమ్మగారు.
3 శ్రీమతి మరంగంటి రంగనాయకమ్మగారు.
4. శ్రీమతి గుగ్గిలం చంద్రమ్మగారు,
5. శ్రీమతి ఆండాళ్ళమ్మగారిద్వారా యిద్దరు శ్రీరామభక్తులు.
6. శ్రీమతి కోటా సులోచనమ్మగారు,
7. శ్రీమతి నామా విశాలాక్ష్మమ్మగారు.

ఇట్లు
శ్రీయతిరాజాసేవా మహిళామండలి. గీతామందిరం-మదరాసు.

---

## —♦ సత్కారము ♦—

తూర్పు గోదావరి జిల్లా వడిద గ్రామ కాపురస్థులగు శ్రీమదుభయవేదాంత ప్రవర్తకులైన శ్రీమాన్ శ్రీమత్తిరుముల పురిఘళ్ళ వెంకటాచార్య లయ్యవార్లంగారు శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘమునకు ఆసంఘ కార్యక్రమమునందు తమకున్న అభిమానమును పురస్కరించుకొని ప్రచారనిధికి రూ 50-0-0 లను సమర్పించిరి. వీరికి మా హృదయ పూర్వక ధన్యవాదములు. వీరికి శ్రియఃపతి సమస్తైశ్వర్యముల నిచ్చి రక్షించుగాక.

ఇట్లు,
శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘము,

---

రిజిష్టరు నెం. 5049

# భక్తినివేదన

(వేదాంత మాసపత్రిక)

ఇందు వేదాంత విషయ రాజములున్ను; భక్తిప్రచార విషయమైన వార్తలున్ను వేదాంత సాంప్రదాయ విషయకమైన ప్రశ్నోత్తరములున్ను ప్రచురించబడును.

చందాలు;

సాధారణ చందా సం. ర 1కి ॥ రు 5-0-0.

సహాయ చందా ,, రు. 10-0-0.

To

Book



1. శ్రీమన్నారాయణుడే సృష్టి - స్థితి లయ - కారకుడు.
2. ఆయనే మోక్షప్రదాత.
3. ఆయనే పరతత్వము-పరమాత్మ
4. ఆయన అఖిలహేయ ప్రత్యనీక కల్యాణ గుణకుడు.
5. ఆత్మ జీవుడు శరీరభూతుడు; శేషభూతుడు; పరతంత్రుడు, నియామ్యుడు, అనుభావ్యుడు.
6. జీవులు జ్ఞానైకా కారులు.
7. జీవులు అనంతములు.
8. జీవులు పరమాత్మకంటె భిన్నులు; ఈ. భేదము సత్యమైనది; నిత్యమైనది.
9. జీవ-పరమాత్మలకు ప్రకృతి శరీరభూతమైనది; శేషభూతమైనది; పరతంత్రమైనది; నియామ్యమైనది; అనుభావ్యమైనది.
10. ప్రకృతి వికారాస్పదమైనది. జీవపరమాత్మలకంటె భిన్నమైనది. ఈ భేదము సత్యమైనది; నిత్యమైనది.
11. జీవుడు ప్రకృతి వియుక్తుడై పునరావృత్తి రహితమైన పరమాత్మ సాన్నిధ్యమగు పరమ పదమును పొందుటయే మోక్షము.
12. భక్తి యొక్కటియే మోక్షసాధనము.
13. భక్తి యనగా తైలధారవలె అవిచ్ఛిన్నమైన స్మృతి పరంపర.
14. వివేక-విమోక-అభ్యాస-క్రియా-కల్యాణ అనవసాద-అనుద్ధర్ష లు భక్తికి అంగములు.
15. ఇవి సదాచార్య-సమాశ్రయణ-లభ్యములు
16. జగద్గురువగు శ్రీరామానుజా చార్యులు వారును; వారి యనుయాయులున్ను సదా చార్యులు.

"నగురుర్వైష్ణవాత్ పరః" భా. సం.

Edited Published & Printed by A. Ch, Srimannarayanacharya at Sriman Press, Kakinada.

## —: విజ్ఞప్తి :—

భక్తి "నివేదన" పత్రిక కార్యాలయము

15-11-1952 తేది నుండి విజయవాడకు మార్చబడినది. గాన చందా దారులు తమ చందా ధనమును దయయుంచి ఇకనుంచి ఈ క్రింద చిరునామాకు పంప గోరుచున్నాము.

పత్రికా విలేఖరులు తమ లేఖలను దయతో ఈ క్రింద చిరునామాకే పంప గోరుచున్నాము.

గౌరవ నిర్వహణాధికారి. (హానరరీ మేనేజరు)
భక్తి "నివేదన" పత్రిక
10/275 A కోటంరాజువారి వీధి,
విజయవాడ. (కృష్ణాజిల్లా)

## విజ్ఞాపనము.

శ్రీమాన్ ముద్రణాలయము విజయవాడకు మార్చబడినది. తెలుగు, ఇంగ్లీషులలో అన్ని రకములైన అచ్చుపనులు అందముగ సకాలములో చవుకగ నిర్వహించబడును. వలయువారు ఈ క్రింది చిరునామాకు ఉత్తర ప్రత్యుత్తరముల జరుప గోరెదము.

మేనేజరు
శ్రీ మాన్ ముద్రణాలయము.
భావనారాయణవీధి, విజయవాడ.
(కృష్ణాజిల్లా)

## శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘ పైసాపండు

(ఈ నెలలో యిచ్చినవారి నామము)

### మైలవరం

| | | | |
|---|---|---|---|
| శ్రీ శ్రీ శ్రీ సూరపునేని శ్రీవరసుంగ | | బడే | 0-2-0 |
| య్యమ్మారావు జమీందారిణిగారు-రూ | 2-10-0 | గొల్ల | 0-2-0 |
| బాలమ్మ | 0-2-0 | చాకలి | 0-2-0 |
| రంగమ్మ | 0-2-0 | మొత్తం | 3-4-0 |

శ్రీమతే రామానుజాయ నమః

# భక్తి నివేదన

వేదాంత మాస పత్రిక

సంపుటి ౪ | నందన-మార్గశిరమాసం | సంచిక ౯

# గృహస్థుడు-ముముక్షుత్వము

జిజ్ఞాసువు: శ్రీమాన్ శివకోటి లక్ష్మీనరసింహంగారు.

ప్రశ్న:— ముముక్షువగు గృహస్థునకు ముఖ్యధర్మమేది?

సమాధానము:— "శ్రీమన్నారాయణ"

ధర్మము రెండు విధములు. ప్రవృత్తిధర్మము నివృత్తి ధర్మము అని, ప్రవృత్తి ధర్మములో గృహస్థాశ్రమము మిక్కిలిప్రశస్తమైనది. ముముక్షుత్వము ప్రవృత్తి ధర్మనిష్ఠులకు, నివృత్తి ధర్మనిష్ఠులకు కూడ నుండవచ్చును. గాని నివృత్తి ధర్మములలోనే చివరకుచేరును. గాన గృహస్థాశ్రమము, ముముక్షుత్వము ఈ రెండింటియొక్క సమ్మేళనము బహువిచిత్రమైనది. జీవితములో కొంత పారమార్థిక దృష్టికలిగి అతి జాగ్రత్తగా తన శీలమును పరీక్షించుకొనుచు జీవితయాత్రను గడుపుకొను వానియందు గాని ఈ రెండింటి సమ్మేళనము కుదురదు, నిజమైనశ్రీవైష్ణవులలో ఈ సమ్మేళనము సహజమై స్వరూపప్రయుక్తమై యున్నను, అయినను దానిని నిలబెట్టుకొని సదా అనుసరించుటకు మంచి దృఢాధ్యవసాయము, అవిరత ఆసక్తి ప్రయత్నము యుండవలయును.

ఇందులకు కొన్ని ఉపాయము లేవియన;— ఇంటిలో తిరువారాధన ముండవలయును. ప్రతి నిత్యము తానే స్వయముగ తిరువారాధన మాచరించుచుండవలయును. భోజనము, నిద్ర, సంతానోత్పత్తి, సుఖ-దుఃఖానుభవములు ఇవి ఎటుల వ్యక్తిగతములో ఇతరులచే చేయించ వీలులేనివో అటులనే తిరువారాధనను కూడ

స్వయముగా చేయ వలశిన దే గాని పరులచే చేయించుట తగదు. మన కుటుంబమునకు అసలైన యజమాని తిరువారాధనమున ఆరాధించబడు పెరుమాళ్ళే రాబడేగాని వినియోగమేకాని ఆదాయేగాని ఖర్చే గాని లాభమేగాని నష్టమే గాని, సుఖమే గాని దుఃఖమే గాని, మానమే గాని అవమానమే గాని ప్రతిదినమున అన్నింటిని ఆ పెరుమాళ్ళకు నివేదించు చుండవలయును. పెరుమాళ్ళకు నివేదించకుండగ ఏ పనిని చేయరాదు. కుటుంబపు పెద్ద యజమానియగు ఆ పెరుమాళ్ళకు అర్చకుడు. తన భార్య, బిడ్డలు, అన్నలు, దమ్ములు, అక్కలు, చెల్లెండ్లు వగైరా బందువర్గమంతయు పరిచారకులు ఇళ్ళు వాకిళ్ళు ఆస్తి సొత్తు అంతయు పెరుమాళ్ళదే.

ఈ భావనతోనే తన జీవితమునంతను గడుపవలయును. ఈ భావనాతిశయానుష్టానముచే నిష్కాముడవ్వ కలుగును. దానిచే కర్మబంధ విముక్తుడగును. అవిద్య నశించును. క్రమముగా కర్మ రుచి, వాసనలు నశించును. చివరకు ఆత్మా ఆత్మీయముల పూర్తిగ నిజముగ పెరుమాళ్ళకు సమర్పించగల సామర్థ్యము కలుగును.

ఇట్టిస్థితియే నిజమైన ముముక్షుత్వము. ఈస్థితి స్థిరపడినచో గాని ముక్తి కలుగదు.

ఆత్మా-ఆత్మీయ సమర్పణకు కాంతా-కనకములయందు కాంక్ష విడువవలయును.

ఈ అస్తిపంజరముయొక్క అస్తిరత్వమును, దీని స్వరూప స్వభావములను, దీని నిర్మాణ కూడికను బాగుగా ఆలోచించి పర్యాలోకన జేయుటచే కాంతా విషయక కాంక్ష తొలగ గలదు.

ఒక ధాన్యపు గింజను మంచికాలములో మంచి ప్రదేశమున నాటుట వలన మూడు మాసములలో ఆ వక్క-గింజయే ఎదిగి చెట్టయి ఏడున్నొందల ముప్పదియారు గింజల నిచ్చును. ఆవిధముగానే మంచికాలమున, సత్పాత్రునకు మనమిచ్చిన ఒక దమ్మిడి జన్మాంతరమున తిరిగి కొన్నివేల రూపాయల రూపముగ పెరిగి మనకే సంక్రమించును.

ఒకే వ్యక్తికి ఒకే క్షణమున ఒక దేశమున ఇద్దరు కవల పిల్లలు పుట్టుచున్నారు. అందులో వకడు మహారాజగును. మరివకడు దరిద్రుడగును. ఇందులకు కారణమేమి? వారు వారు పూర్వజన్మమున జేసుకున్న దానధర్మ విశేషములే కారణము. మనకు ఆదాయములోను ఆరుభాగముల జేయవలయును అందొక భాగమును యింటికి వచ్చిన అధితి-అభ్యాగతసత్కారములకు, ఒక భాగమును శాశ్వతమైన సత్పాత్రదాన ధర్మములకు, ఒక భాగమును నిల్వకు, ఒకభాగమును బంధువర్గ పోషణకు, ఒక భాగమును తన సొంత అనుభవమునకు వినియోగించుకొను చుండవలయును.

కర్ణుడు దుర్యోధనుని ఆశ్రితుడు, మిత్రుడు, సహాయుడు, రక్షకుడును, అందుచే గర్భదరిద్రుడైనకర్ణుని నివాసమునకై తన గొప్పతనమునకు తగినటుల ఒక క్రొత్త రాజభవనమును దుర్యోధనుడు కట్టించి కర్ణునకిచ్చెను.

ఒక బ్రాహ్మణుడు తన యజ్ఞమునకు కావలశిన వంటచెరుకు దుర్యోధనుని యాచించెను. కావలశినంత వంటచెరుకు తనవద్దనుండి గొని పొమ్మని దుర్యోధనుడు బ్రాహ్మణునితో ననెను ఇపుడు వలదనియు యజ్ఞసమయమున వచ్చిగొని పోవుదునని బ్రాహ్మణుడు పలికి వెళ్ళిపోయెను. ఆ బ్రాహ్మణుడు తిరిగి మంచి వర్షకాలమున వచ్చి దుర్యోధనుని అతను వాగ్దానము చేశిన వంట చెరుకును యివ్వమనెను. అపుడు దుర్యోధనుని వద్ద బ్రాహ్మణునకివ్వ తగినంత వంట చెరుకు లేకుండుటచే యిపుడివ్వజాలను మరొకప్పుడు రమ్మనమని దుర్యోధనుడనెను. బ్రాహ్మణుడు దుర్యోధనుని నమ్ముకొని యజ్ఞమారంభించియుండెను. దుర్యోధనునివలన నాస్తిశబ్దమును విని ఖిన్నుడై ఇంతలో కర్ణుని విషయము స్మృతికి గోచరించగా వెంటనే కర్ణుని వద్దకు వెళ్ళి జరిగినదంతయు చెప్పి ఎటులైనను తన యజ్ఞమును పూర్తియగునటుల చేయగోరెను. కర్ణుడు పూటబత్తెగాడు. ఏ పూటబత్తె ఆపూట దుర్యోధనుడు పంపవలశినదియే. ఇట్టి స్థితిలో యజ్ఞమునకు కావలశిన కలప అతనివద్ద ఏది? అతని స్వాధీనమందున్న దెల్ల ఆరాజభవన మొక్కటియే. అతను వెంటనే ఆ బ్రాహ్మణునితో ఆ భవనమును పడగొట్టి దాని కలపనంతను వంట చెరుకునకై పట్టుకొని పొమ్మనెను. బ్రాహ్మణుడటులనే జేసి ఆ కలపనంతను బండ్లపై వేసుకొని పోయెను. ఇది తెలుసుకొని దుర్యోధనుడు కర్ణుని పిలిచి ఇదేమి యని అడిగెను.

అందులకు కర్ణుడిటులనెను. రాజా ఈ భవనమును నేనుకోరగా వచ్చినది కాదు. నా పాద్దాను సారముగ నీకు సంకల్పము కలిగినది. నీవిచ్చితివి. ఇంకను దానిని వృద్ధిపరచుకొనగోరి నేను దానిని దానమొనర్చితిని! ఆ మాటలు విని దుర్యోధనుడు తనకీపాటి తెలివి సాహసము లేనందులకు చింతించి, తన గౌరవ, మిత్రత్వ రక్షణకై తిరిగి వెంటనే మరొక పెద్ద రాజభవనమును కర్ణున కిచ్చెను.

దానమువలన ధనము పెరుగునే గాని ఎన్నటికిని తరుగదు. ఇట్టి నడవడియే గృహస్థుడగు ముముక్షువునకు కర్తవ్యము. సర్వేశ్వరునికి ప్రీతితో మన ఆత్మను ఆత్మీయులను సమర్పించవలెను. దానికి మారుగ సర్వేశ్వరుడు కూడ తిరిగి మనకు మోక్షరూపమున తనసర్వస్వమును నొసంగును.

# యాజ్ఞవల్క్యుడు

"శ్రీమన్నారాయణ"

సర్వతోముఖ పాండిత్య ప్రభావము కలిగి, పాదాక్రాంతులైన ప్రభువరేణ్యులు గలవాడై, జనకాది పరమవిరాగ కర్మయోగులకు గురువరేణ్యుడై విరాగశిరోమణియై, ముముక్షువై, మోక్షప్రతిపాదక సహస్రాధికర చయితయై, శుక్ల యజర్వేద మాతా పితయైన బ్రహ్మర్షి సత్తముడు యాజ్ఞవల్క్యుడు ఈయన బ్రాహ్మణవంశ సంభవుడు, ఈయనతండ్రి బ్రహ్మరాతి తల్లి సుదంద, ఈయన బుద్ధిలో బృహస్పతిని కార్యసాధన నైపుణ్యపట్టుదలలో హనుమంతుని వైరాగ్యమున శ్రీశుకుని మించినవాడు,

వ్యాసమహర్షి శిష్యుడగు శాకల్యుని యొద్ద ఈయన (కృష్ణ) యజుర్వేదమును నభ్యసించుచుండెను, గాని వేష, భాషలు శృంగారపురుషునివలె యుండెడివి, శాకల్యుడు ఆదేశపురాజగు సుప్రియునకు పురోహితుడై యుండెను, రాజునకు అసాధారణమగు దారుణమగు వ్యాధి సంభవించెను, ఔషధచికిత్స కెంతమాత్రము ఆవ్యాధి తగ్గలేదు.

రాజు శాకల్యుని బిలిచి జపహోమాది శాంతి క్రియలచే తనవ్యాధిని నివారింప ప్రార్థించెను. శాకల్యుడు వృద్ధుడగుటచే తన ముప్పదిమంది శిష్యులచేతను దినమునకు ఒక్కొక్కరిచే జపహోమాదుల నొనరింపజేసి తత్తీర్థమును రాజునకు బంపుచుండెను.

ఒకనాడు యాజ్ఞవల్క్యుని వంతు వచ్చెను. "రాజు నన్ను పరాభవించినచో నేనేమి చేయవలయును" అని యాజ్ఞవల్క్యుడు తీర్థమును తీసుకొనువెళ్ళు సమయమున గురువు నడిగెను.

"చేయుట కేమున్నది? నీవు తిరిగి ఆరాజు గుమ్మ మెక్కవలదు" అని శాకల్యుడు సెలవిచ్చెను. చిత్తమని యాజ్ఞవల్క్యుడు తీర్థకలశము నెత్తుకొని రాజునొద్దకు వెళ్ళెను,

రాజునకు వ్యాధి హెచ్చుచుండెనే గాని ఏ మాత్రము తగ్గలేదు, అందుచే రాజు మంత్రతీర్థవిషయమున కూడ విసుగుజెంది యుండెను.

ఆనాడు తనవద్దకువచ్చిన శృంగార పురుష వేషముతో నున్న యాజ్ఞవల్క్యుని జూచుటతోడనే రాజునకు మరింత విసుగుజనించెను, రాజు యాజ్ఞవల్క్యుని బాహ్యవేషమును మిక్కిలి అసహ్యించుకొని చాల పరుషములగు మాటలతో నాతనిని పరిభవించెను, యాజ్ఞవల్క్యుడు శాంతముతో నా పరుషవాక్యములను సహించి "నా బాహ్యవేషముతో నీకేమిపని? నాగురువుగారు నీకే మంత్రతీర్థ మివ్వుమని పంపిరి. దీని నేమిచేయమందువు? అని యడిగెను.

"అదిగో అచ్చట పాతపడియున్న కట్టుకొయ్యపై పారబోసి పొమ్ము" అని రాజు విసుగుతో ననెను,

అంత నమ్మహర్షి శిఖామణి దివం మూలేతి" త్యాది మంత్రము నుచ్చరించి యాకట్టుకొయ్యపై మంత్రతీర్థమునుపోసి వెళ్ళిపోయెను, రెండు ఘడియ లగునరికి ఆకట్టుకొయ్య కడిమి చెట్లై చిగిర్చి కొమ్మలు రెమ్మలు దివ్యపరిమళభరిత

కుసుమితమై ఫలవంతమై విరాజిల్లెను. రాజు విస్మితాక్రాంతుడై విచ్చుబోయి విలోకించు చుండెను,

అంత రాజునకు యాజ్ఞవల్క్యుని ప్రతిభా ప్రభావము తెలిసెను. యాజ్ఞవల్క్యుని పరిభవించినందులకు చాలవిచారించెను. అనంతోద్రేక ము. తాను స్వీకరించియున్నచో వ్యాధి నిర్మూలించి తానుకూడ ఆజీవరహితమైన కొయ్య సజీవమైనటుల సంపూర్ణారోగ్యవంతుడనై యుందు నుగదా యని తనబుద్ధిహీనతకు మిక్కిలివగచెను

రాజు తానుచేసిన పని తెలివిమాలిన పనిని క్షమించి, తిరిగి యాజ్ఞవల్క్యుని తిరిగి తనవద్దకు పంపుమని గురువునకు కబురు పంపెను, గురువు యాజ్ఞవల్క్యుని బిలిచి రాజువద్దకు వెళ్ళుమనెను గాని యాజ్ఞవల్క్యుడా! అటుల వెళ్లువాడు గురువు మొదట తనకిచ్చిన బాస ననుసరించి యాజ్ఞవల్క్యుడు రాజునొద్దకు వెళ్ళననెను. అది తెలుసుకొని రాజేయాజ్ఞవల్క్యుని వద్దకు స్వయముగ వచ్చి తిరిగి తనకు మంత్రతీర్థమివ్వ మిక్కిలి ప్రార్థించెను. గురువగు శాకల్యుడు యాజ్ఞవల్క్యునితో రాజును అనుగ్రహించ బోధించెను, గాని యాజ్ఞవల్క్యుడు వినలేదు. రాజును గురువును కూడ తిరస్కరించెను.

శాకల్యుడు కోపోద్దీపితుడై "నేను నీకిచ్చిన వేదవిద్యను తిరిగి నాకిచ్చివేయుమని తీండ్రించెను,

యాజ్ఞవల్క్యుడు గురువిచ్చిన విద్యను వాంతి యొనర్చెను,

గురువు తక్కిన శిష్యులతో ఆవాంతించిన విద్యను గ్రహించ నాజ్ఞాపించెను, ఆ శిష్యులు తిత్తిరిపక్షిరూపము దాల్చినవారై ఆవాంతిని గ్రహించిరి. అందుచే ఆవేదశాఖకు "తైత్తిరీయ"మని పేరువచ్చెను.

పిమ్మట యాజ్ఞవల్క్య యోగీంద్రుడు సూర్యభగవానుని ఉపాసించి ఆయన యనుగ్రహమనే తిరిగి వేదభాగముకు సంపాదించెను.

సూర్యసంపాదిత మగుట వలనను, కృష్ణయజుస్సువలె గాకుండగ, మంత్రబ్రాహ్మణ భాగములు క్రమానుసారముగను అర్థప్రయోజనాది విస్పష్ట కాంతివంతముగను వెలువరింపబడుటచే ఈ యాజ్ఞవల్క్యవేదమునకు శుక్ల యజుస్సను నామధేయము కలిగెను.

యాజ్ఞవల్క్యుడు తన సమానకాలికులగు బ్రహ్మర్షులందరను జయించ బ్రహ్మిష్ఠుడాయెను, ఈయన కనేకమంది శిష్యులుండిరి, ఈయన శిష్యులలో ద్వైతులు, అద్వైతులు, విశిష్టాద్వైతులు గలరు.

ఈయన ప్రవర్తింపజేసిన బ్రాహ్మణ. క్షత్రియవంశములనేకములు.

శ్రీరామచంద్రుడు, జనకచక్రవర్తి, శ్రీకృష్ణభగవానుడు వీరందరుకూడ శుక్లయజుశ్శాఖీయులే.

ఈయన శిష్యులలో కాణ్వులు, మాధ్వాదినులు అని రెండు తెగలవారు గలరు, కణ్వుడు ఈయనకు ప్రథమ శిష్యుడగుటచే తచ్ఛాఖీయులను ప్రథమశాఖీయులని కూడ వ్యవహరింతురు

యాజ్ఞవల్క్యుడు రచించిన బృహద్మోపదేశ గ్రంథము లనేకములు. మాధ్యందినశాఖీయ గ్రంథములు పెక్కు ఉత్తరహిందూస్థానమందు గలవు. గాని దక్షిణప్రాంతమందు బహుళప్రచారముగల కాణ్వశాఖీయులకు సంబంధించిన గ్రంథములు మాత్రము చాలతక్కువగ నున్నవి. చక్రాంకనమునకు ప్రబలప్రమాణమైన చక్రబ్రాహ్మణము ఈశుక్లయజుస్సగు శతపథబ్రాహ్మణములోనిదే మరియు ప్రచారములోనున్న కాణ్వశాఖీయ శతపథ బ్రాహ్మణమున మోక్షప్రధానోపయుక్తమైన 'చక్రబ్రాహ్మణాది' భాగవములు లుప్తమైయున్నవి. ఇందులకు కారణమేమియో తెలియుటలేదు.

ఈగాథయె కొద్దిమార్పులతో భారతమందు యిటుల యున్నది.

వ్యాసునికి వైశంపాయనుడు ప్రియశిష్యుడు, వైశంపాయనుడు తన మేనల్లుడగు యాజ్ఞవల్క్యునకు వేదవిద్యల నెల్లనేర్పెను. యాజ్ఞవల్క్యుడు సూర్యునివలన తిరిగి వేదముల సంపాదించి అనేకమంది శిష్యుల కుపదేశించెను. దీని వలన యాజ్ఞవల్క్యునిపై వైశంపాయనకుననూయ జనించెను. దీనివలన జనకుని యజ్ఞమందు వీరిద్దరకు యజ్ఞదక్షిణ విభాగమున వివాదజనించగ, వైశంపాయనుడు తన వేదముల తన కివ్వమనెను. వెంటనే యాజ్ఞవల్క్యుడు ఆయనవద్ద నేర్చిన వేదముల గ్రక్కగా వైశంపాయునని యాజ్ఞచే ఆయనయొక్క మిగత శిష్యులు తిత్తిరిపక్షులై దానిని గ్రహించిరి. గాన ఆవేదము తైత్తరీయమనబడెను.

విష్ణుపురాణ మందిటుల యున్నది,

యాజ్ఞవల్క్యునకును పైలునకు వివాదము కలుగగా పైలుని గురువగు వ్యాసుడువచ్చి తన వలన బడసిన వేదముల తిరిగి తనకిచ్చి వేయమనగా యాజ్ఞవల్క్యుడు వానిని గ్రక్కివేసెను. తోడనే వ్యాసుని యిద్దరు శిష్యులు తిత్తిరిపక్షులై దానిని మ్రింగిరి. ఈయుగవురే తైత్తరీయోనిషత్ప్రారకులు.

విద్యకు సాటియైన కన్నులేదు.
సత్యమునకు సాటియైన తపస్సు లేదు.
రాగమునకు సాటియైన దుఃఖము లేదు,
త్యాగమునకు సాటియైన సుఖములేదు.

పాపకర్మలనుండి నివర్తించుట,
పుణ్యశీలమె ఎడతెగక కలిగియుండుట,
మంచి నడవడి, మంచి శిష్టాచారము
ఇవియె ఉత్తమమగు శ్రేయము.

శ్రీమతేరామానుజాయ నమః

# ప్రాతర్నిత్యాను సంధేయ శ్లోకములు.

ఈక్రింది శ్లోకములను తాత్పర్యమును స్మరించుచు ఉదయమున మెలకువరాగానే అనుసంధించవలెను

ఉత్తిష్ఠోత్తిష్ఠ గోవింద :
ఉత్తిష్ఠ గరుడధ్వజ !
ఉత్తిష్ఠ రమయా కాంత !
త్రైలోక్యం మంగళం కురు ॥

తాత్పర్యము.

గోవిందా ! లెమ్ము. లెమ్ము.
గరుడధ్వజా ! లెమ్ము.
సుందరుడా ! లక్ష్మితో కూడ లెమ్ము.
ముల్లోక వాసులకును శుభము తొనగూర్పుము.

## హర్యష్టకం.

1 శ్లో. హరి ర్హరతి పాపాని ।
దుష్ట చిత్తైరపి స్మృతః ।
అనిచ్ఛయాపి సంస్పృష్టో ః
దహత్యేవహి పావకః ॥

తెలియక ముట్టుకొనినను నిప్పుకాల్చునట్లు, దుర్మార్గులైనను తనను తలంచినచో శ్రీహరిపాపాపముల పారద్రోలును.

2 శ్లో. సగంగా స గయా సేతుః
స కాశీ స చ పుష్కరం ।
జిహ్వాగ్రే వర్తతే యస్య ।
హరి రిత్యక్షరద్వయమ్ ॥

హరియను రెండక్షరముల నెల్లప్పుడను స్మరించుచుండుటయే గంగాది పుణ్యనదీ స్నానఫలము గయ. సేతువు, కాశీ, పుష్కరాది క్షేత్ర సందర్శనఫలము.

3. వారాణస్యాం కురుక్షేత్రే
నైమి శారణ్య ఏవచ
యత్కృతం తేన యేనోక్తం
హరి రిత్యక్షర ద్వయమ్॥

కాశీ, కురుక్షేత్రము, నైమిసారణ్యము మొదలగు పుణ్యభూములయందు గావించిన సత్కర్మయొక్క ఫలము "హరి" యను నక్షరముల ననుసంధించుటచేతనే కలుగును.

4. పృధివ్యాం యాని తీర్థాని
పుణ్యాన్యాయ త నానిచ
తాని సర్వాణ్యా శేషాణి
హరి రిత్యక్షర ద్వయమ్॥

హరియను రెండక్షరములే భూమియందుండు సకల పుణ్యనదులున్ను, సమస్త దివ్యదేశములున్ను అగుచున్నది.

5. గవాం కోటి సహస్రాణి
హేమకన్యా సహస్రకం
దత్తంస్యా త్తేన యేనోక్తం
హరి రిత్యక్షరద్వయమ్॥

హరియను రెండక్షరములను సంధించుట లెక్కలేని గోదానములను లెక్కలేని సర్వాభరణాలంకృత కన్యాదానములను గావించినంత ఫల మొసంగును.

6. ఋగ్వేదోఽథ యజుర్వేదః
సామవేదో హ్యథర్వణః
అధీతస్తేన యేనోక్తం।
హరి రిత్యక్షర ద్వయమ్ ।

హరియను రెండక్షరముల నుచ్చరించినచో ఋగ్యజు స్సామా దధర్వణవేదములను నాల్గింటిని అధ్యయనము చేసినంత పుణ్యము లభించును.

7. అశ్వమేధైర్మ హాయజ్ఞైః।
నరమేధై స్తథైవచ।
ఇష్టం స్యా త్తేన యేనోక్తం
హరి రిత్యక్షరద్వయమ్॥

హరియను రెండక్షరముల ననుసంధించువాడు అనేక అశ్వమేధములను, నరమేధములను పంచమహాయజ్ఞములను బడయగలడు.

8. ప్రాణప్రయాణ పాథేయం।
సంసార వ్యాధినాశనం।
దుఃఖాత్యన్త పరిత్రాణం।
హరి రిత్యక్షర ద్వయమ్॥

హరియను రెండక్షరములు జీవుడు ఊర్ధ్వలోకములకు గావించు ప్రయాణములో దారిబత్యమగును. సంసారమనెడు దీర్ఘవ్యాధిని నశింపజేయును. ఇక నెన్నడును దుఃఖములు పుట్టకుండ జేయును. (అనగా మోక్షము నిచ్చును.)

9. బద్ధః పరికర స్తేన
మోక్షాయ గమనం ప్రతి
సకృదుచ్చారితం యేన
హరిరిత్య క్షరద్వయమ్॥

ఒక్కసారి హరి యన్నచో మోక్షమునకు మూట గట్టినట్లే,

10. హర్యష్టక మిదం పుణ్యం
ప్రాత రుత్థాయయః పఠేత్।
ఆయుష్యం బల మారోగ్యం।
యశోవృద్ధి శ్శ్రియావహమ్॥

ఈపుణ్యప్రదమగు హర్యష్టకస్తోత్రమును వేకువనేలేచి యనుసంధించువానికి దీర్ఘాయుర్దాయము, శరీరమానసబలము, ఆరోగ్యము, కీర్తి, ధనము వృద్ధిపొందును.

11. ప్రహ్లాదేన కృతం స్తోత్రం।
దుఃఖసాగర శోషణం।
యం పఠేత్ స నరో యాతి
తద్విష్ణోః పరమం పదమ్॥

ప్రహ్లాదునిచే కూర్చబడిన యీస్తోత్రము సముద్రమంతటి దుఃఖము నైనను నిముషములో నెండించివేయును. దీని ననుసంధించువాడు శ్రీ విష్ణునివాసమగు పరమపదము నధిరోహించును.

## —♦ శ్రీ కృ ష్ణా ష్ట క ము ♦—

1 శ్లో. వసుదేవసుతం దేవం।
కంసచాణూర మర్దనం।
దేవకీ పరమానన్దం ।
కృష్ణం వందే జగద్గురుమ్॥

వసుదేవుని కుమారుడును సృష్టిస్థితిలయాదు లాటలుగా గలవాడును కంసునివంటి దుష్టులను తత్సహచరులగు చాణూరాదులను సంహరించువాడును, దేవకీదేవికి నిరతిశయానంద ప్రదుడును గీతోపదేశముచే ప్రజలయజ్ఞానాంధకారమును పోద్రోలిన శ్రీకృష్ణుని సేవించుచున్నాను.

2. అతసీ పుష్పసంకాశం
హారనూపుర శోభితం
రత్నకంకణ కేయూరం
కృష్ణం వందే జగద్గురుమ్॥

చీకటిపువ్వువలె నల్లనిశరీర కాంతిగలవాడును. వక్షస్థలము ముత్యాలహారములతోను, పాదములు అందెలతోను, ముంజేతులు రత్నపు మురుగులతోను, దండలు మాణిక్య భుజకీర్తులతోను ప్రకాశించుచున్న జగదాచార్యుడగు శ్రీకృష్ణుని సేవించుచున్నాను.

3, కుటిలాలిక సంయుక్తం
పూర్ణచన్ద్రనిభాననం।
విలసత్కుండల ధరం।
కృష్ణం వందేజగద్గురుమ్॥

వంకరతిరిగిన ముంగురులతో కూడి పూర్ణిమ చంద్రునివలె నున్న ముఖము కలవాడును, చకచకలాడు కుండలములు గలవాడును నగు జగదాచార్యుడైన శ్రీకృష్ణుని సేవింతును,

4. మందారగంధ సంయుక్తం।
చారుహాసం చతుర్భుజం।
బర్హిపింఛావ చూడాంగం।
కృష్ణం వందే జగద్గురుమ్॥

మందారమనెడు దేవతపువ్వువలె ఘుమఘుమలాడువాడును, మనోహరమగు చిరునగవు గలవాడును, నాలుగు భుజములు గలవాడును, నెమలి పింఛమును శిరోభూషణముగ నలంకరించుకొనిన జగదాచార్యుడగు శ్రీకృష్ణుని సేవించుచున్నాను,

5. ఉత్ఫుల్ల పద్మపత్రాక్షం।
నీలజీమూత సన్నిభం।
యాదావానాం శిరోరత్నం।
కృష్ణంవందే జగద్గురుమ్॥

వికసించిన తామరరేకులవంటి కండ్లుగలవాడును, నల్లని మేఘమువంటి వాడును, యదువంశీయులకు శిరోభూషణమైన జగద్గురువగు కృష్ణుని సేవింతును.

6. రుక్మిణి కేళిసంయుక్తం।
పీతాంబర సుశోభితం।
అవాప్త తులసీ గంధం।
కృష్ణం వందే జగద్గురుమ్॥

రుక్మిణీదేవితో క్రీడించువాడును, పచ్చనిబట్టలతో విలసిల్లువాడును, తులసితో పరిమళించువాడును అగు జగద్గురుడగు కృష్ణుని సేవించుచున్నాను.

7. గోపికా నాంకుచద్వంద్వ
కుంకుమాంకిత వక్షసం।
శ్రీనికేతం మహేష్వాసం।
కృష్ణం వందే జగద్గురుమ్॥

గోపికల స్తనములయందున్న కుంకుమ యంటియున్న రొమ్ముగలవాడును, లక్ష్మికి నివాసమైనవాడును, గొప్పధనుర్ధరుడు నగు జగదాచార్యుడైన శ్రీకృష్ణుని నమస్కరించుచున్నాను.

8. శ్రీవత్సాంకం మహారస్కం
వనమాలా విరాజితం
శంఖచక్రధరం దేవం।
కృష్ణం వందే జగద్గురుమ్॥

శ్రీవత్సమనెడు గుర్తుగలవాడును, విప్పగు వక్షముగలవాడును, వనమాలతో ప్రకాశించువాడును శంఖచక్రధరుడును నగు జగద్గురుడగు శ్రీకృష్ణుని నమస్కరించుచున్నాను.

## కృష్ణాష్టకం

9. కృష్ణాష్టక మిదం పుణ్యం
ప్రాత రుద్ధాయ యః పఠేత్
కోటిజన్మకృతం పాపం
స్మరణేన వినశ్యతి॥

ఈపరమ పావనమైన కృష్ణాష్టక స్తోత్రమును వేకువనలేచి చదువుకొనువానికిగాని, మానసికముగా తలంచుకొనిన వానికిగాని అంతమాత్రముచేతనే కోటిజన్మల పాపము కూడా నశించును

## రహస్య త్రయసారార్థము

పంచ సంస్కారపరులగు ప్రతివైష్ణవులను ప్రతినిత్యము మంత్రత్రయము ననుసంధించు నపుడు శుష్కహృదయముతో గాక యీక్రింద పొందుపరచిన భావానుసంధానముతో ఆయామంత్రముల ననుసంధించిన కార్యకరము కాగలదు.

## తిరుమంత్రార్థ సంగ్రహము

నేను శ్రియఃపతికి శేషభూతుడను, స్వతంత్రుడనుకాను. నాకు భగవంతుడే రక్షకుడు. నన్ను నేను రక్షించుకొనజాలను. నేను సర్వశేషియగు శ్రీమన్నారాయణునకే అన్నిచోట్లను, అన్నివేళలయందును, అన్ని అవస్థలయందును తగినట్లు సకలవిధ కైంకర్యములను చేయుదునే గాని నాకొఱకై ఏమియు చేసుకొనను.

## (పూర్వార్థము) ద్వయమంత్రార్థ సంగ్రహము.

నేను శ్రీమహాలక్ష్మీదేవిని పురుషకారముగా నాశ్రయించి అమెతో నెన్నడు నెడబాయక యుండు శ్రియఃపతి చరణారవిందములనే ఉపాయముగా నమ్ముచున్నాను. ఆభగవానుడు నేను

ఆశ్రయించుటకు తగిన వాత్సల్యము స్వామిత్వము. సౌశీల్యము. సౌలభ్యము అనెడు గుణములను నా యనిష్టములను తెలుసుకొని పోగొట్టి యభీష్టముల నెఱింగి ప్రసాదించుటకు తగిన జ్ఞానము శక్తి, పూర్తి ప్రాప్తి యనెడు గుణములను పుష్కలముగా కలిగియున్నాను.

(వాత్సల్యమనగా-నాతప్పులను కూడ భోగ్యముగనే ఆదరించుట.

స్వామిత్వమనగా-సొత్తుచెడుచుండజూచి ఉపేక్షించి యుండలేని యొక సంబంధము.

సౌశీల్యమనగా-తన గొప్పతనమును మన నైచ్యమును తలంచుకొనక మనతో అరమరిక లేక కలసి మెలసియుండుట.

సౌలభ్యమనగా-ఎవరికిగాని కంటికి గాన్పించని తాను మనము కంటితో చూచి ఆశ్రయించుటకు తగినట్లు సులభుడై యుండుట.

జ్ఞానము-మనకు పోగొట్టవలసిన యనిష్టములను, ప్రసాదింపవలసిన యిష్టములను తెలుసుకొనుటకుగాను సమస్త పదార్థములను ఒక్కసారిగా చూడదగిన తెలివి.

శక్తి—పనికిమాలిన సంసారిచేతనులను, తనను నిత్యము సేవించు భాగ్యశాలులగు నిత్యసూరులతో పాలతో పాలుకలసినట్లు చేర్చగల నేర్పు,

పూర్తి—మన మిచ్చునదిగాని చేయునదిగాని పుచ్చుకొనియే రక్షించవలసిన యవసరములేని పరిపూర్ణత.

ప్రాప్తి—మనము తనను ఉపేక్షించినను మనను తాను విడిచిపెట్టుటకు వీలులేని సంబంధము.)

(-ఉత్తరార్థము-)

తనవలెనే మనకు ప్రాప్యకోటిలో చేరిన లక్ష్మీదేవితో నెల్లప్పుడు నెడబాయక యుండు సర్వశేషియగు సర్వేశ్వరునకే సర్వదేశ-సర్వకాల-సర్వావస్థలయందును తగునట్లు నానావిధ కైంకర్యములను చేయుచుందునే గాని నాకొఱకై యేపనియు చేసుకొనను.

చరమశ్లోకార్థ సంగ్రహము.

శ్రుతి స్మృతులలో చెప్పబడినది గదా యని నిత్యనైమిత్తిక కర్మలను గాని కర్మ జ్ఞాన భక్తి యోగములనుగాని మోక్ష మిచ్చునను బుద్ధితో నాచరించక పోవుటయేగాక వాటియందలిరుచి వాసనలను కూడ తిరిగి అంకురించకుండనట్లు పూర్తిగా విడిచిపెట్టి ఆశ్రయించుటకు కావలశిన వాత్సల్యము స్వామిత్వము. సౌశీల్యము, సౌలభ్యము అనెడు గుణములుగల నన్నే ఉపాయముగా నమ్ముము. ఇట్లు నన్నే ఉపాయముగా నమ్మియున్న అజ్ఞుడవును, అశక్తుడవును అగు నిన్ను. నీపనుల నారసి చేయదగిన జ్ఞానము, శక్తి, పూర్తి, ప్రాప్తి కలవాడనుగనుక నన్ను చేరనీయక నిన్నాటంకపరచుచున్న సమస్త పాపములనుండియు విడిపింతును. దుఃఖింపకుము.

శ్రీమతే రామానుజాయనమః

జిజ్ఞాసువు:—శ్రీ చిన్నం ఆనమ్మగారు,

"ఆత్మోత్క్రమణ స్థానఫలము"

ప్రశ్న:—ఆత్మ ఈశరీరమును విడిచి పోవునపుడు శరీరమందలి ఏభాగమునుండి బయటకు పోవును? ఏభాగమునుండి పోయిన ఏమి ఫలము కలుగును ? ఆత్మతో కూడ శరీరములోని మరి ఏవేవి కలసి వెడలిపోవును ?

"శ్రీమన్నారాయణ"

సమాధానము:—జీవాత్మ యనునది ఒక విలక్షణమైన ద్రవ్యము అది అతీంద్రియమైనది. సూక్ష్మాతిసూక్ష్మతమ మైనది, దానికి అది నిర్దేశించబడగల రూపముగాని పరిమాణము గాని లేదు. అది విలక్షణ తేజోరూపమైన విశేషము. జ్ఞానస్వరూపమైనది. జ్ఞానగుణకమైనది. పరమాత్మద్వారా పరతంత్రమైనది. ప్రకృతిద్వారా స్వతంత్రమైనది. జనన-మరణ, సుఖ-దుఃఖ, శీతోష్ణ, మానావమానా ద్వంద్వాతీతమైనదే. అయినప్పటికిన్ని అనాదియైన పరిపక్వమైన ప్రారబ్ధకర్మచే ప్రకృతిని తన శరీరముగా గాని ప్రాకృతికమైన దేహ-యింద్రియ-మనో-బుద్ధి-ప్రాణములతో అవినాభావ సంబంధముగలదై వాటికి కలుగుచున్న పైనదెలిపిన ద్వంద్వముల నన్నింటిని తానూకలదై యనుభవించుచున్నది.

ఇది తన కర్మానుగుణముగ ఒక్కొక్క దేహమును విడుచుచుండుట, మరివక దేహములో ప్రవేశించుచుండుట చేయుచుండును, పూర్వదేహ త్యాగమే దీనికి మరణమందురు. తదుత్తర సంబంధమే దీనికి జనన మందురు.

కర్మానుభవము మూడు తరగతులుగ యున్నది.

1. శీఘ్రానుభవము.
2. మధ్యమానుభవము,
3. మందానుభవము.

స్వప్నకాలమందు శీఘ్రానుభవమును; భూలోకమందు మధ్యమానుభవమున్ను, లోకాంతరములయందు మందానుభవమున్ను కలుగుచుండును. ఈదేహమును విడిచిన పిమ్మట జీవాత్మ కర్మానుగుణముగ లోకాంతరములకు జని అచ్చటచ్చటకు తగిన దేహముల కలదై మందానుభవమును యనుభవించును. మానవదేహమందంతటను 72 వేల నాడులు వ్యాపించియున్నవి. సూర్యునికిరణములు ఏఏ ద్రవ్యములచే సృజింపబడినవో ఆయా ద్రవ్యములచేతనే నాడులు కూడ సృజింపబడినవి, అందుచే దేహములోని నాడులకున్న బయటనున్న సూర్యకిరణములకున్ను పరస్పర ఆకర సంబంధము గలదు.

జీవుడు దేహమునుండి బయటకు వచ్చుటకు దేహమందలి నాడులున్ను, బయటకు వచ్చిన పిమ్మట లోకాంతరములు జేరుటకు బయటనున్న సూర్యకిరణములున్ను విద్యుత్ శక్తి ప్రసారమునకు తీగలువలె మార్గములై యున్నవి. సూర్యకిరణములు అండాన్తర్గత లోకములన్నిటియందును కూడ వ్యాపించి యున్నవి.

దేహములోని నాడులన్నియు పరస్పరము చేరుకొని నూరు కొనలుగ రూపొందినవి. ఇవన్నియు ముకుళించిన కమలరూపముగ మానవహృదయ ప్రదేశమున యుండును.

జీవుడు తన కర్మానుగుణముగ ఉత్క్రమణ కాలమందు ఆయానాడులలో ఏదో వకదాని యందు అంతర్యామి ప్రేరణచే బుద్ధి-మనో-ప్రాణ-ఇంద్రియ సహితముగ ప్రవేశించును. ఆప్రవేశించిన నాడి శరీరములోని ఏఅవయవమువద్ద రెండవకొనను కలిగియున్నదో ఆ యవయవమునుండి బయటకువచ్చి దానికి సంబంధించిన బయటి సూర్యకిరణముద్వారా వెళ్ళవలసియున్న లోకాంతరమునకు చేర్చబడును, శరీరమంతయు జీవుడు బయటకుపోగల రంధ్రములు గలదై యుండుటచే శరీరమునందలి ఏభాగము నుండియైనను జీవుడు బయటకు పోగలడు. ఇదిగాక దేహమందలి నాడులలో సుషుమ్న యను ఒక విశేషమైన నాడిగలదు. దానియొక్క ఒకకొన హృదయప్రదేశమందలి ఆ నూరు నాడులకు పైన యుండును. ప్రపన్నునికి యాతని ఉపాసనా ఫలితముగ ఆసుషుమ్నా నాడిచివర ఒక అద్భుతమైన తేజస్సు వెలుగుచుండును. అ నాడియొక్క చివరి కొన శిరస్సునందలి బ్రహ్మరంధ్రమున యుండును, ప్రపన్నునియొక్క ఉత్క్రమణ సమయమున హృదయాంతర్యామి యొక్క అనుగ్రహ ప్రేరణచే జీవుడు తన సహచరులతో సహ సుషుమ్నానాడి ద్వారా బయలుదేరి బ్రహ్మరంధ్రమును బేధించుకొని బయటకువచ్చి తత్సంబంధ సూర్యకిరణము ద్వారా అండభిత్తి వరకువెళ్ళి దానిని బేధించుకొని ప్రకృతి మండలమును అతిక్రమించి పునరావృత్తి రహిత పరమపదమును చేరును. అచ్చటకు చేరిన జీవుడు తిరిగిరాడు. అతనికి జనన-మరణాదు లికయుండవు. మిగతవారందరు తిరిగి పుట్టుచు గిట్టుచు కర్మబద్ధులై కర్మానుభవముగలవారై యుందురు,

జీవాత్మ పాదముల మూలమున నుత్క్రమించెనేని వాడు విష్ణులోకమును పొందును.

పిక్కలనుండి వెడలెనేని వసువుల లోకమును పొందును.

మోకాలి నుండి వెడలెనేని సాధ్యుల లోకమును పొందును.

పాయువు ద్వారా వెడలెనేని మిత్రుని లోకమును పొందును.

జఘనము ద్వారా వెడలెనేని పృథివినే పొందును.

తొడల నుండి వెడలెనేని ప్రజాపతి లోకమును పొందును.

పార్శ్వముల నుండి వెడలెనేని మరుత్తుల లోకమును పొందును.

నాసిక నుండి వెడలెనేని చంద్రలోకమును పొందును,

బాహువుల నుండి వెడలెనేని నింద్ర లోకమును పొందును.

వక్షము నుండి వెడలెనేని రుద్రుని లోకమును పొందును.

మెడ నుండి వెడలెనేని నరుని లోకమును పొందును.

ముఖము నుండి వెడలెనేని విశ్వేదేవతల లోకమును పొందును,

శ్రోత్రముల నుండి వెడలెనేని దిక్కులను పొందును.
ఘ్రాణము నుండి వెడలెనేని వాయులోకమును పొందును.
నేత్రముల నుండి వెడలెనేని సూర్యలోకమును పొందును.
కనుబొమల నుండి వెడలెనేని నశ్వినిదేవతుల లోకమును పొందును.
లలాటము నుండి వెడలెనేని పితృదేవతల లోకమును పొందును.
మూర్ధము నుండి వెడలెనేని బ్రహ్మలోకమును పొందును.
బ్రహ్మరంధ్రము నుండి వెడలెనేని పునరావృత్తి రహిత పరమపదమును పొందును.
సామాన్యముగ శరీర అధోభాగము నుండి వెడలినచో
అధోలోకములను, ఊర్ధ్వభాగము నుండి వెడలినచో
ఊర్ధ్వలోకములను, మల స్థానాదుల నుండి వెడలినచో
నరకాది లోకములను, పొందుదురని చెప్పబడుచున్నది.

---

ధర్మముచే లోభమును విడువుము.
ప్రకృతియొక్క అనిత్యజ్ఞానముచే మోహమును విడువుము.
నీకంటె గొప్పవారిని జూచి మదమును విడువుము.
నీకంటె తక్కువవాని జూచి మాత్సర్యము విడువుము.
సత్యముచే అసత్యమును విడువుము.
నీ అశక్తతను తెలుసుకొని స్వాతంత్ర్యమును విడువుము.
పరమాత్మను దలచుకొని భయమును విడువుము,
లోపములనే తెలుసుకొని సంసారలంపటుత్వమును విడువుము.
నీ పారతంత్ర్యమును తలచుకొని అహంకారమును విడువుము.
భగవంతుని సర్వేశ్వరత్వమును తలచుకొని మమకారమును విడువుము.
భగవంతుని సర్వవ్యాపకత్వమును-తలచుకొని పరహింసను విడువుము.
నీబాధలను తలచుకొని యితరుల బాధించుటను విడువుము.
నీ తప్పులను స్మరించుకొని పరనిందను విడువుము,
నీ కంటె అధికులను జూచి బద్ధకమును విడువుము.
తప్పులను పరికించి అభిమానమును విడువుము.
పంచభూతములను పరికించి ఆసక్తిని విడువుము,
శిష్టాచారమును స్మరించుకొని దురాచారముల విడువుము.
పరమపురుషారాధన కర్మాచరణచే ప్రకృతిని విడువుము.
అర్థపంచక జ్ఞానముచే అజ్ఞానమును విడువుము.
భగవద్భక్తిచే భవబంధముల విడువుము.
శరణాగతిచే జననమరణ క్లేశమును విడువుము.



# నారీవిభాగము



## మోక్షము నెట్లు పడయ తగును?

జిజ్ఞాసువు:—శ్రీమతి మాదాశెట్టి రాధమ్మగారు విజయవాడ.

ప్రశ్న :—మోక్షమనెడు పురుషార్థ స్వరూపమెట్టిది ?

"సమాధానము"

"శ్రీమన్నారాయణ"

వ్యాసమహర్షికి సర్వేశ్వరుని సంకల్పముచే, యజ్ఞార్థమై అగ్నిమథనము జేయుచుండగా ఘృతాచి యను నొక యప్సరసా సందర్శనముచే అరణియందు రేతస్ఖలన మాయెను. వ్యాసుడు దానిని మథించగా అందుండి పంచభూతముల ధిక్కరించు మహాయోగి యగు శ్రీశుకుడు బుట్టెను. వ్యాసుడతనికి వేద-వేదాంగ-వేదాంత-యితిహాస-పురాణముల పఠింపజేసి మోక్ష పురుషార్థస్వరూప జ్ఞానమునకై తన శిష్యుడగు జనకునివద్దకు పంపెను.

జనకుడు చక్రవర్తి, గృహస్థుడు, ప్రవృత్తి మార్గములో నున్నవాడు. అయినను ఆయన మనస్సు నిష్కలమై సదా శ్రీహరి యందే తగుల్కొని యుండెను. సరస్సునబుట్టి, దాని నాశ్రయించుకొనియుండి, దానివలననే పెరుగుచున్న తామరాకు ఆనీటిసంబంధములేనిదై యుండునటులనే జనకచక్రవర్తి కూడ ప్రకృతిలోలీనుడై యున్నప్పటికిన్ని, నివృత్తిమార్గ నిష్ఠాగరిష్ఠుడై, కేవల మోక్ష ధర్మానుష్ఠానపరుడై యుండెను. మహామహులగు మహర్షులకు సహితము శక్యముగాని జ్ఞానానుష్ఠానములు జనకునియందు వెల్లుంగుచుండెను. గనుకనే వ్యాసమహర్షి సహితము తన ఏకైక పుత్రరత్నమును ఆయనకడకు పంపెను. జనకుడు శ్రీశుకుని అనేకవిధముల పరీక్షించి చివరకిటుల నుపదేశించెను.

"మోక్షమార్గము ననుసరించుటకు శాస్త్రజ్ఞానము, లౌకికజ్ఞానము, యుండవలయును. ఈ జ్ఞానము కేవలము గురూపదేశముచే మాత్రమే కలుగును. మరేవిధమునను కలుగజాలదు.

రాజస-తామస దోషముల వర్జింపవలెను. సాత్త్వమార్గము ననుసరించి ఆత్మను దెలుసుకొనవలెను. సర్వభూతములయందు ఆత్మయున్నది

అన్ని ఆత్మల స్వరూపములు నొక్కటియే. గాన సర్వభూతములయందు తన్నును, తన యందు సర్వభూతములను తెన్నగా గనుగొనుచు జలమందలి జంతువులవలె, వానియందు తగులు లేకుండగ నుండవలయును. ప్రతి జీవియందును పరమాత్మ నివసించుచునున్నాడు. పరమాత్మ లేని జీవి యనునది లేనేలేదు. సమాహిత చిత్తము గల ప్రతివాడు పరమాత్మను దర్శించగలడు. ఈ దర్శనమున గాని శాంతి కలుగదు. శాంతి లేని వానికి ముక్తి లేదు.

ఎవ్వని వలన పరులు భయపడరో, పరులవలన నెవ్వడు భయపడడో, ఎవ్వడు ఏ వస్తువాని గోరకయు, ద్వేషింపకయు నుండునో అట్టివాడు పరమాత్మను తెలుసుకొనగలడు. మనస్సు చేతగాని, వాక్కు చేతగాని, కర్మము చేతగాని ఎపుడు సర్వభూతములయందు పాపమగు భావన లేకుండునో యపుడు పరమాత్మను తెలుసుకొనగలడు.

మనస్సును మోహపెట్టినట్టి అసూయను విడిచి, కామమును మోహమును త్యజించినచో పరమాత్మను తెలుసుకొనగలడు. చెవికిని. కంటికిని మరియు తక్కిన యిందిర్యములకును విషయములగు వానియందెల్లను. మరియు సర్వభూతములయందును సముడై ద్వంద్వముల నెపుడు వీడునో యపుడు పరమాత్మను తెలుసుకొనగలడు.

స్తుతిని-నిందను; బంగారమును-ఇనుమును; సుఖమును-దుఃఖమును; చలువను-వేడిని; అర్థమును అనర్థమును; ప్రియమును-అప్రియమును; జీవితమును-మరణమును; సమముగా నెపుడు భావించగలడో యపుడు పరమాత్మను తెలుసుకొనగలడు

తాబేలు తన యవయవముల తనలోనికి ముడుచుకొనునట్టుల ఎవడు తన మనస్సును. యింద్రియములను విషయములనుండి నుపసంహరించుకొనగలడో అట్టివాడు పరమాత్మను తెలుసుకొనగలడు.

చీకటిగ్రమ్మిన యింటిని దీపముచే స్పష్టముగా చూడగలిగినటుల బుద్ధియనెడి దీపముచే తన లోపల యాత్మను చూడ శక్యమగును.

ఇట్టివాడు తనయందలి పరమాత్మను తెలుసుకొని, దానిని దర్శించి, సదా దానినే స్మరించుచుండవలెను. దీనిచే వీని హృదయమందలి గ్రంథులన్నియు చిన్నాభిన్నములగును. సర్వసంశయములు పటాపంచలగును. సమస్త కర్మములు సమూలముగ నశించును. దివ్యజ్ఞానము కలుగును. అట్టి పరమాత్మను నిరంతరము ధ్యానించుము. ఆత్మ-ఆత్మీయుల నాతనికి సమర్పణము చేయవలెను. దీనిచే పరమాత్మప్రీతికి పాత్రుడై ఆయనయొక్క నిర్హేతుక జాయమాన కటాక్షమునకు పాత్రుడై శరీరావసానమున మోక్షమును పొందగలడు. ఏయోగమవలంబించినను ఈ పైన తెలిపిన జ్ఞానానుష్ఠానములున్నగాని మోక్షప్రాప్తి లేదు. అన్ని యోగములు యిట్టి స్థితికై మాత్రమే ఉపకరించును.

★★★

# ధనుర్మాసము — మన కర్తవ్యము

"శ్రీమన్నారాయణ"

శ్రీవిష్ణు భక్తులచే ఆసేతు హిమాచల పర్యంతము అత్యంత ప్రధానముగ భగవద్భాగవత కైంకర్య రూపముగ అనుష్ఠించబడు వ్రత విశేషము ధనుర్మాసవ్రతము - ఇది కేవలము 30 రోజులు మాత్రము, అందును ప్రతిదినము ఉదయమున 2, 3 గంటలు మాత్రము అనుష్ఠించవలసియున్న సు-సులభతను అనుష్ఠాన విశేషము.

పూర్వము గోపికలు శ్రీకృష్ణ పరమాత్మ యొక్క నిత్య-నిరవచ్ఛిన్న సాన్నిధ్య కైంకర్యముల నిమిత్తమై పారస్కర సూత్రానుసారముగ దీనిని యాచరించి తమ యభీష్టసిద్ధిని పొందకలిగిరి.

పిమ్మట ఈ కలియుగమున పెరియాళ్వార్లచే ఉపదిష్టయై శ్రీగోదాదేవి ఈ వ్రతమును 30 దినములు మాత్రము ఆచరించి భగవంతుని సాక్షాత్తుగ పొందకలిగెను.

ఈ వ్రతము సర్వసాధారణ - సులభ - సుసాధ్య - శీఘ్ర - శాశ్వత ఫలప్రద - స్వరూపానుకూలమైన దనుటలో యింతకంటే వేరే రుజువేమి కావలయును ?

గాన, బాగుపడ ఉజ్జీవించ, వాంఛగల ప్రతిజీవియు, వర్ణ-మత-కుల-వయో-నియమములతో భేదము లేకుండగ ప్రతివారును దీనిని ఆచరించిన తరించగలరనుటలో ఎట్టి సంశయము లేదు. శ్రీకృష్ణ పరమాత్మ యొక్కయు, శ్రీ గోదాదేవి యొక్కయు విగ్రహములను తిరువారాధనగ యుంచుకొనుటయు, (వంశపరంపరగా ఆరాధించబడి వచ్చుచున్న శ్రీవిష్ణువు యొక్క యితర ఏ స్వరూపము లున్నను మంచిది) ధనుర్మాసము ప్రారంభము రోజునుండి ప్రతిదినము తెల్లవారు ఝామున గం. 4-0 లకు నిద్ర నుండి లేచి, కాలకృత్యముల తీర్చుకొని, భగవత్ స్మరణ పూర్వకముగ స్నానమాచరించి, మడిబట్టలను ధరించి ఊర్ధ్వపుండ్రములను ధరించుకొని ఆ విగ్రహములకు తిరువారాధనము ప్రారంభించవలయును.

ఆహ్వాన-స్వాగత-ధ్యాన, ఆసన-అర్ఘ్య-పాద్య-ఆచమనాదులను సమర్పించి, ఉపనీతులు పంచసూక్తములతోను, మిగతావారు కేవల నీరాట్టముతోను స్నానమును సమర్పించవలయును. పిమ్మట ప్లోతవస్త్ర - వస్త్రయుగ్మ - ఊర్ధ్వపుండ్ర - యజ్ఞోపవీత - చందన-అలంకారాదుల సమర్పించవలయును-పిమ్మట శ్రీకృష్ణ-శ్రీరామ-శ్రీలక్ష్మీ అష్టోత్తరశతనామములతో తులసి-పుష్పములతో అర్చన చేయవలయును.

అవకాశమున్నవారలు శ్రీవిష్ణు సహస్ర నామములతోను, శ్రీగోదా అష్టోత్తర శతనామములతోను కూడ అర్చించుటగలదు-

పిమ్మట ధూప, దీప, సమర్పణములజేసి వేదవిన్నపమునుజేసి పొట్టుపెసరపప్పు, బియ్యము కలిపి వండిన పొంగలిని ఆరగింపు చేయవలయును– పిమ్మట తొండరడిప్పొడియాళ్వార్లు సాయించిన తిరుపళ్ళియెళుచ్చి అను 10 పాశురములను, శ్రీగోదాదేవి సాయించిన తిరుప్పావై ప్రబంధములోని 28 పాశురములను భక్తులందరు కలసి సమిష్టిగ మున్నడి పిన్నడి రూపముగ సేవకాలము చేయవలయును– పిమ్మట దధ్యోజనమును ఆరగింపు చేయవలయును – పిమ్మట తాంబూలమును సమర్పించి శ్రీగోదాదేవి సాయించిన తిరుప్పావై ప్రబంధములోని 24 పాశురమగు "అన్రి యివ్వులగుం" అను పాశురముతోను, మంగళాశాసన శ్లోకములతోను హారతిని సమర్పించవలయును–పిమ్మట తాంబూలమును సమర్పించవలయును. పిమ్మట మంత్ర పుష్పమును సమర్పించి, తిరుప్పావైలోని, చివరి రెండుశాత్తు పాశురములను చామరకైంకర్యము చేయుచు విన్నవించవలెను–

తరువాత హారతినిచ్చుచు తిరుప్పావై ప్రబంధములోని ఒక్కొక్క పాశురమును ఒక్కొక్క రోజున చెప్పిన క్రమప్రకారముగ రెండేసి పర్యాయములు చెప్పిన విన్నవించవలయును – పిమ్మట తిరుప్పావైలోని "నీళా తుంగ" తనియను విన్నవించవలయును. పిమ్మట క్షమాప్రార్థనయు, తీర్థ ప్రసాదముల వినియోగమును జరుపవలయును–ఆసమయమున గోదాచతుశ్లోకి స్తోత్రమును తప్పకుండగను తదితర స్తోత్రములను యథావకాశముగను విన్నవించవలయును – ఎంత సావకాశముగ జేసినను 1½ మొదలు 2 గంటలకంటె ఎక్కువ వ్యవధి యిందులకు అవసరము లేదు.

చలికాలములో తెల్లవారు ఝామున లేచుట తప్ప ఈ ధనుర్మాస వ్రతాచరణలో ఎట్టి కష్టనిష్ఠూరములున్ను లేవు. సంవత్సరమునకు ఒక పర్యాయము ఒక నెలమాత్రము. ఈ మాత్రము చేయజాలనిచో, మనము ఎట్లుతరించగలుగుదుము ? వంటజేసి విస్తరిలో సిద్ధముగ యుంచిన అన్నమును మ్రింగుట కూడ కష్టమును కొనువానికి ఆకలి తీరుట దుర్ఘటమే కదా! ముముక్షువునకు ఈ కలికాలమునందింతకంటెను సులభమైనట్టియు, స్వరూపానుకూలమైనట్టియు తరించు మార్గమేదియు లేదు.

గోష్ఠికి తీర్థప్రసాదముల వినియోగమొనర్చిన పిమ్మట యజమాని తానుకూడ స్వయముగ తీర్థమును, ప్రసాదమును స్వీకరించ వలయును.

సంధ్యావందనము జపాదులు కలవారు కూడ తీర్థముతోపాటుగ కణమాత్రముగ ప్రసాదమును కూడ గ్రహించి అటుపిమ్మటనే ఆయా నిర్దిష్ట సక్రమకాలములలో సంధ్యావందనజపాదులను చేసుకొనవలెను.

ఈ వ్రతదీక్షలో అర్చనాంగ ప్రయుక్తమైన ప్రసాదకణ స్వీకరణము సంధ్యావందనాదికములకు ముందుగ చేయుటలో దోషములేదు.

పిమ్మట ఆరోజు పాశురమునకు అర్థముతోను వ్యాఖ్యానముతోను కాలక్షేపము చేయవలయును. తిరుప్పావునకు ఇరాయిరప్పడి, మువ్వాయిరప్పడి, నాలాయిరప్పడి, ఆరాయిరప్పడి, స్వాపదేశార్థములు. ఇత్యాది పేరులతో పలువ్యాఖ్యానములు ప్రసిద్ధములై ప్రచురితములై యున్నవి.

ఈ వ్రతదీక్షను 30 రోజులు సంపూర్తిగ నెరవేర్చలేక పోవుదుమేమో, మధ్యలో విఘ్నములు వచ్చునేమోయని ఎవరును భయపడనవసరము లేదు. మనంతట మనము ఎట్టి విఘ్నమును కల్పించుకొనకుండగ యుండిన సరి.

ద్రైవికముగ వచ్చు విఘ్నముల వలన ఈ దీక్షకెట్టి ప్రత్యవాయమున్ను లేదు. ఎంతవరకు జేసిన అంతవరకే శుభంబు కలుగును. అన్ని విఘ్నములను ఆ సర్వేశ్వరుడే నశింపజేసి తన కైంకర్యమును నిర్విఘ్నముగను, వైభవముగను జేయించుకొనగలడు.

వచ్చే మార్గశిర బహుళ త్రయోదశి సోమవారము (ది 15-12-1952 తేదీ) మధ్యాహ్నము గం. 3.30 లకు ధనుర్మాసము ప్రారంభమగును. ఆదినమున ఉదయమున మామూలుగ తిరువారాధనమును జేసుకొని పాలో, పండ్లో అవసర నివేదనమును జేసి మధ్యాహ్నము వరకు ఉపవాసముండి ధనుర్మాస ప్రవేశానంతరమున తిరిగి తిరువారాధనమునుజేసి పాశుర విన్నపమును జేసుకొని ఆరగింపు సమర్పించుకొని అన్నియు అయిన పిమ్మట ఆహార స్వీకరణాదులను జేసుకొనవలయును.

పుష్య బహుళ త్రయోదశి మంగళవారము 13-1-1953 తేదిని భోగిపండుగ, ఆనాడు శ్రీగోదా కల్యాణమును జరుపవలయును - ఈ గోదా కల్యాణమును ఉదయమునగాని లేక సాయంకాలముగాని సౌకర్యానుసారముగ జేసుకొనవచ్చును-

శ్రీ గోదాదేవి ఈ వ్రతమును 30 రోజులు అనుష్ఠించి తత్ఫలితముగ సాక్షాత్తు పరంధాముడగు శ్రీరంగధాముని వివాహము జేసుకొని ఈ శరీరముతోనే ఆయన శ్రీపాదములయందు ఐక్యమును జెందిన మహాపర్వాతి పర్వదినమీ దినమే. గాన ఈ రోజున శ్రీగోదా కల్యాణమును ముముక్షువులందరు అవశ్యము ఆచరించవలసినదియే.

గాన ఆస్తికులగు ముముక్షువులాదరును ఈ ధనుర్మాసవ్రతమును వ్యక్తిగతముగను, శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘము యొక్కయు, శ్రీ యతిరాజ సేవామహిళామండలి యొక్కయు అన్ని శాఖాస్థలములలోను సమిష్టిగాను మహా వైభవముగను జరుపవలసినది.

పెరుమాళ్ళకు స్నానమును సమర్పించునపుడు పంచసూక్తములను, నీరాట్టం పాశురములను; పూజచేయునపుడు నామములను; సేవాకాల సమయమున తిరుపళ్ళియెళుచ్చి-తిరుప్పావై పాశురములను; మంగళాశాసనసమయమున పాశురములు మంగళాశాసన శ్లోకములను, చాత్తుమొఱై సమయమున చాత్తుపాశురములను; అటు పిమ్మట ఆనాటి పాశురమును; తిరుప్పావై తనియను పిమ్మట చాత్తు శ్లోకములు వారి తిరునామములు - గోదాచతుశ్శ్లోకి - తదితర స్తోత్రములు ఇత్యాదులన్నియు అందరు కలిసి సమిష్టిగ విన్నవించవలయును.

ఇందులకుపయుక్తమగు గ్రంథములు కావలసినవారు "శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘగ్రంథ విక్రయశాఖ" 107 గీతామందిరము, వదరాముత్తియప్పన్ వీధి, మదరాసు-1 అను స్థలమునకు వ్రాసి ఖరీదునకు తెప్పించుకొనవచ్చును.

| | |
|---|---|
| తిరువారాధన క్రమము (లఘుతరము) | 0-2-0 |
| తిరువారాధన క్రమము (లఘువు) | 0-6-0 |
| శ్రీకృష్ణాష్టోత్తర శతనామావళి | 0-2-0 |
| శ్రీరామాష్టోత్తర శతనామావళి | 0-2-0 |
| శ్రీ లక్ష్మీ అష్టోత్తర శతనామావళి | 0-2-0 |
| శ్రీ గోదా అష్టోత్తర శతనామావళి | 0-2-0 |
| శ్రీ రామానుజ అష్టోత్తర శతనామావళి | 0-2-0 |
| శ్రీ విష్ణు సహస్రనామావళి | 0-3-0 |
| తిరుప్పావై టీకాతాత్పర్యసహితం | 0-10-0 |
| తిరుప్పావై మువ్వాయిరప్పడి అరవవ్యాఖ్యానం | 2-0-0 |
| శ్రీ గోదా కల్యాణం | 0-6-0 |
| శ్రీ గోదా కల్యాణపటం (చిన్నది) | 0-0-6 |

# శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘ ప్రచారక విశేషములు

శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘ ఆంధ్ర రాష్ట్రీయ శాఖా కార్యాలయమును విజయవాడలో శేషయ్యవీధిలో శ్రీ నిడుముక్కల సుబ్బారాయుడు రంగవల్లి తాయారమ్మగార్ల రామానుజకూటములో నెలకొల్ప బడినది.

ఈ కార్యాలయమునకు నిర్వాహణోద్యోగిగ శ్రీమాన్ నిడుముక్కల శ్రీరామమూర్తి గారిని ఏర్పాటు చేయడమైనది.

రాష్ట్రీయ కార్యాలయముతో ఉత్తర ప్రత్యుత్తరములు జరుపగోరువారు ఈపై చిరునామాకు వ్రాయుచుండగోరెదము.

---

# శ్రీ విశిష్టాద్వైత ప్రచారకసంఘ గ్రంథాలయము విజయవాడ.

శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘము తరపున విజయవాడలో శేషయ్యవీధిలోని శ్రీ నిడుముక్కల సుబ్బారాయుడు రంగవల్లి తాయారమ్మగార్ల రామానుజకూటములో మేడమీద నూతనముగ ఈసంఘ గ్రంథాలయము ఏర్పాటు చేయబడినది.

ఇందు ప్రధానముగా శ్రుతులు-స్మృతులు పురాణములు ఇతిహాసములు - వైఖానస-పాంచరాత్ర ఆగమములు - కల్పసూత్రములు- గుహ్యసూత్రములు పూర్వోత్తర మీమాంస సూత్రములు- దర్శనగ్రంథములు నాలాయిర దివ్యప్రబంధనములు స్తోత్రపాఠములు-సాంప్రదాయ ఇతరగ్రంథములు వీటన్నింటియొక్క వ్యాఖ్యాలు - భాష్యములు - టీకాలు మొదలైనవి సేకరించి యుంచుటకు నిశ్చయింపబడినది.

ఈ గ్రంథాలయమందలి గ్రంథముల పర్యాలోకన జేయుటకై విచ్చేయు గ్రామాంతర శ్రీ విశిష్టాద్వైతులకు యథావకాశముగ బసలు, సాపాట్లు వసతులు ఉచితముగ కల్పించుటకు శ్రీమాన్ నిడుముక్కల శ్రీరామమూర్తిగారు అంగీకరించిరి-

ఈ గ్రంథాలయమునకు పైన తెలిపిన గ్రంథములు కావలసియున్నవి -గాన భాగవతోత్తములు తమవద్ద యున్న గ్రంథములను ఉచితముగ ఈ గ్రంథాలయమునకు బహూకరించ మిక్కిలియు ప్రార్థించుచున్నాము. బహూకరించినవారు తిరునామములను ఆయాగ్రంథములపై లిఖించి యుంచుచు, మరియు పత్రికలో కూడ ప్రచురించగలము. మరియు ఈగ్రంథము లుంచుటకు బీరువాలు కూడ కావలసి యున్నవి. వాటిని కూడ బహూకరించ వలసినదిగ సహృదయుల ప్రార్థించుచున్నాము.

ఈ గ్రంథాలయ స్థాపనదినమునందే ఈ గ్రంథాలయమునకు సుమారు నూరు రూపాయలు ఖరీదుగల పెద్ద బీరువా నొకదానిని ఉచితముగ బహూకరించిన మైలవరం మూడవరాణీ గారగు శ్రీ శ్రీ శ్రీ సూరపనేని శ్రీవరమంగయ్యమ్మారావు జమీందారిణి గారికి మా హృదయపూర్వక ధన్యవాదముల నర్పించుచున్నాము.

(వీరు తమవద్దయున్న యావత్తు గ్రంథములను ఇదివరలోనే మదరాసులోని ఈ సంఘ గ్రంథాలయమునకు సమర్పించియున్నారు)

విజయవాడలోని ఈ గ్రంథాలయము ఆంధ్రులందరకు చాల ప్రధాన కేంద్రముగ యుండి అధిక - ఉపయోగకారిగ యుండును గాన శ్రీవిశిష్టాద్వైత సాంప్రదాయస్థులందరున్ను దీని సత్వరాభివృద్ధికి ఉచితమగు రీతిని తోడ్పడ ప్రార్థించుచున్నాను.

గ్రంథ రచయితలు, ప్రచురణ కర్తలు కూడ తమ గ్రంథములను పత్రికలను పంపుటకై కోరుచున్నాము.

విజయవాడ. }
శేషయ్యవీధి }

ఇట్లు,
శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘ సహాయ కార్యదర్శి.

# శరన్నవ రాత్రోత్సవముల నివేదిక.

## మై ల వ ర ము

కృష్ణాజిల్లా మైలవరం గ్రామమున స్థానికమైన శ్రీయతి రాజసేవా మహిళామండలివారిచే మూడవ రాణీగారు శ్రీ శ్రీ శ్రీ సూ. శ్రీవర మంగయ్యమ్మారావు జమీందారిణిగారి యధ్యక్ష్యమున శ్రీ శ్రీనివాసస్వామివారి దేవస్థాన సన్నిధియందు శ్రీ శరన్న వరాత్ర్యుత్సవములు అతివైభవముగ జరుపబడినవి.

ప్రతినిత్యము:- ముకుందమాల, ఆళవందారుస్తోత్రము, ఉమాషోడశి, భగవద్గీత, సుందరాకాండ రామాయణము పారాయణమున్ను, తిరువాయ్ మొళి సేవకాలమున్ను శ్రీ విష్ణు సహస్రనామస్తోత్రము శ్రీలక్ష్మీ స్తోత్రము సమిష్టి పారాయణమున్ను ప్రతిదినము రెండుపూటల శ్రీవిష్ణు-లక్ష్మీ సహస్రనామార్చనయు, శ్రీ వెంకటేశ్వర, రామ - కృష్ణ - గోదా అష్టోత్తర శత నామార్చనలున్ను అతివైభవముగా జరుపబడినవి.

ఇందు, అర్చకస్వామి శ్రీమాన్ రాఘవాచార్యులుగారున్ను, కాలక్షేపస్వామి శ్రీమాన్ తిరుమలాచార్యులుగారున్ను, దేవస్థాన కైంకర్యపరులు శ్రీమాన్ తిరుమలయ్యంగారున్ను శ్రీమాన్ శృంగారం అయ్యవారాచార్యులుగారున్ను శ్రీమాన్ ఆదినారాయణంగారున్ను అత్యుత్సాహముతో పాల్గొని నిర్విఘ్నముగను వైభవముగను నిర్వహించిరి. గ్రామస్థులందరు చాల ఉత్సాహముతో యిందుపాల్గొనిరి. స్వాములందరకున్ను శ్రీరాణీగారున్ను గ్రామస్థులున్ను ఉచితరీతిని సత్కరించిరి.

## అ ర్త మూ రు.

తూర్పుగోదావరిజిల్లా అర్తమూరుగ్రామమున శ్రీ విశిష్టాద్వైత ప్రచారకసంఘ శాఖ యొక్కయు శ్రీయతిరాజసేవా మహిళామండలి యొక్కయు యాజమాన్యమున శ్రీ వేణుగోపాల స్వామివారి సన్నిధిలో ఈ ఉత్సవములు కడు వైభవముగ జరుపబడినవి.

## ★ విజయవాడ ★

ఈ పట్టణమున శ్రీయతి రాజసేవామహిళా మండలియొక్క యాజమాన్యమున శ్రీ శరన్నవరాత్రోత్సవములు అతివైభవముగ జరిగినవి- ప్రతిదినము శ్రీ మోటూరు అయ్యావార్లంగారిచే సుందరాకాండాది పారాయణాదికములు అతివైభవముగా జరుపబడెను.

## గోపాలపురం — జగ్గయ్యపేట కృష్ణాజిల్లా.

ఈ గ్రామమున శ్రీ కోదండరామస్వామి వారి సన్నిధిలో శరన్నవరాత్రి ఉత్సవములు వైభవముగ జరుపబడెను.

ప్రతిదినము ఉదయము పెరుమాళ్ళకు సహస్రనామార్చనము, తాయార్లకు అష్టోత్తర శతనామార్చనమున్ను, సాయంకాలము గం. 6 లనుండి గం. 10 ల వరకు భజన, కాలక్షేపము భోగముల నివేదన తీర్థ ప్రసాద వినియోగములు జరుపబడినవి.

ఇందులకగు ఖర్చునంతను, దేవాలయ ధర్మకర్తలగు శ్రీమాన్ కొల్లు నరసయ్యగారి కుమారులు పాపయ్యగారే స్వయముగ భరించిరి.

ఇంకను ఈ గ్రామమున నందన సం॥ర జ్యేష్ట బ. 3 వ తేదీని శ్రీ కోదండరామ భక్త సేవాసంఘమను పేరుతో శ్రీవిశిష్టాద్వైత ప్రచారక శాఖా సంఘము నొకదానిని స్థాపించి శ్రీ ఉ. వే. శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల రఘునాథాచార్యులుగారిని దానికి కార్యదర్శులుగా నేర్పరచిరి. ఈసంఘము తరుచుగా పండితులచే వేదాంతోపన్యాసములుగావింపజేయుచున్నది. ప్రస్తుతము శ్రీ ఉ. వే. శ్రీమాన్ స. చ. రఘునాథాచార్య స్వామిగారిచే "ఆచార్య సూక్తిముక్తావళి" కాలక్షేపము నిత్యము గావించుచున్నారు.

## పాలకొల్లు — పశ్చిమ గోదావరి జిల్లా

ఈ గ్రామమును శ్రీయతిరాజ మహిళా మండలిచే తమ శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘమువారిచేతను శరన్నవరాత్రి ఉత్సవములు అత్యద్భుత వైభవముతో శ్రీమదష్ట బాహులక్ష్మీ నారాయణ స్వామివారి సన్నిధియందు జరుపబడెను. ప్రతిదినము తాయార్లకు తిరుమంజనము, విశేషాలంకారములు, శ్రీ గుణరత్నకోశము, గద్యత్రయము, అష్టోత్తర శతనామస్తోత్రములు మున్నగు స్తోత్రపాఠ పారాయణలు, సమిష్టిపారాయణలు. విశేషభోగములుమున్నగు వానితో చాలభక్తి శ్రద్ధలతో జరుపబడెను.

## కట్నములు

జగ్గయ్యపేట తాలూకా గోపాలపురం గ్రామమున వేంచేసియున్న శ్రీ ఉ. వే. శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల రఘునాథాచార్యులుగారు ఆశ్వీజ శు 8 సోమవారంనాడు తమ శిశువునకు "శ్రీనివాస రామానుజాచార్యులు" అని నామకరణము గావించి మన పత్రికకు రు 2-0-0 లు కట్నముగాను రు 5-0-0 లు సంఘమునకు శాశ్వత నిధిగాను సమర్పించి తమసంఘాభిమానమును వెల్లడించిరి. వీరి చిరంజీవి అయురారోగ్యైశ్వర్యాభివృద్ధిగా వర్ధిల్లుగాక యని శ్రీయఃపతిని ప్రార్థించుచున్నాము.

శ్రీమాన్ ముప్పాల ఎలమందగారి కుమారుడు శ్రీ వటపత్ర శాయిగారి వివాహస్నాతకము నందు శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘమునకు రూ 2-0-0 పంపిరి మా ధన్యవాదములు. వీరికి శ్రీయః పతి సమస్తైశ్వర్యముల నిచ్చుగాక.

విజయవాడలో శ్రీ చి. సౌ. ఆండాళమ్మను శ్రీ డా. సంకా రాధాకృష్ణమూర్తి గారి కిచ్చి వివాహము జరిపించిన సందర్భమునను మరియు శ్రీమో. సుబ్రహ్మణ్యం చి॥ సౌ॥ సక్కుబాయమ్మగార్లకు సమాశ్రయణము జరిపించిన సందర్భమునను శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘమునకు రూ 5-0-0 లు కట్నము సమర్పింపబడెను.

శ్రీయః పతివీరలకు సమస్తైశ్వర్యములనిచ్చి రక్షించుగాక.

శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘము.

పెనుగొండ వాస్తవ్యులు శ్రీమాన్ ప్రతివాది భయంకరం ఫణీంద్రస్వామిగారు తమ కోడలి సీమంతోత్సవమున ఈ సంఘమునకు రూ 2-0-0 సమర్పించిరి.

పెనుగొండ వాస్తవ్యులు శ్రీమాన్ కలనగుంట వెంకటాచార్యులుగారు బూరుగుపల్లిలో జరిగిన తమ మనుమరాలి బారసాల మహోత్సవమున ఈసంఘమునకు రూ 2-0-0 సమర్పించిరి. వీరికి శ్రీయః పతి సమస్త మంగళములు చేకూర్చుగాక—

## —భగవద్గీతా పరీక్షలు—

చెన్నపురి గీతామందిరము యాజమాన్యమున ఈ సంవత్సరం నవంబరు 20వ తేదీని జరుపబడు భగవద్గీతా పరీక్షలకు మైలవరం గ్రామము నుండి 20 సం॥రముల మొదలు 50 సం॥రముల వయస్సు వరకును గల 6 గురు అభ్యర్థినులు శ్రీ ఉ. వే. శ్రీమాన్ ధర్మపురి తిరుమల లక్ష్మీకుమార వేదాంత తిరుమలాచార్య స్వామివారిచే శిక్షితులైరి.

## సంభావన.

రాజమహేంద్రవరము శ్రీమతి రా. జ సేవామహిళా మండలివారు శరన్నవరాత్రోత్సవములు అతివైభవముగా జరిపిరి. ఈసందర్భమున వారు శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘ సంభావనగ రూ 3-0-0 ను పంపిరి. ఈ ఉత్సవములో శ్రీమతి ముడుంబై రామానుజమ్మగారు, ముక్తేంగి నాగాయమ్మగారు, రామినీడి రాయలమ్మగారు మున్నగు భక్తురాండ్రు చాల శ్రద్ధాభక్తులతో పాల్గొని పనిచేసిరి!

నరసాపురంలో కీ. శే. శ్రీమాన్ శేట్టలూరి రంగస్వామిగారి పరమపదోత్సవమున ఈ సంఘమునకు రూ 4-0-0 లు సంభావనను సమర్పించిరి. వీరికి సర్వేశ్వరుడు తన సాయుజ్యమును కటాక్షించుగాక.

# శ్రీ యతిరాజ సేవా మహిళామండలి శాఖల

## కార్యక్రమము

### అత్తమూరు

ఈ క్రింద తెలుపబడిన మహాశయులుతమ గృహములలో పూజలను జరిపించిరి.

#### శుక్రవారపు పూజలు

1 శ్రీమండరామన్నగారి భార్య మంగలమ్మగారు
2 శ్రీమేడపాటి వెంకటరెడ్డిగారి భార్య మంగరాజుగారు
3 శ్రీచిర్ల వెంకట్రాయుడుగారి భార్య సూరమ్మగారు
4 శ్రీమండలి మొత్తంమీద 2 శుక్రవారములు.

#### ఏకాదశి పూజలు

1 శ్రీకోనాల వెంకయ్యగారి భార్య బుల్లిఅమ్మాయిగారు
2 శ్రీకొప్పిరెడ్డి వీరన్నగారి భార్య భూషణముగారు
3 శ్రీకోనాల సుబ్బన్నగారి భార్య మహాలక్ష్మమ్మగారు
4 శ్రీనల్లబల్లి వెంకటరెడ్డిగా భార్యకాంతమ్మగారు
5 శ్రీమండలి తరపున 2. పూజలు జరిగినవి.

## ఏలేటిపాడు (ప. గోదావరి)

#### శుక్రవారపు పూజలు

1 శ్రీపడాలి చెల్లారెడ్డిగారి భార్య వీరమ్మగారు
2 శ్రీపులగము సూర్రెడ్డిగారి భార్య మంగమ్మగారు
3 శ్రీబాతిరెడ్డి పేర్రెడ్డిగారి భార్య సత్తెమ్మగారు
4 శ్రీవెలగల సూరెడ్డిగారు భార్య సూరమ్మగారు
5 శ్రీసత్తి లక్ష్మారెడ్డిగారి భార్య చంద్రమ్మగారు
6 శ్రీబాతిరెడ్డి అప్పన్నగారి భార్య బుల్లి అమ్మాయిగారు
7 శ్రీబాతిరెడ్డి వీర్రెడ్డిగారి భార్య సత్తెమ్మగారు
8 శ్రీసత్తి వెంకటరెడ్డిగారి భార్య మీనాక్షమ్మగారు
9 శ్రీసత్తి వెంకటరెడ్డిగారి భార్య మీనాక్షమ్మగారు

(ఏకాదశి పూజనుకూడ జేసిరి)

శ్రీమతే రామానుజాయ నమః

# శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘము, విజయవాడ.

స్వస్తిశ్రీ నందననామ సంవత్సర మార్గశిర బ. ౧౩ సోమవారము (ది15-12-1952 తేది నుండి విజయవాడలో ఈ సంఘము తరఫున ధనుర్మాసోత్సవమును వైభవముగా జరుపుటకు ఏర్పాట్లు చేయబడినవి.

కేంద్ర సంఘ సహాయ కార్యదర్శిగారగు శ్రీ ఉ. వే. శ్రీమాన్ ఆ. చి. శ్రీమన్నారాయణాచార్యులు గారు ఈ నెల రోజులు యిచ్చటనే యుండి శ్రీ నిడుముక్కల సుబ్బారాయుడు రంగవల్లి తాయారమ్మగార్ల రామానుజ కూటములో ఈ ఉత్సవమును జరిపించుటకున్ను మరియు ప్రతిదినము ఉదయము గం. 7-0 నుండి గం, 8-30 వరకు క్రొత్తగుళ్ళల్లో తిరుప్పావై మువ్వాయిరప్పడివి పంక్తిపై కాలక్షేపము సాయించుటకున్ను అంగీకరించిరి. తిరుప్పావై కాలక్షేపము ఈ దశమి శుక్రవారము 12-12-52 తేది ఉదయమునుండియే ప్రారంభమగును.

గాన యిందుపాల్గొన నాసక్తిగల వారి నందరిని విచ్చేయ వలసినదిగ యిందు మూలముగ ఆహ్వానించుచున్నాము.

విచ్చేయువారు ముందుగ తెలిపినచో అవకాశమున్నంతవరకు ఉచితముగ బసలను ఏర్పాటుచేయ ప్రయత్నింతుము.

సాపాటునకు కోవిలలో ఏర్పాటు చేసుకొనవచ్చును. (మనిషి 1 కి పూర్తి నెలకు సుమారు రూ 25-0-0 అగును.)

ముందు తెలిపినచో అవకాశమున్నంతవరకు బీదలగు విద్యార్థులకు విద్యార్థినులకు ఉచితముగ సాపాటు ఏర్పాట్లు చేయ ప్రయత్నింతుము.

ఇట్లు,

శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘము.

శేషయ్యవీధి - నిడుముక్కలవారి రామానుజకూటం, విజయవాడ.

శ్రీమతే రామానుజాయ నమః

# వినతి

శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘ గ్రంథాలయమునకు

మీవద్దయున్న సాంప్రదాయ గ్రంథముల

ఉచితముగ దయచేయ ప్రార్థన.

వాటిని మీపేరున అందరు పఠించి సత్ఫలితముల నొందగలరు.

ఇట్లు,

శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘము.

నిడుముక్కల సుబ్బారాయుడుగారి రామానుజకూటం.

శేషయ్యవీధి, విజయవాడ-1.

# —:పుస్తక ప్రకటన:—

## శ్రీశఠకోపగీతామృతము

తిరువాయ్ మొళి అను ద్రావిడ వేదము ...పద్యరూప చక్కని ఆంధ్రానువాదము దీనిని శ్రీమాన్ నల్లానిచక్రవర్తుల వెంకట ...రాచార్యులుగారు (L. M. P. తుని) ...త సులలిత మధుర సులభ సన్నిహిత శైలిలో రచించిరి. అనేకమంది పండితులచే పలు సభలలో ప్రశంసించబడినది. ఖరీదు రూ 1-2-0 మాత్రము. గ్రంధకర్తగారి వద్దనుండి గాని లేక శ్రీవిశిష్టాద్వైతప్రచారక సంఘ గ్రంథ విక్రయశాఖాలయము, 107, గీతామందిరము, వరదా ముత్తియప్పన్ వీధి, మదరాసు-1 బడయవచ్చును.

| | | |
|---|---|---|
| 1. | శ్రీవిష్ణు సహస్ర నామాస్తోత్రము | 0-2-0 |
| 2. | శ్రీవిష్ణు సహస్ర నామావళి | 0-3-0 |
| 3. | శ్రీవిష్ణు సహస్రనామ స్తోత్ర వైభవము | 0-2-0 |
| 4. | ప్రపన్న తిరువారాధన క్రమము (లఘు విధానము) | 0-6-0 |
| | ప్రపన్న తిరువారాధన క్రమము (లఘుతర విధానము) | 0-2-0 |
| | ప్రపన్న సంధ్యానుష్ఠానము | 0-2-0 |
| | భజయతి రాజస్తోత్రము తాత్పర్య సహితము | 0-4-0 |
| | భజయతి రాజస్తోత్రము (మూలము) | 0-1-0 |
| | శ్రీరామానుజ చరిత్రము | 0-2-0 |
| 9. | శ్రీరామ అష్టోత్తర శతనామ స్తోత్రము | 0-2-0 |
| 10. | శ్రీకృష్ణ అష్టోత్తర శతస్తోత్రము | 0-2-0 |
| 11. | శ్రీలక్ష్మీ ,, | 0-2-0 |
| 12. | శ్రీగోదా ,, | 0-2-0 |
| 13. | శ్రీరామానుజ ,, | 0-2-0 |
| 14. | లక్ష్మీ స్తవము | 0-2-0 |
| 15. | చతుశ్శ్లోకి | 0-1-0 |
| 16. | 82 వార్తలు | 0-2-0 |
| 17. | అర్థపంచకము | 0-6-0 |
| 18. | తిరుప్పావై (టీకాతాత్పర్యములతో) | 0-10-0 |
| 19. | గోదా కల్యాణము | 0-6-0 |
| 20. | అచ్యుతానంద గోవింద శతకము | 0-8-0 |
| 21. | భాగవత సురభూజము | 0-4-0 |
| 22. | శ్రీమన్మంత్ర త్రయార్థ వివరణము | 0-12-0 |
| 23. | శ్రీహం...వైభవము | 0-4-0 |
| 24. | చరమార్థ దీపిక | 0-4-0 |
| 25. | 118 ...వైభవము | 0-1-0 |
| 26. | శ్రీహనుమద్వైభవము | 0-8-0 |
| 27. | శ్రీరామానుజ చరిత్రము (ద్విపద) | 0-4-0 |
| 28. | స్తుతిమాలికా | |
| 29. | సిద్ధిత్రయము | 2-0-0 |
| 30. | తిరుప్పావు (ఆంధ్రముపద్యములు) | 0-2-0 |
| 31. | ద్వయమంత్రార్థ ప్రకాశికా | 0-4-0 |
| 32. | వేదాన్త సిద్ధాన్తకౌముది | 0-8-0 |
| 33. | సుదర్శన వైభవము | 0-4-0 |
| 34. | శ్రీభగవద్గీతా గీతము | 0-12-0 |
| 35. | మూవాము గుణ్యసిద్ధి విమర్శ | 1-0-0 |
| 36. | శ్రీరామాయణ తిథులు | 0-1-0 |
| 37. | ప్రాతర్నిత్యాను సంధేయము | 0-3-0 |
| 38. | శ్రీరామావతార తత్వవిచారము | 0-8-0 |
| 39. | శ్రీమద్గీతార్థ సంగ్రహము | 0-2-0 |
| 40. | In the temple of truth | 0-8-0 |
| 41. | దివ్యస్తోత్ర పాఠములు | 0-4-0 |
| 42. | బ్రాహ్మణుల నేరమేమి | 0-1-0 |
| 43. | తత్వత్రయ సంగ్రహము | 0-4-0 |
| 44. | గద్యత్రయము భట్టరు-దేశికులు పెరియ వాచ్చాంబిళ్లై సంస్కృత ద్రావిడవ్యాఖ్యలతో | 2-8-0 |
| 45. | తిరుచ్చంద విరుత్తం-పెరియవాచ్చాంబిళ్లై వ్యాఖ్యానము పదపురై సహితం | 3-8-0 |
| 46. | తిరువారాధన పంచసూక్తములు-అన్నసూక్త మధు సూక్తములతో | 0-10-0 |
| 47. | పరంద రహస్యం | 1-0-0 |
| 48. | చతుశ్శ్లోకి-(ద్రావిడ వ్యాఖ్యానముతో) | 1-0-0 |
| 49. | కైశిక మహాత్మ్యం-ఆంధ్ర తాత్పర్యార్థముతో | 0-8-0 |
| 50. | తిరుప్పావై-కణ్ణినున్ శిరుత్తాంబు పల్లాండు తిరుపళ్ళి యెళుచ్చి వారణమాయిరం వణ్ణమాడంగళ్ వీటితో | 0-6-0 |
| 51. | చరమశ్లోకత్రయము గీతాపరిషచ్చరము ద్రావిడమునకు ఆంధ్రవ్యాఖ్య | 3-8-0 |
| 52. | ఆచార్య సూక్తిముక్తావళి | 3-0-0 |
| 53. | ఆళ్వారుల చరిత్ర (ఆంధ్రవచనము) | 1-0-0 |
| 54. | భగవద్గీత (తాత్పర్యసహితం) | 1-8-0 |

రిజిష్టరు నెం. 5049

# భక్తినివేదన

(వేదాంత మాసపత్రిక)

ఇందు వేదాంత విషయ రాజములున్ను; భక్తిప్రచార విషయమైన వార్తలున్ను వేదాంత సాంప్రదాయ విషయకమైన ప్రశ్నోత్తరములున్ను ప్రచురించబడును.

చందాలు;

సాధారణ చందా సం. ర 1కి॥ రు. 5-0-0.

సహాయ చందా ,, రు. 10-0-0.

To

**Book-Post**

1. శ్రీమన్నారాయణుడే సృష్టి - స్థితి లయ - కారకుడు.
2. ఆయనే మోక్షప్రదాత.
3. ఆయనే పరతత్త్వము-పరమాత్మ
4. ఆయన అఖిలహేయ ప్రత్యనీక కల్యాణ గుణాకరుడు.
5. ఆయనకు జీవుడు శరీరభూతుడు; శేషభూతుడు, పరతంత్రుడు, నియామ్యుడు, అనుభావ్యుడు.
6. జీవులు జ్ఞానైకాకారులు.
7. జీవులు అనంతములు.
8. జీవులు పరమాత్మకంటె భిన్నులు; ఈ భేదము సత్యమైనది; నిత్యమైనది.
9. జీవ-పరమాత్మలకు ప్రకృతి శరీరభూతమైనది; శేషభూతమైనది; పరతంత్రమైనది; నియామ్యమైనది; అనుభావ్యమైనది.
10. ప్రకృతి వికారాస్పదమైనది. జీవపరమాత్మలకంటె భిన్నమైనది, ఈ భేదము సత్యమైనది; నిత్యమైనది.
11. జీవుడు ప్రకృతి వియుక్తుడై పునరావృత్తి రహితమైన పరమాత్మ సాన్నిధ్యమగు పరమ పదమునుపొందుటయే మోక్షము
12. భక్తి ఒక్కటియే మోక్షసాధనము.
13. భక్తియన తైలధారవలె అవిచ్ఛిన్నమైన స్మృతి పరంపర.
14. వివేక-విమోక-అభ్యాస-క్రియా-కల్యాణ అనవసాద-అనుద్ధర్షలు భక్త్యంగములు.
15. ఇవి సదాచార్య-సమాశ్రయణ-లభ్యములు
16. జగద్గురువగు శ్రీరామానుజాచార్యులు వారును; వారి యనుయాయులున్ను సదాచార్యులు.

"నగురుర్వైష్ణవాత్ పరః" భా. సం.

mannarayanacharya at Sriman Press, Kakinada.

## —: విజ్ఞప్తి :—

భక్తి "నివేదన" పత్రిక కార్యాలయము

15-11-1952 తేది నుండి విజయవాడకు మార్చబడినది. గాన చందా దారులు తమ చందా ధనమును దయయుంచి ఇకనుంచి ఈ క్రింద చిరునామాకు పంప గోరుచున్నాము.

పత్రికా విలేఖరులు తమ లేఖలను దయతో ఈ క్రింద చిరునామాకే పంప గోరుచున్నాము.

గౌరవ నిర్వాహణాధికారి. (హానరరీ మేనేజరు)
భక్తి "నివేదన" పత్రిక
10/275 A కోటంరాజువారి వీధి,
విజయవాడ. (కృష్ణాజిల్లా)



శ్రీమతే రామానుజాయ నమః


# భక్తి నివేదన

వేదాంత మాస పత్రిక

| సంపుటి ౪ | నందన-పుష్యమాసం | సంచిక ౧౦ |
|---|---|---|


## కర్మ రహస్యము


జిజ్ఞాసువు:
శ్రీ కూరపాటి రామారావుగారు
విజయవాడ.


ప్రపన్నుడే కాని, ఏకాంతియే కాని, పరమైకాంతియే కాని, దేహేంద్రియాది సంపర్క-మున్నంతవరకు కర్మాచరణ తప్పదుకదా? అట్టి కర్మబంధము నుండి విముక్తి చెందుట ఎటుల?

సమాధానము "శ్రీమన్నారాయణ"

యత్కరోషి యదశ్నాసి । యజ్జుహోషి దదాసి యత్ ।
యత్తపస్యసి కౌంతేయ । తత్కురుష్వ మదర్పణం ॥

నీవు ఏ పనిని జేసినను; ఏది తినినను; దేనిని హోమము జేసినను, దేనిని ఎవరికిచ్చినను; ఎట్టి తపస్సు నాచరించినను, మొత్తము అన్నింటిని కష్ణార్పణ మొనర్చుము. అనగా ఆయాకర్మల యొక్క ఫలితమును నీవాశింపక ఆ పనిని జేయించిన వాడు దానికి కర్త, దానికి భర్త, దానికి భోక్త. అన్నియు శ్రీకృష్ణపరమాత్మయే యను యదార్థవిషయమును తెలుసుకొని, ఈ అర్థమందు సంపూర్ణ విశ్వాసము కలవాడవై ఆ విశ్వాసముతోను నీ విద్యుక్త కర్మల నాచరించుచు అంతమున తత్కర్మఫలితమును శ్రీకృష్ణపరమాత్మున కర్పింపుము. దానివలన నీకు ఆ కర్మల యందు సంగమము గాని ఆసక్తిగాని వానివలన బంధము గాని యుండజాలదు. వర్ణాశ్రమానుసారముగ నీ విద్యుక్త కర్మల నాచరించుట యందు మాత్రమే నీకు అధికారము, మిగత భాగములతో నీకు సంబంధము లేదు.

# ★ వైరాగ్యము ★

జిజ్ఞాసువు:—శ్రీమాన్ మాదంశెట్టి శీతారామయ్యగారు.

ప్రశ్న:— చక్రవర్తియై జగములనేలుచు రాచకార్య లంపటుడగు జనకుని వైరాగ్యమెట్టిది ?

సమాధానము:— "శ్రీమన్నారాయణ"

ఒకప్పుడు యాజ్ఞవల్క్యమహర్షి తన శిష్యునకు ఉపనిషదర్థములను ఉపదేశించుచుండెను. వారిద్దరకు ఈక్రిందివిధముగ సంభాషణ జరిగెను.

యాజ్ఞవల్క్యుడు: "తం దుర్దర్శం గూఢ మనుప్రవిష్టం ।
గుహాహితం గహ్వరేష్ఠం పురాణం ।
అధ్యాత్మయోగాధిగమేన దేవం ।
మత్వా ధీరో హర్షశోకౌ జహాతి" ॥

పరమాత్మ అన్నిప్రాణులయొక్క హృదయ గుహల యందును తత్తన్నియమనార్థమై వ్యాపించియున్నాడు. ఆయన అతీంద్రియుడు విశుద్ధ మనోమాత్ర గ్రాహ్యుడు గాన గూఢముగా కనబడకుండగ యున్నాడు. ఆయన పురాణపురుషుడు. ఆదేవుడు ఉపాసకులచే ఆత్మయాథాత్మ్య జ్ఞానయోగముచే తెలుసుకొనబడుచున్నాడు. ఎవరైతే ధైర్యముతో ఆయనను ఉపాసించి సాక్షాత్కరింప జేసుకొనగలడో అట్టివాడు సంతోషమును దుఃఖమును కూడ విడిచిపెట్టి ముక్తుడు కాగలుగుచున్నాడు.

శిష్యుడు:—ఆచార్యా ! ఇంద్రియ సంయమనముచేతనే కదా ! అట్టి హృదయాంతర్గత పరమాత్మను చూడనగును. ఇంద్రియముల బహిర్ముఖములుగ ఆపరమాత్మయే ఏల సృజించవలెను. ఆ చూడవలశిన యింద్రియములు పరమాత్మయుందు హృదయగుహాయు దేహమునందున్నవి. ఈదేహము పాంచభౌతికము. ఇది కర్మాధీనమై తత్ఫలానుగుణముగ ప్రవర్తించుచుండును. కర్మఅనాది చక్రరూపమైనది. యిట్టి స్థితిలో నిశ్చనమైన ఉపాసనజేయుట ఎటుల ? పరమాత్మసాక్షాత్కార మెప్పుడు ? ఇక మోక్షమును పొందుట యనునది యెచ్చట ?

యాజ్ఞవల్క్యుడు:— శిష్యా, పరమాత్మయందు ప్రీతియు, తదితరములయందు వైరాగ్యము యున్నచో ఇది సుసాధ్యము సుమా.

శిష్యుడు:—స్వామి ఈదేహధారికి, అందులోను సంసారికి ఇట్టిస్థితి కలుగుట సంభవమా ?

యాజ్ఞవల్క్యుడు:— ఆహా తప్పక సంభవము. మనదేశపురాజు జనకుడు అతనివద్దకు వెళ్ళి నీసంశయము నడుగుము. ఆతను మహావేదాంతి అనుష్ఠానపరుడు. ఆతను నీసంశయముల దీర్చగలడు.

శిష్యుడు గురువుఆజ్ఞబొంది జనకుని సభకు

వెళ్ళెను. సభాభవనము క్రిక్కిరిసి యుండెను. మంత్రిలు, సామంతులు, దండనాయకులు, సభాసదులు నిండియుండిరి. నేలయంతయు చలువరాతిచే నిర్మించబడెను. దానిపై రత్నకంబళ్లు పరువబడియుండెను. మధ్యలో వజ్ర వైడూర్య రత్న, గోమేదిక పచ్చలుపొదిగిన సువర్ణసింహాసనము దానిపై ముత్యములచే నిర్మింపబడిన శ్వేతచ్ఛత్రము యుండెను.

ఇంతలో జనకచక్రవర్తి ఆసభలో ప్రవేశించెను. ఆజానుబాహువు స్ఫురద్రూపి, పట్టుపీతాంబరధారి, ఆతనుధరించి వజ్ర వైడూర్య సువర్ణాభరణములు కండ్ల మిరిమిట్లు గొలుపుచుండెను. మొగమందు కస్తూరితిలకము, అధరమందు తాంబూలరక్తిక, హస్తమందు విలాసపద్మము నడుమున కరకు కరవాలము, శిరస్సున జగచ్ఛాసకరత్నమయ కిరీటము, పాదములయందు మణిపాదుకలు, వంటినిండ దశదిశల ఘుమఘుమాయించు అత్తరువులుకలిపిన రక్తచందనము, త్రోవపొడుగునను పన్నీరుసేచనము ఇరుపార్శ్వముల అప్సరసలవంటి స్త్రీలు తెల్లని వింజామరల వీచుచుండిరి. ఒకవైపు మరొకపూబోణి ముత్యాల శ్వేతఛత్రము పట్టెను. మరొకవైపున యింకొక అందకత్తె అత్తరుపన్నీర్లు జల్లుచుండెను. ఎదుటి సువర్ణవేత్రహస్తుకు, పార్శ్వములందు జయజయధ్వనులతో వంది మాగదులు, అంతకుముందు మంగళదివిటీలు మహారాజు సింహదీప్తితో సభాభవనమును ప్రవేశించునప్పటికి సభాసదులందరు మహారాజుకు జయఅనుచు లేచి నిలబడిరి. సింహేంద్రమధ్యములు కొందరు పచ్చకర్పూర నీరాజనముల నిచ్చిరి.

ఒకప్రక్కగ మొలగోచితో, హస్తమున కమండలుతో, చంకను దర్భాసనముతో అగ్నివలె వెలుగుచు నిలబడిన యాజ్ఞవల్క్యశిష్యునకిది యంతయు జూచిన కండ్లు మిరిమిట్లు గొలిపెను. ఇట్టి భోగినా, విరాగియని మాయాచార్యుడు వర్ణించెను. ఇట్టి ఐశ్వర్యకాముయా నాసంశయముల దీర్చువాడు. ఇట్టి సౌభాగ్యుడా నాకు వైరాగ్యమును ఉపదేశించును? అని సంశయ సంభ్రమములలో శిష్యుడు చైతన్య రహితుడై జూచుచుండెను.

జనకుడు సింహాసన మధిష్ఠించెను. గురుశిష్యునిజూచి దిగ్గున ఆసనము నుండిలేచి నమస్కరించుచు తనవద్దకాయన నాహ్వానించి వేరొక ఆసనమున గూర్చుండబెట్టి ఆయనరాకకు కారణ మడిగెను. శిష్యునికి అరికాలిమంట తలకెక్కుచుండెను. ఆయనను మనస్సును కొంత దిట్టబఱచుకొని "రాజా" సంసారమందు లంపటుడై యున్నవాడు విరాగియై, బందరహితుడై యుండుట కవకాశమున్నదాయని మాగురువు నడుగగా, తత్సంశయనివారణకై మాగురువు నన్ను నీవద్ద కనిపెను. నీవు చూడ మామూలు సంసారివి మాత్రమేకాదు. మామూలసంసారికి పరిమితిగల కొద్దిబంధములే యుండును. ఆతని భోగము పరిమితముగానే యుండును. గాని నీవో జగదేకసంసారివి. నీరాజ్యమందలి అందరి అన్నిసంసారముల బాధ్యతయు నీదేయై యున్నది. నీభోగము దేవేంద్రాధికమై యున్నది. నీయొక్క భోగానుభవము జగత్తులో మరొకని కెవ్వరికి యుండునని ఊహించుటకైన అవకాశముకూడ లేదు. ఇట్టి నీయందు వైరాగ్యమునకు ఎడ

మెచ్చుట ముముక్షుత్వమెటులవచ్చుట? మా గురువు నిన్ను ఏపరిస్థితులలోనే జూచి భ్రమపడి యుండవచ్చును. ఇకనే పోయివచ్చెద. నీవల్ల నా పని కాజాలదు, అని శిష్యుడు లేచెను. జనకుడు నమస్కరించుచు 'స్వామి శాంతించుడు. నా ఈభోగరాగములజూచి నేను ఎటుల భ్రాంతుడను అగుటలేదో మీరుకూడ అటులనే భ్రాంతి చెందకుందురు గాక. ఈభాగ్యభోగ్యములన్నియు ఆ యాస్థితులు కర్తవ్యనిర్వహణకు సంబంధించినవి మాత్రమే. నాకు వీనిలో దేనియందును కాంక్ష గాని, ఆసక్తగాని, సంగమముగాని లేదు. ప్రతిమానవుడు తనవర్ణాశ్రమ ప్రయుక్త ధర్మములను కర్తవ్యవిధులను, దేశ కాలపాత్రల ననుసరించి నిర్వర్తించుచుండక తప్పదు కదా. ఆజ్ఞయుందు నిస్సంశయముగా మీయాజ్ఞను యిప్పుడే పాటించసంసిద్ధుడను, మీరు సద్బ్రాహ్మణులు, అధిపతులు విశేషించి నాగురువుగారిచేత పంపబడిన వారి శిష్యులు మీరు నాకు గురుతుల్యులు. మీ యాజ్ఞకు సర్వదాబద్ధుడను. అని జనకుడు కేలుమోడ్చి శిష్యుని ఎదుట నిలబడెను.

సభయంతయు ఆశ్చర్యచకితులై నిశ్శబ్దముగ జూచుచుండిరి. సామంతులు తమకష్టముల జెప్పుకొనసిద్ధముగ యుండిరి, మంత్రులు రాజకీయ వ్యవహారముల నివేదించ లేచి యుండిరి. దండనాయకులు నేరముల తీర్పునకై ఎదురుజూచుచుండిరి. కోశాధికారులు ఆదాయవ్యయపట్టిక పరిశీలనకై వేగిరపడుచుండిరి. పండితులు వాదనకై ఆయత్తపడుచుండిరి. నటకత్తెలు నాట్యమునలు పుట్నకై నిలబడియుండిరి. జనకుని కప్పుడు ఊపిరి సలుపనంత అత్యవసర కార్యక్రమముండెను.

ఈపరిస్థితులలో గురుపుత్రులతో యింత సావకాశముగ జనకుడు సంభాషించుటయే మహదాశ్చర్యవిషయము. ఆయన మానసము ఏకొద్దిమాత్ర అలజడైనను లేకుండెను, హిమవత్పర్వతమువలె స్థిరచిత్తుడై స్వాచార్యుల ధ్యానించుచు సత్తీర్థులయాజ్ఞకై ఎదురు జూచుచుండెను.

శిష్యులు:—నీవు చెప్పినదినిజమే అయినచో ఈక్షణములోనే ఈభోగభాగ్యముల విడిచి మాతో ఆశ్రమమునకు రాగలవా?

జనకుడు:—చిత్తము. పదండి మీవెనుకనే వచ్చుచున్నాను.

శిష్యులు:—ఈరాచకార్యముల నవరించుకొని, వీరలకందరకు సమాధానముచెప్పి, ఈవేషముల మార్చుకొని ఆశ్రమప్రవేశ యుక్త వేషధారివై బయలు దేరకోరవా?

జనకుడు. ఏల ఆలస్యము స్వామీ ఈకాలచక్రము మనకై తిరుగదు. మనకై ఆగదు. ఈ రాచకార్యములు నాచే నిర్వహించబడునవి కావు నేను లేనిచో ఆగిపోవునవి కావు. నేనిపుడు మీయాజ్ఞానుసారము ఆశ్రమమునకు బయలుదేరకుండగ యిచ్చటనే కూర్చుండియున్నను తప్పక జీవించియే యుందునని ప్రాచీవేమి? ఏపక్షవాతమో, ఏమృత్యుకారణమో తటస్థించకుండయుండునని ఎవరు చెప్పగలరు? అపుడీ కార్యముల స్నియు ఏమియగును? మనకోసమాగునా? మనము నిమిత్తమాత్రమే బ్రాహ్మణ యాజ్ఞానివర్తనకంటె ఇవి ముఖ్యములా? ఇక ఈవేషమా, ఇది నారాకకై మాత్రము అడ్డురాదు. ఇదిమార్చుకొను ఆలస్యమేల? దీనిని కావలెనని నేను కోరితిని గనుకనా యిపుడు వలదనుటకు అది

ఎటుల ఎందులకు వచ్చెనో, పోవలసివచ్చినపుడు తనంతట తానే అటులనే పోగలడు. పదండి, ఆశ్రమమునకు పోవుదము. శిష్యుడు ముందు బయలుదేరి దారితీయగా ఆయన వెంటనంటి జనకుడు సభను వీడివెళ్లెను. వెళ్ళునపుడు జనకుడు ఒకరితోనైనను "ఉ" అనలేదు. ఏవిషయమును ఎవరికిని తెలుపలేదు. అంతఃపురమునకు కబురు పంపలేదు. తాను తిరిగి ఫలానా సమయమున వత్తునని కాని, ఫలానాపని ఫలానామోస్తరుగ చేయమని గాని ఏమియు తెలుపలేదు. సర్వసంగపరిత్యాగియై గోచిగుడ్డయైన లేని అవధూతకైన, దండమును సర్దుకొనుటలో, కమండలమును ధరించుటలో, ప్రక్కవారిని పలకరించుటలో యుండకతప్పదు. గాని మహారాజాధిరాజైన జనకునికి మౌనముతో దిగ్గునలేచి గొబ్బున ఆశిష్యుని వెంబడించుట తప్ప మరి ఏదియు లేకుండెను. మహారాజుయొక్క సభాసదులు బంధువర్గము నిశ్చేష్టులై నిలబడిపోయి యుండిరి. వారందరికి జనకుని నిర్లిప్తత ఇదివరలోనే తెలుసును కాబోలును.

శిష్యుడు ముందు చక్రవర్తి వెనుక నడిచినడిచి మధ్యాహ్నము ఒంటిగంటవేళ కొక నట్టడవిచేరిరి. ఎండలో ఆచ్ఛాదనలేకుండగ ఏకధాటిగ నడచుటచే చక్రవర్తికి వడగొట్టెను. దాహము మిక్కటమాయెను. త్రోవప్రక్కనున్న ఒకబండపై స్పృహతప్పి మహారాజు పడిపోయెను. అతనికి దాహతీర్థము తెచ్చియిచ్చుటకై శిష్యుడు నీటికై వెతుకుచు దూరముగ పోయెను.

ఇంతలో చక్రవర్తియొక్క ఒక సామంతరాజు చక్రవర్తి దర్శనమునకై రాజధానికి ఆమార్గమున వచ్చుచు బండపై పడియున్న చక్రవర్తిని జూచి ఆశ్చర్యపడెను. వెంటనే ముందు ప్రయాణమును నిలుపుజేసి అచ్చటనే డేరాలు వేయించి మొగమలు పరుపుపై చక్రవర్తిని పరుండబెట్టి పన్నీరు మున్నగు వానిచే సేదతీర్చి మహారాజోపచారముల జేయుచుండెను.

ఈసమయమున శిష్యుడు ఆకుదొప్పలో సెలయేళ్ళ నీరుతీసుకొని చక్రవర్తి వడగొట్టి పడిన చోటునకు వచ్చెను. అచ్చట చక్రవర్తి లేడు. సరికదా శిబిరములతో ఒక నగరము వెలసియుండెను. కాపలాభటులు ఆయనను లోనికి బోనీయకుండిరి. ఎట్టకేలకు తగుసమాధానముల జెప్పి లోనికివెళ్ళి జూచెను, చక్రవర్తి పట్టుపరుపపై పరుండియుండెను. అప్సరసలవంటి స్త్రీలు పన్నీరు జల్లుచు, వట్టివేళ్ళ విసినికర్రలచే విసరుచుండిరి. మరికొందరు స్త్రీలు దివ్యచందనము పూయుచుండిరి. మరికొందరు స్త్రీలు మధురపానీయముల నందించుచుండిరి. సామంతరాజు సరదారులతోకూడి స్వయముగ సమస్తోపచారముల జేయుచుండెను. రాజధానిలోకంటె అధికముగ ఉపచారములు జరుగుచుండెను.

చక్రవర్తి తనఎదుట ఆశ్చర్యచకితుడై నిశ్చేష్టుడై నిలబడిన గురుశిష్యుని జూచి, 'అయ్యో, పోవుదమా, ఏదో దైవసంఘటనచే వీరందరు నన్నిటకుగొని తెచ్చి ఏమేమో చేయుచున్నారు క్షమించుమని' అనుచు లేచి శిష్యుని వెంట ప్రయాణమాయెను.

శిష్యునికి అపుడు చక్రవర్తి యొక్క నిర్లిప్తత, భోగవిలాస రాహిత్యత, నిశ్చలవైరాగ్యశీలత, ఐహికవిషయ పరాఙ్ముఖత, పరమాత్మైక లగ్నైకమనస్కతి అనుభవములోనికివచ్చియుండు లనెను. చక్రవర్తి నాకిపుడు నీజ్ఞానానుష్ఠానము లు, శీలము, వైరాగ్యము, అనుభవపూర్వక ముగ తెలసినవి. రాజధానిలోనున్నను, కారడ విలోనున్నను చక్రవర్తియైనను, సన్యాసియైనను అనుభావ్యము అనుభవించక తప్పదు. నిస్పృ హతో తన కర్తవ్యమును నిర్వర్తించుట మా త్రమే మనవిధాయకము, నిన్నింతవరకు అర్థము చేసుకొనలేక పరీక్షచేసి కష్టపెట్టినందులకు క్షమిం చుమని చెప్పి శిష్యుడు తన ఆశ్రమమునకు పో యెను. చక్రవర్తి సామంతునితో తనరాజధానికి మరలెను.

---

# మోక్షాధికారము

జిజ్ఞాసువు:
శ్రీమతి డా. గోదాదేవి.
విజయవాడ.

ప్రశ్న:— జన్మతః బ్రాహ్మణుడై, అందును పురుషుడై, యథాసమయమున ఉపనీతుడై గురుకులమున బ్రహ్మచారియై, వేద-వేదాంత-వేదాంగాధ్యయనమును జేసినవాడై పిమ్మట సన్యా సియై, పరమహంసయై, మహాజ్ఞానియైన వానికి మాత్రమే మోక్షమార్గ మందధికారముగలదు. మిగతవారి కెవరికి లేదు. అని కొందరనుచున్నారు.

ఏ వర్ణస్థుడే గాని, ఏ ఆశ్రమస్థుడే గాని, ఏ వయస్సులోని వాడే గాని, స్త్రీ యే గాని, పురు షుడే గాని అందరికి కూడ మోక్షమార్గ మందధికారము గలదందురు శ్రీవైష్ణవులు. ఈ రెండిం టికి సమన్వయ మున్నదా? లేక యిందొకటి పూర్వపక్షము రెండవది సిద్ధాంతము అగునా?

సమాధానము "శ్రీమన్నారాయణ"

ఈ రెండు వాక్యములు కూడ యదార్థములే. ఈ రెండింటికిన్ని సమన్వయ మున్నది.

ముక్తిమార్గ ప్రవిష్టుడగుటకు బ్రాహ్మణు డగుట ఆవశ్యకము. ముక్తి యనునది ఆత్మకు మాత్రమె సంబంధించినది. దానికి దేహము సాధనము మాత్రమే.

బ్రాహ్మణత్వము రెండు విధములు. ఒకటి దేహమునకు సంబంధించినది. మరొకటి ఆత్మకు సంబంధించినది. జన్మతః బ్రాహ్మణ వంశము నందు జన్మించుటవలన కలిగిన బ్రాహ్మణత్వము దేహమునకు సంబంధించినది. ఇచ్చట బ్రహ్మ శబ్దమునకు వేదము అని అర్థము. దానిని అధ్య

యనము చేయువాడు చేయించువాడు బ్రాహ్మణుడనబడును.

ఆచార్యోపదేశ పురస్సరముగ స్వతః బ్రహ్మ విషయక జ్ఞానము కలిగియుండుటవలన కలిగిన బ్రాహ్మణత్వము ఆత్మకుసంబంధించినది. ఇచ్చట బ్రహ్మశబ్దమునకు పరమాత్మయని అర్థము. దానిని తెలుసుకొని ఉపాసించువాడు బ్రాహ్మణుడనబడును.

ప్రశ్నలో తెలుపబడిన మొదటి వాక్యమందలి బ్రాహ్మణ శబ్దమునకు జన్మతః బ్రాహ్మణుడనియు, ఆ బ్రాహ్మణత్వము దేహమునకు సంబంధించినదనియు అర్థము. జన్మతః బ్రాహ్మణుడైనవాడు ఆ వాక్యమునందు తెలుపబడిన నియమ నిష్ఠుడై యున్నగాని మోక్షాధికారి కాజాలడు.

రెండవవాక్యము కేవల ఆత్మకు సంబంధించినది. ఆత్మకు వర్ణాశ్రమములు కాని, బాల్యాద్యవస్థలు గాని, స్త్రీ పురుష బేధములు గాని లేవు. అన్ని ఆత్మలు జ్ఞాన స్వరూపములైనవియే. జ్ఞానైకాకారములై ఉన్నవియే. ఏఆత్మయైనను సరియే బ్రహ్మవిషయక జ్ఞాన సంపన్నమైన దైనచో తప్పక మోక్షాధికారి యగుచున్నది. దానికి తాను ధరించిన దేహ గుణములు ఆటంకములు కాజాలవు.

దేహము సాధనము కాన దేని స్వభావములు ఆత్మకు సంబంధించవా యని సంశయించ బనిలేదు. బ్రహ్మజ్ఞానియైన వానికి దేహాత్మ భ్రమ యుండజాలదు. ఆత్మ యొక్క శేషత్వ-పారతంత్ర్య-విధేయత్వ-ఆధేయత రూప స్వరూప జ్ఞానముండును. అందుచే దేహ స్వభావములు ఆత్మకు సంబంధించవు.

చేతియందు కుండ యున్నది. ఆ కుండయందు పాలు కలవు. ఆ పాలమీద నొక ఈగ యున్నది. చేయియు, కుండయు, పాలును నీగయు నొక్కటిగా కూడి యున్నను నవి యొకటొకటి వేరే వేరే యగును గాని కుండకు పాలు భావము కలుగదు. పాలునకు నీగతనము కలుగదు. ఈ విధముగానే వర్ణములును ఆశ్రమములును, అవస్థలును, అంగములును ముక్తుడగు వానియందు పరస్పరము కలిసి యున్నను ఇవి వానిని సంబంధించి యుండవు.

ఏ వర్ణాశ్రమావస్థలింగ విశిష్టుడైనను సరియే ముక్తుడగుటకు, ప్రతిదినము-ప్రతిక్షణము అనుష్టానమున తను వర్ణాశ్రమ-ధర్మములకు విధించబడిన రీతిని పరమాత్మ ఉపాసన రూపమున భగవత్ప్రీతికి పాత్రుడై శరీరపాత పర్యంతము భగవచ్ఛరణాగతిని పొంది, బ్రహ్మజ్ఞానియై యుండితీరవలెను. ఇటుల లేనివాడైనచో వాడు జన్మతః బ్రాహ్మణుడైనను సరియే, పరమహంసయైనను సరియే వానికి ముక్తి లేదు. ఇటుల యున్నచో బ్రాహ్మణుడే గాని, క్షత్రియుడే గాని, వైశ్యుడే గాని, శూద్రుడే గాని, చండాలుడే గాని, సంకర జాతీయుడే గాని, జాతి బాహ్యుడే గాని, బ్రహ్మచారియే గాని, గృహస్థుడే గాని, వానప్రస్థుడేగాని, సన్యాసియేగాని, ఏ వృత్తిలో యున్నవాడే గాని, బాలుడే గాని, యవ్వనుడే గాని, ముసలివాడే గాని, స్త్రీయే గాని, పురుషుడే గాని, నపుంసకుడే గాని మోక్షాధికారియగుటలో ఎట్టి సందేహము లేదు.

# ప్రశ్న:- శ్రౌత ధర్మమనగా నేమి?
# స్మార్త ధర్మమనగా నేమి?

" శ్రీమన్నారాయణ "

సమాధానము:— ధర్మమనెడి పదమునకు ధాత్వర్థము ధరించుట యనియు; కూడి యుండుట యనియు నర్థములు చెప్పబడుచున్నవి.

అందు ఇష్టఫలమును పొందుచు నది ధర్మమనియు ఇష్టము గాని ఫలమును పొందించునది యధర్మమనియు పెద్దలు తెలుపుచున్నారు.

దేశ-కాల-పాత్రల ననుసరించి ధర్మము అనేక విధములుగ నుండును. అందును సామాన్య ధర్మము, విశేషధర్మము, నైమిత్తిక ధర్మము, ఆపద్ధర్మము. ప్రవృత్తిధర్మము, నివృత్తి ధర్మము, ఈ రీతిగ ధర్మము వివిధరీతుల విరాజిల్లుచున్నది.

ఎపుడు ఎట్టివారికి ఏది ధర్మమో తెలుసుకొనుట సామాన్యజనునకు శక్యమైన పనికాదు. వేద వేదాంత వేదాంగ పారంగతులై, అమిత తపోసంపన్నులై, స్వార్థత్యాగనిష్ఠులై, భగవదనుగ్రహీత భూత-భవిష్య ద్వర్తమాన జ్ఞానసంపన్నులైన శిష్టులైన ఋషులకే గాని ధర్మనిర్ణయము శక్యము గాదు. ధర్మ నిర్ణయమునకు వేదమే శరణ్యము. అదియే పరమ ప్రమాణము. అయితే అందు ధర్మము సర్వసాధారణ రూపేణ నిర్వచించబడుచు దేశకాలపాత్రాను గుణ్యముగ దానిని వ్యాఖ్యానించి నిర్ణయించుకొనుటకు అనుగుణముగ తెలుపబడినది. ఈ నిర్వచిత ధర్మములనే శ్రౌత ధర్మములందురు. దానము, అగ్నిహోత్రము, యాగము ననెడి యివి శ్రౌతధర్మలక్షణములు.

వీటినే దేశ-కాల-పాత్రానుగుణ్యముగ మహర్షులు నిర్వచించి స్మృతుల రూపమున తెలిపి యున్నారు. అహింస, సత్యము, పరధనాపహరరాహిత్యత, బ్రహ్మచర్యము, పట్టు లేకుండుట యను నియమములతోను; శౌచము, మనోతృప్తి, తపోనిష్ట, వేదాధ్యయనము, ఈశ్వరోపాసన యనె నియమములతోను గూడిన వర్ణాశ్రమ ధర్మానుష్ఠానము స్మార్త ధర్మలక్షణములు అని పెద్దలు తెలిపెదరు.

[భారత నిర్వచనము]

# శ్రాద్ధము - శ్రద్ధ

"శ్రీమన్నారాయణ"

కర్మభూమియైన భారతావనియందు ఆస్తికుడైన ప్రతివాడు పరలోకగతుడైన తన పితరుల నుద్దేశించి శ్రాద్ధములు సలుపుట శిష్టాచారమై యున్నది. ఎంతటి నవనాగరికుడైనను అంతవరకు ఎన్ని కబురులు చెప్పినను, ఎందరిని ఎన్ని విధములుగ ఆక్షేపించినను తన పితరులు చనిపోయినపుడు మైలపట్టుట, ఊర్ధ్వదైహికక్రియల చేయుట ప్రతి సంవత్సరమునను ఆ చనిపోయిన దినమున శ్రాద్ధక్రియల జేయుచుండుట పరిపాటియై యున్నది.

తాను జూదరియైనను, వ్యభిచారియైనను, అనాచారపరుడైనను, అసమర్థుడైనను, అత్యంత శుంఠయైనను, తాను శ్రాద్ధమందు నిమంత్రించబడు వాడు మాత్రము శిష్టాచారపరుడై, మంచి నడవడిగలవాడై, మంచి నీతి ధర్మముల గలవాడై, సమర్థుడై, పండితుడై యుండవలెనని వాంఛించును.

అప్పటివరకు తాను బొట్టును ఆక్షేపించినా, జుట్టును అధిక్షేపించినా, మడిని పరిహసించినా జందెమును హేళనజేసినా, సనాతన ధర్మానుష్ఠానమును దూషించినా, తాను పెట్టు శ్రాద్ధమున మాత్రము ఆ ఆక్షేపకుడే తనచే నిమంత్రించబడు వాడు మాత్రము స్నానము జేసి మడిగట్టుకున్నవాడై బొట్టు పెట్టుకున్నవాడై మంచిజుట్టు, జందెము గలవాడై కొంచెమైనను సనాతన ధర్మానుష్ఠానపరుడై యుండగోరును. ఇదంతయు ఏలకలుగుచున్నది? పితరుల యందు తనకు గల కృతజ్ఞత–గౌరవము–ఆదరణ– ప్రేమ వీని వలన కలుగుచున్నది.

కరుకు కలవాలమున గంగిగోవుల నరక కలిగిన పచ్చి కటికవానికి కూడ తన తల్లి తండ్రుల మీద, భార్యా బిడ్డలమీద ప్రేమ–ఆదరణ లేకుండునా?

అమాంతముగ నొడ నులిపి హత్యజేసి వస్తువుల నపహరించు గజదొంగకు కూడ తన తల్లి తండ్రిలు, భార్యా బిడ్డలపై ప్రేమ–ఆదరణ లేకుండునా? ఎందరు ఎన్ని ఘోరాతిఘోరమైన పనులను జేసినను తన ప్రేమీయుల పోషణకే కదా. వారల ప్రేమ తృప్తికే కదా. తన వారిపై తనకు ప్రేమ, ఆదరణ లేనిచో ప్రపంచమున యిన్ని హింసలు, ఇన్ని హత్యలు, ఇన్ని దొంగతనములు, ఇన్ని అబద్ధములు, ఇన్ని దూరాచారములు ఘటిల్లనే నేరవుకదా? తన పితరుల ఊర్ధ్వదైహిక క్రియలకు కూడ ఈ బంధుప్రేమయే పరమకారణము. ఈ రక్తసంబంధమైన అనురక్తియే ముఖ్యహేతువు.

ఈ ఊర్ధ్వదైహిక క్రియలకు శ్రాద్ధమను పేరేల కలిగెను:– శ్రద్ధతో నాచరించబడునవి గాన శ్రాద్ధక్రియలనబడెను. ప్రేమకు ప్రతి ఫలము, ప్రతిక్రియ శ్రద్ధమాత్రమే. గావుననే ప్రతి మానవుడు తన ప్రేమీయులకు వారి మరణానంతరమున వారి సౌఖ్యానందములకై తప్పక శ్రాద్ధమాచరించవలెను. శ్రద్ధవిశేషమేమనిన

మానవ జీవితములో జరుపబడు క్రియలన్నింటి కిన్ని కావలసిన గుణములలో ప్రధానతమ మైనది, ప్రథమమైనది, ప్రసిద్ధమైనది శ్రద్ధయే- శ్రద్ధలేనిచో సృష్టియే లేదు. రక్షణ నాస్తి. ఫలమును సున్న. అన్నింటికిన్ని ఆధారభూత మైనది శ్రద్ధయే.

లోకాధార భూతమైన యజ్ఞాచరణమునకు యజమాని వివాహితుడై భార్యను సమీపమం దుంచుకొనవలెను. భార్య లేనివానికి యజ్ఞాధి కారము లేదు. గాని ప్రపన్నుడైనవానికి భార్యా రహితుడైనను శ్రద్ధనే భార్యగా భావించి యజ్ఞ ము నాచరించవలెనని శాస్త్రములు విధించు చున్నవి.

శ్రద్ధను గురించి భారత శాంతి పర్వమున నిటులయున్నది.

ప్రాణిహింస లేకుండగ శ్రద్ధతో గావించు కర్మములు ఇహమందును, పరమందును ఫలము లొసంగుచుండును. హింసాత్మకములగు కర్మ ములు శ్రద్ధను నాశము జేయుచున్నవి. శ్రద్ధ నశింపగా తన్నాశనకే నాశములను దెచ్చు చున్నవి. బ్రహ్మమును గురించిన శ్రద్ధ సూర్యు నకు కూతురు. అది రక్షించునది. అది మంచి పుట్టుకను గలది. శ్రద్ధ వేదజపము కంటెను, ధ్యానమున కంటెను నెక్కుడైనది. వాక్కు- లోపముచే జెడిన కార్యమును శ్రద్ధ కాచి రక్షిం చును. మనస్సు దోషముచే జెడిన కార్యమును శ్రద్ధ కాపాడుచున్నది. శ్రద్ధాలోపముచే జెడిన కార్యమును వాక్కుగాని, మనస్సుగాని గావ నేరవు. శుచియయ్యును శ్రద్ధలేనివాడు వేల్చు యజ్ఞద్రవ్యములును, నశుచియయ్యు శ్రద్ధగల వాడు వేల్చు ద్రవ్యములును రెంటిని దేవతల సమముగా భావించుచున్నారు. శ్రోత్రియుడయ్యు పిసినిగొట్టువాని యన్నమును, దాతయయ్యు వడ్డికిచ్చి బ్రతుకువాని యన్నమును దేవతలు చక్కగా నాలోచించి సమానములైనవని తలంచుచున్నారు. దాతయగు వాని యన్నము శ్రద్ధచేత పవిత్రమైనది. శ్రద్ధలేనివాని యన్నము హతమైనది. శ్రద్ధయున్నవాడు వడ్డీవల్ల బ్రతుకు వాడైనను, శ్రద్ధగలవాడైయున్నచో అట్టివాని యన్నమును భుజించవచ్చును. పిసిరిగొట్టువాని యన్నము గుడువతగదు. ఈ ప్రపంచమున శ్రద్ధలేని వాడొక్కడు మాత్రమే దేవతలకు హవిస్సుల నొసంగ నర్హుడు గాడు. అట్టివాని యన్నము మాత్రమే ఎంత మాత్రము స్వీక రించరాదు.

శ్రద్ధలేకుండుట మహాపాపము.

పాము కుబుసమును విడుచునటుల శ్రద్ధగల వాడు తన పాపముల నెల్ల విడువ సమర్థుడగు చున్నాడు. శ్రద్ధతో కూడిన నివృత్తిధర్మము పవిత్రమైన వానన్నింటిలోను పెద్దది. ఎవ్వడు శీలమునకు గల దోషము లన్నియు వదలి శ్రద్ధ తో గూడి యుండునో, వాడు పవిత్రుడే య గును. అట్టివానికి తపస్సుతో గాని వృత్తితో గాని, క్షమతో గాని పనియేమి?

శ్రద్ధయు-సత్త్వము-రజస్సు - తమస్సు అని మూడు విధములు. ఎవని కేగుణమునకు సంబం ధించిన శ్రద్ధకలుగునో వానికట్టి ఫలితము కలుగ గలదు.

సాత్త్విక శ్రద్ధ గలవాడు.

పరమాత్మను-తత్పరిచారకులగు దేవతలను తచ్ఛక్తులను ఆరాధించును. ఆయుస్సును,అంతఃకరణ జ్ఞానమును, బలమును, ఆరోగ్యమును, సుఖమును, ప్రీతిని వృద్ధిపొందునట్టియు, మధురమై, మనోహరమై చమురు గలిగి, బలము నిచ్చునట్టి ఆహారమును భుజించును. భగవత్కైంకర్య రూపముగ, ఫలమును కాంక్షించకుండగ శాస్త్రోక్తవిధిని యజ్ఞయాగాదుల నొనరించును.

ఉద్రేకరహితముగను, సత్యము-ప్రియము-హితము కలుగునటులను, పలుకును, వేదాభ్యాస మొనర్చును. మనస్సును నిర్మలముగ నుంచును. పరుల యభివృద్ధిని కోరును. మితభాషిగ యుండును. సదా భగవద్ధ్యానము కలిగి యుండును. ఆత్మేతరచింత మానియుండును. ఫలమును కోరకుండగ భగవత్కైంకర్య రూపమున తన విద్యుక్త కర్మల నాచరించుచుండును. దేశ-కాల పాత్రల ననుసరించి ఫలాభి సంధి రహితముగ ప్రత్యుపకార కాంక్షా విరహితముగ దానము చేయును. ఏపని జేసినను ఓం, తత్, సత్,అను శబ్దములను చర్చించుచు కృష్ణార్పణ బుద్ధితో జేయును.

రాజసశ్రద్ధగలవాడు:—— యక్షులను-రాక్షసులను ఆరాధించును. చేదు, పులుపు, మిక్కిలి ఉప్పన, మిక్కిలి వేడి, కారము, తాపము వీనిని కలిగియున్న ఆహారమును భుజించును.

ఫలమును కోరుచు, డాంబికము కొరకై యజ్ఞయాగాదుల జేయును.

గౌరవము కొరకున్ను, కీర్తికొరకున్ను, పూజ్యత కొరకున్ను ఆడంబరముతో స్థిరత్వము లేకుండగ తపస్సు చేయును.

ప్రత్యుపకారమును కాంక్షించుచుయు, ఫలమును కోరియు, మనస్సున క్లేశపడుచు దానముల జేయును.

తామసశ్రద్ధగలవాడు:- ప్రేతములను, భూతగణములను ఆరాధించును. శాస్త్రవిరుద్ధముగను ఘోరముగను, దంభాహంకారములతోను,కామ రాగాధిక్యములతోను తపస్సాచరించును. అంత రాత్మరూపుడైన పరమాత్మ జ్ఞాన రహితుడై వృథాగా ఉపవాసాదులచే శరీరమును కృశింపజేయును.

కుళ్ళిన, మగ్గిన, పాసిపోయిన, రసవిహీనమైన, దుర్గంధయుతమైన, గురు-భర్తవీరులుగాక తదితరుల ఎంగిలియైన, భగవన్నివేదితముగానట్టి ఆహారమును భుజించును. శాస్త్రవిధాన మనుసరించకుండగను, అన్యాయార్జితవస్తు సామగ్రితోను ఋత్త్వికులకు దక్షిణలనీయకుండగ యజ్ఞయాగాదుల నొనర్చును.

మూఢత్వముతోను, దురాగ్రహముతోను, ఇతరులకు హానికలిగించు నుద్దేశముతోనుతపస్సు చేయును.

యోగ్యముకాని దేశమందు, యోగ్యముకాని కాలమందు యోగ్యులు కాని వారలకు, గౌరవ రహితముగను, అవమానించుచును దానము జేయును.

గాన శ్రద్ధగా చేయుటలో కూడ సాత్వికత్వమును పాటించుచు మాత్రమే ఏ పనినైనను జేయవలెను.

శ్రద్ధలేకుండగ జేయబడు హోమము, దానము, తపస్సు అన్నియు వ్యర్థము. ఆత్మాభివృద్ధి కాటంక భూతములు.

## ప్రశ్నోత్తరములు:



ప్రశ్న :—

# ఏకాదశీ వ్రతానుష్ఠానమున ముఖ్యమనుష్ఠించవలసిన విధి-నిషేధ నియమము లెవ్వి ?

సమాధానము :—ఏకాదశీ వ్రతానుష్ఠానము రెండు విధములుగ నున్నది. ఒకటి సామాన్యవిధి; రెండు విశేషవిధి.

సామాన్యవిధి :—జనసామాన్యము వ్రతరూపముగ ఆచరించునది.

విశేషవిధి :—కేవల ప్రపన్నులు మాత్రము తమ స్వరూపప్రయుక్తముగ ఆచరించునది.

సామాన్యవిధికి దశమినాడు పగటిపూటమాత్రమే ఒకపర్యాయము సాపాటుచేసి రాత్రి రెండవపూట ఉపవాసముండుట. ఏకాదశినాడు పగలు రాత్రి కూడ ఏ ఆహారము తీసుకొనకుండగ రెండు పూటల ఉపవాసముండుట. ద్వాదశినాడు, ఉదయమున మాత్రము వంటిపూట సాపాటుచేశి రాత్రి రెండవపూట ఉపవాసముండుటయును నియమమై యున్నది.

విశేషవిధికి దశమీ ద్వాదశి ఈరెండు తిథులయందును వంటిపూట ఉపవాసము లవసరము లేదు. విద్ధరహితమైన శుద్ధఏకాదశినాడు పెరుమాళ్ళకు ఆరగింపుచేసిన ప్రసాదమును ఒక కణము మాత్రము గ్రహించి నిర్జలముగ రెండు పూటల శుష్కోపవాసము సలుపుటయును అయియున్నది.

నిషేధములు:—దశమీ, ద్వాదశి తిథులలో త్రాగుటకుగాని, తినుటకుగాని, పచనమునకుగాని కంచుపాత్రల వాడరాదు. మద్య-మాంసములను, శనగలను, కొర్రలను, ఇతరుల యన్నమును, మత్తుపదార్థములను, ఆకుకూరలను, నూనెను వాడరాదు. స్త్రీసంభోగము, రజస్వలాదర్శనము కూడదు. ద్వాదశినాడు తేనెను, చింతపండును, అధికమగు ఉప్పు, కారము, పులుసులను, వ్యాయామమును. కఠినమగు దుంపకూరలను,

తులసిని కోయుటను, నూనెను, నువ్వులను, నువ్వుపప్పును, ఉపయోగించరాదు.

ఏకాదశినాడు, విలాసరూప ఆటపాటలు, వ్యర్థసంభాషణ పాషండ దర్శనాలాపములు, నిద్ర, తాంబూలము, ఇవి కూడదు. పుల్లతో పండ్ల తోముకొనరాదు. ఏకాదశి ద్వాదశులలో, తలంటును గాని, క్షౌరము చేయించుకొనుటగాని, ప్రయాణము చేయుటగాని కూడదు.

విధులు:- దశమీ భగవదారాధనము తన్నివేదిత ప్రసాదస్వీకరణ, తుంగచాపమీద శయనము, సత్పురుషగోష్ఠి, బ్రహ్మచర్యము విధాకములు

ఏకాదశినాడు:— పుణ్యతీర్థమందు తులసిమట్టి గోమయము, ఉసిరికాయ చూర్ణములు శిరస్సునకు శరీరమునకు రాసుకొని శిరస్స్నానమాచరించుట భగవదారాధనము, కోవిలకు వెళ్ళి పెరుమాళ్ళ సేవించుట భగవద్గీతాది సద్గ్రంథకాలక్షేపము వీలైనంతవరకు మౌనము, రాత్రికూడ జాగరణము భగవత్సంకీర్తనము చేయవలయును.

ద్వాదశినాడు:— సూర్యోదయాత్పూర్వమే శిరస్స్నానము, సూర్యోదయాత్ ఏడు ఘటియలలోపుగ భాగవత తదీయారాధనను జేసి తచ్ఛేషమును తాను కూడ స్వీకరించుట, ఆహారములో ఎండు ఉసిరికాయ పొడుముతో చేసిన పచ్చడి, అవిసియాకుకూర, పాయసము వాడుట, యథాశక్తి బ్రాహ్మణులకు దానధర్మములు సాధువులుగోష్ఠి, సత్కాలక్షేపము సలుపవలయును. పచనమునకు కందిపప్పుకంటె పొట్టి పెసరపప్పును వాడుట మంచిది.

# మతప్రచారమును జేయు మానవుడే నిజమైన సంపూర్ణ దయాళుడు

"శ్రీమన్నారాయణ"

సముద్రమునబడి మునిగిపోవుచున్న మానిసిని బ్రతికించుటకై యబ్ధికడ్డుబడిన యీతకాడు దయాళుడు కాడు.

కాలు దిగగూలి పోవుచున్న యింటిలో నేమూలనో మ్రగ్గిపోవుచున్న ముసలివాడు దానిని బ్రతికించుటకై మంటలలో దుమికిన సాహసికుడు దయాళుడు కాడు.

ఆకలిచే అలమటించుచు అల్లాడిపోవుచున్న అంధునికి అత్యాదరముతో అన్నమును కలిపి నోటికందించు అన్నదాత దయాళుడు కాడు.

తుచ్ఛసుఖపర పరాభిరతుడై, కనక కామిని కిరీట-కీర్తి దేవతా విగ్రహారాధన తత్పరుడై, యింద్రియలోలుడై, శుద్ధచపలుడై, నాస్తికామార్గావలంబుడై క్రిందికి దిగజారిపోవుచున్న మానవుని భక్తిమతమున కాకర్షించి ప్రపంచసుఖ విరక్తిని కలిగించి దైవపాదపద్మముల బడవైచి యధఃపతనమగుచున్న యాత్మకు ఊర్ధ్వగతినిచ్చి తరింపజేయు నతడే నిజమైన దయాళుడు సంపూర్ణ దయాళుడు.

మానవుని పరమావధి తాను తరించుట గాదు. తాను తరించుచు తోటిప్రాణి కోటిని తరింపజేయుటయే.

మానవుని జ్ఞానమునకు ఫలము తాను మోక్షమార్గమును తెలుసుకొనుట గాదు.

తోటిమానవులకు మోక్షమార్గమును తన జ్ఞానానుష్ఠానములచే బోధించుటయే.

మానవుని భక్తికి సాఫల్యత తానుమాత్రము కొండగుహలలోనో, కారడవులలోనో, ప్రత్యేక మఠములలోనో, నదీగర్భములలోనో, ఏకాంతముగ పరమాత్మను ధ్యానించుచు ఆరాధించుట గాదు.

తోటి మానవులను భక్తులుగజేసి వారుగూడ ధ్యాననిమగ్నులై పరమాత్మారాధకు లగునటుల జేయుటయే.

ఎవఁడింద్రియములఁ బరుచుకొని వానిచే విషయములయందు తగులు బడక యే యనుభవించుచు శాంతాత్ముఁడును. నిర్వికారుఁడును. సమాధినిష్ఠుడునై తన యింద్రియముల కభిమానిదేవతలతో గూడియు వీడియు వరించునో. దేహము కలిగియున్నను, ఆదియె తానని తలంపక యుండునో, అట్టివాడు విముక్తి నొంది త్వరితముగా న పరంబగు శ్రేయమును బొందుచున్నాడు.

సంసార మనునది మిక్కిలి భయంకరమైనది. రూపము దాని తీరములు మనస్సు దాని ప్రవాహవేగము సర్పమందలి ద్వీపము. రసము దాని ప్రవాహము. గంధము దాని రొంపి. శబ్దము దాని జలములు. దేహము దానిని దాటు తెప్ప. క్షమ దానిని దాటు సాధనముగు తెడ్డు. సత్యము దానిని నడుపదగు బరువు. ధర్మము దానిని నీడ్చుటకైన కంబమునకు కట్టు త్రాడు. దానము దానిని నడుపు గాలి.

## శ్రీ యతిరాజ భజన కీర్తనములు

శ్రీమాన్ శ్రీమత్తిరుమలై నల్లాన్ చక్రవర్తి సంపత్కుమార జగన్నాథ తిరువేంకటాచార్యులవారిచే రచింపబడినవి.

### 4 కీర్తన కేదారగౌళ ఆది

ప॥ రామానుజార్యాగుణధుర్యా । శ్రీయతికులవర్యా ॥రా॥

అ॥ పామరుల సముద్ధరింప మీరలు । బడిన శ్రమల । కు లికిపడరె వారలు ॥రా॥

చ॥ ఐదుగురయ్యల భజియించి వారి, యంతరంగముల దృప్తినించి ।
తదీ, యాదరము నెంతయులభించి । గోప్యార్థములనెల్ల సంగ్రహించి తిరిగడ ॥రా॥ ౧

### 5 కీర్తన నాటకురంజి ఆది

ప॥ ఎంతవారలయ్య యతిరాజా ।

అ॥ మీ, పంతమే నెగ్గించుకొంటిరో జ ॥మీ॥ రెం॥

చ॥ మరుగుపడిన దివ్యదేశములను । మీరు, మనలనుద్ధరించి తీరవలెను అని,
హరిని నమ్మి తగిన యత్నములను । ఎందు జరపి నెగ్గి తిరిగడ । యిలను ॥మీ॥ రెంత ౧॥

### 6 కీర్తన బేహాగ్ అఠ్రిగతి

ప॥ భూత, పుర, మే త, పముజేసె । యతి, పుంగవమా ॥భూ॥

అ॥ దైతేయారాతి । యవ, తారమైనరీతి నిందు । బ్రీతినుదితులైతి రా, హేతువుచే ఖ్యాతిగనై భూ॥

చ॥ భూతపతి యవతారము । మత, రీతియెల్లసిస్సారము । అని,
చేతనులకు దెల్పువారము । అందు, చేత వేర బుట్టనేరము । అని,
చాతురిని, యందుదితు । వైతిరని, తలచెద । నీతరిని, యిటుగా ॥భూత॥ ౧



# నారీవిభాగము



శ్రీమతే రామానుజాయనమః

## నారాయణ పరత్వము

జిజ్ఞాసువు :— శ్రీమతి కర్రా తాయారమ్మగారు యతిరాజాశ్రమం నరసాపురం.

ప్రశ్న :— బ్రహ్మ-విష్ణు-మహేశ్వరులని ముగ్గురను ఒకే చేర్పులో కలిపి లోకపరిగణనకలదు. మరియు విష్ణువు కంటెను బ్రహ్మ ముందు చెప్పబడెను కూడ. ఇట్టి స్థితిలో నారాయణుడే పరాత్పరుడనుట ఎటుల సమంజస మగును?

సమాధానము “శ్రీమన్నారాయణము”

పంచమవేదమగు మహాభారత శాంతిపర్వమున యిటుల వర్ణించబడియున్నది. 349 అధ్యాయమందు

మహాపురుషుడగు పరమాత్మ నారాయణుడనబరగును. ఆయన జగత్తును సృజించ సంకల్పించినవాడై తనను నాలుగు మూర్తులుగ విభజించుకొనెను. 1 వాసుదేవ, 2 సంకర్షణ, 3 ప్రద్యుమ్న 4. అనిరుద్ధులని, నాలుగు మూర్తుల పేర్లు. అనిరుద్ధుడు వ్యక్తత్వమును బొంది పితామహుడగు బ్రహ్మను సృజించెను. మరియు అహంకారాత్మకుడగు ఆ అనిరుద్ధుడే పంచమహాభూతములను, వానిగుణములను, మరీచి, అంగీరస్సు, అత్రి, పులస్త్యుడు, పులహుడు, క్రతువు, వసిష్టుడు, అను సప్తఋషులను, స్వాయంభువమనువును అను ప్రకృతులను, వేద, వేదాంగ, యజ్ఞ యజ్ఞాంగములను సృజించెను. పిమ్మట ఆబ్రహ్మనుండి రోషాత్మకుడగు రుద్రుడు లోకసంగ్రహార్థమై జన్మించెను.

350 అధ్యాయమున

భగవంతుడగు నారాయణుడే లోకహితార్థమై అనిరుద్ధస్వరూపముతో వ్యక్తరూపమును వహించెను. ప్రవృత్తి ధర్మప్రవృత్తికై తన నాభికమలమునుండి బ్రహ్మను, బ్రహ్మలలాటము నుండి రుద్రుని బుట్టించి వారల నిమిత్తముగా గాని సృష్టి ప్రళయముల జేయుచున్నాడు. వీరిద్దరికి అంతరాత్మగ నారాయణుడున్నాడు. విష్ణువనగా లోపల బయట సర్వవ్యాపకుడైయుండుట గాన విష్ణువునకు రుద్రుడు ఆత్మస్వరూపుడు,

“దేవతలలో విష్ణువు తరువాత రుద్రుడే గొప్పవాడు ఆతనిని గౌరవించు నిమిత్తమై నేను నా యాత్మస్వరూపుడైన రుద్రుని నారాధించుచుందును” అని నారాయణుడే తెలిపియున్నాడు.

### అ 357 ధ్యాయమున

పరమాత్మయగు నారాయణుని మానసము వలన చతుర్ముఖ బ్రహ్మకు మొదటి జన్మము కలిగెను. నారాయణుని చక్షువువలన ఆబ్రహ్మ యొక్క రెండవ జన్మయున్ను; నారాయణుని చెవులనుండి నాలుగవ జన్మయున్ను; నారాయణుని ముక్కునుండి అయిదవ జన్మయున్ను; అండమునుండి ఆరవ జన్మయును, నాభికమలము నుండి ఏడవ జన్మయున్ను కలిగినవి.

వేదములకు తాత్పర్యము నారాయణుడే అతడే యన్నింటికిని నధిష్ఠానము. కర్త కారణము, దానము, తపము యజ్ఞము, సమస్తము నారాయణుడే. అతనివలన చతుర్ముఖ బ్రహ్మయు, నతనివలన రుద్రుడున్ను, వీరలవలన జగత్తంతయు కలిగినవి.

### 360 అధ్యాయమున

ఒకప్పుడు బ్రహ్మ తన లోకమును విడిచి పాలసముద్ర మధ్యయందున్న వైజయంత మను పర్వతమునందు ఆత్మవిచారము జేయుచువసించి యుండెను. ఆయనయొక్క లలాటము నుండి పుట్టిన పుత్రుడును, మహాయోగియు, త్రినేత్రుడు, అగు శంకరుడు ఆకాశమార్గమున అతని సమీపమునకు వచ్చి నమస్కరించి నిలచెను. బ్రహ్మయు నతనిని మూర్కొని క్షేమమడిగి యాదరించెను. "తండ్రీ సురాసురులు కొలుచునట్టి శుభంబైన నీలోకమును విడిచి ఈ ఏకాంత ప్రదేశమున కేల నీవు వంటరిగ నివసించుచున్నావు. అని శంకరుడు బ్రహ్మ నడిగెను. "ఈ వైజయంతీ పర్వతము విరాట్పురుషునికి ప్రియతమమైన దగుటచే తద్ధ్యానతత్పరుడనై యిచ్చట నున్నానని బ్రహ్మబదులు చెప్పెను.

"బ్రహ్మదేవా, స్వాయంభవుడగు నీ వనేకపురుషుల సృజించితివి. ఆ విరాట్పురుషుడు, యనేకులయందొకరు కాదే. ఆ పురుషోత్తము డెవడు?" అని రుద్రుడు బ్రహ్మ నడిగెను. "నేను ధ్యానించుపురుషుడు సకల జగత్కారణుడు. అతడే విరాట్టిరూపమున అనిరుద్ధుడుగాను, సూత్రాత్మయై ప్రద్యుమ్నుడుగాను సర్వకారణ స్వరూపమున సంకర్షణుడుగాను; నిర్గుణక్షేత్రజ్ఞ రూపమున వాసుదేవుడుగను విరాజిల్లుచున్నాడు. ఆయనే శాశ్వతుడు, అవ్యయుడు, అక్షయుడు, అప్రమేయుడు, సర్వగతుడు, జ్ఞానమాత్రైకదర్శి సర్వవ్యాపకుడు. సర్వాంతర్యామి సర్వస్వరూపుడు. మహాపురుషుడు. పురుషోత్తముడు. సకల జగత్తునకు ఆదికారణుడు. అతడే నారాయణుడు నీవు గాని నేను గాని అతని యదార్థస్వరూపమును తెలుసుకొనజాలము. అతని యనుగ్రహముచేతనే నేను సృష్టిని, నీవు సంహారమును జేయకలుగుచున్నారము.

సమస్తమైన వారలకు సేవ్యు డాయన వక్కడే. అతడే సర్వేశ్వరుడు.

పుత్రా! ఆద్యుండును, ప్రజల కీగుండను నగు బ్రహ్మనగు నేను నతనివలన పుట్టినవాడను. నావలన నీవు పుట్టితివి. మనచే సృష్టి సంహారముల జేయించుచు మనలను జగత్తు పూజ్యులుగను, గొప్పవారలను గాను జేసినవాడు ఆయనే ఆయననే నిచ్చట నుపాసించుచున్నాను" అని బ్రహ్మరుద్రునితో చెప్పెను.

మొదటిదగు సృష్టిని చేయించుటకై బ్రహ్మను సృష్టించి ఆయనను ముందు పేర్కొని, చివరిదగు సంహారము చేయుటకై బ్రహ్మవలన రుద్రుని బుట్టించి ఆయనను కడపడ పేర్కొని, ఆయిద్దరుకు ఆధారభూతుడుగ మధ్యనునిలచి ముఖ్యమగు రక్షణకార్యమును విష్ణువు జేయుచున్నాడు. మధ్యను పేర్కొనబడుటచే ఆయనయొక్క ప్రాధాన్యత, మహాత్మ్యము, ఆధిక్యము, మరింత యధికమగుచున్న దేగాని తగ్గుటలేదు.

# ప్రచార విభాగము.

భక్తి "నివేదన"
పత్రికానుబంధం

## భక్తి "నివేదన" పత్రికాసంపాదకుల విజ్ఞప్తి :

ప్రియ పాఠక మహాశయులారా :

భగవద్భక్తి శ్రేయస్కరపద ప్రాపకమైనది. ఈ శ్రేయస్సనునది "పరస్పరం బోధయంతః శ్రేయఃపర మవాప్స్యథ" అను భగవద్గీతా వచనానుసరణ మాత్రముచేతనే లభించుచున్నది.

శ్రీకృష్ణుని ఈ గీతావచన విధి నిర్వాహణమునకై ఈ భక్తి "నివేదన" పత్రిక ప్రారంభించబడినది. ముద్దుమాటలతోను, తప్పటడుగులతోను, ఉపవాస కృశింపులతోను, నిర్ణీత కాలాతిక్రమణలతోను, ఆర్థిక యాచనలతోను, ఇంతకాలము అతికష్టముమీద ఈ పత్రిక ఎటులనో గడుపగలిగినది.

మొదటి సంవత్సరమున ఇది మూడువేలమందిని దర్శించగా అందు సుమారు 665-0-0 మాత్రమే దీనిని ఆదరించిరి. ఆ ఆదరణ పోషణ దీనికి చాలక రూ 375-2-9 నష్టముతో రెండవ సంవత్సరమున రెండువేల మందిని మాత్రమే ఇది సమీపించకలిగినది. అపుడు సుమారు 358 మాత్రమే దీనిని అభిమానించిరి. ఆ అభిమాన రక్షకములు దీనికి చాలక రూ1515-3-3 నష్టముతో, మూడవ సంవత్సరమున వేయిమందిని మాత్రమే ఇది సేవింపకలిగినది. అపుడు సుమారు 385 మంది మాత్రమే దీనిని సానుభూతితో జూచిరి. ఈ సానుభూతి అనుభూతులు దీనికి చాలక రూ 818-9-0నష్టముతో ఇది కృశించినది.

పెరిగి పెద్దదైనకొలది ఆహారమెక్కువ కావలయును. అధికముగ ప్రేమీయుల జూడవలయును. అన్నిదిక్కుల నడయాడ వలయును గదా. గాని దీని విషయములో మాత్రము అది వ్యతిరేకముగ ఫలించినది.

దీని పోషణ-ప్రచారములలో ఎట్టి స్వార్థకాంక్షయు లేదనియు, కేవలము భగవద్భాగవత కైంకర్యాపేక్ష మాత్రమే కారణమనియు, తమ కందరకు తెలిసిన విషయమే.

దీనికి త్వరలో నాలుగవ సంవత్సరము గడచి అయిదవసంవత్సరము ఆరంభము గానున్నది. అయిదవ సంవత్సరములో మాసమున కొకపర్యాయము గాక వారమునకొక పర్యాయము మిమ్ములను సేవించవలెననియు, ఇంకను అరవమిత్రులను, హిందీమిత్రులను, ఇంగ్లీషుమిత్రులను కూడ ఆ యా భాషలలో దర్శించవలెననియు ఉవ్విళ్ళూరు చున్నది. ఇందులకు మీ యందరియొక్క సలహా సహాకారముల నపేక్షించుచున్నది. ప్రతి వారము కనీసము అయిదువేలమంది నైనను

దర్శించవలెనని దీనియాశ. దీని యాశను యదార్థముజేసి దీనికితగిన అహారమిచ్చి, పోషించి, బల వత్తరమైన దానినిగ జేసి దీనిచే తగినసేవ చేయించుకొను భారము తమపై నున్నది. దయయుంచి బాకీలున్నవారు చందాధనము నంతను వెంటనే దయచేశియు, తమ బంధుమిత్రులను క్రొత్త చందాదారులుగ జేర్చియు, (ప్రతి చందాదారు కనీసము ముగ్గురినైనను క్రొత్త చందాదారులను చేర్చుటకై దీక్షా కంకణమువహించి) పని చేయవలెననియు సవినయముగ ప్రార్థించుచున్నాము.

ఇది ఏ వకరిమీదనో బాధ్యతగల పత్రిక కాదు. ఇది మన యావత్తు సంఘమునకు బాధ్యత గల పత్రిక. దీని సేవా-ఉపయోగములు ఏ వకరివి గావు. యావత్తు సంఘమునకు చెందియున్నవి.

దీని పోషణ, దీని బలము, దీని ఆకర్షణ, అందచందములు. దీని సేవాశక్తి,దీని ఉపయోగము తమ యందరియొక్క ఆర్థిక ఆదర–సహాకారములపై మాత్రమే ఆధారపడి యున్నది. తమ కృపాకటాక్షమునకై నిరీక్షించుచున్న,

కార్యాలయము:—
భావనారాయణవీధి, విజయవాడ.

భక్తి "నివేదన"
సంపాదకవర్గము.

---

## గీతామందిర కట్నములు

గీతామందిరాధ్యక్షులగు శ్రీ శ్రీ శ్రీ ఉయ్యూరు మహారాణీవారు తమ కుమార్తెగారైన చిరంజీవి సౌభాగ్యవతియగు శ్రీ శ్రీ శ్రీ వెంకట అలివేలుమంగతాయారమ్మగారిని శ్రీ శ్రీ శ్రీ బొబ్బిలి మహారాజావారి కుమారులగు చిరంజీవి శ్రీ శ్రీ శ్రీ కుమారరాజారావు వెంకటగోపాలకృష్ణ రంగారావు బహద్దూరు వారికిచ్చి తిరుచ్చానూరు సన్నిధిలో తి 11-10-1952 తేదీని జరిపిన వివాహ సందర్భమున "గీతామందిరమునకు" రు 50-0-0 లు కట్నమును సమర్పించిరి.

వీరికి శ్రీ శ్రీనివాసమూర్తి ఆయురారోగ్య భాగ్య భోగ్యముల కటాక్షించుగాక.

# విజయవాడ

ది 12-11-1952 సం॥రం, తేదీని శ్రీ విశిష్టాద్వైత ప్రచారకసంఘ కేంద్ర సహాయ కార్యదర్శియగు శ్రీమాన్ ఆ.చి. శ్రీమన్నారాయణాచార్యులుగారి అధ్యక్షతను విజయవాడలో శ్రీ విశిష్టాద్వైత ప్రచారకసంఘ విజయవాడ శాఖ యొక్క కార్యనిర్వాహకవర్గ సమావేశము సదరు శాఖా కార్యాలయమైన శ్రీ నిడుముక్కల సుబ్బారాయుడు రంగవల్లి తాయారమ్మగార్ల రామానుజ కూటమునందు సాయంకాలము గం. 3-30 లకు జరుపబడి తీర్మానింప బడిన తీర్మానములు.

## తీర్మానములు

(1) శ్రీ విశిష్టాద్వైత ప్రచారకసంఘ ఆంధ్ర రాష్ట్రీయ శాఖ ప్రధాన కార్యాలయమును విజయవాడలో శ్రీ నిడుముక్కల సుబ్బారాయుడు రంగవల్లి తాయారమ్మగార్ల రామానుజకూటములో ఉంచవలసినదిగను, దీనికి సంచాలకులుగ శ్రీ నిడుముక్కల శ్రీరామమూర్తిగారిని నిర్ణయించ వలసినదిగను కేంద్ర సంఘమువారిని కోరడమైనది.

## తీర్మానము అంగీకరించబడెను

(2) ప్రతి ఆదివారము సాయంకాలము గం. 4-0 నుండి 5-30 వరకు ఈ శాఖాసభ్యులు అభిమానుల సమావేశమును ఏర్పాటు చేయుటకున్ను, ప్రతి సమావేశములోను సాంప్రదాయ వేదాంతోపన్యాసములను ఏర్పాటు చేయుచుండుటకున్ను, తిరునక్షత్ర జయంతులలో కూడ పండితులచే ఉపన్యాసములు జరిపించుచుండుటకున్ను తీర్మానించబడినది.

ఈ సమావేశమును ఈ శాఖ కార్యాలయమగు శ్రీ నిడుముక్కల సుబ్బారాయుడు రంగవల్లి తాయారమ్మగారి రామానుజకూటములోనే జరిపించుచుండుటకున్ను, యిందులకు వలయు అన్ని ఏర్పాటులను చేయవలసినదిగను, ది 13-11-52 తేదీని ఈ కార్యక్రమ ప్రథమ సమావేశమును ప్రారంభించ వలసినదిగను, శ్రీ నిడుముక్కల శ్రీరామమూర్తిగారిని కోరడమైనది.

(3) ఈశాఖా కార్యాలయములోనే ఈసాంప్రదాయమునకు సంబంధించిన గ్రంథాలయము నొక దానిని స్థాపించుటకున్ను, యిందులకు వలయు ఏర్పాటులను, సదుపాయములను చేయవలసినదిగ శ్రీ నిడుముక్కల శ్రీరామమూర్తిగారిని కోరడమైనది.

(4) ఈ సంఘము తరఫున ఈ సంఘ స్త్రీశాఖయగు శ్రీ యతిరాజ సేవా మహిళామండలి పూర్ణ సహాయముతో ఈ సంవత్సర ధనుర్మాసోత్సవమును వైభవముగ జరుపుటకు తీర్మానించడమైనది.

ది 29-11-1952 సం॥రం తేదీని శ్రీ విశిష్టాద్వైత ప్రచారకసంఘ కేంద్ర సహాయ కార్యదర్శియగు శ్రీమాన్ ఆ. గి. శ్రీమన్నారాయణాచార్యులుగారి అధ్యక్షతను విజయవాడ శాఖయొక్క కార్యనిర్వాహకవర్గ సమావేశము శ్రీ కూరపాటి రామారావుగారి యింటిలో జరిగి తీర్మానింపబడిన తీర్మానములు.

## తీర్మానములు

(1) శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘమునకు ది 18-3-1952 తేదీని శ్రీ కోట వెంకటనరశింహముగారు వ్రాసియిచ్చిన దఖలు దస్తావేజు ప్రకారము వచ్చిన ఆస్తినిగురించి శ్రీమాన్ సత్యవరపు సూర్యప్రకాశరావుగారితో వచ్చిన

తగాయిదాను పరిష్కరించుకునే నిమిత్తమై కోర్టులకు వెళ్ళ నవసరములేకుండగ విజయవాడ శివాలయం వీధిలోని 4/320 నెంబరుగల మేడను శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘమునకున్ను. మిగత ఆస్తినంతను శ్రీమాన్ సత్యవరపు సూర్యప్రకాశరావుగారికిన్ని సంపూర్ణ హక్కులతోను స్వాధీనపరచుకొని స్వేచ్ఛగ అనుభవించుచుండవలసినదిగ మధ్యవర్తి పరిష్కారముగ రాజీ చేసిన మధ్యవర్తుల పరిష్కారమునకు మా హృదయపూర్వక అభివందనముల నందజేయుచు తీర్మానించడమైనది.

(2) సదరు సెటిలుమెంటు దస్తావేజుద్వారా నిష్పేచీగా శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘమునకు స్వాధీనమైన విజయవాడ శివాలయం వీధిలోని నెం 4/320 బరు మేడను ది 29-11-19;2 సం॥రం తేదీనీ ఉదయమున గం. 5-30 లకు ఈ సంఘమునకు నూతనముగ గృహప్రవేశోత్సవమును జరిపిన ఈ కేంద్ర సహాయ కార్యదర్శిగారగు శ్రీమాన్ ఆ. చి. శ్రీమన్నారాయణాచార్యులుగారకి మా హృదయపూర్వక ధన్యవాదముల నర్పించుచు తీర్మానించడమైనది.

(3) సదరు మేడయొక్క ప్రవేశద్వారమువద్ద ఈ క్రింద విధముగ శిలాశాసనమును చెక్కించి వేయించుటకు తీర్మానించడమైనది.

శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘము

విజయవాడ

స్వస్తిశ్రీ ఖరనామసం॥ర ఫాల్గుణ ది 18-3-52 తేదీని శ్రీమాన్ కోట వెంకటనరిశింహముగారిచే కీ. శే. కోట శీతారామయ్యగారిద్దై, వారియొక్క తదనంతరమున వారి దత్తత కుమారులైన కీ. శే. సత్యనారాయణగారి యొక్కయు, వీరి తదనంతరమున వీరి పితామహియైన కోట సుబ్బమ్మగారియొక్కయు, తదనంతరమున తమకు వారసత్వేన సంక్రమించిన ఆస్తినంతను తమకు శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘమందలి భక్తివిశ్వాసములచే ఈ సంఘమునకు దాన, దమన, వినిమయ, విక్రయాది సర్వ హక్కులతోను దఖలు అను దానపట్టావ్రాసి సమర్పింపబడినది. శ్రియఃపతి వీరికి సర్వశుభముల నొసగూర్చుగాక యని ప్రార్థించు చున్నాము.

ఈ ఆస్థిని గురించి శ్రీమాన్ సత్యవరపు సూర్యప్రకాశరావుగారితో తగాయిదా రాగా ది 18-11-1952 తేదీని పెద్దమనుష్యుల మధ్యవర్తిత్వము ద్వారా వ్యవహారము పరిష్కరింపబడి అందు రాజీగా, శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘమునకు దాన, దమన, వినిమయ, విక్రయాది సర్వసంపూర్ణ హక్కులతోను విజయవాడ శివాలయంవీథిలోని నెం 4/320 బరు మేడ చెందునటుల నిర్ణయింపబడి, ది 25-11-52 సం॥రం తేదీని సెటిలుమెంటు దస్తావేజు వ్రాసుకొని రిజిష్టరీ చేయించుకొని స్వాధీనము జేసుకొనబడి స్వస్తిశ్రీ నందననామ సంవత్సర మార్గశీర్ష శు॥ ౧౩ స్థిరవాసరము (ది 29-11-1952 తేది) ఉదయము గం. 5 లకు శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘ కేంద్ర సహాయ కార్యదర్శులగు శ్రీమాన్ ఆ. చి. శ్రీమన్నారాయణాచార్యులు గారిచే నూతనముగ శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘము తరఫున గృహప్రవేశ మహోత్సవము గావింపబడినది.

ఈ శుభసమయమున ఈమేడకు "సీతారామ మందిరము" అని నామకరణము చేయబడినది.

మంగళం మహత్ శ్రీ శ్రీ శ్రీ

ఇట్లు.

శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘము.

తేది. 29-11-1952 విజయవాడ.



శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘమునకు శ్రీమాన్ కోట వెంకట నరశింహాము గారిచే సమర్పింపబడిన విజయవాడలోని నెం 4/320 బరు, శివాలయం వీధిలోని భవనము.

ది 29-11-1952 తేదీని కేంద్రసంఘ సహాయ కార్యదర్శిగారగు శ్రీమాన్ ఆ. చి. శ్రీమన్నారాయణాచార్యులుగారిచే గృహప్రవేశ మహోత్సవము గావింపబడి "సీతారామ మందిరమ"ని దీనికి నామకరణము చేయబడినప్పటి గృహప్రవేశ మహోత్సవ దృశ్యము.



శ్రీమాన్ కోట వెంకట నరశింహముగారు



వీరి భార్య శ్రీమతి కోట నరసమ్మగారు

విజయవాడ శివాలయంవీధిలో నెం 4/320 బరు గల తమ భవనమును శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘమునకు సంపూర్ణముగ సమర్పించిన దాతలు.







శ్రీ విశిష్టాద్వైతప్రచారక సంఘమునకు శ్రీమాన్ కోట వెంకటనరసింహముగారిచే సమర్పింపబడిన విజయవాడ లోని నెం 4/320 బరు శివాలయంవీధిలోని భ వ న ము.

ది 29-11-52 తేదీని కేంద్రసంఘ సహాయ కార్యదర్శిగారగు శ్రీమాన్ ఆ.చి. శ్రీమన్నారాయణాచార్యులుగారిచే గృహప్రవేశ మహోత్సవము గావింపబడి "సీతారామ మందిరమ"ని దీనికి నామకరణము చేయబడెను.

గృ హ ప్ర వే శ మ హో త్స వ దృ శ్య ము.

శ్రీమతే రామానుజాయ నమః

# -• కృతజ్ఞత •-

శ్రీమాన్ కోట వెంకట నరశింహముగారు శ్రీ వైష్ణవ వైశ్య ప్రముఖులు. తక్కెళ్ళపాడు అయ్యావార్లంగారి శిష్యులై పంచసంస్కారపరులై మంత్రి - మంత్రార్థములు లభించుకున్నవారు. ప్రపన్నాగ్రేసరులు.

వీరు శ్రీ విశిష్టాద్వైత సంప్రదాయమందు తమకున్న అనూపమ అభిమానాదరాతిశయములచే విజయవాడ శివాలయంవీథిలో నెం 4/320 బరు గల తమ మేడను సంపూర్ణ హక్కులతో ది 18-3-52 తేదీని శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘమునకు రిజిష్టరీ దానపట్టాద్వారా సమర్పించిరి.

ది 29-11-52 సంవత్సరం తేదీని ఈ సంఘ కేంద్ర సహాయ కార్యదర్శులగు శ్రీమాన్ అ. చి. శ్రీమన్నారాయణాచార్యులుగారిచే ఈ భవన "గృహప్రవేశ మహోత్సవము ఈ సంఘము తరపున గావింపబడి దీనికి "సీతారామ మందిరము" అని నామకరణ మొనర్చబడెను.

దాతలు, ఆదర్శజీవులు అగు శ్రీమాన్ కోట వెంకట నరసింహముగారికి మా హృదయపూర్వక కృతజ్ఞతను తెలుపుచు శ్రియఃపతి వారికి ఆయురారోగ్య భాగ్య భోగ్య కైంకర్యముల ప్రసాదించుగాక యని ప్రార్థించుచున్నారము.

కేంద్ర కార్యాలయము, ఇట్లు,

గీతామందిరం, 107, వరదాముత్తియప్పన్ వీధి, మద్రాసు. శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘము.

(4) ఈ క్రింది మహాశయులను శ్రీ విశిష్టాద్వైత ప్రచారకసంఘ విజయవాడశాఖ కార్య నిర్వాహకవర్గమందు సభ్యులుగ ఎన్నుకొనుచు తీర్మానింపబడినది.

(1) శ్రీ కోట వెంకట నరశింహంగారు
(2) శ్రీ కోట జ్వాలా నరశింహంగారు
(3) శ్రీ సుంకు లక్ష్మీనారాయణగారు

---

మదరాసు గీతామందిరము తరపున

## ప్రార్థన

శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘ స్త్రీ శాఖయగు శ్రీ యతిరాజ సేవామహిళా మండలిచే స్త్రీల యాధ్యాత్మికాభివృద్ధికై మదరాసులో గీతామందిరము స్థాపింపబడి పనిచేయుచున్నది. ఇందు చాలమంది స్త్రీలు సంస్కృతసాహిత్యము హిందీ, ఇంగ్లీషు మొదలగు భాషల నేర్చుకొనుచున్నారు.

ఒక సంవత్సరమునుండి భగవద్గీత మొదలగు వేదాంత గ్రంథముల నిరంతర అధ్యయనము జరుగుచున్నది. వేదాంతోపన్యాసములు కాలక్షేపములు జరుగుచున్నవి. ఉభయ వేదాంత ప్రవచనము జరుగుచున్నది. స్త్రీల కుపయుక్తమగు స్వరూపానుకూలమగు చిన్నచిన్న చేతి పనులను, కుట్టుపని మున్నగువానిని ఆరంభించబోవుచున్నాము.

ఆర్థికదృష్ట్యా దీని నిర్వహణ చాల కష్టముగ నున్నది. అందుచే క్రొత్త కార్యక్రమములు ప్రారంభించ లేకుండుటయే గాక మొదలుపెట్టిన కార్యక్రమమే స్తంభించు ననెడి భయముగ నున్నది. గాన, అభిమానులందరును స్వపర హస్తముల ద్వారా దీనికి ఆర్థిక సహాయమును జేయ గోరుచున్నాము.

ప్రతివారును తమయింట జరుగు శుభకార్యముల సందర్భమున తమకు తోచిన కట్నములను గీతామందిరమునకు సమర్పించి ఆదరింప గోరుచున్నాము.

ఇట్లు,
కార్యదర్శిని,
శ్రీ యతిరాజ సేవా మహిళా మండలి
గీతామందిరము
107, వరదా ముత్తయప్పన్‌వీధి. మదరాసు 1

---

### శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘమునకు కట్నములు

శ్రీమతి కొల్లూరి సత్యనారాయణమూర్తిగారి భార్య శ్యామలాంబగారు ఈ సంఘమునకు రూ 5-0-0 లు కట్నమును సమర్పించిరి.

వీరికి శ్రీయఃపతి సకలైశ్వర్యముల కృపజేయు గాక.

# శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘ యతిరాజ సేవా మహిళా మండలి

## (చావలి)

ఈ గ్రామమందు మద్రాసునుండి విచ్చేసిన శ్రీమతి మరింగంటి రంగనాయకమ్మగారి అధ్యక్షతను శ్రీ యతిరాజ సేవా మహిళామండలి నందననామ సం॥ మార్గశిర శు ౧౧ లు గురువారము (ది 27-11-52) రోజున స్థాపింపబడెను. ఆనాడె శ్రీ గాజుల సుబ్బారావుగారి గృహమునందు సభ చేసి శ్రీ మహావిష్ణు పూజార్చనాది కైంకర్యములు శ్రీ విష్ణు సహస్రనామస్తోత్రము. భజనలు జరుపబడి ఈ క్రింది కార్యనిర్వాహకవర్గము ఏర్పాటు చేయబడెను.

| | | |
|---|---|---|
| అధ్యక్షురాలు | : | శ్రీ తాడికొండ రోశమ్మగారు |
| ఉపాధ్యక్షురాలు | : | ,, సామరాయ వెంకాయమ్మగారు |
| కోశాధిపతి | : | ,, వెన్నం యశోదమ్మగారు |
| కార్యదర్శి | : | ,, దాసరి శ్రీదేవమ్మగారు |
| సహాయకార్యదర్శి | : | ,, గాజుల నాంచారమ్మగారు |

శ్రీ గాజుల వెంకటరమణమ్మగారు శ్రీ గాజుల సామ్రాజ్యమ్మగారు శ్రీ తాడికొండ వెంకట సుబ్బమ్మగారు శ్రీ సామరాతు రామమ్మగారు శ్రీ విష్ణుమొలకల కనకమ్మగారు

### కార్యకారణి సభ్యురాండ్రు

ఈ గ్రామమందు శ్రీ గాజుల వెంకటకృష్ణయ్యగారి మేడయందు గీతాపరీక్షలు చక్కగా జరుపబడెను. ఈ క్రింది విద్యార్థినులిందు పాల్గొనిరి. ఈ పరీక్షల నిర్వహణలో చావలి ముక్తేశ్వరరావుగారు మిక్కిలి తోడ్పడిరి.

### పరీక్షయందు పాల్గొనిన విద్యార్థినులు

1 చిరంజీవి పట్టీల సామ్రాజ్యమ్మ
2 ,, జొన్నకూటి హనుమాయమ్మ
3 ,, చావలి లలితకుమారి
4 ,, సామరాతు రేణుకమ్మ
5 ,, విష్ణుమొలకల వెంకటరత్నమ్మ
6 ,, పట్టెల సామ్రాజ్యమ్మ
7 ,, సామరాతు కమల
8 ,, సామరాతు భాగ్యమ్
9 చిరంజీవి తాడికొండ రామసుబ్బులు
10 ,, గాజుల నాగమల్లేశ్వరమ్మ
11 ,, సామరాతు కనకామహాలక్ష్మి
12 ,, ఆళ్ళ దుర్గాంబ
13 ,, పట్టెల వెంకాయమ్మ
14 ,, సామరాతు భాగ్యలక్ష్మి
15 ,, విష్ణుమొలకల నాగపుష్పావతి
16 ,, సామరాతు వెంకాయమ్మ

ఇకనుండి ప్రతి ఏకాదశినాడు సంఘ సమావేశోత్సవము శ్రీ గాజుల దశరథరామారావు గారింట జరుప నిర్ణయించిరి.

ది 28-11-52 వ తేదీని సోమరాయ రత్తయ్యగారి కుమార్డు వెంకటేశ్వర్లుగారి యింటి యందు శుక్రవారోత్సవము వైభవముగా జరిగెను.

శ్రీమతి మరింగంటి రంగనాయకమ్మగారు స్త్రీధర్మము, విశిష్టాద్వైతమునుగూర్చి చక్కగ నుపన్యసించిరి.

# శ్రీ యతిరాజ సేవా మహిళా మండలి

గీతామందిరము, 107, వరదాముత్తియప్పన్ వీధి, మదరాసు.

## గీతా పరీక్షా ఫలితములు

ది 30-12-52 వ తేదీని శ్రీ గీతామందిర కార్యనిర్వాహక వర్గమువారి ఆధ్వర్యమున మదరాసు, మైలవరం, చావలి కేంద్రములలో జరుపబడిన భగవద్గీతా పరీక్షల ఫలితములు:

| పరీక్షలో ఉత్తీర్ణులైనవారు | కేంద్రము | నిరీక్షకులు | ఉత్తీర్ణతరగతి | విశేషములు |
|---|---|---|---|---|
| 1. శ్రీ తవ్వా వేదమ్మగారు | మదరాసు | శ్రీ తి. ప. రామానుజ స్వామివారు | మొదటితరగతి | మొదటిబహుమతి |
| 2. ,, వి. యస్. కుప్పరత్నంగారు | ,, | ,, | ,, | రెండవబహుమతి |
| 3. ,, గుగ్గిలం చెంచమ్మగారు | ,, | ,, | ,, | మూడవబహుమతి |
| 4. ,, కాం. రాధారుక్మిణమ్మగారు | ,, | ,, | ,, | బహుమతి |
| 5. ,, తాతా సుశీలమ్మగారు | ,, | ,, | రెండవతరగతి | ,, |
| 6. ,, కోటా సులోచనమ్మగారు | ,, | ,, | ,, | ,, |
| 7. ,, చిత్తూరి లక్ష్మీకాంతమ్మగారు | ,, | ,, | మూడవతరగతి | ,, |
| 8. ,, వింజమూరి తిరుమల లక్ష్మమ్మగారు | మైలవరం | శ్రీ శ్రీ శ్రీ మైలవరం రాణీగారు | రెండవతరగతి | బహుమతి |
| 9. ,, కందాళ లక్ష్మీనరసమ్మగారు | ,, | ,, | ,, | ,, |
| 10. ,, ధర్మపురి తిరుమల కుమార వేదాంత కృష్ణవేణిగారు | ,, | ,, | ,, | ,, |
| 11. ,, టి. తిరుమలమ్మగారు | ,, | ,, | ,, | ,, |
| 12. ,, ప్రోల లక్ష్మీకాంతమ్మగారు | ,, | ,, | రెండవతరగతి | ,, |
| 13. ,, ఈచంపాటి శకుంతలమ్మగారు | ,, | ,, | మూడవతరగతి | ,, |
| 14. ,, ప్రతాపసీతామహాలక్ష్మమ్మగారు | ,, | ,, | ,, | ,, |
| 15. ,, దాసరి శ్రీదేవమ్మగారు | చావలి | మరంగంటి గంగనాయకమ్మగారు | మొదటితరగతి | ,, |
| 16. ,, చావలి లలితాకుమారిగారు (11 సంవత్సరములు) | ,, | ,, | రెండవతరగతి | ప్రత్యేక బహుమతి |
| 17. ,, గాజుల నాంచారమ్మగారు | ,, | ,, | ,, | బహుమతి |
| 18. ,, పజ్జల సామ్రాజ్యమ్మగారు (13 సంవత్సరములు) | ,, | ,, | ,, | ప్రత్యేకబహుమతి |
| 19. ,, సోమరాతు రేణుకమ్మగారు (11 సంవత్సరములు) | ,, | ,, | ,, | ,, |
| 20. ,, తాటికొండ రామసుబ్బులుగారు (11 సంవత్సరములు) | ,, | మూడవతరగతి | ,, | ,, |

21. ,, విష్ణుమొలకల వెంకట రత్నమ్మగారు ,, ,, ,, ,,

ఇంకను 5 గురు పరీక్షకు హాజరైరి గాని ఉత్తీర్ణులు కాలేదు.

కేవల గీతాశ్లోకములను అర్థముతో వర్ణించి పరీక్షచే ఉత్తీర్ణులైనవారు.

1. శ్రీ గాజుల నాగేశ్వరమ్మగారు (చావలి) పుస్తక బహుమతి.

ఇట్టివారు మరి 6 గురు హాజరైరి గాని ఉత్తీర్ణులు కాలేదు.

ఉత్తీర్ణులు కానివారు ఇదివరకు పరీక్షలు వ్రాయు నేర్పు లేకయును వ్యవధి తక్కువగా వ్యాసంగం ప్రారంభించినవారు గాన వారీసారి పరీక్షలో ప్రథమకక్షలో నుత్తీర్ణులగుదురని ఆశించుచున్నాము. ఈ పరీక్షాధికారులగు శ్రీ ఉ. వే. శ్రీమాన్ మొలుగు రామానుజాచార్యులవారికిని విద్యార్థినుల తయారుచేసిన మహాశయులకును మా కృతజ్ఞతాపూర్వక వందనశతములు సమర్పించుచున్నాము.

ఈ పరీక్షలకు వ్యవధి తక్కువగా ప్రారంభించుటచే నిర్ణీత పాఠ్య అధ్యాయములు,శ్లోకములు, ఇతర పాఠ్యక్రమము తగ్గించి పరీక్షించవలసి వచ్చెను. తిరిగి ఈ క్రింది పాఠ్యక్రమముతో జూన్ నెలలో ఆఖరి ఆదివారం పరీక్షలు జరిపి యిపుడు ఉత్తీర్ణులతో కూడా విమర్శించి ప్రమాణపత్రములు, బహుమతులు యివ్వదలంచుచున్నాము. రాబోవుపరీక్షకు నూతనముగా స్త్రీలెందరైనను రావచ్చును.

—: పాఠ్యక్రమము :—

(1) భగవద్గీత 4,5,6 అధ్యాయముల రామానుజ సంప్రదాయానుసారముగా విషయము మాత్రము అడిగిన ప్రశ్నకు అనుకూలముగ జవాబు వ్రాయవలెను.

(2) ప్రతిపదార్థ తాత్పర్యములతో వర్ణించవలసిన శ్లోకములు:—

| నాల్గవఅధ్యాయం శ్లోకములు | 5 వ అధ్యాయం శ్లోకములు | 6 వ అధ్యాయం శ్లోకములు |
|---|---|---|
| 5 | 4 | 5 |
| 6 | 10 | 6 |
| 7 | 13 | 9 |
| 8 | 17 | 16 |
| 9 | 18 | 26 |
| 11 | 20 | 34 |
| 13 | 29 | 35 |
| 14 | | 40 |
| 15 | | 41 |

నాల్గవఅధ్యాయం

శ్లోకములు

18

28

34

6 వ అధ్యాయం

శ్లోకములు

42

43

44

47

భగవద్గీత 4,5,6 అధ్యాయములలోని ప్రశ్నలున్నూ జవాబులున్నూ గీతామందిరముచే త్వరలోనే ప్రకటింపబడును.

ఇట్లు,

గీతామందిర కార్యనిర్వాహక వర్గము.

(3) మరియు, భజయతిరాజస్తోత్రమందలి మొదటి 10 చరణములు వల్లించవలెను.

(4) విశిష్టాద్వైత ప్రచారకసంఘముచే ప్రచురింపబడిన "ఎంపెరుమానార్ దర్శనము"నందలి మొదటి ప్రకరణము చదువవలెను.

---

## భక్తి"నివేదన" పత్రికయొక్క ఒర సం॥రం మొత్తం జమాఖర్చులు

| ఏప్రియల్ 1951 మొదలు మార్చి 1952 వఱకు జమలు | రు. అ. పై. |
|---|---|
| విరాళములవలన వచ్చిన సొమ్ము | 50-0-0 |
| చందాదారులవలన వచ్చిన సొమ్ము | 1,914-10-0 |
| సభలు, సమావేశములవలన వచ్చిన సొమ్ము | 52-0-0 |
| శ్రీ వి. ప్ర. సంఘ ప్రచారమువలన ప్రచురణకై కాగితమునకు, అచ్చునకు, పోస్టేజీలకు ఈయబడినది | 480-0-0 |
| సభలలో ఈయబడిన సొమ్ము (ప్రచురణాదుల నిమిత్తం) | 60-0-0 |
| ఈ సం॥రంలో తక్కువ వచ్చిన సొమ్ము శ్రీమాన్ అ. చి. శ్రీమన్నారాయణాచార్యులుగారివద్ద బదులు తీసుకున్నవి | 318-9-0 |

## ఖర్చులు

| | | |
|---|---|---|
| కాగితమునకు | | 793-8-0 |
| అచ్చునకు | | 1,136-4-0 |
| బైండింగునకు | | 113-9-0 |
| చందాదారులకు పంపిన పోస్టేజి | | 197-13-3 |
| తదితరమైన పోస్టేజి | | 15-6-3 |
| రవానా ఖర్చులు | | 92-9-0 |
| ఆఫీసు సిబ్బందికి | | 210-5-0 |
| ఆఫీసు సిబ్బంది తాలూకు నిరుటి బకాయిలు | | 105-0-0 |
| చందాల వసూళ్ళనిమిత్తం ప్రయాణములకు | | 67-11-9 |
| చిల్లర ఖర్చులు | | 38-0-9 |
| | 2,820-3-0 | 2,820-3-0 |

## ఇంతవరకు మొత్తం వచ్చిన లోటు

| సంవత్సరము | రాబడి | ఖర్చు | లోటు |
|---|---|---|---|
| విరోధిలో | 5,753-0-0 | 6,128-2-9 | 375-2-9 |
| వికృతిలో | 3,008-11-0 | 4,523-14-3 | 1,515-3-3 |
| ఖరలో | 2,506-10-0 | 2,820-3-0 | 313-9-0 |
| మొత్తం | రు 11,268-5-0 | 13,472-4-0 | 2,203-15-0 |

## గీతామందిర కట్నములు

ఈ సంవత్సరం ఆగష్టు నెలలో శ్రీమాన్ పాతాళం వీరరాఘవులు శ్రేష్ఠిగారున్ను వారి సతీమణి వేదమ్మగారున్ను, తాము అడయూరులో తమ "నిత్యశ్రీ" యను నూతన గృహప్రవేశ మహోత్సవమున "గీతామందిరము"నకు రూ 10-0-0 కట్నమును సమర్పించిరి.

వీరికి శ్రియఃపతి ఆయురారోగ్య భాగ్య భోగ్యముల కృపజేయు గాక.

# —:పుస్తక ప్రకటన:—

శ్రీ శఠకోపగీతామృతము

తిరువాయ్ మొళి అను ద్రావిడవేదము యొక్క పద్యరూప చక్కని ఆంధ్రానువాదము

దీనిని శ్రీమాన్ నల్లానిచక్రవర్తుల వెంకట రాఘవాచార్యులుగారు (L. M. P. తుని) అత్యంత సులలిత మధుర సులభ - సన్నిహిత శైలితో రచించిరి. అనేకమంది పండితులచే పలు సభలలో ప్రశంసించబడినది. ఖరీదు రూ 1-2-0 మాత్రం. గ్రంథకర్తగారి వద్దనుండి గాని లేక శ్రీవిశిష్టాద్వైతప్రచారక సంఘ గ్రంథ విక్రయశాఖాలయము. 107, గీతామందిరము. వరదా ముత్తియప్పన్ వీధి, మదరాసు-1 బడయ వచ్చును.

| | | |
|---|---|---|
| 1. | శ్రీవిష్ణు సహస్ర నామస్తోత్రము | 0-2-0 |
| 2. | శ్రీవిష్ణు సహస్ర నామావళి | 0-3-0 |
| 3. | శ్రీవిష్ణు సహస్రనామ స్తోత్ర వైభవము | 0-2-0 |
| 4. | ప్రపన్న తిరువారాధన క్రమము (లఘు విధానము) | 0-6-0 |
| 5. | ప్రపన్న తిరువారాధన క్రమము (లఘుతర విధానము) | 0-2-0 |
| 6. | ప్రపన్న సంధ్యానుష్ఠానము | 0-2-0 |
| 7. | భజయతి రాజస్తోత్రము తాత్పర్య సహితము | 0-4-0 |
| | భజయతి రాజస్తోత్రము (మూలము) | 0-1-0 |
| 8. | శ్రీరామానుజ చరిత్రము | 0-2-0 |
| 9. | శ్రీరామ అష్టోత్తర శతనామ స్తోత్రము | 0-2-0 |
| 10. | శ్రీకృష్ణ అష్టోత్తర శతస్తోత్రము | 0-2-0 |
| 11. | శ్రీలక్ష్మీ ,, | 0-2-0 |
| 12. | శ్రీగోదా ,, | 0-2-0 |
| 13. | శ్రీరామానుజ ,, | 0-2-0 |
| 14. | లక్ష్మీ స్తవము | 0-2-0 |
| 15. | చతుఃశ్లోకి | 0-1-0 |
| 16. | 82 వార్తలు | 0-2-0 |
| 17. | అర్థపంచకము | 0-6-0 |
| 18. | తిరుప్పావై (టీకాతాత్పర్యములతో) | 0-10-0 |
| 19. | గోదా కల్యాణము | 0-6-0 |
| 20. | అచ్యుతానంద గోవింద శతకము | 0-8-0 |
| 21. | భాగవత సురభూజము | 0-4-0 |
| 22. | శ్రీమన్మంత్ర త్రయార్థ వివరణము | 0-12-0 |
| 23. | శ్రీహరి పాదవైభవము | 0-4-0 |
| 24. | పరమార్థ దీపిక | 0-4-0 |
| 25. | 108 దివ్యదేశములు వైభవము | 0-1-0 |
| 26. | శ్రీహనుమద్వైభవము | 0-3-0 |
| 27. | శ్రీరామానుజ చరిత్రము (ద్విపద) | 0-4-0 |
| 28. | స్తుతిమాలికా | |
| 29. | సిద్ధిత్రయము | 2-0-0 |
| 30. | తిరుప్పావు (ఆంధ్రపద్యములు) | 0-2-0 |
| 31. | ద్వయమంత్రార్థ ప్రకాశికా | 0-4-0 |
| 32. | వేదాన్త సిద్ధాన్తకౌముది | 0-8-0 |
| 33. | సుదర్శన వైభవము | 0-4-0 |
| 34. | శ్రీభగవద్గీతా గీతము | 0-12-0 |
| 35. | సూత్రాను గుణ్యసిద్ధి విమర్శః | 1-0-0 |
| 36. | శ్రీరామాయణ తిథులు | 0-1-0 |
| 37. | ప్రాతర్నిత్యాను సంధేయము | 0-3-0 |
| 38. | శ్రీరామావతార తత్త్వవిచారము | 0-8-0 |
| 39. | శ్రీమ గీతార్థ సంగ్రహము | 0-2-0 |
| 40. | In the temple of truth | 0-8-0 |
| 41. | దివ్యస్తోత్ర పాఠములు | 0-4-0 |
| 42. | బ్రాహ్మణుల నేరమేమి | 0-1-0 |
| 43. | తత్త్వత్రయ సంగ్రహము | 0-4-0 |
| 44. | గద్యత్రయము భట్టరు-దేశికులు పెరియ వాచ్చాంభిళ్లై సంస్కృత ద్రావిడవ్యాఖ్యలతో | 2-8-0 |
| 45. | తిరుచ్చంద విరుత్తం-పెరియవాచ్చాంభిళ్లై వ్యాఖ్యానము పదప్పురై సహితం | 3-0-0 |
| 46. | తిరువారాధన పంచసూక్తములు-అన్నసూక్త మధు సూక్తములతో | 0-10-0 |
| 47. | పరంద రహస్యం | 1-0-0 |
| 48. | చతుశ్శ్లోకి-(ద్రావిడ వ్యాఖ్యానములో) | 1-0-0 |
| 49. | కైశిక మహాత్మ్యం-ఆంధ్ర తాత్పర్యార్థముతో | 0-8-0 |
| 50. | తిరుప్పావై-కణ్ణిన్ శిరుత్తాంబు పల్లాండు తిరుపళ్ళి యెళుచ్చి వారణమాయిరం వణ్ణమాడంగళ్ వీటితో | 0-6-0 |
| 51. | చరమశ్లోకత్రయము, గీతాపనిషచ్చరము — ద్రావిడమునను ఆంధ్రవ్యాఖ్య | 3-8-[illegible] |
| 52. | ఆచార్య సూక్తిముక్తావళి | 3-0-[illegible] |
| 53. | ఆళ్వారుల చరిత్ర (ఆంధ్రవచనము) | 1-0 |
| 54. | భగవద్గీత (తాత్పర్యసహితం) | 1-8-0 |

రిజిష్టరు నెం. 5049

# భక్తినివేదన

(వేదాంత మాసపత్రిక)

ఇందు వేదాంత విషయ రాజములున్ను; భక్తి ప్రచార విషయమైన వార్తలున్ను వేదాంత సాంప్రదాయ విషయకమైన ప్రశ్నోత్తరములున్ను ప్రచురించబడును.

చందాలు;

సాధారణ చందా సం. ర 1కి॥ రు. 5-0-0.

[illegible]య చందా ,, రు. 10-0-0.

To

**Book-Post**



1. శ్రీమన్నారాయణుడే సృష్టి - స్థితి లయ - కారకుడు.
2. ఆయనే మోక్షప్రదాత.
3. ఆయనే పరతత్త్వము-పరమాత్మ
4. ఆయన అఖిలహేయ ప్రత్యనీక కల్యాణ గుణకుడు.
5. ఆయనకు జీవుడు శరీరభూతుడు; శేషభూతుడు, పరతంత్రుడు, నియామ్యుడు, అనుభావ్యుడు.
6. జీవులు జ్ఞానైకాకారులు.
7. జీవులు అనంతములు.
8. జీవులు పరమాత్మకంటె భిన్నులు; ఈ భేదము సత్యమైనది; నిత్యమైనది.
9. జీవ-పరమాత్మలకు ప్రకృతి శరీరభూతమైనది; శేషభూతమైనది; పరతంత్రమైనది; నియామ్యమైనది; అనుభావ్యమైనది.
10. ప్రకృతి వికారాస్పదమైనది. జీవపరమాత్మలకంటె భిన్నమైనది, ఈ భేదము సత్యమైనది; నిత్యమైనది.
11. జీవుడు ప్రకృతి వియుక్తుడై పునరావృత్తి రహితమైన పరమాత్మ సాన్నిధ్యమగు పరమ పదమునుపొందుటయే మోక్షము
12. భక్తి ఒక్కటియే మోక్షసాధనము.
13. భక్తియన తైలధారవలె అవిచ్ఛిన్నమైన స్మృతి పరంపర.
14. వివేక-విమోక-అభ్యాస-క్రియా- కల్యాణ అనవసాద-అనుద్ధర్షలు భక్త్యంగములు.
15. ఇవి సదాచార్య-సమాశ్రయణ-లభ్యములు
16. జగద్గురువగు శ్రీరామానుజాచార్యులు వారును; వారి యనుయాయులున్ను సదాచార్యులు.

"నగురుర్వైష్ణవాత్ పరః" భా. సం.

ed & Printed by A. Ch. Srimannarayanacharya at Sriman Press, Kakinada.

## —: విజ్ఞప్తి :—

### భక్తి "నివేదన" పత్రిక కార్యాలయము

15-11-1952 తేది నుండి విజయవాడకు మార్చబడినది. గాన చందా దారులు తమ చందా ధనమును దయయుంచి ఇకనుంచి ఈ క్రింద చిరునామాకు పంప గోరుచున్నాము.

పత్రికా వితరణదారులు తమ లేఖలను దయతో ఈ క్రింద చిరునామాకే పంప గోరుచున్నాము.

గౌరవ నిర్వాహకాధికారి. (హానరరీ మేనేజరు)
భక్తి "నివేదన" పత్రిక
10/275 A కోటంరాజువారి వీధి,
విజయవాడ. (కృష్ణాజిల్లా)

## విన్నపము.

శ్రీమాన్ ముద్రణాలయము విజయవాడకు మార్చబడినది. తెలుగు, ఇంగ్లీషులలో అన్ని రకములైన అచ్చు పనులు అందముగ సకాలములో చవుకగ నిర్వహించబడును. వలయువారు ఈ క్రింది చిరునామాకు ఉత్తర ప్రత్యుత్తరములు జరుప గోరెదము.

మేనేజరు
శ్రీమాన్ ముద్రాలయము.
[illegible], విజయవాడ.
(కృష్ణాజిల్లా)

# భక్తి "నివేదన"

10/171 భావనారాయణవీధి, విజయవాడ

సంవత్సర చందా 5—4—0

ప్రచార విభాగము మాత్రము. సంవత్సర చందా 1—4—0

శ్రీ................................................................గారికి

..................................................

..................................................

ప్రియమహాశయా,

శ్రీ విశిష్టాద్వైత సిద్ధాంత ప్రచారమునకై నిస్వార్థతతో ప్రచురింపబడుచున్న భక్తి "నివేదన" పత్రిక గతనాలుగు సంవత్సరముల నుండియు తమకు భక్తితో నివేదించుకొనబడుచున్నది. దీనికింతవరకు తగిన ఆర్థిక పటుత్వము లేక పోవుటచే దీని ప్రారంభ ఆశయములు ఇంతవరకు సరిగా నెరవేరనిమాట నిజమే. అయినను సహృదయులగు తాము దయతో తమకు శ్రీ విశిష్టాద్వైత సిద్ధాంతమందుగల ఉత్సాహ సానుభూతులతో దీనిని ఆదరించుచున్నారు. అందుల కెంతయు కృతజ్ఞులము. రాబోవు చైత్రమాసము నుండియు దీనిని వారపత్రికగ మార్చి హెచ్చు ఉపయోగకారిగ యుండునటుల జేయ నభిలషించుచున్నారము.

ఇప్పటికే ఈనాలుగు సంవత్సరములకు మొత్తము ఈ పత్రిక ప్రచురణలో ఋణనష్టములు వచ్చిన సంగతి దీని జమఖర్చులను పరికించుచున్న తమకు తెలియగలదు. ఈ స్థితిలో దీనిని వారపత్రికచేసినచో తన్నిర్వహణ ఎటుల జరుగునాయను ఆందోళన లేక పోలేదు. ఏమైనను సరియే; శ్రియఃపతి యందును, తద్విభూతి నిర్వాహకులు భాగవతోత్తములు యగు తమయందును న్యస్తభరులమై వారపత్రికగ దీనిని ప్రచురించుటకే సాహసించ గలిచితిమి తాము ఈ పత్రికకు............ బగాయితు..................వరకు చందాక్రింద కృపజేయవలశి రూ...............ను దయచేయ వలశి యున్నది.

దయయుంచి ఈ రూ ను, వచ్చే సంవత్సర చందా రూ..................

మొత్తము రూ.........వెంటనే మనియార్డరు ద్వారా ఈ క్రింది చిరునామాకు పంపినచో అత్యంతకృతజ్ఞులము. మీ ఈ ఉపకారముువలన ఈ పత్రిక ఎంతో బలిష్ఠమై అభివృద్ధిని చెంది తమ సేవ చేయుగలదు.

తమ బాకీచందాను. క్రొత్తసంవత్సర చందాను వెంటనే పంపించియు, క్రొత్త చందాదారులను చేర్పించియు ఈసమద్యమమునకు చేయూత నొసంగవలశిందిగ మరొకమారు మిమ్ముల మిక్కిలియు ప్రార్థించుచున్నారము,

భక్తి "నివేదన" సంపాదక వర్గం

దయయుంచి, పత్రికాభివృద్ధిని గురించిన తమసలహాలను సహాయమును తెలుప ప్రార్థన.

## సంభావనై

శ్రీ కీ. శే. రామినీడి నరశింహారావుగారి పరమపదోత్సవమున శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘమునకు రూ 1-0-0 సంభావన సమర్పించిరి. వీరికి సర్వేశ్వరుడు లవన సాయుజ్యమును కటాక్షించుగాక.

## కట్నములు

రాజమండ్రి గ్రంధి వీరవెంకటరత్నంగారి కుమార్డు చి॥హరినాధబాబు వివాహసందర్భమున శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘమునకు రు 5-0-0 కట్నం సమర్పించిరి. ఈవధూవరులకు సర్వేశ్వరుడు ఆయురారోగ్య ఐశ్వర్యములను ఇచ్చి సర్వదా రక్షించుగాక.

రాజమండ్రి కాపురస్థులు బోండా వెంకటేశ్వరరావు ఔపాసన శుభకార్యము సమయమందు శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘమునకు సమర్పించిన కట్నం రూ 1-0-0 ఈ దంపతులకు సర్వేశ్వరుడు ఆయురారోగ్య ఐశ్వర్యపుత్రులను కలుగ జేసి సర్వదా రక్షించుగాక.

రిజిష్టరు నెం. 5049

భక్తి "నివేదన" పత్రిక.

నందన ఫాల్గుణమాసం. ప్రచార విభాగము

ఇందు వేదాంత విషయ రాజములున్ను; భక్తి ప్రచార విషయమైన వార్తలున్ను వేదాంత సాంప్రదాయ విషయకమైన ప్రశ్నోత్తరములున్ను ప్రచురించబడును.

### చందాలు

| | | |
|---|---|---|
| సాధారణ చందా | సం. ర 1కి | రు 5-0-0 |
| సహాయ చందా | ,, | రు 10-0-0 |

కార్యాలయము:

భక్తి "నివేదన" పత్రిక కార్యాలయము

10/17 భావనారాయణవీధి, విజయవాడ. 1

BOOK POST

To.



శ్రీమతే రామానుజాయ నమః

# భక్తి నివేదన

వేదాంత మాస పత్రిక


| సంపుటి ౮ | నందన–ఫాల్గుణమాసం | సంచిక ౧౨ |
|---|---|---|


జిజ్ఞాసువు :— శ్రీమాన్ నండూరి శోభనాద్రాచార్యులుగారు.

ప్రశ్న :— "పరమాత్మని యో రక్తః । విరక్తో అపరమాత్మని" అనినటుల గృహస్థులకే ఆచార్య పదవి నిచ్చిన రామానుజీయులలో వైరాగ్యమునకు అవకాశమున్నదా ?

## వైరాగ్యము

సమాధానము:— "శ్రీమన్నారాయణ"

భగవద్భక్తుడై, భగవదేతరవిరక్తుడై తరించుటకు సన్యాసికికంటె సంసారికే అవకాశ మెచ్చు గలదు. ఇది సుఖతరమార్గము. అంతరాయరహితము. ఆతంకశూన్యము. వైరాగ్యమునకు అర్థపంచకజ్ఞానము, భగవద్భాగవత భక్తియు ప్రధానములు. ఇట్టి జ్ఞానానుష్ఠానములు గలవాడు సన్యాసియైనను, సంసారియైనను ఉత్తారణకుసందేహములేదు. రామానుజీయులలో కొద్దిపాటి తేడాలో సంసారులకుసన్యాసులకు అందరకున్న జ్ఞాన–భక్తి–వైరాగ్యానుష్ఠానములలో తేడాలేదు నియమ–నిష్ఠలుఇద్దరికిన్ని సామాన్యముగ సమానముగనే యుండును.

ఇతర మతస్థులకు సన్యాసాశ్రమమున ఏవి నియమనిష్ఠలుకలవో, ఏనివృత్తి ధర్మానుష్ఠానము కలవో అవన్నియు రామానుజీయ గృహస్థాశ్రమస్థులకు గలవు. రామానుజీయ గృహస్థాశ్రమస్థులకు నివృత్తిమార్గ నిష్ఠ విశేషధర్మానుష్ఠానములు విధించబడియున్నది. అందుచే వీరి జ్ఞాన-భక్తి-వైరాగ్యములకుగాని ఉత్తారణకుగాని ఆచార్యపదవి నధిష్టించుటకుగాని ఎట్టిలోపమున్నులేదు.

సంసారపరిత్యాగ మననేమియో సంపూర్ణముగ తెలియక సతిని విడిచి సంతానమును విడిచి జోగులై బైరాగులై-పరమహంసలై -పరివ్రాజకులై-పర్వతగుహాంతరములకు వనప్రదేశములకు పోయి; ఎండకుఎండి, వానకుతడిసి, పంచాగ్నుల నడుమ తరితపించి, గబ్బిలములవలె గాళ్ళపై వ్రేలాడి, ఊర్ధ్వబాహులై కొంతచచ్చి, ఒంటికాలిపై నిలువబడి మొరడ్డై, పద్మాసనమున ప్రాణాయామదీక్షచే స్తంభించి యుండినంత మాత్రమున జ్ఞాన-భక్తి-వైరాగ్యములు కలుగవు,

దేహ మెండినది కాని యాశయెండినదా? తలవెంట్రుకలు పండినవికాని తత్త్వము తెలిసినదా? జట లంకురించినవి కాని జ్ఞాన మంకురించినదా? అంగశక్తి తగ్గినది కాని యరిషడ్వర్గ బాధతగ్గినదా? బలాత్కారమున బ్రతిరోధించుటచే మరింత హెచ్చినవేమో? కదలకుండుటకై కంఠమువరకు బూడ్చించుకొన్నయోగికి జిత్తము మునుపటికంటెను జంచలమై పోవుచున్నది. ఉపవాసమొనర్చి ధ్యానించుచున్న బైరాగికి సర్వదా యెదుట కనబడునది పరమాత్మ కాదు. పస్పుకుండ కచ్చగట్టిన జోగికి సాక్షాత్కరించునది సర్వేశ్వరుడు కాదు_కాంత. కన్ను తెరచినకాంత. కలలో కాంత-వీరే సంసారములో నున్నచో ఇంతబాధయుండదుకదా. ఇంత సంతత దుఃఖముండదు కదా. ఇంత తదేక దృష్టియుండదు కదా. ఇంత అవిరత ధ్యానముండదు కదా. ఇంత వెర్రిదేవురాట యుండదుకదా. ఇంత దెయ్యపుటాకలి యుండదుకదా. ఇంతరాక్షసకామముండదుకదా.

వైరాగ్యమనగా నడవిలోబడి యింటికొరకేడ్చుటకాదు, ముక్కు గట్టిగ మూసుకొని తిండికై నోరు తెరచుట కాదు. పంచాగ్నిమధ్యముననిలిచి పట్టెమంచపు టానందము నపేక్షించుట కాదు. లంగోటి బిగించి జారుపైటలకై యురూత్రలూగుటకాదు.. యోగినులకు వేవిళ్ళు బాగనిచ్చి తాము సుఖవ్యాధులచే బాధలు పడుచుండుట కాదు.

ఇంత మాత్రముచే జ్ఞాన-భక్తి-వైరాగ్యము లెన్నటికి కలుగవు. నీకుభగవంతుడిచ్చిన దేహేంద్రియ మనోబుద్ధుల చలింపకుండగ చేయనవసరము లేదు. అసంభవములగు కామ క్రోధాదుల ఆశాపాశాదుల నరికట్టు ప్రయత్నముల జేయనక్కర లేదు. నీయిష్టానుసారముగ నింటిలో నుండవచ్చును. సతితో గాపురము చేయవచ్చును. సంతానము గనవచ్చును. ధర్మమార్గమున ధనాది సంపాదనము జేయవచ్చును.

అటులైన సంసారదుఃఖము లెటుల పోవునందురా? యదార్థమైన అర్థపంచక జ్ఞానమున్నచో ఈభవదుఃఖము లన్నియు మాయమగును.

నీవు ప్రతి వస్తువును దాని యదార్థస్వరూపమున జూచుటలేదు. నీవు ప్రతి శబ్దమును దాని యదార్థయర్థమున గ్రహించుటలేదు. ఇటుల ఏ విషయమును కూడ దానియొక్క యదార్థపుస్థితిని

తెలుసుకొనలేకున్నావు. బాహ్యమునకు కనుపించు అయథార్థస్థితిని మాత్రము గ్రహించి భ్రమ పడుచున్నావు.

ప్రపంచమంతటిలోను భగవన్మయము భగవద్వ్యాప్తము గాని వస్తువొక్కటియును లేదు. భగవంతుని తెలుపని శబ్దమొక్కటియు లేదు. ఇంతేల భగవత్సంబంధము లేనిజగత్తంటూ ఏదియు లేదు. ఈ యథార్థవిషయమును నీవు తెలుసుకొనవలయును. అట్లు చూచుటను నేర్చుకొనవలయును. ఏశబ్దమును వినినను భగవంతుడు నీస్మరణకు రావలయును. దేనిని స్పృశించినను భగవత్స్పర్శ నీకు కలుగవలెను. దేనినియాఘ్రాణించినను భగవద్గంధము నీకనుభవములోనికి రావలెను. దేనిని భుజించినను భగవచ్ఛేషమును నిశ్చయము నీకుండవలయును.

క్రమపడి ఈవిధానమును క్రమక్రమముగా నభ్యసించుము. భగవంతునియందు భక్తి, భగవదేతరములయందు విరక్తి అవంతటవియే నీకు కలుగగలవు.

అపుడు నీకు నీలో భగవంతుడు, నీపిల్లలలో భగవంతుడు. నీమిత్రులలో భగవంతుడు, నీశత్రువులలో భగవంతుడు, పర్వతములో భగవంతుడు, పరమాణువులో భగవంతుడు. ఎచ్చట చూచినను భగవంతుడే కనుపించగలడు.

ఇక నీకు దుఃఖమెక్కడిది ? నేను నాది, ఇది మంచి, అదిచెడ్డ, వీడు మిత్రుడు-వాడు శత్రువు, వీడు నావాడు-వాడు పరాయివాడుఅను భేదబుద్ధి యున్నపుడు కదా నీకీ ప్రాపంచిక దుఃఖములు. అన్నియు భగవన్మయములే అయినపుడు దుఃఖమునకు అవకాశమేది ? మరొక ముఖ్యరహస్యము. నీలోనే సదా నివసించియుండి నిన్ను నడుపుచు రక్షించుచుండు అంతరాత్మభూతుడైన భగవంతుని సదా స్మరించుచుండుము. ఈ స్మరణయే అన్ని సద్గతులకు ఆధారము.

వైరాగ్య మనగా ఇదియే గాని యడవికి బోయి యాకలముల దినుటకాదు భార్యాపుత్రాదులనింట నేడ్పించి వారికంటె నెక్కువగా తానడవులలో నేడ్చుటకాదు. చింకిరి గుడ్డల మాసినగుడ్డలు కట్టుకొని గడ్డములు మీసములు పెంచుకొని మిడుకుట కాదు.

మానవున కసాధ్య మనునది లేదు. ప్రయత్న మవసరము. సంపూర్ణ ప్రయత్న మవసరము. సంతత ప్రయత్న మవసరము.

వివేక-విమోక-అభ్యాస-క్రియా- కల్యాణ - అనవసాద- అనుద్ధర్షాది సాధనములచే-సత్త్వగుణ సంపత్తిచే తలపులలో-మాటలలో - చర్యలలో లలో సదా భగవంతుని నిలుపుము. భగవంతునిపై దృష్టిలేకుండగ నొక్క తలపైన తలపకుము. ఒక్కమాటయైన నాడకుము. ఒక్క పనియైన జేయకుము.

భార్యాపుత్రాదులు నీవారనుకొనకుము. ధనధాన్యాదులు నీవియే యనుకొనకుము. అన్నియు భగవంతునివే యని విశ్వసించుము.

భగవంతుడు యజమాని నీవాయన పూజారివి, సేవకుడవు. నీభార్యాపుత్రాదు లాయనపరిచారకులు. ఈ ధన-ధాన్య భవనాదులన్నియు ఆయన సంపత్తులు.

భగవదిచ్ఛచే ఏది ఎట్లుపోయిన పోవుగాక, నీకేల విచారము. పరక్షేమమునకే నీవెప్పుడును ప్రయత్నించు చుండవలయును.

సంఘసేవకంటె సత్కార్యములేదు. దీనివలన క్రమక్రమముగా నీకు స్వార్థపరత్వము వదలును నీచిత్తము నీలోపలనే గుడుగుడు గుంచము లాడుట మానివైచి వెలుపలికి విజృంభించును. నిన్ను దాటి నీగృహము, గృహముదాటి గ్రామము, గ్రామము దాటినాడు, నాడు దాటి దేశము, దేశముదాటి ఖండము, ఖండముదాటి గోళము, గోళముదాటి చివరకు జగత్తంతయు నీ హృదయము, నీసేవ వ్యాపించగలవు,

ఇట్లు కొంతకాలము నీవభ్యసింపవలయును. మొట్టమొదట నీతల్లిగారిని భగవత్స్వరూపముగ భావించుము, ఆమెను గౌరవించి, మన్నించి, స్మరించి, సేవించి, యారాధించుము. ఆమె యాజ్ఞానుసారము బద్ధుడవై సదా యామె పరిచర్య, యందే బద్ధదీక్షుడవై యుండుము, ఇటుల కొంత కాలము చేయగా ఆమెలో నీవు భగవంతుని గాంచగలవు. తరువాత నీతండ్రి యెడల నటులే వర్తించుము. ఈసారి నీవు త్వరగా కృతకృత్యుడ వగుదువు. తరువాత నీగురువు యెడల నటులనే ప్రవర్తించుము, నీవు మరింత త్వరలో కృతకృత్యుడవగుదువు.

తరువాత నీవు నీపిల్లలలో సతిలో సఖ్యులలో తుదకు అన్నింటిలోను భగవంతుని చూడగలవు. తద్వారా తరించగలవు, ఇకనీవు సతితోనున్ననేమి ? సంతానవంతుడవైననేమి ? గృహస్థాశ్రమ ప్రాశస్త్యమును తెలుపుటయే నాయుద్దేశముగాని, సన్యాసాశ్రమమును కుంగపరచుట నాయుద్దేశ మెంతమాత్రము కాదు. సన్యాసాశ్రమము ప్రశస్త్యతరమేగాని అది సకృదాది కారకము. దానికి తగినవారు నిజముగ అతికొద్దిమంది మాత్రమే.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

---

## యతిరాజ భజన కీర్తనలు.

కవితావతంస, గానకళానిపుణ, హరికథా చతురానన

శ్రీ ఉ. వే. శ్రీమాన్ కరి నారాయణాచార్య భాగవతార్.

కన్నడ—ఆది—"పావనగుణరామా" అనుదానివలె

ప॥ ఆదరమునరారా ! యతీశ్వరా !
నాదుమొఱన్ వినరా ! నతోద్ధారా! ॥ఆద॥

1. నీదుమనసునవ నీతమెగాదా !
గాదిలిదాసుని గన్గొనరాదా !
మేదినిలోనిను మించినదైవము!
చేదెసగానలే మెంబెరుమానే ! ॥ఆద॥

1. భరతఖండమునం బ్రజలలో భేదము
లరమరలన్నియు నడగంజేల, నీ
వరమగు మతమును వరలంజేసితివి !
కరినారాయణ కవివరపోషణ ! ॥ఆద॥

# వేదవ్యాసుడు ★ ★ ★

: జిజ్ఞాసువు :
శ్రీ శ్రీ శ్రీ నూ. వరమంగయ్యమ్మ
రావు జమీందారిణి గారు

ప్రశ్న:— ప్రబల ప్రమాణమైన వేదమును విభజించి మన కనుగ్రహించిన వేదవ్యాస మహర్షి యొక్క జన్మరహస్య మెట్టిది?
పరమప్రమాణమైన శ్రీ విష్ణుపురాణమును అనుగ్రహించిన శ్రీ పరాశరమహర్షికి సత్యవతితో గల ధార్మిక సంబంధమందలి సూక్ష్మార్థ మేమి?

సమాధానము:— "శ్రీమన్నారాయణ"

ధర్మము అతిసూక్ష్మమైనది. దాని యదార్థతను తెలుసుకొనుట సామాన్యమానవునికి శక్యమైనది కాదు. తపోబలముచే భగవత్కటాక్షపాత్రులైన ఋషిసత్తములు మాత్రమే దాని స్వరూపమును కనుగొన సమర్థులు.

లోకప్రవృత్తిని వేదప్రవృత్తిని గురించి ప్రాజ్ఞులగు వారెప్పుడును యుక్తివిచారము చేయరాదు. మృగము లందును. పక్షులయందును, అప్సరసలయందును, శూద్రజాతి స్త్రీలయందును, కన్యలయందును, పూర్వాసువాసినల యందునుకూడ తరుచు వేదపారంగతులైన మునులు, మహాత్ములు ఉద్భవించుచుందురు.

తల్లి క్షేత్రము తండ్రి బీజము. స్వరూపస్వభావములకు బీజమే ప్రధానమైనది. తల్లితోలుతిత్తి వంటిది. పుత్రుడు పితకు సొంతమైనవారు. ఎవనికి నెవడు పుట్టెనో వాడు వాడే యగును. గాన తల్లి జాతినిబట్టివ్యక్తినిర్ణయము జేయరాదు

ఋశ్యశృంగుడు మృగియందు బుట్టెను,
కణ్వుడు నెమలికొడుకు అగస్త్యుడు వసిష్ఠుడు ఊర్వశియందు బుట్టిరి సోమశ్రవుడు ఆడుసర్పమునందు బుట్టెను. అశ్వినీదేవతలు గోడిగయందు బుట్టిరి. కుమారుడు రెల్లుతంపరయందు బుట్టెను.
శ్రీశుకుడు అరణియందు బుట్టెను.
విదురుడు శూద్రస్త్రీయందు జనించెను.
కర్ణుడు కన్యయగు కుంతియందు బుట్టెను.
పంచపాండవులు, పాండురాజుండగనే కుంతిమాద్రిలకు, యమ-వరుణ-ఇంద్ర- అశ్వినీ దేవతలవలన జనించిరి.

మహాభక్తులు పూజ్యులు అగు అళ్వారాదులలో కొంతమంది తామరపువ్వు, సరస్సు, వెదురుడొంక, శూద్రస్త్రీ, పంచమస్త్రీలవలన ఉద్భవించినటుల తెలుపుదురు.

మహామహుడగు శాలివాహనుడు కన్యకయందు జనించెను.

పరీక్షిత్తు మహారాజును ఏడుదినములలో మరణించునటుల శపించిన శృంగి గోవు గర్భమున జన్మించెను.

ఇటులనే శ్రీపరాశరమహర్షివలన శ్రీ వేదవ్యాసమహర్షియు కూడ కన్యకయగు సత్యవతియందుబుట్టెను. ఇదియు ఆయనయొక్క ప్రతిభాతిశయద్యోతకమేగాని అన్యాయకాదు. నిజమునకు సత్యవతి అపుడు కన్యకయై యుండలేదు. పరాశరమహర్షి తన తపఃప్రతిభచే వేదోక్తముగ

సత్యవతిని వివాహమాడిన పిదపనే వ్యాసమహర్షి జనించెను. సత్యవతియు ఉత్తమక్షత్రియ కన్యకయే గాని దాసరాజు పుత్రికగాదు.

ఈధర్మవివాహరహస్య మేమన

ఇందునుగురించి శ్రీమహాభారత ఆదిపర్వమున ఇటుల గలదు.

కురువంశపు ఆదిపురుషులలో ఇంద్రునికి సఖుడై ఆకాశగమన శక్తియు గల మహామహుడగు ఉపరిచరవసువను మహారాజొకడుండెను. అతను పితరులయాజ్ఞచే వేటాడుచు, నడవిలో నుండి ఋతుమతియైన తన భార్యావిషయమైన స్మరణాధిక్యత వలన వీర్యస్ఖలనము కలవాడాయెను. ఆయన తన వీర్యము వృథాకాకూడదని దానిని ఒక పత్రపుటములో భద్రపరచి దానిని తన పెంపుడుడేగచే తన రాణివద్దకు పంపెను. మధ్యలో ఆడేగను మరియొకడేగ తన్నగా ఆపత్రపుటము యమునానదియందు బడెను. బ్రహ్మశాపముచే మత్స్యమైయున్న అదికయను నొక అప్సరస ఆరాజురేతస్సును మింగెను. దానిని జాలరులు పట్టుకొని ఛేధించగా అందుండి రాజురేతస్సుచే రూపొందిన ఒక మగశిశువు ఆడశిశువు బయలు వెడలిరి, మగశిడువును వసుమహారాజు తీసుకొని మత్స్యపువాసన వేయుచున్న ఆ ఆడ శిశువును ఆజాలరుల కిచ్చివేసెను,

ఆ ఆడశిశువే సత్యవతి యనుపేర ఆజాలరిచే పెంచబడి యమునానదిపై ఓడనడుపుచుండెను.

పరాశరమహర్షి ఒకనాడా ఓడపై ఆనదిని దాటవలసివచ్చెను.

సత్యవతి ఆఓడను నడుపునుండగా అప్పరాశరమహర్షి యొక్క మనస్సు ఆమెపై మరులు కొనెను. వెంటనే ఆయన తన దివ్యజ్ఞానముచే తన మనోచంచలతకు కారణమును యిటుల నరసెను.

బర్హిషత్తు అను పితృదేవతలకు మానసికముగ అచ్ఛోద యను నప్సరవలన సత్యవతి పుట్టించబడెను. ఉపరిచరవసువు ఆకాశమున సంచరించుచుండగ ఈమె ఆయనను తండ్రిగ కోరెను. అందుచే ఆమె తన యోగశక్తి దూలినదై ఉపరిచరవసువున ప్రవేశించి, పిమ్మట బ్రహ్మశాపముచే యమునయందు బ్రహ్మశాపముచే మత్స్యరూపము నొందియున్న అచ్ఛోద గర్భమున ప్రవేశించి, సత్యవతియై దాసరాజుచే పెంచబడెను. ఆమె యకడు పరాశరమహర్షిచే వేదవ్యాసుడు జన్మించి వేదముల విభాగించవలసియుండుటచే బ్రహ్మసంకల్పముచే యిదంతయు యిటుల జరిగెను.

పరాశరుడు బ్రహ్మసంకల్పముచే తనమనస్సు చలించుటను తెలుసుకున్నవాడై ఆబ్రహ్మసంధికల్పమును నెరవేర్చసమకట్టి సత్యవతిని బ్రహ్మవిక ప్రకారము వేదోక్తవైదిక క్రియానుసారముగ వివాహమాడ నిశ్చయించుకొనెను. అందుకు సత్యవతియు నంగీకరించి తన కన్యాత్వము చెడకుండ నుండవలయుననియు, తన చేపకంపుపోయి తన దేహమునకు మంచి సువాసన కలుగునటులను వరము వేడెను, పరాశరమహర్షి అటులనే నని యోజనదూరము వరకు ఆమె దేహము పద్మగంధముతో పరిమళించునటుల యనుగ్రహించెను. అంతటినుండి ఆమెకు పద్మగంధి, యోజనగంధి యను నామధేయములుకలిగెను.

ఇంతలో పరాశరుని తాతయగు వశిష్టమహర్షి అరుంధతితోడను, తండ్రియగు శక్తి అదృశ్యంతితోడను అచ్చటకు వచ్చిరి, పితృదేవతలు నచ్చటికివచ్చి సత్యవతి తమమానసిక పుత్రికయనియు తప్పక ఈమెను వివాహమాడి వ్యాసభగవానుని కనవలశిన దనియు పలికిరి.

అప్పుడచ్చటకు నైశారణ్య వాసులగు ఋషులందరున్ను వచ్చి చేరిరి.

వశిష్ఠ మహర్షి ప్రార్థనానుసారముగ యాజ్ఞవల్క్యమహాముని బ్రహ్మత్వమును వహించినవాడై శుక్లత్రయోదశి మఖానక్షత్రమున మైత్రమను ముహూర్తమున ఆయమునా ద్వీపతటమున పెద్దపందెల వగైరాల సృజించి అందు వేదోక్త సమస్తవైదిక క్రియాసహితముగ అగ్నిహోత్రసాక్షిగ శ్రీపరాశర మహర్షికిన్ని సత్యవతికిన్ని వివాహమును జరిపించెను.

పితరుల నియోగముచే ఉపరిచరవసువు స్వయముగవచ్చి సాలంకృతమగు సత్యవతిని పరాశర మహర్షికి కన్యాదాన మొనర్చెను.

పిమ్మట యందరున్ను తమ తమ నెలవులకు జనిరి. తరువాత పరాశరుని యనుగ్రహముచే సత్యవతికి ఏడు గడియలలో శ్రీవిష్ణువంశముచే వేదవ్యాసమహర్షి పుట్టెను. ఆయన బుట్టిన తోడనే పెరిగి యేడేండ్ల కుమారు డయ్యెను. ఆయన స్నానమాచరించి తల్లి తండ్రులకు నమస్కరించి, తలచినంతనే తిరిగి వత్తునని తల్లికి బాసచేసిన తండ్రితో కలిసి తపోవనమునకు వెళ్ళిపోయెను.

పరాశరుమహర్షి యిచ్చిన కలశోదకమున స్నానమాచరించి తిరిగి పూర్వము వలెను కన్యాత్వమును పొందినదై సత్యవతియు తన గృహమునకు జనెను.

పరాశరుడు వ్యాసుని తన యాశ్రమమునకు దీసుకొని వెళ్ళి తన తల్లియను యదృశ్యంతిచే జాతకర్మాదుల జేయించెను. యాజ్ఞవల్క్య మహర్షి వ్యాసునికి ఉపనయనాది సంస్కారముల నాచరించి వేదవేదాంగములు సంపూర్ణముగ నధ్యయన మొనరింపజేసెను.

పిమ్మట వ్యాసమహర్షి ఘోర తపమాచరించి భగవదనుగ్రహమును పొంది వేదముల విభజించి, మహాభారతమును పురాణములను రచించియు లోకోద్ధరణ గావించెను.

# పంచాయుధస్తోత్రము - ఆంధ్రీకృతము

తే॥ లసితనేమి సహస్రకీ లాప్రతీక్ష్ణ ।
మర్కకోటి సమంబును రారి తతికి ।
ప్రాణహరణంబు విష్ణుక దస్త్రమగును ।
దర్శనాఖ్యము చక్రము న్దలతునెపుడు ॥౧॥

తే॥ మురరిపు ముఖోద్ధ వాయుసం పూరితమగు ।
నిసదమున దానవుల దర్ప మును హరించి ।
కోటి సుధాంశు శుభ్రమ గుచును మించు ।
పాంచజన్యాఖ్య శంఖము న్భక్తి గొలుతు ॥౨॥

తే॥ స్వర్ణమయము సువర్ణాద్రి సారమఖిల ।
దితిజవంశైక హరణ ప్రతీక్ష్ణమమల ।
శౌరివామ కరాగ్ర స్థమైరహిల్లు ।
గదను కౌమోద కీన్నతి గాదలంతు ॥౩॥

తే॥ రాక్షసాసుర కఠినక రాళ గళని ।
కృంతన ప్రవద స్ఫగంచి తాంతమగుచు ।
హరి కరంబున సందీప్తమైననంత ।
కాఖ్య ఖడ్గంబుదలతునే ననవరతము ॥౪॥

తే॥ తనదు శింజినీటంకార మునను సురల ।
మానసంబుల భీతిని మడియ జేసి ।
ఘోరదైత్యాద్రి భేదన కులిశమగుచు ।
దనరు శార్ఙ్గము స్మరణుగా దలతు నెపుడు ॥౫॥

తే॥ శంఖచక్ర గదా ఖడ్గ శార్ఙ్గపీత ।
వసన కౌస్తుభరత్న శ్రీ వత్సలాంఛ ।
నాబ్ధికన్యాయుతోజ్జ్వలి తాంగుడైన ।
హరిని శరణముగా గొల్తు ననవతరము ॥౬॥

తే॥ అవని నీహరిపంచమ హాయుధస్త ।
వమును దినదినమున్ బ్రాతమున జదువ ।
నపుడె సర్వదుఃఖములు భ యములుబాప ।
ములు నశించును సుఖములు గలుగుచుండు ॥౭॥

తే॥ గహన రణ శత్రుజలపాప కముల మధ్య ।
ఘనవిపద్భయములు పల కొనయునాకు ।
లాత్ముడయి దీని బఠియింప నపుడెగాంచి ।
యెల్లసుఖముల గల్గించి యొసగుచుండు ॥౮॥

తే॥ రక్షసేయు జలమున వ రాహమూర్తి ।
స్థలమునన్ బ్రోచువామన స్వామియరయ ।
నారసింహుడు బ్రోచు కాం తారమందు ।
కేశవుడు బ్రోచు నెల్ల బ్రదేశములను ॥౯॥

ఇట్లు,
నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులు.
ఆల్ ఇండియారేడియో, విజయవాడ.

ఓం

# ప్రచార విభాగము.

## గీతాసారం

### గీతా చతుశ్శ్లోకి

### భగవద్వాగ్దానములు

శ్లో॥ పరిత్రాణాయ సాధూనాం।
వినాశాయ చ దుష్కృతాం।
ధర్మసంస్థాపనార్థాయ ।
సంభవామి యుగే యుగే॥

భక్తుల మనోభీష్టముల సఫలపరచుట కొరకును, అనాశ్రితుల వ్యతిరేకభావముల పోగొట్టుట కొరకును, భగవత్స్వరూప రూపగుణ విభూత్యైశ్వర్యశీలాదుల ననుభవింప జేయుట కొరకును, ప్రతి యుగమునందును ఈ విధముగ నవతరించుచుందును.

శ్లో॥ అనన్యాశ్చింతయంతో మాం।
యే జనాః పర్యుపాసతే।
తేషాం నిత్యాభియుక్తానాం।
యోగక్షేమం వహామ్యహం॥

ఎవరైతే నన్ను ఏకాగ్రచిత్తులై అత్యంత ప్రీతితో ధ్యానింతురో, సర్వదేశ, సర్వకాల, సర్వావస్థలయందును నా రూపమునే జూచుచు నా నామమునే స్మరించుచు నాయందే సర్వభారమును సమర్పించి యుందురో అట్టి వారల యొక్క సర్వసంపత్ప్రదత్వమును (మత్ప్రాప్తిదానమును) తద్రక్షకత్వ (పునరావృత్తి రాహిత్య) భారమును నేను వహించుచున్నాను.

శ్లో॥ సర్వధర్మాన్ పరిత్యజ్య।
మా మేకం శరణం వ్రజ।
అహం త్వా సర్వపాపేభ్యో।
మోక్షయిష్యామి మాశుచః॥

మోక్షోపాయములుగ తెలుపబడిన వానినన్నింటి యందును ఫలకర్తృ ఉపాయ బుద్ధిని రుచి వాసనలతోకూడ వదలి ప్రీతియుక్తుడవైన కేవలము నన్నుమాత్రమే ఉపాయముగ అధ్యవసించుము. అనన్య శరణ్యుడనైన నేను అనన్యశరణాగతుడవైన నిన్ను మోక్ష ప్రతిబంధకములగు సమస్త ప్రతిబంధకముల నుండియు విడివడునటుల జేయుదును, దుఃఖించకుమా॥

### సంజయుని విశ్వాసము

శ్లో॥ యత్ర యోగేశ్వరః కృష్ణో।
యత్ర పార్థో ధనుర్ధరః।
తత్ర శ్రీ ర్విజయో భూతిః।
ధ్రువా నీతి ర్మతి ర్మమ॥

యోగేశ్వరుడైన శ్రీ కృష్ణపరమాత్మ ఎచ్చట ప్రీతియుక్తుడై యుండునో ధనుర్ధరుడైన పార్థుడు ఎచ్చట భగవద్దాసుడై శరణాగతుడై యుండునో, అచ్చట లక్ష్మియు, విజయము ఐశ్వర్యము, నీతియు, నిశ్చలమై యుండునని నా విశ్వాసము.

(౩)

## ముముక్షువుని ముఖ్యకర్తవ్యము

## —: భగవదుపదేశము :—

(భగవద్గీత 9-27,28)

శ్లో॥ యత్కరోషి యదశ్నాసి ।
యజ్జుహోషి దదాసి యత్ ।
యత్తపస్యసి కౌంతేయ ।
తత్కురుష్వ మదర్పణం ॥

ఓ ముముక్షువా, దేహయాత్రకు వలయునట్టి యే లౌకికకర్మమును జేయుదువో, దేహధారణ కొరకు దేనిని భుజింతువో, హోమ - దాన - తపః ప్రభృతులైన యే వైదిక కర్మములను నిత్య - నైమిత్తిక - విశేషములను ఆచరింతువో, వాని నన్నింటిని నా కర్పణము జేయుము. అనగా నీవు జేయు అన్ని పనులను నన్నే కర్తగను, నన్నే భోక్తగను, నన్నే ఆరాధ్యునిగను అనుసంధించుమా.

శ్లో॥ శుభాశుభఫలైరేవం ।
మోక్ష్యసే కర్మబంధనైః ।
సన్న్యాసయోగయుక్తాత్మా ।
విముక్తో మాముపైష్యసి ॥

నీవును, ఇతర సమస్త దేవ - మనుష్యాదులును, మత్సంకల్పమునకు లోనైన స్వరూప స్థితి - ప్రవృత్తులు గలవారు మాత్రమే యైయున్నారు. ఇది సత్యము. ఈ యథార్థస్థితిని తెలుసుకొని దానినే అనుసంధించుకొనుచు, తదనుగుణానుష్ఠానవంతుడవై, మచ్ఛేషభూతుడవై, మదేక నియామ్యుడవై, మదారాధన రూపమైన సమస్త లౌకిక వైదిక కర్మల గలవాడవై యున్నచో శుభాశుభఫలముల నిచ్చు సమస్తకర్మముల నుండి నీవు విడివడగలవు. నానిత్యసాన్నిధ్యమును పొందగలవు.

# ప్రచార విభాగము

## ధనుర్మాస వైభవము

### మదరాసు.

మదరాసు శ్రీ యతిరాజ సేవా మహిళామండలివారిచే నెలకొల్పబడిన శ్రీ గీతామందిరములో యీ సంవత్సరం ధనుర్మాసము మిక్కిలి వైభవముగా జరుపబడెను. ప్రతిదినం ఉదయం గం 7–0 లకు తీర్థప్రసాదగోష్టి ముగియుచుండెను. గం 9–0 లు మొదలు గం 11–0 ల వరకు శ్రీమాన్ తె. కం. గోపాలాచార్యస్వామి వారిచే తిరుప్పావై మువ్వాయిరప్పడి వ్యాఖ్యానము పంక్తిమీదనున్న ఆరాయిరప్పడియు, స్వాపదేశార్థములును ఉపన్యాస రూపమునను జరుపబడెను. పెక్కురు స్త్రీలును, పురుషులును కాలక్షేప గోష్టిలో నన్వయించుటయేగాక నిత్య కైంకర్యమునకును విశేషగోష్టి కైంకర్యములకును విరాళము లొసంగి తమ భక్తిని గీతామందిర మండలి యభిమానమును ప్రకటించిరి.

### వైకుంఠ ఏకాదశి

ఈనాడు ఉదయం గం 10–0 లకు వేదాధ్యాపకులతో ఉపనిషత్పారాయణ గావింపబడెను. పిమ్మట 11 గం. నుండి సాయంత్రం 5 గం. వరకు శ్రీమాన్ తె. కం. గోపాలాచార్యులుగారు మునుముందు ఒక్కొక్క గీతాధ్యాయమునందలి విషయము సంగ్రహముగా నుపన్యసించి పిమ్మట ఆ యధ్యాయ శ్లోకముల నందరిచేతను అనువదింపజేసిరి.

### గీతా పరీక్షా పారితోషక వితరణోత్సవము

సాయంకాలం 5–30 గం. లకు శ్రీ శ్రీ శ్రీ అస్సాంమహారాణీవారి అధ్యక్షతక్రింద సభ ప్రారంభింపబడెను. శ్రీఅధ్యక్షులు స్త్రీలకు 'గీతాభ్యాసావశ్యకతను' గూర్చి విపులముగా నుపన్యసించిరి. పిమ్మట భగవద్గీతాభిమానులును నిరంతర గీతాపారాయణ పరీణులును నగు శ్రీమతి దేశు కణ్ణమ్మగారి ద్రవ్యసహాయముచే గీతాపరీక్షలలో నుత్తీర్ణులైనవారికి పుస్తకరూపముగా పారితోషికములును యోగ్యతా పత్రికలును శ్రీ సభా అధ్యక్షులచేతను శ్రీ గీతామందిరాధ్యక్షులగు శ్రీ శ్రీ శ్రీ ఉయ్యూరు మహారాణీవారిచేతను సమర్పింపబడెను. శ్రీమతి మట్టపల్లి చంద్రమ్మగారు ప్రథమ బహుమతిగా ప్రత్యేకించి ఒక పతకమును బహూకరించిరి.

పిమ్మట మిగిలిన గీతాపారాయణ శ్రీ విష్ణు సహస్రనామాది పారాయణలున్ను పూర్తియైన తరువాత ప్రసాద వినియోగము గావింపబడెను. అంతట శ్రీ మహామంత్రభజనమండలివారిచే రాత్రియంతయు మృదుమధుర శ్రావ్యసంప్రదాయ గీతములతో భజనగావింపబడి జాగరణవ్రతము పాలింపబడెను.

### శ్రీ గోదాకల్యాణము

భోగినాడు ఉదయము మామూలు ప్రకారము గోష్ఠి కాలక్షేపములు ముగించిన పిదప సాయంకాలం 5 గంటలకు శ్రీ గోదాకల్యాణము ప్రారంభింపబడినది. [illegible]

కల్యాణ కథాభాగము వినిపింపబడిన తరువాత స్వాములచే 'శిర్ పాడల్' అత్యంత వైభవముగా జరుపబడెను. ఈనాటి ఖర్చును శ్రీ శ్రీ శ్రీ మీర్జాపురం మహారాణీవారు వహించి అత్యంత వైభవముతో ఉత్సవమును జరిపించిరి.

## వి జ య వా డ

మన సంఘ కార్యదర్శులైన శ్రీ. ఉ. వే. శ్రీమాన్ ఆ. చి. శ్రీమన్నారాయణాచార్యులు గారు ఈ నగరమందలి నిడముక్కలవారి రామానుజకూటమున తిరువారాధనతో వేంచేసియుండి ఈ నగరవాసు లెన్నడును కనివిని యెఱుంగని వైభవముతో ధనుర్మాస వ్రతదీక్షను నిర్వహించిరి. ఉదయం 6 గంటలు లోపుగనే రామానుజకూటమునందే పెక్కురు భక్తులతో తిరువారాధన సేవాకాలము తీర్థప్రసాదగోష్టియు ముగించుకొని 8 గంటలకు క్రొత్తగుళ్ళు అనబడు శ్రీ శ్రీ శ్రీ కోదండరామపెరుమాళ్ళ సన్నిధిలోని కల్యాణ మండపమునందు శబ్దప్రసారిణీ యంత్రసహాయమున వేల భక్తులకు తమ శ్రీ సూక్తిని సుగ్రహము గావించి అపూర్వార్థ విశేషములతో తిరుప్పావై కాలక్షేపమును సాయించిరి. చూపరులకు వారు తమ భౌతికశక్తిచేగాక దైవికశక్తిచేతనే ఈ కార్యమునునిర్వహించుచున్నట్లు సాక్షాత్కరించిరి. గ్రామాంతరములనుండివచ్చి మహారాణీలు, పెక్కురు భక్తులు ఆ నెలదినము లచ్చట నివాసముల నేర్పరచుకొని వారి కాలక్షేపసుధను గ్రోలిరి. గ్రామస్థుల ఆదరాతిశయములతోను అర్చకుల భక్తిశ్రద్ధలతోను ఏడుదినములు నీరాట్ట ఉత్సవము బ్రహ్మాండ వైభవముగా జరిపించిరి. అందొక దినము శ్రీ ఆండాళ్లును నందిపాటివారి తోట లోనికి వేంచేపుచేసి అచ్చట గొప్ప ఉత్సవమును జరిపించిరి. ఈ వ్రతనిర్వహణ భారమునంతను శ్రీ నిడముక్కలవారి రామానుజకూట పాలకులును, విజయవాడ శ్రీ విశిష్టాద్వైత ప్రచారకసంఘమును వారును, శ్రీ యతిరాజ సేవా మహిళామండలివారును వహించి భగవత్కృపకును భాగవతాశీర్వాదములకును పాత్రులైరి.

## రాజమహేంద్రవరం

ఈ నగరమందలి ఇన్నీసుపేటలో శ్రీమతి ముదుంబై రంగనాయకమ్మగారును శ్రీమతి ముదుంబై రామానుజమ్మగారును తమ స్వగృహమున ధనుర్మాస వ్రతమును ప్రారంభించి శ్రీ ఉ. వే. శ్రీమాన్ శ్రీమత్తిరుమల పురిగళ్ళ వెంకటాచార్య స్వామిగారిచే తిరుప్పావై కాలక్షేపమును చేయించి ఆపేటలోని పెక్కురు భక్తులకీ వ్రతఫలము లభింప జేసిరి.

శ్రీమతి ముదుంబై రామానుజమ్మగారు గోదాకళ్యాణ సందర్భమున మన సంఘమునకు రు 2 లు విరాళమును సమర్పించి వారికిగల సంఘాభిమానమును ప్రకటించిరి.

## బే త వో లు

గుడివాడ సివారు బేతవోలు గ్రామమున శ్రీబోయిన సీతారామ దాసుగారు తమ స్వగృహమున పెక్కుమంది స్వాములతోను మిత్రబృందములతోను వైభవోపేతముగా శ్రీ గోదా కళ్యాణమును జరిపించిరి. ఈ ఉత్సవమంతయు మన సంఘ కార్యదర్శిగారైన శ్రీమాన్ ఆ. చి. శ్రీమన్నారాయణాచార్యులగారి అధ్యక్షతక్రిందనే జరుపబడెను. ఈ సందర్భమున శ్రీమాన్ సీతారామ దాసుగారు మన సంఘమునకు రు 4 లు కట్నముగా సమర్పించి సంఘాభిమానమును సాటిరి.

## శుక్రవార పూజా కార్యక్రమము

విజయవాడలోని శ్రీ యతిరాజ సేవామహిళా మండలివారు మిక్కిలి చురుకుగాను అన్ని మండలులకు ఆదర్శప్రాయముగాను కార్యక్రమములను జరుపుచున్నారు. అందీ శుక్రవార పూజా

ఈ నగరమధ్య ప్రాంతవాసులందరును ఒక సంఘముగా నేర్పడి శ్రీ కోదండరామస్వామివారి కోవెలలోను,గవర్నర్ పేట వాసులందరును ఒక సంఘముగా నేర్పడి శ్రీమతి కే.ధనమ్మగారి యింటి యందును ప్రతి శుక్రవారము నందును యీ పూజాకార్య క్రమమును మిక్కిలి వైభవముగా జరుపుచున్నారు.

సత్యనారాయణ పురం కొత్తపేటలో కూడా ఆ ప్రాంతీయులకు వీలుగా నచ్చట ఒక సంఘమేర్పడి యీ పూజను జరుపుచుండునట్లు ఏర్పాటు గావింపబడుచున్నది.

ఇట్లే ప్రతి నగరమునను విడివిడిగా సంఘములేర్పడి ప్రతిశుక్రవారము జరుపుచు అప్పుడప్పుడు పెరుమాళ్ల సన్నిధిలో అన్ని సంఘములు సమావేశమై అతిశయముగా ఉత్సవము జరుపుచుండుట పరస్పర పరిచయమునకు వైభవమునకును ఆకరమై ఆకర్షకముగా నుండును. ప్రతిసంఘమువారు నొక హుండీని ఏర్పరచి భక్తులొసంగు కానుకలను సేకరించి ఆయాసంఘము పేరుతో ముఖ్యమగు చిన్నపుస్తకములను కాగితములను ప్రచురించుచు ఉచితముగా పంచిపెట్టు చుండుట వలన మరింత అధికముగా ప్రచారము కాగలదు.

# సభా కార్యక్రమములు

## జరిగిన సభలు

శ్రీ వాసుదాసుగారికి ప్రియకరమైన శ్రీ పాదుకా క్షేత్రమునందు శ్రీవారి తిరునక్షత్ర సందర్భమున జనవరి 17 వ తేదీనుండి 19 వ తేదీవరకు 3 రోజులు శ్రీ: ఉ. వే. శ్రీమాన్ మొలుగు రామానుజాచార్యులగారి అధ్యక్షతక్రింద పండిత సమావేశముగా గావింపబడెను. పెద్దలు పెక్కుమంది విచ్చేసి వివిధ వేదాంతవిషయములను గూర్చి ఉపన్యసించిరి. భక్తులనేకులు సమావేశమై అవిచ్ఛిన్నముగా నామ సంకీర్తనముగావించిరి. ఆశ్రమ నిర్వాహకులగు శ్రీ వెంకటప్పదాసుగారు పెద్దలయెడలను అతిథులపట్లను తమ ఆచార్యులగు శ్రీ వాసుదాసుగారి విషయమునను చూపిన భక్తిశ్రద్ధలు వర్ణనాతీతములు. వీరు మన సంఘ కార్యదర్శులకు ఆశ్రమ కార్యనిర్వహణ భారము నొప్పగించి తాము విశ్రాంతి గొనవలెనని చూపిన ఆర్తియపారము, వీరి శ్రద్ధాభక్తి విశ్వాసములు ఆనాటి శబరిచరిత్రను జ్ఞాపకము చేయుచున్నవి.

### చావలి

తెనాలి సమీపమున కొల్లూరురోడ్డు స్టేషనునకు 2 మైళ్ళ దూరములోనున్న చావలి గ్రామంలో శ్రీమాన్ విష్ణుమొలకల వీరరాఘవయ్యగారు చేయుచున్న గీతాప్రచారము మిక్కిలి ఆదర్శప్రాయమును ముదావహమునునైయున్నది. వారి ప్రేరణచే మన సంఘకార్యదర్శులు పెక్కురు భక్తబృందముతో జనవరి 20 వ తేదీని ఆ గ్రామమున కేగి వారిచే శిక్షితులైన బాలికలను పరిశీలించి పరీక్షించి మిక్కిలి ఆనందించిరి. ఆ రాత్రి శ్రీ విష్ణుసహస్ర నామాది పారాయణ గావించి సుమారు గం 9-0 లకు కార్యదర్శులిరువురచే గీతోపన్యాసము గావింపబడెను. అనేక మంది గ్రామస్థులగు స్త్రీలును, పురుషులును విచ్చేసి సభను జయప్రదముగా జరిపించిరి.

## జరుగబోవు సభలు

ఈ ఫాల్గుణ మాసమున యథాపూర్వము కోరుకొండ గ్రామమున ఫాల్గుణ శుద్ధఏకాదశి మొదలు 5 రోజులు శ్రీ లక్ష్మీ నృసింహస్వామి వారి కళ్యాణ సందర్భమున పండితసభలు జరుప

మరియు శ్రీసీతారామయతీంద్రులవారి ఆశ్రమమగు పెదముక్తేవిలోని శ్రీ కృష్ణాశ్రమము నందు కూడా మన సంఘపండిత సమావేశము జరుగు ఏర్పాటులు శ్రీ యతీంద్రుల వారిచే గావింప బడుచున్నవి. వివరములు ముందు పత్రికమూలమున తెలుపబడును.

## పా ల కొ ల్లు

ఇచ్చట శ్రీ విశిష్టాద్వైత ప్రచారక శాఖాసంఘమువారి యాజమాన్యమున 31-12-52 తేదీని శ్రీ అష్టభుజ లక్ష్మీనారాయణ స్వామివారి సన్నిధిలో భక్తులయొక్కయు శ్రీ దేవస్థానం ఎగ్జిక్యూటివు ఆఫీసరుగారియొక్కయు సహాయ సంపత్తులతో లక్ష తులసీదళ పూజా మహోత్సవము వైభవముగా జరిపించబడెను.

| | |
|---|---:|
| ఈ కార్యక్రమమునకై శ్రీమాన్ నడాదూరి గోపాల కృష్ణమాచార్యులుగారు శ్రీమాన్ గోవర్ధనం వెంకటశేషభట్టరాచార్యులుగార్ల వలన | 157-0-6 |
| శ్రీమతి కనుమూరి రంగనాయకమ్మగారివలన | 120-0-0 |
| కానుకలుగా వసూలైనవి | 9-3-0 |
| వెరసి | 286-3-6 |
| తులసీ, ఋత్విక్సంభావన- అచ్చు, ఉత్సవము, మేళతాళము, ఫొటో వగైరాల నిమిత్తం చేయబడినఖర్చు | 186-0-6 |
| మిగిలినది | 100-3-0 |

ఈ మొత్తము భక్తులయొక్క అనుమతిపై 11-1-53 తేదీని—ఆ సంఘ యాజమాన్యముననే జరుపబడిన ఆ యాలయమునందే వేంచేసియున్న శ్రీ లక్ష్మీతాయార్ల లక్షశ్రీ చూర్ణ పూజా మహోత్సవమునకై వినియోగింపబడెను.

ఈరెండు ఉత్సవములును అత్యంత వైభవముతో నిర్వహింపబడి గ్రామస్థుల సంబర నాకర్షించినవి. ఈ గ్రామమున నిట్టి కైంకర్య పరంపర లెల్లప్పుడును జరుగుచుండుట సుప్రసిద్ధమే. కావుననే ఈ నగరమున లక్ష్మి తాండవించుచుండుటయు మనకు తెలియనిదికాదు. వీరు ఈ ఉత్సవ సందర్భమున మన కేంద్రసంఘమునకు రు 10 లు కట్నము నొసంగిరి.

## బం ద రు

### శ్రీ యతిరాజసేవా మహిళామండలి ద్వితీయ వార్షికోత్సవము

ఈ నగరమున రెండుసంవత్సరముల క్రిందటనే శ్రీమతి మరంగంటి సీతమ్మగారు పుర ప్రముఖులగు నారీమణుల నందరను ప్రోత్సహించి శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘ నియమనానుసారముగా శ్రీ యతిరాజ సేవా మహిళామండలి నొకదానిని స్థాపించి అత్యుత్సాహముతో నిరవచ్ఛిన్నముగా శుక్రవార పూజాది కార్యక్రమములను మధ్యమధ్య పండితసభలను, ధనుర్మాస వ్రతమును జరుపుచు తమ మండలినొక ఆదర్శమండలిగా నేర్పుతో నిర్వహించుచున్నారు. ఈ సంవత్సరము నవంబరునెలలో శ్రీశ్రీ సీతారామ యతీంద్రులవారి యొక్కయు, శ్రీమతి నందూరి ఆనందమ్మగారియొక్కయు అధ్యక్షతక్రింద ద్వితీయ వార్షికోత్సవము నత్యంత వైభవముగా జరిపించిరి.

గిరి. రు 523-8-0 వసూలు గావింపబడి రు 417-0-0 ఖర్చు గావింపబడెను. రు 106-8-0 కోశాధ్యక్షులవద్ద నిలవగా నుంచబడెను.

ఈ జమాఖర్చుల వివరములను ఈ మండలివారు త్వరలో ప్రకటింపదలంచుచున్నారు.

## యర్రబోయ్నిపల్లిగ్రామం

### ద్వితీయవార్షిక శ్రీరామ సప్తాహక్రతు మహోత్సవ ఆహ్వానము.

వరంగల్ జిల్లా, మధిర తాలూకా యర్రబోయ్నిపల్లి గ్రామంలో ఈ సంవత్సరం 21-3-53 ఉదయం 9 గం. నుండి 28-3-53 ఉదయం 9 గం. వరకు శ్రీరామ సప్తాహక్రతువున్ను, 25-3-53 ఉదయం గం 10-54 ని॥లకు పెక్కురు భక్తుల సహాయముతో శ్రీ సీతారామ లక్ష్మణుల విగ్రహప్రతిష్ఠయున్ను జరుపబడునుగాన భక్తులెల్లరను విచ్చేసి సేవించి అన్నివిధములతోడ్పడ గోరుచున్నాము.

ఇట్లు

కోటమసింహాం రామానుజాచార్యులు

ఆహ్వాన సంఘాధ్యక్షులు

## భక్తి నివేదన పత్రిక చందాదారులకు విజ్ఞప్తి

విజయ సంవత్సరమునుండి భక్తినివేద పత్రికను వారపత్రికగా ప్రచురించ దలంచుచున్నాము అందు ఒకవారం పల్లాండుమొదలు నిత్యాను సంధానమునంతను వరుసగా ప్రతిపదార్థ తాత్పర్యములతోను, రెండవవారం భగవద్గీత నంతను క్రమముగా ప్రతిపదార్థ అవతారికా తాత్పర్యములతోను గీతాపరీక్షా వివరములు గీతా ప్రశ్నోత్తరములతోనున్ను, మూడవవారం అష్టాదశరహస్యములు ఆంధ్రాను వాదముతోను, నాల్గవవారం ప్రచార విభాగముతో ప్రకటింపబడుచుండును.

గతసంవత్సరములకు బొత్తుగా చందాలను యీయని వారికిక పత్రికను పంపజాల నందుకు చింతించు చున్నాను.ముందుపత్రికను అపేక్షించు గ్రాహకులు తమ చందాలను ముందుగనే యీ క్రింది యడ్రసునకు మనియార్డరుద్వారా పంపవలెను. ఇకముందు పత్రికలు చందాదారుల సంఖ్యను బట్టియే క్లుప్తముగనే ముద్రింపబడునుగాన కోరువారు ఫాల్గుణ మాసాంతంలోగా తమ నూతన సంవత్సరచందాను చెల్లించి తమ పేరులను రిజిష్టరు చేయించుకొన గోరుచున్నాము.

చందాలనుగాని, విరాళములనుగాని, పుస్తకములకు ఆర్డరులుగాని పంపించవలసిన అడ్రసు:—

శ్రీమాన్ కూరపాటి రామారావుగారు

వెండి బంగారం వర్తకులు

శివాలయం వీధి – విజయవాడ

కృష్ణా జిల్లా.

## గీతా పరీక్షలు

ఈ సంవత్సరం జూలై నెల ఆఖరివారమున భగవద్గీత 4, 5, 6 అధ్యాయములలో స్త్రీలకుమాత్రమే పరీక్షలు జరిపించబడును. మొదటి 6 అధ్యాయములకు సమగ్రముగా సులభశైలిలో రామానుజభాష్య చంద్రికా వ్యాఖ్యానముల ననుసరించి ప్రశ్నోత్తరములు తె. కం. గోపాలాచార్యులుగారిచే వ్రాయబడి ముద్రింపబడుచున్నవి. [illegible]



విజయవాడ, శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘ కార్యనిర్వాహక వర్గము

మొదటివరుస - కూర్చున్నవారు

శ్రీమాన్ ఆ. చి. శ్రీమన్నారాయణాచార్యులుగారు కేంద్రసంఘ సహాయ కార్యదర్శి

రెండవవరుస - నిల్చున్నవారు

1. శ్రీమాన్ కపిలవాయి సత్యనారాయణగారు 2. శ్రీమాన్ నందిపాటి జగన్నాయకులుగారు ఉపాధ్యక్షుల
3. శ్రీమాన్ గోపు శేషావతారంగారు ఉపాధ్యక్షులు 4. శ్రీమాన్ కూరపాటి రామారావుగారు ప్రధాన కార్యదర్శి
5. శ్రీమాన్ కోట జ్వాలా నరసింహంగారు 6. శ్రీమాన్ శివకోటి లక్ష్మీనరసింహ్వాంగారు అధ్యక్షులు 7. శ్రీమాన్ వుదయగిరి కృష్ణారావుగారు ఉపాధ్యక్షులు 8. శ్రీమాన్ జవ్వాజి లక్ష్మీనారాయణగారు.

మూడవవరుస - నిల్చున్నవారు

1. శ్రీమాన్ మాతంశెట్టి శీతారామయ్యగారు 2. శ్రీమాన్ నండూరి శోభనాద్రాచార్యులుగారు సహాయ కార్యదర్శి
3. శ్రీమాన్ నిడుముక్కల శ్రీరామమూర్తిగారు సంచాలకులు 4. శ్రీమాన్ యిల్లిపిల్లి వీరరాఘవులుగారు
5. శ్రీమాన్ సుంకు లక్ష్మీనారాయణగారు.

